శ్రీ శివాయ గురవే నమః



# శ్రీరామకథామృతము



## యుద్ధకాండము



ఇది
బ్రహ్మశ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారిచే
రచియింపఁబడి










వారి పుత్త్రుఁడగు
రాఘవనారాయణశాస్త్రిగారిచే
ప్రకటింపఁబడిరెు

1938

[ సర్వస్వామ్యసంకలితము ]        [ వెల రు. 6-0-0



1 నుండి 17 వ ఫారం వఱకు
తాతా ముద్రాక్షరశాల, నిడుబ్రోలు;
మిగిలిన పుస్తక మంతయు
తెనాలి, లక్ష్మీ ప్రెస్ నందు
ముద్రింపఁబడినది.

# తృప్తి

మ॥ తతమౌ రామకథా౽మృతమ్మునను దత్పట్టాభిషేకాంత మై
న తురీయమ్మగు సంపుటం బదియు నెన్నన్ముద్రితంబయ్యె శా
శ్వతసర్వాధికతత్ప్రసాదము భవత్సంకల్పకల్పంబు కీ
ర్తి నా కీదొరకొంట నేఁటి కిఁటు తండ్రీ! ధన్యుఁ డైనాఁడ లే!

ఉ॥ మీకు సహాయులై నెగడు మిత్రులు మీరు భవత్కథేశ్వరుం
డేకతఁ బట్టునట్టి యొలయించినసిద్ధి నిమిత్తమాత్రుఁ డో
మీకొమరు స్వరించుకలిమిం దమ కిచ్చినబాస వచ్చె నేఁ
డీకలసంబున న్నెఱపనెంతు ద్వితీయమునుం గురూత్తమా!

ఉ॥ తృప్తివహించుఁగాక భవదీయము చిత్తము కాంచి పెంచి వి
ద్యాప్తజనుర్నిమిత్తమున నైకె తమి దీఱమి స్వీయసత్కృతిం
గ్రొత్తవదుం బొనర్చి సనుఁ గీర్తికిఁ గూర్చి యొలర్పఁజేయు మీ
యాప్తికిఁ దాతపాద! కలదా? యిల సాప్యము వేఱొకొం డికన్.

చ॥ అనుగుఁజులార! పాఠకమహాశయులార! సహాయులార! నై
పసవలె నుత్తరంబగు ప్రబంధము రాకకుఁ గల్గు కాలయా
పన మది కొంత వ్రాయవలెఁ బ్రస్తుతమౌ ఋణ మీఁగఁగావలెన్
ఘనమతులార! స్వీయకృతికై యిఁకఁ గొంత మెలంగఁగావలెన్.

ఉ॥ ముద్రితసంపుటమ్ముల నమూలము తౌ దొసఁగుల్ కనంబడెన్
భద్రము గాఁగ నానిఁ గని పైకృతిపీఠికలో లిఖించెదన్
చిద్రములార నేఁటిక విశేషము లీకృతి నాదరించి ని
ర్నిద్రరసాలసత్త్వము ననిందితముం గొనియాడ వేఁడెదన్.

ఇట్లు,

చందవోలు
20-1-1988

కవి కుమారుఁడు
తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి.

# విషయసూచిక

శ్రీశివాయగురవేనమః.



# శ్రీరామకథామృతము

## యుద్ధకాండము.

పూర్వభాగము.

———:o.———

## ప్రథమాశ్వాసము.

———:o:———



హేతుభూతమంత్రో
త్సాహాంచితశక్తియోగ, సంభృతమహిమ
ప్రాహుణికీకృతనిగమ
వ్యాహృతసామ్రాజ్యకృత్య, యఖిలస్తుత్యా.

తే॥ అవధరింపుము భక్తభావానుషంగు, డంగజారాతి యిట్లను నగజతోడ
వింటివా సర్వమంగళ! విశ్వపతి ర, ఘూద్వహుం డట్లు హనుమ బహూకరించి. ౨

తే॥ అతని పలుకుబడింగల యర్థములఁ, బ్రీతితోఁ గూడి తనమది బిరికొనంగ
వాఙ్మయంబు తదేకతత్వతఁ బొసంగ, నందఱుం గలయుంగని యనియె నిట్లు. ౩

—♦ శ్రీరాముఁడు హనుమని మెచ్చుకొనుచుఁ గార్యచింత మునుఁగుట ♦—

సీ॥ హనుమం డొనర్చిన యమ్మహాకార్యంబు, మఱియుఁగా వలనేది మదికి ననఁగఁ
జేయ శక్య మటంచుఁ జెప్పఁగా నట్టుల, యయ్యంబుధి దాఁటంగ నగున యొంటి
కాజవ మున్నదే హరి కేజి కనిలున, కనికాక యన్యున కవనిలోన
మేర యున్నదియె యి ట్లేమేటి వీర్యబలాఢ్య, తకుఁ దానవో యింకఁ దనకు సాటి
దేవదానవముఖ్యులకే తేటిచూడ, నేర రద్ధాని నప్పురి నిర్బుతినాథ
పాలిత విశంక లంక నేర్పడఁగఁ జొచ్చి, వచ్చు జీవించి యెవ్వాఁడ వార్యుఁ డగుచు.

చ॥ ఇనజుని భృత్యకృత్య మిత డెల్ల సముల్లసితంబుగాఁ బొన
ర్చెను దనుఁ దాన విక్రమము చేవయు నెక్కొనఁ జేసి యద్భుతం
బునఁ బొదలించె నిందఱిఁ బ్రభూత మభూత మనంగ నైన పీ
డన మొనయించె శాత్రవుని డంబు కరంబు విడంబనంబుగన్. ౫

తే॥ అధిపుఁ డతిదుష్కరం బైనయట్టి కార్య, మంపుఁ దన్ను నియోగింప నంతపట్టు
నేర్చి నరవేర్చి యానల నీతిఁ బేర్చి, యొండుగూడ ఘటించువాఁ డుత్తముండు. ౬

క॥ పంచినపని నట్టనఁ గా, వించి సమర్థుండ యయ్యుఁ బెరయుర్థముఁ దా
నించుకయే నెంచనియా, పంచజనుఁడు మధ్యముండు భృతిభృత్యులలోన్. ౭

ఆ॥ ఒండు విస్మృతి లేక యుండి మేల్పొందిక, చాలఁగలిగి చేయఁజాలి యొకఁట
నేలువాని కర్జ మిట్టటు చెడఁజూచు, నట్టివాఁడు పూరుషాధముండు. ౮

ఉ॥ కావునఁ గాడ్పుపట్టి కడఁ కం బచరించినయట్టి దెల్ల సు
శ్రీ విలసిల్లె నేలఘుతఁ జెందదు ప్రీతిఘటించె నాకు సు
గ్రీవుఁ గృతార్థుఁ జేసెఁ బరికింప ద్విరుత్తమ మైన నేమి నే
నీవల నెంచి సన్నుతికి నేర్పడఁ గూర్పఁగరాదె యీతనిన్. ౯

ఆ॥ పావనుం డితండు పవమానతనయుండు, నన్ను నాకొలంబు ననుచువారి
నెల్ల మనిచెఁ గొలుచు నీసుమిత్రానూతి, బ్రదుకు గట్టి సేసెఁ బరఁగఁ దెట్లు. ౧౦

క॥ ధర్మం బీతనిసామ్మె, మర్మంబును బోల దింక మారత్మణ మి
ట్లర్మిలిఁ బొనర్చుటను స, త్కర్మంబుల కలిమి కితనిఁ గాదే తల్ఁపన్. ౧౧

ఆ॥ దీన మరల మదిని దీనమానసునకు, మరలుబాటె చక్క మలయున య్యొ
నేమి నేసినాడ నీప్రియాఖ్యాతకుఁ, బ్రియ మటంచుఁ దృష్టిఁ బెరయునికి. ౧౨

క॥ ఐనను సర్వస్వంబే, యా నాపరిరంభణము మహామహుఁడు మరు
త్సూనున కబ్బె ననుచు నభి, మాన మొసఁగఁ గౌఁగిలించె మహితుం డతనిన్. ౧౩

ఆ॥ ఇట్టి కాలు మరసి యొనయించితి నటంచు, నిచ్చెఁ జనవు గ్రొచ్చి యెత్తి మఱియు
సంభ్రమానతిహృష్ట సకలాంగుఁ డై రాముఁ, డెంత గలదొ దాన నవ్వఁ డెఱుఁగు.

క॥ కృతకృత్యతచేఁ దనుపొ, రతు నమ్మారుతిని ధన్యుఁ గావించి సమా
హితమతి యై హరిపతి వినఁ, దత ముత్సాహంబుఁ గూర్పఁ దా నిట్లనియెన్.

మ॥ సుకృతం బ్జేయన వయ్యె నన్నిగతులన్ శోధించినన్ సీతఁ గాం
చక నావించు తెఱంగు లేమి నిపు డాసందర్భమ్ము పేరెంచినన్
వికలం బయ్యెడు నెమ్మనంబు కన్ను లేవెంటన్ గనంగాంచువా
రకలంకాత్ములు దక్షిణాంబునిధి నా నప్పార మత్పారమున్. ౧౬

క॥ పారావారము కడు దు, ష్పారము మహాదూర మొనయ్యు పని పాల్పడె నీ
శారమున నెట్టు లొగ్గడు, వారమొ తల యెఱుకపడ దవార్యం బదియున్. ౧౭

ఆ॥ వింటి మేలి వార్త విశ్వంభరాసుత, సేమ మరసి వచ్చి చెప్పినంత
సీహరీంద్రు లెటు సమాహితులై దాఁటు, వారొ వార్ధి వలను వలయుఁ దెలుప.
క॥ అని హనుమంతునితో నని, ఘనుఁ డార్తుం డగుచు నొండు గానక చింత
న్మునిఁగెడు విధమున కౌశ, త్రునిబర్హ్మాణుఁ గాంచి హరివరుఁ డున్ముఖుఁడై.

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునకు నుత్సాహముఁ గలిగించుట ♦—

ఆ॥ శోకనాశనముగ సూనృతంబుగ నిట్లు లనియెఁ బ్రాకృతంబు జనముపోలె
వీర! నీవుగూడ వెతనొందుదే తాప మింత తగునటయ్య యీయెడలికి. ౨౦
వ॥ కృతఘ్నుండు సౌహృదంబు నట్లు లిప్పట్టున నీ వీసంతాపంబుం బరిత్యజింపుము.
ఉ॥ దీనికిఁ గారణం బెదియుఁ దేఁకువ నైన నఱయంగఁ దోఁప ద
మ్మానిని వార్తయుం దెలిసె మూర్తుని యాలయముల్ లయమ్మె య
వ్వానికిఁ గాఁగనుండుటయు వార కెఱుంగఁగనయ్యె నేల న
న్మానము వీడి దీవు మతిమంతుఁడ వై రణపండితుండ వై. ౨౧
తే॥ ప్రాజ్ఞుఁడవు నీయెఱుంగమిం బరఁగు శాస్త్ర, మర్థమును లేదు పాపిక యైన యిట్టి
బుద్ధి వీడుము సద్యోగి పూరుషార్థ, దూషణి మనీషఁ బోలె సంతోషి వగుము.
సీ॥ లంఘించెదము మేలి లాఘవంబున నక్రఝషసమాకుల మైన సాగరంబు
నెక్కించెదము సేన నెక్కుడౌ మగఁటిమి లంకపై హనుమత్కృతాంకపైని
యోజించెదము బుద్ధియుక్తి నచ్చటగల వివిధసాధనముల విదలనంబు
సాధించెదము రిపు సపరివారంబుగఁ గొంకులే కెదిరించి కూడముట్టి
యొదుఁగుదురె శూరు లీహరియూథపులు న, మర్థు లెన్నయి నైన నీయర్థమునకు
నగ్గి నుఱుకంగఁ పాతాళమైనఁ జొరఁగ, నున్నవారు మహోన్నతిఁ గన్నవారు.
తే॥ శోకపర్యాకులాత్ముఁడై చొరవదక్క
దీనుఁడు నిరీహుఁడును నైన దేవుఁడేని
యును నతని మేలి యర్థంబు లుడిగి మడఁగు
నఘము వానిం బొదువు నిశ్చయమ్ము సుమ్ము. ౨౪
ఉ॥ ఎట్టులు సీతఁ దేవలయు నవ్విధి రావణుఁ బాపకర్మునిన్
మెట్టుట యొప్పు నెట్టిడగు మేలిమి నొక్కన సేతు వబ్ధిలోఁ
గట్టఁగఁబోలు రక్కసుని కల్మికిఁ జో టననైన లంక నే
మట్టునఁ గాంచువార మది మాకెఱిఁగింపఁదలంపు మియ్యెడన్. ౨౫
ఆ॥ అలత్రికూటశిఖర మందున్న యాలంక, నెపుడు గాంచువార మెనసి యపుడె
రావణుఁడు నశించు రణరంగమున నంచు, నిశ్చయింపు మిదియె నిశ్చయంబు.
క॥ ఘోరం బగు నాపారా, వారంబున సేతు వొకఁడు వఱలింపక లం
కారాష్ట్రము సాధింపఁగఁ, గా రింద్రునితోడి సురలుఁ గర్బురవరులున్. ౨౬

ఉ॥ సేతువుఁ గట్టినంత దరిఁజేఱఁగ నేర్చును సైన్యమెల్ల న
ట్లాతటి నే జయంబొందవు నంచుఁ దలంపుము శూరు లాజిని
ష్ణాతులు కామరూపులు సుసంగతులై హరివీరు లవ్వరిన్
శా తగలింపఁజాలుదు రబద్ధము గాదు నిబద్ధ మింతయున్ ౨౯

ఉ॥ వీరుని చేయఁబోలుపని వీడక యుత్తటి సత్వ మోజమున్
నేరిమియుం బ్రభావమున నెక్కొనఁ జేర్చి కడంగి మద్విధుల్
వారనివా రనిం దనదువారయి సాయ మొనర్ప దుష్టుఁ డౌ
వైరి నగల్చి చేకొను మవార్యుడఁవై జయలక్ష్మి సీతతోన్ ౩౦

ఆ॥ ఏద వచ్చిపడిన నది పోవఁగా నైన, నిన్నుబోటివారు నెఱిదలంగి
శోక మూనఁబోరు పాకారిముఖ్యులు, బడరె యాపదలనుఁ బ్రీతిఁ గనరె. ౩౧

క॥ వి ల్లీవు దాల్చి నిలిచిన, ముల్లోకములు న్వడంకు మొనసిన మొనవా
రల్లాడరె రక్కసుఁడే, బల్లిదుఁడే నిన్నుఁ జెనకి బ్రదుకఁగ నింకన్. ౩౨

క॥ వానరుల తల నిలిచె ని, ప్పూనిక తెఱలింపనైనఁ బోవదు సుమ్మా
నీనాయికఁ గాంచెద వవ, నీనాయక ! యబ్ధి దాఁటి నెలకొనినంతన్. ౩౩

తే॥ చాలు విక్లబ యగు బుద్ధి జాలుకొలుప, బోదు మది యఖిలార్థము ల్పొకడంచు
శోకమునకును బురుషుని శూరతకును, సహజవైర మ్మగుట శాస్త్రసమ్మతమ్ము.

క॥ కోపం బవలంబింపుము, శాపింపుము వైరికోలముఁ జావు మనుచు ని
క్లేపు సెడి యున్న క్షత్రియు, లేపగిదిం గాంచువార లిష్టార్థంబుల్. ౩౪

క॥ మెత్తనివారలఁ గాంచిన, నొత్తార వొనఁగూర్చువార లుర్విఁ బలుకుతోఁ
గత్తిం గొనెడు ప్రచండునిఁ, జిత్తమునం జేర్చుకొనుచుఁ జేడ్పడుదు రరుల్. ౩౫

ఉ॥ ఈవు కుశాగ్రబుద్ధివి మహేంద్రునియంతటివాఁడ వింద ఱన్
గావఁగ నేర్తు విమ్మెయి వికారముఁ ద్రోఁచి విచారణంబునన్
ద్రోవక వీరలం గొని నిరూఢత నద్దరిఁ జేరఁ గాంచఁగా
నావలఁ జేయ నెంచునది యంతయుఁ దెల్ల మనంగ నయ్యెడిన్. ౩౬

ఆ॥ తూలుఁ జెట్లుఁ గురిసి నేల గ్రక్కదలంచి, లంక పాడుసేసి లావరులను
దుంచి యొక్కమాత్ర ద్రోహి నల్లాడించి, కట్టుఁగట్టి యిడరె కపులు దొడరి.

క॥ దాఁటుదు మీ యంబుధి నొక, వ్రేటునఁ గూల్చెదము పురి నరిష్ట మరికి న
ప్పాట సమకూర్చెదము నీ, మాట నెఱపకున్న మాకు మగసిరి గలదే. ౩౯

క॥ పెక్కులు శకునము లేనీ, చక్కటి వీక్షించుచుంటి సంప్రాప్తంబై
నిక్కెడు నామది జయరమ, జక్కఁ గొనెడ వింకఁ బెరవిచారణ లేలా. ౪౦

ఆ॥ సాధ్వి యవనిజాత సంశ్రయించెను నిన్ను, లక్ష్మి గాని యాపె లాతి గాద
యొడ్లు చెనకరేని యుదు టడంచి మడంచు, వారి వారికోలమువారిఁ ద్రోడ. ౪౧

క॥ అరి గూలఁగ సిరి సేరఁగఁ, బరివారము నిన్నుఁ గొలిచి బ్రదుకఁగ సీతా
సరసీరుహాక్షితో నీ, వుర వెనసి భరింపఁజాలె దీజగ మెల్లన్. ౪౨

మ॥ అను సుగ్రీవుని హేతుమద్వచన మ ప్డాలించి తత్త్వార్థవే
త్త నవోల్లాస మెసంగ మే లని సమర్థత్వంబు చెన్నారఁ బా
వనిపైఁ జూడ్కి నిగుడ్చి శాత్రవుని దర్పం బెంచి స్మేరాస్యుఁ డై
యనె ని ట్లారఘునాయకుండు మహితం బారంభ మొప్పారఁగన్. ౪౩

ఆ॥ తపము శక్తిఁ జేసి తద్దయు వేగంబుఁ, బడసియైన సేతుబంధనమున
నైన వట్టిపోవ నంబుధిం బొనరించి, యైనఁ గడతు మదియు నట్టు లుండె. ౪౪

సీ॥ దుర్గ యా లంకకు దుర్గంబు లెన్నెన్ని గల వందలి విశేషఘటన లెట్లు
పరఁగుఁ దద్బలముల పరిమాణ మెట్టిది ద్వారగుప్తికలాపప్రచార మెద్ది
విస్తారము కొలంది విధ మెంతలెంతలు పొలదిండిపోఁతు లేపాడనువారు
వారి గేహంబుల వరుస లేపాటివి జంత్రమ్ము లెమ్మెయిజాడఁ దనరుఁ
జొచ్చి చూచినవాఁడ వాసొబగుఁ జేమి, వర్తనంబునఁ జరియించువాఁడు వాని
నెల్ల వివరింపు వెరవరి వీవు నాదు, కనులగట్టినయట్లుండ ననిలజుండ. ౪౫

తే॥ అనుచుఁ బలికిన రాముని యట్టిదైన, పలుకుఁబడి విని గాడుపుపట్టి యలరి
వాక్యసారజ్ఞుఁ డవ్వల వలను మెఱయ, నిట్టు లనెఁ గేలు మోడ్చి నగేంద్రతనయ!

—♦ శ్రీరాముఁ డడుగ హనుమంతుఁడు లంకాదుర్గాదుల వర్ణించుట ♦—

ఉ॥ అంతయు విన్నవింతు వినుమయ్య సురారిపురంబు సార మి
క్కింతయుఁ దీక్కుఁగుండ నెటు లేయెడ దుర్గవిధాన మొందె నే
పొంతల నెందఱెందఱు ప్రభూతపరాక్రము లుందు రెట్టి ర
క్కాంతునిఁ గొల్తు రేమిటఁ బ్రకాశిలు నెంతకుఁ గూర్చు నబ్ధియున్. ౪౬

తే॥ బలవిభాగంబు వాహనప్రకరముంబు
రాకపోకల తెఱఁగు నిరాకరణము
గనులఁ గాంచినయది మదిఁ గదిసి యట్టి
యెదుటఁ గనఁబట్టెడు మహీమహేంద్రపుత్రి. ౪౭

సీ॥ అసనంబ కాని యేపరుసంబును నొకంటఁ, గనఁబోవ దెన్నఁడుఁ గాంతుఁ గవిసి
యరదంబులును మదద్విరదంబులును నిన్ని యని చెప్పనేరఁ డనంతుఁ డైన
రంగమధ్యగఁ దత్తురంగమావలిఁ గాంచి యెంచఁ డత్తైలిమావి నింద్రుఁ డెలమి
నా సేన కడిమి మహాసేను నడిమికి గానీయ దను టబ్బురంబు గాదు

మున్ను సృజియించె విధియాన మునుకొనంగ
బరుల కెటు దుర్గమ యనంగ బరగు పెంచి
కూతుసంబంధమున నెలకొలిపె మించు
కలిమి వెండియు నావిశ్వకర్మ గడరసి. ౬౯

తే॥ అప్పురికి నాల్గు ద్వారంబు లొప్పుచుండు, గొప్పలును విపులములు నై కోటి సేయు
నవియు యవియనియరరంబు లర్గళలు వ, రార్గళలు దమయవిగాగ నమరియుంట.

తే॥ శరశిలాయంత్రచయము లచ్చటులయందు
జటులములు లావు బలువు మిక్కుటము లగుట
వచ్చు పరసైన్య మెల్ల నవ్వాని నెఱిని
బ్రతిహతం బగుచుండు నేర్పడ దొకొండు. ౭౦

తే॥ పొరి నినుపకట్టు లవ్వాని బురుజులందు, శతములు శతఘ్ను లున్నవి శితము లవియె
పగఱగుండె లగల్చెడు పనికి జాలు, వీరకోటులు పైపెచ్చు వెఱపు సూప. ౭౨

ఉ॥ బంగరుకోట మిన్నొడిసి పట్టుకొనం దలపెట్టుచుండు నే
బ్రింగుడుపాటులేని దదెపో చిరలబ్దమహాదయంబు త
త్సంగతవజ్రముఖ్యమణిజాలవిశాలకలాప్రసంగ మా
భంగికి జేతు లెత్తి నిలబడ్డవిధం బని తెల్పుచుండగన్. ౭౩

తే॥ దుష్ప్రధర్షణ మద్దాని దొరసి దొరకు, మెచ్చు గూర్చుచు బగతుల మే లడంప
జాలు మొసళుల మీాలమేల్వాళ్ల నీళ్ల, గాధములు గాక తీర్చి యగడ్తలచట.

తే॥ నాల్గుగవనుల సంక్రమనామకములు, గలవు మార్గము ల్ఫలకోపకల్పితములు
యంత్రసారకలాఘటితాంతరములు, వితతములు నాల్గుభటగృహావిష్కృతములు.

క॥ పరిఘుల జంత్రము లమ్మెయి, బరగుగ బఱచినటు లెడ్డ పరసైన్యం బా
కరపడ నగు నప్పుడె య, ప్పురివంకకు దిరుగు వారిపూరము పెరుగన్. ౭౬

క॥ వచ్చినవారల నెల్లం, బెచ్చు పెరిగి ముంచుచుండు బిఱుదీయక య
మ్మచ్చున గల యంత్రమ్ములు, మెచ్చొరసిన వెన్నియేని మేకొను బురిలోన్.

తే॥ అన్నియును బురిగావంగ ననువుపడిన, యవె యకంప్యం బొకండుండు నందులోన
గట్టిలో గట్టి దై బలకలన లొప్పు, గాంచన స్తంభములు వేదికలను గలిగి. ౭౮

క॥ ఉత్తర మగు ద్వారంబున, నుత్తంభిత మగుచునుండు నొత్తొరయుక యా
పొత్తు గని మను టరిది య్యే, యెత్తున దలకొన్న బోతుటీగరు నేనిన్. ౭౯

చ॥ ప్రకృతికి దప్పు డేక్రమము బాసి మెలంగడు యోద్ధు కాము జే
నికృతికి బాలుగా దసురనేత భయావహు డప్రమత్తు జే
వికలత జేరనీడు తఱివేచుచు మే ల్కొనియుండు నెప్పుడున్
బ్రకటయశుండు రావణు డపారబలుం డెడబోక వీకతోన్ ౮౦

క॥ తనవారి మేలు మది నిడి, యనవరతముఁ బ్రాభవమున నమరినవాఁ డా
యనుపమబలునకుఁ దగు నిదె, యను పలుకున దేవ! దుర్గ యగు నప్పురియున్.

తే॥ భయము పుట్టించు నాదేయపార్వతములు, వాన్యకృత్రిమములును నవ్వరుసనాల్గు
బలువు లొప్పార నవి మెట్టుపైని మెట్టు, కొనిదురాసదయంచుఁ జేరొక్కనంగ నగడ.

శా॥ పారావారము దూరపార మతిదుష్పారంబ నై యుండఁ ద
త్పారంబం దది నెక్కొనంగనయి చేడ్పాటంద దెప్పాట నే
ప్రారంభం బెనయింపనేర రౌరు లప్పట్టొంద నా మార్గ మా
ధారం బొండునుఁ దోఁప దేవగిది నిధ్యానించినన్ రాఘవా. ౧౩

క॥ అంగబల మర్థబలముఁ బొ, సంగఁగ సురపురియుఁ బోలఁజాలదు దానిన్
సంగడ మారసి త్వష్ట క, డంగి సృజింపంగఁ గలిమి తావుకొనంగన్. ౧౪

తే॥ పరమదుర్జయ రామ! యావట్టి పట్టు
పరిఘలు శతఘ్నులును యంత్రపద్ధతులును
నందె కల వందె వేసిన యది మదీయ
వల్లభుఁ దెరల్ప నేర రెవ్వారు ననఘ ౧౫

క॥ ఎన్ని యలంకారములు మ, ఱెన్ని కలంకాపహత్వ మెనసిన కలనల్
కొన్ని యన నేల యన్నియు, నన్నిలవునయందు వింత లనివార్యంబుల్. ౧౬

సీ॥ ఆదురాత్ముని పురి కగు తూర్పువాకిట వసియింత్రపదివేవు రసురవీరు
లోకలక్ష రాక్షసు లుందురు దక్షిణద్వారంబు నవ్వేళఁ దఱియఁ గాంచి
యటు పశ్చిమప్రతీహారంబు వీడదు పాటిల్లు దానవప్రయుత మెపుడుఁ
గలిమి నుత్తరపు డాగవనునయం దొప్పు న్యర్బుదసంఖ్యాకశక్తి రాఘ
వందఱును శూలహస్తులే యస్త్రయోధు, లే బలాఢ్యులె పూజితులే కులీను
లే దురాధర్షులే ధీరులే సురథులె యేమనఁగవచ్చు నచ్చోటి సేన మధిప. ౧౭

తే॥ మధ్యమస్కంధమున నుత్తమముబలమ్ము, కోలఁది యిడరానిదది వేలకోలఁదిఁగాఁగ
నుండు నప్పురిఁ జేరొక్కన్న దండిమగలు, పూర్ణకోటికి నెక్కుమేల్ప్రాలుపుఁగాంత్రు.

క॥ ఐన స్నిగ్ధయు సేన, ద్దానం జోరఁబాఱ మేలిదశ కది వాసెన్
నీనామమంత్ర మిఁక నే, దానవతతి నడఁగనిచ్చు దశరథరామా. ౧౯

ఆ॥ కలుగు సంక్రమములగల్చి యగడ్తలు, బూడ్చి సాలవితతి ఫ్రొడ వడంచి
లంకఁ గాల్చి మేల్పలమ్ముగ నౌకపాలు, గ్రుమ్మించి నీపదముల కొరసినాఁడ. ౨౦

ఉ॥ సందియ మేల యబ్ధి నొక సంద దొనరింపఁ ధరించ నైన మే
లక్కొందువఁ గందు మేని వెతఁ గానదు వానరులోక మెత్తునం
గొందరు రాక్షసాళ్ల యనుముఁ గోరికె లీలికె లెత్త దైత్యునిన్
ముందలపట్టి యీడ్తు రిది మోఘమ్ము గాదెదలో ఘటింపవే. ౨౧

తే॥ అంగదుఁడు ద్వివిదుఁడు మైందుఁ డట్లు జాంబ
వంతుఁడు నలుండు పనసుండు వాహినీంద్రుఁ
డైన నీలుండుఁ జాలుదు రంద ఱండ
నబ్ధి లంఘించి యరిపుర మాక్రమింప. ౨౨

ఆ॥ ఎఱిఁగి యాజ్ఞసేయు మింతవట్టుఁ బొసంగు, వార లరిగి పరిఘవప్రసాల
తోరణాఢ్య లంకతోఁ గొండఁబెకలించి, యిచటఁ దెచ్చియిడుదు రీక్షణంబ. ౨౩

క॥ మంచితఱి యెడఁద నాలోఁ, చించి వనుపు మనుపు నెఱపు సిరి మీఱఁ బ్రవ
ర్తించెద రరి నొంచెదు పని, గొంచెము గాకున్న యుద్ధకోవిద! నీకున్. ౨౪

ఆ॥ యుక్తమగు ముహూర్తమూహించి వేనిశ్చ, యించి బయలుదేర నెంచుమయ్య
బలములెల్లఁ జుట్టు బలసికొల్వఁగ వార్ధిఁ, జేరి తలఁతు కార్యసిద్ధి పదవి. ౨౫

క॥ అని యనుపూర్వముగా నను, హనుమని పలుకఁబడినరణి నాలించి ధృతిన్
ఘనసత్యపరాక్రముఁ డి, ట్లనె రాముఁడు తేజు నెఱయ నర్కజుతోడన్. ౨౬

—♦ శ్రీరాముఁడు సుగ్రీవునకు యుద్ధయాత్ర సాగింప సెలవిచ్చుట ♦—

ఆ॥ పవనజుండు దెలిపెఁ బాపాత్ము పురి వీక, జోక లరసి కనులఁ జూపినట్లు
నేను దాని నిపుడె నేలకుం గోలకు, దెత్తు భీమబలుని దితిజుఁ గెడపి. ౨౭

చ॥ నడిమికి వచ్చె భాస్కరుఁడు నాకు జయప్రద మిమ్ముహూర్త మే
ర్పడె విజయాఖ్య మియ్యెడనె ప్రస్తుతముం బొనరింపు యానమున్
దొడరెడు నామనంబు దొలుదూఁకుడునం బడలింతు నంచు వాఁ
డడరి హరించె సీత ననయంబున నిం కిట నెందు వోయెడిన్. ౨౮

ఆ॥ జీవితాశఁ బెరయు జీవితేశ్వరి సీత, మదభియానవార్త మలసినంత
విసము ద్రావి బిట్టునెతనొందుప్రజ యమృతము స్పృశించి యట్లు తరణితనయ!

క॥ ఉత్తరఫల్గుని నేఁడే, యెత్తిచనంజనున కాని యెల్లి దగదు హ
స్తాత్తపరతిథియు కాన వి, పత్తికి మూలంబు తలఁపు ప్రాజ్ఞత వెలయన్. ౩౦

ఆ॥ మనయనీకముల సమాహితముల నెంచి, నడుపు మిపుడె మేలు నాకు శత్రు
భంజనం బొనర్చి పరఁగుదు జానకి, సీతఁ దోడితెచ్చి సిరులు నెఱయ. ౩౧

ఉ॥ ధన్యము లౌ నిమిత్తములు తద్దయుఁ దోఁచుచునున్న విప్డు ప్రా
ధాన్యమున న్మనోరథము దావుకొనందగు గెల్పు దెల్పనై
యన్యము లట్టు లుండ నయ మార దృగూర్ధ్వతలస్ఫురత్తి సా
మాన్య యనంగ రాక సిరి మామకహస్తగతం బొనర్చెడిన్. ౩౨

క॥ అని పలికిన వానరరా, జనుజుఁడు మేల్మే లటంచు నభినందింపన్
మనునిభుఁ డక్షవిదుఁడు వా, డనుధర్ముఁడు మఱియు నిట్టు లనె నచలనుతా. ౩౩

ఉ॥ వందలు వేలు వానరులు వారక గొల్వఁగ వారిఁ గొంచు ని
వ్వందుఁ బ్రమోద తేజుఁ డధిపాలుఁడు నీలుఁడు త్రోవఁ ద్రొక్క నై
ముందుగ నేగువాఁ డాలయు మెచ్చుట లెచ్చరిక ల్పొసంగ సా
నందత నంది యందఱు మనస్వితఁ జేవ నెలర్చువారుగాన్. ౮౪

ఆ॥ అనినయంత నాతఁ డగ్రిమస్థైర్యుఁ జేరంగ, నైన నంతరంగ మలరి పొంగఁ
బలికెఁ దోన వానిపైఁ జూడ్కి నిగుడించి, రాముఁ డఖిలలోకధాముఁ డెంచి.

మ॥ ఫలమూలంబులుఁ బూవులు న్మధువులుం బ్రాపింప రూపై కలం
కులఁ దీరొందు కొలంకులుం దనర మైకో ల్పొసంగు మే త్రైమ్మరల్
బలునీడ ల్సుఖవృత్తి నెక్కొలుప నేవ ట్లుండు నాపద్గతిన్
లలి సేన న్నడిపింపు మీశుఁడవు నీలా! నీవు వాలాయమున్. ౮౬

క॥ అని యతని హెచ్చరించుచు, నినజుని సౌ ననిమె మఱియు నీడంబోకే
కనినఘపంగలవనికిని, ననుజ్ఞ సేయంగవలయు నను వగు భంగిన్. ౮౭

ఉ॥ రోషితు లద్దురాత్ము లసురు ల్ఫ్రకృతి మూలఫలోదకాదులన్
దూషణము ల్ఘటింతు రరిదూషణ! నీ వది యెంచి సైన్యపుం
బోషణపుం బొనర్పుము ప్రబోధిక వృత్తి పొసంగ స్వీయసం
తోషణ ప్రాప్తు డేమఱక దుర్మదులం బరికింపు మీర్పడన్. ౮౮

తే॥ మలయునప్పుడు వనదుర్గమస్థలములఁ, బల్లములఁ గందరలఁ దగుపట్టులందు
శత్రు లునిచిన బలముల జాడ లరయు, వలయుఁబైపై నగసిచూడ్కులొలయఁ జేసి.

తే॥ ఇందు దుర్బల మైన దొకించుకేనిఁ, గలుగ నిచ్చటునందె యాబలము నిలువు
మలఁతి గాని విక్రమమున నాక్రమింప, నెంచునప్పు డిదియె కృత్య మిత్త్రతేజ. ౯౦

ఆ॥ సాగరౌఘనిభము సాంగ్రామికము భీమ, మగ్ర్య మగు ననీక మగ్రగతులు
ప్రబలు లైన ప్లవగపంచాననులు వేల, కొలఁది చాలి నడుపవలయుఁ గడఁగి.

ఆ॥ గిరినిభుఁడు గజుఁడు పరబలాంతకు లాగ, వయగవాత్తులునుఁ బ్రవర్ధమాను
లగుచు నడుచువార లాసేన గోతతి, గా ఘనర్షభముల గతిఁ దనర్చి. ౯౨

ఆ॥ గంధహస్తియంత గలఁడు శరస్వి దు, ర్మర్షణుండు గంధమాదనుండు
వాఁడు చాలువాఁడు వానరవాహిని, సవ్యపార్శ్వ మొనసి చక్క నడుప ౯౩

తే॥ ఇంద్రుఁ డైరావణం బెక్కి యొట్టు లట్టు, లేను హనుమనిపై నిల్చి యేగు దెంతు
నందఱకు హర్ష మొదవింతు ననువుపడెడు, మధ్యమస్కంధమునన సామాన్యగతిని.

క॥ ధనదుఁ డెటు సార్వభౌమ్ముం, బునపై నంగదునిపైఁ బ్రబుద్ధుఁ డటులె నా
యనుజన్ముఁడు నిల నై న, న్ననసియు రాఁగలఁడు ధృతి ననీదృశుఁ డెలమిన్ ౯౫

తే॥ పక్షిరక్షణ మొనరింపఁగూర్చువాఁడు, వెనుదలఁ దనర్చుచు సుషేణు వేగదర్శిఁ
గూర్చుకొని జాంబవంతుండు కోవిదుండు, ఋక్షరాజు మహాసత్త్వుఁ డీక్ష నెఱయు.

క॥ శిబికారూఢుఁడ వై నీ, వ్రిబోధ మెసఁగంగఁ దోడఁ బరఁగుచు దెసలం
గబలింపఁ జూడ్కు లొలయఁగ,నిబంధనలఁ బొనరఁజేయు నేరిమిఁ గొనుమీ. ౯౭

ఆ॥ అనినయంత వినజుఁ డగచరేంద్రుఁడు సేన కానసేసెఁ జెవుల కాని నవుడె
పొంగె బూరటిల్లెఁ బ్లుతులచేఁబొలుపొందె నెగసెఁ గదిసె నదినగేంద్రతనయ!

ఆ॥ యుద్ధకాంక్షమిగుల నొఱకటంబులఁగొండ, కొనలగుహలఁ జఱులఁ గొఱలుచుండి
యైన వార్త నెఱయునంతనే పఱతెంచి, రాప్లవంగవీరు లరుస మెసఁగ. ౯౯

క॥ అంతట వానరనాథుని, సంతసమును లక్ష్మణుని ప్రసంగము సిరియున్
మంతన మెలయింప బలగ, మంతయుఁ గొని వెడలె రాముఁ డరిపురి నఱుమన్.

—♦ శ్రీరామచంద్రుని విజయయాత్ర. ♦—

క॥ దక్షిణపుదిక్కుమొగ మై, యక్కదనపుసేన నడిచె ననరా దెసయుం
జక్కఁ గనఁ గాదు లెక్కలఁ, దక్కఁగొనం బోల దావిధాతకుఁ దక్కన్.

క॥ శతశతసహస్రనియుతా, యుతప్రయుతకోటికోటు లూర్జితు లిభస
మ్మితులు నగు కపులఁ జేకొని, యతులితవిక్రమత నాతఁ డరిగె సురాజ్ఞీ. ౧౦౨

క॥ ఆహార్ నాహారివాహిని, యీహ మెయిం గొలుచుచు స్మహేచ్ఛతఁ జను న
న్నాహ మరసి యమరులు సం, దేహం బుడివోవ మేలిధృతిఁ బెరసి రుమా.

క॥ అతిదర్పితు లై సంమో, దితు లై పతి ప్రాపు ప్రోపుఁ జేఁకువ నిడ గ
ర్జితములు చగ్లాటలు ను, త్ప్లుతములుఁ బరుగులునుఁ దనరఁ బొనరిరి నవలా.

తే॥ దక్షిణపు దైన దిక్కెల్లఁ దామె యగుచు
మధువులు సుగంధు లానుచు మాధురీ స
మంజసఫలంబులం గొంచు మంజుకుంజ
మంజరీపుంజములఁ దాల్చి యంజ లిడుచు. ౧౦౫

చ॥ ఒరయుచుఁ దృప్తు లై యొకరి నొక్కరు లుద్వహనం బొనస్తు రు
ర్వరఁ బెరయంగ వై తు రటు వారలఁ గాంచి హసింతు రన్యు ల
వ్వారవున నుల్లకుట్టు లని వేగిరపా టొలయంగ నొడ్ల న
వ్వరునకుఁ దార్తు రేమనఁగవచ్చును వారి వినోదము ల్సఖీ. ౧౦౬

క॥ కొండ లగలఁ దోఁకలతోఁ, జండిమ నారయంగ బిట్టు చఱచెదరు కరుల్
దుండములఁ దోయములపై, నిండినకుతుకమున నట్లు నీరజవదనా. ౧౦౭

ఆ॥ రాముచెంతఁ జేరి రావణు నేఁ ద్రుంతు, నేన నేన యనుచు నింగిముట్ట
విన్నపం బొనర్చు వీరులఁ గని పెర, వా రసురులు మాకుఁ బా లటంద్రు. ౧౦౮

ఆ॥ ఋషభకుముదులోజ నెనసిరా నీలుండు తొడరు కోటిబలముఁ దోడికొంచు
మార్గశోధనంబు మలయంగ ముందర, నడిచెఁ బెండ్లికట్లు ననుచు వేడ్క. ౧౦౯

మ॥ నడిచెక్కిన్ హరినాథుఁ డేర్తెఱ జగన్నాథున్ సుమిత్రాత్మజున్
గడు నెయ్యంబున గారవించుచుఁ బరాక్రాంతిక్రమం బొప్ప సే
ర్పడి భీము ల్ప్రబలు ల్వలీముఖులు పుంభావప్రభావోన్నతుల్
గడఁకం గోటికిఁ గోటులై కొలిచిరాఁ గావించెఁ బ్రస్థానమున్. ౧౧౦

తే॥ అంతకుంజాలు వీఁ డొండె యనఁగఁ దనరి, వీరుఁ డాశతవలి హరివీరకోటి
దశకపరివృతుఁ డై సర్వథాప్రసక్తి, నఖిలసేనాభిరక్షణ మంది మెఱసె. ౧౧౧

మ॥ అతిశూరు ల్పనసుండు కేసరి గజుం డర్కుండు తత్పార్శ్వ వ్రసం
గతిమై రక్షణ మాచరించిరి జగత్కల్యాణు వీక్షించుచున్
శతకోటిప్రసితప్లవంగులు పోరిన్ సన్నద్ధులై తోడ్పడన్
బ్రతియే వీరికి సాఁకుమూఁ కని సుపర్వశ్రేణు లగ్గింపఁగన్. ౧౧౨

ఆ॥ వరసుషేణజాంబవంతులు బహుబుద్ధి, వితతు లోలిఁ గొలువ వీక నెఱయుఁ
బతిఁ బురస్కరించి పరఁగిరి బలగంబు, వెన్ను దన్ని కాచు పన్నుగడను. ౧౧౩

తే॥ ముందు నడచుచు నెల్లెడ మొనయు బుద్ధి, నఖిలసేనాధిపతి వీరుఁ డైన నీలుఁ
డలరు పరిపాలనంబున నలఁతి గాని, వలఁతిదన మొప్ప నొప్పె శ్రీవరుఁడు పొగడ.

క॥ గజనిభులు వరీముఖుఁడును, బ్రజంఘుఁడును రంభుఁడును రభసుఁడును సేనన్
గజిబిజిపడకుండ నడిపి, రజరులు మెచ్చఁ ద్వరితముగ నధికప్రజ్ఞన్. ౧౧౫

క॥ ఆలలిహరిశార్దూలులు, చాలి బలోద్ధతులు దనరఁ జని సహ్యాఖ్యం
బాలోఁ గనఁగాంచిరి తరు, జాలలతాయుతము మేలి శైలం బెదుటన్. ౧౧౬

క॥ హసితసరసీజకల్హా, రసమన్వితములు సరసులు రమ్యతటాకో
ల్లసితములు వనవికాసవి, లసితములు నరసిరి వారు లావణ్యనిధీ. ౧౧౭

ఆ॥ భీమకోపుఁ డిటఁడు రామభూపతి యంచు, వాని శాసనమున వనచరౌఘ
మడరు గదుర నడిచె ననుసంగతంబుగఁ, బురుల జనపదముల పొరువు విడచి.

క॥ మున్నీటివాఁక పోలిక, గన్నది వానరబలంబు గడు భీమం బ
త్యున్నతిఁ దనరినయది యా, పన్నగడ స్నిరవఁజాలె బహుఘోషణముల్.

తే॥ చోదితాశ్వంబు లట్టు లాశుద్ధమాన, సులు కపిప్రముఖులు మహాశూరు లడరి
కుప్పిగంతులు వైచిరి కొమరు మిగుల, రాము చెంగట నాతని రహిఁ దలిర్ప.

క॥ కపివర్యు లిరువు రట్టు ల్పే, మపరీతులు తమ్ము మోవ మహీపసుతులు వా
రపుడు మహాగ్రహయుగితోఁ, దపనశశులు నా వఱలిరి తద్దయు గిరిజా. ౧౨౧

ఆ॥ ఆప్రకాశమలఁతి యన్నరాదు పోల్పంగ, నెదియుఁ జాల దిల మహిల యుమ్యోఁ
బ్లవగపతి సుమిత్రపట్టియుఁ గొలన రాఁ, గపులు రామచంద్రుఁ గదిసి నడువ.

క॥ అటు లెల్లరుఁ దనుఁ గొలువఁగఁ బటిష్ఠుఁ డా రామనృహరి పగఱ సమితిలం
పటుల నణుమ నరిగె విశం, కటదోర్గర్వం బఖర్వకలనం దనరన్. ౧౨౩

—♦ లక్ష్మణుఁడు రామునితో ననుకూలనిమిత్తముల వర్ణించి చెప్పుట ♦—

తే॥ అంగదుని మూఁపుపై నుండి యప్రమేయ, బలుఁడు స్మృతితత్ప్రతిభాన కలితుఁడూర్జి
తాశయుండు పూర్ణార్థుఁడై యనియె నిట్లు, రాముతో లక్ష్మణుం డభిరామఫణితి.

సీ॥ ఇఁక నంతరము లేదు హృత సీతఁ జేకొందు వెల్లవేల్పులు మును వెనసి పొగడ
నా రావణపశుగ్రహము తద్వినశనంబు నేఁట రేపఁటఁ జక్క నెఱయఁగలదు
బుద్ధారుఁడ వతిసమృద్ధార్థక నయోధ్యఁ బ్రీతిమై జేరి భరింప నోదు
వతిలోక మై చెన లాక్రమించెదు భవద్విక్రమంబు త్రివిక్రమక్రమమున
నీదు కార్యసిద్ధి నెఱిఁ దెల్పుచున్నవి, దివిని భువినిఁ దేటతెల్లముగను
లలి మహానిమిత్తములు శుభప్రదములు గానిపించి యరయఁగంటె రామ!

ఉ॥ చల్లని మేలితెమ్మెర ప్రసక్తి మెయి న్మనసేనపైఁ బ్రవ
ర్తిల్లుచునున్న దెక్కుఁడు ధృతి న్నెలకొల్ప మనోనుకూల మై
యల్లనఁ బూర్ణసుస్వరము లారవము ల్వెలయ న్మృగద్విజా
త్యుల్లసితంబు లొప్పెడు మహోన్నత మభ్యుదయంబుఁ దెల్పుచున్. ౧౨

ఆ॥ దిక్కు లెల్లఁ దెలివి తేటల విలసిల్లు, చున్నయవి గొనంబు లుల్లసిలఁగ
వెలయుచున్నవాఁడు విమలభావం బొప్ప, నస్మదన్వయార్చ్యుఁ డైన హేళి.

ఉ॥ నీ కనుకూలుఁ డై నెరసె నేఁడు భృగూద్వహుఁ డోరఘూద్వహా
ప్రాకటశుద్ధియుక్తుఁడు విభాసురుఁ డాఢ్యుఁడు బ్రహ్మరాశి స
త్త్వాకరు లట్లు సిద్ధులు మహర్షులు హర్షులు వొల్చుచున్నవా
రాకృతులం బ్రదక్షిణసమాదృతులన్ ధ్రువుఁ బెద్దసేయుచున్.

ఆ॥ తగెఁ బురోహితుండు తనకుఁ దో డగుచుండ, విమలరుచిఁద్రిశంకువిభుఁడు రాజ
ఋషి పితామహాగ్ర్యుఁ డిక్ష్వాకుసంతాన, మనఁగ నెగడువారి కందఱకును.

క॥ నిరుపద్రవత విశాఖా, వరఋక్షము మేలికాంతి వఱలెడునది యై
పరఁగుచునున్నది యైక్ష్వా, కరమాకర మైన తార గద యదె యెపుడున్ ౧౩౦

ఉ॥ రక్కసిరిక్క మూల యన రాజిలు నయ్యది ధూమకేతు వా
చక్కటిఁ దోఁచి పైకొనఁగ జాడ్యగతం బయి యున్న దిప్పుడా
చిక్కనఁ జిక్కువా రరులు జీవులు జీవముఁ బాయు వేళ మే
లుక్కఱ స్వీయభం బొదుఁగు నుల్లసితగ్రహపీడనంబునన్. ౧౩౧

తే॥ సురసరసములు గాఁగ భాసురము లైన, సరసు లొలసెడు మేలి ప్రసాదకలన
వనము లొప్పెడుఁ దఱి ఫలవంతము లయి, పూవుదావుల తరువుల పొదవులగుచు.

తే॥ మొగ్గరమ్ములు దీర్చి యుమ్ములఁ దనర్చి, యెక్కుడుగ విలసిల్లెడు నీబలములు
తారకామయ మైన యుద్ధమునఁ దొడరు, దేవసైన్యంబు లట్టు లుద్దీప్తి వెలయు.

క॥ ఇటు లిన్నియు నారసి సం, కట మొకఁడుం గదియనీని కల్యాణి విశం
కటధృతిఁ గొని వెలయుము ప్రాకటయశము జయాంచితప్రకాశముఁ బెరయన్.

ఆ॥ అనుచు నూఱడిల్ల నాయన్న సౌమిత్రి, యన్నతోడ నరసి యాడు జాడ
కాతఁ డంతరంగ మలరంగ నై పొంగ, నరుగుచుండె సస్మితాస్యుఁ డగుచు.

మ॥ నఖదంష్ట్రాయుధు లాఢ్యసత్త్వులు భృతానందు ల్హరీంద్రు లీర్ష్యో
న్ముఖు లై వీఁకఁ బ్లవంగఋక్షబలము ల్మోసాల రా రక్కసుల్
సుఖు లై యుందురె యింక నంచు నెరసు ల్బోధించుచు న్నాటకా
ముఖవృత్తిం బచరించుచు న్నడిచి రామోదానుసంధాయినీ. ౧౩౬

శా॥ కేలం గాలఁ దెరల్చి భూమిరజముత్క్షిప్తం బొనర్పన్ సమా
లోలం బై కడుభీమ మై జగము నాలోఁ గప్పి భానుప్రభా
జాలం బాఁగి సపర్వతావనివనాశాద్యేక మీలోక మే
లీలం గ్రమ్మఱఁ గాంతుమో యనుచు నైలింపాళి శంకింపఁగన్. ౧౩౭

సీ॥ ఎదురెక్క నై నిక్క నేటివాఁకలు చక్కఁదరియింపఁజొరఁబాఱి తార్క్యనంగఁ
జేరనంతన సిగ్గు చేట్పాటునం బోలెఁ దలసూపవయ్యె మే ల్తరులు గిరులు
పైవచ్చిపడె భూమిభాగం బనుచు బిట్టు తల్లడపడిరి పాతాలవాసు
లభిభంజత్రియ పో మహాసేన యింత యేత్తెఱ కొని యని రెంచి దేవయోధు
లంబుదంబుల సంతతి యాకసంబు, నెట్టు లట్టులు భూతలం బిట్టిఁ డనఁగ
రాకయుండఁ బొనర్చి సీరాముసేన, దక్షిణంపుసముద్రంబుఁ దఱియునపుడు.

చ॥ కెలనలఁ దమ్మిపూపొదలు గ్రిక్కిఱియ న్నడిచక్కి నీటివాఁ
కల లలితంపు మే ల్బాబగుకల్మికిఁ గల్మి ఘటించు నచ్చపుం
గొలఁకుల మ్రాకుల న్నిగడు కొండల దండలఁ గ్రింద మీఁద మో
సలఁ దులకించుచున్ సరభసంబున నాబల మేగెఁ జిక్కలా. ౧౩౯

తే॥ సమతలంబుల వనముల చాయ లొరసి, పూలుపండ్లునుఁ గలవాని పొలప మరసి
తేనె లానెడు నెఱిఁ దెల్వితేట లెసఁసి, చనియె సేన మహాసేనజనని! మొనసి.

క॥ ఇది చా టని మా టని లే, దిది తెలఁపని తలఁ పటంచు నెందును లే దా
ముదమున దక్షిణ పుంబొల, మది తొక్కుచు నిక్కిచూచునపుడు పురంధ్రీ.

తే॥ అందఱుఁ బ్రహృష్టచిత్తులే యుండ ఱట్లు, పవనజవనులే విక్రమప్రథితగుణులె
యుందఱును రాఘవార్థ మాత్మార్పణం బొనర్చుచుఁ దనర్చువారెవిధ్యర్పనీయ.

ఉ॥ పొంగున నింగిముట్టుచు నె పోయిరి పో యినవంశ్య మౌళి హా
ర్యాంగణవీర్యసత్త్వతతయావనజోత్సుకభావలబ్ధద
ర్పాంగవిశిష్టచేష్టితము లయ్యెడ నెయ్యము తోడి మెచ్చికో
ల్సంగతి మైకొన న్నిరవఁజాలిరి వా రరిజాలదుస్సహా ౧౪౩

సీ॥ పేరెత్తిపిలుచుచుఁ బెరెమ్మ్రు లిడువార లెగుచుగోర్కు-లకు న స్లైగయువారు
కిలకిలధ్వను లేకకలన నెగ్గు-లువువా రవనిఁ దోఁకల నుఱుమాడువార
లడుగులఁ బాతాల మడుగుఁ బట్టించువా రగములఁ జూర్ణింప నఱుమువారు
శృంగంబులకుఁ (బ్రాఁకి చెంగున దుముకువా రెగుచెట్లు విఱిచి పోప్రవిడుఁదువారు
బి ట్టఱచువారు క్ష్వేళలుఁ బెనుచువార లూరుజవములఁ బెనుపొద లూడ్చువార
లావలించెడువా రాట లాడువారు, శిలల శాఖలఁ గొని కవు ల్కీల మొలయ.
తే॥ శతశతసహస్రకోటులు సంఖ్య లెగువఁ, గా నసంఖ్యాతు లైన యాకా-ననచర
వరులవలన నవ్వల నెల్ల వారని సిరి,కాస్పదం బయి మహికిఁ బూజ్యత ఘటించె.
తే॥ సేన యయ్యు సుగ్రీవాభిమానరక్ష్య, మాణ యాహరివాహిని మహాతి లక్ష్య
మాణతుష్టిప్రహృష్టిప్రమాణకోటిఁ దాఁటి రేయింబవలు నేకధాటి నడిచె.
క॥ త్వరితగతి నరుగు నవ్వా, నరవరు లందఱు రణాభినందనపరులే
ధరణిసుతామోక్షణత, త్పరులే యొకగడెయు నొంటఁ దార్కా-న రగజా. ౧౪౭

—◆ వానరసేన సహ్యామలయ ప్రదేశముల విహరించుట ◆—

తే॥ సహ్యామలయము లన నొప్పు శైలముల మ, హీరుహాలతాప్రతానసమృద్ధముల న
నేకవిధమృగసంచారహృష్టపుష్ట, ఖగరుతాంచితముల వారు గాంచిరబల! ౧౪౮
క॥ చిత్రము లగు విపినముల వి, చిత్రనదీప్రస్రవణవిశేషంబుల నా
గోత్రాధిపతనయుఁడు భువ, నత్రాణుఁడు రాముఁ డొరసె నంద్యచరిత్రా.
చ॥ పొగడలఁ బొన్నలం దిలకభూజములం గరవీరసింధువా
రగుణితసద్రసాలముల రాణఁ దనర్చు నశోకశాఖులన్
బొగడిరి మేలు మే లనచుఁ బొల్చి రదల్చిరి వాలి శాఖికా
మృగవరు లోలి మేల్మిఁ గను మేలనము ల్పచరించి రత్తఱిన్. ౧౫౦
ఉ॥ మంజులరంజనీపవటమాలకసాలకపిత్థకర్ణికా
రాంజనముఖ్యభూరుహము లందుఁ గనుం గొని హర్ష మంది రు
ద్భంజనముం బొనర్చి రది వారికి నైజమ కాదె దృక్కు-లా
సంజితచిత్తభూవిజయసారరసాధ్యవిసారలోచనా. ౧౫౧
తే॥ కాననద్రుమముల కెంత గలదొ వారి, తోడి చుట్టఱికము తోడుతోడఁ దొడరి
పవనజవ మూని వివిధపుష్పప్రతతుల, నాప్లవన మొనగూర్చె నం దందఱకును.
తే॥ తరుచరేంద్రులు కడురమ్యతరము లైన, ప్రస్తరములొంది సుఖమంది ప్రబలిరప్డు
మధురమధుగంధివనికాప్రమత్తభృంగ,గీతికాచందనానిలాకృష్టు లగుచు. ౧౫౩
క॥ గిరిరాజు ధాతురాగో, త్కరములఁ గై సేసి వాయుగతిసంగతి వా
నరవీరులపై నెరపుచు, వరచూర్ణోత్సవకలానువర్తన మొనసెన్. ౧౫౪

సీ॥ విరిసిన గేదంగివిరు లెత్తి చెండ్లాడి వాసంతికలతోడ వాదులాడి
మాధవులా యంచు మలసి తప్పనలాడి కుందకుట్మలములఁ గొల్లలాడి
యగ్నినామ్నాయముల నటు నిటు రాపాడి కింశుకాగమములఁ జేరి యాడి
ప్రియకము లివె యని పేరెత్తి చెల్లాడి నలికొల్ములు లటంచు నొవ్వనాడి
మేటి పాటీరతతిఁ గూర్చి మేలమాడి, పాటలులఁ బాట లొలయంగ నాటలాడి
యుల్లకల్లోల మొనరించి రట్లు పొచ్చి, యువ్వనిక లాక్రమించి వనాటు లపుడు.
తే॥ వాపికలు సరసికలు పల్వలములును ర, సోచితము లంచితములు ద్విజాచితములు
పద్మసౌగంధికోత్పలప్రచితములును, గాఁ దనర్చుట కలరి రాగహానచరులు.
తే॥ ఆజలాశయములు హరివ్యాఘ్రకిటిక
రీంద్రముఖసత్త్వసంచార మొనయు మించ
రెంచి రానందమున మించి రీక్ష్యమాన
కవిచయార్భటులను భృంగగానములను. ౧౫౭
ఉ॥ చల్లని తేటనీట సహసంభ్రము లై చొరఁబాఱి మీఱి తో
నుల్లము లూటడిల్ల రుచు లూఱ నపారబలు లక్కడంగి సం
ఫుల్లసరోజగంధవహపూజన మొాజ గ్రహించి స్నానపా
నోల్లసితంబులం దనిసి రుజ్జ్వలసారవిహారతత్పరా. ౧౫౮
ఆ॥ నీటిచల్లులాట నెఱయించి మించిర, ట్లుత్సహించి రర్థ మొగిఁ దలంచి
కొండ కెగచి నేరి కోరి మూలఫలాదు, లారగించి రమ్మహాప్లవగులు. ౧౫౯
ఆ॥ మత్తు లైరి ద్రోణమాత్రమానవిలంబ
మానసారఘాఘపానములను
మధువు లట్లు సేయు మధుపింగళులఁ బింగ
లాక్షులను మఱింత యాఁచికొనవె. ౧౬౦
క॥ తరుభంజన మొనరించుచు, వరలతలఁ దెరల్చుచుం బ్రవరధరధమనం
బరయుచుఁ గొలఁకులఁ గలఁచుచు, నరిగిరి గిరిరాట్కుమారికా! యిది వింటే.
క॥ కడు గులుకులు బలు పలుకులు, గడుసరు లవ్వారలకు రకము లై తనరన్
దొడరిరి చెట్ల కెగయఁ బ్రాల్పడి రొంటం దుముక నేలపైఁ బొరలంగన్. ౧౬౨
ఆ॥ మ్రాను మెట్టి యొండు మ్రానికి లంఘించి, మానియవలఁ గడమమాని పైనిఁ
బూనిక ల్దలిర్పఁగా నర్దనంబు లా, సానుచరు లొనర్చి రానతాంగి. ౧౬౩
క॥ వారలు పక్వఫలమకే, దారము లట్టులు ధరిత్రిఁ దనరింపంగా
నోరమణీమణి! చాలిరి, సారససారసముదాస్యసంపదలొలయన్. ౧౬౪
క॥ రాజీవాక్షుఁడు దశరథ, రాజసుతుఁడు రాముఁ డగచరప్రముఖులతో
నోజమొయి న ట్లరిగి వి, భ్రాజితము మహేంద్రశిఖరిఁ బడయుంగనిమొన్. ౧౬౫

—♦ శ్రీరాముఁడు మహేంద్రశైలమునఁ జేరి సముద్రముం గాంచుట ♦—

ఉ॥ అవలఁ గాంచె నందముల కందము చందముఁ గూర్చుఁజాలి వృ
క్షావృత మై యనర్ఘ్యమణు లంది ధృతిం దిర మై తనర్చు నా
గ్రావముఁ ద్రొక్కి చూచి శిఖరం బొకఁ డెక్కి ప్రసంగ నిక్కి వి
ద్రావణమీనసక్రపదతావ్యపనిద్రము నాసముద్రమున్. ౧౬౬

ఆ॥ వెనుక ముందుఁ గవిసి వెస సహ్యమలయము, లడచి యానుపూర్వ్యకలనఁ దనర
నేగుదెంచి కాంచి రెల్లరు గపివరు ల్భవనభయంకరంబు సాగరంబు. ౧౬౭

క॥ అదట దానిం బెరయం, గాఁ దొడరిరి వారు రామఘనుఁ డనతర మా
పాదించి సానుజార్కజుఁ, డై దరిపాల మెనసి మెఱసె నంచితలీలా. ౧౬౮

తే॥ విపులధాతూపలతలాతివేల వేలఁ, జలితతోయౌఘలీలావిశాలఁ జేరి
రాముఁడనె రామణీయకధాముఁ డెలమి, మించి హరిపతిఁగాంచి సమంచితముగ.

చ॥ ఇదె మన మేగుదెంచితి మహీనవిభావ! విభావబోధ మై
మొదలు విమోచనం బఱుఁగ మొక్కల మై గడిదేఱి మీఱి యు
న్నది జలరాశి సాగరమె నాఁజన దూరకె యుత్తరింపగా
దదనునఁ దొంటి చింత మది నాదికొనెం దుదినెంత కానొకో. ౧౭౦

ఆ॥ తగునుపాయ మరసి తార్కొన నొ నంత, దనుక నిలుపు మిచట మనబలముల
వసతు లొనరఁ గూర్చి వారక మంత్రింపుఁ, బ్రస్తుతింపు ముదిలపాటు తెగల.

క॥ శూరు లగు వానరుల నతి, ధీరులఁ బనుపుము స్వకీయధీబలమున న
వ్వారలు స్వబలము వీడక, వైరుల ప్రచ్ఛన్నవృత్తి వారకరయఁగన్. ౧౭౨

—♦ సేనా నివేశనము ♦—

క॥ అని సీతాహరణకృశుం, డనితరగుణుఁ డధిపుఁ డనిన యంతఁ బ్రసాదం
బని లక్ష్మణుఁ గొని చని యు, య్యనజుం డక్కజ్జ మొనర నెలమి ఘటించెన్.

ఉ॥ చండతరాజ్ఞఁ డాతఁడు ప్రశస్త మనీకము నిల్పె సంద్ర పుం
దండ ద్రుమాయుతం బగుచుఁ దద్దఁ బొసంగు సమస్థలంబునం
దుండె సముత్సుకం బదియు నూర్జితపింగలవర్ణనీర మై
రెండవసాగరం బనఁగ శ్రీదనరారి మహీధరాత్మజా. ౧౭౪

క॥ వేలావనమున న ట్లతి, వేలబలాఢ్యులు హరిప్రవీరు లెటులొకో
కాలూది నిలిచి రవ్వలి, కూలం బరయంగ నిగుడు కోర్కులు నెగడన్. ౧౭౫

ఆ॥ ఆనివేశమున మహానాద మొక్కండు, పొడమి తొడరనీక కడలినినద
మాఁగి కడలుకొనియె నది శతకోటిని, స్వనమ యమ్యొ నొడ్లమనములారసి.

క॥ ఆవానరధ్వజిని ను, గ్రీవాంచితపాలనప్రకృష్ట యగుచుఁ దే
శావిష్టవ్యాప్తయును నై, శ్రీవిభు మహితార్థపరతఁ జెలఁగుచు నుండెన్. ౧౭౭

సీ॥ గాడ్పు రేపఁగ బిట్టు కదలి వాఁకల నింగి నప్పళింపఁ గడంగి యడరుదాని
నాప్రదోషముతఱి నైన ఫేనోర్మ్మల నవ్వుచు నృతికృతు ల్నడుపుదాని
నుదయకాలపుఁజంద్రు నొలయుచుఁ బ్రతిచంద్రకలనల మిఱుమిట్లు గొలుపుదాని
రారాపు సేయ నారాకాసులకుఁ దోడు నక్రగ్రహాళితో ననుచుదానిఁ
దిమితిమింగిలతద్గిలదీప్తభోగ, పటుభుజంగముముఖ్యసత్త్వప్రకీర్ణ
గర్భ మై దుర్గదుర్గమార్గం బగాధ, మపరపారంబు నన మించు నబ్ధిఁ గాంచి, ౧౭౮

వ॥ వెండియుం బ్రచండతరతరంగతతప్రచారంబున మెండుకొని గండుమిగిలి యండ దండఁ గొను మేలికొండల గండశిలల నాఁచికొని యుద్దండత్వంబున నేరికిం జేరిచూడరాక యన్యనిరాకరణకృతిం దార్కొని మార్కొను ప్రకంపను నకంప నత్వంబున నలవార్చి కూర్చుకొని మహాగ్రాహిగ్రాహంబుల దుష్ప్రవేశం బై యరుణకిరణంబులకేనియు సరణి నూపక వరుణావాసం బయ్యుఁ బాతాళలోక గృహంబునకుఁ జేతాళంబు పెట్టి యుత్పాతనిపాతంబుల రోదసీకుహరం బుఱ్ఱి ట్లూఁగింపుచుఁ బెంబెరలఁ గ్రిందుకొను ఫేనచందనం బందిచ్చి తన కందని కం దని యిందుని కరనికరంబులం దిగంగనాంగంబులం దనివారం బూయించుచుఁ బవడంపు దీవెజొంపంబుల ఫణిఫణామండలమణిఘృణిగణస్ఫురణంబుల నగ్ని చూర్ణం బిట్టు లావిద్ధం బయ్యెనన భాస్వరాంబుకణనికురుంబం బెగయించుచుఁ బలితంపుజప్పళ్లతోఁ గ్రొళ్లుతికి యంబరంబుఁ బొడఁగాంచి మించిన కడంకతోఁ దారారత్నసమాకులత్వ మేఘమాలా వీచిమాలాశ్రియత్వంబుల వితతాంభస్సం పృక్తత్వంబుతోడి బలిసద్మవిషమత్వసురారివిషయత్వమహోరగ ఘోరత్వంబుల నీవును నాయంత లైతి వింకం జంక నేల యని పంకించి యంకించి తీరుతోడి పేరు వాడి పిలుచుచు గంధవాహసాహాయ్యం బందుట సింధురాజశబ్దోచితం బుగా జలభేరీశబ్దంబుల నబ్దంబుల నులికించుచు నొకచెంప మహామాణిక్యసాంఘ నర్తనంబుల నొకవంక యాదోనిచయపరివర్తనంబుల బుద్ధత్వ ప్రసిద్ధత్వంబుల నభిన యించుచు సంభ్రాంతం బగుచున్న యన్నీరనిధి తెఱంగెంచి యన్నగచరవరేణ్యు లనంతం బగు విభ్రాంతత్వంబున ననంతరు లై నిరంతరానపేతంబు లగు దృక్ప్ర పాతంబుల నిగుడించుచుండి రంత. ౧౭౯

ఉ॥ నీలునిచే ద్విపన్నిచయనిష్ఠితయోగవియోగకృన్మహా
శ్శీలునిచే సమాహిత విశిష్టసురక్షయుఁ గాఁగ సేన య
వ్వేల నవేల యుత్తరపువేల నివేశిత యయ్యె రామభూ
పాలకుఁ డిచ్చ మెచ్చఁ బరిపాలుల హెచ్చరిక ల్సెలంగఁగన్. ౧౮౦

క॥ మైందుఁడు ద్వివిదుఁడు నెల్లెడ, లంబారే యన బలంబులం బదికింపం
గ్రిం దెడలింప రిపుచయా, స్కందన మూహింప వెలయఁజాలి రచటన్.

తే॥ నదనదీపతితీరమునను స్వకీయ, సేన సునివిష్ట గా మహాశ్రీనివిష్టుఁ
డైన రాముఁడు పార్శ్వస్థు ననుజుఁ గాంచి, యిట్టులనిపల్కెఁ దొడరి గిరీంద్రతనయ!

—♦ శ్రీరాముఁడు సీతంగూర్చి లక్ష్మణునితోఁ జెప్పుచు దుఃఖించుట ♦—

తే॥ కాల మొకకొంత గడచినఁ గడచిపోవు, నొడ్లశోకంబు నాశోక మొల్లవోక
యహరహంబుఁ బ్రవృద్ధమై యడరుచున్న, దింత కక్కాంత కన్గవ కెదురుపడమి.
ఆ॥ కూళ రక్కసుండు కొంపోయె నని కాదు, దూరగత యటంచుఁ దోఁచి కాదు
వ్యర్థ మయ్యెఁ గద ప్రియావయోర్థ మని క్రుశించు నెడఁద యియ్యకించనునకు.
తే॥ వాయుదేవుండ! సకిఁ దాఁకి వచ్చి తాఁకు, మెచటనున్నదియో నీక యెఱుక కలదు
గాత్రసంస్పృష్టి గలుగు నీకతన నట్టు, లౌను జంద్రువలన దృక్సమాగమంబు.
ఆ॥ విసము పీత మట్లు పస నెడఁగాఁ గాల్చు, చున్నయది కదోయి సన్నుతాంగి
యసురకృష్ట యగుచు హానాథ! యనుచు న, న్నార్తిఁ బిలిచి పలికినట్టి పలుకు.
క॥ ఆచెలి నెడయుటె యింధన, మై చింతాజ్వాల నిగుడ నజిమి మదనుఁడే
శోచిష్కేశుం డై న, న్నేచినపగ రేబగళ్లు నెరియించెడి హా. ౧౮౭
ఆ॥ సంద్రమునను జొచ్చి శయనింతు సౌమిత్రి!, నిన్ను వీడి నేఁటి నిర్ణయమున
నట్టులైన దుష్టుఁ డంగజాగ్ని దహింపఁ, డంత లడిచిపడఁగ ననువుపడమి. ౧౮౮
తే॥ ఈధర నె యాశ్రయించితి మిప్పటికిని, బరఁగ వామోరు వది నేను బ్రదుకుటకును
గారణం బయ్యె నయ్యది గాక యున్నఁ, గామయానుండనగు నాకుఁ గలదె తెలుఁగు.
తే॥ సోదకం బగు కేదార మాదుకొనఁగ, నై నిరుదకం బయిన దాని యనువుఁ దోఁపఁ
గా నుపస్నేహపుంగల్మిఁ గంటి బ్రిదుకు, వనిత జీవించియున్న యవ్వార్త దెలియ.
సీ॥ ఎపుడు గన్గొందునో యిందీవరేక్షణ కళలవుట్టిల్లు చొక్కపు మొగమ్ము
నులివాయఁ గ్రోలుదునో యెన్నఁడు లతాంగి చారుబింబోష్ఠరసాయనంబు
నిమిరి ముద్దిడుదునో సుమగంధి చెక్కుల సిరిమీఱ నేనాఁడు చిబుక మెత్తి
హత్తింతునో యెట్టియదనున నెదఁ దన్వి తాలఫలోపమ స్తనయుగంబు
కష్టములు దీఱ సుఖములు గ్రమ్ముదేర, నసుర యురమున శరముల నంట నాటి
సీతఁ బ్రిత్యాహరింతునో స్ఫీతవిజయ, లక్ష్మితోడ దనుజ రాజ్యలక్ష్మితోడ.
ఉ॥ ఆర్తుఁడ నైతి నావలని హాయి యొకింతయు లేదు సాధ్వి కా
కీర్తిత రాక్షసాంగనలు కేరడము ల్పచరింప నెట్టు లే
యార్తి మునింగెనో దొసఁగు హా యనువారలు లేర చొచ్చి దు
ర్వార్తను లెవ్వ రే మనిన వారక చెల్లదె యట్టిచోటునన్. ౧౯౨
ఆ॥ నాథహీన యట్లు నలినాక్షి మన్నాథ, త్రాత లేక ధృతివిధాత లేక
యడలుచున్న దొంటి హా దైవ మెవ్వరి, నెంత సేయ నేర దీజగమున. ౧౯౩

ఆ॥ జనకరాజదుహిత సాధ్వి మత్ప్రియ కోస, లాధినాథు స్నుష మహానుభావ
రహి సెడంగ గడుసురాకాసు లఱుమంగ, నొదిఁగి నడుమ నట్టు లుండెనొక్కొ.
తే॥ అల్లశశిరేఖ శరదాగమావసరము, నందు జలదాళులంబోలె నతిశయించి
రక్కసుల విదలించి నారాణివాస, మెప్పుడు ననుఁ జేరునో యది యెఱుకపడదు.
ఆ॥ అది స్వభావతనుక నై యుండుఁ దనుతర, యామనస్యమున నిరశనమునను
వ్రాలి దేశకాలవైపరీత్యం బెంచి, హితముఁ దలఁపఁ దన కిఁకేమి గలదు. ౧౯౬
ఆ॥ మంచికాల మొకఁడు మన కున్నె లక్ష్మణా, యెంచి సీత దుఃఖ మెడలఁజేసి
మానవతినిఁ గొంచు మానవేంద్రాశ్రమ, మొలసి బంధుజనులఁ గలసి నగడ.
చ॥ కనుల ముదశ్రువు ల్దొడరి కమ్మనిచెక్కులఁ గ్రమ్మ వేడుకల్
గొనకొన నుత్సుకత్వమునఁ గోర్కులు దీఁగెలువాఱఁ జేర నై
యనుపమభాగ్య మెన్నుచు మహామహ యాసతినాదుకంఠసీ
మను నిజబాహువల్లరుల మాలిమిమైఁ గదియించు టెన్నఁడో. ౧౯౮
మ॥ ఎపు డంధంకరణంబు ఘోర మమితం బిష్టేతరం బౌచితీ
క్షపణం బేహ్యము నా విదేహపతనూజావిప్రయోగోత్థ మీ
విపరీతం బగు శోకము న్విడుతునో వేవేగ మాలిన్యయు
క్తపటంబుం బలెఁ దమ్ముఁడా! తలఁపునం దత్కాల మూహింపుమా. ౧౯౯

—♦ సూర్యాస్తమయము ♦—

క॥ అనుచు విలపించు రాముని, యనితరధాముని విషాద మారసి రవియున్
దినవిరతి మందరశ్మితఁ, గని యస్తగిరీంద్ర మెనసెఁ గల్యాణవతీ. ౨౦౦
ఉ॥ దేశముఁ గాలముం గడచి తీరెనయుంగలవారు లేరు ని
ర్దేశము సీయెఱుంగనిదె తెప్పరము ల్దరలింపు మోపి నా
కాశలు లేవొకో యెడయ నాదు నతే యుదయింతు నప్రతీ
కాశము నీప్రకాశ మని క్రమ్మర హేళి పరార్ధసీమకున్. ౨౦౧
క॥ చని భానుం డని యఱచుచుఁ, జని గూండ్లకుఁ బక్కు లెడలి చక్కవకవలున్
బనవందొడరెం దమ్ములు, మునుకొని మొగిడెన్ దమిస్రముం బాలుపడెన్.
ఆ॥ అంతకన్నఁ దిమిర మధికమే కడఁక న, ట్లాముకొనియె శోకజామనస్య
మధిపుఁ డైన రాము నంతరంగంబున, సీత వలపు లోకటఁ జేరఁబాఱ. ౨౦౩
శా॥ తమ్ముం డూరడిలంగఁబల్కఁ గృతిమూర్ధన్యుండు రాముండు గ
ద్దమ్ముల్ మ్రాయుచు విచ్చుచు న్మహిత సీత న్బద్ధపద్మేక్షణన్
నెమ్మిన్ హృన్నళినీక న్నిలిపి ధ్యానించెన్ విధానంబుఁ బోఁ
జిమ్మం బోల దటంచు సంధ్య నుపాసించెన్ సమంచద్గుణా. ౨౦౪

తే॥ కార్యమానుషుఁ డాతఁ డేకాంతమునను
గాంత స్మరియించుచు బహుప్రకారములను
జింతఁ బొల్గొనె నను టేమి వింత ప్రకృతి
సంతరింపదె యట్టి ప్రసంగములను. ౨౦౫

తే॥ అద్వితీయచిదాత్ముఁ డవ్యయుఁడు హరి స
నాతనుఁడు పరమాత్ముఁ డానందమూర్తి
రాము నెఱిఁగినకృతిని గోరములు దఱియ
వనిన నాతని స్పృశియించు నవియుఁ గలవె. ౨౦౬

మ॥ పడఁతీ! శోకభయప్రహర్షమదలోభక్రోధమోహాదు లె
ప్పుడుఁ జిన్మాత్రు స్పృశింప వజ్ఞవిషయోద్భూతంబులై యుంట నె
వ్వఁడు మే నే నను నట్టి మానికె తదుద్భావ్యంబు దుఃఖంబు చో
ప్పడు విజ్ఞాని ముదాత్ముఁ డాద్వయము భావం బెన్నఁ డేపట్టునన్. ౨౦౭

ఆ॥ అట్టి ద్వైతభావ మడఁగినంత సుఖాత్ముఁ, డగుచు జీవుఁ డాత్ముఁ డై వెలుంగు
నావెలుంగె ప్రకృతి కవ్వలి దగుటఁ బ, రాత్పరంబు చిత్పరాయణంబు. ౨౦౮

తే॥ అబల బుద్ధ్యాదు లొలయని యాసుషుప్తి
యందు దుఃఖం బొకింతయు నరయఁ బోల
దట్లుగావున నెపుడు దుఃఖాదికంబు
సర్వమును బుద్ధికృతము నిస్సంశయంబు. ౨౦౯

మ॥ చెలి! రాముండు పురాణపూరుషుఁడు సంసిద్ధుండు నిత్యోదితుం
డలఘుం డాద్యుఁ డనీహుఁ డక్షరుఁడు నిత్యానందుఁ డధ్యాత్మదృ
క్కలనాలభ్యుఁడు వాఁడె సుమ్ము త్రిజగత్కల్యాణసంధాత యీ
వల నీక్షించి బుధు ల్పరాత్ముఁ డని సంభావింతునిర్ముక్తులై. ౨౧౦

ఆ॥ కాని జనము లెందుఁ గానివారలె యాదు, రతఁడు మాయతోడ నడఁగి పెనఁగి
ద్వంద్వకలితుఁ డగుచుఁ దమ్ముఁ బోలు నటంచు, నెంచు వారి జోలి యేల మనకు.

క॥ ఆనందింపుము సత్యచి, దానందాత్ముఁడు పరాత్ముఁ డని రాముని స
న్మానించి నిత్యముక్తి, స్థానము నీయదియ కాఁగ శైలేంద్రసుతా. ౨౧౨

ఆ॥ అని మహాత్ముఁ డభవుఁ డానతీయ నిరామ, యాత్మవృత్తి గిరిజ యతనిఁ గొలిచి
సదయ! యెట్లు చెల్లె సమనంతరతదీయ,వృత్త మని ప్రసంగ వేఁడుటయును. ౨౧౩

మ॥ లలితామ్నాయకలాభిలాషుకమనోలంకారసాంకాశ్యసం
వలితాంభోనిధిబుద్ధిసారపృథుగర్వధ్వాంతవిధ్వంసి చి
త్కలితాత్మానుభవప్రకారత్రిజగత్కల్యాణదాయిప్రతా
చలితాభ్యుద్గతదృక్ప్రచారమహితైశ్వర్యానుసంధాఽదరా. ౨౧౪

క॥ సురనాథముఖ్యపూజిత, చరణా! చరణాబ్జయోగసంస్మృతికరణా!
కరణాతిగనిజతత్త్వ, స్ఫురణా! స్ఫురణాతివేలసుఖసంభరణా! —౨౧౫

పృథ్వీ॥ సురాసురహితేషణా! సుజనసద్గుణాన్వేషణా
పరాన్వయవిభీషణా! బహుకలాసమాశ్లేషణా
వరాభయవిభూషణా! వలదఘౌఘసంశోషణా
పరావరవిశేషణా! ప్రథితభక్తిసంతోషణా. —౨౧౬

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనళినినిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథామృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబునం
బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీశివాయగురవేనమః.

# శ్రీరామకథామృతము

## యుద్ధకాండము.

పూర్వభాగము.

———:o.———

## ద్వితీయాశ్వాసము.

———:o:———



శ్రీవిదిత శ్రితరక్షా
ప్రావీణ్యప్రథితవిభవ పరపక్షభిదా
త్రైవిక్రమప్రకార స
మావిద్ధకృపాకటాక్ష యఖిలాధ్యక్షా. ౧

ఆ॥ అవధరింపుమయ్య యార్యతో నిట్లని, పలుకఁదొడఁగె హరుఁడు కులుకులాఁడి!
వింటె సద్గుణాతివేల మీరఘురాము, చరిత ముదితబహురసస్ఫురితము. ౨

మ॥ హనుమంతుండు మహాత్ముఁ డింద్రనిభుఁ డుద్యత్తేజుఁ డట్లాచరిం
చినకృత్యంబు భయావహంబు సురలుం జేయంగలే రంచు న
మ్మనమం దెంచి శిరంబు వాంచి నిజసన్మానంబు వో మంత్రులం
గని రక్షోవిభుఁ డందఱు న్వినఁ గ్రహాక్రాంతిక్రమావిష్టుఁడై. ౩

—◆ రావణుని మంత్రాలోచనము. ◆—

ఆ॥ ఇట్టులనియె ఘోర మిందఱుఁ గన్నది, యే కదా కథాంశ మెల్లఁ గ్రొత్త
యొకఁడు నగరు సొచ్చి యుద్వృత్తిఁ జానకి,సీతఁ గాంచి వార్త సేర్చి చెలఁగి. ౪

తే॥ లాఁతులకు దుష్ప్రసహ పురి లావు సెఱిచె, నందనవనంబుఁ బోనిది నావనంబు
పాడుసేసెఁ బ్రాసాదంబు వగలనడఁచెఁ, బ్రవరులగు రాక్షసులఁ జంపెఁ బ్రబలుఁడగుచు

క॥ అక్షునిఁ ద్రిదశఘటాహ, ర్యక్షునిఁ బ్రత్యక్షవిక్రమాటోపకలా
ప్రత్యక్షునిఁ బొలియించుట నా, యక్షులఁ బెకలించివైచి నట్టిద యయ్యెన్. ౬

ఆ॥ వేయుఁ జేల లంకవిధ మెల్లఁ జెడె హాను, మంతు చేత శక్తిమంతు చేత
నేమి సేయువాఁడ నింక భద్రము మీకుఁ, దెలుపు డేది యొనర్పఁ దెఱఁగువడునొ.

క॥ మొనసి సమర్థం బగు న, య్యనంతరం బైన కృత్య మారసి మీ రో
ర్పున వివరించినఁ దోడ్తో, ననుకృతి యోజించి మెలఁగనగువాఁడఁ జుఁడీ. ౮

ఆ॥ మంత్రమూల మెందు మహిత విజయ మంచుఁ, బలుకుదురు మనస్వివర్యులార్య
లట్లుగాన మంత్రి మావశ్యకం బని, తలఁచినాఁడ రాము దర్ప మెంచి. ౯

క॥ క్రమలక్షితు లుత్తమమ, ధ్యమాధములు నాగ జగతియందలి పురుషు
ల్సమవేతు లైన వారి గు, ణము దోషము నిట్టు లని గణన మొనరింతున్. ౧౦

ఉ॥ దైవికమానుషంబు లగు తంత్రములన్ సుహితు ల్సమర్థులుం
గా విలసిల్లు మంత్రుల సుఖం బఘముల్ దమపాలి దంచు స
ద్భావత నున్న మిత్రులను బాంధవులం గొని దాక్ష్య మొప్పఁగా
సేవలనేనిఁ గర్జముల నెంచి ఘటించు నరోత్తముం డిలన్. ౧౧

క॥ ఎక్కటియర్థవిమర్శం, బెక్కటిధర్మప్రసక్తి నెనయించు మదిన్
దక్కక కర్జ మొనర్చెడు, నక్కథితుఁడె మధ్యముఁడు నయంబున నెందున్. ౧౨

క॥ కార్మణగుణదోషంబుల, మర్మము లరయుంగ నెఱుకమాలిన బుద్ధిన్
ధర్మ మెడలి కృతిఁ గైకొని, దుర్మనుఁ డై విడచు దుష్కృతుం డధముఁ డగున్.

తే॥ పూరుషత్రయ మెబ్భంగిఁ బొనరు నట్లు
మంత్రములు నుత్తమాధమమధ్యమములు
గా వెలయుచుండు మూఁడులోకములయందు
నవియు వివరింతు వినుఁడు న్యాయంబు వొనర. ౧౪

ఆ॥ ఐకమత్య మొప్ప నందఱు మంత్రులు, శాస్త్రదృష్టదృక్ప్రసక్తి పొసఁగ
దేనివలననిరతి దెరలక యోజింతు, రట్టి మంత్రి ముత్తమాహ్వయంబు. ౧౫

ఆ॥ బహుమతంబు లున్నఁ బ్రాప్తకాలంబు స్వి, యార్థనిర్ణయమునయందు మరలి
యైక్య మొందువార లంద ఱెం దమ్మియి, మంత్ర మొప్పు మధ్యమం బనంగ.

ఆ॥ తమమతంబె మతము తమపట్టుదల పట్టు, దలయ కాఁగఁ బలుకఁ దలఁక కొంట
నేనిఁ దెఱఁగుఁ గాంచ నెనయని యవ్వారి, మంత్ర మధమ మండ్రు! మహితులెల్ల.

క॥ కావున సుమంత్రితముగా, నావారలు మీర లిందు నయ మారసి సు
శ్రీ వాయుని యక్కర్జము, నే వెలయింపం దలంపుఁ డే నది గొందున్. ౧౮

ఉ॥ వానరవీరకోటిపరివారితుఁ డై యనివారితుండుగా
శ్రీనుతసంద్రపుందరిని జేరెను దా నుపరోధకుం డనం
గానగువాఁడు రాముఁడు ప్రకాశితసత్త్వుఁడు లంకముట్టికో
లా నెఱిఁ బూనెనేనిఁ దగు నయ్యది దయ్యెక నిర్ణయింపుఁడా ౧౯
క॥ సబలానుగుఁడు సహానుజుఁ, డబలుం డనఁబోలఁ డాతఁ డభియోగమునన్
ప్రబలతఁ దీవ్రత నెఱపును, ప్రబుద్ధులరు తగినయొత్తుఁ బరికింపుఁ డికన్. ౨౦
తే॥ సంద్ర మింకించునో యెదఁ దార్చి యొండొ, కండ ఘటియింప నెంచునో కాని రిత్త
వోవఁ డిత్తఱి వికృతంబు వుట్టు నంచుఁ, జిత్తమున నుంచి ప్రతివృత్తిఁ జేర్పవలయు.
క॥ పురి సైన్యమునందును నే, పారహెచ్చెముఁ బొరయకుండఁ బౌరువుల తెఱువుల్
పరఁగకయుండఁగఁ దగు కృతి, నరసి తెలుపుఁ డిది విభావ్య మర్థం బగుటన్.
ఆ॥ అనుచు రాక్షసేంద్రుఁ డాడిన నుడులెల్ల, నాలకించి వార లతిబలాఢ్యు
లట్లు మందబుద్ధు లవినీతు లగుటఁ గే, ల్మోడ్చి పలికి రెదిరి లోఁ దరయక. ౨౩

—♦ రావణునకు మంత్రు లాలోచనము సెప్పుట ♦—

సీ॥ ఓమహారాజ! యిట్లొప్పనే నీబోఁటి రాజ నెక్కొనఁజేయ కుమ్మలింపఁ
బరిఘశూలాయసపట్టిసభీషణం బీబలంబుఁ దెరల్ప నెవ్వఁ డోపు
మునుఁ బన్నగుల గిట్టి ముట్టికో లొనరించి యాభోగవతి భోగ మందఁగంటి
వాసుకితక్షకు ల్వారింపఁగాలేరు జటిశంఖు లెదిరించి జాఁటి రొంట
యక్షపతి దిగ్విభుండు మహాబలుఁడు మ, హేశ్వరశ్లాఘ్యసంబంధుఁడే కదా ధ
నేశుఁ డగిచి కూలంబడ నిత్ధతేజ, మా విమానరాజంబు నీ వాహరింప. ౨౪
తే॥ దానవశ్రేష్ఠుఁడు మయుండు త్వద్భయమున
నొదిగి నెయ్యంబు గోరి సంయుక్తిఁ జేసె
దుహిత హితకామ కామ్యసంతోషితార్య
భార్య నొనరించి మించు నీప్రాపుఁ గాంచి. ౨౫
తే॥ బలుపుగలవాఁడు దానవభర్త మేటి, వలఁతి కుంభీనసీసుఖావహుఁడు మధుఁడు
శౌర్యవంతుండు పరదురాసదుఁడు గిట్టి, నీకు వశుఁ డయ్యెఁగాదె యన్నాటికిఁదక్క.
మ॥ ప్రబలు ల్లబ్ధవరాఢ్యు లక్షయులు దుర్వారు ల్మహాశౌర్యులా
త్తబహుప్రజ్ఞులు కాలకేయులు మహోత్సాహంబునం జేర్చి నీ
దుబలం బగ్గల మంచు నేఁటి కవలం ద్రోపాడుట ల్మాని తా
రబలత్వంబున వశ్యులై కడకు మాయా ల్పెక్కులు న్నేర్పరే. ౨౬
ఆ॥ వరుణసుతులు శౌర్యవంతు లోడిరి లోక, పాలు రెల్ల నిన్ను బలసికొలువ
నైరి సూర్యచంద్రు లడుగుబట్టిరి నీదు, తేజ మసదె యేల దిక్కొనంగ. ౨౭

శా॥ దండగ్రాహము శాల్మలిద్రుమ గణోద్దామంబు పాశోర్మికా
ఖండప్రఖ్యము కింకరోరగ మనీకాశంబు యామ్యాబ్ధి నీ
దండం గెంటితి దాఁటితే మనఁగ నిద్ధంపుంజయం బబ్బె ను
ద్దండుం డంచుఁ జలించె మిత్త్రి యిఁక ని న్నారొ్కంట కొం డొప్పునే. ౨౯

చ॥ అలఁతి జయించినాఁడ వరు లందఱ నిం దరు దండ నంతకుం
గలఁడె నరుం డొకండు గుణకామ్యులు వీర్యమహోన్నతు ల్నృపుల్
కలనుల శక్రతుల్యులు విలాసిబలాఢ్యుని నిన్నెదిర్చి తా్మ
తలమునఁ గూలరే బలువితాకు గడల్కొన మ్రాఁకులట్లుగన్. 30

తే॥ ఓమహారాజ! సుఖపడు మొంట నిలిచి, యోజ నెక్కొన నీకేల యుదిలపడఁగ
నింద్రుగెలిచినవాఁ డురగేంద్రతుల్య, బాహుఁ డున్నాఁడు నేఁడు నీపట్టి గెలువ. 3౧

ఆ॥ అతఁడు క్రతు వొనర్చి నత్యుత్తమంబు మా, హేశ్వరం బనంగ నేరికేని
నందరాని వరము లందె విదారించు, వలను మెఱసి నరుల వానరులను. 3౨

సీ॥ శక్తితోమర బాణఝషచయోద్దీర్ణంబు సర్వతఃకీర్ణాంత్రశైవలంబు
గజకచ్ఛపప్రచారజదృష్టసంబాధ మశ్వమండూకనిహ్రాదభయద
మాదిత్యసుదమహాగ్రాహసందోహ మధికమరుద్వసువ్యాళతతము
రథవారవారిపూరప్రకారాఢ్యంబు పత్తినోయోత్థితప్రణిహితంబు
నైన దేవబలార్ణవ మూఁగి పట్టు, పట్టి నీపట్టి కడచి తత్పతిఁ బడల్చి
పట్టుకొని తెచ్చె లంకకుఁ బ్రథితి దనర, నతఁడు బందిగ్రహావస్థ నలఁతిపడఁగ. 33

ఆ॥ ధాత యాన యవితథత్వంబు నెనయింప, వృత్రనముచిహంత విడిచిపుచ్చె
విశ్వజిత్వరత్వవిధిపొంటెఁ దనకుఁ గా, నలయు వరము లతనివలనఁ బడసి. 3౪

క॥ చేరెఁ ద్రివిష్టపమున కసు, రారి సురపురస్కృతుండ యయ్యుఁ బరిభవం
బారూఢి హృదయశల్యం, బై రీతిఁ దెరల్చి మోమునం దటు వ్రేలన్. 3౫

ఆ॥ అట్టి సుతునిఁ గంటి వఖిలలోకంబులు, గెలిచి తీవు నేఁడు గెలువ వెట్టు
లతనిఁ బనుపు మధిప యందఱఁ దెగటార్చు, రాముతోడఁ బ్లవగరాజుతోడ. 3౬

ఆ॥ ఒక్కప్రాకృతునకు నొదిఁగి యిట్లాపద, నొందదే త్వదీయ మూర్జితత్వ
మెడల నూరడిల్లు మిద్ధతేజుండవు, గెలుతు వీవు రాముఁ గెలిమెయిని. 3౭

క॥ అని వా రనునెడ నంపఱ, కునుఁ జాలినవాఁడు యుద్ధకోవిదుఁ డసితా
ద్రినిభుఁడు క్రూరుండు ప్రహ, స్తనామకుఁడు సైన్యపతి పదరి యిట్లనియెన్. 3౮

— ♦ ప్రహస్తుని వచస్తతులు ♦ —

ఆ॥ తేఱిచూడ నేరు దేవదానవు లట్లు, పతగు లురగు లేమి పాటివార
లింకఁ గ్రోఁతిమూఁకలే సాటి మనసూటి, నిలిచి పెనఁగులాడ నేర్చినవియె. 3౯

ఉ॥ చింతిల నేల వాయుజుఁడు చేసినచేతఁ దలంచి యెంత వాఁ
డంతకుఁ దోలువారిపయి నాతఁడు బీరము సూపఁ బుట్టె నాఁ
డంతటి దా ప్రమాద మొకఁ డద్రిచరుం డథముం డొనర్చె కీ
డెంత లటన్న నమ్మిక నహీనుల వంచనపా లొనర్పఁగన్. ౪౦

ఆ॥ బ్రదికిపోఁడు నేను బ్రదికియుండంగ న, వ్వాఁడు నిక్క మింతవట్టు నమ్మ
యానతిమ్ము నేఁ డవానర మొనరింతు, నాసముద్రముద్ర మవనితలము. ౪౧

క॥ రక్షణ మొనగూర్చెద నీ, పక్షంబున నొండొకండు పాటిలకుండన్
వీక్షణ మీక్షణ మిడు మిటు, లక్షలు క్రోఁతు లిఁక నిన్ను లక్షించెద రే. ౪౨

క॥ సీతం దెచ్చిన నేరము, నీతలపై గాకయుండ నే వారింతున్
జేతోముద మొదవ సము, ద్యోతుఁడ వై యుండు మెందు త్రోవఁ గాన కిటన్.

క॥ అను నెడ సంక్రుద్ధుం డై, యనె దుర్ముఖుఁ డనెడు నాతఁ డక్షమణీయుం
బనుబద్ధ మయ్యెఁ బరిభవ, మని యెఱిఁగి యుపేక్ష సేయనగునే యింకన్. ౪౪

—♦ దుర్ముఖుని గర్వోక్తులు ♦—

ఆ॥ నిన్ను మమ్ముఁ బురి ననింద్య నంతిపురిం గ, లంచె నొక్కక్రోఁతి లాఁతి సేరి
లోక మేలుదొరకు నీకుఁ జెల్లునటయ్య, వాని విడిచిపుచ్చి వన రెనయుట. ౪౫

శా॥ ఆయెం బోయె నిఁకైన నన్ననుపు మియ్యర్థంబు మన్నించి నే
నీయుక్తి న్నరవానరాధముల దిక్కీక్షించి శిక్షింతు వా
రేయేతావుల నున్న నెం దరిగి యె ట్లేచోటులన్ డాఁగినన్
డాయంజాలుదు నాప్రచారమున కడ్డా మూఁడు లోకంబులన్. ౪౬

క॥ ఆలోనె వజ్రదంష్ట్రుం, డాలోలము గాఁగఁ బరిఘ మతిఘోర మస్ర
క్కాలపలాక్తముఁ ద్రిప్పుచు, నాలోడితవృత్తి నిట్టు లనె రోసమునన్. ౪౭

—♦ వజ్రదంష్ట్రుని వజ్రాలాపములు ♦—

తే॥ అర్ధరాత్రచరిత్రాప్తి నట్లు పడిన, హానుమ కృపణుండు తబిసి వాఁ డనఁగ నెంత
రాముఁ డున్నాఁడు వానరరాజుతోడ, లక్ష్మణునితోడ నాదుపాలం బడంగ. ౪౮

ఆ॥ వారిఁ ద్రుంచి ప్లవగవాహిని బడలించి, యిపుడె వత్తుఁ జూడు మీక్షలలర
నెత్తినట్టి పరిఘ మిట్టట్టు డింపక, మఱియు నొండొకండు తెలుఁగు వినుము ౪౯

క॥ ప్రాయ ముపాయకుశలుఁ డొకఁ, డే యెందును శత్రుతతి జయించు నతండి
త్యాయత్తుఁ డగుచు నని మది, నోయొడయఁడ తలఁవు మట్టిఁ డొగి వివరింతున్.

ఉ॥ నిశ్చితులైన రాక్షసులు నేఁ డరిభీములు భీమదర్శనుల్
స్వశ్చరు లొల్లఁబోవ మనుజత్వముఁ గైకొని కామరూపవై
పశ్చితి యుల్లసిల్ల మనువంశ్యునిఁ జేరి యసంభ్రమంబునం
బశ్చిమవృత్తికిం జొరని పల్కులఁ బల్కఁగ నొప్పుఁ జుల్కఁగన్. ౫౧

ఆ॥ భరతుఁ డనుప నీదు పట్టరయుచు వచ్చి, నార మయ్యు యిఁక విచార మొదియు
బోల దరుగు దెమ్ము పొసఁగు మేలన నాతఁ, డదియు నిక్క మనుచు నటులొనర్చె.
క॥ సేనలఁ బురికొల్పి విడువ, సేనెటి సేనియుఁ జనంగ నెంచినచో ని
ధ్యానించి కదియఁజొచ్చెద, మానతవైరీ! ప్రసక్తి నందఱ మొకటన్. ౫౩
తే॥ పరిఘశక్తిగదాచాపబాణవరకృ, పాణహస్తుల మయి త్వరమాణుల మయి
యశ్మశస్త్రమహావృష్టిహత మొనర్తు, మాహరిబలౌఘ మంబరమందె నిలిచి.
క॥ ఈయనయంబునఁ బడిన, ద్దాయన్నయుఁ దమ్ముఁడును నయంబు సెడఁగ లే
దోయీ గతి యనుకొనుచున్, దోయము నెఱివోఁ గృశించి త్రుంగెద రధిపా.
ఆ॥ అనుచు భేద మరసి యతఁ డాడఁగ నదల్చి, కుంభకర్ణజుఁడు నికుంభుఁ డనెడు
వాఁడు పలికె దనుజవల్లభుండు వినంగ, నల్లవారి యుక్తు లీసడించి. ౫౬

—♦ నికుంభుని వాగ్దంభకములు ♦—

క॥ ఈచల్లనిమాటలవా, రోచెల్లి గడింపనేర్తురో కర్జము మే
ల్పూచుచునుండుఁడు రక్కసి, రాచఱికపుమేటిఁ గొలిచి రహి దనరారన్. ౫౭
ఆ॥ ఒంటిఁ దాఁకి రాము నురుబలు లక్ష్మణు, గెంటి రవితనూజు గంటిపఱిచి
హనుమ నుక్కుపుని రయంబునఁ దెగటార్చి, వానరౌఘ మెల్ల వ్రాల్చి వత్తు. ౫౮
క॥ అని యతఁడు త్రుళ్లిపడు నెడ, ననయుహాతుం డొకఁడు వజ్రహనుఁ డను వాఁ డి
ట్లనెఁ బర్వతోపముఁడు నె, ట్టన నాల్కం దొడలం గడంకఁ దడవుచున్. ౫౯

—♦ వజ్రహనుని గీర్వజ్రములు ♦—

క॥ విగతజ్వరులై యెల్లరు, స్వగతములన్ స్వైరగతిఁ బ్రిసక్తిఁ గొనుఁడు మీ
వగలాడులతో స్వస్థుల, రగుఁ డటు నిశ్చింతు లగుచు నానుఁడు మధువుల్. ౬౦
ఉ॥ ఎక్కటి సేన చాలుదు హరీశ్వరు నంగదు నాంజనేయునిన్
గ్రిక్కడలింప సానుజుని రాముని ద్రుంపఁ బ్లవంగయూథులన్
మెక్కి హసింప నిమ్మెయికి మేకొని మీర లనుజ్ఞ యిందు నా
చక్కటి గాంచుచుండుఁడు విచారము దక్కిన చిత్తవృత్తులన్. ౬౧
వ॥ అని యిట్టు లవ్వాఁడును గాఱు లఱచుచుండ నొండొరులం గొండాడుచు గండు మిగిలి యెండుకొను నమర్షంబున నికుంభుండును రభసుండును సూర్యశత్రుండును సుప్తఘ్నుండును యజ్ఞహంతయు మహాపార్శ్వుండును మహోదరుండును దుర్ధర్షుండును నగ్నికేతురశ్మికేతులును రావణాత్మజాతుండు ప్రసిద్ధబలపరాక్రముండు నైన యింద్రజిత్తును బ్రహస్తుండును విరూపాక్షుండును వజ్రదంష్ట్రుండును ధూమ్రాక్షుండును నతికాయుండును దుర్ముఖుండును మున్నగు మేటివీరు లెల్లనొక్కట సన్నద్ధులై పరిఘపట్టసప్రాసశక్తిశూల పరశ్వధచాపబాణతూణకృపాణంబులం

గొని యంబరంబున కెగసి పంబికొను తేజోవిశేషంబులం బ్రదీప్తు లగుచు దశగ్రీవునిం దిలకించి నేఁడు సుగ్రీవునిం దదీయస్కంధావారంబుతోడం గూడ జక్కాడి యుక్కుమిగిలి లంకానగరిఁ గ్రక్కదలించి గరిడిముచ్చుతనంబు మెయి నరిగిన యాహనుమంతుని నంతంబు నొందించి యిదె వత్తు మని తత్తరంబునం బ్రయాణంబున కాయత్తపడిన యవ్వారి నెల్ల వారించి నిజోపదేశంబు బలంబునం బ్రత్యుపవేశంబు సమకూర్చి ప్రధానసచివులం గూర్చి దుష్టజనభీషణుం డగు విభీషణుండు రక్షోవిభుండు విన సవినయంబుగా ని ట్లనియె. ౬౨

—♦ విభీషణు సంభాషణములు ♦—

చ॥ దుడుకుతనంబు మేలె యరి దోర్బల మెన్నక పోవవచ్చునే
కడమ యుపాయము ల్విడిచి క్రన్ననఁ గయ్యమువంక లెంక లై
తొడరకుఁ డన్నలార! యవి దూషణలం బెరయంగ దండ మె
ప్పుడు నని నీతికోవిదులు పెద్దలు తద్ద వచింతు రాదృతిన్. ౬౩

ఆ॥ అనవధాను లైన నభియుక్తు లైన దై, వాహతులుగ నైన నట్టివారి
యందు విధికృతంబు లౌ పరాక్రమములు, సిద్ధిఁ గాంచుచుండు సిగ్గ మిదియు.

తే॥ అప్రమత్తుండు జితకాశి యకృతరోషుఁ
డతిదురాధర్షుఁ డధిబలుం డైన వైరి
ధర్షణ మొనర్ప నయ్యెచ్చ దగునె మీకుఁ
గొఱవిఁ దల గోఁకుకొనఁ నెంచి కొఱఁతపడరె. ౬౪

క॥ మున్నీరు దాఁటి యిప్పురి, నెన్నక చొరఁబాఱి కర్జ మెఱిఁగి తనపయిన్
బన్నినవారి మడఁచి యట, జన్న హనుమ విక్రమప్రసక్తిఁ దలఁపరో. ౬౫

ఆ॥ సరభసముగఁ జరుపఁ జన దవజ్ఞ విమర్శ, సేయు టొప్పుఁ గార్యసిద్ధిపొంటఁ
బరబలంబు లరయఁ బ్రబలంబు లపరిమే, యములు వీర్యయుతము లైనకతన.

మ॥ తతకీర్త్యుల్లసితుండు రాముఁ డెవ్వు డేత ప్పాచరించె న్నదు
ద్ధతిఁ దద్భార్య హరింప నెంచె నిటు లీడై తేయనాథుండు సూ
నృతుఁ డెందేఁ జనఁ బొంచి యాఖరుఁడ యే నిన్వాని పైఁ బోయి తా
నతివృత్తుం డయి కూలెఁ బ్రాణులకుఁ గావా ప్రాణరక్షాకృతుల్, ౬౬

క॥ అయశస్య మనాయుష్యం, బయఘుస్మర మర్ధశసన మతిఘోరము దు
ర్ణయ మఘపునర్భవము నా, నయినది సుం డన్యయోషిదభిమర్శమిలన్. ౬౭

తే॥ ఇది నిమిత్తంబుగా మన కిందఱకును, భయము పొల్పడు వై దేహివలన నిజము
గావునఁ బరిత్యజించు టే కర్జమిపుడు, కలహము ఘటించుకృతి మేలి కలన గలదె.

ఆ॥ ఆర్తసదయుఁడు ధర్మానువర్తి వీర్య, వంతుఁడును నైన రాముతో వైర మెటు ని
రర్థకంబ యగుం గాన నతని కొసఁగు, టొప్పు మైథిలి సుచరిత్రి యుక్త మరసి.

క॥ మణిరత్నసమాకులస, ద్గుణశోభిత సగజ సాశ్వ దోషాచరతో
షణి యిప్పురి రాముని మా, ర్గణములఁ జెడకుండఁగని ధరాజ నిడ నగుఁగా. ౭౨
తే॥ మహాతి దుర్ధర్ష ఘోరసమ్యక్ప్రయోగ, కలిత హరిసేన కవిసి లంకాపురంబు
కాపురంబు లెడల్పఁగాఁ గడఁగు నంత, లోనె జానకి రాముని కా నొసంగ. ౭౩
తే॥ పురి నశించును రాక్షసు ల్వాలియు వార, లిందఱును నంత లెగిచియు నింతనిజము
శ్రీమతి యశస్విని సుసాధ్వి రాము పత్ని, నమ్మహాత్మున కర్పించు టమరదేని.
ఆ॥ అన్న ! నిన్ను నేఁ బ్రసన్నునిఁ గావింప, నెంచి వేఁడువాఁడ హితమె కోరి
యున్నవాఁడ నన్ను మన్నించి నాదగు, పథ్య మైన మేలి పలుకు వినుము. ౭౪
వ॥ శరత్కాలసూర్యమరీచిసన్నిభంబులు నవాగ్రపుంఖంబులు సుదృఢంబులు నమోఘంబులు నైన విశిఖంబుల నశిఖాగ్నులం బోలె రాముండు వధోద్యుక్తుం డై నీపైఁ బ్రయోగింపకుండునంతలోన యాతని కాతన్వి నొసంగి కృతార్థుండ వగుము. ౭౫
ఉ॥ ధర్మసుఖంబులం గలఁచు దారిది కోపము దాని వీడు మ
ధర్మముఁ గొమ్ము కీర్తి ధృతిదాయక మయ్యది దుష్టకర్మదు
ష్కర్మములం దెరల్చు ననుమానము లే దటుగాన నాదు ప
ల్కుర్మిలి నాదరించి యిడు మాయము నాయినవంశమాళికీ. ౭౬
ఆ॥ నీప్రసాదమునను నేమంబు నెఱయ జీ, వనముఁ గాంతు మెల్లబాంధవులును
బ్రదుకువారు మేలు బడయుని పౌరుషం, బేల సీతఁ బనుచు మించు మయ్య. ౭౭
క॥ అని నొడువు సహోదరు నుడు, లను వినియుఁ జలింప కెల్ల లాగరి యుదు లెం
డని పోఁబనిచి స్వకీయుభ, వనమునకుం జనియె నతఁడు వరయోగకలా. ౭౮

—♦ మఱునాఁడు రావణుని వేశనముఁ జేరి మరల విభీషణుండు దుర్నిమిత్తములఁ జెప్పుట ♦—

తే॥ ప్రాప్తధర్మార్థనిశ్చయపరుఁడు లబ్ధ, భీమకర్ముఁడు ఘనుఁడు విభీషణుండు
ప్రత్యుషఃకాలమునను సంప్రస్థితుఁ డయి, రాక్షసాధీశ్వరుని మందిరంబుఁ జేరి.
సీ॥ కొమ్మలొప్పఁ బసిండికొండ క్రొమ్ముఱుఁగుల నౌన్నత్యమున మేల్మి నందినదియు
సవిభక్త లైన కక్ష్యలఁ దోరణద్వారపూజనంబుల సిరు ల్మొనసినదియు
మతిమంతు లగు మహామాత్రుల నెఱి మహాజనపరిగ్రహమునఁ జాలినదియు
ననురక్తు లాప్తపర్యాప్తులు నౌ దైత్యయోధుల పరిరక్ష నొలసినదియు
నగుచు భోగిగంధర్వదివ్యాలయముల, నగుచుఁ దూర్యనినాదానునాదితంబు
మత్తమాతంగనిశ్శ్వాసమహితము ప్రమ, దాజనాఢ్యము నైన యద్దానిఁ గదిసి.
తే॥ తప్తకాంచననిర్వ్యూహతతకలాప్త, రత్నసంచయసంబాధరమ్యయోగ
మన్నగరు సొచ్చి నాదిత్యుఁ డభ్ర మట్టు, లధికదీప్తికరుఁడు రావణావరజుఁడు.

క॥ ఆవీరు ప్రవేశంబున, నావేశిత యయ్యె నొకమహోద్యుతి గుణసం
భావిత యయ్యె సభాస్థలి, శ్రీవిలసితవృత్తు లొలయు చిత్కళ లూరన్. ౬౩
క॥ వేదవిదు లామ్నాతములు ప్ర, మోదావహములు సుపుణ్యములు తతపుణ్యా
హాదితరవోచితములు గు, రూదయపదములు పదంబు లూర్జితుఁడు విసెన్. ౬౪
క॥ లలి లాజ లక్షతలు పూ, వులు ఘృతదధిపాత్రికలునుఁ బొలుపొందఁగఁ బూ
జలఁ గైకొను మంత్రార్థవి, దుల విప్రులఁగాంచె మహితదోర్బలుఁ డబలా ౬౫
ఆ॥ తేజు నెఱయ నెఱిఁ బ్రదీప్యమానుఁడు వాఁడు, దానవౌఘపూజ్యమానుఁ డగుచుఁ
గొలువుగద్దెపైని గూర్చున్న ధనదాను, జునకు సుభుజుఁ డొనసి వినతిఁ గూర్చె,
ఆ॥ నాథు చూడ్కి గవిసి నవనవోన్మిషిత మా, నొక్క పసిఁడిగద్దె నుచితవృత్తి
నమరె నమరసదృశుఁ డాచారవిదుఁ డతం, డాచరితతదర్థుఁ డగుచు మగువ!,
క॥ రావణు మహామహు జగ, ద్రావణు మంత్రియుత మైపరవ్యవహిత మై
శ్రీ వెలసెడు నక్కొలువున, సేవింపుచుఁ దత్ప్రసాదసిద్ధి నరయుచున్. ౬౬
తే॥ అన్నతో నిట్టు లనె విలసన్నయుండు, కలితసాంత్వ ముపస్థితక్రమము గాఁగ
దేశకాలార్థసంవాది దృష్టలోక, సంచయుపరావరుం డసంశయుఁ డతండు. ౬౭
క॥ ఏవేళ నడుగుఁ బెట్టిన, దో వైదేహి యదె మొదలు దోఁచెడుఁ బురిలో
దైవికము లశుభములు నో, నావెడఁగునిమిత్తములు మహాత్మా! యెపుడున్.
సీ॥ పొగగట్టి మిణుఁగుఱులెగయ మంత్రితుఁడయ్యు నభివృద్ధిఁగనఁబోఁడుహవ్యవాహుఁ
డగ్నిశాలికల బ్రహ్మస్థలులం బాము లటు పిపీలికలు హవ్యముల నొదవు
నాల పాల్డిందె నొయ్యన మదావళముల మద ముడివోయె దీమసము సెడఁగ
మొగియఁజూడవు గ్రాసము లిడ నశ్వోత్తమంబులు దీనగతిని హేషల వెలార్చు
నాఖరంబు లొంటె లశ్వతరంబులు, భిన్నరోమములుగ బెరసువాఁటి
కనుల నెపుడు నీరు గాఱంగ వగ సెడి, యుండు నేచికిత్స నొరవుఁ గనక. ౭౧
క॥ కాకులు మొత్తము లగుచుం, గా కా యని విడుమరకునుఁ గాక విమానా
గ్రాకాయనము లగుచు బి, ట్టాకాలం బఱచుచుండు నతిఘోరముగన్, ౭౨
తే॥ మండలముఁ దీర్చి గ్రద్దలు మానకెపుడు, నిండ్ల పై పయిఁ గూర్చుండు నెల్లవిడిచి
కప్పు గప్పిన తెఱఁ గొంటఁ గానిపింప, నుభయసంధ్యల నక్క ల ట్లొలసికూయు.
క॥ క్రవ్యాదమృగము లిప్పురిఁ, గ్రవ్యాదాధీశ! పిల్లుగా ద్వారములం
దవ్యాహతార్భటుల నటు, పవ్యదోృకంబు నెఱయఁ బఱపెడు నెపుడున్. ౭౪
ఆ॥ ఇటు ప్రసక్త మైన యీయనర్థ మెడల్చు, యొప్పు నీదు చిత్త మొప్పు నేని
రాఘవేంద్రునకు ధరాసుత నర్పించి, శుద్ధభావ మొలయు సుకృత మిపుడు. ౭౫
క॥ ఈప్రాయశ్చిత్తము గా, కేప్రాకృతకృతియు యేని నెసఁగదు బహుదో
షప్రసవ మైన నీదగు, దీప్రాఘౌఘుంబు నోపి తెరలింపంగన్, ౭౬

ఆ॥ తెలిసి తెలియకేనిఁ దివుటమైనేని లో, భంబువలననేనిఁ బలుకువాఁడఁ
గానుఁ దప్పులున్నఁ దమియించి నీమేలు, చూచుకొనుము మమ్ముఁ బ్రోచుకొనుము.
క॥ ఈనా తెలిపినదోషము, లోనాయక ! యెల్లరకును నుపలక్షితముల్
గానివి గా వంతిపురియు, నీనగరియు నెల్ల యెఱిఁగి యెరియుచునుండున్. ౯౮
క॥ కన్నది విన్నది దెలుపక, మిన్నక యుండంగ నేర్చు మెయివాఁడను గా
నన్నా! నీమంత్రు లెఱిఁగి, యున్నికృతి మెచ్చుచుందు రోఱ వరయ కొఁగన్.
క॥ ఈయది మది నునిచి యథా, న్యాయంబుగ నిశ్చయించి యను వారసి నీ
వీయొఱకాటము గడచి వి, ధేయులతో మనుము కృతి విధిజ్ఞులు మెచ్చన్. ౧౦౦
ఆ॥ అనుచు భ్రాత మంత్రు లందఱ నడుమ నా, భ్రాతఁ గూర్చి పలికెఁ బథ్య మరసి
రాక్షసాధినేత రావణుం డితఁ డంచు, బెడీయువాఁడౌ యావిభీషణుండు. ౧౦౧

—♦ విభీషణు హితవాక్యముల రావణుఁడు నిరాకరించుట ♦—

క॥ హితము మహార్థము భూతా, యతి సంప్రతికాలయోగ్య మనవద్యము సాం
త్వితము సహేతుకమై తగు, నతని పలుకు విని జ్వరార్తుఁడై వాఁ డనియెన్.
మ॥ భయ మేవెంటను లేదు రాఘవుఁడు నన్బ్రాపింపఁగా నేరఁ డె
మ్మెయి సీతం గొని యేఁగువాఁడు సురలు న్మేకొన్న యిందుఁడ్రిండు ద్ధా
నయి తో డే నని వచ్చినన్ గపులగుం పాయగ్గిపై శాలభం
బయి పోదే నిలువంగలండె యతఁ డే నల్లాటలాడింపఁగన్. ౧౦౩
చ॥ అని సురసైన్యనాశనుఁ డహంకరణోచితుఁ డాత్మసారుఁ డ
ర్ధనిరతవర్తనుండు పరితఃప్రథితక్రమవిక్రమప్రసా
ధనుఁడు దశాననుండు తనతమ్ముని నన్మని నవ్విభీషణున్
జన దన కాప్తవాది యనఁ జాలక యూరక వీడ నమ్యెడన్. ౧౦౪
ఆ॥ మ్రొగ్గినాఁడు కామమోహితుఁడై వాఁడు, కామజనని సీతఁ గాంచి కానఁ
డదియె మిత్తి యనుచు నందఁడే కార్శ్యము, నాదరము నఘమ్మయమ్ముఁ జెఱుప.
క॥ పాపుఁ డయి యేపు సెడి వాఁ, డాపదపడుసమయ మట్టిఁ డధిగత మయ్యెన్
బో పగతు లొదు రాష్ట్రులు, శాపం బిడినట్టులై ప్రశస్తి తలఁగినన్. ౧౦౬
ఆ॥ ఆయతీతకాల మటె కాల మనుకొన్న, రావణుండు రాము రాక దెలిసి
యింక యుద్ధయోగమే యెంచె మంత్రుల, తో సుహృచ్ఛయంబుతోడఁ గలిసి.

—♦ మఱునాఁటి కొలువుకూటమున రావణుఁ డెల్లరాక్షసుల రావించుట ♦—

క॥ మఱునాటి వేకువనె మఱి, పఱిఁ గృత్యము లెల్లఁ దీర్చి యఱుకువ మొదలో
మఱుపడియు నెఱయఁ దగు న, క్కఱకై యక్కఱతలాఁడు కలఁగంబడుచున్.

సీ॥ మేలిబంగరుతోడి మెఱుఁగారు రతనంపుఁ బనిమెచ్చుగల తేరిపైఁ దనర్చి
మొయిలు చప్పుళ్లతో మొనసి పంతములాడు నేమినిస్స్వనముల నిరతి నరసి
యసిచర్మధరులు సర్వాయుధహస్తులుఁ దొడరి యోధులు ముందు నడువ నచరి
పలువేసములఁ భూష లొలసి యిమ్ములఁ గ్రమ్మ పరివారముల బరాబసులు మెచ్చి
సభకుఁ బోవు వేడ్కఁ జానయి నయముతో, సనఁగి పెనఁగ మంగళాస్పదములు
తూర్యరవము లొప్పఁ దోడ్తో వెడలి వాఁడు, రాజమార్గ మెనసె రాజవదన!
క॥ వానికిఁ బట్టిరి నెరవై, జానగు ముత్యాలగొడుగు స్వచ్ఛతర మదే
దానవనాథుని యాదల, పై నెలకొని పూర్ణచంద్రు ప్రథితిఁ దనర్చెన్. ౧౧౦
తే॥ ఇరుగడల నొప్పు స్ఫాటిక హేమమంజ, రీసముల్లసితోచ్ఛ్రితశ్రీఁ దలిర్చు
చామరవ్యజనము లసిచామరారి, విభుని పరిభుధర్మ మెల్లెడ వెలయుచుండ,
ఉ॥ అందఱు నేగుదెంచి రథమం దధినాథునిఁ గాంచి యంజలుల్
ముందల లంగడల్గాఁ నఁగ మ్రొక్కిరి భూస్థలి నుండి రక్కసుల్
గొందఱు తత్ప్రభావములఁ గోర్కులు మీఱ నుతించి రందు ని
ష్పందజయాశిషోక్తుల ప్రసక్తుల మేకొని రెందఱేనియున్. ౧౧౨
మ॥ అటు లేతెంచి మహామహుం డెనసెఁ బ్రోద్యద్రత్నశోభాంచిత
స్ఫటికానల్పితకల్పనాయుతఁ దపస్యాలబ్ధశుద్ధాగమో
ద్భటశిల్పిప్రవరప్రసాధిత లసత్స్వర్ణపట్టాంశుకో
త్కటరక్షోగణగుప్త స్థూణశతలక్ష్యన్ రాక్షసాధ్యక్షన్ సభన్. ౧౧౩
తే॥ అందు వైడూర్యమణిమయమై తనర్చి, ప్రియకప్రియకాజినప్రావృతంబు
నై యమేయోపధానంబులంది పొందు, సుమహితాసనమందుఁ గూర్చుండెనతఁడు.
ఆ॥ ఈశ్వరుండు పేఁడె యీరేడుజగముల, కంఁగ నెగడి దూతలను లఘుక్ర
ములనుఁ జూచి వాఁడు మున్నాడి యిట్లనెఁ, దనదు ప్రాభవంబు తలకు మిగుల,
క॥ పెద్దపని గలిగినది మన, కిద్దెసఁ దీర్పంగవలయు సిందఱ మొకఁ డై
తద్దయుఁ బుద్ధిగలవారల, నుద్దవిడిం జేర్పుఁడా సముద్ధతి మెఱయన్. ౧౧౪
క॥ అన్న శాసించిన శాసన, మనుపదమే కొంచు వార లరిగి యనుగ్రహం
బును వలగొని కడుదర్పం, బునఁ దొడరిన కర్జ మెఱుక పొసరించి రొగిన్. ౧౧౫
క॥ పానాహారరతుల ను, ద్యానవిహారైకమతుల ననుగతశయన
స్థానాంచితుల నభీతత, దానవులు పరిభ్రమించి తఱిమిరి పిలుచన్. ౧౧౬
చ॥ రుచిరరథోత్తమాశ్వగజరూఢత గాఢతరప్రయత్నులై
సచివత నెక్కొనం బెరయసాగి రవేగి రటం బదాతులై
పరిచితసమృద్ధు లూర్జితులు బంటులు గంటులు లేనివారు దా
రచిత మెఱంగి నింగి భువియు న్బలుభంగులఁ దొంగలింపఁగన్. ౧౧౭

క॥ పుర మన్నఁటి తతరథకుం, జరహయసంభేద మొనసి జాన్వై యపుడం
బరము గరుత్మత్సంపా, తరమ న్దర మరయఁజాలుఁ డా ననఁజాలెన్. ౧౨౦
ఆ॥ వచ్చి వాహనముల వరుస నెక్కొన నిల్పి, చొచ్చి రంఘ్రిగతిని శోభమాను
లగుచు నద్రిగుహాను హర్యక్షముల యట్లు, రహిఁ దనర్చి దనుజరాజసభను.
క॥ తేని పదయుగలమున కెడ, మీని గతి న్నతు లొనర్చి యెదుటన దరి నే
నేనే నని సత్కృతిఁ గని, వాని సరసఁ దనరి రెల్లవారు న్నతులై. ౧౨౨
ఆ॥ రాజశాసనమున రాణమైఁ దనరారి, వచ్చి వానితోడివార లగుచుఁ
దగినయట్లు నిలిచి తద్దయుఁ బెనుపొంది, నిశ్చయార్థదృష్టి నెలవుకొనిరి.
క॥ వందలకొలఁదిగ మంత్రు, ల మందప్రతిభాసమాన మానులమాత్యుల్
కొంద ఱన సేల యున్నిఁట, నందఱు ననమాను లగుచు నమరి రచటన్.
క॥ ఆ హేమవర్ణ సభ తగ, సాహసపాండిత్యగుణసమర్థులతోడన్
సాహిత్యమునఁ బ్రతాపం, బాహితమూర్తి యయి తనరె నన ఘనవేణిన్.
ఆ॥ మేలి టోలు సేర్చి మొఱఁగుబంగరుకట్ట, డం బొనర్చి యిదె వరం బటంచుఁ
బేరు సెప్పి భిక్ష పెట్టిన తన యూర, దమున ఘనమహాహ్లాదయుతమునఁ దనరి.
క॥ ఆకీర్తిశాలి మహితుఁ, డ, భీకుఁడు సుకృతాత్ముఁ డవ్విభీషణుఁడు నయుం
డీకరణిఁ దోఁచె నా నన, నాకాలం బరుగుదెంచె నగ్రజు సభకున్. ౧౨౭
ఉ॥ అన్నకుఁ బేరుగొం చదుగులం దభివందన మాచరించి యా
సన్న శుకప్రహస్తులు ప్రశస్తతరాసనము ల్ఘటింప నం
పన్నుఁడు మంత్రులుం దఱియ భాసురవృత్తి నలంకరించి యా
సన్నతఁ బొల్చె నిందఱకుఁ జాలు నితం డొకఁడే యనన్ సిరిన్. ౧౨౮
చ॥ రతనపుఁజెక్కడంపుఁబని రాణఁ దనర్చు పసిండిసొమ్ములన్
దఱిగొని మేలివస్త్రములఁ దార్కొని పేర్కొన నైన కాంతిప
స్తతులు దివంబు నాఁచికొన నవ్యవిలేపనమాల్యగంధసం
గతములు గంధవాహములు గ్రక్కున నెక్కొనె దిక్కు లానఁగాన్. ౧౨౯
శా॥ ఆక్రోశింప రబద్ధ మాడ రపరార్థ్యంబు ల్ప్రశంసింపఁబో
రాక్రవ్యాదవిభుం గనుంగొనుచు నెయ్యం బొప్పఁ దత్కార్యపుం
బ్రక్రాంతిం దలపోయుచుండి రభయు ల్భావజ్ఞు లుద్వీర్యులు
స్వక్రాంతి న్నతి గన్నవారు నగు మన్నీలు న్సభాస్తారులై. ౧౩౦
ఉ॥ మనసున నత్రుశత్రుముల మన్ననఁ గన్న ఘను ల్బలాఢ్యు ల
ల్లెనసిన యాసభం దగ సమేధితమానసుఁ డైన రావణుం
డనితర మైన దివ్యసభలందు వసుప్రవరుల్ ప్రభాకరుల్
దనరఁగ మధ్యభాగమునఁ దద్ద ఘనుండగు వజ్రిచాడ్పునన్. ౧౩౧

తే॥ అట్లు మొనసిన యోలగమంతయును సు, రాంతకుఁడువాఁడు కలయంగ సరసి పరసి
యున్నవానిఁ బ్రహస్తు బహుస్తుతౌజు, నఖిలవాహినీపతిఁ గాంచి యనియె నిట్లు.
క॥ ఆనాలుగుతెఱఁగులఁ దగు, సేనల సేనాచరులఁ బ్రసిద్ధబలుల వి
ద్యానయదక్షుల నీక్షణ, మే నీనెఱి నధికరక్షఁ గేర్పఱుపఁ జనున్. ౧౩౩
ఆ॥ అనినయంతమాత్ర నాప్రణీతాత్ముఁడు, మందిరమునఁ బురమునందు లోన
బయలునందు దుర్గపదమార్గనిర్గమం, బులను బలుబలంబు లలవరించి. ౧౩౪
క॥ ప్రబలుల పైకాఁ పమరఁగ, నబలాజనరక్షణంబు ననువుపఱిచి వాఁ
డుబుసుచనీక క్రిమ్మఱి, ప్రబుద్ధుఁడై విభుని కొలువుపట్టున నిలిచెన్. ౧౩౫
క॥ ప్రముఖమున నెలవుకొని తఱి, సుముఖుఁడగు రాజువలను చూచుచు మనమం
దమలత చొప్పడ ని ట్లనె, నమరారిప్రభుని దగుసమాదృతి నెఱయన్. ౧౩౬
మ॥ బలవద్గుప్తి ఘనర్చినాఁడ బల ముద్భావించి సంపత్తి కా
పిలభావం బనరాదు నీవలనునన్ వేల్పు ల్పలేఁ డొండు ని
శ్చలచిత్తుండవ కాని డెందమున కిష్టంబైన యకార్యమున్
దలపెట్టం దమకింపు మీఁదెదవు సందర్శించి నిప్పట్టునన్. ౧౩౭
ఆ॥ అను ప్రహస్తు పల్కు లాలించి మే లెంచి, సుఖముఁగోరువాఁడు సూనృతుండు
గాఁడు రాజ్యశక్తి గైకొన్న కబళమై, యెల్లవారిఁ గాంచి యిట్టు లనియె. ౧౩౮

—♦ రావణుఁ డందఱు వినఁ బ్రకృతము వినుచుట. ♦—

క॥ ప్రియ మప్రియమఘము సుఖము,వ్యయమున్ లాభముహితాహితార్థములును స
న్నయవిదులరు మీ రరసి య,భయుతం గడుకొండ్రు మత్త్రివర్గమునడుపన్. ౧౩౯
శా॥ ఏనాఁడేనియు నెంచి పొంచి యిది యిట్లే యంచు సన్మంత్రియో
గానూనంబుగ నర్థసంపదల నెయ్యం బొప్ప నెప్పాటునం
బూనంజాలితి రట్టి కర్జ మెదియుం బో దొంట వైఫల్య మె
ల్లేనిం బోలదు కాంచ వింతయొకం బీనాఁటికిం గల్గునే. ౧౪౦
తే॥ చంద్రసూర్యగ్రహర్క్షసంశ్రియతఁ దనరు, నమ్మరుత్తతిభృతి దివిజాధినాథుఁ
డెట్టు లట్టులె యేను మీయొనఁగు వృతిని, గంటి నవ్యాహతస్థితిఁ గన్న సిరిని.
ఆ॥ ఇపుడు పాలుపడిన యీయర్థమునను బ్రే, రేపవలయునంత రీతి లేదు
గాని స్వప్నగతుని ఘటకర్ణు బోధింప, నైతిఁ గానఁ గలిగె నవసరంబు. ౧౪౨
ఉ॥ ఎక్కుడు మేటి యేయెడల నెన్నియుఁ దీర్చినవాఁడు నాకె యే
చక్కటిఁ గూర్చువాఁడు శరజాలసమృద్ధి మహాబలోన్నతిన్
నెక్కొని పేరుగన్న కృతి నేర్పరి మేల్కొన నేఁడు నిద్దురన్
జక్కఁ దెరల్చి యార్నెలలసంయమ మీసమయాప్తికై చనన్. ౧౪౩

ఆ॥ వానిఁ గూర్చి తెలుపవలసె నిప్పట్టున, నాఖరాదు లోలసి యుండఁగొన్న
దండకాటవిం బ్రధర్షింపఁ దెచ్చితి, రాము మహిషి జనకరాజదుహిత. ౧౪౪

సీ॥ నా సెజ్జఁ దఱియ నో నయము పాటింప దమ్మందగామిని రాము మాటఁ దక్క
ముజ్జగంబుల దాని మొనయ నో వగలాఁడి నెఱి గాన మను పల్కు నిశ్చితంబు
పిడికిలిఁ బట్టు కౌ పేద లేఁగౌ నన్న నావృథుశ్రోణియే యలముఁ బృథ్విఁ
గరఁగి పోసిన మేలి కనకంబు బింబంబు సైదోడు దన కనుఁ జంద్రు వదన
మేటి మాయయో యు దెట్టులు పొడమెనో, మయవినిర్మితప్రమాణ మొక్కొ
యహా హుతాగ్నికీల యహా సౌరి లీల యో, యనుచుఁ గాంచువార లాడుకొండ్రు.

తే॥ సులలితములు సులోహితతలము లట్లు, సుప్రతిష్ఠితములు తామ్రదీప్రనఖము
లైన మానిని చరణంబు లానికొలుచు, కొలువుగొని జాయున దెవేయికోట్లు సేయు.

తే॥ సకియ మోమూర చారులోచనము విపుల, ముదిత మున్నతనాసిక మోష్ఠరుచిర
మొప్పుడు గనఁగంటినదె మొదలేచుచున్న, వాఁడుక అకుట్లమూరి కావరుఁడుమరుఁడు.

తే॥ సనుము లెవనికిఁ గ్రోధహర్షములు రూపు
మార్చినర్పంగ నెవ్వాఁడు మలయువాఁడు
శోకతాపంబు లెవ్వాని చూపు కోపు
లతఁ డతనుఁడియ్యదనున నన్నలమినాఁడు. ౧౪౭

తే॥ పతిఁ బ్రతీక్షించువెరవున్నైఁ బరఁగ వేఁడ
నొక్కయేడే గడువుగాఁగ నుత్పలాక్షి
భామినీమణి నెఱిఁ జిల్క పల్కుఁ గొంటి
మంచి నూహించి పోనఁగు నమ్మాట నుంటి. ౧౪౮

క॥ కాంతుఁడ నైతిని మార్గ, శ్రాంతము హాయ మట్లు బిట్టు స్మరుదాడిబడిన్
గాంత తలఁ పరయనోప ని, కాంతత జేకాంతనిహితతాత్పర్యధృతిన్, ౧౫౦

క॥ తరియింప నోపుదురె యే, తరి లేక వనాటు లిట్టితఱి నట్టన సా
గరము బహుసత్వకీర్ణం, బక్షీణబలు లైన నేమి యారఘువరులున్. ౧౫౧

మ॥ కడు నక్షోభ్యమె యాను వార్థి యయినం గార్యసిద్ధి ల్పార్చు నొం
దెడు దుర్జేయత నెంచ నేఁ బౌరిపాటిన్ దిష్టంబు దేశంబు నొ
క్కఁడు గాఁడో కపి లంక సొచ్చి కడఁకం గావించెఁ గల్లోల మే
ర్పడఁగాఁ గానఁ బ్రబుద్ధు లీ రనుమతి న్భావింపుఁ డీయర్థముల్. ౧౫౨

క॥ మనుజునివలనిభయము నా, కనుగత మనరాని దింత యహా నిజ మైనన్
బనితలవిమర్శనం బౌ, ప్పనిదే మీ నెఱియు నెన్నఁబడనిదె యెందున్. ౧౫౩

ఆ॥ ఎన్నిమార్లరాతు లెగిచిపడిరి వారి, నన్నితీర్లఁ ద్రోలి యెనయఁగంటి
గెల్పు వేల్పు లఱుమఁ గీర్తిఁ గైకొంటి మీ, యరుస మెసఁగు సాయమందగనుట.

క॥ సుగ్రీవముఖులఁ బ్లవగుల, నగ్రిగులఁ బొనర్చి యబ్ధి యవ్వలిదరిఁ గం
బుగ్రీవ నరయఁ జేరె ద, శగ్రీవు నదల్ప భర్త సహోదరుఁడై. ౧౫౫

ఉ॥ కావున మంత్రి మిట్టితతి గావలయుం గద ఘట్టివారికిన్
దావల మంచు మీమొదటఁ దార్చితి నింతయు నూహ సేసి మీ
రేవలనేని నిండుముఖి నీయక యుండ నరేంద్రపుత్రులన్
ద్రోవఁగ రిత్తవోని నెఱత్రోవ గతిం గమనించి తెల్పుడీ. ౧౫౬

ఉ॥ ఒంటికిఁ గద్దె శక్తి యెటు లోటమి పాల్పడకుంట గల్గు వా
కొంటయె వార్ధి దాఁటి నెఱకోట్టలసేయుట ధాత్రి నేరి కే
వెంట జయంబు గూరు హరివీరులతో నరుఁ డేగుదెంచి వా
ల్గంటిఁ గొనంగలాఁడె నను గన్గొనువాఁడె క్షయంబు నూఁ జెనే. ౧౫౭

క॥ కావున నాకే కలిగెడు, సేవలనునసేని విజయ మెల్ల నగసి యా
త్రోవతల యిది యనుచు మీ, రావేదింపంగ ముదల యయ్యెద రనినన్.

ఆ॥ కామనిహతుఁ డగుచుఁ గావలంబులు పల్కు, వాఁ డటంచు వాని వర్తనంబుఁ
గినిసి యిట్టు లనియె దనుజారివిద్వేషి, కుంభకర్ణుఁ డాఁచికోలు నెఱయ. ౧౫౯

— కుంభకర్ణుఁడు రావణునకుఁ బ్రత్యుత్తర మిచ్చుట —

ఉ॥ రాము సలక్ష్మణు న్నొఱఁగి రాజముఖి న్గొనివచ్చువేళ లే
దీమెయి నిశ్చయంబు నపుడే యమునానది యామునంబు న
ట్లామకొనంగ నైన మది యాఱడిఁ బాల్పడకుండుఁ గాదె నీ
సేమ మెఱుంగ కిట్టికృతిఁ జెచ్చెరఁ జొచ్చితి వేమి సేయుదున్. ౧౬౦

ఆ॥ మమ్ముఁ గూర్చి తొలుత మంత్రించి యిట్టిదా, కగ్గమునకుఁ దొడరఁగంటి వేని
నప్రతిఘ మనంగ నయ్యెడు నయ్యది, గతజలమున కింకఁ గట్ట యేల. ౧౬౧

ఆ॥ కాల మరసి రాచకజ్జము ల్నెఱపంగ, వలయు న్యాయ్య మైన వర్తనమున
యనువెఱింగి యోమహారాజ యానిశ్చి, తార్థుఁ డవలఁ దాప మందఁబోఁడు.

క॥ అనుపాయక్రియమాణము, లనువదమే చెడునుఁ గడునవర్థముల నిజున్
బొనరున యపాత్రముల నుం, చిన నెట్టి హవిస్సు లైన సిద్ధసమృద్ధీ. ౧౬౩

ఆ॥ పూర్వకార్యములనుఁ బొనరింపఁగఁ దలంచుఁ, బిదప నపరకృతుల మొదల నెంచు
నట్టిఁ డాజఘన్యుఁ డెఱుఁగఁడు రాజన, యానయముల వేఱె యునఁగ నేల.

తే॥ క్షిప్రకారి బలోన్నతుఁ జెనకనేర, కతని లోఁగొందు రొకరంధ్ర మరసి యరులు
క్రౌంచబిలమునఁ జొరఁబాఱు ఖగము లట్లు, గాన నేర్చి ప్రవర్తింపఁగాఁ బొసంగు.

క॥ ప్రతిచింతిత మొనరింపక, కృతిఁ దీఱనిదానిఁ గొంటి కేవలముగ నా
కతన ఫల మేమి స్వాత్మవి, రతి యొక్కటి దక్కఁ గలదె రజనిచరేంద్రా. ౧౬౬

సీ॥ సామాన్యుఁగా నంతె రామావనీంద్రునిఁ గాలుండె నీకయి కడఁగినాఁడు
కాళియే నినుఁ ద్రుంపఁగా సీత యనఁ దగి జనకుని జన్నంపుత్రొవ్వ జనించె
విషమిశ్ర మైన యామిష మట్టులే వీడఁబడితివి శద్దృష్టిపాలు గాక
యప్పటికప్పు డాయాగాములకు నడ్డపడె మేలు మేలు నీభాగ్య మెదిరెను
మునివరుఁడు చెప్ప వింటిని మోస మింత, లేదు నారాయణుఁ డతండు లేమలక్ష్మి
యనఁగ ననద లై రక్కసు లడుగుబట్టు, వారుగా నీ కొదవె నిట్టి వర్తనంబు.

క॥ మానక యామిష మనుకొని, మీనము బడిశమునుఁ బట్టి మ్రింగఁ దలఁచు లే
నీనెఱిఁ గన్పడె నట నే, మానో దైవను మెఱుంగు నానురనాథా! ౧౬౮

క॥ ఆమెం బోమె నిఁకే మగు, నీయాచిత్యేతరంబు నిందింపంగా
జేయూక మెలఁగవలెఁ దగు, సాయముఁ గొని వైరిబలము సమయింపంగా.

క॥ నీనెఱపిన యిక్కార్యం, బేనేర్పరి యైనఁ దీర్ప నెనసి మనఁడ పో
నానెఱి పమీకరించెదఁ, బూనిక మెయి శత్రుసమితి పాలు పెడలంగా. ౧౭౦

ఆ॥ శక్రసూర్యులేని శ్వసనానలులయేని, నాకు భేరవరుణు లైర యేని
నీదు రిపుల నర్ధనిమిషమాత్రంబున, నెగిచి కముచువాఁడ నింత నిజము. ౧౭౧

క॥ కొండవలె మహాపరిఘము, దండంగొని నిలిచి తీక్ష్ణదంష్ట్రి లడర బ్రి
హ్మాండ మగల నార్చెదు నా, దండఁ బురందరుఁడుఁ జేరఁ దలఁకక యున్నే.

ఉ॥ ఒండొకఁ డమ్ము నాటి నను నుజ్జ్వలతేజుఁడు రాముఁ డుద్ధతిం
రెండవు ముల్కి గ్రొచ్చి యనురిక్త నొనర్చెదు నంతలోన న
ట్లుండక త్రావువాఁడ నిజ ముద్ధత మస్రము గాన నూరటం
దండితనంబునం బెరసి తత్పరత న్సుఖవృత్తి నుండుమీ. ౧౭౩

ఆ॥ తద్ద గూర్తు జయము దనకు దాశరథికి, స్వవధమాత్రలాభసౌఖ్య మింత
నమ్మి మనుము యూథనాథులతోఁ గపి, వరుల మ్రింగి యుమిచి వత్తు నిటకు.

క॥ నాజతన రామలక్ష్మణు, లోజమెయి న్మెలఁగనేర రోయసురవరా
మోజించిన నానో రిపు, డీజగమంతయు గ్రసించి యెడలింపదొకో. ౧౭౫

ఆ॥ ఇచ్చమెయి రమింపు మెనయింపు వారుణి, నవికృతిం బొనర్పు మన్ని కృతుల
నేను రాముఁ ద్రుంప నీ కవశ్య యవశ్యమవనితనయ యాయ మక్షయముగాగ

క॥ అను కుంభకర్ణు మధులకుఁ, గనలుట నూహించి తేర్పఁగా నెంచి విభుం
గని పలికె మహాపార్శ్వుఁడు, ఘనసారుఁడు ప్రాంజలిత్వకలన పొసంగా. ౧౭౭

—♦ మహాపార్శ్వుఁడు రావణున కనుకూలముగ బలుకుట. ♦—

సీ॥ ఎవ్వఁడు వనదుర్గ మొనసి శాలిశుఁడ కా కధిగతం బగు మధు వాన కేడయు
నున్నాఁడె యీశ్వరుం డొక్కఁ డీశ్వరుఁ డనఁబరఁగుదు వీవ యఖిలమునకుఁ
బగఱ యౌదలలపైఁ బాదమ్ము మోపుము జానకి రమియించు సంగతముగ
కటిమి యర్మిలి సుందరాంగి భోగింపుము కుక్కుటవృత్తిమైఁ గోర్కు లలర
నాత్తకాముఁడ వైన నీకవల నొకఁడు, భయము ప్రాప్తంబగున నొండుభంగినుండు
నదియు నంతయు నోర్వ నౌ నంతకునకు, వెలువ విమ్ముగు వెలుపున పెడఁగుపడెదె.
ఆ॥ కదన మొదవఁ గుంభకర్ణుండు మేఘనాదుండు మమ్ముఁగూడి తోడరి యుడరి
సాహసమునఁ దీక్ష్ణసాయకంబుల గ్రొచ్చి, వజ్రధరున యేని వ్రచ్చియిడరె.
క॥ ఉపదానము సాంత్వముఁ భే, దపదమున నిపుణముగ దెలిపెదరు వానిని మా
ని పరాక్రమమున సిద్ధిని, నిపుణతరా! నీవు గొనుము నిష్ఠితబుద్ధిన్. ౧౮౦
క॥ పో నేల కా ద నెడు మది, గానేలా రిపుల నొడరి గాని మ్మనఁగన్
గా నగుపని గాని మ్మని, గా నీకయి కాము రుదుగఁ గాదింపంగన్. ౧౮౧
క॥ అని నొడువు మహాపార్శ్వుని, యనుగుణవాక్యముల మెచ్చి యాశరవిభుఁ డి
ట్లనెఁ దనమదిఁ గల తత్త్వం, బనువున నెల్లరు వినంగ నవిరభసమునన్. ౧౮౨

—♦ రావణుఁడు దన రహస్యమును జెప్పుట ♦—

సీ॥ విను మోమహాపార్శ్వ! వివరించెద రహస్య మయ్యర్థ మెఱుఁగ కిట్టాడి తీవు
చిరవృత్త మదియునుఁ జెవాఁడితిసమున వచ్చినదే కామవర్తనమునఁ
దిరుగుచుండి యొకప్డు దేదీప్యమాన మై యగ్నిశిఖం బోలి యాకసమున
జంచూర్యమాణ యా నన్మూర్తిఁ గనుఁగొంటిఁ బుంజికస్థల యను బోఁటిమిన్న
నటు పితామహు సేవింప నరుగుచున్న, దాని నిర్బంధమున నభిమాన మెడలఁ
జేసి భోగించి యె ట్లట్లొ యాస దీఱ, వివసనయు కాఁగఁ బుచ్చితి వెలుపు లేక.
ఉ॥ లోలిత మైన యన్నలిని లోలవిలోచన పోల నై నునం
లాలిత మయ్యు దేజని కలావిభవంబు పురోగమంబు గా
వ్రాలుచు సోలుచుం జని యువారణ ధాత పదాబ్జయుగ్మమున్
గాలువగట్టి కన్నుఁగవఁ గాఱెడు నీట మునుంగఁ జేసినన్. ౧౮౩
ఆ॥ ఆపె దెలుపఁ జెయిద మంతయు విననోపు, జాలి దోఁప సద్గుణాలవాల
మడరి నన్నుఁ బిలిచి యాదట నని భగ, వంతుఁ డతఁడు కోపవహ్ని నెఱియ.
క॥ ఓరీ! యిది మొదలుగఁ బర, నారి న్వల దన రమింప ననిచెద వేనిన్
నేర మదె కాఁగ నీతల, వారక యొక్కొకఁడు నూఱు వ్రక్కలగుఁ జుమీ.
క॥ తప్ప దిఁక నాదు వాక్యం, బప్పటి కప్పుడె ఫలించు నని విడెను నా
త ప్పతిఁగి యుంట నేఁడీ, యొప్పని సీతం గొనంగ నొఱకట మయ్యెన్. ౧౮౪

ఆ॥ మున్ను రంభఁ గొన్న యన్నెఱి కన్నుల, కూబరుండుఁ దిట్టెఁ గుపితుఁ డగుచు
నేది మెట్టు లున్న నీయమ వైదేహి, ముట్టఁగవిసి రట్టు మొనయరాదు. ౧౮౯

సీ॥ సాగరంబున లోఁతు పరస నౌరభసంబు నాసదాగతిద యా నట్టి గతియు
నాయువి యంచు నెన్నఁడు రాముఁ డెడసంచుఁ గొనివచ్చుచున్నాఁడు కొల్పడంగ
గిరిసుప్త మైన కేసరిని మేల్కొలుపంగ మిత్తికోఱల నొత్తి మేల మాడఁ
దలఁచుట గాదె నన్నాఁకి పేరేచుట యాద్విజిహ్వాంబుల యట్టి శరము
లడరఁ గని కానికానఁబోఁ డంతరంబు, వజ్రనిభము లౌ నవ్వాని వరుస నెఱియఁ
గొఱవు లగపడఁ బాఱెడు కుంజరంబు, ననుకరింపంగలాఁ డిప్పు డనగఁ నేల.

ఆ॥ ప్రబలబలము తోడుపడఁ జొచ్చి యాతని, బలము నెల్ల నేలపా లొనర్తు
సవిత యుదయ మొనయఁ జాలునే నక్షత్ర, సమితి మెఱయ నెట్టిజతన నైన.

క॥ వేయుగనుఁలవాఁడేనియు, నాయంతకుఁడేనియు న్మహోహావ మొదవన్
నా యెదుర నిలువఁజాలిరె, పాయఁడె పాశధరుఁ డల్లు పడి తోడ్తోడన్. ౧౯౧

ఆ॥ మూఁడుకనులవాఁడు మొనకొను చుట్టంబు, దనకు దాను మేటి దర్పమునను
విడిచినాఁడు పురము వెన్నంటఁ బుష్పకం, బొసఁగినాఁడు ధనదుఁ డోసరిల్లి. ౧౯౨

క॥ ఒంటికి జళుకుదునే ము, క్కంటికి నేఁ దలఁక నసఁగఁ గంజభవుని వా
క్కంటికొని కాల్చు నని వా, ల్గంటెఁ గవియఁ గుంటిపడితిఁ గాక భరంబే. ౧౯౩

ఆ॥ అని నిశాచరేంద్రుఁ డాడుమాటలు కుంభ, కర్ణ గర్జితములుఁ గడమవారి
వ్యర్థపదములును హితార్థ విభీషణుం, డాలకించి పలికె నధిపుఁ గాంచి. ౧౯౪

—♦ విభీషణు ప్రౌఢభాషితములు ♦—

ఉ॥ ఏల వరింప నెంచితి మహీజ మహోహిభుజాంతరాంచితో
ద్వేలితభోగ యార్తవిషవిస్ఫురిత సుస్మితతీక్ష్ణదంష్ట్రికా
జాల కరాల పంచనఖసంచితపంచశిరోలికాయ మ
మ్మేలఁ దలంపు లేదో తఱి యింతకుఁ దీఱెనొ రాక్షసేశ్వరా. ౧౯౫

ఉ॥ పర్వతకూటసన్నిభులు ప్రాంశునఖాస్త్రులు తీక్ష్ణదంష్ట్రులున్
గర్వితులు ప్లవీముఖులు కాఱులు పల్కుచు లంకలోపలన్
బర్వులు వెట్టుచుండఁగ సుపర్వులు గన్గొని నవ్వుచుండ నా
పర్వము రాకము న్మహిజ భాసుకులీనున కిచ్చు టొప్పదే. ౧౯౬

ఉ॥ వాయుసమాన వేగములు వజ్రనిభంబులు రాము బాణముల్
పాయక జొచ్చి రాక్షసుల ప్రాణములున్ దలలున్ హరింపఁగా
నాయన లంచు బిడ్డ లని నాథు లటంచని పోరు లేద్వ నా
నాయుశుభంబు పాల్పడని యప్పుడె యాతని కిమ్ము తత్సతిన్. ౧౯౭

ఉ॥ ఓయి! ప్రహస్త పొంగెద వదేమొ యొకయింత యెఱుంగ వో పవి
ప్రియము లట్లు ప్రాణహృతిపర్యవసానము లైన మైథిలీ
నాయక సాయకంబు లొకనాఁడును నీతను వ్రచ్చిపోవఁగా
నాయితపాటు గైకొనమి నామె స్వకీయవికత్థనార్భటుల్. ౧౯౮
తే॥ కుంభకర్ణుండు రాజు నికుంభకుంభు, లింద్రజిత్తు మహాపార్శ్వుఁ డీమహోద
రుండు నతికాయుఁడును మేటిగండ రైన, నిలువ లే రని నిక్క మన్నేత నెదిరి.
చ॥ చెనకితి వేని రాముఁ డిక జీవముతో మనలంగనీఁడు ని
న్నినుఁడు మరుత్తులు న్మనువ నెంచర యేనియు వాసవుండు పా
యని కృప నంక మందిడిన నంతకుఁ డే నని చెంతఁ జేర్చినన్
మును మనుచోట టంచుఁ దల మోప రసాతలమందుఁ జొచ్చినన్. ౨౦౦
క॥ అని విభునకు దుర్బోధన, లొనరించుట నెంచి తిట్టనోడ కతం డా
తనిఁ గూర్చి యిట్టు లనె మ, న్నన గలమానిసి నటంచు నాథుఁడు వినఁగన్.
ఆ॥ మాకు లేదు భయము మహిజానిసుతువల్ల, పితికి వీవు గానఁ జెద్ద సేసి
పలికె దిట్టు లనఁగఁ బాడియె ప్రాణము, ల్గీ వటంచుఁ దెరలి తిరిగి దొక్కె.
ఉ॥ ఎన్నఁడు జంకఁ డింద్రునకు నేనియు దిక్పాలకేనియుం దదు
త్పన్నులకేనియుం బతగపన్నగకిన్నరయక్షరాక్షసా
భ్యున్నతవర్గము త్ర్యధరి రోసదిలం బనుపొంది నేఁటి కీ
తఁ డెన్నికయింత యేలు పెడమానిసికై తడఁబాటు గాంతుమే. ౨౦౩
తే॥ అనుచు నహితముగా నాతఁ డాడ రాజు, హితము గోరినవాఁడు మహీయసుండు
ధర్మకామార్థదర్శనమర్మవిదుఁడు, పలికెను విభీషణుఁడు ప్రౌఢభాషణముల.
చ॥ పలికిన యంత చేయఁగల ప్రాజ్ఞుఁడు పల్కెను యిట్టు లెంచి నీ
కలబల మెంటి దా బలముఁ గాంచితె నీవును కుంభకర్ణము
ఖ్యులు ననిన ట్లొనర్పగలరో రఘురామునిఁ గూర్చి పావకు
ద్ధుల కగునే సువర్గగతి తోఁచిన తీరున నన్నఁ దీఱునే. ౨౦౫
శా॥ నీకు న్నాకును సర్వరాక్షసులకు న్మేకొలు గావించి న
శ్లోకాత్ము న్గుణధాము రాముఁ బొదువన్ హింసింప శక్యంబె తాఁ
బ్రాఁకు ల్వెట్టఁగ వార్ధి వప్లవునకున్ బ్రావీణ్య మెప్పారునే
లోకేశుం డతఁ డార్భటుల్విని నిరాలోకుండు గానేర్చునే, ౨౦౬
క॥ ధర్మప్రధానుఁ డధికుఁడు, నిర్మలభావుండు చేయ నేర్చినవాఁ డా
కర్మతుఁ దెరల్పఁగా ము, మ్మర్ములకుఁ దరంబె మాధ్యగాములు గారే. ౨౦౭
క॥ అతనిడగు సంగర మన, నాతామరచూలి వడఁకు నమరు లలుకఁటే
భ్రాంతిమె నినుఁ బోలిన యువి, నీతుం డెటు లనినఁ జెల్లు నే ర్పరయనివాన్.

తే॥ కంకపత్రంబు లనియొనఁ గంకటములు
వ్రచ్చి లోఁజొచ్చి యసువులఁ బుచ్చునపుడు
రాముఁ బొగడెద వోరి యరాతిభీము
నఱవఁగావచ్చుఁ గాఱు లి ప్డధిపుసభను. ౨౦౯
క॥ శక్రసము నెదిరి నిల్చి య, వక్రముఁ డీవిభుఁడయేనిఁ బగఁగున మీామీా
విక్రమము లట్టులుండఁ ద్రి, విక్రమభావంబు నెఱపు విధ మతఁ డొలయుఁ.
వ॥ బలవంతు లైన దేవాంతకనరాంతకాతికాయత్రిశీర్షాకంపనప్రముఖులును శైలస
మానసారు లైన కుంభకర్ణకుంభనికుంభముఖ్యులును గృతమాఘవనవినోదుం
డగు మేఘనాదుండును నీవు నీయొడయండును రణరంగంబున దాశరథి నెదిర్చి
పేర్చి నిలువంజాల రింతయు నిక్కువంబు.
తే॥ తాను సప్తవ్యసనములఁ దవిలినాఁడు,మిత్రు లగు మీా రమిత్రప్రమితులు ప్రకృతి
తీక్ష్ణుఁ డసమీాక్ష్యకారి విదీర్ణుఁ డగుచుఁ,గులము నిర్మూల మొనరించి కూలఁడెట్లు
ఆ॥ అయ్యనంతభోగ మాసహస్రోత్తమాంగంబు భీమ మతిబలంబు నైన
నాగ మిపుడు చుట్టె నాయకు విడిపింపఁ, దలఁచు టనదుగాని దారిగాదొ. ౨౧౩
మ॥ పరిపూర్ణోత్తమకాము లై మనెడు నాపద్బాంధవు
ల్పరిరక్షింప రిదేమి భీమబలదీప్యద్భ్యాతసంగ్రస్తు ని
వ్వరుఁ గేశగ్రహణంబు మీాఱకునికి న్భావించి వారించి త
త్పరతం జూడక "యీఁదు పావన!" యన న్భావాత్ము లై పోవరే. ౨౧౪
తే॥ సాగివచ్చెఁ జుమీా రామసాగరంబు, దివి భువియుఁ గ్రమ్మ వేల నతిక్రమించి
యాజిభూబలిసద్మంబు నందకుండఁ, గాచుకొనవలె నిపుడు రక్షకులెందు. ౨౧౫
క॥ సహాదనుజవరము పురమును, సుహృజ్జనముతోడి రాజు సుఖ మొనయఁగ నే
విహితము సుహితముఁ దెలిపెద,మహీసుత రాఘవున కొసఁగు మతమగుననుచుఁ
మ॥ పరు బీరంబు స్వసార మారసి మహాప్రావీణ్య మొప్పార న
వ్వరుస న్వృద్ధి క్షయంబు స్థానమును వైరిస్వీయపక్షంబులఁ
వరయుక్తిం బరికించి స్వామిహితము న్వాకృవ్వఁగాఁ జాలు నే
ర్పరి పో మంత్రి యనంగ నొంటి కరికి న్భావింప వే యున్నదే. ౨౧౭
క॥ అని యిట్లు బృహస్పతి కి, య్యనఘుఁడె తుల్యమతి యనఁగ నగు చొప్పునఁ బ
ల్కిన నాతని నుడు లెట్లో, విని పీరుం డింద్రజిత్తు వెసఁ దా ననియెఁ. ౨౧౮

—♦ ఇంద్రజిత్తు విభీషణు నతిక్రమించి బీరము లాడుట. ♦—

మ॥ అగు నయ్యా!పినతండ్రి!యి ట్లనఁగ నియ్యర్థం బనర్థావహం
బు గదా భీరుత యేల పాల్పడితొ నీవు ట్టీకులంబందు వే

ఉరగఁ గన్పట్టెడి నట్టుసాఁచి సభఁ గాంచి లొన్నవ్వ నాడం బరుల్
నగరో యనన్యజులేని నిర్వ్యాధికృతికిన్ న్యాయంబుగా నెంతురో. ౨౧౯

క॥ తేజము వీర్యము శౌర్యము, నోజ మెరయు ధైర్యమునుఁ గులోచితములు నీ
కీజాడ నబ్బ దొకటియు, నీజన్మం బన్నిటనుఁ గనిష్ఠమె సుమిత్రా. ౨౨౦

ఉ॥ వారన నెంతవారొ కడఁ జెవారక గెల్చును వీరిలోనివాఁ
డూరక స్తోత్రము ల్సేలఁచు టొప్పదు నీ కటు దోఁచె నేమొ భూ
దారకపుత్రి లన్న మముఁ దాఁక దొకింతయు భీతి సీతలన్
భారము మోపినారొ యిటుపల్కుట కొండొక హేతు వున్నదో. ౨౨౧

శా॥ ముల్లోకంబులు నేలువాఁడె కద పాత్రముఖ్యాంచితుం డింద్రుఁ డా
పల్లేశంబును లేనివాఁడు దనుఁ గావంజాలకే సేన లా
కల్లోలంబున దిక్కటు ల్నెఱయఁగాఁ గాఱాకుచందాన నై
యిల్లు న్వాకిలి బట్ట కీతనికృతి న్థీనస్థితిం గాంచఁడే. ౨౨౨

ఆ॥ నన్ను మెచ్చుకొంట నాతలం పని దీన, నెన్నరాదు సురము శోభనంబు
కర్షణంబొనర్చి హృన్మతలంబునఁ దోవ, నదియు విన్వగముగ నణువహొక్కె.

క॥ సురనివహాదర్పహంత యు, సురోత్తమపరికరగర్వసూదనుఁ డని మె
న్నరె నన్ను వీఁడు పాత్రకృత, నరులకుఁ జాలఁ డనుమాట నాతల నిజదే.

ఆ॥ అని దురాసదుఁడు మహారాజనుఁ డింద్రదన, న్నిభుఁభు వాఁడు వల్కె నిస్త్రింశు
శస్త్రశాస్త్రభృత్ప్రశంస్యుం డనియె నవ్వి, భీషణుఁడు మహార్థవిదిత మొలయ.

—♦ విభీషణుఁ డింద్రజిత్తుని మతము నిందించి రావణుఁ దనపల్కులు వినుమని ప్రార్థించుట. ♦—

ఆ॥ అయ్య! నీకు మంత్రమందు నిశ్చయ మొకం, తయును లేదు బాలతయుఁ దలంగ
దట్లుగాన నేఁటి కవిపక్వబుద్ధి ని, ట్లాడఁజొచ్చి తాత్మహాననమునకు. ౨౨౩

వ॥ ఈవిప్రలాపంబు లన్నియు నర్థహీనంబుల యింద్రజిత్తు వైన నేమగుఁ బుత్రప్రవాదంబుచే మిత్రముఖుండ వై గోముఖవ్యాఘ్రం బని నట్టు లీలేని కిప్పటినం బ్రబలశత్రుండ వైతివి రాముని కెదురై వినాశంబునకుం గుదురై చన నైతిటిం జదురు సొచ్చి పదపద మని మోహావశంబున వదరుచున్నాఁడ విప్పుడు యిం దుర్మతి వైన యీ వొకండవే వధ్యుండ వని కాక యిట్టియెడకు నిన్నుం దార్చిన యవ్వాఁడును నేఁడయవశ్యవధ్యుం డనవచ్చు బాలుండును దిట్టయు సాహసికుండు నగువానిని మంత్రకృత్ప్రవరులు తమచెంతం జేరనిచ్చు టొప్పదు మూఢుండవు మూర్ఖుండవు ధృష్టుండవు నవినయోపపన్నుండవుఁ దీక్ష్ణస్వభావుండవు స్వల్పమతివి దురాత్ముండవు నైన నీవు సుదుర్మతి వై బాలచాపలదోషంబు తెగించిన నెగిచి పడుచున్నాఁడ వింక నీదు వాచాలత్వంబు చాలించి మనుము. ౨౨౪

చ॥ ఎదు రయి యాజి రామవిభుఁ డేయు శరంబులు మృత్యుతుల్యము
ల్చదలునఁ గ్రాలుచుం బఱచు జ్వాలలుఁ దోడుగ నీడఁబోని వై
యదనునఁ గాలదండములొ యాత్మయకాలకృశానుమూర్తులో
కదె యనఁ బైకొన న్నిలువఁ గర్బుర యొక్కఁడ యేని శక్తుఁడే. ౨౨౮

ఉ॥ మాయలు మంత్రము ల్నిగిడి మంజ్ఞను నాఁటికి నేఁడు యోద్ధుకా
మా! యతిమాయుఁ డంచదతిమానుష కాయుఁడు డాయవచ్చెఁ గ
న్మాయఁగనీయఁ డాదొనల మూతు లెడల్చి మొగమ్ము సూప నీ
చాయకు వింత వహ్నిఁ గొని సాగకు రాముని సాయకౌఘముల్. ౨౨౯

ఆ॥ పిన్నవాఁడ వెట్లొ పేరును బొపును, గన్నవాఁడ వింకఁ గాఁగలాడ
వున్నప్రాభవమ్ము మిన్నకచనఁ జన్న, సన్న యొకఁడుఁ గలదె సరణి వలదె.

వ॥ అని యిట్టు లాతని నొనాడి ధర్మపథానుసరణంబున రణంబునం బేరువాడ నైన యవ్వాఁడిమగండు మోడి నీడనివాఁ డయ్యు వీఁడు దోడునీడ కదా యని దాయ యనక తోడిపుట్టునం బట్టి నెట్టనం దెరల్పరాని వాత్సల్యంబునకు వశ్యం డై లోకవిద్రావణు రావణుం దిలకించి యల్లనల్లన ని ట్లనియె. ౨౩౧

శా॥ అన్నా నాపలు కాలకింపు తఱి యె ప్డన్నట్టులే కాదు నీ
బన్నం బారయలేక నే విడువకే భాషించెదన్ సూనృతం
బన్నాలీకభవాదివంద్యు రఘురామాధీశు సేవింపు మే
మన్నం గా దిఁక వీడుకో ల్నెఱప నన్యాయంబు వాటిల్లెడున్. ౨౩౨

ఆ॥ మాన్య సీతఁ గొంచు మహిజానిఁ జేరంగఁ, జని యమూల్యవసనసముదయాఢ్య
రత్నరాజితోడ రామార్పణం బంచు, రాచు నొసఁగ నగు నిరామయంబు. ౨౩౩

క॥ కన్నత్తి తేఱిచూడఁగ, నన్నికగలవాఁ డొకండ యేనియు గాఁ డా
తెన్నున మను నిన్నొవ్వని, మన్నిలం దెట్టి తలఁపు మలగొన నైనన్. ౨౩౪

తే॥ అనుచు సునివిష్ట మై హితమై తనర్చు, పలుకు వలికెను తమ్ముని పాడి మెచ్చ
కసుర యిమ్మెయి కఠినోక్తు లాడఁజొచ్చెఁ, గాలుఁ డాఁకొని ప్రేరేపఁ గంజనయను!

—♦ రావణుఁడు విభీషణు నిందించి వెడలనడచుట ♦—

సీ॥ వసియింప నగు మేటి నైరితో నైన రుష్టాశీవిషంబుతో నైనఁ గూడి
కూడదు కూడ దకూల్క మిత్రప్రభుం డరిసేవి యగువాని యండఁ గొనఁగ
నెఱుఁగుదు జ్ఞాతుల కెల్లలోకంబుల శీల మొక్కఁడు గాఁగఁ జెల్లుచుంట
నవ్వుచుందురు వ్యసనములు పాల్పడ మేల్లు గూడిరా లోలోనఁ గుందుచుండు
రెందునుఁ బ్రిధానుఁ డైన గుణేష్యుఁ డైన, వేత్త యైనను ధర్మప్రవృత్తుఁ డైన
శూరుఁ డైనను మెచ్చరు చూతురు తఱి, గాఁ బరాభవ మొనరింపఁగడఁగుచుంద్రు.

తే॥ కదలకుందురు ప్రచ్ఛన్నహృదయు లగుచు
నిష్టు లట్టులు నిత్యసంహృష్టకలన
నాడు రదనున ఘోరత నాతతాయు
లమలములు గాఢ్రహాయుతము లౌ హ్రదము లనఁగ.

మ॥ ఒకనాఁ డొక్కఁడు పద్మషండమున బంధోద్యోగ మొప్పారఁ బా —౨౩౭
శకరు ల్యుక్తకరీంద్రు లౌ నరుల లక్ష్యం బొప్ప వీక్షించి వ
న్యకరు ల్పాడిన గీతము ల్గలవు నే నవ్వాని విన్పింతుఁ ద
ప్పక వి న్మర్థ మెఱుంగు మావలని దౌ భావంబు నేనూరడీ.

తే॥ అగ్ని గా దన్యములునుఁ గా వస్త్రశస్త్ర, పాశములు నట్టి కావు మాకట్ల భయముఁ —౨౩౮
గూర్చునవి స్వార్థపరు లతిఘోరు లైన, జ్ఞాతిసంఘమువారె వో చంపువారు.

ఆ॥ వట్టువట్టి మమ్ముఁ బరులపాల్సేయంగ, నిపిరు చాలు నంచు నెంచనేల
మెల్లకష్టములకు నెక్కుడౌ కష్టంబు, జ్ఞాతిభయ మటంచు జ్ఞాని మున్నె.

కం॥ గోవుల యెడ సంపద స, ద్భావులు బ్రాహ్మణులయందు దమము మునులం
దేవేళఁ జలత యున్న, ట్లావలనన జ్ఞాతులందె యతిభయ మురుచున్.

తే॥ బుద్ధిమంతుఁడ నే లోకపూజ్యుఁడ నని, మహితసంపద లంటన మానిసి నని —౨౪౧
పగతుల శిరంబులం దొక్కఁ బరఁగితి నని, జ్ఞాతి వగు నీ కనిష్టసంహతి మన్యో.

కం॥ నలినదలమ్ముల నెప్పఁ బడు, జలబిందువు లెనయ వెట్టు సంశ్లేష మ్మ
ట్టులె పో యనార్యులందు, న్నిలువదు సౌహార్ద మింత నిక్కము సుమ్మా.

కం॥ నీవలెనే మధువము వెస, ద్రావను రస మెల్ల సెలిని గ్రంబునఁ దా —౨౪౩
నావల నొందువలనికిం, బోవునుఁ బూవుకడ నిలువఁబోవద కాదే.

కం॥ స్నాన మొనర్చి పరాగముఁ, బోనడఁచియు గజము మరలఁ బోసికొనదె యు —౨౪౪
ష్మానిపయి వంతకెక్కుడు, గా నగు భూగజము నట్లి ఖలహార్ద మిలన్.

తే॥ ఆశరత్కాలమున గర్జనాతిశయము, గానవచ్చును వర్షించుగతిఁ దనర్చు —౨౪౫
గాని రసదానవిభవంబు గానఁబడదు, మేఘముల నట్టివే జ్ఞాతిమేలనంబు.

కం॥ తింటివి పుష్టాంగుఁడ వై, మంటివి నాకడ నె పెద్దమానిసి యనఁగా —౨౪౬
నుంటివి మహితవిభవము, ల్గొంటివి తటిచేచి యనసనుకూలుఁడ వై తే.

ఉ॥ వింటిరె సభ్యులార! ప్రతివీరుఁడు గానయి యున్నవాఁ డిటే —౨౪౭
కొంట కృతఘ్నుఁ డార్యుఁ డనఁగూడదు వీనిఁ ద్యజించితిఁ మహా
కంటక మిట్టిసంగతము గా దిక దుంటరు లైన జ్ఞాతు లే
వెంట శుభంబు గోరిరి నవీనములే ఖలదుష్ప్రసంగముల్.

—౨౪౮

శా॥ ఓరీ! నీమొగ మింకఁ జూడఁ జను మెట్లో మంటిలే యిట్టి దా
దారిం బల్కియు నన్నుఁ డిట్టు లనినం దత్కాలమే చచ్చువాఁ
డారా రాక్షసవంశపాంసనుఁడ వీ వైనాఁడవీపాత్తునన్
శ్రీ రాజిల్లదు మమ్ముఁగూర్చి చెడు గీశీలమ్ము మూలమ్ముగాన్. ౨౮౯

క॥ హా హా మ్మని త్రోఁచిన య, ప్పాపాత్ముని పేర్చుటు పరుషభాషణములుఁ ద
న్వేప నయవాది యన్వయ, దీపకుఁడు విభీషణుండు తేఁకువ వెలయన్. ౨౯౦

—♦ విభీషణుఁడు రావణపరాభూతుఁడై యాకసమున కెగసి చిరుతమాటలు పలుకుట.♦—

క॥ నలువురు దనుజులు తనతో, నలఘుతరము గత మటంచు నలరుచుఁ దరలన్
బలుగదఁ గొని గొనకొని యు, క్కలనన్ దివి కెగసి యున్నఁ గని యిట్లనియెన్.

ఆ॥ తనదు మేలు కోరి తగనాడ విననివాఁ, డమ్మొ సదియు చాలు నతనిఁ దిట్టి
త్రోయనేల తలఁచె ద్రోహి వాఁ డింకెట్లు, గాలకుండువాఁడు కంబుకంఠి!

ఉ॥ ఇంకను నాపయిం గినిసి యెట్టిటు లాడఁదలంచినాఁడ వా
వంకన పోవనిమ్ము నిజవాగ్విభవమ్ము గురుండ వంచు నా
శంకత నేమియుం బలుకఁజాలదు నో రఘు మన్న నింతయుం
జంకదు నీమనం బని పరిసక్తిఁ దోఁటంగుటకై తలంగితిన్. ౨౯౩

క॥ పితృసముఁడు జ్యేష్ఠుఁ డనుట వి, దితమే మైనం బ్రసక్తదిగ్భ్రముఁడవు నీ
మత మొప్ప దనృత మగుటఁ బ్ర, స్మృతి యన్యోం బరునగతియు సిద్ధి పొసఁగునే.

ఆ॥ ఏ సహింపఁజాల నిట్టి పాపము హిత, వృత్తిఁ గఱపు పెల్ల విషము మన్యొ
నరయఁబోదు మంచి నకృతాత్ము లౌ వారు, కాలవశతఁ జిక్కి చేల లగుచు.

క॥ ఇచ్ఛకముగఁ బలికెడువా, రిచ్ఛ మెయి న్వినెడువారు నెందు సులభులే
యచ్చపుఁ బథ్య మనన్ విన, బొచ్చె మెడయు జనులె దుర్లభులు భువి దేవా.

తే॥ కలుగు భూతములనుఁ గట్టు కాలపాశ, మునకుఁ గన్పడి నీల్గనై మొనయువానిఁ
గాల నైన గృహంబునుఁ గని యుపేక్ష, నేయఁబోలమి నిమ్మెయిఁ జెప్పవలసె.

క॥ లయ పావకసంకాశము, లయమితగతులైన రాము నస్త్రంబులచే
క్షయ మొందెదు నినుఁ గనలే, కయ త్రొడరితి నింతపట్టు గాఱులు పలుకన్.

క॥ కాలాభిపన్నులగువా, రేలీలఁ గృతాత్ములైన నెంత బలమునన్
గ్రాలినఁ గూలుదు రొక్కట, వాలుక సేతువుల యట్లు వడిఁబడి యధిపా. ౨౯౯

క॥ కాలుఁడు కాళియు సీతా, లోలుఁడు జనకజయు నాగ లోకముభరమున్
జాలి మారింపఁ బొడమినా, రాలలిఁ దత్ప్రేరణమున నరయవు సరణిన్. ౩౦౦

సీ॥ ప్రకృతి కవ్వలివాఁడు పరమాత్మ శ్రీరాముఁ డఖిలభూతాంతరంగాంచితుండు
బ్రహ్మాదులలో నగ్గిమాడ్కి నొక్కండయ్యు నానాత్వ మందు తన్మయత నుండు

నజ్ఞానదృష్టుల కాకృతిభేదంబు గనుపట్టు జ్ఞానులు గాంతు రొకటఁ
బరఁగు రంగులపొంతఁ బటికము ట్లతఁ డొప్పఁ బంచకోశాదిసంవ్యాప్తి నెనసి
నిత్యముక్తుఁ డయ్యు నిజమాయ గొనముల, భేదముననె వింత పేళ్లు వెలయఁ
గాల మని ప్రధానకం బని పూరుషుం డనియు వ్యక్త మనియుఁ దనకు నెపుడు.

క॥ జగముల నెల్ల సృజియించును, వగకాఁడు ప్రధానపురుషవర యోగమునన్
జగముల కలనల నడపును, జగదాత్ముఁడు కాలరూపసద్భావమునన్. ౨౬౧

ఆ॥ అట్లు కాలరూపుఁ డా భగవంతుండు, రాముఁ డగుచు మాయ గాఁ బ్రవృత్తి
బ్రహ్మ వేఁడ నిన్ను వధియింపఁగా వచ్చె, నతని దా తలంపు వితథ మగునె.

క॥ నిను నీవారినిఁ బొలియిం, చును రాముం డిందుఁ జొచ్చి చూడకమునుపే
చని మొద నాతని కొలువుం, గొన సపరిచ్ఛదము గృహముఁ గొనని తలఁపునన్.

క॥ నాతప్పు సహింపుము ని, న్నీతటి పింత మెంచి మెట్టులేని ననిన-చో
భ్రాత వగుట నొడివెదఁ బురి, నీతనువుం గాచుకొను మనిందుఁడ వగుచున్.

తే॥ స్వస్తి యగుఁగాత మేగెద సౌఖ్య మందు, మేను లేకుంట నైన నీ వింక ముందుఁ
బరఁగు మదె లెన్న గద యెల్లభంగి నిచ్చ,వచ్చుదారి మెలంగు నవ్వాలను మెఱయు.

—♦ విభీషణుఁడు తల్లి యనుమతిఁ గైకొని శ్రీరాముని శరణార్థియై చేరఁబోవుట ♦—

చ॥ అని యిటులాడి యాయనఘుఁ డచ్చటు వీడి ప్రసంగుపాడియై
జనని పదంబు సేరఁగని సాగిలి మ్రొక్కి ప్రసక్తమెల్ల నె
ట్టన వివరించి నీకృపఁ గడంగెద రామునిఁ గొల్వఁగా ననన్
దన కడగొట్టుబిడ్డఁ గని తద్దయు వత్సలభావ మొప్పఁగాన్. ౨౬౬

క॥ కైకసి విశ్రవుకరుణా, శ్రీ కాస్పద మై ముదాప్తిఁ జేన్నారిన స
త్ప్రాకటయశోనిధానం, బాకాలం బతనిఁ దివిచి యనె నిట్లనుచున్. ౨౬౭

క॥ ఓచెల్ల వేత్రుపడితే, నాచల్లని కానుపా! వినమ్రుఁడ వగుచున్
రోచదొరఁ గొలిచి మనఁ జన, యాచించెదె నాదు ముదల నందెదు నిచ్చన్.

తే॥ నీదుధర్మావె నిను మన్చ నిర్మలుఁడవు, తండ్రితాతల కీర్తిఁ దద్ద నిలిపి
తనదు గాదికృతియు నిక్క మరయు గురుల,యైన దుష్టభగతుల నెయ్యంబువలనే

క॥ పొమ్మన్న చిరంజీవివి, గమ్మన్నా! రామవిభుని కారుణ్యమునన్
రమ్మన్నా మహితుఁడ వై యిమ్మన్నా! మహాము మరల నీకన్నులకున్. ౨౭౦

ఆ॥ అనుచు బుజ్జగించి యాశీర్వదించి యా, యమ యనుజ్ఞ సేయ నంతవట్టు
దనకుటుంబినికినిఁ దార్కాణ గావించి, వెడలె నతఁడు సచివవితతిఁ బెరసి.

క॥ ఆసత్యసంధుఁ డిమ్మెయి, దాసంధాన మొనగూర్చెఁ దద్దయు నెదకున్
బ్రావంగిక మగు రామప, దాసంజితభక్తిసార మగు తత్వమునన్. ౨౭౨

మ॥ కొలుతుఁ గా రాము పదారవిందములఁ గోర్కొల్ల ల్గదా సంపదల్
దలఁతుఁ గా బ్రహ్మపదార్థ మట్టి ననుచుం దద్వృత్తినై నెప్పుడుఁ గా
మలఁతుఁ గా స్వేంద్రియపంచకాఖ్య మగు నమ్మత్తేభవర్గంబు దే
వలతుం దత్త్వపదైకసాధ్య నయ మొప్ప న్ముక్తిరామామణీ. ౨౨౪
క॥ నే ధన్యుఁడ నైతి జగ, న్నాథుని కొలు వట్టి నింక నాయన నను సం
బోధించి ర మ్మనకమును, రోధింపరుగా నయాకరు ల్కేశవరుల్. ౨౨౫
సీ॥ ప్రాద్యుప్రొద్దున నె యప్పురుషోత్తమునిఁ గాంచి యాదరంబున సేవ లరయుచుందు
నవనవోన్మిషితము ల్నాయన్న పాదారవిందము ల్సద్భక్తి వెలయఁ దలఁతు
నిదుర దేఱిన సామి నెత్తమ్ము లాకను ల్జిలుగు రుమాలల్లఁ జేర్చి తుడుతు
గద్దియ నలకొల్పి కాంత్రు దీఱ నొనర్తు నర్ఘ్యపాద్యాదిసమర్పణంబు
చాలుగొజ్జంగిపన్నీట జలకమార్చి, తడవి తడిఱొత్తి మంగళార్థము లమర్చి
మేటి కస్తురితిలకమ్ము మెళవించి, పూజఁ గావింతు మేల్మేలి పూవు లేర్చి. ౨౨౬
క॥ ఆదటఁ దగు నుపచారము, లాదృతినేఁ గూర్చువాఁడ నధికం బగు సం
మోద మిడె వేదమార్గితుఁ, డా దేవుఁడు గానవయ్యె నరమఱ లున్నే. ౨౨౭
క॥ కనుఁగనఁ దచ్చరణాబ్జము, లనవరతం బడ్డఁగలుగు నంతటిభాగ్యం
బనుపదమే తనరారెను, దనకై తా నన్నుఁబోలు ధన్యుఁడు గలఁడే. ౨౨౮
క॥ అని నెమ్మది నుప్పొంగుచు, ననుపముఁ డనఘుం డతం డపార్వతిఁ దేజం
బున మీఱుచు సత్పథమున, ననంతర మె కదలె జలరుహాసనవినుతా. ౨౨౯
క॥ వ్యక్తేతరకాంత్రుం డై, యుక్త మిదే యనుచు సంపదున్మేషకలా
యుక్తుఁ డయి రాను సేవా, రక్తుం డై వాఁడు చనియె రాజీవాక్షీ. ౨౩౦
క॥ ఎన్నెన్ని తనువు లెనసిన. నెన్నికఁ గన నైనఁ బుడమి నేలినఁ దుది నా
పన్నుఁడె యాఁ గా దది సం, పన్నత్వం బిదియ చూవె పర్వతతనయా. ౨౩౧
క॥ అని వల్లభుఁ డాటేఁగించిన, విని పార్వతి పిన్ననవ్వు వెలయఁగ నీ వ
య్యనఘుని శరణాగతి ని, ట్లనెదో యది వేగఁ గూర్చు మని వేఁడుటయుఁ గా.
చ॥ సుజనవిధేయ దర్పితనిషూదన తర్పితనాకలోక స
ర్వజనసమానలోక గుణవార్థి వివేకకలాకలాప భా
వజనిపకారశోషణ ప్రభావవాతేషణావృత్తిలక్ష్య మ్మ
త్య్వజయుని రాపదున్నతమహాబాదయునా యజయాసమాశ్రితా. ౨౩౩
క॥ పరమైశ్వర్యగుణాకర!
వరవిక్రమ యోగివర్య వర్ణితచరితా
సురుచిరమహిమాఢ్య శుభో
త్కరసంపత్ప్రభవ సఖిలకారణవిభవా. ౨౩౪

స్రగ్విణీ॥ శుక్లకర్మాఢ్యసంస్తూయమానక్రమా
విక్లబాప్రాకృతావేలవాక్ప్రౌఢిమా
యుక్తమాయత్నితావ్యాహతామేయస
త్యక్తిదిప్రాపితార్థశ్రితాంచద్దయా. ౨౮౨

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబునం
ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీశివాయగురవేనమః.

# శ్రీరామకథాఽమృతము

## యుద్ధకాండము.

—————:o:—————

### పూర్వభాగము - తృతీయాశ్వాసము.

———:o.———



శ్రీకరుణాయితవీక్షా
ప్రాకరణికవిషయవిజ్ఞభావాంచిత దీ
క్షాకలితార్థిజనానయ
నాకల్పితరామరక్షయఖిలాధ్యక్షా. ౧

ఆ॥ అవధరింపుమయ్య యచలేంద్రతనయతోఁ, నిట్టులనియె శర్వరీంద్రముకుటుఁ
డతివ! రామచరిత మద్భుతామృత మని, యనఁగలేరు లోక మరయువారు. ౨

తే॥ వనిత! యప్రాకృతార్థంబు వలనెఱింగి
ప్రాకృతేంద్రియార్థముల చేడ్పాటు దలఁచి
సకలసంత్యాగ మొనరించి చనియె నసుర
రాము సహాలక్ష్మణు మనోభిరాముఁ దఱియ. 3

ఆ॥ మెఱుఁగు మెఱసినట్లు మెఱయుచు మేరుశృంగాకృతిం దనర్చి యాకసమునఁ
దోఁచువాని వాని దోషాచరేంద్రుని, యనుజుఁ గనిరి వానరాధిపతులు. ౪

క॥ తనతోడివారితో నా, ఘనుఁ డైదవవాఁడు గాఁగఁ గనుపట్టఁగ నె
ట్టనఁ గపినాథుఁడు హరివరు, లనుఁ గొని చింతనకలాభిలాషుఁ డయ్యెన్. ౫

క॥ మతిమంతుఁడు దుర్ధర్షుం, డతులక్రియుఁ డొకముహూర్త మాలోచన మా
యతిఁ గూర్చి మతి నెఱపి స, న్మతులు హనూమన్ముఖులు వినఁగ నిట్లనియెన్.

సీ॥ కంటిరే వీఁడు మిన్నంటి సన్నద్ధుఁడై యుక్కునైఁ బరతెంచుచున్నవాఁడు
వీనితో రాక్షసవీరులు నలువు ర ట్లరుదెంచువారు నైవాయనగతి
మేటిశూరుఁడ కాని మేకొనఁబోవ డీయ్యర్థ మనాలంబ మనఁగఁబోల
దాకస్మికం బగు రాకయే వ్యాపాద మెఱిఁగించుచున్నది యింతవట్టు
మీరు బుద్ధిమంతు లారూఢిమై మించి
కాంచి దేశకాలకలన లరసి
తెలుపుఁ డిందుఁ జొచ్చి తెలిఁగించి తఱిఁబొంచి
యలఁచువాఁ డటంచుఁ దలఁచువాఁడ. ౭

మ॥ అను సుగ్రీవుని పల్కులన్వినఁగనే యవ్వానరు ల్లుత్తరం
బున సాలంబులు శైలముల్గొని దొరా! మున్నాడి యి మ్మానవ
మ్మనము ల్వ్రాంగెడు నిద్దురాత్ములఁ గలామాత్రమ్ములోఁ ద్రుంచి తె
ప్పున నప్పంటవలంతికిం బలియిడం బుణ్యాహ మూహించుచున్. ౮

ఆ॥ అనుచు వార లొంటఁ గనుచు నన్యోన్యసం, భాషణము లొనర్చి ప్రబలుచుండ
నావిభీషణుఁడు మహాబ్ధి యుత్తరపుఁదీ, రంబుఁ జేరసి యంబరంబు దొరసి. ౯

క॥ నిలువఁబడి మహాప్రాజ్ఞుఁడు, కలితమహాస్వరత పొనఁగఁ గానచ్చటి జా
వలనారసి సుగ్రీవు, న్వలీముఖులఁ గాంచి వలికె వానవవినుతా. ౧౦

ఆ॥ రావణుం డనం గరంబు దుర్వృత్తుండు, రాక్షసేశ్వరుండు రక్కసుండు
గలఁడు వాని కేనుఁ గడగొట్టుతమ్ముఁడ, నటు విభీషణాహ్వయశ్రుతుండ. ౧౧

ఆ॥ అతఁడు దెచ్చె సీత నాజనస్థానంబు, వలను బాపి గృధ్రవర్యుఁ దునిమి
దేవి రుద్ధ వివశ దీనయు నై యుండె, రాక్షసీజనాభిరక్ష వఱల. ౧౨

ఆ॥ వాని కరసి యొరసి వలయుహేతూక్తులు, నఱియఁ దెలిపినాఁడ నేఁటివఱకు
సీత లోకమాత శ్రీరామునకు జగ, న్నేత కొసఁగు మనుచు నతిపొసంగ. ౧౩

తే॥ కాలచోదితుఁడై వాఁడు కల్లనేసెఁ, బథ్య మగు నాపొనర్చిన భాషితంబు
హిత మగున యోగ్య మౌషధంబెందునేని,రోగి విపరీతుఁడై యొందురోయుచుండ

క॥ పరుసములు వలికె నెట్టనఁ, బరాభవంబునకుఁ గూర్చెఁ బాపుఁడు ననుఁ జా
కిరివానికన్న హీనపుఁ, దెరువున నదలించి తిట్టి తెరలించి వెసన్. ౧౫

క॥ ఇక్కరణిఁ ద్రోఁపువడి యే, దిక్కున్నక రామవిభుఁడె దిక్కనుమతి నా
చక్కటిదారసుతాదుల, నిక్క న్విడనాడి విరతి నిట రాఁగంటిన్. ౧౬

తే॥ సర్వలోకశరణ్యుఁడు సాధువత్స
లుఁడు మహాత్ముండు నగు రాఘవుఁడు వినంగ
వీఁడు శరణార్థి యని నాదు విధము దెలియఁ
బలుకుఁడో యన్నలార ! మీప్రాపు వెలయ. ౧౭

క॥ అని యిమ్మయి నొడివిన దను, జునిఁ గని లఘువిక్రముండు సుగ్రీవుఁడు రా
ముని లక్ష్మణసహితునిఁ జే, రినితాంతవ్యగ్రతం బొరిం దాఁ బలికెన్. ౧౮

— సుగ్రీవుఁడు విభీషణుఁ జేకొనవల దని సహేతుకముగఁ బలుకుట. —

ఆ॥ అరికిఁ బిన్నతమ్ముఁ డట విభీషణుఁ డని, పేరుఁగాంచెనట యభీకు లైన
నలువు రసురవరులు నలువంకలం గొల్వ, వచ్చినాఁడు శరణుఁ జొచ్చినాఁడు. ౧౯
తే॥ రావణావరజత్వోడి రభస మరసి, మంత్రిణవ్యూహనయచారమార్గయుక్తి
నెదిరి తమవారి పక్షంబు లెన్ని కడఁగి, నెఱపు మీకృతి నా గాత నీకు శుభము.
సీ॥ పొలదిండ్లు కామరూపులు దుష్టు లంతర్ధి నంది మిన్నందుదు రధికశూరు
లెదిరి వంచింపఁగా నెంతయు నేర్తురు విశ్వసింపఁగరాదు వీరి నెపుడుఁ
బ్రణిధి కావచ్చును రాక్షసేశున కీతం డనువిష్టుఁ డై భేద మందఁజేయుఁ
గా దేనిఁ దెలివిమైఁ గదిసి నమ్మించి నెట్టన ఛిద్రమరసి మడంపఁజూచుఁ
బేర్చు మిత్రాటవీమౌలభృత్యబలము, లెన్నియు గ్రహింప నగునుఁదీరెంచికడఁగి
కాని శత్రుబలం బెందుఁ గాదు చేర్పఁ, దతగుణోద్దామ నయసంద్యధామ! రామ !
ఆ॥ శత్రు వలను గడచి సన్నద్ధుఁ డై వచ్చె, భ్రాత ననుచు నీదు పక్ష మనుచు
నమ్మఁగూడు నెట్టు నాతండ్రి! యిమ్మెయి, మలకవాని నలికిపలుకువాని. ౨౨
తే॥ రావణప్రణిహితుఁ డై విరాజితుఁ డయి, వచ్చినా డిట్టు లోక్షమవద్వరేణ్య!
కుటిలమతి వీనితోఁ గూర్మిగూడ దనియు,నిగ్రహం బొప్పుననియు నానిర్ణయంబు.
ఉ॥ రాతిరి వేచి మేకొని యరాతి యులూకము వాయసంబులన్
బోతర మొప్పఁగా మడఁచు బోలెన సట్టులె లాతి యంతరం
బేటజె నైనఁ దాఁ బడయ నెంచును స్వేతరపక్షమందు దో
షాగతవృత్తిమైఁ దఱియనౌ నతని న్నెలకొల్పి రాఘవా. ౨౪

క॥ మాయావియు నిను నీతఁ డ, మాయికుఁగా నెంచి యొకట మలయించి ధృతిం
బాయక నమ్మించి తుది న, పాయం బొనరించుఁ దనయుపాయము మెఱయన్.

ఉ॥ కావునఁ దీవ్రదండమున ఘాతుకుఁ డౌ దనుజేంద్రు తమ్మునిం
గావ కడంచుటే తెరవు గల్గును మే లటులైనఁ గానిచోఁ
గావలుఁ డాదురాగతుఁడు కట్టిడి యై తలపెట్టినంత లా
నే వివరించినాఁడ నభినేతవు నేర్తువు నీవ యింకిటన్. ౨౬

ఆ॥ అనుచు రాముఁ గూర్చి యాహరివాహినీ, పతి పదార్థవేత్త పలికి రభస
మడఁచికొనుచునుండె నాదట మానంబె, యౌ నటంచుఁ దాని నవధరించి. ౨౭
తే॥ వాలి సుగ్రీవుఁ డటు నెఱి జాలుకొనఁగ
నోలి నొడువంగ విని కీర్తిశాలి యూర
ఘూత్తముఁడు హరివర్యుల నాత్తబలుల
హనుమదాదులఁ గని యిట్టు లనియె నగజ! ౨౮
ఉ॥ రక్కసుతమ్ముఁ గూర్చి కపిరాజు వచించిన దెల్ల వింటిరే
యక్కఱఁ గూర్చు పల్కు యది యంతయు నర్థ్యమె హేతుయుక్తమే
నిక్కమె యైనఁ గర్జమున నిర్ణయముం బొనరించుపట్లఁ గా
దొక్కని పైని భార మిడి యొడ్లొకఁ డాడక మిన్నకుంటయున్. ౨౯
ఆ॥ అర్థకృచ్ఛ్రముల సమర్థులు శ్రేయోర్థు
లట్లు సుమతు లనఁగ నౌ సుహృదుల
కొప్పు యుక్త మిది యయుక్తమిద్యది యంచు
స్వస్వమతము లొంట జాల్కొలుపుఁడు. ౩౦

—♦ రాముఁ డడుగ నంగదాదులు తమతమ మతములు సెప్పుట ♦—

క॥ అని రాముఁ డడుగ నాఘును, లనుపద మిట్లని రతంద్రితాత్ము లగుచున
మ్మనువంశమణి ప్రశంసం, బొనరించుచు హితముఁ గోరు బుద్ధి వెలయఁగన్. ౩౧
శా॥ అజ్ఞాతం బొకఁ డున్నె యెందు జగదధ్యక్షుండ వౌ నీకు సం
విజ్ఞత్వం బనదృక్షమైనను సుహృద్విఖ్యాతి మా కీయ లో
కజ్ఞత్వం బిటు చెల్లఁ జేసితివి నీకారుణ్య మిట్లాటఁగా
యాజ్ఞాబద్ధుల మైతి మిందఱము మిత్రాధ్యన్వయశ్రీకరా. ౩౨
తే॥ అధికశూరుఁడ వట్లు సత్యవ్రతుఁడవు, ధార్మికాగ్ర్యత విక్రమదర్పిమ నీక
చెల్లు నఖిలజ్ఞుఁడవె పరీక్షించి చేయు, దన సుహృత్పరతంత్రత యబ్బి మగు న.
క॥ ఈనీయడిగినయర్థముఁ, బూని వచించుదురుగాత బుద్ధికుశలు తె
ద్దానను సమర్థులును నగు, వానరవరు లొక్కొకఁడుగ వారనియుక్తిన్. ౩౪
క॥ అని వారలెల్ల నొడువగ, ననంతరము రాముతోడ ననె నంగదుఁ డో
యనవద్య! యరివలనివాఁ, డనఘుఁడె యాగాక తొలుత నగు శంకింపన్. ౩౫
సీ॥ ఓల మాసించిన ట్టుందురు ప్రచ్ఛన్నులై శఠబుద్ధు లొం డదనునందు
తఱివేచి ప్రహరింతు రౌర్కణగా నంతరంబు గన్గొని యుచిరంబె కడఁగి
కాన నీతని నమ్మ కాదు వర్తింపంగ నొంట నియోగించి యుక్తి నెఱయ
గుణదోషముల నెంచి కొలలు న వ్వానిలో గొన మెక్కుడైననోఁ గూర్చుకొనఁగ

దోష మెక్కుడైనఁ దోడ్తోన తరలింపఁ
జనునె కాని సాహసము పొసంగ
దనుచుఁ దలఁచువాఁడ నంతయు నీ
మది నరయుమయ్య రఘుకులాగ్రగణ్య. ౩౬

క॥ అన శరభుం డిట్లనె నీ, తనిదెస లోకద్రోహత ననిచి తత్త్వం బరయం
జను నావలివలనున నగు, ననువునఁ బొనరింపఁ జెల్లు నంతయు నధిపా. ౩౭

ఆ॥ అనిన శాస్త్రవేత్త యగు జాంబవంతుండు, పలికెఁ బాపుఁ డసుర బద్ధవైరుఁ
డతని యనుజుఁ డీతఁ డరుదెంచె నసమయ, మనక కాన శంక్యుఁ డవనినాథ. ౩౮

చ॥ అనిన నయానయజ్ఞుఁడు పదార్థవిశేషవిదుండు మైందుఁ డి
ట్లనె జని యల్లనక మధుర మౌ నుడి రావణుఁ గూర్చి యీతనిం
దొసుకక పృచ్ఛసేసిన నదుష్టమొ దుష్టమొ భావ మేర్పడుం
గని వివరింప నౌ తెఱఁగు గైకొనఁగా నగునయ్య రాఘవా. ౩౯

—♦ హనుమంతు నభిప్రాయము. ♦—

తే॥ అనిన నాదట సచివోత్తమాగ్రగణ్యుఁ, డధికసంస్కారసంపన్నుఁ డైన హనుమ
మృదుమధురతార్థవత్త్వాసమృద్ధ మైన, పలుకుఁబడి నెల్ల నిట్లనె భాసురాంగి. ౪౦

తే॥ నిన్నతిశ్రేష్ఠు సుసమర్థు నియమితాత్ముఁ, బలుక నేర్చినవారిలోఁ బ్రథమగణ్యు
నతిశయింపఁజాలఁడు బృహస్పతియు నంగ, దరమె యొకనికి రామచంద్ర! గుణసాంద్ర. ౪౧

క॥ వాదమునను స్పర్ధానం, భేదమునను వాగ్మియోపబృంహణమున ని
చ్ఛాదిప్రవృత్తిపరతనుఁ, గాదేను వచించుపొంటెఁ గడఁగుట రామా. ౪౨

క॥ నీదగు గౌరవమునను ని, వేదింతు యథార్థ మర్థవివరణ మిదియుం
గాదన కారయు మిం దా, మోదం బిసుపట్టునం బ్రముఖ్యం బెదియో. ౪౩

క॥ పలుదెఱఁగుల నీసచివులు, పలికిరి నయ మందునందుఁ బరికింపనగుం
దొలుత సమాగతునిఁ బరీ, క్షల కిడి చేర్చుకొను టన్నజను మహాత్మా. ౪౪

ఆ॥ ఏనియోజ్యమందు నేని నియోగింప, కరయఁ బోల దతని యంతరంగ
మదియుఁ గూడు నెట్టు లాకస్మికం బౌట, నైన నవధి గలదె యట్టిక్రియకు. ౪౫

క॥ చారప్రణిధానాత్మక, కారణ ముపయుక్త మనుట గాదెన్నఁగ నం
చారణ మేల యెదుట వా, చారంభణముం బొనర్చు నాతనిదెసకుం. ౪౬

ఉ॥ ఈతఁ డదేశకాల మన కీదెస కిట్లరుదెంచె నంచు మీ
రీతఱిఁ బల్కిరప్పలుకు నెంచి వచించెద దేశకాలముల్
బ్రాఁతిగ నివ్విధే యనచుఁ బౌరుషమందలి దోషగణ్యతల్
నేతలపట్లఁ దా నరసి నెట్టన రానగు చొప్పు చొప్పడం. ౪౭

తే॥ అచటిదౌరాత్మ్య మిచ్చటియతిశయితము, విక్రమము బుద్ధి నెంచి యుద్యోగమునను
వచ్చుటయె యుచితం బనవచ్చుఁగాదె, నేర్చి మెలఁగెడివాఁ డెందు నెగడకున్నె.

క॥ అజ్ఞాతరూపులుగఁ జని, ప్రాజ్ఞతమై నడుగఁ దేటపడును దదీయం
బౌ జ్ఞాతభావ మని రది, విజ్ఞతమై నెంచిచూడ వెలయు దధీశా. ౪౯

తే॥ అడుగువానికిఁ జెప్పెడునతఁడు చాలఁ,
డెంతధీమంతుఁడును నాగ నెనసి యరుమ
మంచివాఁ డైన హితుఁ డైన మాఱుపడునుఁ
దోఁచితోఁచనిగతివంక దూష్యుఁ డగుచు. ౫౦

తే॥ వక్రిభావంబు తనమది వఱలుచుండ, నేర్చి యడిగిన నదియును నిష్ఫల మగు
నతఁడు నమ్మియి యర్థంబె యనువుపఱుప, నెదిరితత్త్వమేర్పడమియ కుదురుపడుట.

ఆ॥ వీఁడు పలుకుచున్న వాఁడు తెల్లముగ స్వ, వృత్తి మెల్ల నెందు వెదకిచూడ
దుష్టభావ మింతఁ దోఁకోనబోదు ప్ర, సన్నముఖుఁ సత్వ మెన్నఁగడఁగ. ౫౨

తే॥ స్వస్థుఁడు నశంకితుఁడు గాఁగ శఠుఁడు మెలఁగఁ
జాలఁ దుష్టియు దుష్ట గా కేలనిలుచు
నాఁగిన నడంగునే తన దైన వికృతి
యాకృతియె నిజ మాంతరం బనువదింప. ౫౩

ఉ॥ కావున దేశకాలములఁ గాంచి ఘటించిన కర్జ మెట్టులుం
బోవక సిద్ధి మైకొను బ్రసిద్ధుఁడ వారయుమయ్య దుష్ట యా
రావణు వృత్తి నీనెఱి పరాక్రమముల్ ఘను వాలిఁ ద్రుంచి సు
గ్రీవుఁ బ్రభుం బొనర్చుటయు గీర్తిత! తావకకీర్తి నెంచుచున్. ౫౪

క॥ నినుఁ గొలువవచ్చె నీతం, డనయము నయవేత్త రాజ్య మన్యాహార్యం
బని తలఁచి కాన వీనిం, గొననగు నని నే నచింతు గుణరత్ననిధీ! ౫౫

ఆ॥ ఇతని యార్జవమ్ము నింతవట్టుఁ దలంచి, పలికినాఁడ దెఱఁగు పరఁగు నిట్టు
లని స్వశక్తియుక్తి నాదట శేషార్థ, మెల్ల నీదు బుద్ధి మెఱుఁగు నధిప! ౫౬

క॥ అని వాయుజుఁ డెఱిఁగించిన, విని దుర్ధర్షుండు రామవిభుఁడు ప్రసాదం
బునఁ బొనరి యాత్మనిహితం, బనఁ జను శ్రుత మొలయ నిట్టు లనె వేదశిఖా.

—♦ శ్రీరాముఁడు తన యభిప్రాయముం దెలుపుట ♦—

తే॥ ఏనును విభీషణుంగూర్చి యెదియొ కొంత, పలుక నెంచితి నదియెల్ల భావవిదులు
మీరు నాశ్రేయముం గోరి మెలఁగువార, లందఱును విని తాత్పర్య మరయువారు.

సీ॥ శరణార్థి నని మైత్రి నలుప నేతెంచిన వాని నెప్పాట నే వదలఁజాల
నవ్వాని దెస దోస మతిభరం బనఁగ నై యుండిన నైన దక్కొండె యైన

నిది గర్హితం బని మున్నరు సత్పురుషులు శ్రుతినిర్ణయంబు బొలసియుంటఁ
దను వనిత్యం బని తలఁచియు నభ్యాగతునిఁ ద్రోవఁ బున్నెంబు దొరయఁగలదె
యిదియు శోఁచుచున్న దీనాదు నెమ్మది, బరమధర్మ మనుచుఁ బాటిసేయు
పొంతె మెలఁగుచుంటఁ బో దొంట నిమ్మెయి, పలుకునలుక దానఁ బడసినాఁడ.

క॥ అను పద మనుపదమే కాని, యనుమర్శ మొనర్చి యిట్టు లని సుగ్రీవుం
డును నిదియు శుభతరం బా, నన నను వగు పలుకుఁబడి బయల్పడఁ బఁడతీ. ౬౦

తే॥ తొలుత దుష్టుఁడ యేని నదుష్టుఁడేని, నెఱిఁగలదె యీతఁ డెట్టు రజనీచరుఁ డగు
నీదృశం బగు వ్యసనంబు నెనసియున్న, యన్న విడనాడునే యింత యరయవలదె.

క॥ నెట్టన విడఁదగఁ డనఁ దగు, నట్టిఁడు విం దెవడు వీని కగపడు నింకన్
గట్టిడియై మొందఱని, ట్టట్టొనరింపం గలాఁడొ యనవద్య! యనన్. ౬౧

క॥ ముష్టులు గులికెదు దీనికి, నద్ది గలదె యనఁగ నెగడి యొఱపొందెడు న
వ్వద్దిర యన నందఱఁ గని, తద్దయు లక్ష్మణునితోడఁ దా నిట్లనియెన్. ౬౩

క॥ అసత్యపరాక్రమునకె, నాసత్య సదృక్షునకె ఘనశ్రీకునకే
భాసురశుభలక్షణునకె, యీసంభాషణము పొసఁగు నగరాజసుతా. ౬౪

తే॥ శాస్త్రములు నెల్లఁ జక్కఁగాఁ జదువకయును, వృద్ధులైనట్టి ఘనుల సేవింపకయును
నీహరీంద్రుఁడు పలికిన యిట్టిపలుకు, పలుక శక్యంబె యొంటికెప్పాటనైన. ౬౫

క॥ తమ్ముఁడ! యైనను సూక్ష్మత, ర మ్మగు నర్థమ్ము సకలరాజులదెస దృ
ష్టమ్మగు లౌకికమును నై, యిమ్మగుచున్నయది యదియు నెఱుఁగవలెఁ జెదన్. ౬౬

తే॥ తనకొలమువార లటు లనంతరనృపతులుఁ, బగతులే యని కీర్తింపఁబడుదు రెందు
నిరు తెగలవారు వ్యసనమ్ము లెంచినొంచి, యర్థముం గొన నభికాంక్షు లగుటకతన.

క॥ అనఘు లగు నృపులు జ్ఞాతుల, ననయము హితమెంచి యర్థి నభినందనముల్
పొసరించుచుండు రమ్మెయి, జన మనవద్య మన నైన శంకింపఁజనున్. ౬౭

క॥ పాపాత్ముఁడు నష్టుఁ డతం, డేపున నెప్పాట నదిరి నెదఁగై కొనబోఁ
డావగది వైరవు మెయి రా, నోపు ననన్వచ్చు నొంట యుక్తం బగుటన్. ౬౮

తే॥ వినుము సుగ్రీవ! నీనుడి విశ్రుతంబ, యరిబలాదాన మగు దుష్టమన్న నెఱినిఁ
దెలుపువాఁడ నేనను నొంను తెఱఁగున నది, శాస్త్రదృష్టంబ యై మేలిజాడ నగడ.

ఆ॥ తా మనంగగులము కాముతత్కుల జుల, మిట్టి మనలఁ జేర నితఁడు రాజ్య
కాంక్షి యగుచు వచ్చెఁ గానఁ గై కొనఁదగు, ననురులందుఁ బ్రాజ్ఞు లరయఁగలరు.

శా॥ అవ్యగ్రత్వమునం దనర్చినఁ బ్రహృష్టాంతర్యులై యున్న సం
భావ్యుల్ గారెటు నెందు జ్ఞాతు లెపు డాపన్నత్వ మా నప్పుడే
నవ్యత్వం బెనయంగలారు గత మున్నంబోరు సంగాతు లా
భవ్యుల్ ద్రారె యహాతు లోదు రను సంవాదంబు గన్పట్టెడిన్. ౭౧

క॥ కావున నీతఁడు వెఱపడి, యే వచ్చినవాఁడు తెలుప నెడపడి కుపితుం
డై వెడలనడవ నెడలిన, యావిధము న్నొడివె గ్రాహ్యుఁడగు నెట్లైనన్. ౨౩

తే॥ భ్రాత లందఱుఁ దాత ! మాభరతుఁ బోల, రట్లు తండ్రికి మద్విధు లైన పుత్రు
లెందుఁ గనుపట్ట రెదిమెట్టు లెన్నఁబడిన, నిన్నుఁబోల్పనౌ సుహృదు లేనియుఁ లేరు.

క॥ అని రాముఁడు వచియించిన, విని సుగ్రీవుఁడు బిట్టు వెఱచి సుమిత్రా
తనయుం గాని నిలబడి వం, దన మిడి యిట్లని సభిజ్ఞత దనర్పంగన్. ౨౫

—♦ సుగ్రీవుండు మరల విభీషణుఁ జేర్పవలదని రాముని బ్రార్థించుట ♦—

సీ॥ ఇతఁడు విభీషణుం డిచటికి రావణుం డంపఁగాఁ జేరసిన యతఁడె సుమ్ము
ఘాతుకుం డగు వాని కడగొట్టుతమ్ముండు రాక్షసుం డనికాక రాతివశుఁడు
నమ్మినవారలు నాశ మొట్టుట వీరికాలమున నెన్నఁగోఁ గూర్చినదియ
బొచ్చి యంతర మెటో చూచి విశ్వస్తుల మని నిన్నొ నన్నొ యియ్యనుఁగుఁదమ్ము
కుజ్జనో నేఁట రేవటఁ గూల్చి యరుగు, వాఁడ కాని రిత్తకు రిత్తపోఁడు తనకుఁ
దోడు వచ్చినవారలు ధూర్తు లగుచుఁ, దోడుపాటౌనకూర్ప నిర్ధూతపావ ! ౨౬

క॥ అని మిన్నకున్న హరిపతిఁ, గని యన్నయకోవిదుండు ఘనశుభతరవా
క్యనిరతుఁ డిట్లనె రాముఁడు, మన మౌదార్యాబ్ధిపూరమగ్నతఁ బొదలన్. ౨౭

—♦ శ్రీరాముని నిశ్చయము ♦—

ఆ॥ దుష్టుఁ డౌనుగాక దుష్టుఁ డౌఁగాక న్వా, రాక్షసత్వ మెగువ రాఁడు నెఱవ
నెంచుఁగాక వీఁడు గొంచెమేనియుఁ గీడు, సేయలేఁడు నాకు సిద్ధ మిదియు. ౨౮

మ॥ జగతిన్ దానవయక్షరాక్షసపిశాచ బ్రహ్మరక్షోంతరి
క్షగతుల్ మొత్తము లై కడంగిన సుర ల్నాయం బొనర్పంగ నే
వగ నేనిం దలకొన్న నొక్కఁడన యే న్వ్రాకుచ్చి యగ్రాంగుళిం
దెగఁజూతు న్నిజ మిట్లె ముజ్జగములుం దీర్తు న్సృజింతుం బొరిన్. ౨౯

క॥ పరఁగెడు పవిత్ర మై జగతిన్, శరణార్థిత్రాణపుణ్యసందర్భం బా
చరితం బొక్కఁడు మహితం, బరయుము విని దానఁ దనరు నర్థం బెల్లన్. ౩౦

సీ॥ ఒకయరణ్యంబునం దొక్కకిరాతుండు మృగయార్థ మరిగెను మిత్తివోలె
వలవైచి పక్షుల నలము నయ్యొక్కట్టునం దొక్కతె కపోతి యాకపడియెఁ
దనభర్త గానములు దలఁచి వాకుచ్చుచు ఘూర్ణిల్లుచుండ నక్కూర్మి మెచ్చి
యాకపోతం బట్ల యడలెడునది యింక నేను ధన్యుఁడ నని నెఱయు నంత
గాలివాన వొడమి కడ లెడలింపఁగఁ, దొడరి వెల్లివిరిసెఁ దోన యచటఁ
జిక్కి లుబ్ధకుండు సీతున నొదుఁగుచుఁ జేరె నప్పులుంగుచెట్టు దరికి. ౩౧

క॥ చావున కెదురై యుండిన, పావురపుం బెంటి పతికిఁ బరమహితం బౌ
నావల నుపదేశించెను, దావల మగు పుణ్యలోకతాత్పర్యమునన్. ౮౨
సీ॥ ఈతఁడు మనయిక్కకే తెంచియున్నవాఁ డతిథియై యట్లుగా కార్తుఁ డగుట
శరణార్థియైనాఁడు చావున కగ్గమౌ వీనిఁ గాపాడుట వెరవ కాదె
నిన్ను బోటికి నన నెలఁత పల్కులఁ బక్షి నెఱిఁ గాంచి యవ్వాని నెఱసి యన్న!
కాఱియపడెదె మే ల్గావింతు దలఁకకు మని బుజ్జగించి యవ్వనముపొంత
పల్లె కరిగి నిప్పు పాటిల్లు పుడకలు జేర్చి మంటసేసి సీతు వాపి
యాకటం గృశించి యలమటపడెడు నయ్యనద కిట్టు లనియె నావులుంగు. ౮౩
క॥ మే నగ్గి వైచి పక్వం, బే నొనరించెదఁ బ్రసక్తి నిష్టార్థం బౌ
దీని భుజియించి నీదగు, దీనత్వముఁ బాపికొనుము తెరలకు మింకన్. ౮౪
ఆ॥ అనుచుఁ బూజసేసి యగ్గిని వలగొని, యందు బడియెఁ బక్కి యక్కథాంశ
మరసి బోయ వత్రు లన్నింటి విడచిన, సహాగమంబు దాని సతి యొనర్చె. ౮౫
క॥ ఇరువురు దివ్యవిమానము, వెరయ నధిష్ఠించి తో దివికిఁ బోయిన నా
వెరవరి యనశనదీక్షం, బరఁగి సుగతి వడసె నపుడు ప్రాజ్ఞులు మెచ్చన్. ౮౬
క॥ భార్యాహర్తఁ గిరాతుఁ గ, దర్యము కాకట్లు బ్రోచె నండజ ముఖ్యం
డార్యులు వొగడఁగ నన నీ, యార్యమకులుఁ డింతమాత్ర కైనం దగఁడే. ౮౭
ఆ॥ వానరంబు గాచె వ్యాఘ్రభీతుని నొక్క, నరునిఁ దన్నుఁ ద్రోచి నయముఁ బాఁచి
నట్టివానిఁ జక్కనయ్యెఁ దాఁ దనదగు, పలుకు నెఱపఁ జెట్టుపైకిఁ జేరి. ౮౮
క॥ బ్రాఁతిగ నొకవానర మటు, నీతిమెయి న్మెలఁగె ననఁ గనీ వల్పుఁడవే
కాతర్య మేల మేటివ, నీతరమున వారలం దనిందితచరితా. ౮౯
ఆ॥ కణ్వసుతుఁడు ఘనుఁడు కలఁ డొక్కమునివర్యుఁ, డతనిచేత గీతమైన గాథ
వినుచువాఁడ దాని విను మది సమకూర్చు, సత్యధర్మమార్గసంశ్రయంబు. ౯౦
తే॥ దీనుఁడై దోసిలొగ్గి యధీనుఁ డగుచు, శరణుఁజొచ్చితి ననువాని శత్రునేనిఁ
జంపఁ జూచెడు నతఁడె నృశంసుఁ డనఁగఁ, గాని యొండొక డట్లును గాఁడు నిజము
తే॥ ఆర్తుఁడై యేని దృప్తుఁడే యయ్యునేని, శరణనినవాని నరిసేనిఁ జంపఁజనదు
తన యసుబు వోవనైన సద్ధర్మవేత్త, లట్టివాని సంరక్షింతు రభయ మొసఁగి.
ఆ॥ మోహముననొ కామముననొ భయమ్మున, నో సనత్త్వుఁ డయ్యు నొవ్వనాడి
మనుపఁ దలఁపఁడేని మానని దా పాప, మతని కదియె గర్హ్య మదియె జగతి.
క॥ రక్షింప ననినవానిన, మత్క్షణంబున రక్షుఁడైన యాతఁడు సెడ నా
నాక్షణమునఁ దత్సుకృతం, బక్షీణం బొడిచికొంచు నరిగెడుఁ బలుకన్. ౯౪
చ॥ పరఁగెడుఁ బాప మిన్నిటికిఁ బ్రపన్నుల రక్షణ సేయకున్న న
వ్వరుసన వీర్యముం బలమును వారని పున్నెముఁ గీర్తియుం జెడున్

బరమము సూక్ష్మధర్మమిది పాయఁగఁ జూతుసె మానివర్యుఁడే
గురుఁ డని నమ్మి యవ్విధికిఁ గూర్తునఁగా కిఁక వేయునేటికిన్. ౯౫

తే॥ ఇదియె ధర్మిష్ఠ మిదియె శ్రుతీరితార్థ, మిదె యశస్యం బిదియె స్వర్గ్య మిష్టఫలము
గాన నిద్దాని విడనాడఁ గంటినేని, నాదుపుట్టున కొండొక్క నయము గలదె. ౯౬

క॥ రఘువులు శ్రితరక్షణమున, లఘువులు గా రెప్పు డది యలంఘ్యమ గురు ల
ట్లఘ మడఁచు నెఱిన కాచే, మఘవార్చితు లనఁగఁ గనిరి మాన్యత్వ మిలన్. ౯౭

ఆ॥ ఒక్కపరిఁ బ్రపన్నుఁ డొదఁగి నీవాఁడ నే, ననుచు వేఁడువాఁడు నైన వాని
కభయ మొసఁగువాఁడ నఖిలభూతములందు, నిదియ మద్వ్రతము సమీహితమ్ము.

క॥ అభయం బిచ్చితి వీనికి, సభయత్వము వోల దింక శరణార్థిదెసన్
శుభ మాఁ దోడ్తె మ్మితఁడు, విభీషణుఁడొ రావణుఁడొ వివేచన మేలా. ౯౯

తే॥ అన్న హరివర్య! తనదు మర్యాద వెలయ, నీవె సంబోధన మొనర్చి నియతి నర్థి
నర్థిఁ గొనిరమ్ము దాన సర్వార్థములు ఘ, టించు నమ్ముము లేలెమ్ము లోక మునక.

—♦ శ్రీరాముని ధర్మబుద్ధిఁ గొనియాడి సుగ్రీవుఁడు విభీషణుఁ దోడితెచ్చుట. ♦—

క॥ అను రాముని యనుభావ, మ్మున మునిఁగి హరీశ్వరుండు మొనకొని సౌహా
ర్దనివేదితార్థుఁ డై యి, ట్లనె బరవశ మెసఁగ గిరివరాన్వయభూషా. ౧౦౧

ఉ॥ ఇందాక చిత్రి మున్నదియె యెల్ల యెఱుంగుదు లోకరక్షణం
బందియ వెట్టి కైకొనినయట్టిద మున్నె సుఖావహుండ వీ
వందఱ కార్యసందితుఁడ వంచితసత్త్వుఁడ వాఢ్యసత్పథం
బంది తరాతి నాఁకవదు టాటయ నీ కవు నింక రాఘవా. ౧౦౨

క॥ సంతోషించితి నఘపద, సంతమసం బెడలె నీదు సౌహార్దరసా
భ్యంతరబోధోదయమున, నెంతకుఁ జాలవు మహాత్మ! యినకులతిలకా. ౧౦౩

మ॥ అనుమానైకనిమగ్నమైన మన మి స్సత్యంతశుద్ధంబుగాఁ
దనరెన్ వీఁ డతినిర్మలుం డనుచుఁ దాత్పర్యార్థ మూహించెడిన్
ఘనతేజుండవు నీదు పల్కుఁబడి వీఁకన్ శ్రౌతధాతత్వమున్
బొనరింపన్ ధృతి బెంప నై నెగడఁ జిద్భ్యాతప్రసాదాంచితా. ౧౦౪

తే॥ తోడరినదె తప్పితండు మాతోడివాఁడ
సఖ్య మొనగూర్పుమయ్య మాసంఘమునకు
వీనితోడిద బ్రదు కంచు వెలయువార
మింక నేవంకయును లేదభీష్టవరద! ౧౦౫

క॥ అని కపినాథుఁడు వచియిం, చిన జగతీనాథుఁ డిచ్చఁ జెలగె విహగనా
థుని మైత్రిఁ గొని పురందరుఁ, డనుపమధృతి నందె నిట్లె యనఁ దగి మగుడన్.

ఆ॥ తరణిసుతుఁడు రామదత్తాభయప్రదా, నోక్తిపూర్వకముగ నోజ మెఱయఁ
బిలిచె వరపక్షా విభీషణా ర మ్మంచు, సంచితాదరప్రసక్తి నెగడ. ౧౦౭

ఉ॥ సన్నుతగాత్రుఁ డై తొడఁగు సంభ్రమ మచ్చుపడంగఁ బ్రాజ్ఞుఁ డం
చన్నయుఁ డవ్విభీషణుఁడు సమ్ముద మాస్య మలంకరింప నా
యన్న గ్రహించెనే సుకృతి నై తిని యే నని తోడిభక్తులుం
దిన్నఁగ గూడిరా నిలకు దిగ్గన డిగ్గె ధరాధరాత్మజా. ౧౦౮

—♦ విభీషణ కృతరామ స్తవము ♦—

క॥ బడుగు లగువారి నడుగునఁ, బడనీక భరించు రామభద్రుని సిరి యే
ర్పడఁ దొడుగు తొడవులం గనె, నడుగుందమ్ములనె త్రొత్త నతఁడనుఁగులతోఁన్.

సీ॥ ధామవిధ్యాంతరతత్త్వం బనఁగఁ జెట్లు శ్యామలాకృతిసరసత్వ మొప్పఁ
జూడ్కి మైకొనినట్టి శుభ్రితసంప్రదాయమ్ము ముఖపద్మలక్ష్మి యిమ్ముగ వచింప
ధనువు బాణంబులుఁ గొని జాణ యా వింత శాంతి యాశాంతసంక్రాంతికాలయుఁ
దమ్ముఁ గొల్పించు నందమ్ముచందమ్మునఁ దమ్ముఁగుఱ్ఱని యాశ్రయమ్ము నెగడ
దాణ బెద్దలు పేర్కొన్న రామనామ, సారపరమార్థ మెదుర సాక్షాత్కరింప
ననలఁగనె వాఁడు కనులకయ్యాదనునందుఁ, బున్నె మిడినట్టి కలిమినంభోరుహాక్షి.

క॥ అనలుగురశౌ నిజశిర, మానఁగ నంఘ్రులకు మ్రొక్కి నదె సాష్టాంగం
బై నెగడె నవనిపై మును మే నరయక వ్రాలఁజేయు మొలకువఁ గలికీ. ౧౧౧

క॥ నంజలి దొఱఁగితి నని బ, ద్ధాంజలిపుటుఁ డగుచు నిలిచి యానమ్రిత యా
సంజనసకలేప్సిత మై, మంజిమ నెగడంగఁ బొగడె మహిలామణిరో. ౧౧౨

సీ॥ అర్పింతు నంజలు లఖిలాధినాథ శ్రీరామ! సీతామనోరామ! నీకు
సారింతుఁ బ్రణతులు చండకోదండప్రచారితసాధువాత్సల్య! నీకు
మొనయుంతుఁ గేల్మోడ్పు లనుపమామితధామసుగ్రీవమిత్రసంస్తుత్య! నీకుఁ
గావింతు శరణులు కల్యాణగుణనామరూప! భానుకులప్రదీప! నీకుఁ
గూర్తు జేజేలు జేజేలకొఱకు స్వీకృ, తాధ్యవివిధావతారుఁడ వైన నీకు
నిడుదు వందనములు జగదిష్టివృష్టి, కారణాకృతులనా నించు ఘనుఁడ! నీకు.

క॥ నినుఁ గంటి లోకజనకుఁడ, ఘనాదిగృహమేధ! యిపుడె యను వారసి య
ప్పన మొనరించెదఁ గొను మి, మ్మన మింద్రియములును మేను మహదాదిపరా.

ఆ॥ నీవె జగతి నియతి నెఱయింతు వెలయింతు, వాహరింతు వట్లె యధివసింతు
మెలఁగె దిచ్చ మెయిని మేలౌ కీడౌ నిదు, చరిత మబ్రమందుఁ జర్వ గలదె.

ఉ॥ లో వెలి నిండి భూతములలో విహరింతు జగన్మయాత్వ మీ
వావిఁ బొసంగె వ్యాప్య మటు వ్యాపక మం చనుభావ మొప్పఁగాఁ

కేవలతత్త్వమూర్తి వని కీర్తనముం బొనరింతు రాద్యులా
త్రోవ లెఱుంగనేర నని త్రోవక పోవవె భవ్యభావనా. ౧౧౭

ఆ॥ నీదుమాయ గ్రమ్మ నెఱిమాలి యెఱుకలే, కపహతాత్మచిత్తు లగుచు నెపుడుఁ
బుణ్యపాపవశతఁ బుట్టుచు గిట్టుచు, నుందు రొకట దార మందలేరు. ౧౧౮

ఆ॥ అంతవఱకుఁ దోఁచు నాశుక్తి రజత మ, ట్లంతయును జగం బనంత మనుచు
నీదుసత్త్వ మెఱయ నెఱ్ఱఁగను దృఢబుద్ధి, యెంతవఱకుఁ దెరయ కెడసియుండు.

క॥ నీతత్త్వ మరయ కే యవి, నీతత్త్వమునన్ గృహాదివిరతు లయి సుఖ
ఖ్యాతము లఘుపరములు నగు, నాతంకము లందుచుందు రంద అవశతన్. ౧౧౯

క॥ నీవే యింద్రుఁడ వగ్నివి, నీవే యముఁడవు నిరృతి వనిలుఁడవు నీవే
నీవే త్ర్యంబకసఖుఁడవు, నీవే రుద్రుఁడవు నీవె నిఖిలము దేవా. ౧౨౦

సీ॥ నీవుసూక్ష్మముకన్న నెగడెదు సూక్ష్మమై స్థూలంబుకన్నను స్థూలతరుఁడ
వఖిలలోకములకు నారయఁ దల్లివి దండ్రివి నీవె యాధాత వీవె
యాదిమధ్యాంతంబు లని లేవు నీ కెప్డు హరి వవ్యయుఁడ వీవె యచ్యుతుఁడవు
పరిపూర్ణుఁడ వపాదపాణివి జవనుఁడ వటు గృహీతవు శ్రోత వశ్రవణుఁడ
వన్న! ద్రష్ట వదృష్టి వీ వజున కైన, జనకుఁడ వధీశ్వరుండవు చాలుఁజాలు
నెన్నఁగా నైన నెఱి కొలం దున్నవాఁడొ, యున్నవాఁడని నీవ్యక్తి గొండ్రు రాము!.

వ॥ దేవా! నీవు పంచకోశంబులకు వ్యతిరిక్తుండవై ప్రకృతికిం బరుండ వగుట నిర్గుణుఁ
డవు నిరుపాధియుండవు నిర్వికల్పుండవు నిర్వికారుండవు నిరాధారుండవు నిరీశ్వ
రుండవు షడ్భావరహితుండవు ననాదిపురుషుండవు ననం బరఁగుచుండుదువు
స్వమాయచే నిగుహ్యమానుండ వై ననుఁబోంట్ల భాగధేయం బమేయంబుగాఁగ
మనుష్యాకృతి వై నెట్టన నిట్టి నెఱిం జూపట్టితి వాయీసదుపరతత్త్వరహస్యంబు
దెలిసి కని కలిసికొనువారలే వైష్ణవాగ్రేసరు లనం దగి పరమపదం బనం జెల్లు
ముక్తిస్థానంబలంకరించువారు నేనును భ్రాంతిచే నవనీతుండనై యుదారదారపుత్ర
బంధుపరివారగృహవిత్తంబుల విడనాడి లంక నపవాదపంకంబున ముంచి భవ
ద్వ్యపాదారవిందసేవాభిరతుండ నై సర్వభూతశరణ్యు నిన్ను శరణుఁ జొచ్చి వేఁడి
సద్భక్తినిశ్రేణిక నండగొని జ్ఞానయోగావలంబనంబున నమ్మహాసౌధం బధిష్ఠింపఁద
లంచుచున్నాఁడ నక్షీణవిభవా! రక్షింపుము దీనపోషణవిచక్షణా! ప్రాణ
మానంబులు భవదధీనంబులు సుమీ పరమేశ్వరా! నశ్వరునిం జేయకుము
రాఘవేంద్రా! యమోఘఫలప్రదాతవు గమ్ము సీతాపతీ! నమస్కారము
కారుణికోత్తమా! దోసి లొగ్గితి రావణారీ! విన్నపంబు సేసికొంటి శ్రీరామా!
యమాయికుఁడను. తారకనామా! భవసాగరనిమగ్ను నుద్ధరింపుము. ౧౨౨

—♦ శ్రీరాముఁడు విభీషణున కిష్టవరము లొసంగుట. ♦—

క॥ అని కొనియాడెడువానిం, గొని యాడెడుతలఁపు మలయఁ గువలయపతి రా
మన సుప్రసన్నుఁ డై యి, ట్లనియెం దనభక్తవత్సలాత్మత వెలయన్. ౧౨౩

ఉ॥ అన్న! విభీషణా! సుకృతి వైతివి తేర నయం బిదేర నీ
కన్నఁ గలారె చుట్టములు గంటివి మంటి వనమ్ము గొంటి రా
మన్ననుఁ గన్నవారి కెది యారయ రానిది కోరు మిచ్చపై
నున్నవరమ్ము నమ్ము మిఁక నోడకు మెందును లే దపాయముల్. ౧౨౪

క॥ అని తన్నుఁ గనులఁ ద్రావెడు, ననఁ గాంచెడు రాముఁ గాంచి యతఁడు ప్రహర్షా
బ్ధినిఁ దేలుచుఁ దద్వీచిక, లన వాక్కులనలు వొసంగ నాదటఁ బలికెన్. ౧౨౫

క॥ ధన్యుఁడ నన్మాన్యుఁడ మా, ద్ధన్యుఁడ నేఁ గృత్యవిత్ప్రధానుల కెల్లన్
నాన్యమతి సకలకుశలవ, దాన్యము లీపదము లరసి దలఁచియుటకతనన్. ౧౨౬

ఆ॥ రామ! నీదురూపు రహిమీఱఁ గనుఁగొంటి, నింతకన్న ధన్యుఁ డెందు గలఁడు
సుకృతవంతుఁ డంచు శుద్ధాత్మకుఁ డటంచు, నన్నుఁ జెప్పికొన గొనంబు గలదు.

ఆ॥ కర్మబంధనాశకరము త్వద్జ్ఞానంబు, భక్తిలక్షణంబు పరమవస్తు
వైన ధ్యానమును మహాత్మ! నా కొనగూర్పు, మనియు చాలు వేయు నవల నేల.

క॥ యాచింప విషయసంభవ, మై చను సుఖ మెదియు నొసఁగు మని వేఁడెద నో
రాచిలుక! రామ! నియతిం, శ్రీచతురఁ ద్వదంఘ్రిభక్తి శ్రితజీవనికన్. ౧౨౯

క॥ ఓమని యామెయి నొసఁగెద, నేమంబున ననియు నని సుస్మితుఁడు రఘు
గ్రామణి వెండియు నిట్లనె, సామంతు నొనర్ప నెఱప్రసాదము నెఱయన్. ౧౩౦

సీ॥ విను మోవిభీషణ! వెఱవు నీ కెఱిఁగింతు నది నిశ్చితము భద్రమతిరహస్య
మాంతరంగికులు నా కొందరు శాంతులు వీతరాగులు యోగవేత్త లెపుడు
వారిచిత్తమునందు వసియింతుసీతతోఁ జిత్కళ లూరంగ శ్రీ దలిర్ప
సంశయింపఁగ నేల చాలితి వన్నిఁట శమితకల్మషుఁడవు శాంతిపరుఁడ
విచ్చమెయి నిచ్చలును నన్నెయెదఁ దలంచి ధ్యానమొనరించి లక్ష్యసిద్ధ్యానమొంచి
మించి సుఖవృత్తిమెయి నిస్తరించె దీవు, సత్వరమె ఘోరసంసారసాగరంబు. ౧౩౧

క॥ ఈస్తోత్రమ్ముఁ బఠియించిన, నిస్తులులు లిఖింప వినఁగ నెక్కొను ఘనులున్
ధ్వస్తాఘు లగుచు నగుదురు, వాస్తవ్యులు మన్నివాసవరమున నెపుడున్. ౧౩౨

క॥ ఆనందించితి నీ వటు, లానందోన్నతిఁ దనర్తు వధి సామ్రాజ్యం
బే నొసఁగినాఁడ మున్నుగ, నీనిర్మలభావ మరసి నిభృతవికాసా. ౧౩౩

—♦ విభీషణపట్టాభిషేకము. ♦—

ఆ॥ అనుచు భక్తభక్తుఁ డౌచిత్యసంధాత, ఘనుఁడు రాముఁ డనుజుఁ గాంచి మించి
సాగరమ్ము జలము సరగునఁ గొనిరమ్ము, లెమ్ము నిశ్చితమ్ము రెమ్ము కొసఁగ.

క॥ ననుఁ గన్నఫలము దోడనె, యనుభవ మందఁగఁజేయ నగుఁ గావున నె
మ్మనమున లంకారాజ్యం, బున వీని న్నిలుపఁ దలఁతు పట్టి న్వలనై. ౧౩౫

ఆ॥ ఎంతవఱకుఁ జంద్రుఁ డినుఁడు మేదినియును, రామకథయు నిలుచు రహిఁదలిర్ప
నంతవఱకు నితఁ డనంతరుఁ డై లంక, నేలఁగలఁడు మత్సమీహితమున. ౧౩౬

క॥ అనునంత సాగరోదక, మనఘుం డతఁడు గొని తేర నభిషేకవిధిం
బొనరింపఁబనిచె స్వామి, త్రిని నినజుఁడు దోడుగాఁగఁ దేకువ వెలయన్. ౧౩౭

క॥ ఎది యెట్టులేని నట్టన, బొదలింపం గుదురుపఱుపఁ గో తా నె విభుం
డదనున నిది కా దది యన, ముదలనె యే ననుచు నసుర మొనకొనియుండెన్.

ఆ॥ వార లటు లొనర్ప వారని నెనగు డై, వార ణాఘునాన్వవాయదత్త
మొనసి యిట్టులనిమె నేణాంకసంపద, గ్లొల్లగొను స్మితాస్య ముల్లసిల్ల. ౧౩౯

క॥ లంకారాష్ట్రిఁ బెల్లని, రంకుశముగ నేలుమయ్య యమనులు మెచ్చన్
శంకాతంకము లెడలఁగ, లెంకలు నీ కగుచుఁ బ్రాజ్ఞలింపులు పొగడన్. ౧౪౦

క॥ అని రాముఁడు దీవించిన, ననుపమసౌహార్దమున మహానందమునన్
దనరారె రాక్షసేంద్రుఁడు, తనసచివులు నట్టి రగుచుఁ దార్కొని నెగడన్.

ఆ॥ మేలు మేలు రాము మేలె పొగడనైన, దెల్లజగములందు నిట్టి నెనగు
గలదె యనుచుఁ బొగడెఁ గపివాహినీతతి, పఱయు నట్టిఁ డగుచుఁ బరఁగుచుండ

క॥ అత్తఱి సుగ్రీవుఁడు నము, పాత్తనయుం డసురఁ గదిసి యనుభావ్యసమా
సత్తి నెఱపి తా నిట్లనెఁ, దత్తాదృగ్విభవలక్ష్యతాత్పర్యమునన్. ౧౪౩

చ॥ సునయ! విభీషణా! మనము చుట్టల మైతిమి విశ్వభర్త యీ
యినకులమౌళి కింకరుల మిందఱ మందఱిలోన మేటి వీ
వనయము భక్తి నెక్కొనఁగ నై విభు మన్నన లందఁగాంచ నా
ననువునఁ గానఁ దోడ్పడఁగ నగ్గల మౌ వల నూనఁ గాఁ దగున్. ౧౪౪

క॥ అన విని యఖిలేశున కేఁ, బొనరించెడు సాయ మెంత పొడవైనదియో
యనిశముఁ దత్సేవారతిఁ, దనరారుటకన్న వలను దక్కొం డగునే. ౧౪౫

క॥ సేవింత మిందఱము సం, భావితము తద్విశేషపరమార్థ మదక్
గావింత మనయుకర్జము, లేవింతయుఁ జెరయనీని యెఱుకకతమునన్. ౧౪౬

ఉ॥ అయ్యెడ రాక్షసేంద్రుఁ గని యర్కకులీనుఁడు రాముఁ డాదరం
బొయ్యఁ దలిర్ప నిట్లనియె నోయి సఖా ! వినిపింపుమయ్య యా
దయ్యము లుండుతీరు బలదర్పములుం బ్రభవుండు వారితో
నెయ్యమున న్మెలంగుటయు నెమ్మన మన్మయి వీక మైకొనన్. ౧౪౭

—♦ శ్రీరాముఁ డడుగ విభీషణుఁడు రావణుని సామర్థ్యము వివరించుట ♦—

ఆ॥ అనుచు రామచంద్రుఁ డక్లిష్టకర్ముండు, ముచ్చటింప నదియు ముదలకింపఁ
బ్రీతి నిట్టులనె విభీషణుం డసురేంద్రు, తెఱఁగు వల్లభునకుఁ దెఱఁగుపడఁగ.

ఉ॥ ఆతని సర్వభూతములు నట్లు సురాసురులున్ వధింపలే
రాతనిశక్తి మేకొని స్వయంభువుఁ డిచ్చిన యావరంబునన్
గాతరవృత్తి లే చెదిరిఁ గైకొనఁ డేని జగంబు లేల నా
నేత నటంచుఁ బొంగిపడు నిచ్చలు నచ్చటులుండు రాఘవా. ౧౪౯

తే॥ నాథ నల రావణునకును నడిమివాఁడు, కుంభకర్ణుండు బలదర్పగుంభితుండు
ప్రతిబలుఁడు శక్రునకు నరఁ బరఁగువాఁడు, వాని తేజం బతీత మై వలనుమీఱు.

క॥ సేనాధిపతి ప్రహస్తుఁడు, దా నసురేంద్రునకు లంక దఱియునదె మొదల్
పూనిక నలకేశు గెలువఁ, బో నయ్యెడ మాణిభద్రుఁ బొలుపఱఁ బఱచెన్.

తే॥ వింటె రామేంద్ర ! తా నేటి వీరులందు, బద్ధగోధాంగుళిత్రుఁ డవధ్యకవచుఁ
డధిపసుతుఁ డింద్రజిత్పద మందినాఁడు,పరులఁ బొరిగొను నెదుటఁ జూపట్టఁబోఁడు

క॥ ఆజి హుతాశనతర్పణ, మోజం బచరించి స్యందనోన్మేషము గా
నాజెట్టి జిహ్మవృత్తిన, యా జాడఁ జరించు మింట నంతర్హితుఁడై. ౧౫౩

తే॥ అట్టియెడ నాతని జయించు టరిది రామ !
ప్రథితులు మహోదరుఁడు మహాపార్శ్వుఁ డటు ల
కంపనుండును దిక్పాలకల్పు లెదిరి
లెక్క సేయ రవ్వానికి లెంక లెవుడు. ౧౫౪

క॥ వారలు నాసిరగతులు, గా రణమున నెదిరి నిలువఁ గా రమరవరుల్
గారణము లిన్ని మొనయఁగఁ, గారించె న్నుజ్జగములు గర్వితుఁ డగుచున్. ౧౫౫

తే॥ మాంసశోణితభక్షులు మానవాదు, లెన్న దశకోటికోటుల కున్నవారు
కామరూపులు దారు లంకాపురమునఁ గాఁపురం బున్నవారు దిక్పాలవినుత !.

క॥ కన్నడసేయక యెదియో, పన్నాగముఁ బన్నుచుండు ప్రభు వయ్యది దా
మున్నెకొను నెఱసె నిన్నటి, బున్నమునకుఁ గాని మైన పురుషార్థంబుల్. ౧౫౮

క॥ అన్నియు నిను దొరకొనిన జ, గన్నాయక సమయుఁ గానికావు నెలయఁగా
నిన్నాలీకభవాండముఁ, గన్నయ్యవు గావె నీవు కల్యాణనిధీ. ౧౫౯

ఆ॥ అనిన నతని వినుతు లాలించి మేలెంచి, యాదరించి యాత్మ నవధరించి
పలికె నిట్లు రామభద్రుండు నిర్భరప్ర, విక్రమప్రభావవిలసితుండు. ౧౫౯

—• శ్రీరాముని ప్రతిజ్ఞ •—

ఉ॥ నీవివరించు పల్కుఁబడి నిక్కువమే యసురాఽధిపాఽపదా
నావళి యెల్ల నేనును శుభాత్మ! మదాత్మ గణించి యుంచితిన్
బో తెలియింప నా నెఱియుఁ బోల్పఁగఁ జాల్పఁడె నిట్టి దుష్టు సం
భావితబంధువర్గయుతుఁ బట్టి వధించెద నేఁట రేపటన్. ౧౬౦

క॥ పాతాళముఁ జొరఁబాఱిన, భూతలవివరమ్ము సొచ్చి పొడవడఁగియున్నన్
బైతామహపద మెనసిన, నీతఁడి సీతని నగల్ప కెడపడ ననఘా. ౧౬౧

తే॥ వీఁడు నా పాలఁబడినాఁడు వెఱచికాక, బ్రదికిపోలేఁడు సహపుత్రబంధు వీనిఁ
బూని తెగటార్తు నని తలపోయుమట్లు, గా కయోధ్యకుఁ బోవనిక్కము మహాత్మ!

క॥ నను శరణుజొచ్చి నేనియు, విను మొండెడ కతని ననిచి విశ్వజనీనున్
నిను నిలిపెద సామ్రాజ్యం, బున నావలు కొంచు గాఁగఁ బొనఁగు నె మెప్పుడున్.

క॥ నాతమ్ములపై నీపయి, నేతావత్కృతికిఁ బ్రీతిన యే నొనరింతున్
గాతర్య మెడలి సుఖపడు, మీతాలిమి గూర్పకున్న యెల్లశుభములున్. ౧౬౪

ఆ॥ అనెడు రామవిభున కక్లిష్టకర్మున, కసురవరుఁడు వినతు లాచరించి
ధర్మపరుఁడు వాఁడు తద్దయు నిట్లని, పలికెఁ బలుకు వెలయ భాసురాంగి! ౧౬౫

క॥ వనగల హరివాహిని తల, ననమకరాకార! నిలిచి యసురులఁ గెడపన్
గసిమసఁగి పురిఁ జెరల్పఁగ, నుసు రెసఁగెడునంత కేను నోపుదు నధిపా. ౧౬౬

ఆ॥ అనెడు నుడికి మెచ్చి యా విభీషణ! నీదు, సాయ మెంతకైనఁ జాలు ననుచు
నర్థి నతనిఁ గౌగిలించి యాలింగన మొనర్చె, రాముఁ డఖిలహృదభిరాముఁ డగుచు.

క॥ లాలితుఁ డై హరిచే నటు, లాలింగితుఁ డై భవాబ్ధి యుద్ధరి ధిషణా
శాలి విభీషణుఁ డెనయుం, జాలియు మఱి దేలియాడె సమ్మదవార్ధిన్. ౧౬౮

శా॥ పారావారము లేమి లెక్క యను నావ్రస్తావము దున్న ను
శ్రీరామాకృతి నాకృతిం గొనుచు సుగ్రీవుండు సామీరియుం
దీ రొప్పన్ జని యాచితిం జెరయు నుద్దేశంబు చెన్నారఁగా
ధీరోత్తములు పల్కి రిట్లనుచు నర్థిన్ రామకార్యార్థులై. ౧౬౯

మ॥ మనవారీ కపు లెట్టులేనిఁ గడవ న్మానించి తూఁగంగ నా
వ్యాళ మెటుపారఁగనీక తత్కులప కున్నాళు హా త్రించుచున్
గన నక్షోభ్యము యాబ్ధి నియ్యవధి యాహ్నానాథు కర్జంబుఁ దె
వృతిని సాధింపఁగ నేగుదార మెటు లాపాల్తి న్విచారింపవే. ౧౭౦

క॥ సుహితము దెల్పు ముపాయము, సుహృదుత్తమ యెట్టు లేము చూచిన మదికిన్
రహిఁ బాల్పడకున్నది నీ, సుహితం బగు మత మెఱింగి మలసెద మింకన్. ౧౭౧
తే॥ ఈవలీముఖు లీసంద్ర మెపుడు గడతు, రాక్రమించెద రాక్షణమందె లంక
నీమహారాజసులకుఁ గాని దిది యటన్న, నన్న! సిగ్గయ్యెడు నిఁకెట్టు లనఁగవలయు.
క॥ అని యడిగిన ధర్మజ్ఞుం, డనుపమగుణశాలి మహితుఁ డాశరవరుఁ డి
ట్లనె వారలం గనుంగొని, తన దా దాక్ష్యంబు కడలు దార్కొని వెలయన్.

—◆ సుగ్రీవ పృష్టుఁ డై విభీషణుఁడు సాగరతరణోపాయముం జెప్పుట ◆—

ఆ॥ తాను సగరుచేతఁ ద్రవ్వింపఁబడినాఁడు, సాగరుండు రామచంద్రుఁ డెన్న
దాశరథియు యగుచుఁ దనరినవాఁ డట్టుఁ, లౌట శరణుజొచ్చు టర్హ మిపుడు.
క॥ మతిశాలి సరిత్పతియును, గృతముం దరతమత మతముఁ గీర్తింపడె స
మ్మతిమెయి మార్గ మొసంగఁడె, వ్యతిలంఘన మేల చేయవలెఁ దొలుదొల్తన్.
మ॥ అని సూత్రింపఁగ మేలు మే లనచు వా రయ్యర్థముల్ రామదే
వున కర్థిన్ వినిపింపఁ దాఁ బ్రకృతిచేఁ బుణ్యాత్మకుం డౌట నా
నని మెచ్చెం దనతమ్మునిం గని యిటే యౌఁ గాదె నీనెమ్మదిన్
గని యిట్లే పొనరించు టొప్పు నన నేఁ గావింతు న ట్లాకృతిన్. ౧౭౬
క॥ అనుచు స్మిత మాననంబున, ననుపద మనువొందుచుండ నని వెండియు ని
ట్లనె మీ రందఱుఁ గృతులన్, ఘనులగు భావజ్ఞులరు వికాసము నెఱయన్.
ఆ॥ నిర్ణయించి తెలుపుఁ డర్ణవం బీక్షించి, యపరిమేయభావ మనుగణించి
పలికె నూహసేసి పండితుండు విభీష, ణుండు మేలెకాఁగ నుండ దెల్లు. ౧౭౮
క॥ ఆమాటకు సుగ్రీవుఁడు, సౌమిత్రియుఁ బలికి రేమి సమయోచిత మహా
సేమముఁ గా దనువారమె, నీమది కరయంగ రాని నెఱి యొకఁ డున్నే. ౧౭౯
మ॥ సులభం బౌ పథ ముచ్చరించె నతఁడున్ శుద్ధాత్ముఁ డై యుంట నీ
వల నెట్లుం దలపోయ నైనదియు యివ్వారాంనిధిన్ వాహినుల్
దలకొన్నం గడనంగఁ జాలునవియే తార్కాణగా సేతు వా
వలనేని ఘటియింప నౌ ననఁగ నిర్వ్యాపార మొప్పారునే. ౧౮౦
ఆ॥ ఇంతవట్టు దరలి యేతెంచి సేనల, నిచట విడిచి యెట్టు లేగువార
మెట్లు చొచ్చువార మింద్రాదిదుర్ధర్ష, మైన లంక మార్గ మరయకున్న. ౧౮౧
క॥ కావున విభీషణుని నుడి, గావింపుము తొల్త గార్యగతి మే లెనయుం
గావచ్చుఁగాక యావల, దేవుఁడ వీవెకద తగువిధిం బొనరింపన్. ౧౮౨
క॥ అటు వారు విన్నవించినఁ, దటుకున వార్ధిదరి మేలి దర్భాస్తర మా
ఘటకుఁ డొనర్చి తనర్చెను, బటుగతి దానిపయి వేదిపై వహ్నికిరియన్. ౧౮౩

(శ్రీరాముఁడు దర్భశయనమునను౦డ వ్యాఘ్రముఖాసురుఁడు చూచిపోయి రావణునకుఁ గపిబలంబుఁ దెలిపించుట.

శా॥ ఆలో రాక్షసరాజు రావణుఁడు దుష్టాత్ముండు ప్రేరేప శా
ర్దూలాఖ్యుం డొక రక్కసుండు కడఁకం గోతెంచి సుగ్రీవర
క్షాలంబన్ ధ్వజిని న్నివిష్టఁ గని తద్వ్యాప్యపార మవ్యగ్రుఁడై
యాలోచించి గ్రహించి లంక కరిగెన్ వ్యాహారలీలాదరా. ౧౮౪

ఉ॥ రావణుఁ గాంచి వేగము విరాగము నెక్కొనఁ బల్కె లంకపై
రా వల నెంచుచున్నది త్వరం గొని వానరభల్లుకౌఘ మొం
డై విలసిల్లు సాగరము నట్లె యగాధము నప్రమేయమున్
గా వెలి గ్రమ్మె నక్కడఁక గాదు వచింప సురారినాయకా! ౧౮౫

క॥ పదియోజనములవఱకు, న్నదె కానయి యంబరంబు నట్లు పొదువఁగా
నుదియగొనుచున్నయది యి, య్యది యెంతయు నిక్క మిట్టు లరసి తెలిపితిన్.

చ॥ దశరథరాజనందనులు దారట భ్రాతలు రామలక్ష్మణుల్
వశపడి వారిఁ గూడె నట వానరసేనలఁ గొంచు నర్కజుం
డశనులఁ బోల్ప నోదు రన నా భటు లందిరఁ బొందినారు నీ
యశ మెట్టు లోటమింగొనదొ యవ్విధముం బరికింపఁగాఁ దగున్. ౧౮౭

క॥ ఆరామవిభుని తేజం, బారూఢిన్ భానునందె యగపడు నెందే
తిరునఁ బోల్పంజన దమ, రారీ! యనుజన్ముఁ డన్న కగు జోడనఁగాన్. ౧౮౮

శా॥ ఆలోలాత్ములుగారు సీతపద మన్వర్థించుచు న్వచ్చినా
రాలీల న్గడఁక న్విరాసములు నెయ్యంబు న్గ్రహింపన్ గ్రియా
వ్యాలీఢస్థితులున్ గనం దరమె యెందే పట్టునం దత్స్వగా
పాలంబంబున దగ్గు మారు విధి సేయంజాలఁడే క్రమ్మఱన్. ౧౮౯

ఉ॥ ఆరయఁబోలు నీకుఁ దగ నైన విధంబునఁ దర్పకార మ
ట్లా రయ మొప్ప దూతలను నంపి తెలుం గెలుఁగంగ నావయి
న్నేరము లెన్నఁబోకుము వినీతతఁ దెల్పుసువాఁడ భేద మీ
గోరముఁ బాపునేమొ యనుకూలము దానొకొ సామదానముల్. ౧౯౦

క॥ నీనెఱి నెఱయఁ బొనర్పుము, నానేరిమి నొడివినాఁడ నయ మెంచి జయ
శ్రీ నందఁగాంచు మనుచుం, దా నింద్రసపత్నుతోడఁ దగఁ బల్కుటయున్.

ఆ॥ అతని పల్కు విననయంత నే వ్యగ్రత్వ, మొదవ నొక్క యర్థ మెదఁ దలంచి
శుకవదాఖ్య నపరు సకలార్థకోవిదుఁ, గాంచి యసుర పలికెఁ గమలనయన!.

—♦ రావణుఁడు శుకాసురుఁ బంచి సుగ్రీవు భేదింపనెంచుట. ♦—

తే॥ రీతిమెయి నీవు పోయి సుగ్రీవు వాన, రేంద్రుఁ గని యేను బలికితి నిట్టు లనుము
క్లీబమునుఁగాక మృదువయి కీర్త్య మగుచుఁ, బరఁగి సందిష్ట మొడయుని పలుకుఁబడిని.

సీ॥ ఓయి సుగ్రీవ ! నీ వుత్తమకులమునఁ బొడమినాఁడవు బలబుద్ధిధృతుల
సములు ఋక్షరజస్సూనుఁడవు హరివరులు నిన్గొల్తురు వారకెపుడు
నిను భ్రాతృసమునిఁగా నే నెంతు నధిరాజపద మందితివి మహాప్రీతిఁ గాంచి
తర్థం బనర్థంబు నని లేదొకండు నీ కొక్కని సేవించి యొదుఁగ నేల
తవిలి రాజపుత్రి దార నేదెచ్చిన, వెరవు లేదె యాతఁ డరయకున్న
యేమి వచ్చిపడియె నిందు నీతలనుఁ గి, ష్కింధ కేగు మెలయు కీర్తిఁ గనుము.

క॥ ఆలావరు లగు వేల్పులు, నీలంకం జెరయునే ర రిట నడుగిడ రాఁ
జాలదు మిత్తి నరులు హరు, లేలెక్క విపత్తి గొనకు మితరుని కృతికిన్. ౧౯౫

మ॥ అని రక్షోవిభుఁ డాడె నీకు హితమూ నట్లంచు నీ వంచు నా
తనిపల్కుం గొని రమ్ము పొమ్మనిన సద్దైత్యుండు నామోచితం
బన నైరూపగు పక్షిరూపుఁ గొని యొయ్యన్వార్ధిపైపై నభం
బున నెక్కొల్గని యాదురాత్ము నడిగాఁ బొల్పారఁగాఁ బల్కినన్. ౧౯౬

క॥ అనుడులు విన్నయంతనె, వానరవరులు దివి కెగసి వానిం గొని యా
లూనపతత్రి నుపహతుం, గా నొనరింపంగడఁగిరి కమలదలాక్షీ. ౧౯౭

ఉ॥ ఆతనిఁ బట్టితెచ్చి యవ్వనౌనుక యింతకుఁ జాలి తిట్టులే
నీతర మీఁగువాఁడ వని నెమ్ములు వీడఁగఁ బిండివెట్టుచున్
భూతలమందు నైవ రఘుపుంగవుఁ జేరొకని వాఁడు దేవ ! న
న్నూత యథోక్తవాది నెటిఁ ద్రోచి వధింపఁ దలంపఁ జెల్లునే. ౧౯౮

క॥ పతి మతము విడిచి తనదగు, మతమున భాషించుపొంకె మలయున యేన
న్మతకరిఁ బొరిగొను లేస, న్మత మటుగా కొండు దలఁప మత మగునె నృపా.

అ॥ వానరుల నదల్పు వారు నీవా రని, వార్యు లగుచుఁ బొడిచివైచుచున్న
వార లనుచు నాఁడు వాపోవఁగా రఘు, వీరుఁ డొప్ప దతని విడువుఁ డనిన.

క॥ బ్రతికితి లేదా యని స, న్మతు లాహరివీరు లుడుటు మాని చను మనన్
గతపత్రిలఘుఁడు నెట్టన, గతిగని గగనమున కెగసి క్రమ్మరఁ బలికెన్. ౨౦౧

ఆ॥ ఓమహాను భావ ! యోసారసత్త్వ ! సు, గ్రీవ ! విక్రమాంచితావధాన !
రావణుంను లోక - వణుం డాతనిఁ జేరి యెట్టు లందుఁ జెప్పుమయ్య. ౨౦౨

—◆ సుగ్రీవుఁడు శుకునకుఁ బ్రత్యుత్తర మిచ్చుట ◆—

క॥ నావుడు హరిపతి బలస, ద్భావాంచితుఁ డతనితోడఁ బలికెం దగ నో
దేవీ ! రజనిచరాధిప, భావోచితచారచరుని పద మారయుచున్. ౨౦౩

సీ॥ అరివి రాముని కోట నపకారి విందఱ కాప్తి లే దింతయు నరయు మనుము
నీయుపకృతి యొందు నగడె నెట్లనుకంప్యుఁడవు కీడుపుట్టంది తవస నసుము

ఆ॥ అనుచుండు శోక మంది యాక్రోశించె, రామ! రామ! యనుచు రహిఁ బొసంగఁ
జండసత్త్వయుతు లఖండ తేజులు సార, లట్టి సెంత లాతఁ డనఁగ నగజ!
తే॥ వాని పున్నెంబు దోడ్పడి వచ్చెఁగాక, మీఁదెఱింగెను నమ్మి యమ్మెయినిఁ బేడఁ
దొడరెను దొరా యదల్పవే త్రోవతోడ, నీసుభటపాలి నాస్సైని నీసుమాలి.
క॥ నాయిూకలఁ జెఱికిరి కఁ, దోయిఁ జెకలించి రింగణో నంతం జే
నోసెుడయుఁడ! కనఁగనిన, న్నాయొనరించిన యఘుమ్మునం జేడ్పడెదే. ౨౧౮
ఆ॥ పొరిపుమయ్య నన్నుఁ బుణ్యకీర్తివి యెల్ల, వారు నిన్నుఁ జేరి మెలమి మీఱ
గుర్తికి విడుమరలను మొనయుంగ నాకేల, బాధనంబుఁ గూర్చు పాతకంబు,
క॥ ఏకతి నేని నిన్నేఁ చేరితి శరణంటి నిట్టి సిరి చాలదె నా
నేరము లెన్నఁగనేలా, సారము నీ వరయకున్న జగ మారయునే. ౨౧౯
క॥ అను నాతని పరిదేవన, మును విని శ్రీరామనృహరి ముదల యొనర్చెన్
జన దింక విని నొంపఁగ, ననీతి దగునా యటంచు సందఱు వినఁగాన్. ౨౨౦
క॥ అద్దేవు నానఁ బ్లవగుల, గద్దింపుచు వాని విడిచి కనుపటి నిండే
వ ద్దెనయక నిలు మోగి, యద్దెస నూపువఱ కనిన నతఁ డట్లుంటెన్. ౨౨౧
ఆ॥ వన్నెకాఁడు రాఘవప్రభుం డవ్వేళ, సబ్ధివేల దర్భ లాస్తరించి
ముద్దులూలఁ గేలు మోడ్చి ప్రాఙ్ముఖుఁ డయి, శయితుఁ డై తనభ్భుజాడ నుండె.
తే॥ అరినిషూదనుఁ డలబాహువుగ వొసంగ
భుజగభోగాభ మై యొప్పు భుజ ముపాధి
మొనయ నుపధాన మొనరింప మొనకొనియెఁ గ
లానిధానము! యిట్టి మేలన మరసితె. ౨౨౩
సీ॥ రంగరంగపు మేలి రంగారు బంగారు ప్రోన్నగి ల్ధరియించి కులికె నద్ది
మొపూరి లోనగూర్చు మహిలామణుల కరామర్శనంబుల నిచ్చ మలసె నద్ది
బాలసూర్యప్రభాసిచందనసారభాక్రాంతదిక్కాంత్వ మంద నద్ది
సెజ్జ సీతాతిరంబుసిరులతో గాంగతత్తకభోగసంపత్తిఁ గాంచె నద్ది
సాయుగయుగప్రచారంబు శత్రునిత్తి, కష్టసౌఖ్యప్రదము దైర్యశానునియు
కైకలత్యము సాగరాంతాశ్రయంబు, నైన యాబాహు వపుడు దండతని కన్యా.
క॥ శరముల సవ్యాసవ్యతిఁ, దరలింపన్ జ్యాకిణాంకితం బగుచు మహా
పరిఘాభ మైన దక్షిణ, వరభుజముఁ దలాఁపి సేసె వాఁ డభియాపా. ౨౨౪
క॥ ఆగోనిర్వాపణచణ, మాగోసాహస్రిదాయి యభయోదార
శ్రీగిరము నా భుజమునఁ, యాగతిఁ దలగడ నొనర్చనటె యే మందున్. ౨౨౫

క॥ శరణ మగు నింక సాగర, తరణమొ యవతారజలవితరణమొ యనుసం
స్ఫురణ మిడె మదికిఁ దన సం, సరణం బెదిరించు నతఁడు జగతిం గలఁడే. ౨౨౮

తే॥ మొనసి ప్రయతుండు నియతుండు మునియు నగుచు
దర్భశయనం బొనర్చె సద్ధార్మికుండు
గాదె యది యేనియును విధి కంజభవునిఁ
గన్నవాఁ డొనరింప నా కర్మతులకు. ౨౨౯

ఆ॥ మహితనియతి నప్రమత్తుఁ డై యవ్వార్ధి, కర్థి యై కుశాస్తృతావనీశ
యానుఁ డగుచు రాముఁ డటులుండ రాత్రిత్రి, యము గ్రమించె వికసితాంబుజాక్షి.

ఆ॥ సాగరుం డటంచు సరితాంపతి యటంచు, ధర్మవత్సలుండు దాశరథి ద
యాశరధి యనంగ నై యాశరధి వేఁడె, మూఁడు రేలు నయము మొనయ నవల.

—♦ శ్రీరాముఁడు సముద్రుపైఁ గోపించి పరాక్రమించుట. ♦—

మ॥ ప్రయతుం డై రఘునాథుఁ డమ్మొయినిఁ దన్వార్ధింపఁ బూజింప స
న్నయ మొప్ప వ్రతమాచరింపఁ దలఁప న్మందుండు గాఁ డెట్లు ప్ర
త్యయ మీయం దలపోయఁ డాజలధి యారా యంతరైశ్వర్య మెం
తయు నౌద్ధత్యముఁ గూర్పఁ దొంటి నిజదైన్యం బొండు పాటించునే. ౨౩౧

క॥ క్షణ మెన్నుచు రక్తాంతే, క్షణుఁ డై వెడనవ్వు దొనుకఁ గా రాముఁడు ల
క్ష్మణు శుభలక్షణు నుపగతు, గుణాఢ్యుఁ గని యిట్టు లనియెఁ గోవిదవంద్యా.

సీ॥ అవలేప మరసితే యబ్ధి దర్శన మీయఁ డీడె యింతటికి తా నింత లగుట
సాలమి వేట్టుఁబో సాంత్వక్షమార్దవశమలక్షణము లైన సద్గుణంబు
లాత్మప్రశంసి దుష్టాత్ము ధృష్టుఁ బ్రచండవర్తను విపరీతభావకుని సొత్తు
రవి యివి గుణహీనులం దిట్లు విపరీతభావమ్ము వెలయింపఁ బరఁగుచుండు
ఖ్యాతి యైనఁ గీర్తి యైన జయం బైన, సాధువృత్తి నొందఁ జక్కఁబడదు
రావు సేయ నా పరాక్రమ మెనయింప, నిన్నియునుఁ గడంగి యెదురువచ్చు.

క॥ ఆలము సేసి యిపుడె యే, నాలమ్మున శరధి మేలి యలుఁగుల నింపఁగా
జాలిపడి నీట నిమ్మక, రాలయమకరములు దేలియాడెడుఁ జూమ్మీ. ౨౩౪

ఆ॥ ఫణుల పడగ లెడలిపడ మీనములు మేను, లట్లు నైవఁ గరికరాళి తెరల
శంఖశుక్తిసమితి సమయ నా సమయాప్తి, నంబురాశిశోషణం బొనర్తు. ౨౩౫

శా॥ సౌమిత్రీ! క్షమ పోల దీదృశు నెడం జాలించితిం దాని నా
సామం బెంతలు సేసెనో కనుము పైసన్నాహ మూహింపు మా

రా మేనొప్పఁగ రాఁడు సాగరుఁడు దనాత్రిమేనుఁ డర్థింప నిం
కేమీ తప్పని ముప్పనంబడక కానీఁడొండు జాల్మం డిలన్. ౨౩౬

తే॥ చాప మందిమ్ము లక్ష్మణ ! శరవరమ్ము, లట్టి లాశీవిషమ్ములే యనఁగఁ జెల్లు
నవియుఁ గూర్పుము నవయు నియ్యబ్ధి నింకఁ, గాళ్లనడకలతోఁ గపు లడచువారు.

మ॥ ఇతఁ డక్షోభ్యుఁడ యేని సాగరుఁడ కానేనిఁ సముద్యాదుఁ డు
జ్ఝితమర్యాదుఁడు నంచు లోకు లెదలోఁ జింతింప నానేనిఁ బ్రా
ధతరోర్మిప్రథితుండ యేని బలుగండ దైత్యు లుండంగ సు
స్థితుఁడే యై తగునేని మచ్చరము లే జీర్ణింపఁగాఁ జేయవే. ౨౩౯

క॥ శోభితుఁ డై తగు నీతని, క్షోభిల్లఁగఁ జేయువాఁడ జూడు మితఁ డాకం
డే భోగ మందునఁటు డై, త్యాభుగ్నత చాలుఁ గాచు నదె తన్ననుచున్.

తే॥ అని ధనుష్పాణి యై క్రోధ మగ్గలింప
నంతటనుఁ గన్ను లారుణ్య మవధరింప
రాముఁ డభిరాముఁ డపుడు కరాళుఁ డయ్యె
నాయుగాంతాగ్నివలె జ్వలితాస్త్రుఁ డగుచు. ౨౪౦

తే॥ ధనువుఁ బీడింపఁ దొడర నింధనము లయ్యె
శరము లెడలింప నడలె నా జగము లెల్ల
నుగ్రవిశిఖము ల్పిడుగుల యోజ నెఱయ
నేమి గతి గాంచఁగలవాఁకో యెఱుకపడదు. ౨౪౧

క॥ శరాశాటు లట్లు జ్వాలా, వితతములు శరములు వెడల వినుతులు సెలఁగన్
శితకోటివిశిఖుఁ డితఁ డా, శతక్రతుని వాఁడు గాఁడె చాలఁడె యనుచున్ ౨౪౨

చ॥ వెలుఁగులు వెంటరా ననిలవేగమనోగతు లొప్ప సాయకం
బులు వొలివోక రోదసులు బోరన బోరన వట్టివోవఁగా
సలిలములన్ హరించుటకుఁ జాల్పడి నందరి మతఁదరి మానె యా
విలత యిఁకేల చెల్లు రఘువీరునిఁ గొల్వక నిల్వవచ్చునె. ౨౪౩

ఆ॥ ఉదక ముడికుచుండ నూర్మిమాలికలతోఁ, బూర మొగువ నబ్ధి బూరటిల్ల
ధూమ మట్టు లైనఁ దోఁప వింతగ జంతు, హాక మచటఁ గానఁబడియె నపుడు.

మ॥ పడగ ల్మోములు గన్నులు న్నెఱయఁగాఁ బాతాళ పుంజిల్వ లా
నడఁ దత్రిత్యులు దానవు ల్వ్యథితు లై సాకంగ నిం దెవ్వరే
ర్పడువా రంచు యుగాంతసంభవమహాప్రస్థాన మూహింపఁ జొ
ప్పడ రామాస్త్రపరంపరాఖ్య మగు నార్వాం బబ్ధి మూయించుచోన్. ౨౪౪

సీ॥ జ్వాలముక్కలు గాఁగ రాలఁగాఁదొడఁగె నాశైలముల్ శైలాగ్రశరము లడరఁ
గాకిచిప్పలు గానఁగా నయ్యె నొండొండ శోషణాస్త్రరువిస్ఫూర్తి నిగుడ
ధూమకేతువు లట్లె ధూమకేతువు లొప్ప నాగ్నేయబాణాగ్ను లంటఁగదియ
నూర్మిమాలికలు సత్యోర్మిమాలిక లాడె నాశుగాశుగవేగ మతిశయింపఁ
బదులు నూర్లు వేలు పదికోట్లకోటు లై, ప్రబలి రాముఁ డేయు ప్రదరవితతు
లమ్మహార్ణవమ్ము నట్టిట్టొనర్చె నా, ఘూర్ణమాన మగుచు గొడవపడఁగ.

క॥ పొడవడఁగ నైన నమ్మెయిఁ, దడబడుటే కాని మొనయఁదలఁపఁ డకట య
క్కడలి మును మందరాచల, మెడలింపఁగఁ దనుకఁ డిప్పు డిది విస్మితమే. ౨౩౭

మ॥ ధను వాకృష్టమొనర్చుచుం గడఁక మై దాక్షిణ్య ముజ్ఝింపఁ తలూ
గ నితాంతప్రథమాన తేజుఁ డయి యాకంపించు భూతౌఘముం
గనకే యబ్ధినె కాంచుచున్ రఘుకులాకల్పంబు కల్పాంత మ
ట్లె నిరూపింపఁగ నొక్క దివ్యశరము న్డెందంబునం దుంచినన్. ౨౩౮

తే॥ కరులు మకరములెడలఁగాఁ గచ్ఛపములు, దేలఁగాఁబన్నగౌఘము ల్దూలఁ గాంచి
వ్రాలి కర మెత్తి పొనరించె వారణంబు, వలదువలదని సౌమిత్రివారణంబు. ౨౩౯

క॥ అతఁ డాఁగినఁ దలఁగం డ, య్యతిరథవరవర్ణనీయుఁ డౌ రాముఁడు న
న్నతికుపితుఁ గాక యాదః, పతి నాఁకపడంగ నేల పరువిడ వనుచున్. ౨౪౦

తే॥ అవల సాగరుఁగూర్చి రాఘవుఁడుపలికె, శోషిలఁగఁ జేయువాఁడ నీసొబఁగులూఁప
నీకుఁ జేదోడు వాదోడు నెటేఁ దనర్చు, తోడు పాతాళలోకంబు జోడు గాఁగ.

క॥ ధూళి తెగయించి యిప్పుడె, తోలెద నిర్దగ్ధనిఖిలతోయునిఁ గా ని
న్గాలిపడి యెల్లసత్త్వము, లోలిం బెనుగాలిఁ బెరసి యుబ్బట్లూఁగన్ ౨౪౨

క॥ మత్కార్ముకసృష్టంబు ప్ర, షత్కానలవర్ష మిపుడె సాగర నిను సం
పత్కాలవిరతుఁ జేయు స, మిత్కాంతులు కాల్లనడక మేకొంద్రు కపుల్.

క॥ దానవులకు నిలుకడ నీ, వేనేర్పునఁ గూర్తొ యెంచి యెఱుఁగవు దానన్
నానయవిక్రమముల నిం, కీనెటె ని న్నారయు కష్ట మెంచెదొ లేదో. ౨౪౩

మ॥ అని బ్రహ్మాస్త్రము బ్రహ్మదండనిభ మా నస్త్రంబునం జేర్చి యె
క్కనిమేషంబున మార్విఁ గూర్చి ధను వాకర్షంబు గావించి యా
మనువంశోత్తముఁ డట్టహాస మొనరింప న్వేపటాత్కారని
స్వన మై ఘూర్ణిలె రోదసీకుహర ముత్సన్నత్వసన్నద్ధ మై. ౨౪౪

క॥ గిరులు వడఁకె జీకటు లటు, గిరికొని దెస లాక్రమించెఁ గీల్కొని సరసీ
సరిదంతరములు సంక్షో, భ రావ మెడలింపఁ దొడఁగె బాటవ మెడలన్. ౨౪౫

సీ॥ జ్యోతులతోఁ జంద్రసూర్యు లడ్డంబుగాఁ దిరిగిరి పెనగొనెఁ దిమిరదీప్తు
లుప్పరంబునఁ దోఁచె నుల్కాసహస్రంబు నిర్ఘాతములు తోన నిర్గమించె
ఘనమారుతస్కంధగతు లొప్ప వెసఁ బ్రభంజనుఁడు భంజించె వృక్షముల గిరుల
వజ్రవైద్యుతవహ్ని వర్షంబు లటు మీఱె భూతభైరవరవంబులును బ్రబలెఁ
గనులు మూఁతపడఁగఁ గదలక యుద్వేగ, మంది నెందు ఖగమృగాదు లడలి
యయ్యమోఘబాణ మజునిఁ గన్నయ్యయ, య్యబ్ధిపైని వైవ నడరునపుడు.

క॥ భూతములతోడ వీచీ, వ్రాతంబులతోడ నాగవరరక్షస్సం
ఘాతములతోడ నంబుధి, యాతతవేగాతివేగుఁ డాతజీనయ్యెన్. ౨౫౮

క॥ ఆజనితోపప్లవమున, యోజనపరిమితికి లోని కొదిఁగి చనె నతం
డాజితు నాజితనూజుం, డోజమెయిం బొడువఁగా ననుత్సుకుఁ డయ్యెన్. ౨౫౯

క॥ అంతటఁ దనయంతంబున, కంతం బిటు లౌ నటంచు నారసి స్వక మా
నంతర్థి నెడలి సముప, క్రాంతుఁడుగాఁ దొడరె నతఁడు కమలదలాక్షీ. ౨౬౦

—♦ సముద్రుఁడు ప్రత్యక్షమయి శ్రీరాముఁ గొనియాడుట ♦—

సీ॥ ఉదయించు రవిబింబమో యన నొకతేజ మధిగతోన్నతశైల మందఁ గాంచె
దీప్తాస్యములు సముత్థితము లౌ బహుమహాపన్నగంబులుతోడఁ బరఁగ నగడె
స్నిగ్ధవైదూర్యభాసితమూర్తి నైకొని దేవతాస్ఫూర్తి వ్యక్తీకరించెఁ
బొల్చె జాంబూనదభూషాసముజ్జ్వలరక్తమాల్యాంబరాముక్త మగుచుఁ
దమ్మిరేకులఁబోలు నేత్రమ్ము లొప్ప, సౌరపుష్పస్రజము శిరస్త్రముగఁ దనర
మోము చందురుఁగన్నట్టి మురువుఁ దెలుప, నవలనంబుధియనఁగనై యదెతలిర్చె.

క॥ ముత్తియపుదండ నడుమం, జొత్తిల్లుచు నొక్కమేటి జోతి వెలయఁగా
హత్తిల్లు మేను వెదప్రి, నెత్తిన కౌస్తుభముతోడె యే నని మురియన్. ౨౬౧

తే॥ అబ్ధి యని కాక రత్నాకరాఖ్య తనరుఁ, గలుగుటకు సార్థరత్నప్రకాశ మొప్ప
ధాతురాగవిశేషవిద్యోతుఁ డైన, వలిమలకు సాటివచ్చు నా వఱలి తరలి.

క॥ లెనిలోని మేటి రతనము, లును బంగరుమేలినగలు లోలల్లక్షీశ్రే
పిసివేశము లనఁదగు క్రొ, న్ననలుం గానికలుఁ గొంచు ననిచిన వేడ్కన్. ౨౬౨

ఆ॥ తొంటి గాలి మొగిలు దొరయుసంగతి నైన, తెరల తెరలు బొటు దృష్టసత్వ
వేష్టనమునుఁ దెలుపు వెనుబాటుతోడి వే, నడరు వడఁకు లొంటఁ గడలుకొనఁగ.

క॥ దోయిలి నెరయ మొగపుగం, దోయియు వికసింపఁ దొంటిదొరవుకదోయీ
యోయిత నైతివె పన్నగ, శాయీ యని పిలిచి మేలినన్నుతు లెసఁగన్. ౨౬౩

క॥ శరపాణి యైన రాముని, కరమఱి శే కప్పనంబు లర్పించి ఖలా
శరబాధ తలఁగె నను ధృతి, సరగున సాష్టాంగ మొఱగి సంభ్రమమెసఁగన్,

ఆ॥ నమ్రుఁ డగుచుఁ బలికె నాయన్న! యిల యాప, మట్లు జ్యోతి వాయు వాకసంబు
మలఁగ వాత్మవృత్తి వలను శాశ్వతపథ, మందియున్న తత్త్వ మొందుచుండు.
క॥ అధర్మమున నె యితసక, గాధత్వము వొసఁగుఁగాని గాధత్వము గా
దాధి యుపాధిగ నొదవెడు, బాధ యనం బరఁగు నది యపక్రమ మగుటన్.
ఆ॥ కామలోభపరతఁ గాని భయంబునఁ, గాని సకలసత్త్వకాంక్షితముల
స్తంభనం బొనర్పఁ జాల జలంబులఁ, బలుకువాఁడ నిజము పార్థివేంద్ర! ౨౭౦
క॥ ఒడయఁడ వని నిన్నరయక, తడసిన తప్పున్న దొకటి తఱిఁ గొలని దీ
జడమతిదెస దండనమెయి, బడలించితి వదియుచాలుఁ బద్మదళాక్షా. ౨౭౧
క॥ రక్షింపుము రక్షింపుము, పక్షీంద్రపతాక దేవ! పరమపురుష! నీ
శిక్షం బెఱిఁగితి మధిపుఁడు, దా క్షమియింప దొరఁకొనఁడె దాసుల తప్పుల్.
సీ॥ నీ తమోమయి మాయ నిర్గమింపఁగఁ జేయ భూతంబు లన్నియుఁ బొడమి నెగడు
నవి కారణస్వభావవృతంబు లై యుండుఁ గావున జడభావకలన పొసఁగు
నీవిరాడ్రూపంబు నెలకొన దాని సత్త్వంబున నైరి దేవతలు ధాతృ
ముఖ్యులు రాజసమున మన్యువున భూతపతియుఁ గా నన్నియుఁ బఱఁగె నవల
శుద్ధసత్త్వాకృతివి నిత్యశోభనుఁడవు, నిర్వికారుఁడ వజుఁడవు నిర్గుణుఁడవు
కేలిమెయి మాయ లీల లంగీకరింతు, వేనియును వానియవలేప మొనయ దెపుడు.
క॥ త్రైలోక్యరక్షణమునకు, లీలామనుజాకృతి న్వెలీనుఁడ వగుచున్
హేలమెయిఁ బెరయ నరయం, జాలఁడు వీఁడనఁగ నైతి సౌమ్యత యెడయన్.
తే॥ పసులు మొఱకులు గాఁపరి ప్రభుఁడు దండ
మెడనెడఁ బొనర్ప సన్మార్గ మెనయుచుండు
రట్టు లీశిక్ష నీతత్త్వ మందఁగంటి
నభయ మిచ్చి లంకామార్గ మరయుమయ్య. ౨౭౨
* క॥ ధీవరులు జలధి యితఁ డని, యేవలనున నేనిఁ గొందు రిష్టార్థములన్
దేవా! గాలికిఁ గదలెడు, నావిధమునవాని నొంపనా నీశరముల్. ౨౭౩
తే॥ శరణుజొచ్చితి భక్తవత్సల మహాత్మ!, సర్వలోకశరణ్య! రక్షాధురీణ!
యలసినాఁడ మహాభయ మొలసినాఁడ, దొరవు నీయంఘ్రి దిక్కని దొరసినాఁడ.
ఆ॥ ఎదియొ దారి సూప నెంతు సహింతుఁ ద, ద్భారమెల్ల గ్రాహతతులవలని
బాధలం దొలంతుఁ బరఁగ నీసేన యా, దరిని జేరి నెఱయుదనుక రామ! ౨౭౪
మ॥ అనినన్ రాఘవుఁ డప్రమేయవిభవుం డాయంబుధిం గాంచి యి
ట్లనె సంయోజిత మిమ్మహాశర మమోఘాపాత ఖిద్దానిఁ బో
లిన లక్ష్యంబున వైవఁగావలయు జాలింబోక యాయిమ్ము నా
కొనరం దెల్పుము మిన్నకుంట తగ దాయోజ న్ప్రయోగించెదన్. ౨౭౫

—♦ రాముఁడు సముద్రునివచనంబున తనదివ్యాస్త్రము ద్రుమకుల్యమున నాభీరులపై వైచుట ♦—

ఉ॥ నాఁడు రామచంద్రుని వచనం బమృతోచిత మందుకొంచు మి
న్నావల నంది యబ్ధి యని నయ్య! గుణోత్తర ముత్తరంబునన్
దావల స్థాన మొ మరువు దా ద్రుమకుల్య మనంగఁ జెల్లుఁ బు
ణ్యావృత మైన దీవువలె ఖ్యాతిఁ జెలంగుచు ముజ్జగంబులన్. ౨౮౦

తే॥ ఉగ్రదర్శనకర్ములనూర్జితులు వి, గీతు లతిదుష్టు లత్యంతకిల్బిషులుఁ గి
రాతు లున్నారు దస్యులరాతు లగుచు, వార లొనరించు రారా పవార్య మధిప!

క॥ ఘోరు లమరారులే పో, వారలు మద్వారి గ్రోలి నట్టిచనఁగ నౌ
దారి ఘటియింపఁ గలుషం, బౌరీతిఁ బొనర్పఁజూతు రనవరతంబున్ ౨౮౨

క॥ ఆపాపుల సందర్శన, మాపగిదిన్ స్పర్శనము సహస్థితియును న
న్నాపాత్ముఁ నొనర్చెడు న, ప్పాపం బెడలింపుమయ్య! పాపాపహరా! ౨౮౩

క॥ ఘోరం బీశర మయ్యా, భీరులపై వైవుమయ్య! వెర వదె యన న
వ్వీరవరేణ్యుఁడు తద్వా, క్యారం బనువార నరసి యటు లొనరించెన్. ౨౮౪

మ॥ మరుకుక్షిం జొరఁబాఱి యబ్బిఱుసుల న్మాడ్చుచు దీప్తాశని
స్ఫురణ ల్వెల్లుగఁ దోఁప దిక్తటుల విస్ఫోటించు గర్జ ల్వెలం
గ రస న్వ్రచ్చి రసాతలం బరసి యక్కాంతారముం గాల్చి దు
ష్టరసంబు ల్వెసఁ బీల్చి స్వీయశరసంస్థానంబు సేరె న్వెరిన్. ౨౮౫

తే॥ రామబాణకృతావనివ్రణముఖమున, నారసాతలమునుండి యరుగుదెంచి
శుద్ధగంగాప్రవాహంబు చూడనొప్పె, నెప్పటికిఁబయి కెగయు నై యొసఁకమొసఁగ.

క॥ స్థాప మది వ్రణ మనంగ న, కూపారమునందుఁ బేరుకొనన య్యె నటే
యాపద మొగి మరుకాంతా, రోపాఖ్యఁ దగెం జగత్ప్రయోనశుప్రిత్తమై. ౨౮౬

ఆ॥ అటు లొనర్చి పేర్చి యమ్మరుస్థలికిఁ దా, వరము లొసఁగె నమరవందితుండు
పసుల మేత లుండు పాడిపంటలు నిండు, మూలఫలరసములు మొససియుండు.

క॥ సుకరక్షీరస్నేహం, బకలంకౌషధివిశేష మారోగ్యగుణా
వికలము శుభసౌరభ మతి, పికస్వరము నగుచుఁ బుణ్యవిధు లిది వెనుచున్.

క॥ అని రాముఁడు వర మొసఁగిన, ససితరసాభాగ్యగరిమ నంది వెలసె న
మ్మనికి మనుకులుసఁ గసఁగొస, యని సరితాంపతి ప్రసక్త మరుసం బొసఁగన్.

క॥ నీయది లోకం బొకపసి, సేయంజాల వను పలుకు సెల్లునె నీయ
ట్లే యెుద్దు న న్నటిమి పెడ, దోయుం దలఁపఁసనఁ గాదు ధూంతారిచయా.

—♦ సముద్రుఁడు తనయందు సేతువుఁ గట్టునుపాయముం జెప్పి యంతర్హితుఁ డగుట ♦—

తే॥ అట్లుగావున విశ్వకర్మాత్మజాతుఁ, డతనికిం బ్రీతి యైనవాఁ డప్రతిముఁడు
తత్కృపాప్రాప్తపూర్వప్రదత్తవరుఁడు, నలుఁడు నీసేనఁ గలఁడు సన్నద్ధుఁ డతఁడు.

క॥ ధీమంతుఁ డాతనిం గొని, శ్రీమంతుఁడ! యానతిమ్ము సేతు వొనర్పన్
సామగ్రి నేను మోచెద, నామహితుఁడు నైవ యోధు లందియుంగన్. ౨౯౩

తే॥ చేయుఁగావుత సేతు వాసిద్ధినంతుఁ, డదియు నాయం దొదవి లంక నందుఁగావుత
కూళ దెగుఁగావుత సీతఁ జేకొందుగాత, నీదు కీర్తి జగత్త్రయి నెగడుఁగాత. ౨౯౪

క॥ ఈకృతి పుణ్యఫలప్రద, యాకృతి గొన్నట్టి తేజ మఖిలజగములన్
గైకొని మనుపంజాలు న, నేకులఁ దరియింపఁజేయు నితకంకణ మై. ౨౯౫

క॥ ఏ నరిగివత్తు నింకిట, నీనెఱి నెఱయంగ మెఱయనేర్తువ కాదే
శ్రీనాయక యని యంబుధి, తా నంతర్ధాన మొనసెఁ దరుణీమణిరో. ౨౯౬

—♦ నలుఁడు సేతుబంధనమునకు శ్రీరాముననుజ్ఞ గోరుట. ♦—

ఉ॥ అంతట వానరప్రవరుఁ డైన నలుండు వరప్రభావమ
త్యంతసమృద్ధి మైకొన సమర్థత మైఁ దనరారి జానకీ
కాంతునిఁ జేరి మ్రొక్కి యొసగంగదె యాజ్ఞఁ బొసంగ సేతు వే
నెంతయు వేడ్క మీఱ రచియింతుఁ దలంతుఁ గృతార్థత న్మదిన్. ౨౯౭

క॥ నాతండ్రి వర మొసంగిన, యాతత్త్వముఁ దెలిపి నీతఁ డది నిజ మన నై
నాతలఁపును బెసఁగొనె ని, ట్లీతఱి నే నెంత సేయనేనియుఁ దగుదున్. ౨౯౮

ఉ॥ మందరమందు మాజనని మానితఁ జేకొని విశ్వకర్మ ని
ష్పందసుఖాఢ్యుఁ డై తనరి బాలుఁడు నీ కుదయించు వాఁడు నా
యందలి శిల్పవైభవము లందఁగలాఁడు తరించువాఁడు వా
ర్ధిం దనలావుమై ననిమెఁ జేఁకువమై వచియించె నబ్ధియున్. ౨౯౯

క॥ ఒండు దెలుపకయ యే నా, కుండనె నేర్తు నని పలుకఁగా నే మగు నా
తండు స్మృతి కెక్కఁజేయఁగ, మెండుకొనె న్విదిత మది సమీహిత మగుచున్.

ఉ॥ ఓకపులార! మీర లిఁక నోపికమైఁ గొనితెండు సాలముల్
ప్రాకటశైలశృంగములు పాదములుం దగునట్టు లన్నియుం
జేకొని యే నమర్చెద విశేషవిధాన మచర్చితంబుగా
నాకృతి నామతిం బెరసె నాకృతిఁ గైకొని చొప్పు చొప్పడన్. ౩౦౧

క॥ దండమె వశ మొనయని యు, ద్దండులనేనియు మరల్పఁదగినది సు మ్మా
మొండిక్షమ శరులఁ దీర్చునె, పండునె సాంత్వమ్ము దానపద్ధతి వలనే. ౩౦౨

తే॥ అమ్మహోదధి యిమ్మెయి నందువాఁడె, సేతు వొనరింపుఁడని యుక్తిఁ జెప్పువాఁడె
దండభయమునఁ గాకున్న దాశరథికిఁ, జుట్టమే నాదు నని యెంచి చూడఁదగఁడె.

క॥ కావున వైళమె సేతువు, గావలె యుదధిం దరింపఁగావలె దఱియం
గావలె లంకం బోరిగొనఁ, గావలె రక్కసుని జయము గావలెఁ బతికిన్. ౩౦౪

క॥ అని నొడువ వారలా నన, ననుమతి నెఱపెనుఁ బ్లవంగమాధిపుఁ గొని యా
య్యినకులతిలకుఁడు మే లన, ననుజుఁడును విభీషణుండు నను విదె యనుచున్.

ఉ॥ మాంగళికోద్యమం బటు లమానుషయోగకళానిధాన మై
పొంగ గుణోచ్ఛ్రితం బగుచు బోరన నాహరివాహినీవ్రజా
భంగతరంగనిస్వనవిభావవిభావ్యరసప్రవాహ ము
ప్పొంగను రామదేవుఁ గని పొంగిన వార్ధికి నీడు జోడుగాన్. ౩౦౭

క॥ అని విభుఁ డెఱిఁగించిన సతి, విని సర్వేశాన లోకవిభు చారిత్రం
బనుపమరస మావల నే, యనువునఁ జెల్లెనొ వచింపు మని యడుగుటయున్.

శా॥ భావాభావవిభావభావవిభవప్రస్తావసంభావనా
ప్రావీణ్యప్రథమానభావుకజనప్రఖ్యాతభావోదయా
జీవంజీవితజీవలోకరసలక్ష్మీస్రప్రపణానంతచి
ద్భావానూనకలానిధానసుఖనిత్యశ్రీవిశేషాంచితా. ౩౦౮

క॥ భక్తజనానుగ్రహసువి, భక్తరసోదయ! దయాప్రపంచితగుణసం
భక్తమహావిభవాభి, వ్యక్తావ్యక్తస్వభావవరసద్భావా. ౩౦౯

వనమయూరము॥ కారణగణోపచయకల్పితజగత్కా
పూరణగుణాతిశయపోషణసముత్కా
వారణమనోధికృపవాంఛితవలత్కా
లేరణవినాశితమహీజనవృషత్కా. ౩౧౦

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథామృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబునం
దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవే నమః.

# శ్రీరామకథామృతము.

## యుద్ధకాండము.

:o:

### పూర్వభాగము - చతుర్థాశ్వాసము.

:o.



కామ్యజగదధీశ
త్వాకలితవిలాస చిన్మయాంతర్హృదయా
ప్రాకటభవాబ్ధిసేతు
శ్రీకరకరుణాకటాక్ష! శ్రితసంరక్షా! ౧

ఆ॥ అవధరింపుమయ్య! యనవరతామృత వాక్ప్రసంగ మొసఁగి వలను సూపు
మయ్య! యభవుఁ డప్పు డగరాజకన్యకఁ, గాంచి స్మేరదృష్టి కలన మించి. ౨

తే॥ పలికె నిట్లని వింటివే కులుకులాఁడి, లోకనాయకు నాసతి లోనఁ జొచ్చి
యప్రమేయచిదానంద మందఁ జేయ, నలుఁడు పరిపంథిజనదవానలుఁడు గడఁగి.

క॥ తనతోడియోధవులఁ దోడ్తోఁ, డ్డాని బీరము మేటితోన గొనకొని చనుగ
ఘన మన మబ్బెడు తటి యని, మనోగతము సెసి సేతుమార్గక్రమమున్. ౩

తే॥ లోనియాలోచనమున నాలోచనమ్ము, సేసి సహజన్మకృతయోగ సిద్ధిఁ బెఱిఁగి
వస్తుసామగ్రిఁ గూర్చి నావల నిది యని, శ్రుతపతించె నిల్లవానరస్తోమము సకు. ౪

ఉ॥ ఆయెడ రామచంద్రుఁడు మహావిభవుం డఖిలార్థదర్శి సు
శ్రీయుత మా స్వకీయపదసిద్ధము లింగ మొకండు కీర్తనం
స్థాయము సేతువుం దొరయ నబ్ధిదరి న్నెఱి సుప్రతిష్ఠితం
బై యనువొందఁగా నిలిపె నాతని దా తలఁ పెన్నశక్యమే.

క॥ పూజ లొనరించి ధృతి నం, భోజదళాక్షుండు రామభూపతి మహితో
త్తేజనము నెఱసి తనయు, వ్యాజకరుణ వెలయ నిట్టు లనె శ్రీయుతుఁ డై. ౭

—♦ శ్రీరాముఁడు రామలింగప్రభావముఁ గపులకు బోధించుట ♦—

సీ॥ ఇచట మత్కృతి మించు నీసేతుబంధమ్ముఁ బ్రణమిల్లి సేవింపఁ బంధ మెడలు
రామలింగేశుఁ బర్వతవర్ధనీదేవి భక్తిమై బూజింపఁ భవము దలఁగు
నెవఁడు వారాణసికేగి గాంగజలమ్ముఁ గొని తెచ్చి ప్రియతుఁ డై కోర్కు లలరి
యనువొంద నిమ్మూర్తి కభిషేక మొనరించి భార మంబుధిలోనఁ బరఁగ వైచు
నతఁడు బ్రహ్మణ్యుఁ డై బ్రహ్మ మందఁగలఁడు
బ్రహ్మహత్యాదిపాతకప్రచయ మడఁగు
వాని కేఁ గూర్తు వత్సలత్వంబు దనర
వంశపావనుఁ డవ్వాఁడు వసుధలోన. ౮

క॥ మనుజుం డెవ్వాఁ డేనిన్, ఘనపాపౌఘము లొనర్చి కాని పథమునన్
జననేనియు రామేశునిఁ గని యన్నియు విడిచి కొలువఁ గాంచును ముక్తిన్. ౯

తే॥ రామలింగేశ్వరా! యంచు రక్తి వొదల
నామ ముచ్చారణ మొనర్చు నామహితుఁడు
నేమమున నున్న సీమయు నిర్మలంబు
శ్రీమహోన్నతుఁ డతని సంసిద్ధి వెరయు. ౧౦

క॥ రామేశ్వరతీర్థంబున, కామదదూరంబులోని దగు జీవం బె
ప్డేమెయి మడియున యేనిన్, దామరసార్భకుని పుణ్యధామం బెనయున్. ౧౧

క॥ ఆచంద్రార్కం బిది పు, ణ్యోచిత మగు తీర్థ మనఁగ నొప్పఁ బ్రథిత మై
ప్రోచినక చేసిన తప, మాచొప్పున వేయుమడుఁగు లై వర్ధిల్లున్. ౧౨

చ॥ అని మనువంశరత్న మటు లానతి సేసి విధాన మొప్ప నె
మ్మనమున ధ్యానయోగము సమంత్రిక మా నెఱిఁ బాదుకొల్పినన్
ఘనకుతుకం బెలర్ప జనకాత్మ్యుని రాముని గాంచి సత్కృతు
ల్పనరఁగ నేను ధీశరధి! దాశరథీ! యని యిట్లు పల్కితిన్. ౧౩

క॥ నీసంకల్ప మమోఘం, బోసావిత్రికులదీప! యుజ్జ్వలరూపా!
యేసరణి నెది పొసర్చితి, వాసకల మొసంగు నక్లై యరమఱ లేలా. ౧౪

ఉ॥ నీవఖిలాత్ముఁ డౌ హరివి నిర్మలమూర్తివి యెల్లలోకులం
బావనులం బొనర్ప నరభావము నొందితి నేను మున్నుగా
దేవత లెంచి యుంచిన దె దేవ! వధింపుము లోకకంటకున్
రావణు నింక ని న్నోరసి రాఁగలవార లె యుంద జీకృతిన్. ౧౫

క॥ కల్యాణమూర్తి! త్రిజగ, త్కల్యాణ మొనర్చ నీదు కాంతం గాని సా
ఫల్య మొదవఁ బురికిం జని కల్యము వెలయింప నెపుడు గడకొనెదొకదే. ౧౬
క॥ అని నెయ్యము తియ్యముగా, ననువొందఁగఁ బలికి తత్సహాత్వము తసరన్
ఘనతత్త్వరహస్యంబుల ననుమతిమైఁ దేర్చి తనివు నందిన ధృతిస్తోన్. ౧౭
తే॥ రామదేవప్రతిష్ఠిత రమ్యమూర్తు, లందు నర్ధార్ధనిజకళ లందఁజేసి
వచ్చెదనటంచు నే నిట వచ్చినాఁడఁ, జిత్తమాతనిమూర్తిపైఁ జేర్చినాఁడ. ౧౮
క॥ ఆరామప్రభుఁ డాదట, నారూఢిమెయిం బ్లవంగ మాధికృతులఁ జె
న్నారఁ గని మీర లింకిట, నారంభింపఁదగు సేతు వని నొడువుటయున్. ౧౯

—♦ కపులు రామాజ్ఞ చొప్పున సముద్రమున సేతువుంగూర్చుట. ♦—

శా॥ రామాధీశు ననుజ్ఞ మున్కొని మహారణ్యంబులోఁ జొచ్చి యే
మే మంచు న్మయివెంచి యూధపులు సాహిత్యంబు చెన్నార ను
ద్దామప్రక్రియఁ బెల్లగించిరి గిరుల్ ధాత్రీజము ల్దెచ్చి ర
ట్లామంత్రించుచు వైచి రంబునిధి తోయౌఘంబునం దద్రిజా. ౨౦
సీ॥ అశ్వకర్ణము లొంట నందిచ్చి నైశమేకుటజము ల్గొనుమని కొసరువారు
సాలార్జునంబులు చాలునా యివె యింక ధవవంశము లటంచుఁ దఱుమువారు
కర్ణికారము లివి కావు బిల్వము లంచు సప్తచ్ఛదము లిచ్చి జరుగువారు
తిలకంబులో యంచుఁ దిమిశంబు లెనయించి యవెయశోకములనియఱచువారు.
ఇంద్రకేతువు లనుచుఁ బైకెత్తి నారి, కేలహింతాలతాలర సాలనక్త
మాలవకులాదు లొక్కట మలయఁజేసి, గేలిమెయి నాడుకొందురు శవరులు.
తే॥ ఆటమైఁ దెచ్చి రళ్లైము న్నీట వైచి, రాకపులఁ గపులన నెట్టు నాకప్లులన
జంబుజంబీరనింబకదంబముఖ్య, సాలముల నింపె నబ్ధివై శాల్య మబల. ౨౨
మ॥ ఖదిరాశ్వత్థకపిత్థచందనగజ గ్రాసాక్ష ముఖ్యంబులన్
ముదమొప్పం గొనివచ్చి రద్రిశిఖరమ్ము ల్దెచ్చి రాకాశముం
గదియం జేర్చిరి పేర్చి రెమ్మెయి కడంక న్నేర్చిరో నాఁగఁ జె
ల్లదు శాఖామృగముల్గదా యొకట లీలాభాషితోల్లాసినీ!. ౨౩

—♦ నలుఁడు సేతువుం గట్టుట ♦—

తే॥ అందఱును దెచ్చునవి యెల్ల నందుకొనుచు
నబ్ధి వైచుచు ఘట్టించి యలవఱచుచు
కొలత లిడి హెచ్చుతగ్గులు కూర్చుకొనుచుఁ
దొడరెఁ బొనరింప నలుఁడు సేతువు రసజ్ఞ! ౨౪
క॥ పదియామడలు వెడల్పుగఁ, బదిపదు లామడలు పొడవు పరఁగఁగ సవరై
పదిలమయి యుండ మదిలో, నుదియంగొని కుదురుపఱచి యుజ్జ్వలుఁ డగుచున్

సీ॥ పనుమాఱుఁ గొలఁదిగా నొండొంటఁ జేర్చి యడ్డలు సేర్చి యాలంబనంబుల ననువుపఱిచి
కాష్ఠఘట్టనలచేఁ గదియించి కుదియింప నొక నెడ నొండొండ నదిమి యదిమి
పలుతూలు కొండలు పాదకూటమ్ములుఁ బరగింప నొక చోట్లఁ బాదుకొలిపి
పై మేలిపలకలు పఱిచి కీల్కొనఁజేసి నెఱచూడ్కి నిగుడించి నెరులువాపి
కట్టెఁ గట్టితనము గలికితనంబును, గానిపింప వాఁడు కలనఁ బెంప
వస్తుసమితిఁ దెచ్చి వానరేంద్రులు నింప, మొనసి కడలి భారమును వహింప. ౨౬
తే॥ అమ్మహాకాయులు ప్రసక్తి హస్తిమాత్ర
ము లగు పాషాణములు గిరు ల్వ్రచ్చి తెత్తు
రటు సముత్పాటన మొనర్చి యనువు నెఱయ
దారుయంత్రంబుల నొకొండ్లు దార్చుచుందు. ౨౭
క॥ జలము పయి కెగసి యభ్రం, బొలసి పునఃపతిత మగుడు నురుధారాసం
కుల మయ్యె నబ్ధి వానరు, లలవోక గిరు ల్దొరలు నాసమయమునన్. ౨౮
ఉ॥ కొండలు బండలుం దరులుఁ గొల్లలుగాఁ గొని తెచ్చి వైచుచున్
దండఁ బ్రమాణసూత్రపటదండములం బరఁగించుచు న్సము
ద్దండత నెందుఁ దారె యనఁ దార్కొనుచుం బరికించుచు న్ధరా
ఖండలు నాజ్ఞ నక్కొని రఖండులు వా రటు సేతునిర్మితిన్. ౨౯
తే॥ చూడనేర్చినకనులకే చోద్యమయ్యెఁ, నాడఁదొడరెడు నాల్కలే యడరవయ్యెఁ
గేలిమెయిఁ దృణకాష్ఠోరు గిరితరుప్ర, తతులు గొని వారు పఱతెంచు తఱిని గిరిజ!
తే॥ కట్టుచున్నాఁడు నలుఁ డబ్ధిఁ గంపితమ్ము, సేసి యమ్మహాసేతువు భాసురముగఁ
గూర్చుచున్నారు వానరు ల్ఘోరకర్మ, లంగనా! యింకను గొఱంత యనఁగఁగలదె.
తే॥ కోఁతు లిరుగడలం గీలు కొలిపినట్టి, పుష్పితంబులు ఫలితము ల్భూరుహములు
పెట్టినట్లుండ వచటునఁ బుట్టినట్లె, కానిపించె విపరివృత్త కాలగతిని. ౩౨
ఆ॥ శైలములును శిలలు సరిదధీశు జలంబు
లొరయు దొరయు నులివు లొక్కఁ డగుచు
సాగి దెసలు మిన్ను సవరింప నలనాఁటి
మథనవార్త నతఁడు మఱచి మొరసె. ౩౩
క॥ కృత్యారంభము నాఁడు ని, రత్యయముగ నడువఁ బదియు నటు నాలుగు నొ
పత్యయమున నామడలకుఁ, బ్రత్యక్షం బగుచు సేతు పద్ధతి తనరెన్. ౩౪
క॥ మఱునాఁ డిరువదియామడ, లఱిమంగానయ్యెఁ దఱిమి యాభీమబలుల్
నెఱయించు నెఱిని విభు న, క్కఱఁ దలఁచెడు చిత్తవృత్తి గడలుకొనంగన్. ౩౫
ఆ॥ అటు తృతీయదివస మం దేకవింశతి, యోజనములు గడచి రురుబలాఢ్యు
లవల నాలుగవది యగు నాఁటి కిరువది, రెండు యోజనములు రిమ్మకొనిరి. ౩౬

క॥ పంచమవాసరమునను బ్రి, పంచితవిక్రములు రెండు పదు లోకమ్మాఁడుఁగా
సంచితము లైన యామడ, లంచితలీలం దరించి రాదరి దఱియన్. ౩౭

మ॥ అతివేలోద్యము లాహరిందు్రి లరరే యావేల నావేల సు
స్థితిఁ గన్పట్టి సువేలశైలవరముం జేరంగ సారంగ పుం
గతి మీఱ న్గమకించి యాకృతినెఱిం గావించి సేవించి రా
శ్రితరక్షాచణుఁ డైన రాముపదము ల్సిద్ధార్థు లై పార్వతీ! ౩౮

క॥ ఆవిశ్వకర్మతనయుం, డావిశ్వనిచితనయుం డహో యంబుధిలో
నావిర్భవింపఁ జేసిన, యావిశ్రుతకీర్తి రూప మట్లొండెఁ జెలీ! ౩౯

క॥ శ్రీమంతుఁ డాతఁ డదియును, శ్రీమంతం బనఁగఁ దనరె శ్రీమంతు కృపన్
సీమాంత మెనసి లంకా, సీమంతము దీర్పఁజాలు స్థితి కెక్కె సఖీ. ౪౦

క॥ ఆసాగరమున నలకృత, మా సేతువు వొల్చె నంబరాంతరమున శ్రీ
భాసిలు స్వాతీపథ మన, నాసాదితసకలసుగుణ! యౌచిత్యచణా!. ౪౧

క॥ ఆయద్భుతమును గనుఁగొన, నాయమరులు సిద్ధనర్వు లటు గంధర్వుల్
పాయని ధృతి బయలున నన, పాయస్థితిఁ దనరి రప్పుడు పర్వేందుముఖీ. ౪౨

—♦ దేవగంధర్వులు సేతుబంధనమునఁ గపుల నెన్నుట. ♦—

సీ॥ అనుపచింత్య మసోఢ మతిదుష్కరం బద్భు తాద్భుతం బధికోను మార్గణంబు
నా నొప్పుచున్నది నలసేతు విది బళే యబ్ధికి సీమంత మనఁగఁ దనరి
సుకృతవైశాల్యంబు శుద్ధకాంతిసుభూమి సునమాహితంబును సుదృఢతరము
నై తీర్పుగన్నది యఖిలేశుఁ డీరాముఁ డగు నింక సందియం బందవలదు
చాల్పు నూఱామడలును వెడ ల్పటు పది, యానుడలుగ ఘంటాపథ నుంబు గాశి
గడఁగి కావించువాఁ డున్నె కడచినారు, కపులు గడచి రిక్కాట్లు జగములవారు.

ఆ॥ అనుచు వార లనఁగ నఖిలభూతంబులుఁ, బ్రిమద మంద సేతు బంధనప్రి
కాశ మొప్పెఁ గుప్పి గంతులు వైచి ర, య్యగచరేంద్రు లండి రఱచి రగడ!.

క॥ ఆకోటిసహస్రములు వ, నౌకసులు మహౌజసులు మహాంబుధి సేతు
శ్రీకరణమునఁ దరించిరి, శ్రీకరులు భవాబ్ధి దాఁటి సిరిఁగాంచ రశే. ౪౩

క॥ ఇదె పున్నెం బిదె మాన్యం, బిదియె యనీదృశము శుభ్రిశ మీహిత మర్థం
బిదెపో ముక్తిద్వారము, మదవతి! రామకృతసేతు మార్గం బెన్నన్. ౪౪

తే॥ రామసేతుస్మృతి మనోభిరామములు త, దభిగమనదర్శనము లేతదాశ్రయణము
రామలింగేశు సేవాభి రతియు నిఖిల, కలుషహారములు సంతోషకారణములు.

సీ॥ ఆసాస నట్టాడె దకట యే మని బ్రహ్మహత్య! యెచ్చోటనో యడఁగి మనుము
భ్రూణహత్యా! నీ కుబుద్ధిమానవు చని తలదాఁచుకొనరాదె తడయ కొకట

మత్తతవాయదో మద్యపానమ! నీవు పడెదు లే నీపాట్లు బ్రహ్మ మెఱుఁగు
పాడు స్తేయంబ! నీ వంబ రేగును లేచి పాఱిపోరాదటే బ్రదుకుఁగోరి
యోపిశాచులార! యోబ్రహ్మరక్షస్సు, లార! మీకు వలను లావుఁ గలదె
యేల కదల రింక నీనాఁట మీవారు, సేతుదర్శనంబు సేయువారు. ౪౮

క॥ అని నొడువుచు నొండొంటిం, గని మీఁ దారయుచు బిట్టు గలఁగుచుఁ జనలే
క నితాంతచింత మునుఁగుచుఁ, గనుకని మేర గుమిగొంచుఁ గదలుచునుండున్.

తే॥ దాశరథిచేఁ బ్రతిష్ఠాపితంబు గాఁగఁ, జెలఁగు పాషాణనవకంబు సేరఁ బాఱి
నంతనే మర్త్యుఁ బాసి దిశాంతములకు, నిన్నియుం జనుఁ దత్సత్త్వ మెన్నఁదరమె.

తె॥ దర్భశయనంబుఁ గాంచఁ జింతలు తలంగు
నానవగ్రహపాపలదృష్టి యఘము లడఁచు
జ్ఞాన మొసఁగు రామేశు దర్శనము తోన
రామసేతువుఁ గన ముక్తి రామ వలచు. ౫౧

మ॥ పడఁతీ! పాపము లెట్లు పైకొనినఁ జేడ్పాటు ల్విజృంభించినన్
జడభావైకనిమగ్నుఁ డైన బహుదుశ్చర్యోచితుం డైన నె
వ్వఁడయేని న్విభు సేతువార్త విని యాపార్తి న్మలంగంగ నె
వ్వఁడు చిత్తం బిడు జన్మవార్ధి దరి నవ్వాఁ డొందఁగాంచుం జుమీ. ౫౨

తే॥ అచట నెలకొనె గంగాదులౌ సరిత్తు, లెల్లజేజేలు జడదార్ఢ్య నిమిషీ రట్టు
లందెపో యందె దొడిగిన దఘము లడఁప, బంధముక్తిఁ బొనర్ప నాధారమనుచు.

క॥ రామకృతసేతువృత్తం, బేమానవుఁ డైనఁ జదువ నెఱిఁగింప విన న్
గామాద్యరిసంక్షయము, న్నేమంబున నెఱపు నెగడు నిర్మలుఁ డగుచున్. ౫౪

క॥ అంతట విభీషణుఁడు తా, నెంతయుఁ గుతుకమునఁ జేర్చి హితులఁ గొని సము
ద్రాంత మొనసి గదతోఁ బ్ర, ర్యంతార్పితదృష్టిఁ బరుల నరిగొన నిలిచెన్. ౫౫

మ॥ పతి సుగ్రీవుఁడు గాంచి మాంగళికమౌ ప్రస్థానముం జెప్పి స
మ్మతి నిమ్మారుతసూతి మూఁపునయు మన్మైత్రి లక్ష్మణుం డంగదాం
సతలాలంకరణంబొనర్చు నెర వౌ సంద్రంబు దాఁటింతురి వి
రతిలోకప్రతిభాసమానమహిమాఢ్యా రామ! శ్రీమానితా. ౫౬

ఆ॥ మేలి చిగురు లట్లు మృదువులౌ నిమ్మయి, యడుగు లిట్టి కఠిన మైన నేల
జోఁక నొరలఁ ద్రొక్కఁ జూచి సహింతునే, మకరనిలయ మలఁతి మలసిచనెనె.

క॥ అను వాని హితోక్తులు మె, చ్చి నవోన్మేషంబుతోడి సిరి చెలువారం
దనరారి వారి మూఁపుల, నినవంశ్యు లలంకరించి రేడ్తెఱ మెఱయన్. ౫౮

క॥ ఘను వెక్కుడి ధర్మాత్ముం, డనుగతసుగ్రీవుఁ డగుచు ననుజుం డటు తో
డనె రా సేనాముఖమున, ననువొందఁగఁ దనరి కడచె నవ్వార్ధి వెసన్. ౫౯

సీ॥ బలుతోఁక లెగయించి బ్రహ్మాండగోలంబు సవరింతు మని చర్చ సలుపువారు
సేతువు నడుచక్కఁ జిఱుగంతు లిడుచుఁ గా లానఁ దత్పారాప్తి కడరువారు
పార్శ్వభాగంబులఁ బఱతెంచి యొండొడ్ల నొరయుచుఁ బట్టున నుఱుకువారు
దారి చాల దటంచు వారిమధ్యంబున నీఁదువా రటు దివి కెగయువారు
నేము వైహాయసపథంబె యెనసివత్తు, మనుచు సౌపర్ణకాఖ్యాన మందిపుచ్చు
కొనెడువారును నై యబ్ధి కూల మెనయఁ గనిరి హరివీరు లుత్ఫుల్లకమలనయన!
తే॥ అట్లు హరివాహిని తరించునపుడు తోడరు
భీమనిర్ఘోష మర్ణవపృథులఘోష
మాఁగి లంకాపురం బెల్ల నాక్రమించెఁ
దొలుతతాఁకు డదియకాఁగఁ గలుషశమని! ౬౧
ఆ॥ కడచి యపుడె బహుల కందమూలఫలోద, కంబు నాఁగ నెగడు నంబునిధిత
టంబునందు విడిసె నంబరంబు గ్రసింప, నదియ చాలు ననఁగ నమరవినుత!
ఉ॥ అబ్బలు వెంచి తచ్చరిత మంతయు దుష్కరమే యటంచుఁ బె
ల్లబ్బుర మావహిల్ల నవురా యని వేలుపులు న్మహాత్ములు
న్నిబ్బర మైన దృష్టి నవనీరదవర్ణుని రాముఁ గాంచి పె
న్నబ్బలి దాఁటినార మని యుబ్బున నైమఱ పుల్లసిల్లఁగన్. ౬౩
ఆ॥ ఇంచురసము లలరు తెలమి మైకొనఁ గురి, యించి సమభిషిక్తుఁ డితఁ డంచు
నెంచు మదిఁ దనర్చె యేణాంకముఖి! యిట్టు, లనిరి వారు తద్ధితార్థు లగుచు.
మ॥ అరివర్గంబుల గెల్వుమయ్య జగదాహ్లాదంబు చెన్నొంద ను
ర్వర సద్వీప ససాగరన్ సుమహితైశ్వర్యంబు సేకూర వ
త్సరము ల్శాశ్వతము ల్భరించి మన నిచ్ఛం గూర్పుమయ్యా! యిఁక
న్సుర దేవర్షి సమర్చ్య! రాఘవ! పరానందస్వరూపా! హరీ! ౬౫
ఆ॥ అనుచు వాచికార్చ లందించి యంతర్థి, సేయ ననుజు నెడఁదఁ జేర్చి పేర్చి
యానిమిత్తవేత్త యగు నిమిత్తంబులఁ, గాంచి యవలికర్జ మెంచి పలికె. ౬౬
క॥ లలితఫలమూలములు శీ, తలజలములు నైన వనుల తలసు లరసి యా
వ్వలనుల నెలకొని యస్మ, ద్బలౌఘముల మోహరింపఁ బరఁగుదు మింకన్. ౬౭
క॥ ఆకాలికలోకక్షయ, మీకారణమునఁ బొసంగె నిరుతెగలందున్.
జీకాకుపడుట పొల్పదు, నేకరణిఁ దరింతుమొక్కొ యీయర్ణవమున్. ౬౮
తే॥ వాతములు వీచుచున్నవి వలనుదలఁగి, యీవసుంధర కంపించు టెటుకపసినొ
నగము లగములు వేపమానంబు లగుట, గానవచ్చెడు నిచ్చోటి కాననముల. ౬౯
క॥ ఘనములు క్రవ్యాదాకృతు, లను బరుసఁదనంబునం గలకపాటిడ నా
స్వనముల శోణితజలవృ, ష్టిని మొనయించెడు జనముల చేటు నొడువుచున్.

తే॥ రక్తచందనద్యోతసంభక్తఘనతఁ, బరమదారుణమై సంధ్య పరఁగుచుండ
నందుచుండెను నాదిత్యమండలమున, నుండి యుల్కెడు నొకవహ్ని పిండ మనఘ.

క॥ దీనములును ఘోరములును, దీనస్వరములును నగుచు దివికై మోరల్
గా నగుచుఁ గనుచు మెకములు, నానెఱిఁ బక్షులును నొకఁట నఱచెడుఁ బెలుచన్

సీ॥ తనప్రకాశము వీడి తపియింపఁ జేయుచు నున్నాఁడు రజనియం దుడుల ఱేఁడు
కట్టెఱ్ఱనై కడ కప్పు కెంపులముప్పు నెఱిసూపె రూక్ష మా కుఱుచపరిధి
నీలలక్ష్మ మొకండు నెలకొనె లక్ష్మణా! యమలభాస్వన్మండలాంతరమున
బందూళి గ్రమ్మినఁ బేరెత్తరాని చుక్కలై తెల్పునవి క్షయ కాలగతిని
గాకములు శ్యేనములు గృధ్రగములు దక్క, వానిరాయిడి వడగొని వ్రాలఁజొచ్చె
నశివములు భీషణములునై నట్టి రొదల, వదరుచున్నవి యేప్రొద్దు వంచకములు.

ఉ॥ కావున శైలశూలములఁ గైకొని వానరరాక్షసౌఘముల్
లావునఁ బోర నెక్కొనన నిలాతల ముద్గతమాంసకర్దమం
బావిల మావృతంబు నన నయ్యెడు నిట్లని వంక లెన్నఁగా
నావల నున్న కాఁగలది యై చన నావలఁ గానఁగానగున్. ౭౪

తే॥ తడయు కొక్కటఁ దొడరి దుర్ధర్ష లంక, రాక్షసబలాభిరక్షిత రాజధాని
ముట్టడింతము నాలుగు తట్టు లొరసి, యఖిలమును వానరమయంబ యై తనర్ప.

ఆ॥ నేఁటి కచటి కరిగి నేటుకొనందగు, తావు లరసికొని విధంబులెఱిఁగి
సలుపవలయుఁ గార్య సంస్తవం బని పల్కి, తరలె విభుఁడు యుద్ధ పరత నెఱయ.

క॥ లంకాభిముఖుం డై సి, శ్శంకుఁడు రాముండు ధర్మ సంశ్రయుఁ డొకఁడున్
వంకయిడరాని కడిమి న, సంకాశ్యము ధనువు గొని సు సంగతుఁ డయ్యెన్.

ఉ॥ తోడనె తమ్ముఁడు న్నడిచె దోర్బలసారులు వానరర్షభుల్
తోడయి రక్షకేశపతి తోడు విభీషణుఁ డార యిట్టిఁ డా
జాడ యనంగ మున్కొనఁగ సంభ్రమ మొప్పఁగ శత్రుమర్దనం
బాడఁగ నైన యాట యని యాడుచు నర్తనము ల్సలంగఁగన్. ౭౮

క॥ ఆరీతిఁ దగువారలు, తారే యనఁగాఁ దనర్చు తారేయాద్యా
ధారుల హరివీరుల నెఱి, యాఘోషియు నరసి రాముఁ డలరారె ధృతిన్. ౭౯

తే॥ వీరసమితి వ్యవస్థిత యై రఘువర, వీరుచే నది భాసిల్లె వెరవు గాంచి
శోభనాంచితనక్షత్ర శుద్ధమూర్తి, మహిత శారది యగు పౌర్ణమాసివోలె. ౮౦

ఆ॥ పుడమి వడఁకఁ దొడరె బోరన నతిపీడ్యమాన యగుచుఁ దృశ్యమాన యగుచు
సాగరమ్ము రమ్ము జాడ వానరబలౌఘమ్ము తలము నెల్లఁ గ్రమ్ముచుండ. ౮౧

శా॥ భేరీమర్దలకాహళాదిరవసంభిన్నంబు రోమాంచదం
బై రక్షఃపురిఁ దోఁచె సంతుముల మహా నాకోత్రిశ మద్దాని బ
ల్వీరు ల్వానరయూథపు ల్వినిరి తోఁ బెల్లార్చి రత్యంతహ
ర్షారూఢిం దదమర్షణంబు తెలఁగి క్లా నాఁగ నొక్కుమ్మడిన్. ౮౩

తే॥ ఆప్లవంగాధిపుల గర్జలంబరమున, దృప్తమేఘములవి గాఁగఁ దెలఁగుపడుచు
గర్భనిర్భేద మొనరింపఁ గడలుకొనుట, రాక్షసులు విని రటు మహాశ్చర్యపడిరి.

చ॥ దశరథరాజనందనుఁడు తాఁ గనె నప్పురిఁ జిత్తవృత్తికిన్
విశదము గాఁగఁ బండువు నివేదితముం బొనరించుచొప్పునన్
దిశ లొలయించు మంగళవిధిప్రహితాఖిలవాద్యనాదముల్
భృశమణిసౌధరాజనునివిష్టకలాపరిచయంబు లొప్పఁగాన్. ౮౪

తే॥ ఆధ్వజపతాకికావళు లాత్తసార, తోరణద్వారగోపురాపూరణంబు
లావిమానాగ్ర్యలక్ష్యవిద్యాప్రసక్తు, లరసి జానకిఁ బెరసె హృదంతరమున. ౮౫

ఉ॥ ఉమ్మలికమ్ము నెమ్మనము నూర్జితముం బెడదారి కీడ్వఁ దో
నమ్మహిరాన్వవాయమణి యక్కట చిక్కనకాదె యొంటిమై
నమ్మృగశాబకాక్షి ముదితాత్మిక సీత సతీవతంస మీ
యిమ్ముల నిమ్ముపీడి యిటు లేఁబడుచుండఁగ నింతకాలమున్. ౮౬

తే॥ రోహితాంగగ్రహార్దిత రోహిణి యన, వితతవగ్రహాతిక్లాంత క్షితి యనంగ
రావణోపరోధంబున రాణసెడఁగ, నెట్టులున్నదియో సాధ్వి యెఱుకపడదు. ౮౭

క॥ అని దీర్ఘము నుష్ణము నగు, వినిశ్వసన మెడల రామవిభుఁడు సుమిత్రా
తనయుం గని తత్కాలో, పనతౌచితి తనర నిట్లుపలికె విధిజ్ఞా! ౮౮

సీ॥ చూడు మోలక్ష్మణ! చుక్కలతెరు వెల్లఁ బొడుచుచున్నది లంక పొడవు పెరిగి
తలఁచినంత లొనర్చి దాకొల్పెఁ గొండపై నావిశ్వకర్మతుం డైన మయుఁడు
వెలిమబ్బు లొగి గ్రమ్మ విష్ణుపదం బట్లు బహువిమానాకీర్ణ పరఁగె నిదియు
మేలి సంస్థానము ల్మెఱుఁగులీనఁగలీల నందె నైరమ్మదీ యూథిలక్ష్మి
తమకు నందనచైత్రరథములు చాల, వనెడు వనములు మత్తవిహంగలీన
మధుపఫలపుష్పతరులతామధురవాహి, నీశివానిలకలనల నియతిఁ దనర. ౮౯

క॥ పలికెడుఁ జిలుకలు కలరవ, మొలికెడుఁ గలకంఠతతులు నుదులలితములం
గులికెడుఁ గేకులు రసములఁ, జిలికెడు నిం దలికులములు శ్రీగీతులన్. ౯౦

ఆ॥ ముప్పొలముల సిరుల మొనసినదే వాని, గెలిచినదె విశేష కీర్తికలనఁ
గాని కాంతుఁ డంత కావరుం డనునదే, యొచ్చె మెల్లభాగ్య మొంటి కగునె.

క॥ అని పలుకుచుఁ దటియుంజని, జనితోత్సాహమున బలము శాస్త్రవిధి విధిం
చెను నిలువ మోహరింపఁగ, ననుపమవీర్యుండు రాముఁ డధికృతి వెలయన్. ౯౧

—◆ శ్రీరాముఁడు గరుడవ్యూహమున సైన్యము మోహరించి శుకు విడిపించుట. ◆—

సీ॥ నీలుఁ డంగదునితో నెత్తి దుర్జయుం డయి యురమున నెలకొని యుండువాఁడు
ఋషభుండు వానర వృషభుండు బలముతో దక్షిణపక్షాప్తిఁ దనరువాఁడు
గంధహస్తితరస్వి గంధమాదనుఁడు దుర్ధర్షుఁ డా సవ్యపార్శ్వంబువాఁడు
ననుఁ బురస్కృతుఁ గాఁగ ననిచి నాతమ్ముండు తల నిల్చి దండడి సలుపువాఁడు
వేగదర్శిసుషేణులఁ బెరసి జాంబ, వంతుఁ డటు కుక్షి రక్షించు వాఁడు రాజు
జగముపశ్చార్ధ మప్పతి జాడఁ దేజ, మెసఁగ జఘనస్థలావన మొనయువాఁడు. ౯౩

క॥ ఈహారువున గారుడ మగు, వ్యూహము సమకట్టి ననిచి యొక్కట లంకా
గాహన కొనరింపంజనను, నాహిత మిది మీర లెంచి నడువుం డనినన్. ౯౪

క॥ రాముని యానతి గైకొని యామెయి యుగ్గరము వన్ని యనలసులై వా
రాముకొని లంక కరిగిరి, సామంతులు మెచ్చి పొగడ జలజాతాక్షీ!. ౯౫

ఆ॥ మేఘమాల దఱిసి మెఱుఁగు లొప్పారంగ, నాకసంబు గ్రమ్ము నట్లుగాఁగ
రాము సేన హరివ రప్రతిపాలిత, పుడమి నాక్రమించి పొల్చె నపుడు. ౯౬

మ॥ గిరిశృంగంబులుఁ బెద్దభూరుహములుం గేల్లం దలిర్పంగ వా
నరవర్యుల్పులకించుచుం దనుజుల న్నన్మారకుం బాతెఁ దై
పెరుగంజొచ్చిరి లంక యింకఁ గలదే భీభత్సతు ల్గారె యా
యురు లీముష్టులె జాలె చాలు నన నా నారూఢభావంబులన్. ౯౭

క॥ అంతట రాముఁడు నలినీ, కాంతునిఁ దేజమునఁ దొడరు కలనఁ దగి రుమా
కాంతునిఁ గనుఁగొని యిట్లనె, మంతనము దయాసముద్ర మయు మై తనరన్.

క॥ సువిభక్తము లైనవి యిపు, డవికలముగ సైన్యములు మహోబ్ధిఁ గడచి లం
కవలను గన్నారము శుకు, నవశ్యము విడిచిపుచ్చుఁ డతఁ డిలు సేరన్. ౯౯

ఉ॥ నావుడు రాజశాసనము నం గపిరాజు శుకు న్విముక్తునిం
గా వెరవెంచి చేయు మనఁ గావలు నీతని వీడనయ్యెఁబో
దైవము మేలు గూర్పఁ దగ దా మున కం చలయించి పంచి రా
ధీవరు లాతఁడుం జనియెఁ ద్రిక్కొని రక్కసితేని పాలికిన్. ౧౦౦

మ॥ పెడన వ్రాప్పఁగ రావణుండు శుకుని న్వీక్షించి యోరోరి! యీ
పెడరూపంబు ఘటిల్లెఁ గట్టిపడితే భీతిల్లితే తెక్కలి
క్కెడలం గారణ మేమి చంచలముఖు ల్లాలాగతు ల్నీవు లోఁ
బడ హాస్యాస్పదుఁ జేసి పుచ్చిరె కపు ల్పాటిల్లఁగాఁ జెల్పుమీ. ౧౦౧

క॥ అని భయసంవిగ్నుని దై, త్యుని తేఁ డడుగంగ వాఁడు తడయక తగిన
ట్లనయించె నుత్తమోత్తర, మనుపమగుణసదన! చంద్రహాసిసుసదనా! ౧౦౨

—♦ శుకుఁడు రావణునితోఁ దనపాటు చెప్పుట. ♦—

సీ॥ నాథ! నీ చనుమన్న నయ మెంచి పున్నీటి యుత్తరపుందీర మొలయఁగంటి
నీచెప్పిన ట్లంటి నియతిమై నక్లిష్టమృదురీతిఁ గపినాథుఁ డెదిరి వినఁగఁ
జూచినంతనె మేలి చా ప్పెన్నకయె మింటి పైఁబ్రాఁకి కపులు న న్నట్టుకొనిరి
పొడిచిరి పిడికిళ్లఁ బొనుపేది పొనువడ త్రొక్కులు విఱిచిరి ముక్కలుగను.
బలుకు తెఱఁగు లేదు ప్రశ్నోత్తరంబులు, పొడమ వచటఁ దోడబుట్టి నదియు
యలుక వారి తైక్ష్ణ్య మందరానిది యన, నేమిగలదు వాద మింక మీఁద.
ఆ॥ రామ రామ రక్ష రక్ష యటంచు నే, మొఱ్ఱపెట్ట నతఁడు ముదల యిడఁగ
నెట్లొ విడిచి రెగసి యే మందు నను నంతఁ, గడఁగి కట్టి యిడిరి కదలనీక. ౧౦౪
క॥ వికట మగు పలుకు పలికెను, బ్రికటబలుఁడు ప్లవగపతియుఁ బార్థివుఁ డింకన్
సుకరముగ నొడువువాఁడే, యకలంకత యెట్లు పొసఁగు నరిపక్షమునన్. ౧౦౫
ఆ॥ ఆవిరాధహంత యాకబంధవిరోధి, యాఖరాంతకుండు హరిబలములు
పతియుఁ దోడుగాఁగఁ బ్రిబలినాఁ డిప్పుడు, చెలువ యున్నచోటు సేరఁగాంచి,
క॥ ఆటాడినట్టులే ము, న్నీట న్సేతువు రచించి నీరధి తీరం
బోటమి లే కారసి క్షణ, దాటతృణీకరణ మెంత యనె వి ల్గొనుచున్. ౧౦౬
ఉ॥ కొండలఁ బోలి మేఘతతి క్రొత్తల కేమనఁ జాలి దండ ను
ద్దండతఁ గ్రాలి నేలకనితా నిడనోపు ననంగ నల్గడల్
నిండఁగ నోలి వాలిసుత నీలముఖాద్యులు ఋక్షవానరుల్
గండరగండ రాముకొనఁ గాలము సేకురె నింక లంకకున్. ౧౦౭
తే॥ సంధి పొసఁగదు రాక్షస సంఘమునకు, వానరేంద్రచమూపరీ వాహమునకు
దేవదానవతతుల దా తీర్పు నెఱప, వచ్చుచున్నారు కన్నారు వలనిగతులు.
ఆ॥ ఆక్రమింప నవల నయ్యెడు మే లున్నె, మనకు నొండు కీడుమాట వుట్ట
కున్నయంతలోనె యువిద నిత్తువొ లేక, యెదిరి చక్కనిలువ నెంతొ యధిప.
తే॥ రాజు పలుకు పలుకె కపిరాజు పలుకుఁ, దమ్ముఁ డనినట్టులే నీదు తమ్ముఁడు ననుఁ
జాలుదురు వారె సకలంబు సంహరింప, నంద ఱేల రాముఁడె యొప్పు నవధరింప.
ఆ॥ ఎట్టి రూపు గంటి నేమేమి వినఁగంటె, గంటిలేని యెఱుకఁగడలుకొంటి
రాముఁ దఱిసినంత రావణా! యది నాదు, మదికె ముదల యొండుమాట లేల.
క॥ లంకారిప్రభృతులు త, త్కింకరులఁటె వారి గెలువ దేవుం డొకఁ డే
వంకఁ గలవాఁడు సందియ, మింకం జన దేని నిలిచి యింతయుఁ గనుమీ. ౧౧౩
తే॥ పెద్దపెద్దలు పేరును బెంపుఁ గన్న, వారి నెట్టెట్టొ వివరింప వచ్చునేమొ
కాని కడతేర్ప వచ్చు నీ కడలిపొంగు, ఖంగు రని పల్కరా దెడఁ గదియరాదు.

తే॥ తొమ్మి దయి దేడు వేలతోఁ దొడరు లెక్కఁ
గోట్లు శంఖసహస్రము ల్కోసరు బృంద
శతములును గాఁగ నున్నారు సచివు లినజుఁ
గలిసి మనువారు పెరవారి గణన మెట్లొ. ౧౧౫

—♦ శుకుఁడు రావణునకు రామతత్త్వ మెఱింగించుట. ♦—

క॥ ఇందఱఁ గొని యుందముపై, నందముతో రాముఁ డిచటి కరుదెంచె నెవం
డెందుఁ జన నైన మనసీ, డందిచ్చెద నున్నమాట కరమఱ లేలా. ౧౧౬

ఉ॥ కాయజుఁ గన్న తండ్రి యగుఁ గాని మనుష్యుఁడు గాఁడు దేవ నా
రాయణమూర్తి రాముఁడు ధరాత్మజ లక్ష్మి జగద్ధితస్థితిం
బాయనిరీతిమై మెలఁగుఁ బా టొనరింతురు తల్లిదండ్రులే
కా యటుగాన వారిదెసఁ గల్మషవర్తనము ల్పొసంగునే. ౧౧౭

తే॥ ఆజగద్ధాత్రిఁ జిచ్ఛక్తి నఖిలలోక, మాత సీతను నేత కన్మలఁచి యొడిచి
తెచ్చితి నటంచుఁ దలఁచుట తెలివి లేమి, గాని తద్వాదులకు భిద గానఁబడదు.

సీ॥ క్షణనాశకలిత మీసంసార మన మేను క్షణభంగురము గాక సంతతంబె
పాంచభౌతిక మది పంచవింశతితత్త్వ కలన బుద్బుద మట్లు గాని పించు
మడఁగుచుండును రక్తమాంసాస్థివికృతంబు దుర్గంధమలమూత్ర దూషితంబు
నై జడం బలదాని కై బ్రహ్మహత్యాది పాతకంబు లొనర్చుఁ బ్రాకృతుండు.
తన కహంకృతిబంధంబు తవులుసూపఁ, జేయరాని కృత్యము లెల్లఁ జేసి తనువుఁ
బాసి యఘసుఖకారణ పాపపుణ్య, భోగలబ్ధికి వెండియుఁ బుట్టుచుండు. ౧౧౯

క॥ మే నే నను నజ్ఞానం, బేనాఁటికి వీడకుండు నెడలదు బంధం
బానాఁటివఱకు నట్టులు, గాన వికారప్రపంచ కలనలు గలుగున్. ౧౨౦

క॥ ఆత్మ విశుద్ధుఁడు ప్రాజ్ఞా, నాత్ముం డవ్యయుఁ డచలుఁడు నను తత్త్వధృతిన్
స్వాత్మపరుఁ డగుచు నెప్పుడ, నాత్మవశతఁ బోఁడొ ముక్తుఁ డౌ నపు డనఘా.

మ॥ నిరయస్వర్గముల న్శ్వసూకరతనూ నిష్ఠత్వమందు న్నరా
మరపిండంబులయందు భోగములు సామాన్యంబు లై యుంట మే
లరయంజాలఁడు దేహి దేహకలితాహంభావ మట్లుండఁగా
విరతిం గాంచి సుఖించు నుత్తముఁడు దా విశ్వాధికుం డౌ స్థితిన్. ౧౨౨

ఉ॥ కావున నీవు శుద్ధమతిఁ గై కొని మోహరతిం ద్యజించి స
ద్భావము కల్మి నౌ విరతి దారసుతాదులపట్లఁ గొంచు సం
భావనసేయు మాత్మహిత పద్ధతి నప్పరమార్థతత్త్వమున్
బోవుదు ముక్తి కాపె నినుఁ బూరుషు డంచు వరించి ఖించఁగన్. ౧౨౩

ఆ॥ కలితభారతాఖ్య కర్మభూమి జనించి, యందునేని ద్విజత నధిగమించి
యాత్మతత్త్వ మిట్టి దని యెంచి విదితుఁడౌ, వాఁడు దేహభోగ వశ్యుఁ డగునె.

ఆ॥ బుద్ధిశాలి వైతి పొడవుపడితి వెల్ల, శాస్త్రములును జదివి చదురుగొంటి
శక్తి లేదవె మేలి జపతపోయోగాప్తి, నిట్టి బంధ మేల నొదల దధిప. ౧౨౫

తే॥ బ్రహ్మకులమునఁ బొడమిన బ్రాహ్మణుండ, వాపులస్త్యుని మనుమండ వరసి యింక
నైన భోగేచ్ఛ లుడిగి పరాత్ము రాము, భక్తి సేవించి గాంచుము పరమపదము.

తే॥ మాతృవత్పూజ్య సీత రా మప్రభునకు, నప్పన మొనర్చి తచ్చరణానుచరుఁడ
వగు మఖిలకల్మషవిముక్తి నందఁగాంతు, వతఁడు చేపట్టి ప్రోచు ని న్ననవరతము.

చ॥ మరకతకాంతికాంతు రఘు మండను ప్రాంత ధరిత్రిపుత్రి సుం
దరవుఁ గడానిబొమ్మ ధృతిఁ దాగ్నుము నేర్పున లక్ష్మి యంచు శ్రీ
హరి యనుచు న్భజింపు మనుజార్కతనూజవిభీషణార్చితుం
డరమఱి లేక గాఁచు నిను నాదట ధన్యుఁడ వౌదు రావణా. ౧౨౮

ఆ॥ విభుని శరణుఁజొచ్చి విష్ణులోకమునకుఁ, బోవువాఁడ వట్టి పొలుపు దక్క
లేని నేగువాఁడ వెట్లు నధోగతి, కింత నిజము నాదు హిత మరయుము. ౧౨౯

క॥ అని యిట్లు ప్రబోధించెను, వనజాక్షీ! వాఁడు దనుజ వల్లభునకు శ్రీఁ
దనరె శుకగీత నా నది, జననాదిక్లేశశమని సన్నుత యగుచున్. ౧౩౦

క॥ ఆశాసనంబు వాని క, నాశాస్యము గాఁగఁ దోఁన యదరిపడుచు న
య్యాశరు దహించునో యన, నైశాంతి దొరంగి యిట్టు లనె శైలసుతా. ౧౩౧

—♦ రావణుఁడు కాలు లఱచుట. ♦—

శా॥ ఓరీ దుర్మతి! ముజ్జగంబులకు నే నొక్కఁడ శాసింపఁగా
నై రాజిల్లుచునుండఁ గింకరుఁడ వీ వయ్యుం దలం కింత లే
కీరీతి న్వచియింపవచ్చితివి సిగ్గేమాయెరా శిష్యుఁడే
లేరా తేఁడు గురుండ వైతి వికఁ నో లిం గాంతు విష్టార్గముల్. ౧౩౨

క॥ శిక్షించితి మంచిగ నిను, శిక్షించెద ననినఁ బూర్వసేవాకృత నా
దాక్షిణ్య మెడలకున్నది, పక్షీ! యెటఁ బోయి తైన బ్రదుకుము సరి గాన్. ౧౩౩

సీ॥ ఇత్తునే సీత నే నీరేడుజగముల వా రొక్కఁ డై యెత్తివచ్చి రనిన
రాముఁ డెన్నఁడు గ్రిమ్మ నో మచ్ఛలీముఖతతి యామని బ్రఫుల్లతరు తతిగతిఁ
దోలు చెడ్డో వానిఁ దూణీశయాత్మీయశరముల నుల్కలఁ గరిని బోలె
నుదయించుచునె రవి యుడుల దీప్తుల నట్లు బలము గైకొని వారి ప్రభ లడంతు
నెఱుఁగఁ డీవేగ మీఁగతి యీబలమ్ము, నెట్లు సాగరమారుతాహీనవిదిత
ము లని సవిషోరగమ్ము లీ ములుకులనియుఁ, గాన వచ్చుచునున్నాఁడు కదనమునకు.

తే॥ సాధనస్ఫూర్ణ శరశోణ నాదిత యతి, ఘోర జ్యారవతుముల యార్త్రోరుఘోష
హేతునాఁ గాచనిసద వాయింతు నిపుడె, యహితసేనామహారంగ మధిగమించి.
తే॥ వేయుఁగన్నులు గల యిందు్రఁడో యనలుఁడో
వరుణుఁడో యముఁడో వైశ్రవణుఁడో నన్నుఁ
జెనకి ధర్షింప రణభూమి సీమఁ జేరఁ
జాలినంతనె భీతుఁడై పరువు లిడఁడె. ౧౩౬
తే॥ ఇట్టి కారు లఱచినట్టెపై హింససేఁత, నాయ మగు జాలిపడినది నామనంబు
చూతి మొండొక్క వరిసేఁడుచూడ్కి కెదుట, నిలువకుమనంగ వాఁడువినీతుఁడగుచు.

—◆ శుకుని పూర్వజన్మకథనము. ◆—

ఆ॥ దండ మిడి ప్రసాద ముండుగాత మటంచుఁ, బాసె నచటు శుకుఁడు బ్రాహ్మణుండు
బ్రహ్మవిత్తముండు బ్రహ్మనిష్ఠుఁడు మున్ను, వాని కిట్టి విగతి వచ్చిపడియె. ౧౩౮
శా॥ వానప్రస్థవిధానముం గొని మహావన్యస్థలి న్నిల్చి క
ర్మానూనస్థితిఁ బొల్చి జన్నములు నిత్యం బాచరింపంగ న
ద్దానం దానవనాశ మేర్పడెఁ బ్రమోదంఁ బబ్బె దేవాళి క
ద్దైనం బాటున శోర్వ కయ్యసురు లొయ్య న్వైర మేపారఁగన్. ౧౩౯
అ॥ కాచియుండి రప్డు కడు నగ్గలిక వజ్ర, దంష్ట్రుఁ డనఁగ నెగడు దైత్యుఁ డొకఁడు
కారసిల్లి తవిలి తఱివేచి యపకార, మొనరఁగూర్పఁ దలఁచు చుండునంత. ౧౪౦
క॥ పిశుప్రీతుఁ డగస్త్యమునివరుఁ, డాశ్రమపదమున కొకప్డు డరుదెంచినచో
బ్రశ్రితుఁ డగుచు సమర్చల, నశ్రముఁ గావించి యాతఁ డాఘనుతోడన్ ౧౪౧
ఆ॥ చులుకితాంబునిధవి శుద్ధాత్మ! నాయింట, భోజనంబు సేసి పుణ్యతముని
సన్నొనర్చు మనుచు నాతండ్రి! ప్రార్థింతు, ననిన వల్లె యనుచు నాతఁ డలరి.
ఉ॥ స్నానము సేయఁగాఁ జనిన సందు గ్రహించి తపస్వియాపునన్
దానవుఁ డేగుదెంచి ద్విజుఁ దద్దయుఁ గన్గొని పెద్దకాల ము
ల్లోనిటి భాగమాంస మొకఁడే కఱవాయెను దానితోడి గా
భోనము వెట్టు మన్న నది పొందుగఁ గూర్పఁగఁబంచె నాతఁడున్. ౧౪౩
ఆ॥ భార్య భర్తయాజ్ఞఁ బడసి యట్లొనరింప, మౌని భోజనేచ్ఛ మలసియుండ
నాతిథేయి మొటేఁగియాకృగూపునఁదోఁచి, యసురమనుజమాంస మొసఁగచనియె.
చ॥ అది గని మానుషామిష మహా సముకూర్తి యమేధ్య మింత దు
ర్మద మెటు గల్గె నీ కిదియ మానిత మయ్యెనయేని నట్టులే
పొదలెదుగాక నరాళి వయి పొమ్మని సంయమి తిట్టె దానికిం
గదలెను గాలిచేఁ గదలికాండముఁ బోలి ద్విజుండు భీతుఁడై. ౧౪౪

క॥ నీచెప్పినట్లచేసితి, నోచీరాంశుకవరేణ్య ! యొలసి మలసి యా
లోచించి మంచిమానసము, నీచతురతఁ గూర్చ మనవె నీ ననుచు వెసన్. ౧౪౬
క॥ చరణముల వ్రాలి యిట్లా, చరణము నే కోరుఁగ మాని చంద్ర ! సదయ ! న
న్నరుణింపు మింక నీవే, శరణ మన న్మనమునందు సందియ మొదవన్. ౧౪౭
ఉ॥ తాను ముహూర్తమాత్రి మట ధ్యానసమాహితుఁ డై తనర్చి యం
దా నెఱి దానవాచరిత మంతయుఁ బోల నెఱింగి త ప్పొకం
డేనియు లేదు నీవలన నెంచి ఖలుం డొకరక్కసుండు నీ
కీనికృతిన్ ఘటించె నిఁక నే మన నే మగుఁ గర్మలబ్ధికిన్. ౧౪౮
సీ॥ ఆర్య ! నీ కీకష్ట మవిచారమున వచ్చె నాప ల్కమోఘంబు ననుచు నింక
రక్కసిమే నొంది రహి రాత్రు సేందుఁ డా గావణుఁ గొల్చి సద్భావ మొప్ప
వర్తించుచుండు మవ్వాని వధింపంగ నాదినారాయణుం డఖిలజగతి
మనుప దాశరథి యై మహిఁ దోఁచు రామాఖ్యఁ బ్రహ్మాదులటు వేఁడఁ బ్రథితదనుజ
వానరౌఘతత్ప్రధానులు తనుఁ గొల్వ, నబ్ధిఁ గట్టి లంక కగుగునప్పుడు
చారకృత్యమునఁ బ్రసక్తిమై నద్దేవుఁ, గాంచువాఁడ వన్య మెంచ నేల. ౧౪౯
ఉ॥ ఆనవమోహనాకృతి మహామహు దేవు సహానుజన్ము ని
జ్ఞానవిశిష్టతం గని విచారవిహీనుఁడ నై కడంగి య
జ్ఞాన మడంగ నయ్యసుర సన్నిధి రాము గొనమ్ము లెన్ని యో
పూనిక నెన్ని శాప ముడివోవఁ గృతార్థుఁడ వయ్యె దమ్మె యున్. ౧౫౦
క॥ మలకలు దలఁగఁ గరతలా, మలక మగుం బరమపదము మహితుఁడ వగుచున్
వెలసెద వాదట మోదము, వెల సెప్పఁగ నాక నిగడ వేల్పులు పొగడన్.
ఆ॥ అనుచు నాసగొల్పి యానంయమీంద్రుఁడు, చనె యథేచ్ఛ నట్టి చంద మంది
రాముఁ గాంచి మించి రావణు బాధించి, యతఁడు భవ్యపదవి నధిగమించె.
క॥ ఒక్కాకరుల భాగ్యం బటు, లెక్కం బరకోటి కప్పు డేమనవలెఁ జెం
పెక్కిన మదమునఁ బొదలెడు, నక్కఱినాత్ములకుఁ దక్క సనవద్యగుణా !. ౧౫౪

—♦ రావణుఁడు శుకసారణు లను గూఢచరుల రామునికడ కనుచుట. ♦—

ఆ॥ అంత నసురనాథుఁ డమ్మేటిసంద్రంబు, దాఁటి దఱిసి యున్నవాటు లెల్ల
గొలువరాఁగఁ జదురు గొని కూర్చుకొనె శుక, సారణు లను మంత్రిసారములను.
ఉ॥ వారు వరాకు దేవ ! యన వారలతో ననె శ్రీమదంబు చె
న్నారఁగ దుస్తరం బతిసమగ్రము సంద్రము దాఁటి రే కపుల్
వారిధి సేతుబంధనము వార కొనర్పఁగ రాముఁ డెమ్మెయి
న్నేరిమిఁ గన్నవాఁడు మది నెట్టన సందియ ముద్భవిల్లెడిన్. ౧౫౫

ఆ॥ నమ్మె సేతుబంధనమ్ము నే నెట్లును, వలయు నరిబల మ్మువశ్య మరయఁ
గాన మీర లొడ్డ కను మొఱంగి తదంత, రమ్ము సొచ్చి తత్పరత్వ మెసఁగ. ౧౫౬

సీ॥ పౌరుషం బెట్టిదో పరిమాణ మెంతలో ఘను లెందఱో ప్లవంగములలోన
సచివు లెవ్వారలో సమ్మతు లెవ్వరో రామార్కజుల పైని రక్తి నెఱపు
వార లేవారలో శూరత్వమున ముందుఁ దొడరువా రేసంఖ్యఁ గడవఁగలరో
కట్టినసేతు వేకట్టునఁ దనరునో యబ్ధి నెమ్మెయి దాఁటి యతిమినారో
యెవ్వరెవ్వరి కెట్టెట్టు లేయుపాయవి
సన్నివేశములో వృత్తిజాడ లెట్లొ
యమ్మహావమూర్తు లగువారి కందఱకును
సైన్యనాథుం డెవఁడో చర్చ సలుపవలయు. ౧౫౭

తే॥ రాము వ్యవసాయవీర్యము ల్నేమమును బ్రి
హారణములును లక్ష్మణుని వా నవ్వి యన్ని
యును విమర్శించి వేగమే రొులయుఁ జేమి
సెంట నేనియుఁ జిక్కని వెరవు మెఱయ. ౧౫౮

తే॥ అని సమాదిష్టులగుచు నద్దనుజవీరు, లిరువురును హరిరూపము ల్వొరసి యాబ
లంబులోఁజొచ్చి యది యచింత్యంబు రోమ, హర్షణంబగుచుండఁ బ్రహర్ష మెడల.

— శుకసారణులు పట్టువడి రామునిచే ననుగ్రహింపఁబడుట —

ఉ॥ కొండల నిర్ఝరంబులను కూటములన్ గుహల న్సముద్రపుం
దండలఁ దద్వనస్థలుల దార్కొను దారుల నిండి నిండుచున్
నిండఁగ నైతరించు నెఱి నెక్కొని నెక్కొను సైన్యవార్ధి యు
ద్దండతఁ గాంచి వెక్కసుఁడఁ దారసముత్సుల యైరి సుందరీ! ౧౬౦

ఉ॥ వారల గుట్టెఱింగి రఘువర్యుని ముందటఁ బెట్టి వైరికిన్
వీరలు చారు లిచ్చటివి వేచసమున్ బొసరి పఁ జేరినా
రూరక వీడఁగా దని గుణోజ్జ్వలుఁ డార్యవిభీషణుండు పొ
ల్పారి నచింప న్వొహిచిటి మా ఘనమంత్రి మతంత్రి మై చెడన్. ౧౬౧

క॥ రక్కసుల తేనిమంత్రులు, కక్కట్టు బయల్పడంగఁ గలఁగి వ్యథితులై
యొక్కడి టంకిటి బ్రిదు కని, యక్కరుణాంబునిధిఁగూర్చి సాంజలిపుటులై.

ఆ॥ రామ! రఘువేంద్ర! రావణుఁ డనుపంగ, వచ్చినార మిందుఁ జొచ్చినార
మఖిలబలవిశేష మారయుపనిఁ బూని! యింతనట్టు నిజ మహీనచరిత! ౧౬౩

తే॥ అనిన నవ్వుచు భూతహితాధికృతుఁడు, రామచంద్రుండు త్రైలోక్యరక్షకుండు
వారిఁగనిపల్కెఁ గంటిరే వలను లెల్ల, మమ్ముఁ బరికించితిరె యింటి మలయువారె.

సీ॥ అధినేత పనిచిన యాకృత్య మంతయు నింతకే తీర్పొందెనేని నెయిదుఁ
డం దించుకంతయు నఱుకువపడెనేని నెల్లెడ లారసి యేటుఁ గాంచుఁ
డది యసాధ్యమ కాఁగ మదికిఁదోఁచినఁ దోఁడు నూవిభీషణుఁడుండు మలసిరండు
చిక్కటి మింకెట్లు జీవింతుమే మంచుఁ దలఁకు గైకొనకుఁ డీ దండ సేరి
పట్టుబడినవారిఁ బాఱిపోయెడువారి, శరణుడించువారిఁ జంప మెప్పుడు
నెగిచిపడెడువారి నేయుదు మిట్లాట, మీర లారసి యిచ్చమెయి మెలఁగుఁడు.
ఆ॥ అడుగుచున్నవార లన్న విభీషణా!, వీరి విడువుమయ్య! విధియు నదియ
శత్రుపక్షకృతివిచారులు చారులు, తెరువువట్టి యెపుడుఁ దిరుగుచుంద్రు. ౧౬౬
ఉ॥ ఓచరులార! మీరు భయ మొయ్యన వీడి పురంబు సేరి దో
షాచరనాథుని న్గనసి చక్క వచింపుఁడు నాదుపల్కుగా
నేచతురత్వ మేబలము నెక్కటి నమ్మి మదీయ సీత న
ట్లాచికొనంగఁ దెచ్చి తది యయ్యదియుం బ్రకటింపు మిత్తఱిన్. ౧౬౭
క॥ ఎక్కటి రాఁబోకుము నీ, చక్కటి సైన్యములఁ గొంచు సహజులు సుతులుం
బ్రక్కలఁ గాచుకొనఁగఁ బెం, పెక్కిన ధృతి సమరభూమిఁ బెరయుము కడఁకన్.
ఆ॥ ఎల్లి దెల్లవాఱు టే మొద లీలంక, నాశరాఘు మెగుప నాశ మొందు
గోపురాట్టవప్రకూటకోటులతోడ, నాశ లుండ పంక నాశగుండ. ౧౬౯
క॥ భీమ క్రుథ యిద్యోడం గడు, నేమముతో నున్నయది యనీకయుతుని ని
న్నే మరులుకొన్నయది కొన, నామఘవుని యశని దానవౌఘమ్ముఁబలెన్.
క॥ అని తెలిపిన సందేశం, బనుపదమె గ్రహించి విజయ మందుము దేవా!
యని పలికి చనిరి వార, య్యనుపమగుణు ధర్మవత్సలాత్ముఁ బొగడుచున్. ౧౭౧

— ♦ శుకసారణులు రావణునకు రామబల మెఱిఁగించుట ♦ —

ఉ॥ అంకము సేరి రావణు నిరంకుశుఁ గన్గొని వార లొక్కటన్
శంకలుదక్కి వాకొనఁగ సాగిరి దేవ! విభీషణుండు నా
శంకరుఁ డౌచుఁ బట్టుకొని సన్నిధిసేర్చిన నమ్మహాస్వి శ్లే
మంకరుఁ డాత్తధర్ముఁడు ప్రమాణము రాముఁడె మమ్ము వీడఁగన్. ౧౭౨
మ॥ ఒకచోఁ జేరిరి వారు నల్వురు మహోద్యోగంబు చెన్నొంద భా
సకుఁ డారాముఁడు లక్ష్మణుండు రిపుసంజాతుండు సీతమ్ముఁడున్
బ్రకటశ్రీకుఁడు భానుపుత్త్రుఁడును నేపట్టేసి గుట్టేనియున్
వికలత్వంబును గాంచుఁగాని మన వాఁవిఖ్యాతశౌర్యోదయా! ౧౭౩
ఆ॥ పెల్లగించి లంకఁ బెరచోటఁ బెట్టంగఁ, జాలువారు వారి జాడ లేల
యొకఁడె యంతపనికి నోపు నం చెఱిఁగించు, రాము రూపరేఖ కామతములు.

ఆ॥ వారిచేత గుప్త వానరవాహిని, మించు నెల్లలోకములుఁ గడంగి
అది సురాసురులకు నయ్యింద్రునకును దు, ర్ధర్షతరయ కాని తరముపడదు. ౧౭౫

క॥ అంబుధిఁ గడచినపుడె ది, వ్యం బోఘ మమోఘ మనఁగ నై యదియు నిరా
లంబ యనరాని తీర్పున, నంబరము గ్రసించుచుండె నభిరామముగాన్. ౧౭౬

తే॥ అతిదృఢమనస్కు లోజస్వు లాజిలోల, సులు వనౌకసు లవ్వారి వలని ధ్వజిని
హర్షగూప యనఁగఁబోలు నలుక చాలు, రామునమ్మేలుబంతిఁ గూర్పనగు మేలు.

తే॥ పథ్య మక్లీబమును నయి పరఁగుచున్న, తదభిభాషితమును విని దశముఖుండు
తన్నిషేధతత్పరుఁడ యై తనరెఁ గాని, రూఢపద మెన్నఁబోఁడు మూర్ఖుండువాఁడు.

—♦ రావణుని యాత్మస్తుతి. వానరబలవిచారణ. ♦—

క॥ న న్నెదిరి దేవదానవు, ల న్నెత్తి గంధర్వనరులు నఱుమఁదలఁచిరే
నిన్నేలక న్ని నిత్తును, య న్నిఱజాణతన మెల్ల నరయం జనదే. ౧౭౯

ఉ॥ జంకితి వీవు సారణ! విచారణసేయక బేల వోట ని
శ్శంకితవృత్తి మీరఁ దరయఁజాలక జాలక మెన్న కూరకే
గొంకక గూడిరానయిన క్రోఁతు లనీతులు గెల్వ గూర్తు రం
చుంకువఁగోరు రాముఁ గని యోటమి గాటముగా వచించుటన్. ౧౮౦

చ॥ సమరమునందు న న్గెలువఁజాలఁ డొకండు నిజమ్ము లెం డటం
చమరవిరోధ యాచరుల నాదటఁ దోడ్కొని చంద్రపాండరం
బమితసముచ్ఛ్రియం బధికలాంఛితి మై తగు నొక్క దివ్యహ
ర్మ్యమునఁ దన ర్చెఁ గ్రుద్ధుఁ డయి యంతయుఁ గన్గొను మంతనంబునన్. ౧౮౧

ఉ॥ ఏమొడఁ గాంచినం బ్లవగులే యన నై గిరివార్ధివన్యలం
దామెలదోటలం దవనియం దొకయించుక యేని రిత్తచో
టా యిది నాఁ గనంబడక యాయితమై తగు తద్బలౌఘముల్
బాయనికిన్కఁ గన్గొనియెఁ బాలసుఁ డయ్యసురుండు చిన్మయా! ౧౮౨

తే॥ అట్లపార మసంఖ్యేయ మై తనర్చు,
రాము సైన్యంబు వీక్షించి రాక్షసేంద్రుఁ
డనియె సారణుఁ గని తొంటి యాపదంబె
యరయఁ డాపదంబుధిఁ దీర్చు నాపదంబు. ౧౮౩

ఉ॥ ఎవ్వరు ముఖ్యు లందు సుగుణోడితు లెవ్వరు శూరు లెవ్వరిం
కెవ్వరు సద్బలాఢ్యులు మఱెవ్వరు ప్రోద్యతశక్తి లంకపైఁ
జివ్వకుఁ గాలుద్రివ్వుదురు చేర్చెఁ జెవి న్విభుఁ డెట్టివారివ
ల్కవ్వివరం బొగి న్విశద మై తగనాడఁగడంగు మిత్తఱిన్. ౧౮౪

తే॥ యూథపులపైని యూథపు లొప్పువారి, పై నియుక్తు లమాత్యు లేపగిదివారో
యప్రధానప్రధానాప్తు లనువుపడఁగఁ, దెలుపు మోయిసారణ! నీదు ధీప్రసక్తి.

క॥ అనిన వినిపింతుఁ జెల్లము, గనె నీయడిగిన తెఱంగు గలయ నరసి వ
చ్చినవాఁడ నగుట నంతయుఁ, గనుకలి నిశ్చిత మొనర్పఁగాఁ జను నధిపా! ౧౮౬

—♦ సారణుఁడు రావణునకు రామసైన్య ప్రభావ మెఱిఁగించుట ♦—

ఉ॥ అంకిలిదేటి లంకఁ గని యార్చెడు నార్పులు నింగిముట్ట సా
శంకతమై వడంకెడు పురిసంగము దీనికిఁ గూర్చినాఁడు ని
శ్శంకులు నూఱువేల కగు సైన్యపతు ల్దనుఁ గొల్వ నీలనా
మాంకుఁ డధీశు వాహినుల కాతఁడె తేఁ డర లేక గాంచితే. ౧౮౭

సీ॥ ఎగుభుజమ్ములు సాచి మొగయించు నింగి న ట్లడుగుల భూతలం బవియఁద్రొక్కు
బీరమ్ము గ్రోధమ్ముఁ బిరికొన లంకకై యావలించుచుఁ జూడ్కు లందఁజేయు
దెసలు గ్రక్కదలంగఁ దివిరి లాంగూల సమాస్ఫోటనక్ష్వేళ లావహించుఁ
గొండకొమ్మనఁ దమ్మి కొనపూలరంగున తీర్పొందు తనదు మే నేర్పరించు
వాలి తఱువాఁతి వాలి రాచూలి మెచ్చుఁ బ్రొద్దుచూలి యులర్చిన ముద్దు దన్నుఁ
బిన్నయొడయనిఁ జేయంగఁ బేరు పెంపు, గన్నవాఁ డంగదుఁడు సిరి గొన్నవాఁడు.

ఉ॥ నిన్నదె యాజికిం గడఁగి నెట్టనఁ బిల్చుచునున్నవాఁడు సం
పన్ను నొనర్తు రాము నని బాసలు సేసెడు బిన్నతండ్రికిం
దిన్నని బంటు స్వర్పతికిఁ దీరుగ నప్పతి పోలె విక్రమం
బన్నువ గాదు బుద్ధిబల మంతకుమీఁదు గణింపఁ జొచ్చినన్. ౧౮౯

తే॥ ఎంత లొనరించె హనుమంతుఁ డిచటు ద్రొక్కి
యంతయును వీనియులవార్పె యనఁగఁ జెల్లు
నిరువురును రామహిత మెద నెంచువారు
జోడుకోడెల కా నెందుఁ జొచ్చువారు. ౧౯౦

క॥ బహువాన రేంద్రయూథపు, లహమహమికఁ దన్నుఁ గొలిచి యరుదేరఁ గడున్
బహుమాన మొనయ తలఁపున, విహరించెడు నీదు మొనల వెస దుర్జయుఁ డై.

ఆ॥ అతని ననుసరించి యార్భటుల్సెలఁగంగఁ, బెద్దసేనఁ గొంచు బెట్టిదంబు
సూప నెంచువాఁడ చూ నలాఖ్యుఁడు సేతు, హేతుభూతుఁ డటు ప్రభూతబలుఁడు.

ఉ॥ మేనులు వెంచుచుం బుడమి మెట్టుచు గర్జ లొనర్చుచుం బొరిం
బూనిన యాగ్రహమ్ము నెటి బుట్టిన దిట్టలు జృంభణ ల్మహా
గోనినదంబులం దెగడ ఘోరులు చండులు చండవిక్రము
ల్గా నగు సైనికు ల్మొనయఁగాఁ గడు నొప్పెడు వాఁడు గంటివే. ౧౯౩

ఆ॥ అరయు మష్టశతసహస్రము లక్షకోటి, శతము లనఁగఁ దనరు చందనద్రు
వాసిసైన్య మతనివలనిది పతి మెచ్చ, వడసె లంకఁ గడపఁ దొడరినాఁడు ౧౯౪
ఉ॥ శ్వేతుఁ డనంగ వాఁడె రణసిద్ధికిఁ దూఁగెడు వెండికొండ వి
ఖ్యాతుఁడు ముజ్జగంబుల రయంబున బుద్ధిని విక్రమంబునన్
జేతముఁ జిక్కఁబట్టి విభు చెంతకుఁ బోవుచువచ్చుచున్నవాఁ
డేతతి నొడ్డఁ ద్రోఁపిడుటయే బలమంతయు సంతసింపఁగన్. ౧౯౫
క॥ అమితోద్ధతం బనీకం, బమర్షమయు మంతరంగ మనుపమతేజః
క్రమ మధిభాస్కరలక్ష్యం, బమరనిభుం డతనిదెస నిరంతరము లగున్. ౧౯౬
తే॥ గోమతీతీరమందు సంకోచనాఖ్య, నమరు నానాద్రుమాంచిత మైన శిఖరి
నుండిశాసించువాఁడు మున్నోజమెయిని, వాఁడె కుముదుండు యూథపవర్యుఁడధిప.
క॥ బలము లమేయము లీతని, బలసి కొలిచి కన్నుసన్నఁ బరతేరఁ గడున్
జలమున లంకఁ దెసకుఁ జూ, డ్కుల నలవార్చెడుఁ బ్రిసక్తి గొనకొనుచుండన్.
ఉ॥ వాలము లట్లు గ్రాలునవి వాలమువాలము లెన్ని బారలో
వాలుగ నాఁగ బాఱులిడి వర్ధిలి పీతసితారుణంబు లై
పోలఁగ రోమణుండు పరిపుష్టుఁ డదీనుఁడు యుద్ధకాంక్షి యా
భీలుఁడు వాఁడె చండు డని పేర్కొన నైన ఘనుం డధీశ్వరా!. ౧౯౯
ఆ॥ వీఁడు గూడ లంక విదలింతు నని సేన, యని సహస్రశతసహస్రసంఖ్య
లైన కపులతోడ నడరుచున్నవాఁ, డధిపుఁ డాజ్ఞ యిడుటె యవధి గాఁగ.
శా॥ సింహాపక్రమ దీర్ఘనేత్రు నిభృతశ్రీఁ బింగళాంగు న్మహో
రంహుం గాంచితె రంభుఁ డాతఁడు తతారంభుండుఁ దా లంకపై
సంహారాదృష్టి నిగుడువాఁ డలుకమై నోఁ గాల్చఁగా నంచొగిన్
సంహారోద్యతరుద్రుఁ డార్భటిమె యాచండం బెటింగించెడిన్. ౨౦౧
తే॥ వింధ్యకృష్ణసహ్యవ్యాయ విశ్రుతములు, నటు సుదర్శనసంజ్ఞంబు లైన గిరుల
నుండఁ జండకృమముగొల్చుచుండుబలము, శతశతసహస్రసంఖ్యోపసంఖ్యమగుచు.
ఉ॥ కర్ణవివృత్త్యమర్షపరి కంపనజృంభణతిర్యగాత్తని
ర్వర్ణనము ల్పొనర్చు నపవాదము మిత్త్రికిఁ గూర్చు జంకఁ డా
యర్ణవ మన్న యుద్ధమన నైన స్వవాలముఁ బేర్చు నార్చు సం
పూర్ణబలోల్లసద్రియుఁడు పోటరి యాశరభాఖ్యుఁ డొప్పెడిన్. ౨౦౩
తే॥ రమ్యసాల్వేయపర్వతరాజ మెపుడు, మనికిపట్టు దనకు బహుమానయుతులు
నలువదుల నూర్ల వేల కొ నాయకులుమ,హాబలులుగొల్చుచుండుదురనవరతము.
తే॥ శరభసాళువ మద్యో సీశ్వరుఁ డొకప్డు, డరికరము నరసింహంబు నాక్రమింప
నిపుడు కేవలశరభాఖ్య నేగుదెంచె, వానరుం డయి వాఁడు సర్వంబు గెలువ.

వ॥ అదె యవ్వాని కనంతరుం డై. ౨౦౬

మ॥ ధరణిం గప్పుచు నొప్పు నాకసము నబ్దం బట్టు లెవ్వాఁడు వా
నరవీరోత్తములందు వేలుపులలో నన్వాసన్వం డెట్టు లా
స్ఫురణం బొల్చెడుఁ జూడు మెవ్వని భుజాస్ఫోటధ్వను ల్సైన్యసా
గరనాదంబులతోఁ గడల్కొనియె థక్కాలక్షలక్ష్యార్భటిన్. ౨౦౭

తే॥ ఉత్తముఁడు పారియాత్రి మనుత్తమంబు, పర్వతంబు నధిష్ఠించి పరఁగువాఁడు
పనసుఁ డీతండు యుద్ధదుష్ప్రసహుఁ డితనిఁ,గొల్చు శతశతసాహస్రి కోటిబలము.

ఉ॥ రెండవసాగరం బనఁ గరేణుఘటాసముదీర్ణ మౌ బలం
బొండు దలంగనీనిధృతి నో జమెయిం దనుఁ గొల్వఁ గొండపైఁ
గొండ యనం దనర్చు బలుగొండలదండ నెలర్చు వాఁడె పో
గండరగండఁ డెమ్మెయినిఁ గాంచెనొకో వినతాభిధానమున్. ౨౦౯

తే॥ ఇతఁడు పర్ణాస యనునది నెనఁగు రసముఁ, గ్రోలి పరిపుష్టుఁ డై నాఁడుకోటగోడ
కట్టనిది పెట్టనిది యయి కానిపించు, భుజబలంబె బలంబుల ప్రోలిసిరికి. ౨౧౦

మ॥ అడుగో షష్టిసహస్రికాశతకసం ఖ్యాకంబు సైన్యంబు చో
ప్పడఁ దన్గొల్వఁగఁ గ్రోధనాఖ్యుఁడతిదర్పప్రోద్ధతి న్నిన్నుఁ బి
ల్చెడువాఁ డాయతవిక్రముండు రణసంసిద్ధుండు సిద్ధార్థుఁ డో
క్కఁడెపో చాలు ద్విషద్బలౌఘముఁ గడంకం గంప మొందింపఁగన్. ౨౧౧

ఉ॥ గైరికవర్ణ మైన నిజగాత్రము సొంపెనయింప లావు నై
నేరిని లెక్కసేయఁడు మహేచ్ఛుఁ డరాతిభయంకరుండు దు
ర్వారుఁడు ని న్నెదుర్కొనఁగ వచ్చెడు తెంపు దలంపనయ్యెడిన్
బేరునఁగాక పోటునను బొపునఁ దా గవయుండు నాఁ జనున్. ౨౧౨

తే॥ రమణ డెబ్బది శతసహస్రములు గొలువ
బలువయిన యగ్గలిక మెయిఁ బరఁగువాఁడు
లంక నాలంకిగుడియాటవంక మీటఁ
దలఁపుగొన్నాఁడు నీమది దార్చి చూడు. ౨౧౩

క॥ ఇందఱునుఁ గామరూపులె, యిందఱు బలవంతులే మహేచ్ఛులె వీరిం
గ్రిందుకొని దుష్ప్రసహులై, యుందురు గొంద అధిపతివె యనుఋలటంచున్.

శా॥ కంటే యూథపయూథపేంద్రులు పరాక్రాంతిక్రమోల్లాసు లే
వెంటం బో వెనుదీయ రంబునిధిసంవేగంబు మోకాటనే
గెంటంజూతురు పోతరం బెగువ ని స్గీర్తింపకే యుల్లసం
బంటంబల్కుదు రట్టివారి నద నొయ్యం దాల్పు మేఁ దెల్పఁగన్. ౨౧౫

సీ॥ తామ్రపీతాదికోద్యద్ద్యోతమయము లై వాలవాలము లతివేలములుగ
సూర్యరశ్ములఁ బోలి చూడఁ బాఱుచున్నవి కాంచువారల కన్నుఁగవలు నిండ
సాచుచు ముడుచుచు సమకూర్చు నట్టనఁ బుడమి యాకస మెడ లూనపేరు
గా వాఁడె హరుఁడు దాఁ గాఁ డె ట్లరిప్రాణ హరుఁడు సూర్లకు వేల కగుచుపీని
దటిసి మురిసి చెట్లు దాల్చి కొండలు పూని, యడరుచున్నవార లంతకాభు
లైన యూథనాథు లలుక లగ్గల కెక్క, లంక దక్కనీని లావునుడుల. ౨౧౬
శా॥ నీలంపుంగిరులో మొగిళ్లొ తమపున్నిటాడ్రులో కాటుక
ల్పోలం బోసిన పోవ్రులో యనఁగ నై పొల్పారు భల్లాలు భ
ల్లా లల్లే తెగఁజూడ నౌ నెటికి నౌ లావ ర్లనిర్దేశ్యలు
ద్వేలారంభు లసంఖ్యు లాత్తరయు లర్థం గొల్వ సంరబ్ధుఁడై. ౨౧౭
ఆ॥ విషమపర్వతముల విపినస్థలంబుల, నదుల నిర్ఝరముల ననుచువారి
గానుచు నిన్నదిక్కు కొక్క నెక్కనఁ బేర్చు, వాఁడె ధూమ్రుఁ డనెడువాఁ డధీశ!
ఆ॥ ఋక్ష వంత మను గిరీంద్రముపై నుండు నర్మదాపగోర్మి నిర్మలావ
రస్యధర్మ మెఱుఁగు గాణించుఁ బర్జన్యుఁ, డగుచు ఋక్ష వర్యు లబ్దములుగ.
శా॥ భీమాత్ముం డతిభీమదర్శనుఁడు నిర్భీకుండు తా నన్నచో
నే మా నీతని మించఁగాంచు ప్రబలుండే తమ్ముఁ డున్నాఁడు ని
ర్ధామం బౌ నిజధాము మెల్లకడలం దోడ్తోడఁ గన్పట్టఁ బ
ద్ధామస్యంబునఁ గొండనాఁ దగి విపక్షాక్రాంతి వీక్షింపుచుఁ. ౨౨౦
ఆ॥ ఆతఁ డీతఁడే మహాయూథయూథప, యూథపుఁడు పరాక్రమోన్నతుండు
జాంబవంతుఁడనఁ బ్రశంస కెక్కె నరాత్య, మర్షణుండు స్వజనహర్షణుండు.
క॥ గురువర్తి యితఁడు దైవా, సురసంగ్రామమున నముచి సూదనునకుఁ దా
న రచించె సాయ మద్దా, న రహిం గొని నాతఁ డిడ ఘనము లగు వరముల్.
చ॥ పరుపిడి కొండబండ లెగఁబ్రాకి మహాభ్రవిశాల లౌ శిలల్
పరువడి నెత్తివై చెదరు పాదపము ల్వాకలించి తెచ్చి యు
వ్వరుసన మోద నెంతురు విపల్గనము ల్పచరింత్రు మిత్త్రికిన్
వెర వొకఁ డున్న మాదెసకు వ్రేలిడనోపునె యంచు యూథపుల్. ౨౨౩
తే॥ భూతినిభు లాసురాభులు భూరిబలులు, వహ్ని తేజు లసంఖ్యు లవార్యు లాత్త
యశులు రోమశు లీశని యాస్ఫభల్ల, భటులు చటులాజిశీలసముద్భటులు పటులు.
తే॥ నిలిచి చూచెడు గంటె యసీక మెవని, మహితసంరంభ పోష్ణాయ మానకలన
శుంభ దరిమర్దనక్రమాదంభుఁ డతఁడె, దంభుఁ డను వానరుఁడు తతారంభవిదిత.
క॥ ఇమ్మేటి సహసాత్ముని, నెమ్మి మెయి న్గొలుచుచుండు నేమముగలవాఁ
డిమ్ముల బహుబలయుతుఁడై, యుమ్మేలున మేలుబంతి యై వర్తిల్లున్. ౨౨౬

సీ॥ కొండ చక్కటి మెట్టుచుండఁ దా నద్దాని కొండు రూపా నాఁగ నొప్పినాఁడు
యోజనాయతకాయుఁ డొకమొకంబును వీని నెత్తిఁ గోల దను వార్త నెగడినాఁడు
ఎల్లవానరకోటి కెల్లఁ డాదిభూతుఁ డై యటు పితామహసంజ్ఞ నందినాఁడు
మున్నింద్రు నెదుర నై మొనసి సంగరమున నోడక జయలక్ష్మి నోలసినాఁడు
గాన నక్రమంబు గాదు శక్రప్రాక్రి, మక్రముండు కేశమల్లుఁ డనఁగఁ
గలిగె వహ్నివలన గంధర్వకన్యయం, దసురవ్యాతికి సురస హర్షభృతికి. ౨౨౮

కం॥ సన్నాదనుఁ డనువాఁ డా, సన్నాహముఁ జూడు మకని సన్నాదములన్
దన్నలుఁగక మి న్నరయక, పన్నుచునున్నాఁడు మేలి బలములు గొలువన్.

కం॥ ఎవ్వని జంబూవనమున, నివ్వటిలు విహారసుఖము నీయన్నకు నీ
వవ్వానరేంద్రుఁ గాంచితె, చివ్వకుఁ గడకొన్నవాఁడు సిరు లొప్పారన్. ౨౨౯

ఉ॥ కిన్నరసేవితంబులు సుకీర్త్యము లౌ గిరు లెన్ని గుత్తకుం
గొన్న మహాబలుండు రణకోవిదుఁ డీప్లవగాధనాధుఁ డే
మన్నను జంకఁ డాత్మనుతి కగ్గము గాఁడు సహస్రకోటిసం
ఖ్య న్నెగడొందు వీరు లనయంబు నయంబున గొల్తురీతనిన్. ౨౩౦

కం॥ క్రథనుఁ డనువాఁడు మనతోఁ, బ్రథనం బొనరింప నెంచి పటుతెం చెనుని
ర్మథనము లంకకు గూర్చుట, కథనము లేకయ వికాసగతిఁ గనుపట్టున్. ౨౩౧

ఆ॥ హస్తియూథపతుల నదలించుచును గంగ, ననుసరించి వైరమును స్మరించి
తిరుగుచుండు నెపుడు గిరిగుహాశయములఁ, గరులు గిరులుఁ దరులు గదియఁబడఁగ.

ఆ॥ వేయునూటువేలు వీరులు తనుఁ గొల్వ, నాయుశీరబీజ మనెడు కొండ
నుండు దివిని శక్రుఁ డుండున ట్లమ్మెయి, హైమవతి రసమ్ము లాని కడిమి. ౨౩౩

కం॥ అమితబలవీర్య మగు బల, మమరబలం బట్టు లెనయ నరిదుర్ధరుఁ డై
తమకని దర్పంబునఁ దగుఁ, బ్రమాథి యనువాఁడు వాఁడె పరదర్పహరా. ౨౩౪

ఉ॥ గాలి కదల్ప నెల్లెడలఁ గ్రమ్ముడు పెన్మొగి లంచు ధూతది
క్పాలక ! పల్కె దేప్లవగుఁ గన్గొని వాఁడె గవాక్షుఁ డమ్మొగిన్
గ్రాలెడు వాని సైన్యము వికస్వర మై యరుణాభ మై పయిన్
ధూళియుఁ జొప్పడెన్ దరలె ధూర్తుఁడు లంకఁ గడంకఁ దీర్పఁగన్. ౨౩౫

శా॥ గోలాంగూలులు కోట్లలెక్కకు మహాఘోరు ల్సితాస్యు ల్బల
ప్రాలంబు ల్గొలువ న్నలు న్బరసి తా భాసిల్లుచున్నాఁడు వా
చాలుం డాడినయంత సేయఁగలుగున్ సన్నద్ధతం గొన్నవాఁ
డోలీలావిజితేంద్ర ! నీదు మది సంయోజించు మిటింతయున్. ౨౩౬

సీ॥ కోదమతుమ్మెదల కోర్కులు పండ నేకొండ యఖిలకాలఫలద్రుమాఢ్య మయ్యె
దనవర్ణదీప్తులఁ దనరారు ననియేమొ సూర్యుఁ డేమెట్టునే చుట్టివచ్చు
మృగపక్షు లేగిరి మొగసినయంతనే తద్గుణాలంకృతి ద్రఢిమ నెఱపు
నెద్దాని ప్రస్థంబు నెడసిపో నెంచఁబో రధిహార్షులు మహర్షు లాత్తయశులు
సర్వకామదంబు సఫలంబు సరసంబు, నైన స్వర్ణశిఖరి నధివసించు
కేసరియ యతండు కేసరిసంజ్ఞుండు, వానరప్రశస్తి వఱలువాఁడు. ౨౩౭

శా॥ సింగారంబున కాటపట్టులు మహాశ్రీ లక్ష్మిసాహస్రిముల్
బంగారంపు గిరుల్తదస్తశిఖరిప్రాంతస్థముల్వానితో
నంగాంగిత్వము నొంది నీ వసురులం దధ్యక్షతం గాంచురీ
తిం గైకొల్గను కాంచనాద్రి యొకఁడు దీప్తప్రభంబుం డెడుఱ్. ౨౩౮

వ॥ అయ్యుత్తమశిలోచ్చయంబున నుండువారు వారె కపిలులు శ్వేతులు తామ్రాస్యులు మధుపింగళులు తీక్ష్ణదశనులు నఖాయుధులు సింగంబు లట్లు చతుర్దంష్ట్రులు వ్యాఘ్రంబులవలె దురాసదులు వైశ్వానరసములు జ్వలితాశీవిషోపములు సుదీర్ఘాంచితలాంగూలులు నుత్తమాతంగసన్నిభులు మహాపర్వతోన్నతులు మహాజీమూతనిస్వనులు వృత్తపింగళరక్తాక్షులు భీమభీమగతిస్వరులు నైన వానరులు లంకాభిఘాతోత్పాతం బభినయించుచున్నవా రవ్వారి నడుచక్కం గనుపట్టుచున్నవాఁ డిందఱకు ఱేఁడు నీడు సూడు దిర్చుతలంపున నొండొక దెసం గనఁబోఁడు జయార్థియై యాదిత్యు నుపాసించుచున్నాఁడు బుద్ధివీర్యశౌర్యసారస్థైర్యపౌరుషంబులచే శతవలినామధేయంబుచే జగత్త్రితయంబునం బ్రఖ్యాతిం గన్నవాఁడు రాముని మేలునకై ప్రాణంబులపై జాలి మాలి నిన్ను నీబలమ్ము నోలిఁదాన చాలి మడంతు నని ప్రసిద్ధంబులు పన్నుచున్నవాఁడు వీనికిం దోడు లై గజగవయగవాక్షనలనీలు లొక్కొక్కఁడు పదికోటులు కపివీరులతోఁ బన్నియున్నా రిందఱు సారిష్ఠు లలఘువిక్రములు వింధ్యపర్వతవాసులు బహుత్వంబుకతనం జక్కఁగా లెక్కింపనేరము నేర మెన్నకు మోమహారాజా యిమ్మహాప్రభావు లీకులగిరినిభకాయు లీధాగుణి నొక్క వ్రేల్మిడి విదారింపం జాలుదు రని యెంచుచున్నార మని సారణుండు విన్నవించిన. ౨౩౯

క॥ ఆరావణుఁ డాత్మసవిభు, సారబలుం గాంచి పముల సారిష్ఠత్వం
బారసి శేషవిశేషము, లారూఢిం బలుకఁదొడఁగె నాశుకుఁ డంతన్. ౨౪౦

సీ॥ ఆముఖేనఁగులో సౌరాపగావటములో హిమశైలసారమహీరుహములో
యని కాంచుచున్నాఁడ వవ్వారు దుస్సహ బలకామరూపప్రభావయుతులు

కిష్కింధఁబురి నుండ్రు కీశాధినాథుని సచివులు దివ్యప్రశక్తిభవులు
తనుకరు దానవ దైత్యరాక్షసు లన్న నాజి దేవపరాక్రమాభిమాను
లధిప! నవపంచసప్తస హస్రకోటి, శంఖసాహస్రములు బృంద శతములు నగు
లెక్క నున్నారు వీరి వా లీల లెన్న, వశముపడ వలవేనోళ్ల వలఁతి కైన. ౨౮౧

చ॥ వివిధప వాంగ నేప్లవగ వీరకుమారులఁ గాంతు మైందుఁడుఁ
ద్వివిదుఁ డు నాఁ బ్రసిద్ధు లతి ధీరులు వారలు దివ్యమూర్తు లా
ప్రివరులఁ బోలఁగాఁ బరఁగు పట్టుల నొక్కఁడయేని లేఁడు తా
త వనుప మె లెతేంగి సుధఁ ద్రావిరి వారిరి బొల్చి రుద్ధతిన్. ౨౮౨

క॥ వీరును లంకామర్దన, మారూఢి మదిం దలంచి యా లె మ్మనుచున్
శ్రీరామభక్తి వెనిచెడు, ధీరత నున్నారు తాను దితిజాధీశా. ౨౮౩

సీ॥ చూచితే వాతూలసుతు మదకరివోలె నిల్చియున్నాఁ డదె నిర్భయమున
నితని కోపంబున కేఁటిబోఁటిమగండు గండడంగి విలీన గతిఁ దనర్చె
సీతఁ గన్గొనవచ్చి చీకాకుగావించె లంక నాలంకాటలావు నెఱయ
నిన్ను నీతనయుని నెన్నక యెదిరించెఁ బునరాగతుం డయ్యెఁ బూచిగొంచు
శివలకశౌర మీతండు కేవలుండు, గాఁడు వాయుప్రసాదంబుకతనఁ బుట్టి
రుద్రవీర్యోద్భవుం డన రూఢికెక్కె, నవలహనుమంతుఁ డనఁగఁ బ్రఖ్యాతిఁగాంచె.

తే॥ గోష్పదీకృతసింధుండు కువలయైక, బంధుఁ డటు రామకార్యధురంధరుండు
సతతగతి యట్టు లనివార్యగతిబలుండు, కామరూపుఁ డసాధ్యుఁ డీవివరుండు.

సీ॥ ఉదయించు భాస్కరు నొడియఁగా నూహించెఁ బుట్టినప్పుడె క్షుధ పొడవుపడఁగఁ
ద్రిసహస్రయోజనో ద్దేశంబు గ్రమియించె నద్దేవు గ్రమింగఁ బేరాస దొరయుఁ
దవిలి యనాదృవ్యతము తేజు మైసోఁక నుదయనగిరిమీఁద నొరఁగె బాలి
హనుశిలాతలముల కన్యోన్యసంఘర్షజనితక్షతివ్యాప్తి సంభవించె
నవల సురలెల్ల నితండు హనుమఁ డనుచుఁ, బేరుపెట్టిరి పిలిచిరి పేర్మిఁ బొగడి
రిచ్చమెయి దీవన లొసంగి రెఱుకగఁటి, నింతవట్టు సదాగమాహీనయుక్తి.

క॥ భావము రూపము బలము ప్ర, భావము నదసీయ మెఱుక పఱుప నశక్తుం
డేవెరవుననేనియు నొకఁ, డీవెరవరి లంకవంక కెగయుచు నుండున్, ౨౮౬

క॥ లంకారిశబ్ద మీని, శ్శంకు పదసహస్రిక న్నసంగత మయ్యెన్
బంకజభవవర్ణిత మది, యింక న్నాబోఁటి కగునె యిట్లని తెలుపన్. ౨౮౭

సీ॥ శ్యామసుందరమూర్తి శౌర్యైకసంశ్రియుం బరవిందనిభనయనాంచితుండు
సోము మోము హసించుఁ జొక్కాట మింతింత లనరా దశంకుఁ డత్యతిరథుండు
దా నెల్లయెత్వాకతతి కెక్కటి వలంతి యీరేడుజగముల నేలఁగలఁడు
విదితశ్రితుఁడు లోకవిశ్రుతపౌరుషుం డచలధర్ముఁడు ధర్మ వరసి కాని

యడు గిడఁడు బ్రాహ్మ మ ట్లఖిలాస్త్రములును
వేదవేదాంగములును దద్వివరములును
దాల్చు నొక్కండె యను కీర్తిఁ దనరినాఁడు
రాముఁ డవ్వాఁడె కంటె యిందిరప్రియందిర ! ౨౪౯

చ॥ హనుమకుఁ దా ననంతరుఁడ నైయె తనరారె భుజాధిరూఢతం
గనకమహీధరంబుపయిఁ గ్రాలు వినీలసలీల మబ్దముఁ
మొనకొని డాలు జాలుకొన ముంగిట నై తనభార్య సీతఁ దె
చ్చిన పగ నీఁగ ని న్నణుమఁ జెచ్చెర వచ్చెడువాఁడు రావణా ! ౨౫౦

క॥ దారించు నాకసంబు వి, దారించు ధరాధరప్రితతి సందము ని
స్సారించు ధనుర్గుణముఁ, సారించుచు విభుఁడు వనుచుశరవిసరమ్ముల్. ౨౫౧

ఉ॥ కుత్తిని మించుఁ గ్రోధమున మేటి పరాక్రమసీమ శక్రునిఁ
హత్తికొనంగ నోపుఁ దగ వాపురుషోత్తముఁడే యెఱుంగు నే
యొత్తున కోపహాటింపఁడు గుణోన్నతుఁ డుజ్జ్వలరూపుఁ డిప్పుడీ
యెత్తున రిత్తవోఁ డరసి యీవ దలంతువుగాక కర్జముఁ. ౨౫౨

మ॥ అయయుద్ధాగమవేత్త రాము బహిరీ ద్యప్రాణ మా భ్రాత దు
ర్జయుఁ డైకాంతికభక్తుఁ డూర్జితుఁడు ప్రజ్ఞావంతుఁ డెందు న్నిరా
మయుఁ డంచద్బలవిక్రముండు మహితామర్షుండు సంరక్షి జే
త యతండే సుమి లక్ష్మణుం డసురదుర్ధర్షుండు దైత్యర్షభా. ౨౫౩

తే॥ అదుగో దక్షిణపార్శ్వమం దమరియున్న, వాఁడు దక్షిణభుజము భూ వల్లభునకు
నీలకుంచితకచుఁడు వి శాలవక్షుఁ, డమలకనకాభుఁ డుచితగా ప్రమాత్ముఁ డధిప.

క॥ జీవితరక్షణమునకును, జేవిడఁడు రామకార్య సిద్ధిక్రమముఁ
దేవారివీరహననము, నావలనిదె యనుచు నయ మనయముం దలఁచుఁ. ౨౫౫

ఆ॥ సవ్యపక్షమునను జానొందె రాముని, యాశ్రయమున నాపదత్యయమున
నీవిభీషణుండు నేత తా నయి నయ, కోవిదుండు హితులు గొలుచుచుండ. ౨౫౬

క॥ శ్రీయుతుఁడు రాజరాజు స, మాయుక్తిం దన్నులంక కభిషేకింపఁ
గాయము వొంగఁగ సీతకో, నాయోధనముంబొనర్ప నడరెడుఁ బెలుచఁ. ౨౫౭

సీ॥ సర్వశాఖామృగ శైలాధిపతిఁ గంటె చలిగట్టుదొర నవ్వఁజాలినాఁడు
కొండలనడిమి పెన్గొండ యీతం డన వావిరి స్థైర్యంబు వడసినాఁడు
స్వాభిజనము జ్ఞానమనము తేజోబుద్ధు లపరాజితునిఁ జేయ నమరినాఁడు
కృతకృత్యుఁ డై దుర్గ కిష్కింధ దుర్గస్థఁ బ్రణిధులతో నేలఁ బరఁగినాఁడు

వాలి చన హైమపుష్కర మాల దేవ
కాంత లక్ష్మీప్రతిష్ఠ స్వకంఠలగ్న
యగుచుఁ దారతోఁ డిద యాయి యఖిలసుఖము
లిఁడగ జేజేలతేని తీరెనసినాఁడు. ౨౫౮

తే॥ ఇంతయును రాముని ప్రసాదమే యటంచు
సంతసము జాల్కొనంగఁ బ్రసక్తి నెఱయ
నఖిలవాహినులం గూర్చి యాసఁ బేర్చి
వచ్చినాఁ డిదె నీయిల్లు సొచ్చినాఁడు. ౨౫౯

వ॥ శతశతసహస్రంబులు కోటి యనియును శతకోటిసహస్రంబులు శంఖం బనియును
శతశంఖసహస్రంబులు మహాశంఖం బనియు శతమహాశంఖసహస్రంబులు బృందం
బనియును శతబృందసహస్రంబులు మహాబృందం బనియును శతమహాబృందసహా
స్రంబులు పద్మం బనియును శతపద్మసహస్రంబులు మహాపద్మం బనియును మహా
పద్మసహస్రంబులు ఖర్వం బనియును శతఖర్వసహస్రంబులు మహాఖర్వం బని
యును శతమహాఖర్వసహస్రంబులు సముద్రం బనియును శతసముద్రసాహస్రంబు
లోఘం బనియును శతౌఘసహస్రంబులు మహౌఘం బనియును మనీషులు వచిం
చెదరు మహాబలపరాక్రముండు వానరేంద్రుండు నగు సుగ్రీవుండు ని న్నెదిరి
యుద్ధం బొనరింపఁ గోటిసహస్రంబును శంఖశతంబును మహాశంఖసహస్రంబును
బృందశతంబును మహాబృందసహస్రంబును పద్మశతంబునుమహాపద్మసహస్రంబును
ఖర్వశతంబును సముద్రశతంబు నోఘశతంబును మహౌఘకోటియు ననందసరారు
బలార్ణవంబుతోఁ బరివృతుండై యరుదెంచినవాఁడు. ౨౬౦

తే॥ ఓమహారాజ! క్రూరగ్రహోపమ యయి
యిటు లుపస్థిత మైన వాహినిఁ గుఱించి
తగిన జతనం బొనర్పుము తమజయ మని
కాక పరపరాజయ మెట్లు గాఁ బొసఁగునొ. ౨౬౧

ఆ॥ అనుచు శుకుఁడు దెల్ప హరియూథపోత్సాహ
మెంచి రాముఁ జేరి యెసక మెసఁగు
తమ్ముఁ గాంచి విభు భుజమ్ము లక్ష్మణుఁ బరి
కించి కీశనాథు కృతిఁ దలంచి. ౨౬౨

క॥ అవిఘ్నహృదయుఁ డై యటు, లావిద్ధక్రోధుఁడును మహావేగుఁడు నై
దేవారి వారిఁ గనుఁగొని, యావలఁ బరుషోక్తుఁ లాడె నద్రితనూజా. ౨౬౩

ఆ॥ ఉన్నయంత లనుచు నొదిఁగి నతాస్యు లై, యున్నవారిఁ గొలిచి మన్నవారి
నెదిరి కారు లఱచె నె ట్లనవలవదు, మొఱకు విధికిఁ గన్ను మూఁత గలదె.

— రావణుఁడు శుకసారణులఁ దూలనాడుట. —

సీ॥ చన వుపజీవు లౌ సచివుల కేనాఁడుఁ బతిమ్రోల విప్రియభాషణములు
నిగ్రహాపగ్రహ నిరతుండు విభు డంచు నెఱుక లేదో యిప్పు డెడసినారొ
ప్రతికూలు రగు రిపు లై వ్రాఁగ నేటి కీ యుపప్రస్తవ స్తవ వ్యాహరణము
లాచార్యవృద్ధుల నటు లుపాసించితి రదనున నది యసమర్థ మయ్యె
మలసి కారొ కడఁగి మఱచినారో కాని, సిద్ధసార మాను జీవ్య మిట్లు
తెఱఁగువానెఁ దెలివి దెల్లవాఱిన శాస్త్ర, భారవాహకులకుఁ బ్రతిభ గలదె.

తే॥ ఇట్టిమూర్ఖుల సచివుల నేర్చి కూర్చి, యకట నేఁ దాల్చుచుంటి ని య్యాధిపత్య
మడరుపరుసమ్ములకునోడరాడఁదొడరి,మి త్రమిూస్మృతినొకనాఁడు మెలఁగవొక్కొ.

క॥ శాసించు నాదు జిహ్వా వి, భాసించు శుభాశుభముల పట్టున విభు వై
యాసించువారిఁ గాంచు ను, పాసించుచునుండుఁ దాని నహితులు హితులున్.

తే॥ దవదహనమూర్ఛితములు పాదపము లెట్లొ,నిలుచుననవచ్చుఁగాని యే నెఱిన యేని
రాజకోపవిసృష్టాప రాధు లెందు, నిలువఁజాలర చూ యిది నిశ్చితంబు. ౨౧౮

క॥ ఈపాపులఁ దెగటార్తుఁ బ్రి, తీపుల పక్షంబు వొగడు తెఱఁ గెంచినఁ బూ
ర్వోపకృతిస్మృతి నా దగు, కోపము మృదుత న్వహింపఁ గొనకొన దేనిన్. ౨౧౯

శా॥ ఈనాసన్నిధిఁ బాసిపొం డిపుడు మిమ్మేఁ జంప యత్నింప ము
న్నానందింపఁగఁ గూర్చినట్టి కృతు లొయ్యం జేరి వారించుటన్
నోనాడ స్వాంతు లైతి రీరలు కృతఘ్ను ల్స్నేహశూన్యు ల్సవకా
స్థానభ్రష్టత దాసదండ మనుచుం దర్జించి భర్జించినన్. ౨౨౦

తే॥ సిగ్గువడి వార లిరువురు చేటు మూఁడెఁ, జెల్ల దిచ్చట నునికి యో చెల్ల యనుచు
ననుచు జయఘోషణాల నభినందనమ్ముఁ, గూర్చి తలఁగిరి కిసలయకోమలాంగి !

ఉ॥ ఆదట నాదశాననుఁ డహంకరణోచితుఁ డంతికస్థలిన్
సాదరుఁ డై మహోదరునిఁ జయ్యనఁ జీరి సురారికార్యసం
పాదనదక్షులన్ ధుతవిపక్షులఁ జారుల సద్విచారులన్
నీదగునేర్మిఁ గూర్పుము మనీషితము ల్సమకూర్ప మిత్రతన్. ౨౨౨

ఆ॥ అనిన నంతలోనె యన్నరహాంత దా, నంతరించెఁ దగినచరుల వారు
విభుని శాసనమున వే వచ్చి తజ్జయా, శంస లట్లు నతులు జరిపి రగజ ! ౨౨3

క॥ ఆయతశౌర్యుల నిజసే, వాయత్తుల విగతభయుల నాత్తనయులఁ బ్రి
త్యాయితులఁ బ్రణిధులం గని, యాయసురాధిపతి యిట్టు లనె నలినాక్షీ !

—♦ రామసైన్యముల రంధ్రము లెఱుంగ మఱికొందఱు చారుల పనుచుట ♦—

సీ॥ పెరవారి సైన్యంబు బెరయుచు వింతవేసము లూని మీర తీక్ష్ణమౌ నిరలి
రాముని వ్యవసాయ మేమాడ్కిదో కూడివచ్చినవార లేవలనివారో
యాభ్యంతరులు మంత్రు లం దెవ్వరెవ్వరో పిరికొని యెడయీని పేర్మిఁ దఱియు
వార లెవ్వారలో వారిలోపల నెంత కెంతకుఁ జాలు సమీహితములు
గలవొ నిదురవోవుఁ గతి మేలుకొలుపన, నొండుపనులవంక నొడయుఁ డెట్లు
నెగడువాఁడొ యెల్ల నిపుణంబుగ గ్రహించి, రండు నాకుఁ దెల్ప రహి దలిర్ప.
క॥ పండితు లగు దొరలు సమ, గ్రుండగు చారుకతన న్విరోధి నరసి యు
ద్దండు లయి వానిఁ గెడపుదు, రొండొకఁ డాచూడ్కి తన్న నుత్తమ మున్నే.
ఆ॥ అనిన వార లట్టు లాఁగాపుత మరించు, సరుస మెసఁగ రాక్షసాధినాథు
సరవిఁ జుట్టి మ్రొక్కి శార్దూలు మున్నిషు, కొని చలించి రపుడు కువలయాక్షి!
ఉ॥ మేలి సువేలశైలము సమీపమున న్సహాలక్ష్మణుండు ని
శ్చేలవిభుండు భానుజవిభీషణభాషణతత్పరుండు ని
ద్యాలసితుండు లోకవిభుఁ డా రఘురాముని జూచి రల్లవా
రోలము గూర్చు వేసముల నొప్పి ధరాధరకన్యకామణీ! ౨౭౮
ఆ॥ మొనసి కాంచి రాచమూసముద్రము నల్లె, యుద్ధికాంచి కాంచె నొర దీని
నని చలించి రడరు మొనకొన పక్షంబు, లైరి తెఱవు గాన నైరి గౌరి! ౨౭౯
ఆ॥ కరుగు గట్టి ధర్మకలన లేర్పడఁ బెట్టి, నలువ పోఁతవోయఁ జెలువు డాయ
నైన పుణ్యమూర్తి వ్యాఖ్యాతసత్కీర్తి, యావిభీషణుఁడు ప్రహర్షణుండు. ౨౮౦
క॥ ఆపగిది వారి నరసి ని, రూపణ మొనరించి గదిమి రూఢిమెయిఁ గడున్
బాపుఁ డనుచు శార్దూలునిఁ, బాపుఁ డనుచుఁ బ్లవగయూథపతులకుఁ దెలిపెన్.
క॥ నిర్దయులై వా రాతని, మర్దించిరి పట్టి కట్టి మలఁగక వాఁడ
య్యర్దన మెంచుచుఁ గూయిడె, స్వర్దయితాగ్రజ్యుండు రామచంద్రుఁడు వినఁగాన్
ఆ॥ వీడుఁ డనుచు రామవిభుఁ డానృశంస్యంబు, వెలయ నానసేయ విశ్వసించి
వానితోడఁ దోడివారిఁ దో డయ్యంగ, మోది విడిచిపుచ్చి మొనయుటయును.
ఉ॥ ఊర్పులు పుచ్చుచుం దరలి యోపనియోపిక లంక సేరి ని
ర్దర్పులు నష్టచిత్తులు విదారితగాత్రులునై వడంకుచున్
స్వర్పతివైరి కొల్వున దెసం బడి నిత్యచరుల్ నిశాచరుల్
మార్పడియుండఁ దద్దశయె మానుగ మార్తుఱ వార్తఁ దెల్పఁగన్. ౨౮౪
ఆ॥ కడఁగి వారు ఘనుఁడు క్రాంతసువేలాద్రి, వనుఁ డటంచు భూమివరుని ఛాటి
పాటిసేసి పలుకఁ బలుమొగమ్ములవాఁడు, దలఁకొకింత యెడఁదఁ దారసిలఁగ.

—♦ చారులు రావణుఁ జేరి తమచేటుపాటులు తెలుపుట ♦—

శా॥ శార్దూలుం గని పల్కె మాఱుపడె నీచందంబుతో నంద మా
దోర్దర్పం బెటఁ బోయె రుష్టు లగు నాదుష్టు ల్విజృంభించిరే
నిర్దాక్షిణ్యులు వారిచేతఁ బడితే నేమంబు లూపాడ న
ట్లర్దింపం దొరకొన్న వారి మన మియ్యర్థంబు మన్నించెనే. ౨౮౭

క॥ అని యొడయఁ డడుగ మందం, బనఁదగు కంఠస్వరమున ననదయ కా ని
ట్లనె భయవిహ్వలుఁ డగుచున్, దనరఁగ నగు దారిమెయి విదారితదురితా.

తే॥ లేఁడు శార్దూలుఁ డిప్పుడు రాఁడు నీకుఁ, గాఁడు రాక్షసశార్దూల కంటగించి
చూడకుము విను మచ్చటి చొప్పు వినుచు, వాఁడ నీవాఁడ నైన యావలను వెలయ.

సీ॥ కారయ్య! లోకైక వీర! కీశులు చారచారణశక్యులు సమధిబలులు
విక్రాంతు లైనారు విభు నాచికో లట్లు వేయిమడుంగులు వెరవు సూప
భాషింపఁగారాదు పలికినపలుకునఁ గోటియర్థంబులు గుప్పుమ్మరింతు
ప్రశ్నోత్తరంబులు పాటిల్ల వచ్చట దారి డొంక యొకొండు దారసిలదు
చొచ్చినంతటనే పోడఁ జొచ్చినారు, చారులో యంచు నాదు లెడఁ జల్లినారు
త్రిప్పలం బెట్టుచును చుట్టుఁ ద్రిప్పినారు, కొట్టినా రిట్టు వెడలంగఁ గొట్టినారు.

తే॥ త్రొక్కిచూడకమున్నె యీతోడుసు లెల్లు, పడిరో యనుకొంటినవ్వార్తపడయరాని
దమ్యొ నిచ్చోట మొనయంగ నైనపిదపఁ, గంటి మాగంటు లీవును గన్నయవియ.

మ॥ సమయం బెంచి వచించె వారలకు నీ సైదోడు పీడ్కోలు దో
న మహాత్మ్యాకృతు లూని పొంచి యటుపై సాగించి రాజానుము
ష్టిమిలత్పాణితలాభిఘాతముల ని ష్పీడించి రుద్రాంతదం
తములన్ గ్రొచ్చిరి గోళ్ల నెత్తుగులు సోన ల్గట్టి నో ల్లొట్టిపోన్. ౨౯౧

తే॥ అయ్యమస్తంబు లా హారు లందుఁ గలుగు, వీధివీధులఁ ద్రిప్పుచు వేఁచునపుడు
నక్కఁ గన్గొన్నవా రెల్ల ననుచు వేఁట, కాండ్రి యై రన్న యర్థంబు గాననయ్యె

తే॥ వివశుఁ జలితేంద్రియు విశీర్ణ విద్ధ రక్త, సిక్తసకలాంగు నను రాముఁ జేర్చినంత
నంతకాలంబునం దెట్లొ యావహిల్లె, రామ రక్షేతిపదము నా మోమునందు.

క॥ అట యాచ్యమానబంధున్, ఘటితాంజలిబంధు నన్నుఁ గాంచి కృపాలం
పటుఁడు రఘూద్వహుఁ డీతనిఁ, దటుకున విడనాఁడుఁ డనుచుఁ దద్దయుఁబలికెన్.

ఆ॥ జీవదాత కెఱిగి చెదరిన యసులఁ, జేర్చుకొనుచు బ్రిదుకు జీవుఁడయని
రెంటఁ జనినవార లొండొండఁ గవియంగ, వచ్చినాఁడఁ గొలువు సొచ్చినాఁడ.

క॥ శైలములు శిలలు దరుపులు, జేలాపున వైచి కపులు సేతువు గట్టం
గా లావరి యైయున్నాఁ, డాలక్ష్మణభ్రాత యాయు ధాంచితుఁ డగుచున్. ౨౯౬

మ॥ గరుడవ్యూహము పన్ని పన్నిదములుద్ధారించుచు న్సర్వతో
హారిముఖ్యాధ్య మనీక మొప్ప జనమాన్యం బైన తేజంబునన్
బుర మంతఃపుర మంబరంబు నొకటం బూరింపనున్నాఁడు దు
ర్ధరుఁ డారాముఁడు రిత్తవోఁడు తగునర్థం బద్ధి నూహింపుమా. ౨౯౦

క॥ అరికట్టు నేఁడొ రేపో, యరి కట్టు లసాధ్యుఁ డనఁగ నగుఁ గదిసిన నీ
వెరవుమెయిం బొనరింపుము, తరుణీమణి నొసఁగుటో ప్రథనమున కగుటో.

క॥ అని నొడివెడు శార్దూలునిఁ, గని రక్షోవిభుఁడు భావిగతి నెంచి భయం
బొనరఁగ నిట్లని పలికెను, దనధార్ష్ట్యం బెడలనీక దలితానీకా! ౨౯౯

తే॥ దేవగంధర్వదానవు లిట్టు లగుచు, నన్ను నలికింపవచ్చిన భయముఁ బాసి
యేను శర ణందునే సీత నిచ్చి మనఁద, లంతునే యటులేని నాలావు నెడదె.

తే॥ సర్వలోకభయం బొంటఁ దారసిల్లుఁ, గాక యుష్మద్గశాబకాలోక నిచ్చు
మాట కల్ల త్రియామాట! మలసి యవ్వ, నాటబల మెల్లఁ గాంచితి వట్టులగుట.

క॥ అం దెట్టివార లుందురొ, ముం దలిగెడువార లెవరొ ముఖ్యు లెవరొ బల్
క్రిందున కలుక కడరువా, రెందఱొ దుస్సాధు లెవరొ యెఱిఁగింపు మొగిన్.

తే॥ ఎవని కెవ్వారు పుత్త్రులో యెవని కెవరు
పౌత్త్రులో మిత్త్రులో బంధు భావయుతులో
తత్త్వ మరసిన యంతలుఁ దద్దయు వివ
రింపు మద్దాన నసమాన రీతిఁ గాంతు. ౩౦౩

క॥ విజిగీషుఁ డైన యొడయఁడు, నిజబల మెదిరిబల మెంచి నిర్ణయు మొదవన్
గజిబిజిపడక జయశ్రీ, గజగమనం గొని సుఖించుఁ గలనన బలిమిన్. ౩౦౪

—♦ రావణు నకు శార్దూలుఁడు కపిసైన్యము జననాదు లెఱిఁగించుట. ♦—

క॥ అని యతఁ డాడిన విని వాఁ, డినకుల కేసరికిశోర మెడలించెడు మీ
తని మోడి యని బలార్ణవ, మనుపమ మెఱిఁగింపఁదొడఁ రె నాస్థానమునన్ ౩౦౫

సీ॥ సంగరంబున సుదుర్జయుఁ డెకదా రాజు ఋక్షరజస్సూతి యినభవుండు
వానిఁ బోలినవాఁడె వనజోద్భవోద్భవుం డా జాంబవంతుఁ డత్యలఘుబలుఁడు
గద్గదు నతి పీనిఁ గనియె నీతని యన్న ధూమ్రుఁ డన్వాడు; విధూతరిపుఁడు
లంకారిఁ గన్నాడు లావరి కేసరి పే రెట్టు లట్టులే పేర్చి పెనఁగు
శ్రీనుతుఁడు ధర్మసుతుఁడు సు షేణుఁ డనఁగఁ
బరఁగు దధిముఖుండాత్మ పాకరతనుజుఁడు
సుముఖదుర్ముఖ వేగద ర్శిముఖులైన
వారిఁ గన్నది మిత్త్రి యు వ్వారి జనని. ౩౦౬

తే॥ అగ్నిచూలియు చూ నీలుఁ డతనిఁ జెప్ప, నేల సేనాధిపత్యాప్తిఁ గ్రాలినాఁడు
హనుమ నెఱుఁగుదుగాదె వాఁ డనిలజనితుఁ, డెల్లఁ గాల్పంగఁజాలుదు రిరువు రెనసి.

తే॥ అంగదుఁడు పిన్నవాఁడు బలాధికుఁడు సు, రేంద్రు మనుమఁడు దుర్ధర్షుఁ డెఱిఁగినాఁడ
వతనితండ్రిని వాలి నయ్యశ్విసుతులు, మైందుడును ద్వివిదుండును మానధనులు.

వ॥ గజగవయగవాక్షగంధమాదనశరభ లేవురును గాలునివలనం బొడమినవా రవ్వా
రలు కాలాంతకోపములు కోప మూని రేని ముజ్జగంబులు మడియింప నోపుదురు
యుద్ధకాంక్షులు శూరులు శ్రీమంతులు దేవపుత్రు లైన వానరోత్తములు
లెక్కకుం బదికోటులు దక్కినవారి నిక్కువం బెక్కాలంబునం జక్క వివరింపనేర
నేర నెన్నంబోకుము. ౩౦౯

సీ॥ కనుమరల్పని చూడ్కి గముచు సింగారంబు దన మేని దే యనఁ దనరినాఁడు
లేఁబ్రాయ మియ్యది లెంక లే రొకనాఁడు దరలు నే యను నుతిఁ దవిలినాఁడు
భూనాథు వేలిమి పున్నం బొసంగిన పాయసం బన మనఁ బరఁగినాఁడు
విల్లమ్ము దాల్పుచే వెరవుగా జయలక్ష్మి తనపాలి దై కొల్వ మొనసినాఁడు
చొచ్చి నటవి విరాధుని వ్రచ్చెఁ గడఁగి. మసఖరుఁ ద్రిశిర్షు దూషణు మడఁచె నాక
బంధు బంధురతను నాకబంధుఁ జేసె, రామనిభుఁ డున్నవాఁడె ధరాతలమున.

ఆ॥ కాకపక్షధరుఁడుగాఁ గాదె గాధిజు, జన్నమున సుబాహు మన్నెనర్చెఁ
దబిసి తెఱఁ గనంగఁ దాటక నేర్చె మా, రీచు మార్చె నేమిరీతిఁ గనినొ. ౩౧౧

క॥ నీకతన వాఁడు మడిసెన, నేకక్రతు ల్వన్ని యట్లు లెగిచి జనస్థా
నాకరనిరాకరణ మది, నీకై వచ్చినది గాదె నిర్ఋతిగణేశా! ౩౧౨

ఆ॥ వాలిఁగూల్చి వాని వరుసవాని మరల్చు, కొని ప్లవంగవీరకోటు లెల్లఁ
గొలువ లంక ముట్టి కోట్లలు సేయంగ, వచ్చినాఁడు కృతకిఁ జొచ్చినాఁడు. ౩౧౩

మ॥ అనుఁగుందోడఁట యంతికాఁతికుఁడు వాఁ డాయన్నకుం జోడు ధ
ర్మనిగూఢుండు మదేభ మట్టు లఱుగు న్మన్నించు నెవ్వాఁడు బా
ణనివేశమ్మున నిల్చి యింద్రుఁడును బ్రాణమ్ముల్పొరిం దాల్చు కా
మునకుం జాలు ననోలునే యరియు కా న్మార్కొంచి మాటాడుటల్. ౩౧౪

క॥ రవిసుతులఁట జ్యోతిర్ముఖుఁ, డవిరళతేజుండు శ్వేతుఁ డను నతఁడును న
య్యవిదితుని హేమకూటునిఁ, బ్రవరుని వరుణాత్మజునిఁగఁ బలికిరి దేవా! ౩౧౫

ఆ॥ నలుఁడు విశ్వకర్మనందనుఁ డాప్లవ, గోత్తముండు సేతు వొనరఁ గూర్చె
నతనికడిమిఁ గడవ రన్యులు వసుపుత్రుఁ, డలసుదుర్ధరాఖ్యుఁ డలఘుబలుఁడు.

క॥ రక్కసులలో వరిష్ఠుం, డుక్కుతునుక నీదుతమ్ముఁ డొడ్లవశమునం
జిక్కెను సిరి తక్కెను దన, కక్కతమున ననుచు నీనయువ్యపగతిచేఁ. ౩౧౭

తే॥ మంత్రులం గూర్చుకొని శత్రు మలసినాఁడు
నిన్నదిర్చి పెనంగఁగా నేర్చినాఁడు
ప్రాణమానము లనునవి రాముని వని
పలుకుచున్నాఁడు విధి గొన్న బాట యెదియొ. ౩౧౮

క॥ ఉన్నయది తెలిపినాఁడ స, మున్నత మగు నీదు సత్త్వ మొలయించెదు నా
తెన్నునఁ గూర్పుము కర్జం, బిన్నిటికే మమ్ముబోంట్ల యేలుక లధీశా! ౩౧౯

ఉ॥ అమ్మయి వాఁడు దెల్పెఁ జరు లందఱు నట్లె యనంగ రావణుం
డి మ్మెడఁ బాసి చిత్తగతి యేట్టెఱ నూవఁ జలించి లోని గా
నుమ్మలికంబు నాచికొన నూర్పులు పుచ్చక వెళ్లవోవు నా
యెమ్మె నమాత్యులం బిలిచి యిట్టు లనెం గనుకట్టు చొప్పడన్. ౩౨౦

ఆ॥ మంత్రికాల మిది సుమాళమ్ముమై నిల్వ, రాదు పాదుకొని నరాతిసేన
గాన మీరు తగినకలనల మెలఁగంగ, వలయుఁ దెలుపవలయు వలను లరసి.

క॥ అని సమనంతరకృత్యము, లను వారలతోడఁ దగిన లాగునఁ జింతిం
చి నెఱయఁగఁ జేయుఁ డనుచున్, దనయంతర్గృహము సేరి తనికెను మదిఁగోన్.

క॥ విద్యుజ్జిహ్వుం బ్రిబలు స, ముద్ద్యోతితు మాయలాని నొంటిఁ బిలిచి మా
యద్యోతనుఁ డిది విను మని, సద్యస్సంపన్నయుక్తి సరణిం బలికెన్. ౩౨౩

ఉ॥ సీతను మోసపుచ్చవలె శీఘ్రగతిం జని రమ్ము మాయికం
బై తగు రాము శీర్షము శరాసన మస్త్రము మున్ను గన్న తీ
రే తనరార నయ్యువతి యెన్నియు నొం డని యెన్నకుండఁగా
సీతర మంచుఁ దెల్పితి వినీతతమైఁ గొనితెమ్ము నావుడున్. ౩౨౪

క॥ అది యెంత లనుచు నాతం, డదరిపడుచుఁ బలుక నొడయఁ డతిరమణీయం
బదె యనఁగఁ దనరు మణిమయ, ముదంచితము హార మప్పు డుపహార మిడన్.

ఆ॥ అతఁడు జతనమెయిన యరిగిన దనుజేంద్రుఁ, డాయశోకవనిక కట్లు చనియె
సీతఁ గాంచు వేడ్క శిర మెక్కి నటియింప, దుష్టభావ మెంతఁ దోసువడఁగ.

సీ॥ తల వంచుకొని శోక దార్ఢ్యంబున నశోక వనికి దూఱుఘటించు వలను దాని
రామరామా యంచు రహిఁ బెంచు తలఁపుల జీవనాడికిఁ జేవఁ జేర్చు దానిఁ
బెఱగాము మొగిలుచాల్పుఱదీక గిఱికొనఁ గను మాయు శశిరేఖఁ గవియు దాని
బలుగాలి యొంపెడఁ బడవైవఁ దల్లి మే దిని హత్తుకొను తీఁగె తెఱపు దానిఁ
దా నిదానించియును దుష్టమానసుండు, గడుసు రాకాసి తేఁడు వికాస మొప్ప
మంచి యెఱిఁగించు చందానమలసియిట్లు, పలికె రఘునాథుకలికతోఁ బాపహంత్రి.

—♦ రావణుఁడు సీతకడ మాయను బన్నుట. ♦—

శా॥ చాయం బల్కుచు భద్రమూర్తి వని నీ సఖ్యంబు పాటించినన్
జేయీ కమ్మయిఁ దూలనాడితివి నన్ సీరాముఁడే భర్త నా
కే యోగంబును బోల దంచుఁ జల మెంతేఁ బూని నిర్భాగ్యవై
యాయాటల్సనె నాఖరారి యిపు డొయ్యం గూలె జన్యంబునన్. 3౨౯

తే॥ ఉట్టి చేర్లన్నియుం దెగె నుదిలపడుచుఁ, దొంటిదర్పంపుటుయ్యాలఁ దోఁగఁగలవా
వ్యసనపర వయి నీకు నీవయ్యుఁక నాకు,భార్య వగుదువా ప్రార్థించు పనియులేదు.

ఆ॥ మూఁడుగాల నిన్ను మొనసిన యామతి, నడచి యిప్పు డైన నంతిపురికి
నీవె యీశ్వరివిగ నెగడుము కడమ వా, రెల్ల నీదుకొలువు నెనసి మనఁగ. 330

తే॥ పున్నె మించుక సేసితి పోమె నదియు, మొదలి జడభావమే యిప్టు ముదలకొనియె
నింకఁ బండితమానిత్వ మేల యేలఁ, జాలుదు జగమ్ము లనుకొన్నఁ జక్కవడునె.

క॥ ఘోరము వృత్రవధం బటు, నీరమణుని వధవిధంబు నెఱయ విను మకూ
పారము పారము సేరెను, నేరని యాకోఁతిపిందు నెలకొని తఱుమన్. 33౨

తే॥ నన్నుఁ బొలియింప నెంచినాఁడన్నుమిన్న, దాశరథి దాశరథిదాఁటఁదడవుకొనుచు
నేము పుట్టనిబిడ్డల కిట్టు లనుచుఁ, బేళ్లువెట్టెడువార మన్నిగు వరయఁడు. 333

ఆ॥ దండువిడిసినా రుదధి యుత్తర పుదీర, ముందు మందు లగుచు ముందు వెనుక
చూడ కటమటించి చొక్కి యన్నెలవున, నిద్రసేసినారు నీరజాక్షి!. 33౪

క॥ తెఱి గని యఱిముఱిఁ జరుల, క్కఱఁ దెల్పఁ బ్రహస్తుఁ డరసి కని బలములతో
నంకమి యరిబలముఁ దనదగు, నెఱిఁ దెగటార్చె న్మదాజ్ఞ నెలకొని నెగడన్.

వ॥ రామలక్ష్మణసుగ్రీవవిభీషణు లున్న యన్నెలవెల్లఁ బల్లటిల్ల నెట్టనం గదిసి దిట్టలగు పాలదిండివీరులు సూరెలం బొదివి పట్టసంబులు పరిఘంబులు చక్రంబులు మహాచక్రంబులు చంద్రహాసంబులు మహాయసదండంబులు శూలంబులు బాణజాలంబులు భాస్వరంబు లగు కూటముద్గరంబులు యష్టులు తోమరంబులు శక్తులు ముసలంబులు నొక్కయెత్తున నమ్మత్తులపై నెత్తి యెత్తివైచియు విసరియు మొత్తంబుల గ్రొచ్చియువ్రచ్చియు విదలించియుఁ గదలించియుసైన్యంబు శూన్యం బొనరించి రది యట్లుండె 33౬

తే॥ అందు సుఖసుప్తుఁ డగు రాము నందఁగాంచి
యాప్రమాథి ప్రహస్తుఁ డొయ్యనఁ దలంచి
మించిన మహాసిఁ బూన్చి ఛేదించె శిరము
తనదు శిక్షాప్రసక్తి తద్దయుఁ బొసంగ. 33౭

చ॥ నెఱసిన యవ్విభీషణుని నెట్టనఁ గట్టిరి దిగ్భ్రమోచితుం
దఱిమిరి లక్ష్మణుం గపికదంబము తోడుగ దిక్కులంట ను

క్కఱఁ బ్లవగాధిపుం బ్రథితు లైన సుయోధులఁ దీర్చి రుద్ధతిన్
నెఱకు లెడల్చి చీల్చి యలినీలకచా! వికలత్వ మేర్పడన్. ౩౩౮

సీ॥ సుగ్రీవుఁ డందు భగ్నగ్రీవుఁ డయ్యె నిర్మానుఁ డై సడలె నల్ల హనుమఁ డసురి
పట్టసంబులఁ దెగి పడె జాంబవంతుండు నలుకఁ గూలెడు ప్రమాని నయము దోఁప
నడిమికి రెండుగా నలువు రై రిరువురు మైందద్వివిదులు దుర్మానఘనులు
పనసతోన ల్వ్రాల్చెఁ బనసుని మేన దరీముఖుం డూరఁగ దరీముఖమునఁ
కుముదుఁ డై వ్రాలెఁ గుముదుండు గూళ యంగ
దుండు దుండగి మథితాంగదుండు గాఁగ
నస్రము ల్వెడలఁగ ధర నత్తమిల్లె
నెందుఁ జేరనివార లిఁ కేమి లెక్క. ౩౩౯

మ॥ మదనాగంబులు ద్రొక్కఁ గొందఱు మహామాత్రంబు లశ్వోఘము
ల్పొదువ న్వాతహతిం దొలంగి చను నంభోదంబు లై కొందఱున్
దుది సింగంబుల దాడికిం దెరలి నిర్ఘాతం బు లౌ హస్తు ల
ల్లైదియుం దోఁపక గొందఱు న్మడఁగి రోయేణాక్షి! యవ్వానరుల్. ౩౪౦

క॥ మున్నీటఁ బడిరి కొందఱు, మి న్నేమో గతి యటంచు మిడుకుచుఁ దుది తే
క న్నెతి వ్రాలిరి కొందఱు, గొన్నా రెగఁబ్రాకి చెట్లకుం దమవృత్తిన్. ౩౪౧

ఆ॥ చంపి రతిమి యతిమి సంద్రమ్ము తీరమ్ము, లందు గిరులయందు నడవులందు
రక్కసులు గడంగి రారాపు సేయుచు, నెదురుపడినవారి నెడయనీక. ౩౪౨

క॥ బిసరుహదృశ! నీపతి యిటు, నసైన్యుఁ డై మడిసె నింక క్షతజాగ్రము కీ
కసయుతము రజోధ్వస్తము, వెసఁదెచ్చిరితచ్ఛిరంబు వేయేమిటికిన్. ౩౪౩

తే॥ పరమదుర్ధర్షుఁ డమ్మాయిఁ బడఁతి వినఁగఁ, బలుకుచునె యొక్క రక్కసిఁ బట్టఁగాంచి
కించిదుల్లసితం బొప్పఁ గృతిఁ దలంచు, రీతి దళుకొత్త నుత్తాలుఁ డాతఁ డసిగు.

క॥ విద్యుజ్జిహ్వునిఁ బిలువు మ, హోహాద్యుతుఁ డవ్వాఁడు దెచ్చి నొగిఁ దచ్ఛిరమున్
దద్యోగిశరముఁ జాపము, నాద్యంతము లరసి తెలుప నౌ వల నొలయన్. ౩౪౪

తే॥ అని పలుకునంతలోనె విన్యాస మొప్ప, నాశరశరాసనము లుత్తమాంగమును బి
రానఁ గొనివచ్చి ప్రణతులు రాణఁదనరఁ, గూర్చి నిలఁబడె నక్కూళ కుచ్చితమున

తే॥ వచ్చినం గని యప్పడవాలు మెచ్చి, తెచ్చి తేకదగుర్చి యాధీరు శిరము
పచ్చినెత్తురుతో నట్లు పరఁగఁ జెలువు, నచ్చెలువుఁ గాంచుఁగాపుత మబల కృపణ.

క॥ ఆయమ యెదుటం బెట్టుము, పాయనితమకమున నట్లు పడు యువతి నిజ
ప్రియు స్తము మో మరయుట, నాయమ కద యమని కేతనం బతఁ డనయున్.

ఆ॥ అనిన వాఁడు వల్లె యని బాలహరిణాక్షి, మ్రోల దృష్టిపథము నోలగించి
కాల్ల శీర్ష మైంద్రజాల మయ్యెడఁ దార్చి, యోల మొనసె నమరజాలవినుత.

కం॥ అందుకొని శరశరాసము, లం దార్చెం దాను మొక్కలంబులు విఖ్యా
తిం దనరినయవి యనుచు న, మందేచ్ఛుఁడు వాఁడు లోకమాన్యచరిత్రా!
కం॥ కను మిదె నీమగని శిరం, బనితర మిదె ధనువు జ్యాసమాయుతము మదిం
గొనుము ప్రహస్తుఁడు నిశ న, మ్మనుజునిఁ దెగటార్చి తెచ్చెమానిని! కడఁకన్.
కం॥ విద్యుజ్జిహ్వునిచే నా, ప్రద్యోతనుఁ డిచటు సేర్పఁ బనిచెను నీయా
యుద్యోగము సెడె నంతయు, సద్యోలాభంబు వడయఁ జర్చింపు మెదన్. ౩౫౨
తే॥ అవశ వీఁక వశ్య వౌదు గాకనుచుఁ బలికి
యాపిసాచి యదను వేచియట్టు లుండ
విల్లు నమ్ములు దల మ్రోలవెలయఁ గాంచి
ముదిత బలుశోక సాగరమ్మున మునింగి. ౩౫౩

సీ॥ హనుమనిచే సమాఖ్యాత మైనట్టి సుగ్రీవమైత్రీకథాస్ఫురణ లెంచి
వరుస నవ్వానరవాహిని సాగరాభ్యాగత యను వార్త నన్వయించి
మోము గన్నులు కురు ల్ముఖవర్ణ మాశిరోమణియు నట్లే యుంట మలయఁ గాంచి
మదిలో నభిజ్ఞానమండలి గలయంతవట్టు చూపట్టుట వావిఁ బెంచి
యుమ్మలిక ముప్పతిల్ల నాయమ్మ కురరి, యట్టు లాక్రోశ మొనరించె నాస వాసె
ననుచుఁ దనవడ్డపా ట్లెల్ల నావహిల్లి, తల్లడం బొడఁగూర్ప నొత్తిల్లి తెరలి.

—♦ సీతాదేవి రాముని మాయాశిరముం జూచి దుఃఖించుట ♦—

కం॥ తలఁపులు ఫలించెఁ గైకా!, కులనందనుఁ డిడలె నింకఁ గుదురుకొను మదిన్
నిలువుము కులనాశనమున, కలవడె నీకలహాశీల మనుగత మనుచున్, ౩౫౪
తే॥ ఏమి విప్రియ మొనరించె నిత్థచరితుఁ, డార్యుఁ డగు రాముఁ డాతని యంతమునకు
గారణమ వైతి చీరలు గట్టఁబంచి, వెడలనడఁచితి వడవుల వెతలు గుడువ.
కం॥ అను నుడి నొడువుచునె తప, స్విని జనకుని బాల మ్రోల సిరిసెడ నొరగెన్
వినికృత్త మైన కదలిక, యనువృత్తము నెఱయ వడఁకు నవయవములతోన్.
ఆ॥ ఒకముహూర్తమునకు నూ ర్పెడల్చుచు జీవ, మందినట్టు లగుచు నమ్మృగాక్షి
యాశిరంబుఁ బుణికి యాఘ్రాణ మొనరించి, తొడరి వలికెఁ బలుకు తొట్రిలంగ.
ఉ॥ ఆహత నైతి వీర! నియమానుగతవ్రత! రామచంద్ర! యా
బాహుబలం బరిందమము పశ్చిమ యా దశ నిచ్చగించెనే
నీహరిణాక్షి కీవికృతి నెట్టనఁ గూర్చితె సాధువృత్తికిన్
సాహసవృత్తి మేలె తన సాధ్వి మొఱంగి చనంగ నిద్దెసన్. ౩౫౮
ఆ॥ తప్పఁబలుకుదాన దయితుండు తనకన్న, మున్న చనుట యెన్న ముదిత దోస
మతిసువృత్తుఁడవు మహాత్ముండ వీ విట్లు, లరుగుదే మదీయ మఘమ కాక. ౩౬౦

తే॥ దుఃఖితో దుఃఖి మిమ్మోయిఁ దొఱయఁ గాంచి. మన్యుసాగరమునను నిర్మగ్నుఁ నైన
నన్ను రక్షింప దొరఁకొంటి నాథ యట్టి, దొర వరయఁగంటి విట్టు లన్యోగతంబు.
తే॥ అమ్మహితుకాలు కౌసలు నాత్మజాత, దేవి మదుపాస్యదేవత ధేను వాత్మ
వత్సముం బలె నినుఁ బాసి వాసిసెడఁగ, వత్సల వివత్సఁ జేసితేనలను సూవి.
క॥ ఏయోజ నెవరు నిను దీ, ర్ఘాయుస్సము పేతుఁ గాఁగ నాడి రచింత్రు
శ్రీయోగ! వారి నుడు ల, ల్పాయుష్కుఁడ వీవు గాఁగ ననృతము లయ్యెన్.
ఉ॥ కారణభూత మై జగము గ్రాసముగాఁ గొననేర్చు కాల మా
నేరిమిఁ బక్వభూతునిఁగ నిన్ను నొనర్పఁగ నొడ్లప్రజ్ఞపై
నేరము మోపు కేమిటి క నింద్యుఁడ వెల్ల యెఱింగి తర్థదృ
క్పారముఁ గంటి మృత్యుముఖ గహ్వర మంది తహో తటాలునన్. ౩౬౪
తే॥ కమలలోచన ! మత్ప్రాణసముఁ దతోతి
ఘను నతినృశంస రౌద్ర యా కాలరాత్రి
రేఁగి యొడిచి పొదివి యాహ రించె నేమి
సేయుదాన స్ఫురింప దుపాయ మెదియు. ౩౬౫
తే॥ ననుఁ దపస్విని విడనాడి నాయ మేమొ, ప్రియతమంబోలె నట్టనఁ బృథివి నట్టు
లఱిమి యాశ్లేష మొనరించి యత్తమిల్లి, యుపశయానుఁడ వైతివేయురుభుజాఢ్య
క॥ ఇదె కాదె వీరశేఖర, ముదనున నాతోడి నిరతి నర్చావిధులం
బొదలింపఁబడిన విల్లది, ముదమున సుమమాల్యగంధ ముఖ్యార్థములన్. ౩౬౭
క॥ నీతండ్రి నాదు మామ వి, నీతాగ్రణి పితృగణం బనింద్యము స్వయమా
నీతముగా స్వర్గమునఁ ద్వ, దాతతపద మెనసి ముదితుఁ డయ్యెఁడు నింకన్. ౩౬౮
తే॥ నీదు రాజర్షి కులము ద్యో నిష్ఠితంబు, సుకృతిజనకాంక్షణీయంబుఁ జూచువాఁడ
వచట నక్షత్రభూతుండ వగుచుఁ దనదు, పున్నములప్రోవు నెలకొని తెన్ను సూప.
ఆ॥ బాల నన్ను బాల్య పరిణీత సహధర్మ, చారిణిం బ్రియసక్త సాధ్వి భార్య
నేమి దలఁచి యిట్టు వీక్షింప వే మని, పలుక వుచితముల సుభాషితముల.
క॥ మఱవంగ నగునె పెండిలి, నెఱపిన యావ్రతిన ధర్మ నిష్ఠుఁడ వీయు
కృఅనేని నీదుదే నను, మొఱంగ కావన్న నచటు కొనయింపఁగదే. ౩౭౧
క॥ ఉత్తమగతిమంతులలో, నుత్తముఁడవు నన్నుఁ ద్రోచి యొంటిగ నరుగన్
బొత్తెడలితో మఱచితో, యిత్తలముం బాసి యచటి యెఱుక మరఁగుచోన్.
తే॥ సకలకల్యాణసంపత్ప్ర సక్తిఁ గని మ, దేకలోకపరిష్వంగ మెనసి యెసక
మెసఁగు నానీశరీర మి ష్టసదు లైన, పాదుకవ్యాదములకుఁ బా ల్పడెనె యకట.
ఆ॥ ఆప్తదక్షిణంబు లధ్వరముఖ్యంబు, లాచరింప కిట్టు లైతి వేల
నీదుకాలములోన నెఱిగన్నవారెల్ల, నగ్నిహోత్రు లై మహత్త్వ మంద. ౩౭౪

మ॥ ఇలు సేరం గనెనేని లక్ష్మణుఁ డొకం డొల్లినఁ గౌసల్య యు
మ్మలికం బెక్కుడు గాఁగ వత్స! కడునే మం బూని చన్నట్టి వా
రలలో నెక్కటి గాను పించితివి దూరం బయ్యె నాద్వంద్వ మే
కలన న్నాగ నతండు దెల్పు సోద శక్యం బె విచారింపఁగన్. ౩౮౬
చ॥ అడుగఁగ వీడరాక బలు నంగదమైఁ గడుఁ గ్రుస్సి యాతఁ డీ
వడువున రక్కసు ల్గొడరి వారక యుద్ధమరేయి చొచ్చి ని
న్నొడయుని నీసుహృద్బలము నూరకె చంపి రనంగ నప్పు డా
బడుగున కెట్టిదైన గతి పాల్పడునో తరమే వచింపఁగన్. ౩౮౭
తే॥ సుప్తహతుఁడై చనిన తన సుతుని గతియు
రక్కసుల యిక్క నున్న నా వ్రాతఫలము
హృదయ మువదీర్ణ మొనరించి యెనయు నంతఁ
బడుటయే కాక పై నొక్క పలుకు గలదె. ౩౮౮
ఆ॥ ఏ ననార్య నాదు హేతుకృతిన చువ్వొ
సత్త్వవంతుఁ డేలఁ జాలి నట్టి
ఘనుఁడు వార్ధి దాఁటి కడకు గోష్పదమందుఁ
నిహతుఁడయ్యె రాముఁ డహతుఁ డహహ. ౩౮౯
తే॥ స్వకులపాంసని యిది యన్నజాడ గనఁడు దాశరథి మోహమున నన్నుఁ దావరించె
నరయ నయ్యార్యపుత్రుని హాతు నొనర్పఁ, బాల్పడిన మిత్తి గాని నేభార్యగాను
ఆ॥ పీఁటమీఁది పెండ్లి పెడవెట్టి చూచిన, దాన ము న్నొనర్చి యేనుఁ గాక
యనుభవింతు రెవ్వ రఖిలాతిథికి భార్య, నయ్యు నేఁటి కిట్టులైనదాన. ౩౯౦
ఉ॥ రావణ! పున్నె మబ్బెడు బిరాన మదీయము కాయ మట్టె నా
జీవముగీము రాము మెయిఁ జేర్పుము తీర్పుగ సంస్కరింపు ము
ద్భావమునం దదీయ మగు పట్టినయుం గలదాన దానము
న్నీ వొనరించినట్టు లగు నేను శుభోదయ మందఁగాంచెదన్. ౩౯౧
ఆ॥ సతికిఁ దనదుభర్త చనిన లోకమె లోక, మతనిఁ బాసి యొక్క యరనిమునము
నిలువ దిచట ధర్మనిష్ఠితుం డద్దేవుఁ, గూర్చి మంచిగతికిఁ గూర్చి మనుము. ౩౯౨
క॥ అని ప్రాకృతత్వ మవలం, బన మొనరించుచు సరోజపత్రేక్షణ నె
ట్టన శోకపరీతాత్మత, ధనువు శిరము మఱియుఁ గనుచుఁ దడబడచుండన్. ౩౯౩
ఉ॥ ఒక్కఁడు రక్కసుండు పతి నొయ్యనఁ జేరి జయింపు మార్య! యం
చొక్కటఁ బల్కి కేల్మొగిచి యుగ్జితుఁగా నొనరించి పొంచి నాఁ
డక్కఱ వాహినీపతి ప్రహస్తుఁడు దెల్పఁగ బంచినాఁడు నీ
వక్కడ కేగుదేరఁ జనునయ్య! యటంచు వచించి క్రమ్మఱన్. ౩౯౪

ఉ॥ అంద అమాత్యులుం గదిసి రాతఁ డుపస్థితుఁ డయ్యెఁ దర్శనం
బందఁగఁ గోరి నన్ననిచె నాత్యయికం బది గాఁగ నోపు నీ
యందలి దాక్ష్య మెంచి నిలయంబునయం దటు నిల్చినారు సం
క్రందనవైరి! చయ్యనఁ బ్రకాశము గాంచుట మేలు నావుడున్. ౩౮౫

క॥ వినినంతనే యశోకా, వనిక న్వనికం దొఱంగివాఁ డరిగెను మం
తనమున మంత్రులతోఁ దగ, ననిమె న్సభ కేగి నిర్ణయం బొనరించెన్ ౩౮౬

ఆ॥ రాము విక్రమంబు రామామణి ధరాజ, సాధువృత్తిఁ దలఁచి జలదరించెఁ
గాని చలము వీడి కరుణాబ్ధి! శర ణనఁ, జాలఁ డదియు నేటి సంభ్రమంబొ. ౩౮౭

శా॥ అంతర్ధానము నొందెఁ గార్ముకముఁగో నయ్యుత్తమాంగంబు వాఁ
డంతర్ధిం గొనె నెవ్వ డవ్వడె బలాధ్యక్షుండు దాను న్నమ
చ్చింతారత్నము రాముఁ గూర్చి యెడఁదం జింతించి రావైరి దు
ర్దాంతుం డన్నెటి నానసేసెఁ దగువా రాలించి మే లెంచఁగన్. ౩౯౮

మ॥ స్ఫుటకోణాహతభేరికాగణముఖస్ఫూర్జన్నినాదంబు మి
క్కుటమై చొప్పడరాని చొప్పుననె సంగ్రామోచితౌఘంబు లొ
క్కుట రాఁ దిర్పొనరింపుఁ డిట్లయిన నిక్కూర్జంబునం గారణా
బెటు లేని న్వచియింప నెంచకుఁడు నా యీసత్ప్రధాను ల్పురిన్. ౩౮౯

—♦ రావణుఁడు తనసైన్యముల గూఢముగ సిద్ధపఱచుట ♦—

ఆ॥ అనిన వారు వల్లె యనుచునె యయ్యర్ధ, మనుగమించి కూర్చి యనికిఁ గూర్చు
నధిపుమ్రోల నెల్ల యాయత్తపడె నంచుఁ, బలికి రతఁడు మెచ్చెఁ బద్మనయన!

ఉ॥ అంతట రాక్షసాచరిత మంతయు మంతనమందు రోసి యే
కాంతసఖి స్సతీమణి ధరాత్మజఁ జేర్పఁ దలంచి వచ్చి వి
భ్రాంతివిషాదమూర్ఛనవిపాకవిషాప్తుల నెంచి సద్గుణా
క్రాంత విభీషణప్రియ వికస్వరసమ్మృదుభాష లొప్పఁగన్. ౩౯౧

ఆ॥ పొక్కి పొరలి వేచి పోడిమిసెడి ధూళి, ధూసరాంగి యగుచుఁ దొట్రు పడుచు
మిఱ్ఱిమిఱ్ఱిచూచు మెయి బడుగగు బడ, బం దలంపఁజేయు పడఁతిఁ గాంచి,

ఉ॥ ఊరడిలంగఁ బల్కె నిటు లుత్తమ యాసరమాభిధాన చి
త్పూరితచిత్త సన్నియమ పుణ్యచరిత్ర దయామయాత్మ యో
ప్పారఁగ నైన రావణుని యానతి నమ్మదహస్తియాన దై
వార భరించుచుం దదను వాసితమైత్రి భజించుఁ గావునన్. ౩౯౨

—♦ సరమ సీతాదేవి నూరడించుట. ♦—

సీ॥ ఇంత మనోవ్యథ యేటికే నాతల్లి లలితాంగి! యిల్లైన లావు సెడదె
యావిదేహావని నవతరించితగాదె నీదుపున్నెం బెల్ల నే నెఱుఁగనె
కల్యాణి! శ్రీరాము కాంతామణివ కావె యజితుఁ డాతం డని యరయ లేవె
పౌలదిండిపోతుల పోఁతరం బెఱుఁగవే యీ నట్టిమాయలు చేవగలవె
యతఁడు వచ్చినట్టి యారాకడ వచించి, నట్టి నుడు లొనర్చినట్టి మతక
మేను దెలిసికొనుచు నిచ్చోటున నె యున్న, దాన మఱుఁగుపడుట ధర్మ వగుట.
క॥ స్త్రైణమణి! యతనివలనం, బ్రాణభయము లేదు నాకు బాహిర మగునా
ప్రాణము నీ వగుట దరి, దాణున కొకఁ డాచరింపఁ దర మై యున్నే. ౪౯౬
ఆ॥ ఆతఁ డిచట నుండ నధికృతు ల్బిలువ నం, భ్రాంతుఁ డగుచుఁ బోవు ప్రస్తుతంబుఁ
దలఁపరాదె మాయతల కార్ముకంబు నం, తత్థిఁ గనుట యెదకుఁ దార్పఁజనదె.
క॥ అంతయు నెఱుఁగుదు మైథిలి!, చింతార్ణవమందు మునిఁగి సిరి రా మోకా
లంతరము సేసి యడ్డెడు, నంతటిదాన వటె పతి మహత్త్వ మరయవే. ౩౯౭
క॥ ఆరక్కసి రామేంద్రునిఁ, జేరుట సాప్తికముపొంటె సిద్ధపడుట యా
పూరుషసింహు వధించుట, యేరీతి స్నీదుమదికి నెక్కెఁ దెలుపవే, ౩౯౮
మ॥ తరమే రామసురేంద్రపాలితుల విద్యాదక్షులం బౌరుషా
కరులన్ వృక్షశిలాప్రహారుల సమక్షం బంద సాధింప నోం
డొరుల స్మెఱినవారు సుస్థిరుల కానున్నారు జేజేల యా
వ్వరుస న్నెక్కఁడనఁ దీసిపోరు ఘను లవ్వారి న్విదారింపఁగన్. ౩౯౯
ఆ॥ ఒక్క హనుమ తేజ మురియాడఁగాఁ జేసె, వీరి వీఁక నన్ని విధులఁ జెడిరి
తలఁపరాదె మదినిఁ దాత్కాలికం బెల్ల, నాకు చవ్వఁడులకు నలుకనగునె. ౪౦౦
సీ॥ శ్రీవత్సమున నరు ల్చన్నార సిరి కెప్డు డోలోత్సవముఁ గూర్పఁ జాలువాఁడు
దీర్ఘవృత్తభుజుండు దీర్ఘాయు వగు నను శ్రితిసంప్రదాయంబు చూపువాఁడు
స్వీకసంహాననలక్ష్మిఁ స్మరదృక్చరములఁ బరఁగింప విల్లు చేఁ బట్టువాఁడు
శ్రితరక్షణం బన నితనిసామ్మె యను భువనవిశ్రుతకీర్తిఁ బొలుచువాఁడు
రాముఁ డాతని తేజంబు రాణ విక్రమంబు నయశాస్త్రవేత్తృభావంబు పరబ
లాఘువిధ్వంసనము సర్వ మరసి యరసి, యీపిసాచు తొడల్తు రం చెంతువమ్మ.
పృథ్వి॥ అచింత్యబలపౌరుషుం డబల రాఘవుం డమ్మెయిన్
విచిత్రనటభావసంవిదితుఁ డెల్లలోకంబులన్
స్వచిత్తకలనావిశేషమునఁ గావఁగాఁ ద్రోవఁగా
రచింప మెఱయింప సర్వవిధి నోపుఁ బృథ్వీసుతా! ౪౦౧

క॥ పిడుగునకుఁ దోడు నాఁ జను, బడబాగ్నియె యనుజుఁ డట్టి పరబలహాంతన్
బడసిన రాముని కేసు, ఘ్నుఁడుగా నొక్కండు గెడప దొరకొనుట సఖీ! ౪౦౩

తే॥ వాహినులు వాహినీంద్రులు వాహినీశుఁ
జేరి పరబల మెడయింపఁ జెనయు నపుడు
నిదురవోవుట యన్యులు గదిసి తమ్ముఁ
బొదివి పరిమార్చుటయు నమ్మఁ బోలునవియె. ౪౦౪

ఉ॥ తాను విరోధి యెల్లరకుఁ దాఁటమాఁటవాఁ డయుక్తసం
ధానితబుద్ధికృత్యుఁ డపధర్ముఁడు రాద్రిఁ డితండు నీకడన్
బూనికమై ఘటించినది బూటకమే యని నమ్ము మొండు చొ
ప్పౌనటేనేని నెన్నకు మహీనశుభోదయ మబ్బు నీ కిటన్. ౪౦౫

ఆ॥ నీదు శోక మెడలె నిత్యకల్యాణి వీ, వఖలసుఖము లనము నందఁగలవు
నిజము లక్ష్మి నిన్ను నియతిమై భజియించు, నాదుపలుకు లరసి నమ్ముఁ గనుము.

సీ॥ మున్నీటిపై నాలి మొనయించి వానరవరసేనతో నీదు వల్లభుండు
దాఁటి యద్దాని దా దక్షిణరోధంబు నెనసినాఁ డటు లగ్గ లెక్కినాఁడు
రెండవసంద్రంబు రీతిఁ గ్రమ్మినది దా నెడయాక మొగ్గర మేర్పరించు
కొని దేవసేనగాఁ గులపతి స్కందుండు నా నొప్పినాఁడు స నాథుఁ డగుచుఁ
గనుల కఱవు దీఱఁ గంటిని వింటిని, జెవులపండువుగను జేడె! యింక
నలుకవలవ దొలయ నైనదిలే క్షయ, కాల మీనిశాటకాండమునకు. ౪౦౬

క॥ అనుజుఁడు లంకానాధుని, యనుజన్ముఁడు వానరేంద్రుఁ డనుమఁడు ము న్నా
ననుచరులుఁ గొలువ నడుమం, దనరారెడు రాముఁ డధికదర్పోద్ధతుఁ డై.

ఉ॥ పంపినవాఁడు రక్కసులఁ బాలకుఁ దుద్భటులం బ్రసక్తి నై
లింపబలావరోధి చని లీలమెయిం జనుదెంచె నిందఱన్
ముంపఁగ నున్న సంద్రమని ముట్టవచించిరి వారు వచ్చి యీ
తెంపరి మంత్రులం గొని యుదీర్ణవిచారణలం దనర్చెడిన్. ౪౦౯

అ॥ అనుచు నోడువుచున్న యంతలో సరమ దా, సరమ సీతఁ గూడి చక్క నిలిచి
యాలకించె భైరవాట్టహాసముఁ బోని, భేరికాసముత్థ పృథులరవము. ౪౧౦

ఆ॥ మరలఁ బలికె నల్ల మధురభాషిణి రణ, భేరిఁ బొడము భైరవారవంబు
వింటికాదె భీరువిశ్రుతం బైనది, తోయదస్వనంబు దొఱయునగుచు. ౪౧౧

వ॥ ఇత్యాది యుద్ధ సన్నాహంబకాని యొండు కానేరదు సింహనాదంబుల సముప బృంహణంబు లట్టులే పొడకట్టుచున్నయవి మత్తమాతంగంబుల కాకల్పంబులు కల్పించుచున్నారు రథవాజులు యోజింపఁబడుచున్నవి తురంగమారూఢులు హృదయంగమంబు లగు వేషంబులతోఁ బ్రాసంబులు పూని వేలకొలందిగా

నిర్వేలం బైన కౌతూహలంబున నోలలాడువారు పదాతులు సన్నద్ధు లై యచ్చటచ్చట గుంపులు గూడుచున్నారు విచిత్రదర్శనంబులు వేగవంతంబులు శబ్దాయమానంబులు నగు ననీకంబులచే రాజమార్గంబు తోయపూరంబులచే సాగరం బట్లు పూరింపఁబడుచున్నది నిర్మలంబులగు శస్త్రాస్త్రచయంబులయు జర్మంబులయు వర్మంబులయు రథవాజిగజరక్షోవరభూషణంబులయు సంస్థానంబుల నుప్పతిల్లి యుప్పరంబున నల్లిబిల్లిగా నల్లుకొని నానావర్ణ మై వర్ణనీయ మైన ప్రభ కానం బేర్చు కార్చిచ్చుమంట యట్టు లెట్లు గన్పట్టెడినో చూడుము ఘంటానాదంబులు రథనిస్వనంబులు హయహేషలు గజబృంహితంబులుదూర్యధ్వనులు భేరీరణనంబులుం బెచ్చుపెరిగి వినవచ్చుచున్నయవి ఉద్యతాయుధహస్తు లై రక్షోగజేంద్రునకుఁ బక్షానుయాయు లగు రాక్షసుల ససంభ్రమం బునగు సంభ్రమం బల్లదె తుములంబును రోమహర్షణంబును నై పరధర్షణంబునకుం దొడఁగుచున్నది కావున నయ్యైంద్రజాలికం బెల్లఁ గల్ల. యిప్పిసాచులకు రాము నాఁచికోలున భయంబు గదురనయంబు సెదరె. శోకఘ్ని యగు సిరి నిన్నే భజించు నచింత్యపరాక్రముండు కమలపత్రాక్షుండు నగు రాముండు వానరవర్గంబు నసుమ దైవతసంఘమధ్యంబునఁ బురందరుం డట్లు విస్మితుండును నస్మితుండు నై క్రోధ మూనని తెఱంగునం గానిపించుచున్నవాఁడు విష్ణుసహితుం డగు జిష్ణుండపోలె సహలక్ష్మణుం డై చెలరేఁగి దశమాఁగి త్రివిక్రమక్రమోల్లాసంబునం బరాక్రమంబు నేఁడ నూపెడు బలే బలంబులతో రావణుండు సంబలుం డగు కాలుని ప్రోలికి విచ్చేయువాఁడు సమరవినిపాతితుం డగు నభియాతిం గని సిద్ధార్థ వై రాముని యంకపాళి నధిగమించిన నిన్నుఁగాంచి యామోదించుదాన. నీదాన నాపై నానబెట్టుకొంటి నొండొంటిఁ దలంపకుము శోభనమూర్తీ! భర్తృసమాగమంబంది విష్ణువక్షస్థలంబునయందు లక్ష్మియట్టు లస్మోటి సమక్షంబున నుపలక్షిత నగుచుఁ బరిరంభసమారంభంబునం బ్రహృష్ట నంభవంబు లగు నశ్రువుల నాతనిచేతమ్ము చల్లనసేయుచు నుల్లసిల్లెదవు రసవేణీ! యీవేణి జఘనగతఁబిరకాలధృత నచిరకాలంబునన మహాబలుం డగు నీదు విభుండు విప్పఁగలండు మనోభిరామము మోముఁ బరిపూర్ణసోమునిం బలె సందర్శించి పన్నగాంగన నిర్మోకంబు నట్లు శోకజలమోకంబు కర్జంబు వర్జించు తటి యయ్యె. నిత్తటి నరి నటిమి వధించి సంపూర్ణసకలకాముఁ డైన రాముండు ప్రేయసిమణి వగు నినుం గూడి పాడిమెయిం జయలక్ష్మి నాదరించి సుఖార్హుండు సుఖం బెనయునయ్యెడు నమ్మహాత్ముఁ డగు రాఘవేంద్రునితో సమాగత వై యాతని వీర్యంబుచేఁ బ్రశస్తవర్షంబుచే సస్యయుక్త యగు మేదిని మాదిరి కై యామోదించెదవు సుమీ మైథిలీ! బంగరుగట్టు చుట్టును జుట్టి పరువు లొనర్చు మేటి వాజి

యోజం బరివర్తమానుం డగుచు నిజతేజంబున నీజగంబులకు భుక్తిముక్తులం
గూర్చు పవలుసేయు జేజేలరాయని నాయకుని జయం బర్థించి దోసి లొగ్గి
సంప్రార్థింపు మద్దేవుం డిష్టపూరణంబునకు ననిష్టవారణంబునకుఁ గారణం బనం
దనరారెడువాఁ డిక్ష్వాకువంశంబునకు మూలకందంబ గదా యని ప్రబోధించి.

క॥ ఆనంద మందఁజేసె న, నూనప్రియకథనమున మహాహ్లాద్యమకలనా
ధ్యానపర సరమ సీతం, ద్యోనారి స్వవర్ణనమున నుర్వరఁబోలెన్ ౪౧౩

మ॥ స్మితపూర్వోచితభాషణప్రవణ యై సీతామహాదేవికిన్
హిత మా మేలొనఁగూర్ప నెంచి సమయం బీక్షించి యాయమ్మ న
మ్మతి కైకో లెద నుంచి యిట్లనియె నమ్మాన్యత్వ మొప్పార నా
సతి సాహార్దము మీఱఁ దోర మగు కౌశల్యం బపారంబుగన్. ౪౧౪

సీ॥ ప్రియసఖి! నీకూర్చు పేర్మికి నీడుగా నొకకర్జ మూహించి యున్నదానఁ
దరలాక్షి! యది నీయుదారభావంబున కెక్కనిచో దాని నెన్నఁబోను
నేఁడె రాముని గాంచి నీదు మే లెఱిఁగించి యతని మే లరసి గా కలఁ దీరాను
ప్రచ్ఛన్న నై వియత్పథమందుచోఁ బవమానతార్క్ష్యుల కేని లోనుగాను
వల నరసి యింతవట్టు నావలని దైన
పనిగొనుము నాదు ప్రాణమ్ము ప్రాణ మనుచు
నినుఁ దలంచితి నమ్ము మీ నిర్ణయమ్ము
నెమ్మనమున నిమ్మేను నీసొమ్ము సుమ్ము. ౪౧౫

— సీతాదేవి సరమసహాయమును మెచ్చుట —

క॥ అని మధురముగాఁ బలికిన, ననుపద మాలిఁ గని మహిజ యనె మృదులం బై
యనుపమమధురం బై తగు, ననఁజను నుడి శోక మెడపు నరుసము పొసఁగన్.

మ॥ గగనం బంట రసాతలం బెనయ దాక్ష్యం బొప్ప నా కన్న నీ
తెగఁబా టొక్కెడ యెన్న నేల చెలి! ప్రీతి న్నీదు చిత్తంబె యి
య్యగచాట్లొందెడుదాని కిచ్చి తివి నెయ్యం బిట్టి దాఁ గా భవ
త్సుగుణంబు ల్వరికింప ముజ్జగములున్ శోధింప నొం డుండునే. ౪౧౬

క॥ చాన! యెదియేనిఁ బూనం, గా నౌ నీ కరయ నొండు గనుపట్టెడు నా
కీనాఁటి కుచిత మగు నది, గా నిది యొడ్ల కెఱిఁగింపఁ గర్తవ్యం బై. ౪౧౭

ఉ॥ మే లొనరింపఁగాఁ దలఁచి మేకొనుదానవు గాన నెట్టనన్
బోలుదు వీవ యంచు మఁది బొల్చెడు ని త్తఱి నాశకుండు వా
చాలుఁడు రక్కసుం డెది ప్రసక్తిమెయిం గొనియున్నవాఁడొ య
జ్ఞాల మెఱింగి ర మ్మచట సక్తవు గా కెద యొప్పనేసెయున్. ౪౧౮

ఆ॥ క్రూరుఁ డన్న మాయికుండు నిష్కరుణుండు, రావణుండు శత్రురావణుండు
వానిఁ దలఁచునంత వడఁకు నెమ్మనేమి, సేయుదానఁ దనకు సిరియుఁ గలదె.

ఉ॥ త్రాఁగినకల్లు నా నదరుఁ దల్లడముం బొనఁగూర్చు నిచ్చలున్
వేగము పాటునం దఱియు విచ్చును దర్జనభర్జనంబులన్
మూఁగినమూఁకకుం దెలుపు మున్నడి వా రటు వేఁచువారు నా
బా గిటు లయ్యె రక్కసుల పజ్జ మెలంగు తెఱంగు చొప్పడన్. ౪౨౧

ఆ॥ శంకితాత్మ నైతి సకియ! యుద్విగ్నతఁ, బడసియుంటి మనసు పాలుపడదు
తద్భయంబె యెపుడుఁ దార్కొని మంచి ద, లంపనీ కలంప లావు సెడఁగ.

క॥ నేనా? యశోకతరువని, లోనా శోకాంబునిధికి లోనై తెరలం
గా నో దానను విధి కిటు, లౌనా దానవుని బాటి కగ్గ మొనర్పన్. ౪౨౩

ఆ॥ కాన వాని తెఱఁగు కథ నిశ్చితార్థంబుఁ, బూని యరసి యెల్లఁ బుట్టినట్లు
దెలుపుమమ్మ యిష్టదేవత వీవె యి, ట్లీగ్రహమ్మె పర మనుగ్రహమ్ము. ౪౨౪

క॥ అని దీన యగుచుఁ బలికెడు, వనితామణి సీతఁ గాంచి వల్గువచన యి
ట్లనె సరమ బాష్పవిక్లబ, మును దన్ముఖమును స్పృశించి మొనకొను పరిమన్.

క॥ అమ్మరొ యుమ్మలిక మ్మెద, నిమ్మెయి నెనయంగ నింత కేల యదియ నీ
సమ్మత మైన క్షణములో, నమ్మార్గం బెల్ల యరసి యరుదెంతు నిఁకన్. ౪౨౬

ఆ॥ శత్రువృత్త మెఱిఁగి సరగ నుపావృత్త, నైన నన్నుఁ గాంచి యరుస మందు
దాన విప్ర డటంచు దానవి ధర్మని, దానభూత చని యెఁ దత్ప్రసక్తి. ౪౨౭

ఉ॥ మంత్రులతోడఁ గూడి పెఱమార్గము లెన్నియుఁ బన్నువాని దు
ర్మంత్రిని మంత్రణం బరసి మానసవృత్తియు రోసి దుష్టమా
తంత్రము కీ లెఱింగి వెసఁ దాఁ బఱతెంచెద సుశీల యప్డె యే
యంత్రణలోనఁ జిక్కువడ కాసతి సందియ మెల్లఁ దీర్పఁగన్. ౪౨౮

ఆ॥ పద్మ మెడసి చనిన పద్మాలయం బోలెఁ, దను నిరీక్ష సేయు ధరణిజాత
సీత మోముఁ గాంచి సిరిఁ బెంచెఁ గ్రమ్మఱఁ జేరునంత నవ్విశిష్టకాంత! ౪౨౯

క॥ ఆవల్గుభాషిణిం గని, యావరసతి చేయి సాచి యాలింగనముం
గావించి స్నేహ మెసఁగం, గా విష్టర మొనసియుండఁ గా నిడి పొసఁగన్. ౪౩౦

ఆ॥ పలికె నన్నుఁ గూడి పొలఁతి యిచ్చోట గూ, ర్చుండి క్రూరచిత్తు దుండగమ్ము
లున్నయట్లు దెల్పు మోయమ్మ నీవ కా, యెల్లగతులఁ దనకు నేడుగడయు.

— సరమ సీతా ప్రార్థిత యై రావణుని ప్రవర్తన మెఱిఁగించుట —

క॥ అని వడఁకు పడఁతిఁ గనుఁగొని, యనితర యిట్లనియెఁ దల్లి! యంతలు పడ నై
మొనకొను తఱి గడచెను మఱి, లోనయఁగనొ సమయ మిపుడు మొనకొనవయ్యెన్.

ఆ॥ కదియవచ్చి తల్లి కైకసి మంత్రివృ, ద్ధుం డవిద్ధుఁ డట్లు దొఱయనేర్చి
బుధులు కొందఱును బ్రబోధించి రవ్వాని, తెఱఁగు లెంచి బ్రదుకు తీరుఁగాంచి.

సీ॥ తొలి జనస్థానంబు దొఱసిన నాఁటి యద్భుతవిక్రమం బెన్న బుద్ధి సారదొ
నీతోడిమెక మట్లు నెఱిబాసిపో నీకు సన్యాసివేసంబు సంగతంబొ
ఘను నాజ్ఞఁ గడలిఁ దాఁగడచి మే ల్వడసిన మారుతాత్మజు వీఁక మఱచుటెట్లొ
యస్త్రాదు లటు చన నైన యీయున్నట్టి బిడ్డల మనఁజూచు పేర్మితగదొ
ఏటి పౌరుషం బి దేటి సంతోషంబు, మనుజమాత్రుఁ డనుట మాన వకట
రాము శరణుఁ జొచ్చి రామ నర్పించి కృ, తార్థభావ మందు మయ్య! యింక.

తే॥ అందరాని ఫలంబున కఱ్ఱు సాప, నేల యాలలితాంగి మహీజ లక్ష్మి
గాని యొండనఁబోలదు గడవకుండు, నంతలో రాముఁగొలిచి నెయ్యమునమనుము

క॥ ఈమాపలికెడు పలుకులు, నీమది కెక్కనివ యేని నిక్కం బనిలో
సామాత్యబంధుహితుఁడవు, గా మనువంశ్యునకుఁ జిక్కి కలఁగెదు సుమ్మా. ౪౩౬

క॥ అని పలుతెఱఁగులఁ దెలిపిన, వినఁ డాకష్టాత్ముఁ డర్థవృద్ధిపరుఁడ ధ
ర్మనిహితబుద్ధిం గొనఁ డ, య్యనయము మృతుఁ డైన పిదప నరిగెదు నెందున్.

ఆ॥ కాన మేలి నెఱికిఁ గాఁడు బాంధవులకుఁ, గాఁడు మంచిగతికిఁ గాఁడు నిక్క
మింతవట్టు వేర మిష్టం బభీష్టు లు, ద్దారివార యింక దరలనయన ! ౪౩౭

మ॥ అనియే నిశ్చిత మయ్యె మీఁదఁ బని లే దాసాన నక్రాడఁగా
జనితం బై తగె మృత్యులోభమున నీసంభ్రాంతభావం బతం
డనిరస్తుం డయి యీఁడు ని న్నొకరుఁడే యల్లైనఁ బోఁబోఁడు స
ర్వనిశాటాటవి గాల నున్నయది శ్రీరామేశు క్రోధాగ్నిచేన్. ౪౩౯

ఆ॥ సంగరమున నిశితశరముల రాముండు
రావణుని వధించి రాణ నెఱయఁ
బొలఁతి ! నిన్నుఁ గొంచుఁ బూజ్య మా పుష్పకం
బెక్కి యాయయోధ్య నెనయఁగలఁడు. ౪౪౦

క॥ మంగళము నీదు విభునకు, మంగళమూర్తి వగు నీకు మానితపులకాం
కాంగపరీరంభసుఖం, బంగన ! గొనె దేల యింక నలమటపడఁగన్. ౪౪౧

క॥ అజితుఁడు నీపతి సంగర, విజయం బాతనిదకాని వేఱొం డనరా
దజరులు గోరిన దదె యు, య్యజరామరుఁ గూడి కాంతు వఖలశుభములన్.

క॥ అనుచుండ శంఖభేరీ, నినదముతో నసఁగి పెనఁగి నిర్ణీతం బై
యనుపమ మై వినవచ్చెను, ఘనహరిబలవార్ధిరవము కంజదళాక్షీ ! ౪౪౩

శా॥ ఆసైన్యార్భటి విన్నయంతటనె లంకావాసులౌ రాక్షసుల్
చేసారింపఁగ లేక నష్టవిభులై చేష్టాపరిభ్రష్టులై
యాసల్మాని వడంకి రింక మన కెల్లా శ్రేయ మిన్నేత బ
ద్దోసంబు ల్గణుతించినాఁడు మఱఁగు న్ధూర్తుం డటంచు న్వెతన్. ౭౭౭

ఆ॥ పుడమి వడఁకె గుహలు భోరుకొనం జొచ్చె, వానరౌఘసంప్రవర్తనమునఁ
బుడమికన్నె మోము వాల్చె సశ్రీకమై, తిరముపడె మనంబు దెస దొఱంగి.

క॥ ఆసరమయు రమ యనఁగా, నాసమయమునం దలిర్చె నవనిజఁ గని సం
త్రాసం బెడలి ప్రహర్షో, ద్భాసిత నొనరించు పలుకుఁబడులం దనరెన్. ౭౭౮

క॥ అన్నియు శుభలక్షణములె, యన్నులఁతకుఁ గానిపించె నరివిధ్వంసా
భ్యున్నతుఁడు రాముఁ డన్నెఱి, నన్నులమిన్నా! జయార్థియై వచ్చె నన్.

క॥ అని శశిధరుఁ డెఱిఁగించిన, విని శశిముఖి గిరిజ యవలి వృత్తాంతము చ
య్యన వినవలతుం దెలుపవె, యనుపమరసభరితఫణితి నని యడుగుటయున్.

మ॥ మహితానంతవిలాసనైగమరసామ్నాతప్రభావా! గుణ
ప్రహితామేయకథానిధాన! సకలప్రారంభకప్రాభవా!
విహితానేకలయా! దయామయ! జగద్విఖ్యాతకీర్తి! స్వస
న్నిహితావ్యక్తకలానువర్తిసుదృశా! నిష్కాంచనా! నిష్క్రియా! ౭౭౯

క॥ ప్రణతాభీష్టఫలప్రద, గుణతాదాత్మ్యానుమేయ కునలయరాజ్యా!
వ్రణతాంత్రికసంసార, ప్రణాశకృతిహేతుదివ్యపదసంస్మరణా! ౭౮౦

ఉత్సాహ॥ విశ్వాతిగా! విశ్వగ విశ్వమూర్తి!, విశ్వప్రియా! విశ్వప! వేదవేద్యా
శశ్వత్కలాలక్షణ సంవిధానా!, పశ్వాఖ్యజీవామయ భవ్యవైద్యా!

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథామృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబునం
జతుర్థాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయగురవే నమః.

# శ్రీరామకథామృతము

## యుద్ధకాండము.

---

### పూర్వభాగము - పంచమాశ్వాసము.

---



సంప్రదాయకలనా
ప్రాసంగికనిజజనప్రభావోచ్ఛ్వసిత
వ్యాసంగసంపరాయ
న్యాసా! వ్యాసాదిమౌనినంద్యవిలాసా! ౧

ఆ॥ అవధరింపు మభవుఁ డచలరాజతనూజఁ, గాంచి యిట్టు లనియెఁ గమలనేత్ర!
వినుము రామదేవు విశ్రుతచరితంబు. పావనంబు విబుధజీవనంబు. ౨

గీ॥ శంఖభేరీరవంబు లెసంగఁ గపుల, యట్టహాసము ల్తగఁ దఱియంగ వచ్చెఁ
బరపురంజయుఁ డారామభద్రుఁ డనెడు, నన్నుడియు విని రాక్షసాధ్యక్షుఁ డపుడు

చ॥ ఒకగడె ధ్యానసంగతుని యోజ నిలంబడి మంత్రివర్యులం
బ్రకటబలాఢ్యులం గని విపాకసమాపతనంబు దోఁప వా
రక సభ తల్లడిల్ల ఘనరావము చొప్పడ సంప్రబోధనా
వికలుఁ డనంగ నై పలికె వేల్పులరాయిడికాఁ డదల్చుచున్. ౪

శా॥ మున్ని రన్నెతిఁ దాఁటె నంచుఁ గపుల న్మర్కారుగాఁ గొంచుఁ దా
నిన్నేలం జొరఁబాఱె నంచుఁ బ్రబలుం డీహీనమేతుండు స
త్సన్నాహుండు నరుం డటంచుఁ బొగడం జాల్కొన్నవా రెల్లవా
రున్నీతం బది వింటెఁ గంటి మిము మీ యోజమ్ము తేజమ్మెగిన్. ౫

ఆ॥ మున్ను సంగరములు మొనయ సత్యపరాక్రమోన్నతిం బ్రసిద్ధి నొందె రాము
రాక వినఁగ వీఁక లేక తూష్ణీకులై, యొకఁ డొకరు చూచు టొప్ప దిపుడు. ౬
క॥ అని యాఁడు తేనిమాటలు, విని యెన్నక మిన్నకుండు వెర వొప్పఁగ న
మ్మనికిమగ లుండి రక్షస్తతి, ఘనబలుఁ డాతఁడు ప్రయోగగతిఁ గనుచుండెన్. ౭
ఉ॥ అంతటమాల్యవంతుఁ డను నాతఁడు రక్కసిమన్నకాని సా
మంతుఁడు బుద్ధిశాలి నిజమాతృపితృవ్యుఁడు సాపరాయవి
క్రాంతుఁడు నీతికోవిదుఁడు గ్రక్కున రావణుఁ జేరవచ్చి వి
భ్రాంతత దోఁప నిట్లనె విభావితశాంతిపరాంతరాత్ముఁడై. ౮

— ♦ రావణునకు మాల్యవంతుఁడు నయతత్త్వ మెఱిఁగించుట ♦—

తే॥ ఓమహారాజ నేఁ జెప్ప నుద్యమించి, నట్టి పలు కీవు విను మిష్ట మయ్యె నేని
నట్లొనర్పుము కాదేని నన్యగతిని, గొ మ్మదిరి నేర మెన్నని యిమ్ము నెఱయ. ౯
ఉ॥ నాలుగువిద్దెలం దొఱసి నంద్యనయాన్వితుఁ డైన తేఁడు సం
శీలత చొప్పడన్ రిపులఁ జేర్పఁగ వేర్పఱుపంగ నేర్చియే
కాలమువంక నేది తగు కారణ మట్టదె సంధి విగ్రహం
బౌ లలిఁ గూర్చు వాఁ డగు మహావిభవోన్నతుఁ డాశరేశ్వరా. ౧౦
క॥ నిజపక్షము పరపక్షము, నిజ మారసి రసికుఁ డగుచు విగ్రహ మొనరిం
పఁ జనుం గాకుండిన తఱి, స్వజనావన మెంచి సంధి జరుపన వలయున్. ౧౧
క॥ హీనుఁడొ సముఁడో యరి గాఁ, దా నధికుం డైన తఱిని దఱుమంజనుఁ గా
కానయము విపర్యస్తము, గా నేర్తుఱ పొసఁగ దెపుడుఁ గాఁగలపతికిన్. ౧౨
క॥ కావున నియ్యెడ రామునితో విగ్రహ మొప్ప దనుచుఁ దోఁచెడు మదికిన్
నీవగసి కాంచు మంతయుఁ, దీనరపడ నేల తగిన తీ రెది లేదే. ౧౩
ఆ॥ దేవతలును మునులు దివ్యగంధర్వులు, రాము జయము కోరి రాణఁ దనరు
వార కాని యెందు వంకఁ జూపట్ట ర, ద్దాన నతనిఁ జెనకు దారి తగదు. ౧౪
మ॥ సృజియించెం గద రెండుపక్షముల నిస్సీమప్రభావుండు స
ర్వజగద్వ్యాపకసర్జనుండు విధి ధర్మం బం చధర్మం బటం
చజరు ల్దానవులుం దదాశ్రయులుగా నం వార లంచుం బొరిన్
నిజము ల్గాఁ దనరారుచున్నయవి త న్నిర్ణీతకాలంబులన్. ౧౫
తే॥ ధర్మ మెప్పు డధర్మంబుఁ దా గ్రసించు
నదియె కృతయుగ మను కాల మయ్యె న ట్ల
ధర్మమే ధర్మగతి నెప్డు దలఁగఁ జేయు
నట్టియానాఁడె కలియుగ మా నధీశ ! ౧౬

సీ॥ నీవు లోకము లెల్ల నెఱిఁదప్పి తిరుగుచుఁ బాధసేసితి ధర్మపదము దివిరి
దాన నధర్మంబు తనపక్షమున మిక్కుటంబయి స్వీయధర్మంబుఁ జెఱిచె
నమరుల ధర్మంబు నభివృద్ధి నొందించె ఋషులు తత్పక్షంబు నెనసియుందు
రగ్నికల్పులు వారి కపకార మొనరించి యుద్వేగ మొనఁగూర్చి త్రోటువడక
విషయసక్తుండ వగు నీదు విధము నెంచి, వారి దుర్ధర్ష మగు ప్రభావంబు తొడరి
దీప్తపావకజ్వాల లై తేజరిల్లి, నిన్ను నీవారిఁ గాల్పంగ నేటుకొనియె. ౧౭
ఉ॥ ధర్మువు మన్వఁజాలు నెఱతాలిమి నెక్కొను వారు భావితుల్
నిర్మలు లట్టి కీ లరసి నిచ్చలు మౌనులు బ్రహ్మఘోషము
ల్కర్మము లిజ్యలుం దపము కల్మికిఁ దోడుగఁ బెంచుచున్నవా
రర్మిలి వేల్పుల న్విజయ మందఁగఁ జేయు తలంపు పొల్పడన్. ౧౮
శా॥ రక్షోఘ్నంబులు మంత్రము ల్చదువుచున్ రారాపు మాయించుచున్
దీక్ష న్వ్రేల్చెదువారి హోమభృత మా దీవ్రింపు ధూమం బొగిన్
దక్షత్వంబున వీరి తేజముల సన్న ల్వాపఁగాఁ బోదు రా
లక్షింపన్ ధృతి లేక వేసవి మొగిళ్లంబోలుచున్ రాక్షసుల్. ౧౯
క॥ పసులం బోలఁగఁ బదియుం, బెసలకుఁ బోఁదోలి తారు దిట్ట లగుచుఁ దా
పసులు పలుతీర్థములఁ బర, వసమునఁ బొనరించు తపము వర్ధిలఁజొచ్చెన్. ౨౦
ఆ॥ ఎచట నున్న నైన నేవేళ నైన ని, య్యసురతతికిఁ దాప మతిశయిల్లె
నాతపంబు బలిమి నత్తిమెదువాఁడెల్ల, విజయమందుఁగాని నెఱచిచనఁడు. ౨౧
ఉ॥ నాఁటివరంబులం దనుజనాథ! వనాటులు మర్త్యు లెంత లిం
కేటి కటంచు మానితి వహీను లటంచుఁ దలంచుచుం బ్రదో
షాటసుపర్వయక్షనివహంబులవల్ల భయంబు లేని యే
ర్పాటొనఁ గూర్చి మం చడిగి పొల్పడి తిప్పటి కీయవస్థకున్. ౨౨
ఆ॥ అది నిమిత్తముగ మహాబలు లిత్తఱి, మానవులును ఋక్షవానరులును
తొడరి విక్రమించి దుముకుచున్నా రిప్పు, డేటి పౌరుషం బికేటి యశము. ౨౩
ఉ॥ ఏగడెఁ జొచ్చె నీపురి మహీసుత జానకి రామపత్ని య
య్యాగ మదేమొ కాని యదె యాదిగ దుష్టము లౌ నిమిత్తముల్
సాగెను ఘోరము ల్సకలసంహృతిహేతువు లెన్ని చెప్ప ము
న్నా గురుభావ ముంచి విన నా నెఱి మున్నుగ విన్నవించెదన్. ౨౪
సీ॥ ఖరఘోషణల భయంకరము లై మొగిళులు వేఁడినెత్తురు లురియాడఁ గురియు
నేడ్చుచున్నవి చెమ రెడల వడంకుచు దేవలింగంబులు దేవళములఁ
గాళిక ల్నవ్వుట గనుపట్టు నెదుటనే దంతకాంతులు దెస ల్దాక నిగుడ
గోవు లీనెడు నేఁడు గోమాయువులనేని గర్దభంబులనేనిఁ గాన్పు పెడఁగ

మూషకంబులు నకులము ల్మ్రానసి పోరు
చున్నయవి పన్నగంబు లయ్యురగభోక్త
లటు బిడాలమ్ము నెదిరించి యడరఁదాడరె
మీఁదఁ గాఁగల తెఱఁ గెదఁ బాదుకొనదు. ౨౫

ఉ॥ కన్నులఁ గార్చుచుండు నుదకంబుల గుఱ్ఱము లేనుఁగు ల్సమా
సన్నము లౌచు నక్కలు దెస ల్వగుల న్వస నార్చుచుండు నా
పన్నములయ్యెఁ బోరితముఁ బాయవు కారులు వీచికూచులం
బన్నుచునుండు జంతువులు భాస్కరుఁ గాంచుచు నేడ్చు నెప్పుడున్. ౨౬

క॥ తోలఁగెడు ధ్వజములు సెడి కా, కులు గ్రద్దలు బార్లుగట్టి కూసెడు నెడఁ గు
క్కలుసొచ్చి బలులుగొనియెడు, గలరవములు శ్యేనములునుఁగలసి మెలఁగెడున్.

ఆ॥ కాలపింగళుఁడు కరాలుండు వికటుండు, ముండుఁ డైన పూరుషుం డొకండు
చొచ్చి ప్రతిగృహంబు శోధించుచున్నాఁడు, కావరమున నెల్లకాలములను. ౨౮

ఉ॥ ఇంకను దోఁచుచున్నయవె యెన్నిన నిన్నియనంగరాక యీ
పంకము వోవ రక్కసుల పాళెము ద్రొక్కొని నిక్కకుండ నా
శంకలతో వితండముల జాడలఁ జూడని వృత్తిమైన నా
శంకరి యైన సత్క్రియఁ బొసంగఁ దలంచి ఘటింపఁజేయవే. ౨౯

క॥ నీకతన బ్రదుకువార ల, నేకులు గాకున్నఁ జెడుదు రింతయు మది సం
శ్లోకించి శాంతివిధి సు, శ్లోకత్వము వెలయ నెరపఁజూడుము దయతోన్. ౩౦

చ॥ సలలితవృత్తిమై జనకజాతను సీతను సోదరిం బలెన్
విలసితసద్గుణాఢ్యఁ బదివే లతివేలమణీసువర్ణరా
సులు గలితాంబరములునుఁ జొప్పడు మేలి సుదాయమై తగన్
గులపతి రాముఁ జేర్చి యనుకూలుఁడ వై కుల ముద్ధరింపవే. ౩౧

ఉ॥ మానుషవేషముం గొని యమానుషుఁ డాతఁడు విష్ణుఁ డట్లుగా
కేనరుఁ డుద్భటుం డగుచు నిమ్మెయి నద్భుత మైన సేతువుం
బూని రచించు నబ్ధిపయిఁ బోఁతర మొప్పదు సంధి మేలు నీ
కీనెఱి నాయతిక్షమము నెంచుము కర్జము నాదు పల్కులన్. ౩౨

తే॥ ఆదినారాయణునిఁ గాఁగ నతని నెంచి, సీత లక్ష్మి యటం చెదఁ జేర్చి పేర్చి
నేరము విలోలభావంబు విడిచిపుచ్చి, యాశ్రయించిన నీఁక నింత లగుదు వధిప.

క॥ భజియింపుము శ్రీరాముని, సుజనత్వము వెలయ నేఁటి నూటిన నీ క
య్యజరామరత్వ మబ్బును, బ్రజలు సుఖించెదరు రిత్త బన్నము లేలా. ౩౪

ఆ॥ పెద్ద లనఁగ జగతిఁ బెంపు గన్నట్టివా, రటు తదంఘ్రిపోత మాశ్రయించి
దాఁటుచున్నవారు తఱిని సంసృతివార్ధిఁ, గాన నతఁడు నరుఁడు గాఁడు సుమ్ము.

ఉ॥ సర్వహృదాశ్రయుం డయిన జాణ విరాట్టు విభుం డటం చెదర్
నిర్వహణంబుఁ గూర్చు చెలి నిర్మలభక్తిఁ బరిగ్రహించి నీ
దుర్విధశీలవృత్తముల ద్రోచి భజింపుము రాము దాన ను
చ్చైర్విభవంబు పొల్పడు విచారము వోవు శుభంబు సేకుఱున్. ౩౬

క॥ నీదు దురాచారంబులఁ, బాదుకొనిన యఘము లెడలఁ బరిశుద్ధుఁడ వై
శ్రీదయితు లోకమున సం, మోదముపై వర్తిలంగ మొనకొనె దవలన్. ౩౭

క॥ కులనాశకుఁ డను దూఱీ, వలఘుతరుఁడ వందనేల యంద ఱతులకా
శలమున సుఖులై మనఁగా, ఫల మది గాదె నినుబోటి భవ మొనయుటకున్. ౩౮

మ॥ అనుచు న్మాల్యవదాఖ్యుఁ డాత్మహిత మయ్యర్థమ్ము దెల్పంగ నె
మ్మనమం దించుక సేర్పఁ డాతఁడు కృతామర్షుండు కష్టాత్ముఁడున్
మనునే కాలవశంగతుం డగుచు దుర్మానంబె ప్రాణంబెడం
జనుఁగా కెందును నిత్యనిర్మలజగజ్జాలావనాంచద్గుణా! ౩౯

—♦ రావణుఁడు మాల్యవంతునిఁ దూలనాడుట ♦—

తే॥ బొమలు ముడివడఁ గన్నులు భూరివహ్ని
కుండములు గాఁగఁ బ్రిబల మా క్రోధ మెగిచి
యాటలాడింప నతఁడు నిరర్థము లగు
మాటలాడంగఁదొడఁగె సన్మాన్యచరిత! ౪౦

మ॥ అరిపక్షంబునఁ జేరి యి ట్లఱవఁగా నైనాఁడ వీ విత్తతిన్
శరణిందప్పినవాఁడ వంతగలఁడే సన్నాసి రాముండు త
త్పరిభూతిం బరికింతు గాక యిఁక నీపన్నాగము ల్సాగ వా
నరునిం బెద్దఁబొనర్చి పల్కకిటు లున్నా వెల్ల కర్జంబులన్. ౪౧

తే॥ తండ్రి గెంటింప నొంటిమైఁ దరలివచ్చి, యడవిమెకములఁ గూడి యిట్లాడుచున్న
వాని రాముని గృపణుని మానవుని స, మర్థుఁ డంటివి కంటె వేయర్థ మచట.

క॥ హీనుఁ డని యప్రియుం డని, కాననమునఁ ద్రోచె గురుఁడు గా కేమని నీ
వీనుల కానెనో వాఁ డొక, మానిసియే నాసభ న్విమతు నెన్నదవే. ౪౩

క॥ వీరద్వేషంబుననో, వైరిధనం బఱపాతవల్గవముననో
యీరీతిఁ బ్రీతె దే ని, స్సారులు బోధించి రింత సంభ్రమ మొదవన్. ౪౪

తే॥ పండితుం డయి శాస్త్రతత్త్వం బెఱింగి
ముజ్జగంబు లేలెడు దొర ప్రోల నెవఁడు
వరుల బోధనమునఁ గాక పలుకఁగలఁడు
పఠనములు రిక్తములు నగు పలుకుఁబడులు. ౪౫

సీ॥ తవిలి తెచ్చితి సీతఁ దమ్ముఁ బాచిన సిరి నట్టు లారాము నెయ్యము సడల్చి
కోఁతిమూఁకలఁ గూర్చుకొని వచ్చె నింత లంతలు సేర నన నెట్టులలుకవాఁడ
న న్నదిర్చిన దేవనాథుండు మున్నుగా నెంద ఱెట్లైరది యెన్నరాదె
కట్టె నెట్లో కట్టఁ గడలిపైఁ గడముట్టనదియు నాతని మంచి కనఁగఁబోల
ది ల్లలికినంతఁ బండు వదెట్టు లయ్యె, బ్రిదికిపోయిననాఁ డిట్లు పలుకఁజనదె
పగులఁగోసిన నైన నేఁ బట్టువట్టి, విడువ నింతయు నిజ మింక వేయునేల. ౮౭
ఆ॥ తాత వనుచు వృద్ధతాతపస్వి వటంచుఁ, గర్ణపదవి నేర్చు కాఱుచిచ్చు
నీదు పలుకుబడిని నే సహించితి వడి, యుడిగి యొక్కచోట నుండి మనుము.
క॥ అని తోఁచిపలుక నీఁక నే, యనుమానము వలవ దంత మందెడు సమయం
బనువిద్ధమయ్యె నీతని, కని చనె ముదిరక్కసుం డహార్యతనూజా! ౮౮
క॥ రావణుఁడు మంత్రులునుఁ దా, నావల మంత్రించి తగినయట్టి వివేకం
బావేళ వలనుపడఁగా, నావీటికి మేలి గుప్తి నాజ్ఞాపించెన్. ౮౯
సీ॥ తూర్పుద్వారమున యందుఁ బ్రహస్తుఁ డుద్వేలసైన్యంబుతో నిల్వ జతనపఱిచి
దక్షిణంబున మహోదరమహాపార్శ్వ లుత్థితతేజు లుండంగ దిటవొనర్చి
యాపశ్చిమపుదెస నతిమాయి సుతు నింద్రజిత్తు సబలు గట్టి సేసి యునిచి
నే వచ్చెద నుదీచి నెకొల్లనుఁ డటంచు శుకసారణుల కగు చోటు నొడివి
మధ్యమం బైన యట్టి గుల్మంబునందు
ఘను విరూపాక్షుఁ దతపరాక్రము ఘటించి
తన్నుఁ గృతకృత్యుఁగా మదిఁ దలఁచె నపుడు
కాలచోదితుఁ డగుచు రాక్షసవిభుండు. ౯౦
క॥ సచివులఁ బనిచి తదీయము, లుచితాశీఃపూజనంబు లొలసి ఘటితసం
ప్రచితపురరక్షణుం డై, యచిరమె తనయంతిపురికి నరిగె బుధార్చ్య! ౯౧

—♦ శ్రీరాము తన్మంత్రుల కార్యాలోచనము ♦—

సీ॥ నరవానరేంద్రులు ననుచు వాయుసుతుండు జాంబవంతుఁడు ఋక్షజాతనేత
యావిభీషణుఁడు దైత్యాగ్రణి యువరాజు వరతేజుఁ డుదితుండు వాలిసూనుఁ
డమ్మెయి నెల్లర కధికుండు సౌమిత్రి మైందద్వివిదు లట్లు మానధనులు
శరభసుషేణులు సరభసు ల్పనసుండు కుముదుండు గజగవాక్షులు సుసిద్ధు
లెందు నలనీలు లొక్కట నెన్నబడిన
వారు సమవేతు లై తఃసవారిఁ జెరసి
యాయమిత్రవిషయ మప్పు డందఁగాంచి
మంత్రి యొనరించి రఖిలసంమాన్యచరిత! ౯౨

మ॥ ఇదె లంకాపురి గానవచ్చెడు సురారిశ్రీభిరక్షాఢ్య సం
పదలం గాంచిన మేటి దుర్జయ సుపర్వారిప్రవర్యావళికిం
బొదలంబోలదు కార్యసిద్ధి దెస నీ ప్రోల్వీడఁ డేనాఁడు దు
ర్మదుఁ డా రావణుఁ డిన్నియుం దెలిసి సన్మార్గంబుఁ జింతింపుఁడా! ౫౩

క॥ అని యూథపు లొండొరులం, గని పలికెడునెడ సమృద్ధి గ్రామ్యేతర మ
ర్థనిచిత ముచితము నగు నుడి, పొనర్చెఁ గైకసి కనిష్ఠపుత్త్రుఁడు పొసఁగన్. ౫౪

ఆ॥ అనఘు లనలశరభు లల్లు సంపాతిప్ర, ఘసులుఁ బక్షిరూప కలనఁ దనర
వైరిబలము సొచ్చి వలను లెఱింగి యి, చ్చటికి వచ్చి రాత్మసచివు లిపుడు. ౫౫

ఉ॥ అచ్చటి సంవిధానము దురాత్మకుఁ డాతని తత్త్వము న్యథా
వచ్చరితంబుగా నరసి వారక తెల్పిరి నాకుఁ దద్విధం
బిచ్చమెయి న్గ్రహించి తగు నేయది దానిఁ బొనర్పు మెందు నే
పొచ్చెము లేని యెత్తున రిపుప్రకరంబు హరింతు రాఘవా! ౫౬

వ॥ దేవా! యవధరింపు మివ్వానరవాహినుల రాక యెఱింగి పూర్వద్వారంబునం బ్రహస్తుండును దక్షిణంబున మహాపార్శ్వమహోదరులును బశ్చిమంబునం బుత్త్రుండు సురేంద్రశత్రుండు నగు మేఘనాదుండును మధ్యమగుల్మంబున విరూపాక్షుండును సన్నద్ధులు సాయుధపాణులు నై యలవోని బలంబుతో నిలువ నియమించి యుత్తరప్రతీహారంబును రావణుం డసంవిగ్నుం డై తగినయండఁ గొని తా నుండ సమకట్టి గండుమీఱి చేరఁ బాఱెడువాఁడు మామకామాత్యు లింతవట్టు సన్నాహంబునఁ దత్సైన్యసందోహంబు దారసిల్లుట నారసి యోరసిల్లుటయే మేలుగా నెంచి యరుదెంచిరి గజసాహస్రంబును రథాయుతంబును హయాయుతద్వయంబును రక్షస్సాగ్రకోటియు ననునిది విక్రాంతమై బలవంతమై యతిక్రూరం బై నిచ్చలు నచ్చటులునిఁ గొలిచి యిష్టసంపాదకం బై యుండు మహాబలంబు సంగరం బొదవిన యక్కాలంబున నొక్కొక్కనికిం బరివారసహస్రసాహస్రం బుపస్థితంబగు ని ట్లింతయుం గనుంగొని వచ్చినవారలు వీరలే యని నిరూపించి వారిచే నయ్యుదంతం బంతయు నేర్పడం బలికించి మంచి దలంచి రావణావరజుఁడు శ్రీమంతుఁడును గమలపత్త్రాక్షుండును నగు శ్రీరామచంద్రునితో మఱియు నిట్లనియె. ౫౭

ఉ॥ అన్నిదెస లజ్జయింపఁగ నహంకృతి మున్నలమం గడంగి పె
ద్దన్నఁ గుబేరునిం గెలువ నయ్యెడ కొయ్యన నేగునప్పు డీ
యన్నకుఁ బాపరూపునకు నయ్యెను నర్వదిలక్ష లా బలం
బన్నిఁటఁ దన్నుఁ బోలినదె యాదటఁ జేరిన దింత వింతగాన్. ౫౮

తే॥ కోపగింపకుమయ్య! చిదూర్జిత! రామ!,యుత్సహింపఁగఁ జేయు నయ్యెఱప కాని
నిన్ను నలికింపఁగాఁ గాదు నిగ్రహింతు, వన్ని నిల్పిన నిర్జరభర్త నైన. ౭౯

మ॥ చతురంగంబుగ సైన్య మొప్ప రిపు నిస్సారించుచు న్నిమ్మదిక్
దత ముత్సాహముఁ బెంచి నీ వనిమొనం దార్క్షాణగా నిల్వఁగా
నితనిం జెప్పఁగనేల ముజ్జగము ల శ్లోకంబ లై పన్నినక్
గతికిం బాసి తలంగుఁగాక తదితఃకర్తవ్య మొం డుండునే. ౮౦

ఆ॥ రహిని రావణావరజుఁ డిట్లు దెలుపంగ, రాముఁ డలరి శతృరావణార్థ
మిట్లు పలుకఁదొడరె నీనానొడువు నుడి, వినుఁడు మీర లెల్ల వెరవు నెఱయ. ౮౧

— శ్రీరామచంద్రుఁడు నీలాది సేనాధిపతుల నియమించుట. —

సీ॥ ఆప్రహస్తు నడంప నఖిలబలేంద్రుండు నీలుండు తూర్పున నిలుచువాఁడు
దక్షిణంబున వాలితనయుండు గెల్చెడు నొగి మహాపార్శ్వ మహోదరులను
బశ్చిమద్వారంబుఁ బవనాత్మజుం డాక్రమించుఁ గావుత మప్రమేయబలుఁడు
వానరేంద్రుఁడు జాంబవద్విభీషణులు మధ్యమగుల్మ మెల్లెడఁ దడవువార
లెవఁడు వర మందితి నటంచు ఋషివరులకు నాసుగాసురులకు నెగ్గు లరయుచుండు
నట్టిరావణుఁ ద్రుంప మదనుజుతోడ నుత్తరద్వారమున నేన యుండువాఁడ. ౮౨

క॥ అందఱును భిన్నరూపం, బందంగాఁ జనదు హరుల లై యుండవలెన్
బొందుగ మనవారి కిదె యు, మందం బగు చిహ్న మరసి మలయుఁడు మీరల్.

ఆ॥ మానుషులము యగుచు మార్తుఱ నలయింతు
మేడుగురము గుఱుతు లెఱ్ఱఁగి తోడర
నాసమోదరుండు నాతో సనాథుఁ డ
ట్లాత్మపంచకాఖ్యుఁ డసురవరుఁడు. ౮౪

మ॥ అనిగామాధిపుఁ డర్థసిద్ధికయి యిట్లాగూఢమైఁ బల్కి యా
య్యాస వృత్తిం దటరామణీయకము చాయం దా సువేలం బహో
యనిపింపం దదగాధరోహణము సేయన్మోకొనెం దోన న
య్యానుఁగు ల్లెస్స యటంచు ముస్గడఁగు నెయ్యం బెల్లఁ దియ్యంబుగన్. ౮౫

తే॥ అట్టు లరిఁ ద్రెంచు విషయంబు గట్టిసేసి, యాస్థలం బెల్లఁ దనసేన నావరించి
లంక నిద నెలకొల్పె నిశ్శంకుఁ డగుచు, శైల మధిరోహణ మొనర్చెఁజూడ గిరిజ

సీ॥ తమ్ముసితోడి నేస్తమ్ము మోదమ్ము కన్దమ్ముల మేలి యందమ్ము సూప
ధర్మజ్ఞు లనురక్తిఁ దనరారు సచివులు మంత్రసంస్థానంబు మలయఁ జేయఁ
దనరాగకృత మెంచి ధాతురాగశతంబు లెనయించు నెఱి గిరి యేర్పఱింప
ననిశంబు శం బిడు నట్టి ప ట్టిది యంచు నిశ నందు మన్నించు నెమ్మి నెఱయ

ననుచు నాలోక మాలోకనాథుఁ డపుడు
రిపునిపురిఁ బురికొని కాంచురీతి పోనఁగఁ
జేర్చెఁ దదధిత్యకాస్థలిఁ జేరునంత
నంతరము లెడలంగ శుద్ధాంతరంగ! ౧౮

మ॥ ధర ధర్మంబు సువృత్తముం గాలము నిర్ధార్యంబు గాఁ గండు ని
వ్వరి కవ్వారలు నీతిబాహిరమ యూ వర్త్మంబు గైకొం డుగ్రిదా
మరణాంతంబు సుమాళి మాఁకవడ దుర్మంత్రింబు మంత్రించి మ
ద్వరనారి న్హరియించె నియ్యసుర యేవం బా స్వభావంబునన్. ౧౯

తే॥ రాక్షసాధము నివ్వాని రాచియిడఁగ, రోష మున్నది యదనీయదోషమునను
గులముఁ గూల్పంగ నా నను కొఱఁత మదిని, బాదుకొన్నది సత్ప్రథప్రథితులార!

క॥ ఒక్కండు కాలవశతం, జిక్కె విక్రమం బొనర్పఁ జెడు నెల్లకొలం
బొక్కటఁ బొడమిన కార్చి, చ్చక్కన మాక్రమింప కంటటఁ జనునే. ౨౦

వ॥ అని నొడువుచు నచ్చోటు విడిదల సేసి నిలుచునప్పు డనుజన్ముండు సుజన్ముండు
నగు సౌమిత్రి సశరం బగు శరాసనంబు పూని పాలివోనివిక్రమంబునం దన్నుఁ
గాచుకొనియుండ నండదండలుగా వానరేంద్రుండు సామాత్యుం డైన దానవేం
ద్రుండును నిరుదెసల నెలకొని పరఁగుచుండ హనుమంతుండు నంగదుఁడు నీలుండు
నలుండు మైందద్వివిదులు గజగవయగవాక్షగంధమాదనులు పనసకుముదహార
రంభులు సుషేణజాంబవంతులు ఋషభదుర్ముఖులు శతవలియును న్నగా నెన్నఁ
దగిన యూథనాథులు వాయువేగసమాగమం బొప్పారం దోడన యగ్గిరి నారో
హించిన వార లెల్ల మెచ్చువడసిన యచ్చోటున నిచ్చమెయిం బెచ్చుపెరిగిన
వేడ్క శ్రీరామచంద్రుని వలగొని తలఁగని ప్రేమభరంబున నొప్పారి రప్పుడు. ౨౧

తే॥ కొండపై మెండుకొని దివి నుండె ననఁగ, నున్న యున్నతసాలసమున్నతర్ధ
శీలఁ గాంచిరి పురివైరి సిరిఁ దలంచి, రాలలి హరీంద్రు లొసుగుణాలవాల! ౨౨

క॥ నీలంపుటాలగుం డ్లన, సాలముపై నెక్కి కనునిశాచరుల వృత్తిన్
లీల న్మాత్సపారికా, రాలంబన మందఁగాంచి యది మెఱసె నుమా. ౨౩

ఆ॥ అట యుయుత్సు లయిన యాప్లవంగమవీరు, లసురవరులఁ గాంచి నంతలో న
రాముచెంతనుండి రాణమైఁ బరఁగించి, రరులు చెదర గర్జ లంబుజాక్షి! ౨౪

మ॥ రవి యస్తంగతుఁ డయ్యె సంజ కడుఁ దనా్రిగిల్లి రంజింపఁ జే
య వియన్మార్గము దాఁటి యస్తగిరిలోయం జొచ్చి ఛోద్యోన త
త్ప్రవిలోపం బెడలింపఁ జందురుఁడు రారంగారు సింగారముం
గవియంగా నయి చూడనొప్పె క్షప పాక్రామ్యంబు పెంపారఁగాన్. ౨౫

చ॥ విడిసిన సైన్యముం గని యవేలము హర్షము పొంగ రాముఁ డ
య్యెడఁ దనుఁ జేరి వేడ్కఁ దనుజేశ్వరుఁ డాదృతి పూజ లిత్తు ల
ట్లుడుగక కూర్పఁ దమ్ముఁడును యూథపుఁడుం గపినాథుఁడున్ క్షణం
బెడయక కొల్చుచుండ వసియించి శయించె నిశ న్నయించుచున్. ౨౭

శా॥ ఆరే యూథను లట్లు కొండచఱి నెయ్యంబొప్ప విశ్రాంతికై
తీ రా పద్ధతి నుండి లంకఁగల యుద్దేశంబులం గాంచి ర
య్యారామంబులు మేలిసౌధములు భవ్యప్రాంతభూము ల్గుణో
దారశ్రీవిభవంబు లై తనరి చిత్తంబు ల్గొనం బార్వతీ! ౨౮

క॥ సమసౌమ్యవిశాలాయత, నములం గని రమ్య యనఁగ నని చిన యత్యు
త్తమ పురి యిద్యె కాక జ, గములం దొండొకఁడు చూడఁగలదే యనుచున్.

తే॥ జాతవిస్మయు లట్లు సస్మయులు నగుచు
హరులు హరియూథపు లధీశు లంద ఱొకట
చెప్పవేయక యద్దాని యొప్పు గనుచు
ననుచుప్రీతిఁ గొనిరి స్త్రైణనాయకమణి! ౨౯

—◆ వానరభటులు త్రికూటాద్రివనముల విహరించుట ◆—

తే॥ కామరూపులు కపు లసంకాశు లచటి
వనము లుపవనములు గాంచి వర్ధమాన
విహరణోత్సాహు లగుచుఁ బ్రవేశ మర్థి
నాథుఁ బ్రార్థించి రాజగన్నాథుఁ డొలయ. ౩౦

క॥ సాన్నిధ్యబలము నవ్విధి, వన్నెఁ బెనుచు చనవుసూప వారెన్నిన యా
పన్నగడ కుబ్బి సెలవిడె, నన్నాళీకాప్తతనుజుఁ డశ్కాలమునన్. ౩౧

వ॥ ఆనతిఁగొని యానతవైరులు హరివీరులు హృష్టపుష్టాంగు లై ప్రమోదంబు
తనరార ఘనామోదంబుల కాటప ట్టనఁగ నగు నారామతతి సొచ్చి యారామ
మతి మెచ్చి విచ్చిన క్రొంబచ్చిపూవులనుండి మెండుకొని గొనకొని ప్రవహించు
నించు విరిజేనియల దోనియల దారి నాధారించుకొని క్రొ్రలు నోలిమిమై
వ్రాలుచు మాలిమిమైఁ దేలుచుఁ గ్రాలుచు సోలుచు ననుచు గీతక్రమంబుల
సక్రమం బగు పరాక్రమంబు గూర్చి యందమ్ము నెఱయం దమ్ముఁ బొగడ్తకుం
దెచ్చు భృంగరాజదంపతుల యతులస్నేహాతిరేకంబున కుబ్బుచుఁ బ్రిబ్బుచు
నాఁకపడి నాకపతివనంబునయుం దట్లుసర్వర్తుఫలకాంక్షల నిర్వర్తింపఁజాలి మేలు
కొను మేలిమాఁ్రకుల చాలుం బెరసి చాల నొరసి రసాలవాలంబు లగు రసా
లంబులు మున్నుగాఁ బన్నుగాఁ గలుగు నవ్వాని పండుల పేసంబుల నాసం బుల

కించుచుఁ దులకించుచుఁ దలఁ కించుక లేక బొట్టల నించుచు దిట్టల నెంచుచుఁ గట్ట మించు సాగరంబు తరంగంబు లన మట్టుమీఱి మెట్టు పై నెరి కోరినట్టి వస్తువు లన్నియు శిస్తుగా గ్రహించుచుఁ జెట్టు లారోహించుచు గట్టుల పై దుముకుచు నుబుకుచున్న పుష్పాదితిప్పలం బొరలుచుఁ బెరలుచుఁ గుసుమితాగ్ర లతాపరిగతతరుషండంబులపై హెచ్చినమచ్చికం బరపి పువ్వుటీరంబులు సొచ్చి యిచ్చమెయి దచ్చన ల్నెఱపి వచ్చి కూడి కేళాకూళుల జలకంబులాడి తమకోడి మోడిసూపు వాతపోతంబుల ననేతాదృశ లీవియ పో యని యనుమతించుచుఁ జంపకాశోక పున్నాగనాగమాలూరసాల సాలతాలహింతాలతమాలన క్తమాల పాటల తిలకకులకసప్తపర్ణకర్ణికార రంభారాజరంభాదికంబు లగు తరురాజంబుల డంబు నిరూపణం బొనర్చుచు వేయునందనవనంబులు గోటి చైత్రరథంబులు నిమ్మెయి నెమ్మెలు సూపు నన్మన్మనోరథంబులకుఁ దీయుఁదనంబు నందీయుఁజాలునే యని ప్రశంసింపుచు శంసితంబులకుంజాల వని శుకంబులం దోలుచు మమ్మేలు చున్నవాఁ డని రామనామంబుఁ బ్రకటించి పికంబుల రకంబులుగా నోళ్లు మూయించుచుఁ గేకులమూఁకలఁ గూకలువైచి కేకలు మాయించుచు నాయించు విల్తుని బలగంబుల యలబలంబులవారించి మృగద్వీపంబుల నిస్సారించి సత్వంబుల నిస్సత్వంబులఁ గావించి సింహనాదసంవాదంబులు సముద్భావించి కడలి దాఁటించి కడల కెక్కించి యడుగుల వేగంబు సాగి పొడవుపడు నప్పుడు దొ్రక్కుడుపడు నప్పుడమి యాకసమ్ముగాఁ దద్రిజమ్మున నాకసమ్ముఁ బుడమిగా దిరుగుడుపడం జేయుచు నకలంక యగు లంకకు కలంకం బొదవించిన పొద మించినది యే మని మసికిపట్టుల రక్కసియన్నులు క్రిక్కిఱిసి తమబన్నంబు లెన్నుచుండఁ బన్నుచుండ నగు నప్పటికప్పుడు పొడమిన యప్పుడుమూట్లకు మాట్లకు నేగు పొలదిండిపోటుల నెఱపోటుమాటకుం బాట గలదే యనుకొను వైమానికుల యభిమానిత్వంబున నుల్లసిల్లుచు నిచ్చకువచ్చిన ట్లెల్ల విచ్చలవిడిగా విహరించుచుండి రంత. ౮౨

ఆ॥ మూఁడు కూటములను మొనయ త్రికూటాద్రి
యం దొకండు మింటి నంటి యుండు
పూలరాను లందు పొలుపొందు నయ్యది
చారుదర్శనమ్ము స్వర్ణఘనము. ౮౩

క॥ శతయోజనవిస్తీర్ణం, బతివిమలము శ్రీమహిత మనంతవిశేషో
న్నతము దురారోహము స్నిగ్ధతరము దుష్ప్రాప మెదకు ఖగసంతతికిన్. ౮౪

సీ॥ చాల్పు వెడల్పు త్రింశత్తు శతము నైన యోజనమ్ముల లెక్క కొవు లంకఁ
బొరి విశ్వకర్మ నేర్పున మించి నిర్మించె నట్టిశృంగంబునయందుఁ దొల్తఁ

బడఁబడి రావణు పాలనంబునఁ బడి యరులకు దుర్ధర్షమై తనర్చెఁ
బాండురాంబుదసన్నిభంబు లుచ్చైర్గోపురంబులు నద్దానడంబు సూపు
రాణఁ గాంచనములు రాజతంబులు నైన, సాలములు విమానసంఘములును
బరఁగు నందు మేలి ప్రాసాదములు నట్టు, లదియ నూ జగత్త్రయమ్ము సొమ్ము
ఆ॥ ఆఘనములచేత నాతపాత్యయమునఁ, దనరు వైష్ణవము పదమ్ము వోలె
దానినడుమ వేయి స్తంభము ల్గలుగు ప్రా, సాద మొప్పు సంప్రసాద మగుచు. ౮౬
క॥ ఆసలు గోలుపుచు నదికై, లాసశిఖర మట్టిదై విలాసభృతిసము
ల్లాసంబున నుల్లేఖం, బాసంజితముం బొనర్చు నంబరమునకున్. ౮౭
క॥ రక్షోగణపరిరక్షిత, మక్షోభ్యము చైత్యమెల్ల కాభరణం బా
రక్షఃపతిశరణం బన, దృక్షుం బద్దాని మించు ధృతిఁ గనిరి కపుల్. ౮౮

—♦ లంకావర్ణనము ♦—

సీ॥ వెలిగట్టులఁ బుట్టి మెఱుఁగారు ధాతురాగముల చిత్రములు రాగములఁ బెనువ
నంతయు నొకవెలుంగై వేవెలుంగుల రేవెలుంగుల తీగ్ప లేవి యనఁగఁ
గాననశ్రీ ల నేకాననమ్ముల ఖగప్రతతివాక్కులఁ దన్నుఁ బ్రస్తుతింప
నర్ఘార్ఘసంబంధులా సమృద్ధార్ఘ నౌ నన్నుఁ బోలుదు రను నవ్వ్యారయ.
తే॥ మెరయనగు నప్పురీమణి మిహిరవంశ
మణి సహానుజుఁడై స్నిగ్ధమణులతోడఁ
గూడి కనుఁగొనఁ గొనకొని కూర్చు చూడ్కు
లెల్ల వెదచల్లె బళి యంచు నిందువదన! ౮౯
ఉ॥ సృష్టుల్లవబృంహణం బిదియె శ్రీనిలయం బిదె యింద్రలోకసం
స్పృష్ట్యతిదేశ మియ్యదియె చెల్వలదీవి యిదే యటంచుఁ దా
దృష్ట్యుపహారసారములఁ దీరుఁగఁ గూర్చుచుఁ దోడివారితో
ఘృష్ట్యతిరేక మొప్పఁ బరికించు తెలంపున నించువేడ్కతోన్. ౯౦
ఆ॥ ఎగసి మొగసి కాంచి యేమంచుఁ బలుకంగ, నగు నటంచుఁ బలికి యైన చోటు
లెల్ల నెంచి కాంతి హేరాళ మని యంత్ర, కలన లెఱిఁగి తృప్తి గడలుకొనమి.
ఆ॥ రెండుయోజనముల మండలం బగ్గిరి, నుండి మఱియు నరయుచుండు నంతఁ
బురముగోపురమునఁ బొల్చె దైత్యేంద్రుండు, రాముఁ జూచు వింత రహిం దలిర్ప.
సీ॥ కార్మొగి ల్గ్రమ్మినగతి మెట్టుపై మేని కప్పుడా లోకయొడికంబు సూప
తెలిమబ్బు గురియు సలిలధారల ప్రసక్తి విడిము త్తెపుంబేర్ల గొడుగు నగడ
వీచోపు లిరుపు న న్వారఫున నిరుకెలంకుల జయశ్రీల యుంకువలు దనర
ననులేపరక్తచందనరత్నభూషలు వీగభావస్ఫూర్తి విస్తరింప

మేలిబంగరుతీఁగెల మెఱుఁగు లీను
శశము నెత్తురు రంగు వస్త్రంబు గట్టి
సంజకెంజాయ వహిఁ గొన్న జలద మట్టు
లున్న దైత్యేంద్రు నినవంశ్యుఁ డోజఁ గనియె. ౯౩

కం॥ ఐరావణతీక్ష్ణవిషా, ణారూఢవ్రణకిణాంకితాంచితవక్షుం
డై రాజిలు నవ్వీరు, న్వీరోత్తంసుండు రామవిభుఁ డటు గాంచెన్. ౯౪

ఉ॥ వానరరాజు రాముఁ డటు వానిసిరిం గనుచుండ వానరుల్
దానవుఁ డెంత యొప్పె నని తద్దయు వేడుక నాడుచుండ స
న్మానము వీడి రోస మసమానముగా బలసత్త్వయోగసం
స్థానము పైకిఁ దా నెగసి తావుకొనెం బురగోపురంబునన్. ౯౫

చ॥ అలు కొకయింత లేక తని నాంతరవృత్తిఁ దృణీకరించి కొ
క్కుల మగు రీతిమై నటిమెఁ గాంతువె మోక్షము మోసకాఁడ! నే
నలరఘురాముదాసుఁడ మహాత్ము సఖుండఁ దదీయశక్తిమై
నులుమక పోను నిన్నిపుడు నొచ్చెదొ విచ్చెదొ యంచుఁ బల్కుచున్. ౯౬

—♦ సుగ్రీవ రావణుల మల్లయుద్ధము ♦—

ఆ॥ అట్లు పైన దుమికి యాతని మకుటంబు, దలకుఁ బాపి యెత్తి ధరణి వైచి
తాను నిలిచె నెదిరి ధరకుఁ జిత్రముగ లం, ఘించి తేజ మెసఁగఁ గీశవిభుఁడు.

కం॥ అంతలు సేపి యలుక యిఁక, నంతలుగా నాక్రమింప నరుదెంచెడు దు
ర్దాంతు రవిసూనుఁ గనుఁగొని, యంతకసంకాశుఁ డసుర యానె నిట్లనుచున్. ౯౮

తే॥ మున్ను సుగ్రీవుఁడవొ యేమొ మొనసినాఁడ
విపు డపగ్రీవుఁడవ యౌదు వెందుఁ బోదు
వని పాదివి యెత్తి వైచె నవనినతండు
బంతిపగిది నెగసి వాని నంత నేసె. ౯౯

ఉ॥ చెమ్మట లూర నొత్తుటలఁ జేష్టలు దక్కఁగఁ గ్రొత్తనెత్తురుల్
గ్రమ్మఁగఁ బర్ణశాల్మలుల రాణఁ దనర్చుచు నమ్మహాబలు
ల్క్రమ్మఱ కొండొరుం బొదివి కల్పితముష్టితలాగ్రహస్తఘా
తమ్ముల నిమ్ముల న్నెఱపఁ దార్కొని రప్డు నియుద్ధపద్ధతిన్. ౧౦౦

కం॥ చిరకాలం బప్పురగో, పురవేద్యంతరమునందుఁ బొడిచి గెలుచు సం
బరము రభసం బెసఁగ సం, చరణక్రమ మొప్పఁ బోరు సలిపిరి పెలుచన్. ౧౦౧

తే॥ పొంచి యెగిచి యాక్షేపించి పొడిచి తివిచి, తివిరి సంవేష్టనశ్లిష్టదేహు లగుచు
వ్రాలి రట సాలపరిఘాంతరప్రదేశ, మునఁ బ్లవంగేశ్వరుండు నద్దనుజవిభుఁడు.

క. పడినంతన మొగకొని రప్పుడమి స్పృశింపకయ యెగసి పూనిన గ్రహ మ
వ్వడువున నాగ్రహమే యై పొడవుపడఁగ నూర్పు లొంటఁబుచ్చుచుఁగడఁకన్.
క. ఆలింగనవల్గనముల నోలి న్మనములకుఁ బీడ లొదవింపంగాఁ
జాలి రథిబాహుయోక్త్ర వేలస్ఫుటయోజనప్రవీణత మెఱయన్. ౧౦౪
తే. అభినివేశాభ్యసనబలా ద్యతిశయితము లెసఁగ సింగము ల్పులులు గజేంద్రపోత
ములుగ దర్పితు లై కడ ముట్ట గాంచుకడఁక వా రట్లు పోరిరి కంజనేత్ర.
క. తాఁకి యురఃపీడన మటు తేఁకువ నొనరించుచు నె పృథివిఁ బడుచు నసం
బాఁకపడ లేక యెగయుచు వీఁక నధిక్షేపసరణి వెలయింతు రమా! ౧౦౬
ఉ. వారణవారణాభములు బాహువు లెత్తి నివారణంబుల
న్వారక గూర్చుచుండ్రు వరవారణతుల్యులు వార లిత్థసం
చారవిశేషశిక్షల ప్ర చారము లారసి నిర్విచారమున్
స్ఫారబలంబు తోడుపడ సాగు చలంబు క్లమం బడంపఁగన్. ౧౦౮
ఆ. అట్లు సుచిరకాల మారాధన మొనర్చి స్థాన భేదముల ప్రసంగ మెంచి
పొంచి యొండొరులను బొలియింప భర్త్స్యార్థ మదరు గండుపిల్లు లట్లు మించి.
సీ॥ కొండొకండు ప్రసక్తి మండలక్రమ పరి భ్రమణంబు లొనరింపఁ బరఁగి పరఁగి
యట గతప్రత్యాగతావాప్తి గోమూత్రి కాదిలక్ష్యంబుల నడరి యడరి
యవలఁ దిరశ్చీనతావలంబనమున నెడసొచ్చి బడలింప నెంచి యెంచి
కడఁగి వక్రంబు లౌ గతులకుఁ జొరఁబాటి దొంగవ్రేటులవంకఁ దొడరి తొడరి
ప్రమ్మి పరిమోక్షణము వర్జ సమ్మి విపరి ధావనాభిద్రవణము లాప్లావవిగ
హొంచితాస్థానములు వెలయంగ వీరమల్లురటు మల్లయుద్ధంబు మలయఁగాంచి.
వ॥ నియుద్ధమార్గవిశారదు లయ్యిరువురు దొరలు దొరఁకొని మరలనీక పురికొలుపు
గెలుపుటుబ్బునం ద్రబ్బికొను నాన నాసంజితంబు లగు పరావృత్తంబును నపావృ
త్తంబును నవద్రుతంబును నవప్లుతంబును నుపన్యస్తంబును నపన్యస్తంబును
మున్నగు ప్రచారంబుల సంచారం బొనరించుచుండి రంత. ౧౧౦
క॥ బడలువడి రక్కసుం డవ్వడువున మాయాకృతిప్రవణుఁ డౌట హరి
శుఁడు గని మింటి కెగసె నయ్యెడ నెడపడి యాతఁ డున్న యెడ నుండంగన్.
ఆ॥ వంచకుండు తానె వంచితుండయ్యె నవంచకుండు ప్లవగవరుఁడు గెలిచెఁ
గ్లమమునొందె నతఁడు క్లమమొందఁడితఁడంచు నమరగణము పొగడె నాక్షణమున.
ఆ॥ కన్నతండ్రిఁబోల గగనమ్మునకు మణినాఁ దనర్చె నవితృనందనుండు
డక్కులాని నటు బడల్పడఁజేసినయుబ్బు నెఱయ ననుచు నోజ మెఱయ. ౧౧౩
క॥ పవమానగమనుఁ డై యుత్సవ మానందంబుఁ బెనుపఁ జయ్యనఁ బ్లవగ
ప్రవరులు పొగడఁగ రఘుపతిఁ గవియం జనె నతని ధృతి ప్రకాశిలఁ బొలఁతీ.

మ॥ విభుఁ డవ్వీరు సమీరకలక్షణముల న్వీక్షించి యక్షీణదు
ర్లభలాభంబు ప్రహృష్టిఁ గూర్చునటేఁ దా లక్షింపకే యాదరం
బు భరం బర్రిఁ బొసంగ మేనఁబులక ల్పొల్పొంద నా గొఁగిఁటన్
రభసం బొప్పఁగఁ జేర్చి పల్కె మహితారంభుం డదంభస్థితిన్.
మ॥ చనునయ్యా! నెఱ సాహసంబు కృతి మత్స్వామంత్ర మొక్కింత లే
క నతారీ! చననెంతె మేల్ధొరలు పెక్కం ద్రొక్కఁ డూహించి యా
నని కా కెద్దియుఁ జేయువారె బలము న్నామాత్యు ద్రైత్యేంద్రు న
న్నును సన్నంద్యచరిత్ర సందియమున న్మంపం దలం పొప్పునే. ౧౧౬
క॥ ఎన్నఁడుఁ బూనకు మోసఖయెన్నక యిన్నరికడంక నీ వొకఁడగుచో
నన్నాతి యేల తమ్ములసన్న లనఁగనేల మేని సంగడ మేలా. ౧౧౭
ఆ॥ నీవు రాకమునుపు నే నిర్ణయించితి నరి మడంచి లంక నర్థి నితని
కొసఁగి భరతు నాయయోధ్య భరింపఁగాఁ బనిచి మేను విడిచి పర మరయుట.
క॥ అని నొడువు రామునిం గని యినజుండనె వానిఁ జూచి యే నెట్లు సహిం
తును బతి కపరాధ మొనర్చిన ఖలు శిక్షింపకునికి సేవకు ధృతియే ౧౧౯
తే॥ అనిన నభినంద్యుఁడవు నీక యాఁ గదయ్య
యిట్టి కృతి యంచు మెచ్చుచు నిట్టులనియె
మఱియు లక్ష్మణు లక్ష్మీసమగ్రుఁ గూర్చు
కొని రణోత్సాహ మెసఁదలోఁ గుదురుకొనఁగ. ౧౨౦
క. మును దెలిపితిఁ గ్రూరము లనఁజనెడు నిమిత్తములు పెక్కుసరణులఁ గనుప
ట్టునవి యుటంచు న్నెట్టననుబద్ధము లగుచుఁ గాన నయ్యెడుఁ గంటే. ౧౨౧

—♦ శ్రీరామచంద్రుఁడులక్ష్మణునకు యుద్ధనియమముల బోధించుట ♦—

ఆ॥ కాకమాన దాజి పోకమానరు వీరు లందు నిందుఁ గొంద అఖిలలోక
భీకరంబ యిదియుఁ బృథుల ముత్పాతం బనంగ నొలయు నని కనంగపలయు.
తే॥ నీటివసతులు వనములనీడ లొనరఁదనరు నెడ లాఁక్షపడి నిల్వఁదగు బలౌఘు
మెల్ల విభజించి యుంచి యధీశు లడరఁదొడరుదము రిపుగెల్వఁ దోడ్తోడ ననికి.
తే॥ పరమదుర్ధర్ష రావణపాల్యమాన
లంక నిశ్శంకముల సుబలములఁ గొంచు
మించు రక్కసుఁబొలియించి మేల్మివడయ
నెఱయవలె నేఁడ యిదియచూ నిశ్చితంబు. ౧౨౪
చ॥ అనుచునె లక్ష్మణాగ్రజుఁ డహార్పతితేజుఁడు ధర్మమూర్తి చ
య్యన గిరి డిగ్గి స్వీయబల మంత యుగాంతమహార్ణవంబు పెం

పునఁ దనరారుదానిఁ గని పొల్చు సముత్కట సార్కసూనుఁ డై
యనుమతి సేసె సంయుగమునందుఁ బ్రవర్తిలఁ గీర్తిశాలినీ!. ౧౨౫

శాలిని॥ సన్నాహం బాసన్న నొప్పారఁ గాల్యం బౌన్నత్యం బుద్యజ్జయశ్రీఁ దలిర్పన్
ము న్నైక్ష్వాకోద్ధు ల్ముఖ్యు లుపొంగ జేజే లెన్నం దర్లెన్సాల శత్రున్మడంపన్.

—♦ రామచంద్రుఁడు వానరసేనతో లంకను ముట్టడించుట ♦—

క॥ లంకాభిముఖ్యు మొప్పఁగశంకాతంకములు లేక జలజాప్తకులా
లంకారుఁడు రాముఁడు సర్వంకషదోర్వీర్యుఁ డని కవార్యుఁడు వెడలెన్. ౧౨౭
ఆ॥ కదిసె జోడుకోడెఁగదె లక్ష్మణుం డనుయాయు లావిభీషణార్కసూను
లనుమ హనుమఁ జెప్ప నాబుక్షరాజన్యు నానలు న్ననీలు నొనె పొగడ. ౧౨౮
ఉ॥ అమ్మెయివీరులం బెరసి యాఘనవాహిని మేదినీస్థలిం
గ్రమ్మచు రాఁదొడంగె గిరికందరము ల్మొరయంగ సంగరం
బిమ్మనఁ గూడివచ్చె నని హెచ్చగు వేడుకపాట గాని యం
దుమ్మలికమ్ముమాట పొర దుజ్జ్వలసద్గుణ భూషణాంచితా! ౧౨౯
ఆ॥ వేలకొలఁది గాఁగ శైలశృంగంబులఁ దతమహీరుహములఁ దడవికొనిరి
వారణాభు లన్యవారణు ల్వానరు లానవాభ్యుదయకలానుస్మృతిని. ౧౩౦
క॥ వారలు నీరదములు గిరి సారము గ్రమ్మంగ నడరు సరణిఁ దొడరిరా
నారామలక్ష్మణులు తఱి నారాక్షసపురిఁ బెరసి రఘాన్వసపత్నా! ౧౩౧
సీ॥ నిట్టలుదొ్రిచి యా నింగి కట్టులు సాచు బలుపతాకావళు ల్పరగునదియు
హృద్యానవద్యమ్ము లుద్యానములకల్మి జేజేల వనవాటిఁ జెనయునదియుఁ
దతబహుప్రాసాద తాదూప్యనటనల వైజయంతమ్ముతల వంచునదియుఁ
బ్రాకారపరిఘతో రణవప్రగుప్తుల లీల ద్యోపురి మూదలించునదియు
నరికిఁ జేయాని దమరుల కందనిదియు నన దురాధర్ష యా లంక నలమువంక
రామవాక్యప్రబోధితు ల్వీ్రమహితులు చొచ్చి రవ్వానరులు శ్రుతిస్తుతపదాబ్జ.
క॥ సంపీడన మొనరించుచుఁ బొంపిరివోవుసిది నిలిచి పొల్చిచిక్కితఱి నా
జంపున కెగయు బరాబరి సొంపు నుతింపంగ దరము సురలకు నైనన్. ౧౩౩
ఆ॥ జతనఁ దమ్ముఁగట్టి సాయమై యఱుమంగ నుత్తరంపుద్వార మొనసి మెఱసె
రాముఁ డఖిలసైన్య రక్షణవిధితోడఁ బరనిరోధ మొంటఁ బరఁగుచుండ. ౧౩౪
ఆ॥ ఉదుటుఁదనము నెఱప నుండెఁ దా నచ్చోట రాక్షసేంద్రు నునికి రా పెఱింగి
క్రూరదానవాభిగుప్త మయ్యది సహావరుణ మా మహార్ణవంబ కాదె. ౧౩౫
క॥ అద్దానిఁ దొలువనోపం డద్దానవవైరిదక్క నన్యుఁ డెవఁడు న
ట్టుద్దవిడి నచట రావణుఁ డుద్దామబలుండు నిలిచియుండుటకతనన్. ౧౩౬

క॥ లఘువులకుఁ ద్రాసజనన మలఘుపాతాళంబపోలె లావరి యగు నా
రఘువరుచే నఘహరుచే లఘుత్వముం గాంచు నది యిలాధరతనయా ! ౧౩౭
ఆ॥ అందుఁ గాంచె నెన్ని యాయుధోత్కరములు నట్లు కవచములు మహాసిరాసు
లును మహోజ్జ్వలాంగుఁ డినవంశ్యుఁ డవి యెల్ల నెట్లుసేయ నెడఁదనెంచినాఁడొ.
క॥ పూర్వద్వారము నీలుఁ డ ఖర్వబలుఁడు హవ్యవహముఖస్తుతుఁ డతిమెఱ్
సర్వహరిచమూనాథుఁడు గర్వప్రోల్లసితుఁ డంతకప్రతిభుఁ డనిన్. ౧౩౮
తే॥ వీర్యవంతులు మైందుండు ద్వివిదుఁడును సహాయులై రాతనికి నిది యనఁగ నెంత
మాయమై పోక నిల్చిన మన్ను మంటఁగలపమో యను పంతంబు గడలుకొనఁగ.
ఆ॥ వాలిపుత్రుఁ డమరవరపౌత్రుఁ డరిదాత్రుఁ డంగదుండు ప్లవగపుంగవుండు
వాలి గజగవయగవాక్షర్షభులతోడఁ దాను దక్షిణంపు ద్వార మతిమె. ౧౪౧
తే॥ పశ్చిమద్వారమునను విపశ్చితుం డపశ్చిముం డుండె నమ్మహాబలతనయుఁడు
హనుమఁడు ప్రమాథిప్రఘసుం డనంతరులుగ నట్టులన్యులు వీరులు నాముకొనఁగ.
క॥ ఉగ్రవిధానుం డొడయఁడు సుగ్రీవుఁడు నిలిచె నెడలు సుడియ సుదరగు
ల్మగ్రీవమున గరుడపవనాగ్రహజాగ్రత్త గలమహాప్లవగులతోన్. ౧౪౩
ఆ॥ వాని నెనసియున్న వారు ముప్పదియాఱు కోటు లంత కగ్ర్య కోటి నెన్నఁ
బడినవారు జగతిఁ బ్రఖ్యాత వీర్యులు యూధపతులు పావకోపమితులు.
క॥ రామేంద్రు శాసనంబున సౌమిత్రి విభీషణప్రసక్తిఁ బ్రితిద్వా
రాముక్తకోటిసంఖ్యల శ్రీమహితుల వానరుల విశిష్టులఁ జేర్చెన్. ౧౪౫
క॥ నడిగుల్మంబున నమ్మెయి గడకొని జననాథు వెన్నుఁ గాచుకొనుచుఁ ద
న్విడని నెఱి జాంబవంతుం డడరి సహాయుఁడుగ వానరాధిపుఁ డుండెన్. ౧౪౬
క॥ శార్దూలము లట్టులు హరిశార్దూలులు దంష్ట్రి లెసఁగ సన్నాహముతో
నిర్దాక్షిణ్యతఁ గవిసిరి స్వర్దయితారిబలములను సమయించుటకున్. ౧౪౭
ఆ॥ పదియు నూఱు వేయుఁ బదివేలు లక్షయుఁ గోటిపైనఁ గొసరు కోటి యోఘ
మోఘశతము ననఁగ నొప్పు నేనుంగుల బలము వార లంపుఁ బ్రిబలు లుండు్రి.
సీ॥ పెనుప్రాఁకులును గొండలును నేర్చికొని తెచ్చి యేరి మార్తు రటంచు నెగయువారు
కోఱలు దీటుచుఁ గొనగోళ్ళు మీటుచుఁబొంచి వైరుల నదలించువారు
వికృతచిత్రాంగము ల్వాలయు మోరలు సాచి రేద్రిమ్మరుల వెక్కిరించువారు
పేరెము ల్గొని వచ్చి పెరవారిఁ గనఁగాంచి తోఁక లాకిడఁ బైని దుముకువారు
నైరి వానరవీరు లత్యద్భుత మగుశరభముల దండు చాడ్పున సరభసముగ
నప్పురియు శైలమును దన్మయంబ కాఁగనడరు నప్పట్టునను విశ చాబ్జనయన !
క॥ ఆకాశ మనవకాశం బాకరణి న్ధరణి పిహిత మయ్యెను రాకం
బోకఁ దెరువీక నెరసెడు నాకపివీరుల ప్రసక్తి నయ్యెడఁ బడఁతీ ! ౧౫౦

తే॥ వచ్చువారలు నెడనెడఁ జొచ్చువారలట్లు డీకొని యరులపై నఱుమువారు
గాఁగ వాయువు సొరరాదు కదలఁ జొచ్చెలంక గల గిరి గలఁగిరి లాఁతు లపుడు.

క॥ తెప్పునఁ బైఁ బడు నప్పటియుప్పాటున భయము విస్మయము నందిరి పె
న్ముప్పిది తప్పని దిప్పతినిప్పచ్చర మిట్లు గూర్చునే యని పౌరుల్ ౧౫౨

క॥ వడవడ వడఁకెడు నప్పురిసడుగిడ నేర రస వారి కగునే తమ మే
ల్గడవుకొనఁ దడవు గొనకొనఁ దడబడుచుం బడలుపడుట దక్క సురాజ్ఞీ. ౧౫౩

ఆ॥ ఆమొ గిఱ్ఱు గ్రమ్మ నట్టు లర్ణవములు పొంగి పొరలునట్లుఁ బోరి బలౌఘ
ములు గడల్కొనంగ మ్రోఁతలు నిర్ఘాతములఁ దరంగఘోష ములను మించె.

తే॥ ఆనివాదము లొక్కఁ టై యఱుముచు సహావరణతోరణాకాసన ధరణిధర ని
రామయకలంక లంక యెు య్యనఁ దలంక భోరుకొనె నప్పు డోకర భోరు వించె.

తే॥ రామలక్ష్మణసుగ్రీవ రక్షిత సుమహార్ణవాపూరణోచిత యాప్లవంగ
వీరవాహిని యటు వినివిష్ట తనరెఁదా సురాసురదుర్ధర్షతర యనంగ. ౧౫౬

ఉ॥ అన్నెఱి సన్నివేశమున నాబల మెల్ల నెలర్పఁజేసి వి
ద్వన్నివహస్తుతుండు రఘువల్లభుఁ డాదటఁ గర్జమెంచి సం
పన్ను విభీషణుం బ్లవగపాలుని మంత్రుల మంత్రణంబునం
బన్నుగఁ బూన్చి యాఘనుల పల్కుల సమ్మతిఁ గాంచి యాచితిన్. ౧౫౭

ఆ॥ తత్త్వవేత్త రాజధర్మంబు పాటించి యంగదుని లసద్గుణాంగదుని వి
కాస మొప్పఁ బిలిచి శాసించె నిట్లనిదుందుభిస్వనంబు తోడవుగాఁగ. ౧౫౮

ఆ॥ సౌమ్యమూర్తి! నీవు చయ్యన లంకాపురాంతరమ్ము సొచ్చి యపభయుండ
వవ్యథుండవు నయి యరుగుము దశకంఠు నరసి నాదుపలుకు లని పలుకుము.

—♦ అంగదు రాయబారము ♦—

ఉ॥ నీసిరి ఫ్రాయె సీశతయు నిన్నెడఁబాసెఁ దలంగెఁ బెల్వితో
నాస యనన్మమూర్ఘతకు నైతివ యింకను జ్ఞాన మున్నె నీ
చే సుర లచ్చరల్మునులు సిద్ధులు యక్షులు పన్నగంబులున్
గాసిపడంగ నౌ కథలఁ గల్గిన పాపము పండె రావణా. ౧౬౦

తే॥ మోహ మవలేపమును దన్ను మొనసి పొదువ
నాస్వయంభు వొసంగిన యట్టి వరము
చెల్లె దర్పోపహతుని నిన్జేసి యింత
వట్టు జెల్లద యింకఁ దా వలను బాసె. ౧౬౧

తే॥ రేఁపితివి మదకరి సిల్గు సూపి మాన్య
మత్ప్రియను బంది సేసి త్వన్మారణమున

కితఁడు దండధరుం డిదె యేగుదెంచి
నాఁడు తగు నౌపయిక మొండు చూడు మిపుడు ౧౬౨

క॥ నిలిచె న్నీపురి వాకిటనలఁతింబోఁబోఁ డెదిర్చి హతుఁడవ యైనన్
వెలసెదు సురమునిరాజర్షుల కి మ్మగుచున్న యట్టి చోటుననసురా! ౧౬౩

ఆ॥ ఏబలమ్ము నమ్మి యేమాయఁ గైకొని సీతఁ దెచ్చి తిట్టి చేరుగడను
నదియు నదియు నెఱప నై దిట్ట వై నిల్వ మెదిరి తలఁగి తిట్టులే పడకుము

మ॥ శర ణంచు న్ననుఁ జేరఁగాంచి జనకక్ష్మాజాత నర్పింపవే
ని రక్షోణిని వాఁడియమ్ముల నిను న్నిర్భిణ్ణుఁ గావించు న
య్యుర వట్లుండ జగం బరాక్షసముగా నుద్యుక్తి సాధింతుఁ బె
క్కురు పాపాత్ముని సంగతిం జెడుఁగు లై కోల్పోరె ప్రాణార్థముల్ ౧౬౪

తే॥ కొలము వెలయంగఁ బుట్టె నో క్కొండు మేలి
పున్నెముల రాశి నిను వీడి పొలుపుఁగాంచె
నతఁ డకంటక మైశ్వర్య మందువాఁడు
శ్రీవిభీషణుఁడే ననుఁ జేరినాఁడు ౧౬౫

క॥ న్యాయ మని లేక మూర్ఖసహాయుఁడ వతిపాపరతుఁడ వవిదితుఁడవు నై
యాయము నెఱచితి రాజ్యశ్రీ యెడఁబాసె నినుఁ గడమ చింత లిఁకేలా. ౧౬౬

క॥ యుద్ధ మ గతి యనుచు ధృతిని బద్ధం బొనరించి శౌర్యపద్ధతిని శరా
విద్ధుఁడ వై శాంతుఁడ వై యిద్ధరఁబడి శుద్ధభావ మొనసెదవు బలే ౧౬౭

ఆ॥ పక్షి వగుచు మూఁడు పత్తనంబులవంక కెగయ నైన బ్రదికి యొనయ నీకు
నాదుకంటిగుఱిని బాదుకొంటివ యేని నంటికాల్పఁదొడరు నలుఁగుఁజిచ్చు ౧౬౮

మ॥ హితమేఁ దెల్పెద నొర్థ్వదైహికకృతు ల్లాప్తాత్మతం గూర్చుకో
మ్మొ లఱి ల్లంక నలంకరించి కను మిమ్ములూనపు చుట్టమ్ములన్
జతనం బొప్పఁగఁ గాంచి తెల్పుకొను మాస ల్వీడి రమ్మింక జీ
విత మీనాయరచేతిలోని దని భావింపంగ నా తెంపునన్. ౧౬౯

క॥ అని తెలిపి రమ్మహా మ్మన ననఘుఁడు తారేయుఁ డధిపు నంగ్రఘులకు నతు
ల్లొనరించి పొగడి యాకసమున కెగసె న్మహావ్యవహృని మూర్తత పొసఁగన్.

ఉ॥ ఒక్కముహూర్తమాత్రమున నుజ్జ్వలమూర్తి పురంబు దాఁటి పెం
పెక్కిన రాజమందిరము హేమమణిద్యుతిసంప్రకీర్ణముం
జక్కటి గాంచి చొచ్చి కనె సైంహముఖాఢ్యమహాసనంబుపై
నెక్కి సమంత్రమంత్రినివహేరణ లంచెడు రాక్షసేంద్రునిన్. ౧౭౨

తే॥ కని ముఖాముఖి నిలిచెఁ జో క్కాట మొలసి
గాట మై నేటుకొనఁగ వనాటనేత

హేమకూటమ్ము దరిఁ దోఁచి యెనయు చంద్రుఁ
బోల్పఁ దగె నాతఁ డప్పు డో పూవుఁబోడి! ౧౭౩

ఉ॥ అమ్మెయి నిల్చి తా నని యె నంగదుఁ డంచితకాంచనాంగదుం
డిమ్మగఁ బంపె నీదెసకు నిత్యచరిత్రుఁడు రామభూవరుం
డమ్మహనీయు కింకరుఁడ నంగదనాముఁడ వాలిపుత్రుఁడన్
జ మ్మిటు నీదు శ్రోత్రమునఁ జొచ్చెనొ లేదొ యొకప్పు డేనియున్. ౧౭౪

క॥ అని యన్యూనాధికముగ మనువంశ్యుం డను మటన్న మాటలవరుసన్
వినిపింపఁదొడరె నిట్లని సునిహితనయుఁ డతఁడు శుద్ధసురుచిరవేషా! ౧౭౫

ఆ॥ పురము వెడలి రమ్ము పూరుషుండవు గమ్ము ప్రతిభటుండ వగుచుఁ బవరమునను
నిలువు పుట్టు లయిన నిలుచు నెక్కటి కీర్తి మేను బాయు టొండు మేలుగాఁగ.

ఆ॥ అడఁచువాఁడ నిను సహామాత్యు సతనయజ్ఞాతిబాంధవుని ససంశయముగ
నీవు చనిన లోక నివహ ముద్విగ్నతఁ బాసి మేలి సుఖము బడయఁగలదు. ౧౭౭

క॥ వేలుపులకు మునులకుఁ దొలివేలుపులకు సిద్ధసాధ్య విహగాదులకున్
శూలమ వైతివి ని న్నిఁకఁ దూలింపకయున్నఁ గీడు దొరయవె జగముల్. ౧౭౮

క॥ ఈతగనికంటకం బిటులీతఱి నెడలించి సుజనహితు మహితగుణో
పేతు విభీషణు రాజ్యశ్రీతుం బొనరింతు మత్సమీహిత మెసఁగన్. ౧౭౯

ఆ॥ సీతఁ దెచ్చి యొసఁగి చేసాఁచి శరణంటి వేని బ్రదుకువాఁడ వెట్టు లైనఁ
గాని లంక నేలఁ గా వీవు సీతమ్మ పాలిదయ్యె నది యభంగురముగ. ౧౮౦

ఆ॥ పక్షి వగుచు మూఁడు పత్తనంబుల వంకకెనయ నైన బ్రదికి యెనయనీదు
నాదుకంటిగుఱిని బాదుకొంటివయేనినంటికాల్చుఁదొడరు నలుఁగుఁజిచ్చు. ౧౮౧

మ॥ హితమేఁ దెల్పెద నార్థవైహికకృతుల్ హ్యాప్తాత్మతం గూర్చుకొ
మ్ము తటిన్ లంక నలంకరించి కను మి మ్ముల్సాపు చుట్టమ్ములన్
జతనం బొప్పఁగఁ గాంచి తెల్పుకొను మా సల్వీడి ర మ్మింక జీ
వితమీనాయరచేతిలోని దని భావింపంగ నౌ తెంపునన్. ౧౮౨

క॥ అని యిట్లు పరుషవాక్యములను నెరయింప రుషఁ బొదలి లావరి హరివ
ర్యునిఁ గని నిశాచరేశ్వరుఁ డనుబద్ధము పారవశ్య మదనునఁ దనరన్. ౧౮౩

ఆ॥ ఇతనిఁ బట్టి కొట్టుఁ డిట్టట్టు లౌ నను తలఁపు మాని మన్మతంబు పూని
దొర సమక్ష మనక దుర్మేధసుం డిట్టు లాడఁదొడరెఁ దెఱఁగు లాడ కిపుడు.

క॥ అని మఱియుఱి శాసింపఁ దదనుచరులు నిశాచరులు సమతిఘోరులు నె
ట్టన నలువు రగ్గు లట్టులుగొనకొని యమ్మేటి ముట్టుకొన నిగుడుటయున్. ౧౮౫

ఆ॥ పట్టుకొనఁగ నిచ్చి బలదర్శనేచ్ఛఁ దై యాత్మవంతుఁ డవల నందరాని
వాని పెద్దమేడ వలనున నతిలంఘునం బొనర్చె నాకసంబు ముట్ట. ౧౮౬

ఆ॥ తనదు బాహువులఁ బతంగంబు లట్టులు జిక్కియున్నవారు శీఘ్రగతి స
హింప కెడలి పడిరి హీనులై యిలపైని నసురనాథుఁ డింత యగయుచుండ.

క॥ పెనుగొండకొమ్ముఁ బోలఁగఁ దనరెడు ప్రాసాదశిరముఁ దద్దయుఁ గనె న
వ్వనచరవరజుఁడు తనలావును మగఁటిమి నెఱపఁ దలఁపు ప్రేమముఁగ మగువా!

ఉ॥ తన్నెను వాఁడు దాని నది తద్దయుఁ గూలె నగారి గట్లపై
బన్నిననాఁడు వజ్రహతి పాల్పడఁ జేడ్పడి నేల వ్రాలె నె
ట్లన్నగరాజు శృంగ మటులై చటులైకపరాక్రమాఢ్యుఁ డాఁ
గన్నులఁ జూచుచుండె దశకంఠుఁ డోకం డొనరింపఁ బోలమిన్. ౧౮౯

శా॥ పే రొప్పారఁ దనర్చు నన్నగరి దా పెం పట్లు పోకార్చి నా
పే రిం దందఱు వింటిరా యనుచు సం ప్రీతిం బ్రశంసించి యా
పో రిట్లే యిఁకఁ జెల్లు నెల్లి యని యా స్ఫోటించి బిట్టార్చి దే
వారు ల్గంత వియత్పథం బొరసెఁ గీశౌఘంబు లుప్పొంగఁగాన్. ౧౯౦

ఆ॥ తెప్ప వాల్ప కెలమి నుప్పరంబునచక్కి కెగయు చూడ్కి లోంటఁదిగియునంత
లోన స్వీయజనము లో నుండె నవ్వాఁడు రాము పార్శ్వ మెనసి రాణ దనర.

క॥ ప్రాసాదధర్షణంబున నాసాదితిమర్షుఁ డనఁగ నగుచు నసుర నా
యాస లిఁకఁ దలఁగె నని ని శ్శ్వాసము లెడలించె సకల శాసననిపుణా! ౧౯౨

తే॥ రామవిభుఁ డంగదాగమ మామెయి నద సీయముజయమ్ము నెఱి నయశ్రీప్రసక్తి
జాలుకొల్పుటయు నెఱింగి సంభ్రమంబు తనర మే ల్మే లని నుతించెఁ దళుకులాడి!

శా॥ స్పష్టాహంకృతు లుల్లసిల్లఁ బ్లవగు ల్సన్నాహ మొప్పార సం
హృష్టాత్మత్వము చెన్నుమీఱ సమరం బెడ్డెప్పు డంచుం బరా
నిష్టంబు ల్దలపోయుచుం గడఁగి రాయి మ్మిమ్ముఁ బాయంగ నా
కష్టం బేర్పడె రాముఁ డట్లసురశిక్షాకల్పముం గైకొనన్. ౧౯౪

ఆ॥ కామరూపులైన కపివరేణ్యులఁ గొని యాసుషేణుఁ డధిపు నాన నద్రి
కూటనిభుఁడు నాల్గు బాటల హరుల బుఱుములఁ జంద్రుఁ డట్లు గలయఁ దిరిగె.

శా॥ లంకామార్గము లెల్లఁ గ్రమ్మి కడఁకన్ లావెక్కి డాచుండ ని
శ్శంకుల్గా విహరించు వానరుల యక్షయ్యత్వ మూహించి యే
వంకం జూచిన నబ్ధిలి ట్లఱును నై వచ్చెంజుఁడీ యంచు సా
శంకాశ్చర్యభయప్రకంపు లయి రోజం బాసి యయ్యాసురుల్. ౧౯౬

క॥ కొందఱు సమరాకాంక్షుమ్మం దడు గిడి రనుచె కాని ముద మేదఁగ న
య్యందఱ దెసఁ ద్రాసమె రూపందుట హాహారవముల నను వొందె సఖీ! ౧౯౭

ఆ॥ వానరీకృతంబు నా నయ్యెఁ బరిఘ వప్రాంతరంబు నాఁగ నగునె పూర్తి
నాల్గుసాగరముల నడుచిక్కియును దదీయాఘపూర్ణ మనిన నన్నృత మగునె.

మ॥ అను కోలాహలము ల్నెలంగ దనుజాధ్యక్షు ల్మహాయూథము
ల్గొనకొంచుం గరలంగ నాయుధములం గొంచున్ యుగాంతప్రవా
తనిరాఘాతత్వము ద్రోప నర్వెసల దోర్దర్పంబు చెన్నార నె
ట్టన సంచార మొనర్చి రొడ్డ పరికట్టంజాలు శీలంబులన్. ౧౯౯

కం॥ అంతట వే చని హరివరు లంతిపురింగూడఁ బురము నలమి రెచటునం
దంతరము లే దటంచు నుదంతము రావణునితోడ దైత్యులు నలుకన్. ౨౦౦

ఆ॥ నగరి రుద్ధ యయ్యెనా నదశ్రుతి తోనె పెచ్చుపెరిగి యలుక చిచ్చు ముట్ట
డింప రక్షణము గు ణింపఁగాఁ బనిచి ప్రాసాద మెక్కె రాక్షసప్రభుండు. ౨౦౧

ఉ॥ కన్నులఁ గాంచెఁ గన్నులనుగట్టినయట్టులె విన్నయంత లా
నన్నరనాథు వాహిని బయళ్ళ నగంబులఁ గాననంబులన్
మన్నున మిన్నునం దనక మార్పడఁజేయఁగ లెక్క ద్రిక్కగా
నన్నెఱమాయలాఁ డెటుల నయ్యెడునో యని విన్నవోవుచున్. ౨౦౨

శా॥ ఇన్నేలం గబళింతురో దెసల మా యింత్రో చద ల్దోంతురో
మున్నీర న్నడి సున్న సేయుదురుకో ముప్పోకల స్వేఁకలం
గొన్నా రెమ్మెయి వీరి గెల్వనగు నైకుంఠు ల్గదా యంచు లో
న న్నిర్వేదము ప్రొగి యూర్పులకు స న్న ల్సేయ సన్నాశుఁడై. ౨౦3

ఆ॥ అట్లు దీర్ఘకాల మాలోచన మొనర్చి ధీరభావ మెట్లొ దీటుకొనఁగఁ
గనులు విచ్చి రాముఁ గపివరేణ్యబలమ్ముఁగలయఁజూచె మరలఁ గమలనయన!

కం॥ వెలిగొడుగుల నీడలఁ దమ్ములఘుశ్రీ నట్లుగాంచు నాతనిఁ గని యు
త్కలమగు రోసంబున మోములంక రింప నొకవింత హాసం బొలయన్. ౨౦౪

ఆ॥ రాముఁ డర్ధశశిశ రముఁ బూన్చి యద్దానఁబది కిరీటములును భాసురాత
పత్రములుఁ దెరల్చె భంగజాపత్రపముంప వాఁడు తలఁగె ముదిత! వింటె.

—♦ రామాజ్ఞప్తులై కపిభటులు లంకపైఁ గవియుట ♦—

ఉ॥ లగ్గల కెక్కఁ బంచె నటు లాఁతిపురమ్మపయి న్వనాటులం
దిగ్గన దానిఁ గన్గొనెడు తీరున సీత తలంపులోని దై
భగ్గు రనంగఁ గోపపరిపాకవిశేష మె సంగఁజేయ నా
దిగ్గజకుంభకస్తని విదేహజ యెట్లగు నేమొ యం చొగిన్. ౨౦౫

ఆ॥ ధర్మమూర్తి రామదైవతం బటు లానసేయు నంతలోనె సింహనాద
ములు సెలంగి దెసల ముప్పోకలకుఁ గూర్పనొండొకొండ్ల నొంట నొరసికొనుచు.

ఆ॥ కొండశిలల దీనిఁ గొనకుఁ బూడ్తుమొ పిడికిళ్ళఁ బొడిచిపొడిచి క్రిందుమీఁదు
సేసి ప్రోవువెట్టి శీర్ణమ్మొనర్తుమో యని తలంత్రు వానరాధిపతులు. ౨౦౬

సీ॥ కొనముట్ట శిఖరము ల్గొండలు పెకలించి కొనివచ్చి వైతురు కోర్కె లలర
నటు మహాతరువుల నందించువారల మెచ్చి కైంకొందురు మేను లెగువ
నెగసి తన్నులు దన్ని యింతింతముక్కలు గావింత్రు నెట్టనఁ గడఁక దనరఁ
బిడికిటిపోటులఁ బీఁచం బడంగించి యొండెడఁ బడఁద్రోతు రుబ్బు సెడఁగఁ
బరిఘ లొంటఁ బూడ్చి పఱు పౌనర్చిరి మహావరణముల నగల్చి వఱలు తోర
ణముల వ్రచ్చి యిడిరి సమభూమిగాఁ జేయనింక లంక యుండు నెట్టు లనుచు.

ఉ॥ బంగరుమేను ల ట్లరుణభాసము లౌ మొగము ల్వెసంగ న
య్యంగజమూర్తి జీవములె యన్నియు నంచు రిపు ల్దలంక లం
కాంగములం గలంప నయి యాఱడిపెట్టిరి రాక్షసేంద్రు న
ప్పొం గిటు గ్రుంగఁగాత మని బోరన వా రనవద్యభావనా ! ౨౧౧

శా॥ కోటీకోటుల లెక్కకుం గవియుచు న్గోల్పోక సాటించుచున్
బాటీకోచితభర్మహర్మ్యముల దౌర్భాగ్యంబు వాటించుచున్
నూటి న్గోపురతోరణప్రతతి సంచూర్ణంబు గావించుచున్
బోఁటీ ! యాటలు పాటలు న్నెఱపి రాపో రెన్నఁగాఁ శక్యమే. ౨౧౨

ఆ॥ అతిబలుండు రాముఁ డజితుండు జయ మొందు లక్ష్మణుండు వెలయు లాఁతివారి
నేలపాలుసేయు నేత సుగ్రీవుండు తత్ప్రపోషణమునఁ దవిలినాఁడు. ౨౧౩

మ॥ అని యిట్లార్పులు నింగిముట్ట బలుసయ్యాట ల్సెలంగన్ రిపు
ల్గని భీతిల్లఁగ నుల్లసిల్లు ధృతిఁ దత్ప్రాకారముల్ద్రోచి యే
చిన దర్పంబునఁ జొచ్చి విచ్చలవిడిం జేడ్పాటు గూర్పంగఁ ద
ప్పని దీము ప్పను ఘోషణ ల్దెసలకుం బ్రాకెం దివౌకస్స్తుతా! ౨౧౪

వ॥ ఆసమయంబున ము న్నొనరించుకొనిన సమయంబునన యన్నినెలవులం దన్ని పన్నుగడలు గడలుకొనం బన్నుచున్న యన్నెఱి నెఱజాణతనంబు మీఱలన వీరబాహుసుబాహులు ప్రాకారంబులు నిరాకారంబులు గావించు నయ్యుప వేశనంబున స్కంధావారనివేశనంబు సమర్థించు విశేషార్థంబుఁ గైకొని ప్రఘసుండును బనసుండును బహుసైన్యంబులతోఁ దనకుం దోడ్పడం బడవాలునకు సహాయంబుగా జితకాశు లగు పదికోటులు కీశవర్యులతోఁ గుముదుం డీశానదిశం దార్కొని పూర్వద్వారసేనారక్షణంబున కోపి నిలుచునట్లును వీరుఁ డగు శతవలి వింశతికోటులతో నాగ్నేయి న్నెలకొని దక్షిణానీకినిపైఁ గన్నిడి మెలంగునట్లును నఱువదికోటులతోఁ దార తండ్రి యగు సుషేణుండును నైరృతపు దిక్కుం ద్రొక్కి పశ్చిమద్వారంబున సేనాపారావారంబుఁ బాలింపఁ బాలుపడునట్లును సర్వహరీశ్వరుం డగు సుగ్రీవుండు మధ్యమగుల్మంబు వెన్నుదన్ని వాయవ్య దిశ నుండినవాఁడు సహలక్ష్మణుం డై యుత్తరద్వారం బాక్రమించి

మించిన శ్రీరామదేవుని యండంబాయక నాయకరంబు పొగడొంద నెగడొందు నట్లును భీమదర్శనుండును మహాకాయుండును నక్షీణవిక్రముండు నగు గవాక్షుండును విపక్షనిబర్హణుండును ఋక్షవ్యూహనాథుండు నగు ధూమ్రుండును గోటి కోటిసైన్యంబులతో నాలీలామనుజేశ్వరుని కెలంకులన తొలంకునట్లును నిబంధనంబు సంధానించి గజగవయగంధమాదనశరభులుం దారును బరిధావనం బొప్పార సర్వహరివాహినీపరిరక్షణంబున మెలంగుచుండువారుగా నియ్యకొని రయ్యెడ మహాబలవీర్యుం డగు విభీషణుండు సన్నద్ధుండును గదాపాణియు నై సచివులతో రామనరేంద్రుని బలమ్ము బలమ్ముగా నాసీరసీమన కుమురుకొని యుండె నట్టియెడ ౨౧౫

క॥ పరబలములు పైకొని సంబరమునఁ బరవళ్లుసేయఁ బరఁగుటఁ గని స
త్వరమె నిజసైన్యముల కంబరచరరిపుఁ డాజ్ఞసేసెఁ బ్రస్థానంబున్ ౨౧౬

—♦ రావణుఁడు తనసైన్యములకు యుద్ధమునకు సెలవిచ్చుట ♦—

తే॥ అట్లు తన్ముఖనిర్గతం బైన పలుకు చెవికి సోఁకినయంత నే సిద్ధ మనుచుఁ
దరలి రెనసిరి సింహనాదము లొనర్చి రశనినిర్ఘోషములఁ బోల నసురవరులు.

సీ॥ చంద్రబింబాస్య లంచల మ్రోసె భేరిక ల్హేమకోణాహతి భీమలగుచు
ముఖమారుతమ్ముల మొనసి ఘోరమ్ముగా ఘోషిల్లె శంఖము ల్కోట్లకొలది
గజఘట ల్హాయతతు ల్గతు లెంచియేమొకో మొరసె నాశలకు వైముఖ్య మొదవఁ
జక్రనేమిక్రమసన్నద్ధనాదంబు లశనినిర్హ్రాదాప్తి ననువదించె

గీ॥ రావణప్రేరణమున సంగ్రామభూమి
ముంచుదుమటంచు దరిలేని మొక్కలమున
సమయకృతిపూర్యమాణము ల్సాగర ప్ర
వేగముల య ట్లసురభటుల్ వెడలు నపుడు ౨౧౮

తే॥ మేలిమేనుల కప్పుల మెఱుఁగులీను క్రొన్నగల యొప్పిదముల సంకులు ధరించి
వారు విస్ఫురద్బలాకికావళులతోడి యంబుదంబులు నాఁ బొల్చి రంబుజాక్షి.

ఉ॥ వారలరాకఁ గాంచి వరవారణతుల్యులు వానరోత్తముల్
భూరిబలు లొనర్చిరి ప్రభూతము లౌ ఘనగర్జితంబులన్
బూరిత మయ్యె నామలయభూధరమే యననేల నేలతోఁ
బూరటిలె న్నభం బటులె భోర్కొనెఁ దన్మహిమేఖలాటుర్భల్ ౨౨౦

క॥ దేవాసురులకువలెనేయా వానరరాక్షసులకు నయ్యె సమరమ
హావేగవేగవృత్తులు తీవరపడువారిపట్లఁ జేటపడంగన్. ౨౨౧

—♦ యుద్ధప్రారంభము ♦—

ఆ॥ స్వస్వవిక్రమములఁ జాటుచు ఘోరుల వైర్వరు లెగిచి తాఁకి వనచరులను
బొడువఁజొచ్చి రోకటఁ బోలుచు గదాశక్తి శూలఖడ్గభిందివాలములను. ౨౨౨

మ॥ జయ మొప్పారఁ బ్లవంగమాధిపతికిన్ క్ష్మాపుత్రికాజానికిన్
జయ మా మాకును వారి ప్రాపు గలుగన్ సంగ్రామరంగంబునన్
భయ మెన్నం బనిలే దటంచుఁ గడఁకన్ భాషించుచున్ స్వీయ మా
హ్వాయముం దెల్పుచు వానరు ల్దొడరి రొయ్య న్మార్తుల న్మార్కొనన్. ౨౨౩

ఆ॥ కడఁగి యమ్మహోగ్రకాయులు నెల రేఁగి పూచినట్టి దైత్యపుంగవులను
గొట్టఁదొడరి రోకటఁ గొండల బండలఁ జేతిబలువు మెఱయఁ జెట్లువిసరి. ౨౨౪

తే॥ గోళ్ల వ్రచ్చిరి పండ్లచే గ్రొచ్చి రెండు వ్రేలిడఁగ సందు లేకుండ వేగితు లయి
మొట్టులేనియు విదలించి యిడిరి పగఱఁ గ్రోఁతు లవ్వార లావెంటఁ గొఱఁత గలదె.

ఉ॥ కొండల మంది రక్కసులు గొండఱు వప్రములందు నిల్చి యా
క్రింద నెదిర్చు వారిపయిఁ గ్రిక్కిరియించిరి భిందివాలముల్
వ్రమందఁగఁజేయు శూలములు వ్రామనిమెకా లది యోర్చి మార్తుఱన్
ముందల లాఁగి లాఁగి రొగి ముట్టఁగఁదాఁకి వియద్విహారు లై. ౨౨౬

తే॥ అట్టిసంకుల సమరంబు నందు మాంస శోణితాంకంబు పంకంబు చూడ నొప్పె
భార మెడలించు కొననెంచు పట్టునందు నేల కొదవిన రోసంబు నెఱసె ననఁగ.

తే॥ అంతకంతకు బలకోప మతిశయిల్లె వారు పీ రనఁబోని యప్పొరితమున
మూఁక లేఁకట తోడి దై మొనయు దేరు పరవశత్వంబునకు వశపడుచుఁ బొడువ.

ఉ॥ ఓపు పిసాచికోలుపులు లుగ్రరణంబున నేపు మీఱఁగాఁ
బైపయి వ్రాలి రుద్దవిడి బంగరుపోడుము లొప్పు గుఱ్ఱముల్
ప్రాపుగ భానుమండలనిభంబులు వహ్నిశిఖాధ్వజంబు లు
చ్ఛ్రిపథముల్ రథంబులు విశిష్టసుకంటకము ల్దొలంకఁగన్. ౨౨౯

తే॥ ఆర్పు లెసఁగ రావణు జయ మభిలషించి
భీమకర్ములు తా మట్టు లాముకొనఁగ
రామవిజయంబు రూపించు రాణవొసఁగ
వానరచమూసముద్రంబు వారిఁ బొదివె. ౨౩౦

—♦ వానర రాక్షసవీరుల ద్వంద్వయుద్ధములు ♦—

మ॥ సమయం బియ్యదె యంచు ద్వంద్వసమరోత్సాహంబు వాటిల్ల రో
స మనేకాకృతు లూనె నాఁగ నుభయుల్ సన్నద్ధు లై యుద్ధతిన్

సమదేభంబుల భంగి మార్కొనిరి తత్సరంభ మీక్షించి త్రా
సమయంబుల్ తమహాభృత్ప్రదేశములుగా స్వర్వాసు లూపాడఁగన్. ౧౩౧

తే॥ వాలిపుత్రునితోఁ గడు వాలి క్రాలి యెదిరి పోరంగఁ దొడరె నయ్యింద్రజిత్తు
మున్ను నన్నుఁ దలంపక ముట్టుకొనిన యంతకునిఁ బోల్ప నగుచు లతాంతలలిత.

సీ॥ సంపాతి తొడరెఁ బ్రజంఘరాక్షసునితో మలసెఁ బోరఁగ జంబుమాలి హనుమ
సక్రోధుఁ డవ్విభీషణుఁడు మిత్రఘ్నునిఁ దాఁకె గజుం డట్లు తపనుఁ బొదివె
నీలుండు దొరఁకొనె నెఱి నికుంభునితోడఁ బ్రఘసుని వానర ప్రభు వెదిర్చె
మఱి విరూపాక్షు లక్ష్మణుఁ డాటఁగదిసె శ్రీమంతు రామేంద్రుని మార్కొనంగ
గీల్కొనిరి నల్వు రాయగ్నికేతురశ్మికేతుసుప్తఘ్నయజ్ఞకోపాతియోధ
వరులు మైందున కగపడె వజ్రముష్టి ద్వివిదుఁ డశనిప్రభుని పోటు దీటుకొనియ.

క॥ రణదుర్ధరుఁడు ప్రతపనుఁడు గుణవంతుని నలుని నెమకి గూర్చుకొనె విచ
క్షణు నాసుషేణు దుర్మర్షణు విద్యున్మాలి వడసెఁ బ్రతియోధునిఁగన్. ౧౩౪

ఉ॥ ఎన్నికఁ గన్నవారె దనుజేంద్రుని బంటులు వానరేంద్రు క
న్నన్న మెలంగువారిఁ గొని సంయుగము న్బొనరించి రిందఱం
దెన్నఁగ నిట్టు లట్టు లన నేరికి శక్య మగున్ రణంబు సం
పన్నము రోమహర్షణము ప్రాజ్యము కీర్త్యము నై ప్రవర్తిలన్. ౧౩౫

క॥ అన్యోన్యజయాకాంక్షు లనన్యాదృశములుగఁ బోరి రాపోరితపు
న్విన్యాసం బెన్నం జను నన్యము లన్యముల చూవె యగరాజసుతా! ౧౩౬

ఆ॥ కేశశాద్వలములు గిఱికొన నట్టెలు కాష్ఠసంచయములు గాఁగ రక్త
నదులు వాఱె బిట్టు పొదలుచు హరిరాక్షసాంగజనిత లై రణాంగణమున.

క॥ అంగదునిం గదఁగొని యాజిం గనలున మోఁదె నింద్రజిత్తు పవిఁ బ్రస
క్తిం గేరు దాని నెన్నక యంగము వెనిచిన యమర్ష మన నై పెలుచన్. ౧౩౮

ఆ॥ వాఁడు వాని స్వర్ణవర్ణనీయరథంబు నూడ్చి రథ్యసమితి నుక్కడంచి
సారథిని వధించి సరభసుం డై యార్చె నమరు లర్చ్యుఁ డీతఁ డనుచుఁ బొగడ.

తే. మూఁడు బాణములం గ్రుచ్చి ముమ్మరింప నాప్రజంఘుని సంపాతి యవనిఁ గూల్చె
నశ్వకర్ణశరంబున నా నటంచు సచివు కరలాఘవము విభీషణుఁడు మెచ్చ. ౧౪౦

తే॥ జంబుమాలి రథస్థుఁ డై యంబరభవుతనయుని స్తనాంతరంబు బెల్చన నగల్చె
నతఁ డలిగి యాతని రథంబు నతనితోడఁ జూర్ణిత మొనర్చి యార్చెఁ బ్రసూనకలిక.

చ॥ ప్రతపనుఁ డార్చుచు న్నలుని పైఁ బఱతెంచి శరప్రపాతముల్
వితత మొనర్పఁ దత్ప్రదర విద్ధుఁడు వాఁ డది లెక్కసేయ క
ద్భుతముగ వాని గ్రుడ్లు దలతోఁ గొనగోళ్ళఁ బెకల్చి వైచెఁ బో
రిత మిది బెట్టిదం బని యరిప్రకరం బొగిఁ బిచ్చలింపఁగన్. ౧౪౧

తే॥ గ్రసన మొనరించు ప్రఘసునిఁ గాంచి సేన రభస మెడలంగ నైన వ రాకు నెంచి
స ప్తపర్ణంబునన వానిఁ జక్కడంచి మించె వ్రేల్మిడిఁ బ్రథితుఁ డమ్మిహిరసుతుఁడు.
ఆ॥ ఆగ్నికేతుముఖ్యు లానల్వు రుద్ధతు లడరి రాము ముంచి రస్త్రవృష్టి
నగ్నిశిఖలఁబోలు నన్ని తూఁపుల వారి జముని బ్రోలి కనిచె జనవిభుండు.
ఆ॥ అడరు వజ్రముష్టి కని మైందుఁ డొకముష్టిఁగూల్చె దాన నవనిఁ గూలె నసుర
వాని తేరు పేరు వారువంబుల తీరుగాన రాద కలదె గతియు మీఁద. ౨౮౫
క॥ పురగోపుర మ టాతఁడు దెరలినఁ బలుదెబ్బు లైన దితిజబలముల౯
బోరిగొనె సితఁడు సమక్షముధరాధరం బట్టు లేచి ధరవరతనయా. ౨౮౬
క॥ నీలు న్నీలాంజనరుచిజాలు౯ జలదంబు రవి ప్రసక్తి నికుంభుం
డోలి శరములఁ గరమ్ములయాలీల౯ వ్రీలఁ గొట్టి యార్చెం బెలుచ౯. ౨౮౭
క॥ మఱిమఱి కరలాఘవ మేర్పఱచిన శరశతము లతనిపై నెఱసిన న
క్కఱ తోఁపకునికిఁ గని పనిసెఱిచితి ననె నసుర నవ్వ సెలవులఁ బాఱ౯.
ఆ॥ నీలుఁ డడరి విష్ణునెఱి నాతనిద యైన రథము చక్రమున నరాతిశిరము
నఱికి వైచెఁ దో న నాథుండ ననకుండ యంతతలయుఁ దఱిగి యనువుసూపె.
క॥ అశని సమస్పర్శుండపుడశనిప్రభు గిరిశిఖాప్రహతుఁ జేయఁగ ని
ర్వశుఁ డయ్యు వాఁడు ద్వివిదునిస్వశరాశనిశితములం బ్రసక్తు నొనర్చె౯.
ఆ॥ క్రోధమూర్ఛితుండు కోవిదుం డాద్వివిదుండు దుడఁగీడ! పండు మనుచు
సాల మొండు దెచ్చి చదిపెరక్కసు రథ రథ్యసూతయుతు సురల్నుతింప.
శా॥ విద్యున్మాలి రథస్థుఁ డై వితత మా వేగంబున స్స్వర్ణపుం
ఖద్యోతమ్ముల నమ్ములం బఱపినం గాలుష్య మొప్ప న్హరి
ప్రద్యోతుండు సుషేణుఁ డేచి విపుల గ్రావంబున న్వాని సం
పద్యోగాకృతి స్యందనోత్తమము నిర్భగ్నంబుఁ గావించిన౯. ౨౯౨
క॥ గదఁ గొని గనుకనినిల నిలబ్రదికితె యసురా! యటంచు బలుశిలఁ గొని య
వ్విదితుఁ డరుదేర రాక్షసుఁడది ప్లవగోత్తముని వక్ష మంటఁగ విసరె౯. ౨౯౩
ఆ॥ ఘోర మాగదాప్రహార మాతఁడు లెక్కసేయ కెదిరి నిలిచి ఛాయఁ గాంచి
వాని గుండె వగుల వైచె గుం డెదఁ బిండిఁ గొట్ట నసుర మడిసెఁ గోమలాంగి.
తే॥ దేవదానవయుద్ధంబు తెఱఁగుసూపు నమ్మహాయోధనమున దైత్యౌఘ మట్లు
నాశ మందంగఁదొడరెఁ గీనాశుఁ డడరి కీశరూపముల్గొనెనన్న కీలుదోఁప.
ఉ॥ భగ్నములయ్యెఁ బెన్గదలు పట్టసతోమరఖడ్గశక్తులు
ద్విగ్నములై పడెం గరులు దీర్ణములౌ రథరథ్యసంతతుల్.
మగ్నము లయ్యె రక్తఝర మాంసచయాంకితపంకమం దసం
భుగ్నతఁ గీశు లాశరులు ఘోరనఁ బో రొనరించు నత్తఱి౯. ౨౯౬

తే॥ చెడియుఁ జెలుపనచూతు రోచెల్ల యాపి సాచు లద్దాన నద్దానిఁ బూచి మాయ
దేమనఁగవచ్చు సంగరం బింతనంత సంద్ర మెదిరించు నను సడిసన్నఁ గాంచె.
క॥ కరితురగస్యందన వానరాసురాంగచయశకలనాళాస్రఝరిక్
ధర వైతరణీనదితో సరిపోల్పఁగ నయ్యె నాప్రచారమునఁ జెలీ! ౨౫౮
ఆ॥ చామర గ్లహుగులు చక్రాక్షయుగదండములు పతాకలును సమూహ మగుచుఁ
జెప్పఁదేలె నారుధిర ఝరపూరంబు పైని నెగసిపడెఁ గబంధవితతి. ౨౫౯
క॥ ఆమాయులు తనువులు దిన గోమాయుసకంకగృధ్రకూటగ్రహముల్
గామాయ త్తతఁ జేరఁబడెఁగా మాయట్టిరు వచింపఁగా రది మగువా! ౨౬౦
ఉ॥ ధ్వస్తసపత్నులా హరివతంసుల ఘాటి నిరస్తశౌర్యులై
ప్రస్తరపాతజాసృగుపపన్నసమస్తశరీరభాగులై
ప్రస్తవికాసులై నిలువఁజాలమి వీడఁగరామి నెంచి సూ
ర్యాస్తమయాభికాంక్షులయి రాశరులోశరజన్మమాతృకా!
తే॥ సంగతుం డయ్యె నయ్యె నస్తంగతుండు కాలగతి త్రోవరాని దా కారణమున
రవి యఖిలసుఖకారిణి రాత్రి వచ్చెఁ బ్రాణహారిణి యై వారి పాల బాల! ౨౬౨

రాత్రియుద్ధము.

తరల॥ పరజయాభిరతు ల్పరస్పరబద్ధవైరులు ఘోరు లా
సురులు వానరు లుద్ధతిం దటి చూచి యేచి ప్రచార మ
బ్బురముగాఁ దటియంగఁజొచ్చిరి పోరు దారుణ మయ్యె న
ప్పురుసునం జగమెల్ల నేకటఁ బ్రాకె నే మని చీఁకటుల్. ౨౬౩
క॥ రక్కసుఁడవా యనుచుఁ గపులక్కపివా! నీ వటంచు నారక్కసు ల
ట్లుక్కుమిగిలి తమపేళ్లను వక్కాణించుచు నె పోరువారైరి సఖి!
ఆ॥ తలఁగె దేల యెదిరిఁ దాఁకి విదారింపు మడఁచి యిడుము పొడువు మలుకవీడఁ
బోకు మనెడు నుడులు పోరఁబోరి వినన య్యెఁ దుముల మైన రాత్రి సమరమునను,
క॥ కాలు ల్కాంచనకంకటచేలుల్ రక్కసులు బిట్టుచీఁకటిలోనే
శైలము లోషధిలతికాజాలోత్థము లల్లు దృక్ప్రసక్తి కయి రుమా! ౨౬౬
శా॥ ఆదుష్పారతమంబులోనఁ బొలదిం డ్లాక్రోశ మొప్పార ను
న్మాదౌద్ధత్యము మీఱ వ్రాలి కపుల న్మ్రందింప భక్షింప దు
ర్వాదంబు ల్పచరింపఁజాలి రయి రవ్వా డెంచ కవ్వైరుల
క్షోదక్షోదములం బొనర్పఁ గపిలాక్షుల్పల్లచేఁ గోళ్లచేఁ. ౨౬౭
ఆ॥ అగ్నిశిఖలఁ బోలు నవ్వారి ధ్వజముల హాటకోచ్చయముల హయచయముల
గరుల స్యందనముల గ్రచ్చిరి వ్రచ్చిరి విఱిచి రడఁచి రావవీరు లడరి. ౨౬౮

తే॥ మారిమసఁగిన యట్టులై మారిమసఁగిరాశ్వికుల నశ్వములతోడ హాస్తిపకుల
హాస్తిపకులంబుతోడ సమస్తవైరిసంచయ మసంచయము గాఁగ శైలచరులు.
ఆ॥ అగ్గిపిడుగు లట్టు లాశీవిషము లట్లు జెట్టిదమ్ము లరివిభేదకమ్ము
లమ్ములనిచి యనిచి యారామలక్ష్మణు లసురవిసర మొకట నలఁచి రగజ.
క॥ దృశ్యాదృశ్యంబుల సంపశ్యులు వా రడఁచుచుండఁ బ్రభుతేజము సం
దృశ్య మన నయ్యె నయ్యెడ రాశ్యుచితం బగుచు నయ్యరాతితతులకున్. ౨౭౧
తే॥ వానరుల నావహించె నవ్వసుస విభుని శక్తి యని యెంచి రమరు లా సక్తి నెఱయ
నల్ల లాడంగఁ దొడరె నయ్యసురసేన సారసేనాధినాయక జనని! వింటె.
వ॥ వెండియుఁ బ్రచండతర తురంగఖురవిధ్వస్తంబును రథనేమిక్షతదేశదత్తహాస్తంబు
నగు రణభూమిపరాగంబు పరాగంబుల ముంపంజాలి యుద్ధ్యన్మహాయోధుల
కర్ణనయనంబుల యయనంబులఁ గప్పం జెప్పరాని ముప్పునం బడియుఁ దప్ప
రానిద యగు తమతమకంబు గూర్చు నెఱిన పోరం బో రతిఘోరంబును రోమ
హర్షణంబును. బ్రవృద్ధతర్షణంబు నై యొప్పార నందు రుధిరోదలు నపరోధలు
నగునదు లుద్భవిల్లె భటఘనార్భటులం దెసలు ఘూర్ణిల్లె. శంఖభేరీమృదంగ
పణవవాద్యనిస్వనంబు లొక్కటఁ బిక్కటిల్లె నక్కదనంబునకుం బఱతెంచు
వారును. నఱచువారును బఱచువారును మలయువారును బొలయువారును.
నగు పేరుగల వీరుల సన్నాదంబు లవ్వానితో సంవాదం బొనరించె. శక్తిశూల
పరశ్వధాదులచే నిహతు లగు వానరుల కళేబరంబులును బర్వతశిలాపాతం
బులచే నిపాతితు లగు రక్షఃపతిసపక్షుల భూషణోచితావయవంబులును గొడు
గులు బడగలు నమ్ములు హారమ్ములును హారితపుష్పాద్యుపహారమ్ములుగా
రణమేదినీరంగం బొరుల యంతరంగంబులకు దుర్జ్ఞేయంబు దుర్నిరీక్ష్యంబు శ్రద్ధా
యితంబు నై యద్భుతంబునాఁ గనుపట్టె నప్పట్టున. ౨౭౩
క॥ హరిరాక్షసహారిణి యైహరిహరి యాకాలరాత్రి యనఁ దగె నారా
తిరి యెల్లభూతముల కదిదురతిక్రమ గాఁగ నట్లు దోఁచున కాదే. ౨౭౪
క॥ శరవృష్టులు గురియుచు నాశరు లాదాశరథి నెదురఁ జాల్కొని రొగిఁ బై
మిరికాపత్త్రియు సరి యగు తెరువున కొకపరి మరల్చు దివ్యర్షినుతా. ౨౭౫
తే॥ అట్లు క్రుద్ధులై రాముపై నడరువారి ఘోషణలు భీషణలు గాఁగఁ గొఱలసయ్యె
నాఱు సంద్రంబు లొక్కట నమ్మహార్ణవంబు సారఁబొఱు కల్పకా లంబనంగ.
వ॥ దుర్ధర్షులు దురాసదులు మహాకాయులు నగు యమశత్రుమహాపార్శ్వమహోదర
వజ్రదంష్ట్రశుకసారణు లను నమ్మేటిమగ లాఱుగు రొక్కటం జక్కఁజేరి యుక్కు
మీఱి యురవడించిన. ౨౭౬

మ॥ భువనాధీశుఁడు రాముఁ డయ్యొఱక వహా ప్రేరేంచి తాత్కాలి కం
బవపాతంబు సహించి యాఱు గుఱిగా నా ముల్కులం బూంచి యొ
క్క విశేషం బెద నుంచి వారి నెఱఁకు ల్గాడంగ వీడంగ నా
యువె యొక్కించుక దక్కఁ దక్కరని నయ్యోధు ల్సముద్విగ్ను లై. ౨౭౮

ఆ॥ వారిరథము లీడ్చు వరరథ్యముల యొర కవల రాము శరము లగ్నిశిఖల
యగుచు దెసల వెలుఁగులనువొందఁగాఁ జేసె విశ్వరూపకలన వెరవుపడఁగ.

ఉ॥ క్రోపకె క్రోవ నై యెదిరి దుండఱికంబు గుణించుకొంచు న
ష్టైవిధ నెంద ఱింద్రరిపు లేడ్తెఱనూపఁ దొడంగి రన్నెఱిం
బావకుపైనిఁ బన్ను శలభంబులభంగి నశించి చేరి కా
దేవున కెగ్గుసేసి తమదిట్టతనం బెలయింప భామినీ ! ౨౮౦

ఆ॥ స్వర్ణపుంఖములు విశాలకీలంబులు నైన రాము శరము లడరుచుండ
ఖద్యుతు ల్సెలంగె ఖద్యోతములు శరద్రాత్రి నాగ నాఁటిరాత్రి నగజ. ౨౮౧

ఆ॥ వారులు రక్కసులును బరగించు పరవళ్ళనడరు నిస్వనముల నాత్రియామ
ఘోర ఘోరతమయునై రాపు రూపించెనిలఁ ద్రికూట మింక నెలయ దనుచు.

క॥ నింగిం దద్దరకందరలండ లెడలి కూలఁజొచ్చె నా కూటము లం
దుండెడు వారి విధికి వేఱొండు గతియుఁ గలదె యమ్మహోచ్చధ్వనులన్. ౨౮౩

క॥ మొఱవెట్టఁ గో యనుచు స త్త్వఱి గిరి యాలించువారె తారసిలరు వే
మఱు గ్రుక్కరాని తమయక్కఱదెసఁ గొసకొంద్రు గాని కమలామోదా.

క॥ గోలాంగూలులు తమమునసాలీలన తసరువార లతికాయులు స
మ్మేలసమున రక్కసులను జేలావునఁ బొదివివెస గ్రసించిరి గౌరీ ! ౨౮౫

క॥ అమృతము ద్రావిన యట్లుగ నమృతాన్నాంశభవు లీడ్య మగు చేవఁ బ్లవం
గము లరిబలముఁ జతుర్థాంశము శేషముగా మడఁచిరి సంయమివంద్యా! ౨౮౬

ఉ॥ అంగనఁ డింద్రజిత్తు నటు లంగదసా లొనరించి వాని స
ర్వాంగములుం దళించి నిహతాత్మునిఁ జేయఁ గడంగునంతలో
దొంగ యతండు కట్టెనుటఁ దోఁపకపోయె నిరశ్వయంత్రృకం
బంగవిహీన మైన రథ మచ్చట డించి మహాహవప్రియా !

తే॥ వాలిపుత్రుని మెచ్చెడు వారె కాని వైరిసోక విచారించు వారు లేరు
యుద్ధమున వానికడఁగ సహేంద్రు లమరు లెఱిఁగియున్నారు తా రిన్డు మఱచినారు

తే॥ ప్రణుతి సేసిరి రామల క్ష్మణుల సురలుమునులు సంగదు బలువెంచి ముచ్చటించి
ర ట్లనేకు లనీకపు లాదరమున జయజయేత్యుక్తు లాడిరి శమలశమని ! ౨౮౯

ఆ॥ బ్రహ్మదత్తవరముఁ బాటించి యతఁ డట్టు లంతరమ్ముఁ గాంచి సంతమసము
గవియు వారి ముంపఁగాఁ దేల్పఁగాఁ జూచుచుండె గండుమిగిలి యుత్పలాక్షి !

క॥ అందఱఁ గనుఁగొని యాశ్రితమందారము దాశరథి సమందహాసితుఁ డై
ముం దరసి పలికె నిటు లరవిందానన వింటె వాని విశ్రుతగుణముల్. ౨౯౧

సీ॥ అఖలపూజ్యుఁడు బ్రహ్మ యసుర కిచ్చెను వరం బద్దాన ముజ్జగం బలఁచె వీఁడు
మనపాలఁ బడినాఁడు మలసి తా నీనాఁడు తద్వచఃకలన యాథార్థ్య మొలయ
వలయు మీ రంతకు వానరేంద్రుని పీడకుండుఁడు దెబ్బలెంచి యోసరిల్లి
క్షమియింపఁ దక్కొంట శమియించ నా వెంట వలను గన్గొని తెల్పువాఁడ నింక
ననుచు బ్రాహ్మ మస్త్ర మవధాని యై మదిఁ జేర్చి యానవహిల్లు చేటువంకఁ
జూచుచుండె నతని సూనృతం బాకనోటఁ బొగడఁదర మె చిత్ప్రబోధమహిత!

శా॥ ఇంతీ! కర్కశుఁ డట్లు రావణసుతుం డేనోమయుం డట్లు తా
నంతర్ధానము నొంది రాఘవుల మాయామోహవిభ్రాంతులం
బంతం బొప్ప నలంతు నం చలుక మైఁ బాటించి వజ్రాశని
క్రాంతంబు ల్పరఁగింపఁగాఁదొడరె వీఁ కం దీక్ష్ణబాణౌఘముల్ ౨౯౩

ఆ॥ సర్వభూతముల కసందృశ్యుఁ డై యట్లు కసిమసంగి సర్వగాత్రములను
దాశరథుల నొగి విదారింపఁగాఁజొచ్చెఁ గూటయోధి వాఁడు కుధరతనయ ౨౯౪

తే॥ కాద్రవేయమ్ములనె బాణగతికిఁ దార్చి యందుకౌద్రమ్ము బ్రాహ్మమ్మునలవరించి
యంతరము సేసి యమ్మేయి నస్త్రతతుల నన్నదమ్ముల బంధించె నానతాంగి.

క॥ కన్నులపండువుగా నాయన్నలఁ గనుఁగొనుచు సమరమందు మెలఁగు సం
పన్నులు వానరవరు లాపన్నుల నవ్వేళఁ గని రపధ్వాంతకలా ౨౯౬

ఆ॥ ఎదిరి నిల్వఁజాల రెవ్వారలేని నా కట్టి జోలి యేల యని తలంగి
యప్రకాశగతుఁడ నై వారి సాధింతు నని తలంచి యింత లతఁ డొనర్చె.

క॥ సౌమిత్రీ బ్రహ్మాస్త్రము తో మనుజాశిసుతు నిపుడ ద్రుంతు ననె విభుం
డామాట విని తలఁకె వాఁడాముదలఁ గొనం డదేమి యభిమానంబో. ౨౯౭

ఉ॥ అమ్మేయి బద్ధుఁ డై రఘువరాన్వయుఁ డింత యెఱింగి వాని నా
నిమ్మరయంగఁ బంచెఁ ద్రిదశేంద్రసమానులు చిత్రకర్ము లా
దిమ్మరి వ్రావు పోక గని తెల్పుఁ డటంచుఁ బదుంద్రుఁ గీశసిం
హమ్ములు వా రధీశ్వరుని యానతిఁ గైకొని హృష్టచిత్తు లై. ౨౯౯

వ॥ సుషేణదాయాదయుగనీలాంగదశరభర్షభవినతజాంబవత్సానుప్రస్థఋషభస్కంధు
లనువారు భీమనగపాదపాదపంబుల మూఁపుల మోపుకొని దశదిశలరయుచు
నాకసంబు సొచ్చి యవ్వాని యవస్థానంబు నెమకి పడయం జూచునవసరం
బున. ౩౦౦

క॥ ఆవేగవంతులం గనియావేగము నెఱయఁ దొంటి యావేశముతో
నే వేగవత్తరేషువులే వేఁగడలుకొనఁ జేసె నిషువిద్వనుతా. ౩౦౧

ఆ॥ భీమవేగయుతు లభీకు లా నవ్వారు వానివలనఁ గనిరి వారణంబుఁ
గానరైరి వానిఁ గాలికావృతు భాను నట్టు లంధకార మలముకొనఁగ. ౩౦౨

క॥ తరముతరముగా శరములువరఁగి తనువు లొరయ విన్నబాటు గదుర నే
వెరవును దోపమి గమికొనిధరపైఁ బడి రార్తు లగుచు ధరణీధరజా! ౩౦౩

ఉ॥ అంతట రామలక్ష్మణుల నంతకసన్నిభుఁ డాశరుండు వి
భ్రాంతులఁ జేయుపొంటెఁ బ్రదరంబులు మేనుల నించి సించి యెం
దంతగ మింత చొప్పడని యట్టు లొనర్చె రుషాక్తరక్తనే
త్రాంతుఁడ వై కడల్కొనెడు నార్పులు నేడ్పులు మిన్నగల్పఁగన్. ౩౦౪

క॥ క్షతమార్గంబుల రక్తస్రుతు లొప్పఁగ దత్తనువులు సొగయక సంపు
ష్పితకింశుకతరువులలో వితండ మొనరింపఁదొడరె విధిముఖవినుతా! ౩౦౫

క॥ భిన్నాంజనచయకల్పుఁడుద న్నదలో మెచ్చుకొనుచు దాశరథులతో
నన్నైర్బృతుఁ డిట్లనెఁ గ్రుధఁబన్నిన తమమున నెడాఁగి పర్వేందుముఖీ. ౩౦౬

ఆ॥ యుద్ధ మిట్టు లోల మొంది యే నొనరింపశక్రుఁ డైన నల్ల చక్రధరుఁడ
డైనఁ జేర నేర రన మీరు నరు లెంతవారు న న్నెదిర్చి వలను నెఱపు. ౩౦౭

క॥ ఈ మిమ్మిరువుర శరజాలామయసంగ్రస్తతనుల ననుతు జముని దా
సీమకుఁ దొడ్పడువా రెవరామెయి విదళింతుఁ గ్రోఁతు లందఱ నొకటన్. ౩౦౮

క॥ అని రామలక్ష్మణుల వాఁడనిన ట్లొనరించి ఘోర యగు శరసమితిన్
దనియక చొనిపెను మర్మములను భేదింపంగ మఱియు లాస్యోల్లాసా! ౩౦౯

క॥ కన్నెత్తి చూడఁజాలనియన్నెఱికిం గూర్చె వారి ననవద్యుల సం
పన్నుల న్వనవేత్తజ్ఞులనన్నియతికి నియతి గలదె యఖిలవిధాత్రీ. ౩౧౦

ఆ॥ నవ్వఁదొడరె వెడఁగు నటనము ల్సొనరించెనన్నదమ్ము లిట్టు లై రటంచు
వాఁడు వార లమరవరు ధ్వజమ్ములు ముక్తదామకములు వ్రాలుదారిఁ దూల.

వ॥ వెండియు నాపరిచారుండు వీరశయనశయాను లగు నవ్వీరవరుల నెమ్మేనులు శర
వేష్టితసర్వాంగంబులు పరమపీడితంబులు నై జలప్రస్రవణంబుల పోల్కి నస్ర
జాలంబుల స్రవింపం జేయుచుండ నంగుళీమాత్రం బేనియు నంతరం బనరాక
యవిద్ధంబును, నవిభిన్నంబును, నస్తబ్ధంబును నగు తలం బని లేక వీకఁ నెడ
బంగరుపిడులు నిశితాగ్రంబులు. సన్నోగతంబులు నైన యాశుగంబుల నారాచం
బుల నర్ధనారాచంబుల భల్లంబుల నంజలికంబుల వత్సదంతంబుల సింహదంష్ట్రిం
బుల క్షురంబులఁ జేతులతీఁట వోనం బరవసంబునఁ బఱపి పఱపి గ్రొచ్చిగ్రొచ్చి
విదళించివిదళించి యీరెండును మద్బాణతూణంబు లయ్యెం జూఁడీ. ము
న్నింద్రునిం గెల్చినది గెలుపు గా దిదియే పదిలం బైన యదియని ఘననిస్స్వన
సంవాదంబుగా సింహనాదంబు సేసిన. ౩౧౧

ఆ॥ తొలుత బాణతల్ప మొలసిన యన్నదుర్ధర్షు రాముఁ బూరుషర్షభుఁ దన
కన్ను లెత్తి చూచి గతిసెడి యేడ్చుచు నాస లెడలఁ దమ్ముఁ డవనిఁ బడియె.
చ॥ హరివరు లట్లు వీరశయ నాంతరసంగతులం గరస్ఫుర
త్ప్రరుచిరవిజ్యచాపుల నపాపులఁ గన్గొని కన్గొన ల్సొనల్
పరువిడ నశ్రుపాతములఁ బొల్పడఁజేయఁ బ్రతప్తులై పొరిం
బొరి విలపించి రంబరము భూమియుఁ గాంచుచు మించు నెవ్వగన్. ౩౧౪
ఆ॥ వాఁడు విసువు లేక వర్షించి వర్షించి ఘనుఁడవోలె నొక్కగతి దలంచి
యుండఁగా విభీషణుండు సుగ్రీవుండుఁ జేరఁబోటి రచటు సింహవాహా!. ౩౧౫
క॥ అందఱుఁ గనుఁగొని రసురుం డెందడఁగినవాఁడొ యనుచు నెఱుఁగ రయిరి ని
ష్పందితు మాయాచ్ఛన్నుఁ గనందివిరె విభీషణుఁడు కనత్తత్ప్రతిభన్. ౩౧౬
క॥ అప్రతిమకర్ము నాతనినప్రతిభటు నప్రతిక్రియావిష్టు నయ
శ్రీప్రవణుఁడు గనె మాయావప్రాంతరవస్థితు న్నివారితదురితా! ౩౧౭
ఆ॥ వాని వరము పూచి వఱలుట విక్రమం బసమ మగు టసమ్మునట్లు గనుట
వీరవరులు నేల వివశత నుంటయు నతఁడు తలఁచి తెగువ నందఁ డయ్యె. ౩౧౮
క॥ అంతట నే నెక్కటి సామంతుఁడ నైతి నని నిక్కి మఘవరిపుఁడు శ్రీ
మంతుల నవనిశయులఁ గనియింతిం తనరాని యరుస మెసలారంగన్. ౩౧౯
క॥ పరిపార్శ్వగతులు రాక్షసవరభటు లుప్పొంగ వారివల నరయుచు నె
ల్లరు విన నిట్లనెఁ దనదగుపరాక్రమము నెగడుభంగిఁ బాటలగంధీ!. ౩౨౦
సీ॥ కంటిరే దూషణు ఖరునిఁ జంపినవార లతిబలాఢ్యులు వీరె యన్నదమ్ము
లారామలక్ష్మణాహ్వయులు ధరాశయు లై యున్నవారు నిరాశయులుగ
మద్బాణపాతము ల్మలయించె నిమ్మోయి బంధనమ్ముల వీడుపాటు గూర్పఁ
దెలియ రింద్రాదులు దివిజర్షు లసురులు మొనసిరయేనియు మొత్తములుగఁ
దండ్రి దేనికతన దరిలేని చింతతోఁ గడపు రేయి సెజ్జఁ గనఁడు హాయి
గలఁక లంక వాన కారున నేఱు నాఁ గాంచె నయ్యనర్థగతి తలంగ. ౩౨౧
క॥ ఈయందఱ విక్రమణములాయెన్ శరదంబుదముల యార్భటు లట్లే
పోయె న్నిష్ఫలములుగా నాయంబకములు గడల్కొనం జల మెడలన్. ౩౨౨
క॥ అని వారలతో నొడువుచుఘనదర్పుఁడు వాఁడు సర్వకపిసైన్యపులన్
మొనకొనె నిర్భేదింపఁగననితరశరముల స్మరప్రియార్చితచరణా!. ౩౨౩
సీ॥ నీలునిఁ దొమ్మిది వాలమ్ములం గ్రొచ్చి మైందద్వివిదుల సమ్మదము చెరల
మూఁడు మూఁడులుఁగులు మొనయించి యలజాంబవంతుని వక్షమ్ము పగులనొకటి
పరఁగించి హనుమనిఁ బదిబాణముల నొంచి శరభు గవాక్షుని జంట జంట
తూఁపుల బడలించి యేపారు నంగదు ననుచు గోలాంగూలనాథు నట్లు

చిచ్చుకొనలు సడలు సేకొన్న ములుకులు పెక్కు లేసి యేసి పెం పెడల్చి
పెచ్చుపెరిఁగి యార్చెఁ బిఱుఁదీని మగఁటిమి యగ్గలింప రావణాత్మజుండు. ౩౨౪

ఉ॥ వారలఁ బీడపెట్టి పరివారము నొత్తిలఁ జేసి స్వీయు లౌ
వారలతోడ నిట్లనియె వాఁడు ప్రహాస మెసంగ నిప్పు డీ
వైరుల బంధము ల్గెడపు వా రిల లేరు నశింతు రంతలో
సారబలు ల్నృపాత్మజులు సందియ మందకుఁ డించుకేనియున్. ౩౨౫

క॥ పెరవార లేని విసములు పిరిగొన నీల్గుదుర కాని పెంపెనయరు నా
దుర మిది పరవిధ్వంసకమనుచే యమృతాశినాథుఁ డంతలు పడఁడే. ౩౨౬

మ॥ అనునంతం బ్రమదంబు విస్మయము నెయ్యం బొయ్యన న్దోఁప వా
ర నువాదించిరి మేలు మే లని జగం బట్టిట్టుగా నెట్టనన్
ఘనగర్జ ల్నెలకొల్పి రంతకును నేకప్రాభవం బొప్ప నీ
కని ప్రార్థించిరి సన్నుతు ల్నెఱపి రయ్యర్థార్థు లర్థేశ్వరీ! ౩౨౭

క॥ ఊర్పులు నిగుడింపక యేయార్పులు నేర్పులును లేక యడఁగి మడఁగి యా
మార్పునఁ బండిన నృపతులస్వర్పతిసన్నిభులఁ గాంచి సంబర మొదవన్. ౩౨౮

ఆ॥ వీరు మడిసినారు వీరివా రింకను మడియువారె యనెడు మతి దొలంక
వాఁడు చనియె సపరివారుం డగుచు లంక సేరఁ గన్నవాని చిత్త మెలయ.

క॥ ఆసమితింజయుఁ డట్టులువో సన్నాహంబు సెడఁగఁ బొలిసితి నని ని
శ్శ్వాస సము లెడలించుచు విశ్వాసార్హుఁడు కీశవిభుఁడు వడఁ జేడ్పడుచున్. ౩౩౦

క॥ ఆరఘువీరవరేణ్యశరీరాంగోపాంగములు సిరిం గోల్పడి దు
ర్వారవిశిఖముల పాల్పడిభారము మోచుకొను వెంటఁ బడి దుఃఖితుఁ డై. ౩౩౧

—♦ నాగపాశబద్ధులగు రామలక్ష్మణులఁ జూచి సుగ్రీవుఁడు దుఃఖించుట ♦—

క॥ ఏ నేల బ్రదికినాఁడనొ యీసరపతు లిట్లు గాఁగ నింతకు ననుచున్
జానెడల నేడ్చెఁ గన్నులసోనలుగొని బాష్పజలము చోత్తేరంగన్. ౩౩౨

క॥ ఆతఱి నాతనిఁ గనుఁగొనియాతతసత్త్వుండు దానవాధికుఁ డొఱుకం
బ్రాతిస్విక మగు తత్త్వంబేతాదృశ మెనయఁ జేసె నేణాంకముఖీ! ౩౩౩

—♦ విభీషణుండు సుగ్రీవు నూరడించుట ♦—

సీ॥ బాష్పవేగం బింత పరఁగనీయకు మయ్య యడరండఁబోదు నీయట్టివారు
సంగరంబుల జాడ చర్చింప నిట్టిద కాదె యొక్కని దౌనె కలిమి చెలిమి
మనభాగ్య మించుగ మలయఁగాంచిన గాంతు రిమ్మహాత్ములు మోహ మెడలఁ దెలివి
నీయనాథుని నన్ను నెలయింపవలవదే ని స్సనస్థాపింప నీవ కావె
సత్యధర్మాభిరక్తు లౌ సజ్జనులకు మృత్యుకృత మగు త్రాస మెమ్మొయిన యేని
గలుగ దందురు మీఁదటి గతిని గూర్చి మంచి దలపోయు మింక నామాటవినుము.

క॥ అని నీటం జేయిడి యాతని మేల్కాంచెదోయిఁ దుడిచి తద్దయు జలము
లొని విద్యామంత్రజపంబొనర్చి దృగ్జాగ్రజనప్రయోజన నెఱపెక్॥ 33౫
ఆ॥ అట్లు మొగము నిమిరి యాధర్మమూర్తి ప్లవంగమాధినాథు వలను గాంచి
సంభ్రమం బడంచి సమయోచితంబుగా నిట్టులనియె మదగజేంద్రగమన ! 33౬
వ॥ కపిరాజేంద్రా! యియ్యది వైక్లబ్యంబు వలగొను కాలంబు గాదు సుమీ ప్రియ
సఖా! యియ్యకాలంబున నట్టి యతిస్నేహం బవలంబించినచో నదియుం
బ్రాణావసానంబు నుపకల్పింపం జాలి యుండు నట్లుగావున సర్వారంభవినాశ
కరంబు లగు నకార్యకారణంబుల తెరువు విడనాడి ససైన్యు లగు నిమ్మాన్యుల
హితంబునకై మంతనంబున ననుచింతింపుము. కాదేని నవ్వీరవరేణ్యు లిరు
వురుం బ్రబోధం బెనయునంతవట్టు వీరలం బరిపోషించుకొను జతనంబున
నుండుము. లబ్ధసంజ్ఞు లగు నీకాకుత్స్థులే మనభయం బపనయింపంగలవారు.
మాయాకల్పితం బీశస్త్రబంధంబు రాము నొండొక్కం డేమియుం జేయం
జాలదు. గతాయువులకు దుర్లభ యగు లక్ష్మి యిమ్మహాత్ముని వదనంబు
వదలక పొదలుచున్నయది. యింతయుం దలంచి నీకై నీ వూరటగొని బలం
బూరడిల్లఁ దెఱంగుపడుము తగినభంగి నే నెల్లకర్జంబులుం దిరిగి చక్కపడు స
ట్లొనరించువాఁడ హరివరేణ్యా! చూచితే యాహరివీరు లడరున విప్పారుకనులం
బిత్తరిచూపులు చూచుచుం బులకితాంగులై నిక్కవీనులతోఁ జీమచీటు
క్కనినం దెరలుచు నొండొకండ్ల కర్ణప్రాంతంబుల మూఁతు లిడుచున్నవా
రట్టట్టు దెల్లాడు నన్నుఁ గాంచి వీఁ డింద్రజిత్తె యను తలంపునం గాబోలు.
త్వరపడుము సంజ్ఞాపనంబున నవ్వారి వారింపుము భుక్తపూర్వం బగు సుమమా
ల్యంబుకరణిం బ్రాసం బెల్లరుఁ ద్యజింతురుగాత మింక నరుసం బొడఁగలుగున్
మని యాతని నవ్వేరవున ముచ్చటల హెచ్చరించి యారాక్షసేంద్రుం డగు
విభీషణుండు కాందిశీకం బగు ననీకంబు సమాశ్వాసింపం బ్రివర్తించుచుండె
నయ్యవసరంబున. 33౭
క॥ మాయావి మేఘనాదుఁడు పాయని కుతుకమున స్వీయబలయుతుం గొని తా
నీయుఱవునఁ దండ్రి యెడరు మాయింపం జనియె లోకమాన్యచరిత్రా! 33౮
ఆ॥ లంక సేరఁగాంచి లావరి వాఁడు సాశంకుఁ డైన గుహుని యుంకపాళి
నొరయఁ దఱియ నరిగి యొర నెక్కొని మ్రొక్కి దోసిలొగ్గి ప్రీతిదొనుకఁ బలికె.

—♦ఇంద్రజిత్తు రావణునకుఁ దన పరాక్రమమును వెల్లడించుట.♦—

క॥ నీ విట్టు లైతి వెవ్వరిభావంబునఁ జేర్చి యొండు పడయని మదితో
నా వెరవరు లిప్పుడు నాచేవంబడి రవని నింత సిద్ధం బఢిపా. 340

మ॥ అనునంతం దన యున్కి వీడి తనయుల్ హర్షోద్గతిం గౌఁగిలిం
చి నిమేషాతిగదృష్టి మేకొన ధృతి శ్రీ మించి శీర్షంబు మూ
ర్కొని నాయన్న! యలంచితే రిపుల నీకోపంబు రూపించితే
తనయానృణ్యముఁ బెంచితే జగములం దార్కొణగా నిత్తతిన్. ౩౮౧

ఆ॥ అనుచుఁ బొలసుదిండు లందఱు విని పొంగ పీనివలనఁ గులము వెలసె నని పొ
సంగఁ బలికి యడిగి సర్వవృత్తాంతంబు వార కతఁడు దెలుప వలనుగాంచి.

వ. హర్షవేగానుగతాంతరాత్ముండై యమ్మహారథునిం బొగడినయట్ల పొగడుచు నా
శరనాథుండు దాశరథివలని సంజ్వరం బెడలి కడలి దాఁటితి నని యుబ్బుమైఁ
బ్రబ్బుకొనె నంత నచ్చట

ఉ॥ అంతలు సేసి రావణి యనంతరుఁడై చన నార్తులయ్యుఁ దా
రంతకుఁ జాలు మేలి భటు లంగదజాంబవదాదు లట్టు లా
భ్యంతరుఁ డంజనాత్మజుఁడు నందఱ నెక్కొనఁజేసి వారి సం
భ్రాంతతఁ బాపి రాజసుతరక్షణముం బొనరించుచుండఁగన్.

క॥ పెరవారు శిలలు ద్రుమములు సరభసులై తాల్చి తృణము చలియించిన నా
శరు లేగుదెంచి రని మొగ్గరము గరము దీర్చుకొను రకంబున నుండన్. ౩౮౫

తే॥ రావణుం డంత నంతఃపురమున కరుగుమని సుతుని వీడి క్షితిసుత నరయుచున్న
రాక్షసస్త్రీలఁ బిలువ బిరానఁ బనిచె సేవకజనంబులఁ బ్రహృష్టభావ మొప్ప.

ఆ॥ వార లేగి తెలుప వచ్చి రచ్చటికిఁ ద్రిజటయు మున్నుగాఁగ శాసనమున
కగ్గమైన వృత్తి నవ్వారు వారితో నిట్టు లనియె రాక్షసేశ్వరుండు. ౩౮౭

ఉ॥ వింటిరె యింద్రజిత్తు పృథివీపతిసూనులఁ గూల్చి వచ్చె నా
కంటక మూఁడె నిప్పటికి గాదిలితమ్మునితోడ రాముఁ డా
పంటవలంతిపైఁ బడి విపాకము దోఁపఁగ నున్నవాఁ డి కే
మంటినొ నాక చెల్వుఁడు ధరాత్మజ కిత్తఱి వర్తమానమున్. ౩౮౮

ఆ॥ పుష్పకమున నునిచి పూబోఁడిఁ గొనిచనియానదీఱ నతని నరయు మనుఁడు
రామ నిచ్చ లెవని రాకఁ గోరుచు నన్ను లెక్కసేయకుండె నుక్కివమున. ౩౮౯

తే॥ నేఁడు కాలవశత్వోపసీతు రామునతనితోడిద గతి యని నట్టి తమ్ముఁ
గని నిరాశయై యొండొక్క గతియు లేకతనకుఁ దాన కా! నాకుపొత్తైనయకున్నె.

క॥ భగ్నాశంకయు ననముద్విగ్నయు నిరపేక్షయు నయి వెర వెంచి గుణా
భుగ్ననవాలంకృతిసంలగ్నమనోగతుల నన్ను లాలించు బలే, ౩౯౧

ఆ॥ అనుచు మూర్ఖుఁ డాదురాత్ముండు రావణుఁడాడు తోటుకు లెంచి యటు లొనర్చు
వార మనుచుఁ దరలి వరవిమానముఁగొనివచ్చి రయ్యశోక వనికఁ దఱియ. ౩౯౨

ఉ॥ దేవికి వార్తఁ గూర్చి యుప దేశ మొనర్చి లతాంగి భర్తృశో
కావిలఁ బుష్పకాఖ్యమున నల్లనఁ జేర్చి ప్రసక్తి దోఁపఁగా
భావిని యైన యా త్రిజట భామకుఁ దోడయి రాఁగ ద్యోగతిన్
ద్రోవక వారలయ్యెడకుఁ దోడ్కొనిపోయిరి స్త్రైణభూషణా! ౩౬౩

ఆ॥ వెఱ్ఱివాఁడొ మేలివెర వింత గలవాఁడొ కాని రావణుండు కలన లొప్ప
లంక నప్పుడపు డలంకరింపఁగఁ బంచె నెల్లయెడలఁ బడగ లెత్తుఁ డనియె.

క॥ మనయింద్రజిత్తుచే దురమున వినిహతు లైరి సుభట ముఖ్యులు రఘునం
దను లని పురమున నెల్లెడననువొందఁగఁ జాటఁబంపుఁ డనె సత్వరుఁడై. ౩౬౫

యుద్ధరంగమున ససైన్యబద్ధు లయిన రామలక్ష్మణులఁ గని సీత విచారపడుట.

తే॥ అట్లు గొంపోయి రణరంగమల్లఁ గాంచి సీత కెఱఁగించి రాశర స్త్రీలు కీశ
సైన్యము నిపాతితం బైన జాడతోడ సొలసి రఘువీరు లొరఁగిన చోటు గూడ.

క॥ మునుకొని ప్రహృష్టమానసులను బిశితాశులను జూచె లలితాంగి ప్లవం
గనివహ మతిదుఃఖార్తంబనంతరం బరయఁగనె భయాకుల యగుచున్. ౩౬౭

సీ॥ శరతల్పముల నడిసన్న లేర్పడకుండ నొరఁగి చిత్తరువు లట్లున్నవారి
ప్రేలిడ సందేడఁ గ్రాలు ముల్కుల శర స్తంభంబు లివి నాఁగఁ దనరువారిఁ
బుండరీకాక్షు లీపురుషులు స్కందవిశాఖు లం చనుటకుఁ జాలువారిఁ
బెందూళి గ్రమ్మినఁబృథుకాంతి మేల్బంతి వీడ దొనను ఖ్యాతి వెలయువారి

తే॥ నమరతుల్యు స్వభర్తఁ దదనుజు లక్ష్మణాఖ్యుఁ గనుఁగొని బాష్పశోకాభినిహత
యై వితర్కంబు నెఱయ ని ట్లనియె సీత లోకమాత సుమంగలాలోకమహిత.

క॥ కరుణము లగు నప్పలుకులఁ గరుణామయు లట్లు దెలుపఁగా నేర్తురె యో
సురుచిరమూర్తీ! నీ వాతెరు వడిగిన నేనె పూనితిం ధార్ష్ట్యమునన్. ౩౬౯

క॥ జ్ఞానులు లాక్షణికులు దన్నా నెఱిఁ బుత్రిణియు మంగళాంచితయు నగున్
మానిత యిది యని రవ్వారినొప్పైన నన్నృతవచనులే యైరొక్కో ౩౭౦

ఆ॥ యజ్వమహిషి యిది మహాసత్రికి సుపత్ని యనిరి లక్షణంబు లాసి నన్నుఁ
గూర్చి యంతలేసి కోవిదు లట్టివా రనృతవాదు లైరె యకట నేఁడు. ౩౭౧

ఆ॥ నాసవిత్రి మోల నాసంశ్రవణమునస్మితదృగాదు లొలయు సిరులనెంచి
యిది శుభాత్మ యంచు నెల్లకార్తాంతికులాడి రదియు మిథ్యయనఁగవలసె.

తే॥ వీరపార్థివపత్నివి వీరజనని వట్లు నిర్వేలవిభవ వీ వౌదు వనుచు
మునులు దీవించి రమ్మోయి ముచ్చటలకు గతి యొకండు నున్నె విభుఁ డిట్లుగాసిపడిన.

క॥ నాపదముల నీపద్మములీపగిది న్వెలయుచుండ నేపాపం బీ
యాపదఁ గూర్చెం బతితో దీపింపదె యిట్టి సతి ప్రథితరాజ్యమునన్. ౩౭౪

ఆ॥ విధవ తాదు రెట్టి వికృతచిహ్నంబుల నింతు లట్టి దోసఁగు లియ్యెడలునఁ
బడయనేర రెంత పరికించియును మేలి లక్షణములె నిష్ఫలంబులయ్యె. ౩౧౮
సీ॥ తథ్యనామాంకితపద్మములు మత్స్యదములు సమసీలసూక్ష్మలక్ష్మములు కురులు
కలియవు భ్రూమలు జంఘ లరోమశములు వృత్తము లవిరల నాదు దంతపంక్తి
శంఖము ల్నేత్రిము ల్హయములు చరణమ్ము లూరువు గుల్ఫమ్ము లుపచితములు
స్నిగ్ధంబు లనువృత్త శిఖనఖసమము లంగుళు లెడయదు పీనకుచయుగంబు
మగ్నచూచుకము నిమగ్న యుత్సంగిని నాభిచితము లురము ననుచు కెలఁకు
లధికమణిప్రభంబ యూ మేని వర్ణ మట్లంగరుహము లెన్న సతిమృదువులు.
క॥ అడుగు లటు వ్రేళ్ళు ధరపై నెడలేక ప్రతిష్ఠితత్వ మిూప న్నెంతుం
బడయును పడయదె యిన్నటిపడఁతుక యెందుం బ్రతిష్ఠ భవ్యాత్మిక యై.
ఆ॥ అలరు పాణిపాద మరుణవర్ణంబు సమగ్రయవపదం బసంత రాళ
మిదియె రాజ్యలక్ష్మి యెల్లసామ్రాజ్యమ్ము నేలఁజాలు భర్త నెనయు ననిరి.
క॥ నాచిఱునవ్వు మొగముఁ గనియాచతురులు పలికి రిట్టి యంగన పతితో
సాచివ్య మొప్ప సకలశుభోచితరాజ్యాభిషేక మొలయు నటంచున్. ౩౧౯
ఆ॥ నాతలంచినవియు ననుచు పెద్ద లెఱింగి పలికినవియు వ్యర్థభావ మెనసె
నేమి గలదొ దీని కింక నపూర్వ మా కర్మ మెంచిచూడఁ గానఁబడదు. ౩౨౦
క॥ ముప్పొలము లెత్తివచ్చినదప్పక గెలుపుసిరిఁ గొనఁగఁ దావల మట దా
నప్పాటం బడియుండఁగ నిప్పగిదిం గాంచుచుంటి నే మానితనే. ౩౨౧
క॥ ఆనెవ్వగ లెగయ జనస్థానము శోధించి వార్తఁ దడవి యసుతరం
బౌ నీరధి సాధించి యహీనులు గోష్పదము నంది యిట్లు పడుదురే. ౩౨౨
ఆ॥ అల్ల బ్రహ్మశీర్ష మాగ్నేయవాయవ్య వారుణమ్ము లైంద్రవరశరమ్ము
మున్ను గాఁగఁ బెరసి రన్నదమ్ము లమోఘ పాతకృతుల వీరి పాల నవియు.
ఉ॥ మాయలమారి వాఁడు మటు మాయ మొఱంగి తొఱంగి యప్పుడే
మాయెనొ వానరూపముల నన్నను దమ్ముని నిట్లు సేసెఁ గా
కేమెల పెట్టి యైన నిల నెంచినచో విదలించివైవరే
పాయక కాలదండమును బట్టిన జెట్టినయేని నాజిలోన్. ౩౨౪
క॥ మన్నాథు దృష్టిపథమునఁబన్నిన రిపుఁ డెట్టులేని బ్రదికిచనంబోఁ
డెన్నఁగరాని మనోజవమున్న ప్రణరంగమున మహోగ్రుఁడ యైనన్. ౩౨౫
ఆ॥ కాలమునకు లేదు గద భార మాకృతాంతుండు దలఁప నెందు దుర్జయుండు
గాక యున్నఁ బోర ఘనుఁడు రాముం డిట్లు వడునె యొకనిచేత భ్రాతతోడ. ౩౨౬
ఉ॥ నాపతి కంతగా వగవ నాథుని సోదరు లక్ష్మణాఖ్యు ని
ష్పాపునిఁ గూర్చి య ట్లడలఁ బావని దల్లిఁ దలంప నాదుమే

నీపగిది న్నశించు నని యెన్నఁ దపస్విని యైన యత్త బి
ట్టూపెడు వంతపా లగుట కుమ్మలికమ్మన ప్రగ్గిపోయెదన్. ౩౮౮
ఆ॥ తలఁచుచుండు నాదు దైవతం బాయన తమ్ముఁగూడితోడఁ దరుణితోడ
రాముఁ డెప్పు డెపుడు రాఁగలవాఁడొకో వ్రతము పరిసమాప్తి వఱల ననుచు.
క॥ ఎవ్వారి కేమి యున్నది మవ్వము సెడఁ బడిన వీరు మఱి యెట్టెట్లో
నొవ్వెద బ్రదుకుఁగాంచెడునవ్విధమే లేదయేని నాదటి సొదలోన్. ౩౮౯
ఆ॥ సీత నాఁడె చనియె శ్రీరాము నెడఁబాసియువిద యొంటుచోట నుండు నదియె
యన్ని కష్టదశల ననుభవింపఁగఁ దోఁచినట్టి దీపిసాచి యనఁగరాదె. ౩౯౦
తే॥ అనుమఁ డటు దెల్పి చనిన యీ యంతరమున నాస బాధించె దాన నిట్లనద నైతిఁ
గాక రక్కసిచేపడ్డ కాలముననె మేను బాయని దీజంత మేలు గనునె. ౩౯౧
ఆ॥ తీఱె ఋణము నాకు దేవున కద్దారిమాయదారి మొకము మలసినంత
రామ! రామ! యంచు రహి జపించుచునుంటి మై దొఱంగ కేమి మబ్బు పడెనొ.
క॥ అనుచు విలపించు నాయమఁగని త్రిజటాభిఖ్య యెఱుకఁ గన్నకలనతోఁ
దన నిరతి సెడని యాధృతిమనమున నిద్దంపుఁ గరుణ మలసి నెరయఁగన్. ౩౯౩
ఆ॥ కనుల నీరు దుడిచి కల్యాణి! నీ విట్లు వగలఁ బొగులనగునె వాసిసెడదె
నీదుభర్త బ్రదుకు నెఱిఁగాంచియున్నాఁడునాదు పలుకు లరసి నయము గనుము.
ఆ॥ తగినకారణములు తరుణి! యే వచియించునవి మహత్తరము లనంతరములు
రామలక్ష్మణులు విరామమ్ము లే కింక మేలుకాంత్రు మేలుపాలు గొనుము.

—♦ త్రిజట రామలక్ష్మణులు బ్రదికియుంటకు తగు కారణము లెఱిఁగించుట ♦—

క॥ తమపతి మడిసిన యోధులు సుముఖతఁ గాంచుదురె దెసలు చూడఁజనరె బీ
రము సారము నెలకొలిపెడునమర్షపుం దెఱఁగు మెఱయ నట్లు నిలుతురే ౩౯౬
మ॥ కలదమ్మా! నిహతప్రధాన యయినం గాలూన కాసేన దా
జలధి న్నిర్గతకర్ణ నౌకయటు లోజం బాయనోఁగాక యా
చలము న్వీడక తొంటిచందమున నౌజ్జ్వల్యంబు పెంపార మే
ల్కలన న్నెకొ్కనుచుండ నోడ్డఁబోదువం గార్కొంట మార్కొంటయున్. ౩౯౭
క॥ సేనఁ గనుఁగొంటె యెమ్మెయి నీనాథునిఁగాచుకొనుచు నెఱి నున్నది యో
చాన! యసంభ్రమతాధృతులూని ప్రవర్తించు దాని యురవల్పంబే. ౩౯౮
ఆ॥ పుష్పకాఖ్య మిది సుపూజ్యంబు దివ్యంబునగు విమాన మట్టు లైనవారి
నువిద ! మోఁచిచనఁగ నొల్ల దియ్యానవా లంది కల్లనిజము లరసికొనుము.
తే॥ ఏను బ్రీతి నివేదించుదాన సదనుమానములు నానుడులు నమ్మి మనుము మేలు
గాంతు వెల్లవిధముల నీకాంతుఁడే జయించు నింతయు నీమది నెంచు మెలమి.

ఆ॥ అనృత మేను నొడువనమ్మ! యేనాఁడునుదర్శనంబు లొరసి తథ్య మరసి
పలుకుదాన నాదు భావ మొందితివి చారిత్రశీలములఁ బవిత్ర వగుట. ౩౯౧

క॥ సుర లసురు లేక మైనంశురమున నన్వీరవరులు దొసఁగొందరు కా
వరు వరము పరపు నవ్విగ నురవడఁగినవార లట్టు లున్నారుసుమీ! ౩౯౨

సీ॥ సన్న తేనున్న నీసంజ్ఞానమూర్తు లిట్లుండదు లక్ష్మి తమ్ములసియుండ
గతసత్త్వజీవితు ల్గాఁగ వారల మోములందు వైకృత మప్పుడపుడ తోఁచుఁ
దమ్మ మాయావి శరమ్ములు గ్రమ్మిన నినరవ్రాయెడు తీరు నెఱపినారు
మూర్ఛితు లివ్వారు మొనయఁ బోవుచునున్నవారు నెట్టనఁ దనరారు తెలివి
శోకమోహంబు లెడలి త్రిశుద్ధ వగుచునిష్టదేవత భావింపు మెల్లగతుల
మేలుగాంచెద వొండెదఁ బోల దింకసుదతి నాపల్కుబడి మేల్మి చూచికొనుము.

క॥ అనునంతం బ్రాంజలి యైయనుపమగుణశీల బాల యవుగావుత మ
ట్లనవద్యము నీస్నేహమునిచితి సఖి యనియె నిత్యమహితోల్లాసా ౩౯౪

ఉ॥ గీష్పతి శిష్యురా లనఁగఁ గీర్తిత యాత్రిజటాఖ్య యంతఁ దాఁ
బుష్పకము న్మరల్చుకొని భూసుతఁ జేర్చె నశోకసీమ న
బ్బాష్పపినద్ధనేత్ర నెరిఁ బాపె నలంతలు వాయు నింకిటన్
గోష్పద మాను రామునకుఁ గోమలి! యీదుర మంచుఁ దెల్పుచున్. ౩౯౫

ఆ॥ రావణాజ్ఞ మెయిని రాక్షసీజనము మున్నెట్టు లట్లు సీత నెనసి నిలిచె
విభుని కుశల మెపుడు విందునో యనుచు నద్దేవి చిత్త మెరియఁ దివురుండె.

మ॥ శరబంధం బతిఘోరమ ట్లెనసి భూశయ్యాశయాను ల్మహీ
శ్వరపుత్రు ల్రుధిరోక్షితు ల్తతరజస్సంఛన్నదేహు ల్ఫణీ
శ్వరసామాన్యతదోఁప బున్న లిడుచుం బన్నుండ సుగ్రీవుఁడుం
బరివారంబును గొల్చియుండిరి మహాప్రస్తార మొప్పారఁగన్ ౩౯౬

ఆ॥ శోకదీర్ణమానసుల యయ్యు నవ్వా రుదీర్ణఘోషు లగుచు దెసలు గనుచు
నొరులఁ గలఁచు నిర్ణయోద్వృత్తి నుండిరి దైవసాహ్య మొదవు తఱిఁ దలంచి.

—♦ రాముఁడు తెలివొంది లక్ష్మణుఁ గూర్చి శోకించుట ♦—

క॥ అంతట మేల్కాంచె వారల సంతాపము దీఱ రామచంద్రుఁడు శరబం
ధాంతరితుఁ డయ్యు బీర మనంతము సత్త్వమును నిజమహత్త్వముఁ దెలుపన్.

ఆ॥ మేలుకొనియుఁ దనదు మేలు కోరఁ డదేమి వత్సలతయొ కుఱ్ఱవాఁడు దమ్ముఁ
డటులె వ్రాలియుండె నసృగుక్షితుఁడు క్షితి దీనుఁ డగుచు ననుచుఁ దెలియఁగాంచి.

సీ॥ సీతతోఁ బని యేమి జీవితం బింకేల వీఁ డిట్లు పడియుండ వెరవు గలదె
స్వాజఁ బోలిన సతి సాంపరాయికసఖుఁ డిట్టి తమ్ముఁడు నెందు నేని లేరు

సౌమిత్రి మేల్కాంచు జాడ పొల్పడినచో నే నుసు తెడలెద నింద తెలియఁగఁ
గాకున్న నటఁ జని కౌసల్యతోడ నే నే మందుఁ గైకయో మెట్లు గందుఁ
దా సుమిత్ర పుత్రదర్శనలాలస వేపమాన యగుచు విధముఁ గాంచి
యట్లె కురరి యట్టు లాక్రోశ మొనరింప నూఱడింప నొక్కఁ డురవు గలఁడె.

వ॥ అంతటివాఁడు శత్రుఘ్నుండును యశస్వి యగు భరతుండును గూడినచ్చిన తోడేడి? వీడి రానేల వాఁ డెందుఁ దడసె ననిన నోరు మూసికొందుం గాక సుమిత్రయేమందు నెట్టైన సుమిత్ర యుపాలంభంబు భరింపఁజాల నట్లుగాన నేనును మేను విచ్చోటునన వైచితినేని సన్నియుం జక్కవడు సౌరా రా యెంత కుష్కృతకర్ముండ నైతి. న న్ననార్యు నిందింపవలదే నానిమిత్తంబునన కాదె యీ యుత్తమసత్త్వం డిమ్మెయిం దుష్టాసురనిహతుం డై భూశయ్యం గతాసునియట్లు పడియున్నవాఁడు లక్ష్మణా! నిచ్చలు విషణ్ణు నయ్యనాథు నూఱడించువాఁడ విప్పు డూరకుంటి వేమి బలమఱి పలుకనేరవా? యనసానంబు గూడ మఱచితినా? చూచితిరా? యివ్వీరుండు పలువురు రాక్షసుల భంజించి కాలయోగంబునఁ బరనిహతుం డై యాయిల్లాప్రదేశంబునన తానుసుశరతల్పంబున శయనించి శరజాలనిచితుండు శోణితపరిప్లుతుండు నగుచు నస్తంగతుండు గాఁబోవు భాస్కరుననుకరించుచున్నవాఁడు బాణాభిహతమర్ముం డగుట కతన నభిభాషింపనేరకున్నను నంతస్స్రంతత యగు రుజనెల్ల నిజదృష్టిరాగంబుచే సూచించుచున్నాఁడు. న న్ననుసరించి కాననంబునకు వచ్చిన యిచ్చెలిమికాఁ డెపుగు నన్నెట్లును లేనట్టు లిచ్చమెయిన పోవలవదే యిష్టబంధుజనుం డీతండు నాతోడివాఁ డై యొల్ల చేడ్పాటులకుం బాల్పడి నెట్టన సమ్రతుం డై తుట్టతుదకుం గిట్టఁడె నైన నాయనిర్ణయంబున నిట్టియవస్థకు సముపస్థితుం డైనాఁడు. మహాస్నిగ్ధుం డైన యీతం డెంతటిరోషం బలముకొనెనేనియు జలముపైనేనియు న్నాయోలం బగు సంబు విప్రియంబు నగు సంభాషణం బొనరించి యెఱుంగఁడు. అభియోగంబు నం బ్రబలుం డై సహస్రశరంబుల నేకవేగంబునం బంచశతశరంబులం బరఁగించు నక్కార్తవీర్యునికన్న మిన్న యై యిన్నెఅజాణ యిరుచేతులన యన్నెఱి నన్నియిషుకాండంబులం బ్రయోగించి యెన్నికఁ గన్నవాఁడు. బలారి యస్త్రంబుల నేనియుం బ్రత్యస్త్రంబుల సురాళింపంజాలు నిమ్మేటిమగండు సూటిదప్పిన యిప్పాటున వీటఁబోయి మహార్హ శయనోచితుండయ్యుం గటికినేల నలుంగులమొత్తనొత్తిగిల్లినవాఁ డింతకన్నఁ బాపంబు గలదే. విభీషణునకు రాక్షసరాజ్యంబు సంఘటింతు నని పంతంబు నెఱపి నేరక యూరక రెంటికిం జెడిన రేవనిం గావించి మిథ్యాభిలప్తుండ నైతి. నయ్యది యియ్యదనుసం దన్ను దహించుచున్నయది సుగ్రీవా! న న్నెడఁబాసిన నిన్ను వేసరి యగు రావణుండు గాసిసేసి పరాభ

వింపకయ మున్న సరాళంబుగా సంగడుం బురస్కరించుకొని ససైన్యసుహృజ్జనుండ వై నీలనలాదులుం దోడ్పడఁ బ్రతినివర్తించి సంద్రమ్ము దాఁటుముపొమ్ము. హనుమంతునిచే సాధింపఁబడిన దెల్లఁ గరం బన్యదుష్కరంబ. ఋక్షరాజు యువరాజు గోలాంగూలాధిపుఁడు మైందద్వివిదకేసరిసంపాతిసేనాపతిసేతునిర్మాతృప్రభృతులు మదర్థసమర్పితశరీరు లైనవారు దైవం బతిక్రమింప మానుషుల కశక్యంబ. శక్యం బైనయంతవట్టు ధర్మభీరుండ వైన నీవు వయస్యునిచే సచివునిచే నెరవేర్పఁబడఁదగిన యాయాకర్జంబులం బూని యార్జవంబునం బ్రవర్తించితివి. వానరర్షభులారా! మీ యోపునంత వఱకు మిత్రకార్యం బనపవార్యంబుగా నడిపించితి రిట్టి వినిపాతంబు చూపట్టుటం జేసి నాచేత ననుజ్ఞాతుల రైతి రింకం జనుఁ డెందేని మనుం డనుచు నిస్త్రాణుఁ డగు నయ్యార్తత్రాణశరణ్యుం డశరణ్యుని యట్లార్తుం డై యసమంజసంబుగాఁ బలుకు నవసరంబున— ౪౦౨

క॥ కనుఁగొలుకుల నీ రెడలఁగ సనుపము లవ్వాసరేంద్రు లందఱు నట్టె
వుని గాంచుచు నప్పలుకులు వినుచు న్విలపించి శోకట విధి నాడుగనుచుఁ.

ఉ॥ అయ్యెడ నయ్యనీకముల నన్నిఁటి నెట్టనఁ బట్టి మున్న యా
దయ్యము ప్రేటులం బడిన తత్పతులం దగ నూఱుకొల్పి తాఁ
జయ్యన నేగుదెంచె గద సంభ్రమ మూనఁగఁ బాల్చి రాముపై
నెయ్యము మీఱ రక్కసుల నేర విభీషణుఁ డోలిగింపఁగన్. ౪౦౪

శా॥ నీలాద్రిం బురుడింప నంజనచయోన్నద్రత్వముం బెంపఁ బా
నా లీలం బఱచేయు వానిఁ గని డాయంబోలు భీతిం గపుల్
చాలం బ్రాలెడు వాఁడె రావణి సుఁడీ చర్చించుట ల్మానుఁ డిం
కేలా రెంండెడ కేగరాదె యని పో నిట్టట్టు లై రత్తఱిన్. ౪౦౫

మ॥ హరిరాజయ్యది గాంచి తేజుబలమొయ్యం గ్రాలనిట్లీల దు
ర్భరవాతాహతి నొక పోలె వ్యధితత్వం బందెదున్ సేన స
త్వర మొస్నంజను నాఁగ నంగదుఁడు తావన్మాత్రమే యాదారల్
శరజాలాచితు లౌట తచ్చలనముం జర్చించెదే నావుడున్. ౪౦౬

శా॥ పుత్రుం గాంచి యినాత్మజుం డవును లే పో యీనిమిత్తంబు నే
నాత్రాసంబున కౌను హేతు వని యొయ్యం గాంచు న ట్లైదు నే
యాతం బొప్ప విషాదవన్ముఖులు నంత్యక్తాయుధు ల్పోల్లస
న్నేత్రుల్లాఁ జనువారలే ప్లవగు లున్నేయాంశ మి ట్లుండునే. ౪౦౭

ఆ॥ ముందు వెనుకఁ జూడ మున్కొనఁబోక యొంగ డొరుల లంఘనముల కోటుపడక
విప్రకర్షణమున వెఱపు సి గ్గనియు లే కట్లు పఱచునదియె హరిబలంబు. ౪౦౮

క॥ అనుచుండ నావిభీషణుఁ డనుపమగుణుఁడరుగుదేర హరిరాజిది యూ
నని జాంబవంతునిం గని ఘనబలమున కింత దెలిపి మలయించు మనన్. ౨౦౯
ఆ॥ అతఁ డరిగి యిట్టులౌదురే మన విభీషణునిఁ గాంచి యనుచుఁ జనెదు వారి
నాఁగి యందఱకు నయం బొప్పఁ దెలిపినఁ దిరిగి వారలెల్లఁ దెలిసికొనిరి. ౨౧౦

—♦ వి భీ ష ణ వి చా ర ము ♦

ఉ॥ సన్నుతుఁ డౌ విభీషణుఁడు సంభ్రమ మొప్పఁగ రాము లక్ష్మణున్
సన్నుతుఁ డై కనుంగొని విచారము దోఁపగ నిమ్మహాత్ము లీ
పన్నగబాణబంధముల పాల్పడి రెట్లు విముక్తిఁ గాంతు రం
చెన్నుచు శోకపూరహతి నిట్టటు లై మది దిట్ట దేలఁగాన్. ౨౧౧
తే. హస్తము జలార్ద్రి మొనరించి యారఘూద్వ
హుల నయనయుగ్మముల నెయ్య మొప్పఁ దుడిచి
యధికతరశోకసంపీడితాత్ముఁ డగుచు
నతఁడు విలపించె నప్పు డోయులరుఁబోఁడి! ౨౧౨
ఆ॥ కూటయోధు లైన కూళలు రక్కసు లొప్పించి యియ్యవస్థఁ బంచి యిడిరి
సాంయుగీను లధికసత్త్వులు సద్ధర్మపరులు నైన యట్టి నరవరులకు. ౨౧౩
ఉ॥ అన్నకుఁ బుత్రుఁ డీతఁ డన నయ్యెను బెద్దల పేరుపోవ య
న్నన్న కుపుత్రుఁ డట్టి జను లౌ నన రక్కసబుద్ధి నిట్టు లీ
యన్నలఁ దోఁచె నార్జవ మయమ్మ నయమ్మును గల్గువారి నే
మన్నను బోల దిందఱును నైతి మనాథుల యట్టు లీక్రృతిన్. ౨౧౪
ఆ॥ శరశతముల వీరు సంవిద్ధు లై వీరు లస్రసిక్తు లగుచు నవనిఁ దెరలి
శల్యకముల యట్లు సందృశ్యమాను లై యున్నవార లింక నొకటి గలదె. ౨౧౫
ఉ॥ ఎవ్వరి వీర్య మూతఁగొని యేను బ్రతిష్ఠఁ గొనంగ నాదు నం
చవ్వరదార్ఢ్య మొప్ప ననయంబు నయంబున మించినాఁడనో
యవ్వసుధాధినాథులు మహాత్ములు రిత్తరిత్త ముష్కరు
ల్నవ్వఁగ నెవ్వగంబడి యనాథులపోలెఁ బరుండి రేమనన్. ౨౧౬
ఆ॥ ఏను బ్రదికి బ్రదుకు లేనివాఁడను నష్టనిఖిలతర్షహర్ష నిర్ణయుఁడను
నైతి నాసపత్నుఁ డైన రావణుఁ డఖిలార్థకామనిరతుఁ డయ్యె నిపుడు. ౨౧౭
క॥ అని వగచునతని హరిపతి గొని పరిరంభణ మొనర్చి కోవిదుఁడవు నీ
వనఘ! యిటు లౌదె యింతకుమును దెలిపితి గాదె నాదుమోహం బెడలన్.
ఆ॥ సందియంబు లేదు సకలధర్మజ్ఞుండ వందువాఁడ వీవ యఖిలరాక్ష
సాధిరాజ్యపదము నగు లంకయు సనాథయగుల కోర్కి పార మరయఁబోదు.

తే॥ ఆత్మయిక మొందువారు గారన్నదమ్ములీమహాత్ములు మోహ మియ్యెడదొలంగి
రణమున వధింత్రు సగణు రావణు నటంచుఁ ద్రికరణవిశుద్ధి తగ నీవు తెలిసికొనుము.
క॥ అను సాంత్వనమున నాతని ననువొప్పం దేర్చి శ్వశురు నఖిలజ్ఞు సుషే
ణునిఁ గనుఁగొని యిట్లనె నయ్యినతనయుఁడు ప్రాభవం బనిదృశ మొలయన్. ౪౨౨
ఉ॥ విక్రమవంతు లైన హరివీరులు గొందఱు తోడరా దొరల్
సక్రమలబ్ధసంజ్ఞులగు జాడకుఁ దోడ్పడ నోపి నీదు త్రై
విక్రమలీల గ్రాల మనవీటికి వీరలఁ గొంచుఁబొమ్ము నే
శక్రవిరోధిఁ జంపి సిరి చొప్పున మైథిలి రాముఁ జేర్చెదన్. ౪౨౨
క॥ అని తెలిపినఁ గగ్జముతెఱఁ గనుపద మతఁ డెంచి యిట్టు లనె నాతనితో
ననఘా! యిక్కాలం బేనసుమానించిన విశేష మభివర్ణింతున్. ౪౨౩
సీ॥ తొల్లి దేవాసురు ల్తొడరి పోరంగఁ బో రతిఘోరతరమునా నడరుచుండ
వేల్పుల బహుశస్త్రవేత్తలు దానవు లొరసి యాయువుపట్టు లురలఁ జేయ
నాబృహస్పతి వారి నరసి యార్తుల హతసంజ్ఞుల నిహతులఁ జక్కఁబఱుప
సన్మంత్రవిద్య లోషధు లుపాధులు గాఁగ వర్తించె నెప్పటివలను మలయ
గెలుపు గాంచి సురలు వెలయు నయ్యవి యెల్ల క్షీరసాగరంబు జెనయుచంద్ర
మట్లు ద్రోణసంజ్ఞ మగు గట్టుపట్టునందునిచి రాత్మనీన లని యెఱింగి. ౪౨౪
తే॥ అమృత మొదవిన ఱెంకియు నదియకాన నోషధిప్రకరం బందె యుండు నెపుడు
సరణి సంజీవకరణి విశల్యకరణి ముఖ్యములు వానిలోన నిమ్ములు ఘటింప.
క॥ అవి గొనితేరఁగ నిపుడే జవమున నరుగనగువారు సంపాతిముఖుల్
ప్రవరుం డందఱిలోపల నవిహతగతి వాయుసూతి యమ్మెయిధృతికిన్. ౪౨౫
క॥ అన విభుఁ డానతి సేసిన హనుమానుఁడు వల్లె యని ప్రయాణ మొనర్చెన్
జనితానందంబున నొడ్లును నే మే మనిరి ధర్మలోలమనీషా! ౪౨౬
వ॥ అట్టియెడ. ౪౨౭

—♦ గ రు డా గ మ న ము ♦—

సీ॥ మెఱుఁగుఁదీఁగెలతోడి మేఘబృందంబులు దెరలి దిక్కులకు బోదెలు వొనర్ప
నబ్ధిలో రసపూర మట్టిట్టు లై యిలపైఁ జల్లుపోరాటఁ బరఁగఁజేయ
మేదిని పొదలు నమ్మెయికిఁ దజ్జములు మహాద్రుమములు సంద్రమందు ప్రాల
స్థలజలజంతువు ల్సంభ్రమపడి యంతరాంతరం బెనసి యుండడఁగి చనఁగ
నొకముహూర్తమున నె యుద్భవిల్లిన యట్టు లరుగుదెంచె వినత వరతనూజుఁ
డెల్లవాన రేంద్రు లిది యుజ్జ్వలాగ్ని తేజం బనంగ గరుఁడుఁ డంబరమున. ౪౨౮

ఉ॥ బంగరుఱెక్క లగ్నిశిఖభాతి వెలుంగుల నీను మేను శ్రు
త్యంగమయంబు లంగము లహర్పతితేజము వాయువేగ ము
ప్పొంగెడు శీతరశ్మిరుచి పోఁడిమి మెచ్చని మోము సత్కృపా
పాంగతరంగితేక్షలు మహాత్ముఁడు తార్క్ష్యుఁ డితండె యహా ననన్. ౪౩౦
ఆ॥ తఱియవచ్చువాని తత్త్వ మారసె నేమొ యస్త్రప్రభావ మెనసి యాపురుషుల
బద్ధులం బొనర్చి పరఁగెడు ఫణు లెల్ల విద్రుతంబు లయ్యె విశ్వజనని ! ౪౩౧
క॥ ఆమాయ లెల్ల నాయెడ నేమాయెనొ కానఁబడక యెడ సెఁ దడసి రా
నేమో యామెయిపురుషుండామాయఁ దలంప నజునకైనం దరమే. ౪౩౨
మ॥ అభినందించె సుపర్ణుఁ డాఘనుల నొయ్యం జేరి వా రట్లు ప్ర
త్యభినందించిరి వాని నాతఁ డమృత వ్యానద్ధహస్తద్వయిన్
విభు లవ్వీరల మోముల న్నిమిరె నున్నిద్రేక్షము ల్చంద్రస
న్నిభము ల్తత్క్షణ ముల్లసిల్లె నవి శ్రీనిర్వేలలీలాచితిన్. ౪౩౩
తే॥ వైనతేయకరోపసంస్పర్శమునను వ్రణము లన్నియుఁ బూడె సువర్ణము లయి
యట్లు సుస్నిగ్ధములు నయి యనుపదంబె మేను లొప్పారె మేనకోస్మిలదుదయ !
క॥ తేజము వీర్యము బల మట్లోజం బుత్సాహమహిమ మురుదర్శనమున్
బూజితధీస్మృతిధృతులును నోజ న్వారలదెస న్ద్విరుక్తము లయ్యెన్ ౪౩౫
ఆ॥ మహితవాసవోపమానుల నమ్మెయి మేలుకొలిపి వాఁడు మేలుగోరి
యెలమిఁ గౌఁగిలించె హృష్టాత్ములై వారుఁ దన్ను నలముకొనఁగఁ దరళనయన!
క॥ సకలజగదేకకల్యాణకలాసంపాదనప్రణయిసంభవుఁ డా
యకలంకమూర్తి రాముఁడు వికిరేంద్రునిఁ గాంచి ప్రీతి వెలయఁగఁ బలికెన్.
సీ॥ తాత నీదగు ప్రసాదంబున రావణిప్రభవంబు వ్యసనంబుఁ బాయఁద్రోచి
పూర్వవద్బలకలాపూర్ణుల మైతి మట్లఖిలసేనయుఁ గాంచె నభ్యుదయము
మాతండ్రి దశరథు మాపితామహు నజుఁ జూచినట్టులె చొక్కెఁ జూడ్కి మదియు
వరరూపుఁడవు దివ్యవస్త్రస్రగనులేపనుఁడవు పూజ్యుండ వెవ్వఁడవు నీవు
దెలుపుమయ్య యిట్టి తేజం బసామాన్యమెల్లభువనముల వహింపఁజాలి
యున్నయది మదీయ మోజంబుఁ బెనుపనై యెనసె నాదు సుకృత మెంతగలదొ.

గరుడకృతరామస్తుతి

క॥ అని యడిగిన నమ్మేయామనుజునిఁ గని కనుగొలుగుల మహితానందా
శ్రునివహ మెలమిం బెర్కొన ననియె మహామహుఁ డతం డహార్యవరసుతా!
క॥ నీకింకరులము యిందఱమో కరుణానీరధీ రసోజ్జ్వలమూర్తీ!
యేకరణిఁ దెలుపువారము లోకాలోకమున నీ వలోకుఁడ వడుగన్. ౪౪౦

ఆ॥ బ్రహ్మదత్తవరముఁ బాటించి యసురునకోహటించి యెఱఁగి యుంటి వీవు
బ్రహ్మ యేమిసేయుఁ బాములా బంధించునవియు శేషశాయి వైన నిన్ను. ౨౨౧

తే॥ వైనతేయుండ గరుడుండ వలనెఱింగివచ్చినాఁడ నీదగుకూర్మి హెచ్చినాఁడఁ
బరఁగినాఁడను గాదె నా బాహిరంబుప్రాణ మనుచు నీ వెన్నంగ భద్రమూర్తి!

ఆ॥ మాయికంబు దీని మాయింప నెనసితి నీయుపేక్షసేయ నెఱి నెఱింగి
యిది సురాసురులకు నింద్రున కేనియుఁబాపరాని దస్త్రబంధనంబు. ౨౨౩

క॥ మాయాబలమున వరకృతమై యొలసిన చలమునను మహాసురుఁ డిమ్మై
నోయసురారీ! పఱపెనుదాయతనము దనరఁ దద్విధప్రదరములన్. ౨౨౪

సీ॥ నీసత్త్వమునకల్మి నిలిచితి నిలిపితి నీవు దమ్మునితోడ నింతసేనఁ
బదనుకోఱలు విషోల్బణము లౌ కాద్రవేయములె యిన్నియు మాఱెనస్త్రములుగ
నధిరౌద్ర మట్లు బ్రహ్మాస్త్రంబు జతపడె ధర్మజ్ఞుఁడవ యయ్యుఁ దవులుకొంటి
విద్దాన నొడ్డైన నింతకుమున్నె భస్మీభూతు లైపోరె మెలఁగువారె
సత్యవిక్రముఁడవు సర్వాత్ముఁడవు సభాగ్యుఁడవు నీవు గోరుకొనినయట్టు
లెవ్వియును ఫలించు నిత్ధతేజుఁడవ కానెన్నియును నడంగు నింత నిజము. ౨౨౫

క॥ త్వరపడి యరుదెంచితి స్నేహరమాకృష్టి స్వకృత్య మనుపాలింపన్
గరముఁ బొనరారె నయ్యది కరముద్రాపితము త్వత్ప్రకాశ మెసంగన్. ౨౨౬

శా॥ కాని మ్మింతటివార లంచు రిపులం గాఱింప సౌ నార్జవం
బే నమ్మం దఱి నౌఁ బ్రమాద మొగి నిల్లే కూటయోధు ల్సురా
రీను ల్జిహ్ములు పాపు లం చరయ నూహింపంగ నౌఁ దండ్రి! నీ
కేనా తెల్పెడువాఁడ నీదగు తలం పెట్టట్టు వర్తింపవే. ౨౨౭

ఆ॥ నీకు శత్రులందు నెఱయు వాత్సల్యంబు ధర్మమందుఁ దవులు తఱుగకుండు
నిట్టి యెల్లలోక మెలయింపఁ బొడసూపితదియు స్మృతిహితంబ యగుటకతన.

క॥ అనుచుఁ బునఃపునరాలింగనముం బొనరించి రామ! ఘన మీభాగ్యం
బెనయందర మే నీ విదియనుమోదించినదె యనఁగ నై యొప్పనిచోన్. ౨౨౮

తే॥ అనుగుఁజెలికానిఁగాఁగ న న్ననవరతముఁబోలఁగా నేలుకొంటివి పొడవుసేసి
దొరసె సద్దాన నింతకుతూహలంబు సఖ్య మట్టిద యాఁ గాదె జగతిలోన.

మ॥ సెల వి మ్మోరఘునాథ! యాశ్రితమహాశ్రీప్రాపకా! యుద్ధసం
కలనం బంతయుఁ దీర్చి రాక్షసవిభుం గార్చిచ్చులంబోని య
మ్ములఁ బోకార్చి సబాలవృద్ధ మగు నిమ్మ న్వాని తమ్ముండు నీ
చెలిమిం జేకొన సీతతోఁ దనరు ని న్సేవింపఁగావచ్చెదన్. ౨౩౦

క॥ అని యడిగి రాముఁ డనుమతిఁ బొనరింపఁ గపు ల్నుతింపఁ బొరిఁబొరి వినతు
ల్మొనయించి ప్రదక్షిణవిధిననఘుం డతఁ డరిగెఁ బవనున ట్లభ్రగతిన్. ౨౩౧

క॥ రుజఁబాసి తీరుఁగాంచినవిజిత్వరుల నారఘుప్రవీరులఁ గని వా
యుజముఖులు యూథనాథులునిజముత్సాహంబుఁ బెనుప నెలకొని రంతన్.

—♦ నాగబంధముక్తు లగు రామలక్ష్మణులఁ గని కపు లుత్సహించుట ♦—

సీ॥ తోఁకలెత్తి విదుర్పఁ దొడరెడు వా రట్లు సింహనాదంబులు సేయువారు
భేరీస్వనంబులు బెరయింప నౌ వారు తతమృదంగధ్వను ల్దార్చువారు
శంఖము ల్గొంచు నిశ్శంకఁ బూరించువా రాస్ఫోటన లొనర్చి యలరువారు
ద్రుమము లుత్పాటించి త్రోడ్త్రోడ నడరువా రగములఁ బెకలించి యెగయువారు
రక్కసుల బెదరించుచు రాముజయముఁ బేర్కొనుచు బాటలాటలు దర్కొ మొలయ
నెఱపువారును నై కపు లతిమి రపుడు లంక వాకిళ్ళనెల్లఁ గలానిధాన! ౭౫౭

ఆ॥ అట్టు లానిశీథమం దమందమ్ములు భీషణమ్ము లైన ఘోషణములు
మొనసి యొక్కఁ డై తుముల మై నిదాఘాత్యయము మొగిళ్ళ నాదమై యెసంగె.

క॥ ఆయుత్సాహముఁ బొగడఁగ వేయుమొగంబులుగలట్టి వెరవరి కగునే
మో యొక్కని కగు ననఁగా నాయుల్లము మెచ్చఁబోదు నగరాజసుతా! ౭౫౮

ఆ॥ అనుచు మేలివార్త నభవుం డెఱింగింప విని భవాని దేవ! ననుచురీతిఁ
దెలిపినాఁడ వింకఁ దేటతెల్లము సేయు మవలి దగు గథాంశ మనుచు వేఁడ.

శా॥ మాయాతీతగుణోపలక్షితమహామాయాధిసంస్థాన! చి
చ్ఛాయాసంశ్రయసర్వలోకనిచయస్వాతంత్ర్యసామ్రాజ్య! వి
ద్యాయోగప్రసితానుభావ్య!యనవద్యా!స్వప్రకాశా!శ్రుతా
మేయానందరసస్వభావసదయోస్మిలత్ప్రభావాంచితా! ౭౫౯

క॥ అమ్నాయలక్ష్యసారసమామ్నాతకలాసమగ్ర! యఖిలజ్ఞా! ప్ర
ద్యుమ్నప్రాభవసంజ్ఞిక నిమ్నగతోద్ధరణశీలనిజసంస్మరణా! ౭౬౦

మాలిని॥ నిరవధికవిలాసా నిత్యసంపన్నివాసా! నిరసితగుణదోషా నిస్తులశ్రీవిశేషా!
విరచితబహురూపా విశ్వవిజ్ఞానదీపా! విరహితభవపాశా వేదమార్గప్రకాశా!

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రమానుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతం బైన
శ్రీరామకథామృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబునం
బంచమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయ గురవే నమః.

# శ్రీరామకథామృతము

## యుద్ధకాండము.

### పూర్వభాగము.

### షష్ఠాశ్వాసము.



మహిత ధర్మయోగ
క్షేమంకరచరణ! భక్తచింతామణి! తే
జోమండలాంతరుద్యత
కామాద్యరివర్గ నికృతి ఖండన నిపుణా!

తే॥ అవధరింపుము భక్తచిత్తానుషంగుఁ డంగజారాతి యిట్లనె నగజతోడ
రామసేన నిరత్యయభ్రాజమాన సరభసోత్సాహయాన యా సమయమునను. ౧

—రామసేనల యుత్సాహమును విని రావణుఁడు చారులఁ బంపుట.—

ఆ॥ చదురుసేసి తనదు సచివులు గొల్వఁగా నుండి దేవకంటకుండు వినియె
మానిమొకము లాఁజిమల్లులు బలియురు నింగి వగులఁ దార్చు నెఱయుఱుములు.

క॥ విని యెల్లరఁ గనుఁగొని యిట్లనె రక్కసిమన్నెకాఁ డయత్నపరిభవం
బనితర మియ్యది పగతుఱయనుత్తమప్రీతిఁ దెలుపనయ్యెడుఁ దలఁపన్. ౨

ఉ॥ అద్దమరేయి మిన్నగల నార్తురె మార్తురు కల్పకాలమం
దుద్దవిడి న్మ్రొగ్గి ళ్లఱచునోజ బయల్పడ సంద్రిమిత్తజిన్
దద్దయు క్షోభముం బెరసి దాశరథు ల్శరపాశబద్ధులై
మొద్దులభంగి ద్రోపడిరి మోస మిదేమొ యెఱుంగ మింతకున్. ౩

ఆ॥ ఇట్టి పెద్దమ్రోఁత లిప్పట్టునం బుట్టు వెనసి నాదుచెవిని మొనయఁగాంచి
కలుగరానిశంకఁ గలిగించె నవ్వారు మడిసి మరలఁ బ్రదికి మలసి రనుచు. ౬
కం॥ అని పరిసరపరివర్తులఁగని వైళమె చని కృంశిపఁగా నగు వేళన్
బనుపడిన హర్షకారణ మనాప్తతతిదెస నెఱింగి యరుదెండనిరన్. ౭
తే॥ వారు సంభ్రాంతు లగుచుఁ బ్రాకారమెక్కి యనతనూజసురక్షిత నిత్థతేజఁ
గాంచి రాసేన నట్లు మేల్కాంచి మెలఁగు త్యక్తఘోరాస్త్రబంధుల దాశరథుల
ఆ॥ ఉబుకు తెలివితేట లూర్జితం బగు తేజ మంతకన్న మిన్న యైన వేగ
మల్లవారిపట్ల నారసినంతనే యిమ్ముసెడిరి రాక్షసేంద్రుభటులు. ౯
ఆ॥ హృదయముల భయంబు వదనంబుల విషణ్ణ భావమట్టు లుట్టిపడఁగ గుండె
గుబ్బు రనఁగఁ జెదరి గుప్పున ప్రాకార లంఘనం బొనర్చి లంకసేరి. ౧౦
తే॥ దీనముఖు లయి రావణుఁ దేఱిపాఱఁ జూడలే కెట్లొ చూచి యచ్చురుకుమాట
యున్నయది యున్నయట్టులే యొక్కఁడేని దాఁపనోపక తెలిపిరంతయుఁ దలార్లు

—♦ చారులు రావణునకు రామసేనల విశేషములు నుడువుట ♦—

తే॥ కొండచట్టుపల్కొట్టినదుండగీని కొఱలుమగఁటిమి నుడికించి కొఱంతవెట్టి
నట్టి జెట్టి నీకొమరుండు మట్టుమీఱి నాగుబాములఁ గట్టఁగా నరవరులను. ౧౨
కం॥ వారిపుడు బంధముక్తులుఁగా రాజిలుచున్నవారు కదనక్షోణిన్
దారితపాశము లగు మదవారణములభంగి సంప్రవర్ధితకరులై. ౧౩
ఆ॥ నిష్ప్రకంపభుజులు నిర్నిద్రు లగు వారి యొడళులం దొకింత యొకఁడ యేని
గంటి గానరాదు కపు లన్న నమ్మైన యమరియున్నవార లభయు లగుచు. ౧౪
కం॥ ఏమని తెలుపుదు మధిపా! యామెయి తేజం బొకంట నగుఁ గా దనఁగా
మామదికిఁ దోఁప దింకిట సేమముఁ గూర్పంగ నీక చెల్లదు ననిరన్. ౧౫

—♦ రావణుని విషాదము ♦—

చ॥ అది విని రాక్షసేంద్రుఁడు మహాబలుఁ డంచితవిక్రముండు నె
మ్మదిఁ గడుచింతతో నెడరుమాపుడు సూపుచు నేపుమీఱ మో
మదిగొని పెన్విషాదమున కై యతిదీనత నోహటిల్లఁ జొ
క్కొదవఁగ నిట్లనెం దనమహోన్నతియుం దలపోయ కత్తటన్. ౧౬
తే॥ బ్రహ్మదత్తవరంబులం బ్రథితిఁ గాంచి మొనయు నాశీవిషముల నమోఘములు ర
విప్రకాశములును నగు విశిఖములుగఁ జేసిబంధించెఁగద యింద్రజిత్తు నరుల. ౧౭
ఆ॥ అట్టి యస్త్రబంధ మలమ విముక్తులై యున్నకడఁక వార లుండి రనిన
సందియంబెడంద జాల్కొనుచున్నది మనబలౌఘ మింక మనునె యనుచు. ౧౮

ఉ॥ వాడిదొలంక బిట్టడరి వాసుకిముఖ్యమహాస్త్రమాఖ్య చే
ర్వాడి మథింప నోపునవి వారక శత్రుల నట్టిశస్త్రముల్
వేఁడిదొఱంగి యిమ్మెయిఁ బ్రవేగము మార్పడ నిష్ఫలంబులై
పోఁడిమి దక్కె నాఁగ నిఁకఁ బోరున రక్కసు లోపి గెల్తురే. ౧౯

కం॥ అని యురగ మట్లు రోఁజుచు ననితర క్రుధ యగ్గలింప నందఱ దెసకున్
దనచూడ్కిఁ బఱపి ధూమ్రాక్షునిఁ గనుఁగొని యిట్టు లనియె క్షుభితసపత్నా. ౨౦

ఆ॥ ప్రబల మధిక మైన ప్రధనబలముఁ గొంచు నీవు బొమ్ము వధకు నియతి వారయ
ననిఁ దనర్చు నరుల నటు వానరులఁ గూర్చి నెగడు పౌరుషంబు నిష్ఠ మెఱయ. ౨౧

కం॥ అని పలుకు రాక్షసేంద్రునియనుమతిఁ గొని నతులొనర్చి యరుసం బెసఁగన్
జనె ధూమ్రాక్షుఁడు ద్వారం బెనసి బలాధ్యక్షుఁ గాంచి యిట్లనెఁ దోడ్తోన్.

ఆ॥ తామసంబు వలదు త్వరపెట్టుము బలమ్ము నేఁ డనుజ్ఞఁ బెరసినాఁడ మిమ్ముఁ
దోడుకొనిచనంగ దొర పంచె నావుడు వల్లె యనుచు నల్లె వాఁ డొనర్చె. ౨౩

కం॥ ఆనతి కానతు లగుచున్ దోనే వెడలిరి ప్రశస్తితో నెక్కొనుచున్
బూనిక గంటలు బిరుదులు బూని కడ ళ్మైడలఁజేయు పురరవ మొప్పన్. ౨౪

శా॥ ఘోరాకారులు హృష్టమానసు లసంకోచు ల్గదాద్యాయుధ
ప్రారంభోచితహస్తలాఘవులు సంప్రాప్తప్రశస్తాంకు లా
ధారుల్ రాక్షసలక్ష్మి కుద్భటసముద్ఘాటు ల్నిశాటు ల్పొరిం
దా రేతెంచిరి చుట్టి రాతనిఁ దదర్థమ్ము న్సమర్థింపఁగన్. ౨౫

వ॥ శరశరాసనశూలముద్గరగదాప్రాసపట్టసముసలదండభిండివాలభల్లపరశ్వధంబులు మున్నుగాఁ గల యాయోధనసాధనంబులు ధరించి మించిన వేడుకమెయి నలంకారంబులతోడి సన్నాహంబులుపెట్టి ధ్వజంబు లెత్తించి యుగ్యంబులంబూన్చిన యరదంబు లెక్కియు, మదోత్కటంబు లగు ద్విరదంబుల నధిష్ఠించియుఁ, బవనజవనంబు లగు హయోత్తమంబుల నారోహించియు, సురుచిరభూషణాంబులు ఖరనిస్స్వనంబులు నైన ఖరమ్ములపై దిరమ్ముపడియు, రాక్షసవ్యాఘ్రంబులు వ్యాఘ్రంబులయట్లు దురాసదులై జలదనిర్ఘోషంబుల దెస లద్రువ నర్దనంబులు సేయుచు సదనంబు వదలి కదనంబునకుం గదలి రంత. ౨౬

ఆ॥ సింహవృకముఖములు రంహస్సమగ్రంబులట్లు కనకభూషణాంచితములు
నౌ ఖరములు పూను నాదివ్యరథము ధూమ్రాక్షుఁ డెక్కెఁ బరదిధక్షు పరఁగ.

—◆ రావణప్రేషితుఁడై ధూమ్రాక్షుఁడు యుద్ధమునకు వెడలుట ◆—

కం॥ ఖరకరమండలనిభ మతి ఖరనిస్స్వన మాఢ్యసత్త్వఖరవాహ్యము నా
నరదమునఁ బశ్చిమపుగోపురవుం ద్వారమున వెడలి పోడసూపె సఖీ! ౨౭

ఆ॥ అంత సంతసంబు నందుచుఁ జనె రాక్షసాంతకుండు హనుమఁ డచట నున్న
వాఁడు చాలఁ డెట్లు వల నెఱింగినవాఁడుగాఁడొ దేవుఁ డతనిఁ గదియలేఁడొ.

క॥ ఘోరుఁ డసురుఁ డటు వెడలఁగ ఘోరతరంబు లన నౌ శకునములు వానిన్
వారింపఁదొడరె వాఁ డవ్వారణము సహించునే ప్రవరుఁ డనఁ జనఁడే. ౩౦

క॥ స్యందనశీర్షంబున నిష్పందము భీమ మొకగ్రద్ధ వ్రాలె ధ్వజాగ్రం
బం దక్లే మిళితములై కొందలపా టెఱుకసేసె గుణపాశనముల్. ౩౧

ఆ॥ చిత్రముగను రక్తసిక్తంబు శ్వేతంబునౌ కబంధ మొక్కఁ డపుడు వ్రాలెఁ
గన విరూప మట్లు విన నపస్వరము నౌస్వరము గాఁగ నేల వానిమ్రోల. ౩౨

క॥ నల్ల గురిసెఁ బర్జన్యుఁడు దల్లడిలెం బుడమి మారుతము నిర్ఘాత
ప్రోల్లసితపాత మననై తెల్లముగా వీచె నిరులు దెసలం గప్పెన్. ౩౩

ఆ॥ చూచిచూచి వాఁడు సాక్షాద్రాక్షసభయావహము లివి యటంచు వానితోడి
వారు నొల్లఁబోయి రేరాళ మగు విధిచేఁత కితరు లేమి సేయువారు. ౩౪

క॥ కాని మ్మని పోని మ్మనికా నిమ్మరయంగవలయుఁగద యని యసురుం
డానిమ్మళమునఁ జని కనెఁదా ని మ్మగు రామసేనఁ దతసన్మానన్. ౩౫

క॥ కాంచి నిరూపించి ధృతిం బెంచి సమీపించి తనరు పృథుదర్పముతో
మించిన రణోత్సుకతఁ దను బ్రాంచితు నొనరింపఁ జేతఁ బట్టెన్ ధనువున్. ౩౬

—♦ ధూమ్రాక్ష వానరసేనల తుముల యుద్ధము ♦—

శా॥ వానిం గాంచిరి వానరోత్తము లఖర్వస్థేమగర్వోన్ సమి
ద్యానోత్సాహవిరాజమానుఁ డతవిద్యామానుఁ డా రప్పుడే
యానేలం దిగఁద్రొక్క నంబరము ద్రోయం జిత్తమం దుంచి క్ష్వే
లానిర్మోక మొనర్పసాగి రతివేలశ్రీసముల్లాసినీ! ౩౭

క॥ అవ్వానరరాక్షసులకు నివ్వటిలెం బోరు ఘోరనియతి వనాటుల్
దవ్వుల ఱాలుం దరువులు రువ్విరి హేతితతు లాశరులు నవ్వేళన్. ౩౮

తే॥ కదిసి దనుజులు శూలముద్గరగదాసి పరిఘపట్టసముల విడల్చిరి ప్లవగుల
భూరుహంబులఁ బగతుర భూమితలసమీకృతులఁ జేసి రట్లు వనౌకసులును.

శా॥ రోసం బొప్పఁగఁ జూప నిస్సృతమహారోషంబు లట్లున్నత
ప్రాసంబు ల్బలుకూటముద్గరములున్ రక్షోవరు ల్మీఱి సో
త్ప్రాసంబు ల్పరగించుచుం బఱపినం బాటోర్వక వ్వానరుల్
వే సాలంబులు ప్రస్తరంబులును వేవేలైపయిం ద్రోచినన్. ౪౦

ఆ॥ అందుఁ గొంద ఱడఁగి రడపొడఁగనరాక కొంద ఱట్లు వడియుఁ గొఱలి హరుల
నఱికి రసురు లసుల నానాప్రహరణప్రహతుల నొవ్వఁజేసి రలుకఁ దొడరి. ౪౧

శా॥ ఆవేగంబు సహింప కక్కపులు లబ్ధావేశు లై రాక్షస
ప్రావీణ్యం బుడివోవ భూధరశిలాపాతంబుల న్నొంచి బి
ట్టావేగంబు ఘటించి యార్చి రదసీయాభిఖ్య లిట్టట్టు లే
మా వేదించెద మంచుఁ బ్రోద్ధతరణవ్యాపార మేపారఁగన్. 82

ఉ॥ అబ్బురమయ్యె ఘోరము మహాహవ మన్నెఱి నేటుకోల్గనన్
బబ్బుకొనంగ నై కపులు పాదపముల్ శిలలు న్నిగుడ్పఁగా
నిబ్బరపుంబ్రయోగముల నేర్పొలయం బొలదిండ్లు హేతులన్
గొబ్బున నాటుచుం బ్రబలి కోల్తల సూపఁగఁ గాంచువారికిన్. 83

వ॥ వేగితు లై సాగి చెలరేఁగి జితకాశు లాగిరిచరవరులు రజనీచరుల నాఁగి బి
ట్టదల్చి కదల్చి తెమల్చుకొనసీ కనోకహంబుల ప్రోవులు గప్పియు తాలు
గుప్పియు దంతంబుల ప్రచ్చియు నఖంబులం గ్రొచ్చియు మొగంబు లగల్చియు
గ్రుడ్లు పెకల్చియు దలప్రహారంబులం దలలు వ్రక్కలుసేసియు వజ్రసన్నిభ
ముష్టిప్రఘాతంబులం బలుమేనులు డొక్కలు సేసియు జేతుల నిమిరియుఁ గాళ్లం
జమరియుఁ గొండలు వైచియు గండశిలల ద్రోచియు నుద్దండు లై గండుమీఱిన
వారి గం డడంచి ధ్వజంబులువిఱిచి రథంబులు నెఱిచి గజేంద్రంబుల నగేంద్రం
బుల మాటుననుంచి ఖరంబుల శిరంబులు ద్రెంచి తురంగమంబుల నారోహకు
లంగూడ వసుంధరకుం బలిపెట్టి యీసువ్రాక ముట్టవచ్చి పోటులకుం దలపడిన
పొలదిండులం బొలివోని యగ్గలికంబొడిచి బిలుకుమార్చి పేర్చిన మారి చిక్కనం
బడినయట్లె రుధిరంబులు గ్రక్కువారును నేలంబడి పొక్కువారును జూర్ణి
తులై యనిర్ణీతు లగువారును నధోముఖు లై పన్నుండినట్లు నేలంబడి సన్నసెడి
నవారును సగము విఱుగ మోడ్పడినవారును మొగము దఱుగం బొడ్పడినవా
రునుం గాఁ దోడువచ్చినసైన్యం బెల్లఁ బెల్లగించి యెడల్చిన వైరుతీరు ననుకరింప
హతశేషులు నిలువనోపక యేపులుసెడి తూపులు నెడ నిడి కనుకని పెనుపారఁ
బాఱంజూచుసమయంబున. 84

క॥ అలుక దనర ధూమ్రాక్షుఁడు బలుకదన మొనర్చెఁ దనదు పలుకదనము వో
నలికి చనువారిఁ బిలుచుచు ములికిచనుపఁ గపులవంక మొగకొలుపునెడన్ 85

సీ॥ ప్రాసంబుల నొకొండ్లఁ బ్రమథితుల నొనర్చె శోణితవిసరము ల్జొబ్బిలంగ
ముద్గరంబుల మోఁది మురు వడంగించెఁ గొండఱ ముద్దపాకంబు దారసిలఁగ
శూలంబులం గ్రొచ్చి చూపె సి ల్కొకళుల రక్తధారల నిలసిక్త గాఁగఁ
బట్టసంబులఁ గొట్టి ప్రాణము ల్వాపె వేఱొండ్లపైఁ బడి కర తొఱక మొరయఁ
బరిఘములను భిండిపాలంబులను విదారించె నసుల నఱికెఁ జించె భల్ల
ములను బాణములను మొనయించి ఛేదించె గపులసేన బిట్టు గాసిపడఁగ. 86

క॥ భిన్నహృదయు లై మి న్నని మన్ననికన లేక ప్రాణమానంబులపై
నున్నచవి వీడి విడివడి యన్నగచరు లరుఁగఁజొచ్చి రబలామణిరో! ౮౭
ఆ॥ ప్రక్క లూడ హృద్విభాగంబులు ఘటిల్ల నెత్తు రుర్ల నాంత్రనిర్గమంబు
దారసిల్లఁ గపు లుదారులు గీ యను నెలుఁగు లెడలఁజేసి రేణనయన! ౮౮
తే॥ శబ్దబహులం బుపలవృక్షసంకులంబు ప్రహరణాభీల మురురుధిరప్రవాహ
మాప్తపిశితాశనము నయి హరిపలాశ భీమసంగ్రామ మొప్పె నుద్దామచరిత! ౮౯
క॥ జ్యాతంత్రీమధురము హికాక్తాలసమన్వితంబు ఘనబృంహిత సం
గీత క్రమ మాయుద్ధం బాతతగాంధర్వవిభవ మై యొప్పారెన్. ౯౦
ఆ॥ అట్లు ధనువు దాల్చి యారక్కసుండు కో ల్తలకు మొనసి నవ్వ్వదలకుఁ బ్రాక
విద్రవింపఁజేసె విశిఖవృష్టుల దెసల్గప్పి కపిబలములఁ గదనమునను. ౯౧

—♦ సైన్యముల మర్దించు ధూమ్రాక్షుని హనుమంతుఁడు మడియించుట ♦—

క॥ ధూమ్రాక్షార్దితసైన్యముఁ దామ్రేక్షణుఁ డగుచు వాయుతనయుఁడు గని క్రో
ధామ్రేడితరయుఁ డై జయసామ్రాజ్యము సిరి వరింపఁ జనుదెంచె ధృతిన్. ౯౨
తే॥ విపుల యగు శిల యొక్కండు పెర్చి తెచ్చి
పితృసమపరాక్రమతఁ గొన్న పేర్మి హెచ్చి
వానియరదంబుపైఁ ద్రిప్పి వైచెఁ జూచి
యసుర గొదకొని గదకొని యవని కుఱికె. ౯౩
ఆ॥ ఆశిలాభిఘాత మంది రథంబు సాశ్వంబు సధ్వజంబు సశరవరశ
రాసనము సచక్రి మటు సకూబరము నై యంతతోడఁ జూర్ణమయ్యె నపుడు.
*క॥ మహితుఁ డతం డహితహితుం బ్రహరణయుతబాహుపరిఘుఁ బాటింపక త
త్సహచరనిశాచరస్తోమహనన మదన మని కనలు మనమునఁ జెనయన్. ౯౪
క॥ సస్కంధవిటపవిటపుల నాస్కందనమున కమర్చి యనిలజుఁ డొల్లన్
"గస్కోత్రిభో" యటంచుఁ బురస్కృతు లమరు ల్పటింప రయమునఁ జమరెన్.
ఆ॥ ఉసులు లెడల శోణితోక్షితు లై తల కాలు సేయు ననఁగఁ గానరాక
కూలి రసురు లపుడు కుంభినిపైఁ జాపకట్టుగాఁగ వాని కదనమునను. ౯౭
క॥ వారల యమసదనమునకు వీరుఁడు వాఁ డనిచి తొంటివీరునిదెసకున్
వారక పరువిడెఁ దోడ్తోఁ జేరువ గిరిశిఖర మొండు చేకొని పెలుచన్. ౯౮
ఆ॥ వచ్చువానిఁ గాంచి వాఁడు గొంటున బహు కంటకాఢ్య మైన గద నమర్చు
కొని పొనర్చి గాలికొమరుని నడినెత్తి మోఁదె మీఁది కెత్తి మురిసి మురిసి.
ఉ॥ కొట్టునొ యాతఁ డంచు మది గొం కొకయింతయు లేదు నెట్టనన్
గొట్టెనపో యనంతరము గొండల మందుట గానరాదు చే

పట్టిన శైలకూటము సపత్నుని మస్తకమధ్యమందుఁ బె
న్దిట్టతనంబు నెక్కొన నుదీర్ణతమైఁ బడవైచె నార్చుచున్. ౬౦
ఆ॥ విహ్వలుఁడు విశీర్ణవివిధావయవుఁడు నిరస్తమస్తకుండు నగుచు నసురుఁ
డవనిఁ బడె వికీర్ణమైన పర్వత మట్టు లమ్మహోజవప్రహారమునను. ౬౧
ఆ॥ పవనసుతుఁడు పగతుఁ బరిమార్చి నెత్తురు టేఱు లెల్లయెడల నెనయఁజేసి
కపులు పూజ లొనరఁగాఁ గూర్పఁగ నజేయుఁ డాజివగరు పెడల నలరె నవల!
క॥ ఆధూమ్రాక్షుఁడు మడిసిన యోధులు హతశేషు లఱుమ నోపక చని లం
కాధిపతి కెఱుకసేసి రగాధబలుఁడు హనుమ ధృతియు ఘనభుజు మృతియున్. ౬౩
ఉ॥ కూలెను ధూమ్రనేత్రుఁ డనఁ గ్రోధము శోకము నొక్కపెట్టునన్
జాలుకొనంగ రావణుఁడు సారెకు నూర్పులు వుచ్చుచున్ బరు
ల్గాలుట స్వీయు లొత్తిలుట సంభ్రమ ముట్టిపడంగ నెంచి య
క్కాలము వజ్రదంష్ట్రుని నికామబలుం గని సంయతాత్ముఁడై. ౬౪

—♦ రావణుఁడు వజ్రదంష్ట్రు నని కనుచుట ♦—

ఆ॥ పొమ్ము వీరకోటిఁ బొలియింప నగువారిఁ గొంచుఁ దొలుత రవిజుఁ గోలుపుచ్చి
రాము ననుజు వచ్చి రమ్ము నీ ముమ్మరంబె నెఱింగినదియ యెయిదు మనిన.
ఉ॥ ఆతఁడు మిన్ను ముట్టి యవు నోఁ దగు నానతిఁ గూర్చి తంచు మా
యాతతుఁ డీడు జోడు నగు నట్టి సురారుల నేర్చికొంచు సం
పాతబలమ్ము లిమ్మరసి పాటున కోర్చెద మంచుఁ జుట్టిరా
నాతఁడె నుల్లసిల్లె రణ మున్న మహాభరణ మ్మటం చొగిన్. ౬౬
తే॥ రత్నకేయూరమకుటవిరాజితుండు దృఢతనుత్రశిరస్త్రకోత్తేజితుండు
నగుచు నలువొంపె విలుదాల్చి యరిదళమ్మునవఘళింపంగ నైన యయ్యును వరయుచు.
క॥ సుపతాకాశ్వాలంకృత మపరిమితపుటాప్తకాంచనాంచిత మరదం
బపుడు ప్రదక్షిణగతితో నిపుణుం డతఁ డెక్కె విజయనిర్ణయ మొప్పన్. ౬౮
తే॥ తోడివారలు జతన మైఁ గూడి రపుడు రథములు పతాకికావిచిత్రములు దనర
గజము లుష్ట్రము లశ్వము ల్ఖరము లమరసమరభటు లట్టు లొరసిరి సరభసముగ.
చ॥ తరలిరి యష్టితోమరగదాముసలాసిపరశ్వధాదు లా
వరరణసాధనంబు లనివారణమైఁ గయికొంచుఁ గొంకులే
కరిబలము న్దెరల్పు మను నార్భటు లొప్పఁగ నుద్ధరిష్ణుని
ర్భరకుతుకమ్ము ద మ్మలమి పాయఁగ ద్రోయఁ బదాతు లత్తఱిన్. ౭౦
ఉ॥ సొమ్ముల యొప్పు వస్త్రముల చొప్పు శరమ్ముల సౌరు వజ్రఘో
షమ్ముల తీరు మేల్పరవసమ్ముల కల్మి యెసంగు బల్మియున్

ద మ్మనివార్యు లంచనఁగఁ దత్పరు లై యసురారు లమ్మెయిన్
బమ్మెరపోకనా కనికిఁ బ్రస్థితు లైరి ధరాధరాత్మజా! ౭౧
ఆ॥ తొడరు కొండ లట్లు తోమరాంకుశపాణులాజికుశలు లైన యట్టి యంత
లెసని నడుపఁ దరలె నిభరాజములు మదోత్కటము లుద్భటములు కదనమునకు.
క॥ లాక్షణికములు మహాజవ లక్షితములు సంచరణకలావంతము లౌ
నక్షీణాశ్వంబులపై రక్షస్సాదులు దనర్చి రానైరి సఖి. ౭౩
ఆ॥ అట్లు వెడలి ఘోర మగుచు బిట్టార్చుచుఁబరఁగె నబ్బలంబు స్ఫురణ లెసఁగ
వానకారు చొడరఁ బ్రబలి విద్యుద్ద్యుతులడర మ్రోత లిడు ఘనౌఘ మనఁగ.
క॥ అంగదుఁడు మెఱయు దక్షిణపుంగవనునఁ జొచ్చి వెడలి పోరిపోరి జని ర
య్యంగద దెలిపెడు శకునములింగాలము లట్లు చూడ నెనసె శుభాంగీ ౭౪
ఆ॥ మబ్బు మాయ లేకె మలసి యాకసమున నుండి యురలె నుల్క లుగ్ర లగుచుఁ
గూసె నక్క లోలిఁ గొఱవి మంటలు నోళ్ళ దొరల మెకము లఱచె దుష్టములుగ
క॥ వికటములు గాఁగ నౌత్పాతికములు పెక్క లటు దోఁప దితిజులు భీతిన్
వికలత్వముఁ గాంచిరి తమ కకాలమృతి యొదవు నట్టిఁ డయ్యెనటంచున్ ౭౫
ఆ॥ అమ్మహాబలాఢ్యుఁ డావజ్రదంష్ట్రుఁడు దుండగీఁ డనిం బ్రచండతేజుఁ
డుత్సవంబ కాఁగ నొలసెఁ గా కింతయు దలఁకఁడయ్యెఁ దనదు ధైర్యమునను
మ॥ సోరిది న్నిష్క్రమణం బొనర్ప జితకాశు ల్గాంచి రవ్వారి వా
నరవీరు ల్దెసలెల్ల బూరటిల సన్నాహంబుమై నార్చి రు
ప్పర మానం గమకించి రుల్లసన మొప్పన్ సంకులం బైన సం
గర మాపైఁ గర మావహిల్ల నగుపీఁక న్మించి రంచద్గుణా! ౭౬
ఆ॥ ఎగసియెగసి తాఁకి రిరువాఁగువారునుఁ గసిమసంగి విజయకాంక్షు లగుచు
నొడళు లెడల రుధిర మురల నై పుడమిపైఁ బడఁ దొడంగి రపు డపర్ణ! వింటె.
ఆ॥ చొచ్చువాఁడు వెనుకఁ జూడఁ డాకలనున వివిధశస్త్రములను విసరివిసరి
గ్రొచ్చిగ్రొచ్చి కడఁగి నొచ్చి వ్రాలునకాని పోటుకాండ్రు తలఁగుబాటువారె.
ఉ॥ ఒండొరులం గడంకమెయి నుద్భటు లై పొడువంగఁజొచ్చి రా
భండన మద్భుతంబు నెఱబొటులు దీర్చిరి వృక్షము ల్శిలల్
గం డడఁగంగ వైచి రది యాా నిది గా దనరాదు హేతు లు
ద్దండతఁ జిమ్మి రాకపులు దానవులున్ దృఢబద్ధ వైరులై. ౮౨
ఆ॥ తాలు మ్రాఁకు లలుఁగు లోలిఁ బ్రయోగింపఁ
బొడమి జ్యాస్వనములఁ బొడవు పెరిఁగి
నేమివాద్యసింహానిస్వనంబులఁ గూడి
యొక్కయెలుఁగు దిక్కు లురలఁజేసె. ౮౩

తే॥ పాదుల నస్త్రము ల్వట్టిపోఁ బొలసుదిండ్లు బాహుయుద్ధ మొనర్చిరిపలు మొగముల
నెదిరి తక్కువపడుదు రే యిట్టికలని కెదురుచూతురు తా రెప్పు డెప్పు డనుచు.

చ॥ తలముల జానుఘాతముల దారుణముష్టివిదారణంబులన్
బలుచరణప్రహారములఁ బాదపశైలశిలాప్రపాతనం
బుల విదలించి రుద్ధవిడిఁ బుల్లలఁ జేసిరి చూర్ణితంబుగాఁ
గలిపిరి నేల రాక్షసుల కాయము లోయనుచున్ బ్లవంగముల్. ౮౭

తే॥ యుద్ధదుర్మదు లవ్వారి యుదుటు మాన్ప వాలె శరవృష్టిఁ గురియుచు వజ్రదంష్ట్రుఁ
డఖిలసంహృతికై పాశహస్తుఁ డగుచుఁ దరలి తెరలింపఁ దొడరు నంతకుఁడనంగ.

క॥ బలవంతు లస్త్రసంవిదు లలఘులు నానావిధప్రహరణాఢ్యులు నా
పొలదిండ్లు క్రోఁతిమూకల నలవడి విదళింపఁదొడరి రాజిని యలుకన్. ౮౮

—♦ అంగదుఁడు వజ్రదంష్ట్రుని సైన్యము నడంచి విజృంభించుట ♦—

తే॥ అట్లు ప్రహరించు పెరవారి యాగడంబుదనబలగ ముబ్బడంగు నద్దశయుఁ గాంచి
యంగదుఁడు ద్విగుణావిష్టుఁ డయ్యె నలుక నపుడు సంవర్తకాగ్ని నెయ్యంబు దొలఁక.

మ॥ ఒకవృక్షంబుఁ బెకల్చి దాల్చి క్రుద్ధుఁడై యుగ్రాకృతి న్మించి పా
వకకుండోపమనేత్రయుగ్మమున త్రోవన్ విస్ఫులింగంబు లా
ఉక దోఁపన్ బలుసింగ మొందు గడఁకన్ అంపిల్లి క్షుద్రంబు లా
మెకపుంగుంపుల నట్లు వైరితతుల న్మెక్కాడ్చి చక్కాడఁగన్. ౮౯

ఆ॥ పోరు ఘోర మయ్యెఁ బొలదిండిదిట్టలుగాలు సేయు దలయుఁ గానఁబడక
గొట్టఁబడిన ద్రుమాని గుట్టల యక్కరి హరిహయాఢ్య తేజుఁ డాతఁ డడర. ౯౦

చ॥ అరదము లశ్వము ల్ధ్వజము లాశరవానరవీరదేహముల్
పొరిపొరి నెత్తుటేర్ల పయి బోరన దెప్పలుదేలఁగా భయం
కరి యన నయ్యెఁ బృథ్వి యదె కంకణహారకిరీటకోటులం
బరఁగెడు వస్త్రమాల్యముల భాసిలె శారదరాత్రియో యనన్. ౯౧

మ॥ పవనప్రేరణ నంబుదంబువలె దుష్పారంబు రక్షోబలం
బవికంప్యంబు ప్రకంపితం బగుచు నొయ్యం గూలుటన్ వైరియే
సవికాసంబు జయంబు గైకొనుటయున్ జర్చించి సక్రోధుఁడై
జవసత్త్వాఢ్యుఁడు వజ్రదంష్ట్రుఁ డధివజ్రజ్యాస్వనం బొప్పఁగన్. ౯౨

తే॥ అంగదునిఁ దాఁకి శరవృష్టి నతనిబలమునెల్ల ముంపంగ దొరఁకొనె నెడలినట్టి
తనదుయోధులు మొనసి స్యందనములందుఁదనరి తనతోడివార లై తఱుమ నపుడు.

తే॥ వానరులలోఁ బ్రముఖ్యులు వాలి శైలపాదపాదపములు గొంచుఁ బరఁగి రట్లు
వారు మొగకొనఁ బోరతిఘోర మయ్యెఁ దత్ప్రహారప్రహారము ల్దవుల నెఱయ.

శా॥ కాలుం జేతులు వ్రీలఁ గొందఱు తల ల్గంపించుచు న్నేలపై
వ్రాలం గొందఱు గాత్రసంధు లధిమర్మంబు ల్సెడఁ బేస్చమై
కాలం గొందఱు నూఱుఁబిండు లగుచు న్గాన్పింప రూపింపఁగాఁ
బోలం బోలక కొండఱు స్మడిసి రప్పోరం గృతారంభులై. ౯౫

తే॥ కదిసె రక్తపూరము మాంసకర్దమంబుమలసెఁ గంకగృధ్రవళగోమాయుగణము
లెగసె నట్టలు భీరులు సొగయ ఘోరదారుణం బగు నాప్రవిదారణమున. ౯౬

ఆ॥ వారు వీరసంగ వలను లేక విభిన్నపాణిపాదశిరులు భగ్నకాయు
లగుచుఁ బడిరి యోధు లందు నిందును దుర్నివారకాలయోగవశ్యు లగుచు. ౯౭

ఆ॥ గ్రుడ్లు మిడుకరించి కోల్పోక గాంచుచు నున్నయాతఁ డట్టులుండఁ గడమ
పొలసుమేఁతరులనుఁ బొలమార్చి భంజించి రగచరు ల్ప్రవీణు లగుచుఁ దొడరి.

మ॥ భయవిభ్రాంతుల హన్యమానుల హతప్రారంభసంరంభులన్
నయ మొప్పారఁగ స్వీయులం బగఱ సన్నాహంబులం గాంచి యే
మయినం బో యవుఁగాత మం చసురసైన్యాదేష్ట పెన్నిప్పుక
ల్బయ లెక్కంగను లెట్టసేసి యెదిరెన్ బ్లావంగమశ్రేణిపై. ౯౯

ఆ॥ ధనువుమండలమునఁ దద్దయుఁ బొడమెడు శరకరములు దెసలఁ జాలుకొనఁగ
వాఁడు నడిమిప్రొద్దు వేఁడివెలుం గయి వెలిఁగెఁ గపిబలంబు విహ్వలింప. ౧౦౦

తే॥ కంకపత్త్రంబులు నజిహ్మగములు నైన ప్రదరములను విదారించి పొదులుపొదులు
గాఁగ నిగుడించి యవ్వాఁడు కపివరేణ్యు బలగ మంతయుఁ జీకాకుపడి తలంగ.

క॥ ఏపుసెడ నలఁచు నసురుని కోపు సహింపంగలేక గుంటుపడుచు మా
ప్రాపుగ దే యని యంగదు దాపున నొదిఁగి రగచరులు దయమానదృశా.

ఆ॥ ప్రజలఁబాలనమునఁ బ్రబలు ప్రజానాథు నట్టు లల్లవారి నాదరించి
యదరు వాపి బిట్టు పొదలు నల్క నరాతిఁ జూచెఁ దన్ను వాఁడు చూచుచుండ.

—♦ అంగదునిచే వజ్రదంష్ట్రుఁడు హతుండగుట ♦—

మ॥ కదియం బాఱెను దోన యగ్గలిక మైఁ గాడంగ రాకాసి దు
ర్మదుఁ డై మత్తగజంబు బొబ్బ మెకము న్మార్కొన్న చందానఁ దా
నదలింపు ల్గదఁ దాఁకె నైంద్రితనయు న్వ్యాపాద మొప్పార నా
నద నంచుం జరియించి రయ్యిరువు రుద్యత్ప్రక్రియారంభులై. ౧౦౪

తే॥ తోమరముల మదేభంబుఁ దోలఁచినట్లు
శరము లొకవేయి మర్మదేశములఁ గ్రొచ్చె
వాలి యాశరుఁ డవ్వాలివరతనూజు
నెన్నక సముద్భటార్భటు లెసఁగుచుండ. ౧౦౫

ఆ॥ రుధిరఝరినిఁ దోఁగి యూష్మేక్షణుం డాతఁ డొక్క పెద్దమ్రాని నూడఁ బెఱికి
వజ్రదంష్ట్రుపైని వైచె వాఁ డద్దానిఁ బ్రిదిలిపడ నొనర్చెఁ బృథుశరముల. ౧౦౬
క॥ ఆవిబుధవైరి ప్రక్రమ మావిక్రమనిరతుఁ డరసి యా లె మ్మని పెన్
గ్రానం బొక్కఁడు చొప్పడఁగాఁ ద్రిప్పుచు వైచె నార్చెఁ గడలు చలింపన్.
ఆ॥ వచ్చుకొండఁ గాంచి వాఁడు లాఘవ మొప్ప
గద యొకండు గొంచు ద్రుమ్మె తలమున
కుఱికి నిలిచె వాజియుక్త మయ్యరదంబు
యంతతోడ సంయుతాంత మయ్యె. ౧౦౮
క॥ కొండొకగిరి విపులము ద్రుమ మండితముఁ బెకల్చి యెత్తి మార్తుని తల నా
ఖండలపౌత్రుఁడు ద్రోచెను గండరగండఁడు ప్రతాపకలనాంచితుఁ డై. ౧౦౯
ఆ॥ దాన రక్కసుండు తతశోణితోద్గారి యగుచు నూర్పు లెడల నవని వ్రాలె
గదయుఁ బ్రక్కతోడుగా దానిఁ గౌఁగిఁట నలముకొని విసంజ్ఞుఁ డగుచు గౌరి!
ఆ॥ అట ముహూర్తకాల మటు లుండి మైకంబు విచ్చి చనినఁ గ్రోధవివశుఁ డగుచు
నంగదుని యురంబునం గదఁ గరమునఁ బూన్చి పొడిచె దెసలు భోరుకొనఁగ.
ఉ॥ పోటు సహించి యుద్ధవిడిఁ బొల్చి సురారి గదన్ హరింప వాఁ
డోటమి లేక పైకొని నియుద్ధ మొనర్పఁగడంగె నిర్వురున్
సూటిగ నిల్చి మార్కొనిరి చొక్కుచు నెత్తురు లుగ్గుచుం గ్రుధం
బాటిలు దార్ఢ్య మబ్బురముపా టెడఁ గాంచెడు వారి కబ్బఁగన్. ౧౧౨
ఆ॥ ఎడసి కదిసి పొడిచి యెగిచి వాలి కడంక నూపి బిట్టడంచి యేపుమాపి
పోరి రొండొకొండ్లఁ బొలియించు తలఁపుల వక్రబుద్ధులఁ బోలి వార లపుడు.
పృథ్వి॥ ప్రహారజనితశ్రమాపలపనంబు లొప్పారఁగా
సహార్యవరధైర్యు ల ట్లడరి పోరు నాలో ననో
కహం బొకఁడు చర్మఖడ్గములఁ దాల్చెఁ గన్నాటి య
య్యహర్పతిసమప్రభుం డగచరేంద్రుఁ డత్యుద్ధతిన్. ౧౧౪
క॥ వాఁడును నట్టివ కొని తనుఁ బోఁడిమి మొగకొనుచు నుండఁ బొడుచుకొనిరి వె
న్కాడక యెడచూడక పెను సూడెదలం గ్రాల నైంద్రిసుతుఁ డాశరుఁడున్.
క॥ చిరకాల మట్లు కలనునఁ జరియించిరి చిత్రగతుల సమదుఃఖసుఖ
స్ఫురణాల నొప్పారిరి తత్పరిక్రమము లొఱపు నెఱపెఁ బద్మదళాక్షి! ౧౧౬
తే॥ రక్తసిక్తవ్రణాంకసంరక్తతనులు వారు సంపుష్పితపలాశవరతరువు ల
నంగఁ బొల్చిరి జయకాంక్ష ననుచు వేడ్క నిర్దయప్రఘాతములకు నెలవుపడిరి.
క॥ అంతట నిరువురునుఁ బరిశ్రాంతుల లై యవనిఁబడిరి జానుతలము ల
మ్మంతున నూఁతలుగా సంక్రాంతాన్యోన్యప్రహారఘటకృత్యమునన్. ౧౧౮

చ॥ ఒకనిముసంబులోఁ దెలివి నొంది హరీంద్రుఁడు దండతాడన
ప్రకరణరోషితం బయిన పన్నగముల్ బురుడించి లేచి పా
వకరుచులం గను ల్నెగడ వర్ణ్యగుణాంకితకింకిణీకముల్
సుకృతము నైన ఖడ్గమును స్రుక్కక గైకొని నిశ్చితాత్ముఁ డై. ౧౧౯

—♦ అంగదుఁడు వజ్రదంష్ట్రి వధించుట ♦—

ఆ॥ వజ్రదంష్ట్రిఁ డల్లి వఱలఁ బైకొని వాని విపులశిరము రోషవృత్తనేత్ర
మపుడె కోసె వ్రాలె విపులపై నది యట్టుఁ బాసి యవల నదియుఁ బడియె నవల!
మ॥ హతుఁ డై కూలిన సైన్యనాథుఁ గని దేవారు ల్భయభ్రాంతు లై
తతదైన్యాననమ్రము లై హరివరు ల్దమ్ముక్కటం దాడ్యమా
నత నొందింపఁగ మొక్క వేల్పు పిలువ న్పాఱి పంచు లే దంచుఁ బ్ర
స్థితు లై వ్రాలిరి లంకలోఁ బగతు జాక్షేపింప జేఁ డొల్లఁబోల్. ౧౨౧
ఉ॥ వజ్రధరప్రభావుఁ డలవాసవిసూనుఁడు వజ్రదంష్ట్రినిల్
వజ్రసమానసారు ననివార్యు సుర ల్వొగడంగ వృత్రునిల్
వజ్రియపోలెఁ బేర్చు నని వచ్చి ప్లవంగమరత్నమాలకుల్
వజ్రమణీంద్ర మై మెఱసె వారనిబీరము వన్నె కెక్కఁగాల్. ౧౨౨
తే॥ వాలిసుతుచే నిహతుఁ డైనవాఁడు వజ్ర
దంష్ట్రిఁ డనుమాట విని యుల్కి దశవదనుఁడు
తనబలాధ్యక్షుఁ గాంచి యిట్లనియె నాతఁ
డంజలిఘటించి యభిముఖుం డై వినంగ. ౧౨3

—♦ రావణుఁడు ససైన్యు నకంపను యుద్ధమున కనుచుట ♦—

క॥ అనుపదమె తరలఁదగువా రనుపమవిక్రములు నటు దురాధర్షులు నా
మనయోధు లకంపనుఁ గొని ఘనుఁ డాతఁడె సర్వనేతగా నగుచుండల్. ౧౨౪
తే॥ ఎఱుఁగు నఖిలశస్త్రాస్త్రంబు లెదిరి నొంప
స్వీయులను మన్పఁ దెఱఁగు భాషింపఁ గలని
వలను లూహింప నేర్చినవాఁడు నాడు
భూతిఁ బెంప నా కృతి సమవేతుఁ డెపుడు. ౧౨౫
ఆ॥ సంగరం బటన్న జాడఁ జేనకు మూరగాఁగఁ బెరుఁగు నితఁడు గదిసినపుడె
రాముఁ దమ్ముఁ బ్లవగరాజు ముట్టి జయించునితరబలముగోల యెన్న నేల! ౧౨౬
క॥ అని యానతిసేసిన నది తనయానతి యౌ నటంచెంగి తరలె న్నతిఁ గూ
ర్చి ననుచు సుమహోల్లాసంబునఁ బొదలి యకంపనుండు భూధరతనయా! ౧౨౭

సీ॥ త్వరపెట్టె నానాప్రహరణుల భీమదర్శనుల భీమాత్ముల రాక్షసులను
మొనయించెఁ గుండలమ్ముల జోడు వజ్రాంగిజోడు తోడుగఁ దోడుతోడ మెఱయ
నారోహణ మొనర్చె నఖిలసాధనముల సన్నద్ధ మై యున్న స్యందనంబు
నిగుడించె నుచ్చైస్స్తనితనిస్వనంబుల మేఘమట్టేఁడ యగు మేను దనర
వెడలె బిరుదము లీవ్రఁ డతివీరుఁ డనఁగ ఘనబలౌఘపుఁదరఁగలఁ గలసి యుష్ణ
రశ్మితే జట్లు బలుతేజు రాజిలంగ గంపితారాతినివహుఁ డకంపనుండు. ౧౨౮
క॥ దేవాసురాహవముగా నావానిఁ దెరల్పనేర రమరవరులు న
ట్లా వెరవునన యకంపనుఁ డై వెలసెను వాఁడు సురవరార్చితచరణా! ౧౨౯
ఆ॥ ఆయుయుత్సుఁ డట్టు లరుదేర నూరక లేటమొఁగము వడియె ఘోటకౌఘ
మదరె వామనయన మానసంబు వివర్ణమయ్యె మాఱుపడె గళారవంబు. ౧౩౦
క॥ సుదినమె దుర్దినమయ్యెనుఁ గదిసె న్మారుతము రౌక్ష్యకలితం బగుచున్
వదరెను ఖగములు మృగములు ప్రదుష్టభీకరము లైన పలుకుంబడులన్. ౧౩౧
తే॥ ఉపచితస్కంధుఁ డగుట సింహోపమితుఁడుచాలువిక్రమనిరతి శార్దూలసముఁడు
లెక్కసేయఁ డుత్పాతము లిక్కుటముగఁ గానఁబడెనేని ననివంకఁ గడఁగుఁగాని.

—♦ రెండవునాఁటియుద్ధము ♦—

క॥ సాగరము క్షుభిత మయ్యె మహాగమములు పాదు లెడరి యటు నిటు పడె ది
గ్భాగములు మ్రోసె దనుజుల యాగము లాగము లొనర్చునపుడు పురంధ్రీ!
క॥ ద్రుమశైలాయుధు లాహరి చమూపతులు యోధులును బ్రసక్తి న్వివి ర
త్తుముల మగు నులివు దోడ్తో నమరిరి తలపడిరి యుద్ధ మతిరౌద్రముగన్. ౧౩౪
ఆ॥ అపుడు రామరావణార్థసమర్పిత దేహు లైన రెండుతెగలవారుఁ
బోరిరలఘుబలులు పోరిఁ బరస్పరవిజిఘాంస నెరయుచుండ ఘనరయమున.
క॥ వారని యారవ మొదవెను,వా రని నొండురులఁ బొడుచువలనునఁ దఱుచై
వైరనివేశంబున ననువై రని వేల్పులకుఁ గూర్చు నామంత్రణ మై. ౧౩౬
సీ॥ క్రోధంబువెనిచిన కోల్తల నొండొండ నభిగర్జితంబు ల ట్లతిశయిల్లె
నరుణవర్ణం బయి యవనిజంబు పరాగ మంతరాలం బెల్ల నాక్రమించెఁ
దెర వైచినటు లయ్యెఁ దెలిరంగునఁ గడంగు కొండొక భూక్షోదమండలంబు
పాట లాటలు నందె పరఁగె నేయంకంబు గానరాదనుచు నిష్క్రాంతు లాడఁ
గపులు గపుల నఱుమఁగా రాక్షసులు రాక్షసులనె పొడువ నెన్నఁ జోద్య మనిరి
కాని చోద్య మొకఁడు గానరాదెట్లునుఁ గలిత సత్ప్రయోగగతులు వారు.౧౩౭
క॥ భూ భర ముడుపం దొడరిరి భూభవము రజంబు నట్లె పొడవడఁగింపం
గా భీకరి రక్తమయింగా భీరూ!ఝురి నొకొండు గల్పించి రొగిన్. ౧౩౮

ఆ॥ క్రోధజనిత రక్తకూలంకష పరాగ మెత్తి వైచి వార్ధి నెనసి మెఱసె
బహుళకబంధములనుఁ బడఁద్రోచుకొని చను నంత దానికప్పు దేణనయన! ౧౩౯
క॥ రంగస్థల మపు డొప్పెఁ దురంగముఖాంగప్లవంగరాక్షసకలనా
ప్రాంగణ మగుచుఁ గన్నారం గన్నా రవ్విబుధులు రభస మెసంగన్. ౧౪౦
ఉ॥ కొండలు తాలు మ్రాఁకులును గొంచు హరీంద్రు లతంద్రు లాగదా
మండలశక్తిముఖ్యముల మానుగఁ బూనుచు రాక్షసుల్ రణో
ద్దండులు బాహుదండముల దర్ప మెలర్పఁగఁ జేయఁ ద్రోయ నా
రెండురకాలవారు నయి రేఁగిరిపో గిరినందినీ! యనిన్. ౧౪౧
తే॥ హరులు రాక్షసులం గొట్టి యడ రడంచి రట్లు రక్కసు లవ్వారి నలఁచి పేర్చి
రాహవము హవ మై పశుహననమునను బొనరె నవ్విధిసాధనంబులు దలిర్ప.
క॥ దారుణశస్త్రాస్త్రంబులఁ దారుడుగక పొడుచుచుండఁ దఱి రక్కసులన్
బోరునకుం బురికొల్పెంబో రుషితుఁ డకంపనుండు భూరితరముగన్. ౧౪౩
ఆ॥ ప్లవగు లూరకుండుపాటివారలఁటే మహాద్రుమాశ్మవితతు లరసి తెచ్చి
తవిలి పగఱ నటు విదారింత్రు తత్సాధనములు గొంద్రు వారి సమయఁజేయ.

—♦ మైందద్వివిదాదుల విజృంభణము ♦—

క॥ అంతకుమును నలకుముదులు నంతకసన్నిభులు మైందుఁ డల ద్వివిదుఁడు వి
క్రాంతు లయి సైన్యముఖమున నింత యనఁగరాని దర్ప మిరవుకొనంగన్. ౧౪౫
ఆ॥ రక్కసులనుఁ బొదివి రాపాడిరాపాడి విఱిచివిఱిచి చెట్లు విసరి విసరి
చక్కుచేసి పేర్చి సంఘుసంఘములుగా నాప్రతాపతపను లతిరయమున. ౧౪౬
క॥ వానరసత్త్వము లమ్మెయి నా నెఱిఁ దమవారి నులుము టారసి క్రోధం
బూనిన యాకృతి తానే కా నోపు నసంగ నయ్యకంపనుఁ డంతన్. ౧౪౭
ఆ॥ పరమకార్ముకంబుఁ బట్టి యాడించుచు వహ్నికుండ మనఁగ వదన మొప్ప
నల్లవారి తెఱఁగు నంతయుఁ దనయంత కెఱుక సేయువహిన యిట్లు లనియె.
సీ॥ కాంచితే యెట్టు లలంచుచున్నారొ లంకౌకసులఁ గపు ల్లంకదక్కి
చట్లు గుట్టలు వైచి చర్లాటలాడంగ నేర్చినార మటంచు నేటుకొనిరి
బలియుర మని యొగ్గఁ బోటిసేయరు వీరు భీమకాయులు పెచ్చుపెరిఁగినారు
మద మడంచినఁ గాని మలఁగిపో రీనాఁటి దా పోర నాచూడ్కి కబ్బినారు
గాన సత్వరముగఁ గడపుము తే రంత లెగయువారి నెల్ల నీక్షణంబె
పొల్చు బాణవహ్నిఁ బూర్ణాహుతిఁ బొనర్చి విజయలక్ష్మిఁ బేర్చి వెలయువాఁడ.
క॥ ఈసమరశ్లాఘుల నిపుడే సమయించెదను జూడు మింక నను చున్
జే సారించి విశిఖముల వేసారక విడువఁదొడరె విబుధస్తుత్యా. ౧౫౦

తే॥ ప్రజవనాశ్వంబులం బూన్పఁ బరఁగినట్టి రథముపై నుండి హరివీరరాజిఁ గదిసి
యాజిఁ జక్కాడఁదొడరె ననంతములుగ నిశితనిర్మోకశరఘణు ల్నెఱి నిగిడ్చి.
ఆ॥ వాని నెదిరి నిల్చువారె లేరై రందుఁ బొడిచి గెలువఁ నిచ్చఁ బూనువార
లెవ్వ రింక దెసల కెగసి పాఱంజూచి రలఁతిఁబోని తూపు లలముటయును.

—♦ ఉద్ధతుఁ డగు నకంపను హనుమంతుఁ డెదుర్కొనుట. ♦—

క॥ భంగపడి మృత్యుముఖమున సంగాతులువడుటఁ గాంచి సరభసుఁ డై స
ర్వాంగముల రోస మెగుువ నభంగుఁడు హనుమ పఱతెంచెఁ బా ఱెడలింపన్.
ఆ॥ అమ్మహాబలు న్మహాబలసంభూతు నాప్లవంగయూథపాగ్రగణ్యు
నాజివీరు లరసి యతిహృష్టు లై చుట్టి యెగసి యెగసి యాడి రిందువదన!
క॥ బలవంతుఁ బెరసి తారుం బలవంతుల యాదు రెంత పాలసు లైనన్
బలవంతుల కతిబల మగు బలమొదవఁగ నేమిచెప్ప బలవైరినుతా! ౧౫౭
తే॥ అటు లవస్థితుఁ డచలాభుఁ డైన హనుమఁ గని యకంపనుఁ డుద్ధతి గవియఁబాఱి
నొగి శరాసార మొదవించు నోజ మించు జన్య మొనరించు లీలఁ బర్జన్యుఁ బోల.
క॥ వైరి నిగుడ్చు శరప్లుతి తీరెన్నక తద్వధార్థధీవృత్తి మయో
త్స్వారపరపార మెనసెను సారబలుఁడు మారుతాత్మసంభవుఁ డలుకన్. ౧౫౮
తే॥ తనువునను జొచ్చె నే నుచ్చిచనెన యేనియునుఁ దదీయాశుగాహతి కోహటింపఁ
డాశుగాత్మజుఁ డాశరు నభిగమించె భూమికంపంబు నొడగూర్చి పొల్చు గతిని.
క॥ దీప్తిస్ఫురితుఁడు సుగ్రీవాప్తుం డరి నలముతఱి మహాతేజములో
సప్తార్చిర్నిభుఁ డయ్యెను బ్రాప్తాశం బగుచు రూపు ప్రబల సురూపా! ౧౫౯
క॥ ఒకగిరిఁ బెకలించెను దా నకరణుఁ డను మాట యేటి కని యద్దానిం
బ్రకటముగఁ ద్రిప్పె నొకచే సకలాత్ముని భక్తుఁ డాత్తసంరంభుం డై. ౧౬౦
క॥ పోరి దుమికె నకంపనుపైఁ బురందరుఁడు నముచిఁ బొడువఁబోయినగతి వాఁ
డరసెఁ దనయాత్ర మరనెలశరముల నమ్మహీధరమ్ముఁ జక్కాఁడె ధృతిన్. ౧౬౧
ఆ॥ అటు విశీర్ణ మైన యాకొండ వైచి యగ్గలిక దర్పమునుఁ బ్రకాశిలంగ
దాని కన్న నుచ్ఛ్రితం బగు నశ్వకర్ణాఖ్య మగముఁ దూర్ణ మాక్రమించి. ౧౬౨
క॥ దానిఁ బెఱికి దెస లద్రువంగా నార్చుచుఁ ద్రిప్పు లిడుచుఁ గదనాంగణముం
బూనిక నగలించుచు బలు జానువులం దరులు గిరులుఁ జమరుచుఁ బెలుచన్.
ఆ॥ పదరి రథుల హాస్తిపకులఁ దొరంగికులనుఁ బదాతులనుఁ దదనుపదముల
తోడ ననుపదంబె తూఁటాడఁదొడరె సంక్రుద్ధుఁ డగుచు ననిలుకొడుకు గడిమి.
ఆ॥ అట్లు చుట్టుకొనిన యాకారుచిచ్చులో మిడుకు మిడుత లగుచు మడియు తనదు
బలగములను గాంచి పఱతెంచె నంతకుండితఁడు నిజ మటంచు నెదఁ దలంచి.

క॥ ఆయోధవరుఁ డకంపనుఁ డాయోధనమునకు నిక్కి యార్చెఁ గడంకన్
బోయెం గ్రోధముత్రోవం బోమెదిరి జయింతు ననెడు బుద్ధి దివియఁగాన్.

క॥ పదునాలుగు నిశితము లగు ప్రదరముల విదారణములఁ బఱపి హనుమనిన్
బదరి ప్రభేదించె నసురుఁ డదె మూలం బయ్యె వాని యంతమున కుమా! ౧౬౭

తే॥ మఱియు శరవృష్టిఁ బఱఁగించె మహితు నతనిఁ
బాప రక్షోవరానీకపాలుఁ డడరి
హనువు దాఁకి చిఱుతనాఁడె యైంద్ర మశని
మొక్కవోయె నటంచు నమ్మోములెఱుఁగఁడు. ౧౬౮

మ॥ అలుఁగు ల్గాడఁ బ్రరూఢవృక్ష మగు నయ్యద్రీంద్ర మ ట్లొప్పెఁ జి
ప్పిలు నెత్తుర్ల వికాస్యశోకతరుసంస్ఫీతత్వముం గాంచె భా
సిలు భాసంపదతోడి రోసమున నిస్సీమం బధూమంబు నౌ
ప్రలయాగ్నిం బురుడించె వాఁడు భువనప్రారంభసంభావితా. ౧౬౯

—◆ హనుమంతుఁ డకంపనుఁ జంపుట ◆—

ఆ॥ ఉత్తమము మహీజ మొక్కఁ డుత్పాటించి యామహీజశోక మపనయింపఁ
బాడమినట్టి ఘనుఁడు భువి చెస ల్గంపింపఁ ద్రిప్పి యసుర శిరము ద్రెవ్వనేసె. ౧౭౦

క॥ వాతాత్మజకృతవృక్షాఘాతంబున వాఁడు గూలెఁ గదనక్షోణిన్
స్ఫీత మగు మేను నులియఁగ నాతత మరదంబు శిథిల మై రాలంగన్. ౧౭౧

క॥ క్షితికంపంబున ద్రుమముల గతిఁ గంపితు లైరి తా రకంపనుఁ డటు సం
హృతుఁ డౌట గని నరాదులు మతిఁ బాసిరి ప్రహరణముల మఱచిరి సురుచీ.

ఆ॥ కాందిశీకు లైరి కడల కమ్మెయి నసంకీర్ణు లైరి ముక్తకేశు లైరి
భజ్యమాను లైరి భ్రాంతు లై రసురులు స్విన్ను లైరి శ్వసితవితతు లైరి. ౧౭౩

క॥ వెనువంకఁ దిరిగిచూచుచు ఘనభయమునఁ ద్రొట్టుపడుచుఁ గాల్నిల్వఁగ లే
క నుగతుల నగలఁ దిట్టుచు జని రిరవున కెట్టులెటులొ సారసనయనా! ౧౭౪

ఆ॥ పూజసేసి రెలమిఁ బొందిరి కపివరు లెల్ల రనుమఁ జేరి హితముఁగోరి
పొగడి రుల్లసిల్లి పొగడె నవ్వాఁడు మీ సాయ మెంతకైనఁ జాలు ననుచు.

క॥ జితకాశు లతిస్వరభృతి నతిహర్షోల్లాసు లగుచు నార్చిరి రణభూ
గతులం బగతుర నీడ్చిరి బ్రతినిహతుల జీవయుతుల బ్రాణవిరతులన్. ౧౭౬

క॥ బలి బలములతో గెల్చి ప్రబలు హరిఁ బురుడించి వఱలెఁ బరకాలు మహా
బలు సబలు నసురుఁ గూల్చి సుబలుఁడు మహాబలునిపట్టి బలరిపువంద్యా!

శా॥ వీరశ్రీఁ దనరారు మారుతి ననిర్వేదుం బ్రశంసించి రి
శూరుం బోలునె యొం డటంచు సుర లాచోద్యంబునం బొంగుచున్

ధీరుం డారఘునేత లక్ష్మణుఁడు సన్మిత్రుండు సుగ్రీవుఁడున్
సారోదారుఁడు దైత్యనాథుఁడును బ్రస్తావించి రస్తాఘులై. ౧౭౯
ఆ॥ కదనరంగమున నకంపనుం డీల్గిన వార్త వినియె దనుజవల్లభుండు
గాంచె సచివవరులఁ గడుదైన్యము మొగాన వ్రేలుకాడఁ దలఁకు విధముతోడ.

—♦ అకంపనమరణదుఃఖితుఁడై రావణుఁడు పురిం దిరుగుచుఁ బ్రహస్తున కానయిడుట ♦—

ఉ॥ ఒక్క ముహూర్త మేమనుచునో మదిలో గదియించి యెంచి యా
యక్కఱ గల్గు చుట్టముల కందఱకు న్వినిపించి తోడనే
రక్కసిఱేఁడు నల్గడల రాణువ లారయఁబోయెఁ బ్రాహ్ణమం
దిక్కలు గాంచుచుం దిరిగె నిక్కము చక్కటి కెక్కు వృత్తితోన్. ౧౮౦
ఆ॥ అట్టి వైభవంబు లందిన యాపురి ముట్టికోలుఁ గాంచి మొక్కవోవు
గతి దలంచి యలుక గారింపఁ దత్కాల మాప్రహస్తుతోడ ననియె నిట్లు.
ఉ॥ యుద్ధవిశారదుండవు నయోల్లసితుండవు నీ వెఱుంగవే
బద్ధయ కాఁగ నిప్పురి విపాశ నొసర్పఁగ న్హ్యేవారి నీ
బుద్ధిఁ దలంపు మెం డెదియుఁ బోలదపో యరిమర్దనంబె సం
బద్ధము గాన నీనెఱినిఁ బన్నము పన్నగు నర్థ మింకిటన్. ౧౮౨
క॥ నేనో ఘటకర్ణుఁడో నాసేనాపతి వీవో యింద్రజిత్తో నికుంభుం
డో నేఁటిభార మింతయుఁ బూనఁగ నగువార మిట్లు బుద్ధిఁ దలంపన్. ౧౮౩
ఆ॥ కాన నట్టినీవు కదలుము ప్రబల మాబలముఁ గొంచు విజయపట్ట మెనయఁ
గొమ్మమెకము లెచట గొనకొందు రచ్చటు నందు నీప్రతాప మతిశయిల్ల. ౧౮౪
క॥ నీనిర్యాణంబున న వ్వానరవాహిని స్వతశ్చపల చపలత్వం
బానెఱిఁ గాంచదె నిను నీతోనార్పు లెసంగనడరు ధూర్వహులఁ గనన్. ౧౮౫
క॥ తరళు లవినీతు లవ్వానరు లిభములు ననుచు సింహనాదము నల్లె
నరభసుఁడ వైన నీవిస్ఫురితార్భటి నోర్చి యింకఁ బోడవ్రువడుదురే. ౧౮౬
ఆ॥ బలము సెదరి నిల్వఁ బట్టులేక సుమిత్ర కొడుకుతోడ రామకువలయేశుఁ
డపుడె నీకరమున కందు నెవ్వా రటఁ బొంగి కోల్తలకుఁ గడంగువారె ౧౮౭
ఆ॥ యుద్ధ మొనరఁ జేసి యూడుటో నిల్చుటో శ్రేయ మూరకుండి చెడుట మేలు
గాదు నామతంబు గద యిట్లు నీతలం పిదియొ వేఱొ యన్వయించి యిడుము.

—♦ ప్రహస్తుఁడు జేనితోఁ దగుమాటలాడి యాయత్తుఁ డగుట ♦—

క॥ అని రక్షోవిభుఁ డడిగిన ననుపమజవసత్త్వుఁ డిట్లు లనియెఁ బ్రహస్తుం
డనుపద మసురేంద్రునితో దనుజగురుఁడు పలుకుచొప్పు దార్కొనుచుండన్.

మ॥ కుశలుల్ మంత్రులు నీవు నేనుఁ దొలుతం గూడంగ నై మంత్రముల్
విశదంబుం బొనరించినారమకదా వేయేల యావేళఁ బ
న్పశమై ల్గాల్పడలేదొ నేటుకొనమో పారంబుఁ గన్గొంట గా
క శమంబొప్పునె యిప్పుడొండు మదిఁ జక్కం గూర్తునే యింకిటన్. ౧౯౦
ఆ॥ సీత నొసఁగి సంధి సేయుట మే లంచు నట్లుగాక యున్న నరుల ముట్టి
పడుట నిజ మటంచు భావించితిని నాఁడు బ్రథితు లెల్ల నేర్చి పలికినారు. ౧౯౧
క॥ అదె దృష్టం బయ్యెను నేఁడది యిది యని యెన్ననేల యలఁతిపడక యూ
నదనునఁ బొడిచిన గెలుపో సదమలపరలోకగతికిఁ జనుటో యొప్పున్. ౧౯౨
శా॥ నీచేఁ బూజల దానమానముల నున్నీతంబులం గొంటి బల్
సాచివ్యంబున నుంటి మంటి గృతులం జాల్కాంచు మేల్కాంచు ని
ష్టీచారిత్రము చొప్పడంగ హిత మా నెట్టులేకాక యొం
డొ చీ కెంచెడువాఁడనే మదిని మద్యాథార్థ్య మూహింపవే. ౧౯౩
ఆ॥ పుత్రదారధనవిభూషణవిభవము ల్వీడినాఁడ మేలి వెర వెఱింగి
వేల్తు జీవితంబు విధియు క్తముగ రణవేదిఁ దావకార్థవృత్తి నెగడి. ౧౯౪
క॥ అని పలికి వాహినీపతి తనయోధుల యూథపతులఁ దద్దయు వేడ్కం
గని సమకూర్పుడు బలముల ననితరముల కాఁగ నింక ననికిం దరలన్. ౧౯౫
ఆ॥ నగచరౌఘు మెల్ల నాదుబాణాశని వేగనిహతి నుసుఱు వీడి వ్రాల
మలవి పొలసు లొరసి మాంసాదములు పక్షు లెదలఁ దృప్తి మించి పొదలుఁగాత.
మ॥ అని సేనాపతి యాజ్ఞ సేయఁగ బలాధ్యక్షు ల్ససంరంభు లై
చని సంగ్రామబలౌఘముల్ దొరసి నిష్క్రాంతం బొనర్పంగ నై
రి నిమేషంబున లంక వస్యగజముల్ రెమ్మంగ నెట్టట్టు లా
దనుజు ల్నాస్త్రీలు గ్రమ్మ సంకులయ కా దర్శింపనయ్యెం బొరిన్. ౧౯౭
ఉ॥ వేలిమి వేల్చువారు పృథివీసురులం గని మ్రొక్కువారు మే
ల్పూలును దండలుం గొని యపూర్వజపప్రణిధానము ల్తగం
బోలఁగఁ దాల్చువారు బలిపూజలవంక మెలంగువారు నై
రాలలి లంకలోఁ గలుగు నందఱుఁ దొందరపాటునన్ సఖీ! ౧౯౮
క॥ హావిరాజ్యహోమగంధము లవిరళముగఁ దాల్చి యనిలుఁ డంతట వీచెన్
వివర మొనరించె రక్షః ప్రవరప్రస్థానరభసపద్ధతి నదియున్. ౧౯౯
ఆ॥ పేర్చు విండ్లు దొనలు వివిధాయుధంబులు పొల్చుజోళ్లు మేలి బొమిడికములుఁ
దాల్చి సత్వరముగఁ దరలిరి రావణుఁ గాంచి ప్రాప్రహస్తుఁ గలుసుకొనిరి ౨౦౦
క॥ ఆరాత్రిను లందఱు దగువారువములఁ దేర్ల సమదవారణముల న
ధ్యారోహించిరి ప్రస్థానారంభము దెలుప భేరు లత్తఱి మొరసెన్. ౨౦౧

సీ॥ నిఖిలదివ్యవిమాననివహంబు దులకించు శ్రీల సంచున ధిక్కరించునదియు
రవిచంద్రమండలారంభకంబుల నిజసర్జనం బను వార్త జాటునదియు
నొడిసినఁ దిరుగ దీయురగధ్వజము చక్క దిలకింపరాదంచుఁ దెలుపునదియు
రెక్కలు గల వంచు నిక్కకు మోగరుడీ! యనుతేజీల నెనయునదియు
సజ్జకల్పితంబు సకలార్థసమవేత మలఘుయంత్రచోదనాన్వితంబు
భీషణారవంబు పృథులంబు నౌ రథమెక్కె నయ్యమాత్యుఁ డినుననుజ్ఞ. ౨౦౨
క॥ లంక విడిచి వాఁడు నిరాతంకుం డై బయలుదేరు తఱి మ్రోసె నెత్తా
సంకటలు డక్కలు బూరా లింకం దగునవియుదిక్కు లెక్కం బెలుచన్. ౨౦౩
ఆ॥ బలము ప్రబల మతని బలిసి యార్చుచు రాఁగ నదియు నిదియు నొక్కఁ డై తనర్చె
దెసలు ఘూర్ణిలంగ దివ మబ్ధి నెరయంగ నగుచుఁ బ్రలయఘనఘనారవమున.
వ॥ భీమరూపులు మహాకాయులు నగు నరాంతకకుంభహనుమహానాదసమున్నతు
లను నలువురు మానిసిదిండి మన్నెకాండ్రు తనదుమన్ననల విన్ననువుఁ గాంచు
వారు. వైరి పై రన్నంత బేరలుక మీరకుం బాఱగా సాఁగువార లాసర్వసేనా
ధీశుం బరివారించి రయ్యవసరంబున. ౨౦౪
క॥ సన్నద్ధకంకటము సంపన్నం బిభయూథనిభము బలతేజస్సా
రోన్నతము నౌ బలముఁ గొని పన్నుగఁ బురి వెడలె నతఁడు ప్రాగ్ద్వారమునన్.
ఆ॥ సాగరౌఘ ముబికి చనుదెంచెడు నటంచు నెదిరి బలమువార లెన్నుచుండఁ
గదిసె వాఁడు ప్రలయకాలాంతకయముండు నాఁగ నాగనాసికాగురూరు!
క॥ ఘననిర్యాణస్తనితం బనంతరం బగుచు స్వీయ మనుగజనము న
ల్లినయఁగ లంకం గల భూతనివహ మార్తస్వరములఁ దద్ద నిగిడ్చెన్. ౨౦౮
ఆ॥ మొగిలులేని మిన్ను మొగకొని మాంసాస్రభోజి పక్షిరాజి భోరుకొనుచుఁ
జుట్టె నాజి రథముచుట్టు నపక్రమమున నె యసుర చేటు మూఁడు టనుచు.
ఉ॥ నక్కలు నోళ్ళ మంటలు ఘనంబుగ వెళ్వడఁ గూసె నుల్క లా
చక్కటి మిన్నునం బొడమి చాల్పుగ వ్రాలె సమీరవిక్రమం
బెక్కటి కర్కశంబనుచు నెన్నఁగ దోఁచెఁ బరస్పరాగ్రహం
బెక్కుడుగా సిరు ల్దెరల నేర్పడె నాగ్రహమండలంబునన్. ౨౧౦
మ॥ ఖరనిర్ఘోషములన్ సురారిపయి మేఘంబు ల్బొరాళించుచున్
గురిసెన్ రక్తముఁ దత్పురస్సరుల పైఁ గోక్లోల్లఁగాఁ జల్లె న
ట్లురుగృధ్రం బొకఁడుత్తరేతరముఖం బొప్పన్ ధ్వజాగ్రంబునం
దిరవొందెం బరిపార్శ్వకర్షణకృతి స్వాతుస్థితి ద్దెల్పుచున్. ౨౧౧
ఆ॥ తలఁకఁ డాజిఁ జొచ్చి తద్దయు నేర్చిన వాఁడు తురగవిద్య వంశగతయ
కాఁగ నదియు వెలసె ఘనుఁ డట్లు పేర్చినయంత చేతికోల యవనిఁ బడియె.

క॥ మొగ్గతిలంబడెఁ దేజీ లుగ్గులుఁ బెక్కులు ఘటిల్లె నొగి యానజ మై
దృగ్గత మమరదురాపము నగ్గలమును నైన తేజ మడఁగె న్గడెలోన్. ౨౧౩
ఆ॥ వెల్లఁబోయి యెల్ల విధి నేర్పుఁగాత నుంచదనునందు ధైర్య మధికమించి
యభిగమించె వానరాధీశు వాహిని ఖ్యాతపౌరుషుఁడు ప్రహస్తుఁ డడరి. ౨౧౪

—♦ ప్రహస్త సైన్యము రామ సైన్యము నెదుర్కొనుట ♦—

క॥ అదిఁ గని ప్లవంగయోధులు సుదినం బిది యనుచు మేలు సూచుచుఁ దరువుల్
పదిలము లగు శిలలుం గొని పదరి యెదుర్కొని రధీతపవనవిహ్వాతు లై. ౨౧౫
తే॥ అట్టు లిరువాఁగువారు ననంతవేగు లప్రమేయోరుతేజులు నగుచు నొంట
నార్చు నార్పు లాహూతులు నడరి పెచ్చు పెరిఁగె దివిఁ బ్రాఁకె నల్గడ ల్భేదిలంగ.
క॥ ఆహరిసేనం జొరఁబడె నోహాటిలక శలభ మగ్గి నొలయుగతిన్ బ్ర
త్యూహము లెన్నక మిన్నక సాహస మొనగూర్చినట్టి సంరంభమునన్. ౨౧౭

—♦ రామ విభీషణుల ప్రశ్నోత్తరములు ♦—

ఆ॥ లంకలోననుండి లావరి యొకరుండు వెడలుచున్నవాఁడు విపులతేజుఁ
డనఁగ నరసి యెంచి యవ్విభీషణుఁ గాంచి యరినిహంత రాముఁ డలఁతి నగుచు.
క॥ ఎవఁ డతఁడు మహాకాయుఁడు జవనుఁడు కపిసేనవంక సరభసుఁ డై పో
దివురుచునున్నాఁ డాతనిదవు తెఱఁ గేర్పడఁగఁ దెలుప నవు నీ కనినన్. ౨౧౯
క॥ మన్నాథ ! జగన్నాథా ! సన్నుతగుణధామ ! యతఁడు సకలానీకం
బున్నతిఁ బాలించెడువాఁ డెన్నఁదగిన మంత్రి విభున కెంతయుఁ గూర్చున్. ౨౨౦
ఆ॥ మూడుపాళ్ళబలము మొనసికొల్వఁగఁ బేర్చు వీర్యవంతుఁ డస్త్రవిదుఁడు శూరుఁ
డలబలంబుసేయు నరిబలంబులఁ గన్నఁ బలుదురంబులందుఁ బడసె నసము. ౨౨౧
క॥ ఈతఁడు ప్రహస్తసంజ్ఞుం దాత వెరయుఁ గాంచినాఁడు తతరోషుఁడు క్రౌ
ర్యాతతుఁడు దుష్టబుద్ధిసమేతుఁడు పతి దలఁచు కృతి సమృద్ధి ఘటించున్. ౨౨౨
ఆ॥ ఇతఁడు దెగెనయేని నెల్లబలంబులుఁ బఱచు దొరయు విన్నఁబాటుఁ గాంచు
నీవు దలఁచినంత నెగడుగా కెవ రేమి సేయువారు మహితచిత్ప్రకాశ ! ౨౨౩
క॥ అని తెలిపె నటు ప్రహస్తుండని మొనఁ జొరఁబాఱి గర్జ లడరం దనవా
రిని బెరసి బరవసముసేసె నవాక్రమణంబు పగఱ సిలుగులఁ బెట్టన్. ౨౨౪
క॥ బల్లిదులు పెద్దకత్తులు బల్లెము లలుఁగులును విండ్లు బహుకరణములుం
గొల్లలుగాఁ గొని యడరిరి భల్లప్లవగాఢ్యసేనపై గుము రగుచున్. ౨౨౫
క॥ అవ్వానరవాహినియుం దవ్వుల నవ్వారిఁ గాంచి తలపడెఁ దలఁచున్
నొవ్వ నని లేక ప్రమాఁకులు నవ్వాటున శిలలుఁ గొంచు నఱిముఱి నెఱియన్.

క॥ బండారులఁ బోడుచువారల దుండగ మెన్నంగనయ్యెఁ దొలితాఁకున ని
ట్టుండవలవదే మగఁటిమి బండారం బనెడు సురల పలుకుంబడులన్. ౨౨౮
ఆ॥ అస్త్రవృష్టి నెరసె నటు లశ్మవృష్టియు నొరసెఁ గ్రోఁతిమూఁక నుక్కుమడఁతు
మనుచు నసురబలము లవ్వానిఁ దెగటార్తు మనుచు హరిబలములు నడర నపుడు.
సీ॥ శూలము ల్గ్రొవ్వంగ స్రుక్కి వ్రాలెడువారు పరమాయుధము లంటఁ బరియువారు
పరిఘప్రహరణార్తిఁ బరిపరు లగువారు గండ్రగొడ్డళ్ళఁ జెక్కు లగువారుఁ
ప్రాసప్రసృతి నిరుచ్ఛ్వాసు లై పడువా రిషుప్రోతు లై బిట్టు సోలయువారు
ఖడ్గధారల ద్విప్రకారు లయ్యెడువారు గదలఁ గ్రక్కదల మ్రొగ్గతిలువారు
నైరి కపులు వారు వైరుల నమ్మెయి వరశిలాతరుప్రవర్షణముల
వజ్రముష్టిహతుల వ్రచ్చి చూర్ణించి నల్లల నెడల్చి నేలఁ గలిపి రపుడు. ౨౨౯
ఆ॥ కండ్లు వగులఁ బండ్లు గదల గాలుం జేతులూడ మస్తకములు వీడ నుభయ
పక్షవీరు లెగసిపడి రందు నిందు బిట్టార్తసింహారవము లతిశయిల్లె. ౨౩౦
క॥ కన్నులు దెఱచి విత్తాకుగఁ బన్నుచుఁ దెరలుచుఁ దిరమ్మునపడుచుఁ బయిం గ్రో
ధోన్నతిమై నెగయుచు నపు డన్నిర్మృతులుఁ గపులుఁ బోరి రభయత వెలయన్.

—♦ సుగ్రీవసామంతులు ప్రహస్తసచివుల నలువుర వధించి విజృంభించుట ♦—

క॥ నలువురు ప్రహస్తసచివులు నలి నలిసేయంగడంగినా రని హరివీ
రులఁ దులకించు మగఁటిమిన్ జలమున నుబ్బున జయప్రచారాసక్తిన్. ౨౩౨
తే॥ ఆచతుష్కంబున నరాంతకాఖ్యు ముట్టి
యచలశృంగాహతిఁ దెరల్చి యంతకాల
యమున కనిచెను ద్వివిదుండు సమయ మరసి
యమరు లౌ సౌ ననంగ హర్షము వొసంగ. ౨౩౩
క॥ అది గని దుర్ముఖసంజ్ఞుఁడు విదితుఁడు హరివర్యుఁ డెగిచి వెలయుము సఖుతో
నదనున ననుచుఁ దలాహతి మదమడఁచె సమున్నతుం బ్రమథితుఁడు గాఁగన్.
ఆ॥ జాంబవంతుఁ డడరి శైలాభ యగు శిలయెత్తి తనదు తేజ మెసక మెసఁగ
వైవఁ బేసురంబు వగుల మహానాదుఁడపుడె శమనుపురము నధిగమించె. ౨౩౫
క॥ తారుఁడు కుంభహనుని తలఁ దీరగు వృక్షమున మోఁదఁ దెరలె నసూఱు ల
వ్వైరి శరీరము వడిమెను ధారుణిఁ గ్రక్కదల భూతధాత్రీధరజా!. ౨౩౬
క॥ ఆకర్మం బోర్వక లంకౌకస్సేనాధిపతి ప్రహస్తుఁడు జవ మ
ప్రాకృత మై తనరార వసౌకసులం దాఁకె సరథుఁ డై సాయుధుఁ డై. ౨౩౭
క॥ ఆసమయము సంవర్తముగా సంక్షుభితార్ణవప్రకాండం బన నా
నాసైన్యయుగలమున దెస లాసంజితములుగఁ దోఁచె నారవ మొకటన్. ౨౩౮

వ॥ ప్రశస్తహస్తలాఘవుం డగు నా ప్రహస్తుం డలిగి యప్పరమాహవంబునం జెల రేఁగి యమోఘం బగు శరౌఘంబున వానరబలంబులం బీడింప నందును నేర్చిన వా రెల్ల రాక్షసదలంబుల విదలింప నయ్యిరువాఁగునం దోడరి నిహతులై పడు వారి కళేబరంబులం బర్వతంబులం బఱచి నట్లైన యమ్మేదిని యతిఘోర మై కానంబడియు మాధవమాసంబునం బుష్పితం బగు పలాశవనంబుచేతనుం బలె రుధిరౌఘంబుచేఁ బ్రచ్ఛన్నమై తోఁటియట్లు గానఁబడని దయ్యె. హత వీరౌఘప్రతీరయు భగ్నవివిధాయుధోద్దామద్రుమయు శోణితపూరమహానీయయు యమసాగరగామినియు యకృత్ప్లీహదుర్గమకర్దమయు వినికీర్ణాంత్రశైవలయు విభిన్నకాయశిరోమీనయు నంగావయవశాద్వలయు గృధ్రహంసగణాకీర్ణయుఁ గంకసారసేవితయు మేదఃఫేనసంపూరితయు నార్తస్తనితనిస్వనయుఁ గాపురుషదుస్తరయు నగు నారణభూమితరంగిణిని ఘనాపాయంబున స్వపదరజోధ్వస్త యగు సరసిని గజయూథపంబులుంబలె వలీముఖముఖ్యులు గ్రవ్యాదవర్యులుం దాఁటంగ నౌ తలంపున జొటగొని పాటుపడుచుండు నయ్యవసరంబున. ౨౩౯

—♦ చెలరేఁగిన ప్రహస్తుని నీలుండు వారించుట ♦—

క॥ స్యందనగతుఁడై శరనిష్యందమును సృజించు నా ప్రహస్తుం గని యి
ట్లందఱ ముంచెడు వీఁ డనిస్పందము నొందని ప్రయత్నసంభ్రమ మొప్పన్. ౨౪౦

క॥ నీలుఁడు ప్రావృడ్జలదవినీలుం డవ్వానిఁ దాఁక నెఱసెఁ బ్రబలమై
యాలీల నడరు నభ్రమునోలిం గాలి యన నెదిరి యొరసె నసురయున్. ౨౪౧

మ॥ ధను వాకృష్ట మొనర్చి యాహవమునం దర్పం బెలర్ప న్నికృం
తనుఁ డా రాక్షససైన్యనాథుఁడు మహాద్ధత్యంబునం బేర్చి నీ
లునిపై వే పరగించినట్టి యలుఁగుల్ రుష్టంబు లౌ సర్పముల్
నా నెక్కొ ల్గనె భూగతం బతని మేనం జొచ్చుచుం గ్రచ్చుచున్. ౨౪౨

తే॥ అట్లు శరపూర మెగువఁ ద న్నఱుము నసుర
వాహినీంద్రునిఁ గపిబలవల్లభుండు
మోఁదె బలు మ్రాఁ నొకఁడు గొని మొక్క వ్రాక
వాఁడు వాని నాశుగవృష్టి వాంచి ముంచె.

ఆ॥ బాణగణము లట్లు ప్రబలి ఘోరతరంబు లగుచు నాక్రమింప నగ్నిభవుఁడు
కాంచి యుడిగి గెడపఁ గా దటంచు సహించెఁ దనదుబలము క్షాంతిఁదవిలి మెఱయ.

ఉ॥ వెల్లగు శారదంపుజడిఁ బెంపెసఁగంగఁ జొరంగ నై మొగం
బెల్లన వాంచి కన్మొగిచి యానెడ కేఁగఁగడంగు మేలి గో

నల్లభ మట్టు లాప్రదరవర్షము నోర్చి కడంకఁ బేర్చి యా
బల్లిదుఁ డొక్కబల్తరువుఁ బట్టి పెకల్చి విదిర్చికొంచు చొగిన్. ౨౪౯
ఆ॥ వానిఁ జేర నరిగి వరరథాశ్వముల మనోజవముల నుగ్గునూచ మగుచుఁ
బోవ నడఁచి మించుచేవఁ బైకొని తచ్ఛరాస మొడిచి విఱిచి యార్చె నపుడు.
తే॥ ధనువు సెడ గఫ్యతతి గూలఁ దగినపరికరంబు సేర్చుకొనఁగనీక రాతి వేఁప
నెట్టకేలకు నొడుపుమైఁ గట్టి ముసల మొకఁడు గొని స్యందనము వీడి యుఱికె నసుర.
ఆ॥ ఉభయవాహినీంద్రు లుద్దాము లై యొండొరులను దాఁకి వైరరూఢు లగుచుఁ
బోడుచుకొనిరి జనము పొగడొంద సింహశార్దూలసంప్రయోగలీల లొప్ప.
తే॥ శాతదంష్ట్రలఁ గ్రొచ్చుచు క్షతజదిగ్ధగాత్రు లగుచుఁ గషాయితనేత్రు లగుచుఁ
బెరసి విసివ ర్తనము లేని పెనఁకువల మెలంగి రవ్వారు జయకాంక్ష లావుఁ బెనుప.
క॥ పేరెనసినవారే తగు తీరునమనువారె యెల్లదెలిసినవారే
వా రిరువురుఁ బోరఁగఁ గనువారికి నబ్రంబు వొడమె వరమునివంద్యా. ౨౫౦
క॥ వారని యలుకమెయిన్ మదవారణముల యట్లు దొడరి వరకరకృతదు
ర్వారాఘాతంబుల ననివారా రావల నెరపి రఖిలవందితచరణా. ౨౫౧
క॥ వాలుకడిమిన్ మైఁ గడుకొని నీలుని ఫాలమునఁ బొడిచె నిర్వాణమునం
బో లావఱి నని ముసలముచే లావరి యసురుఁ డెదిరి చేష్టా టొందన్. ౨౫౨
ఉ॥ నెత్తురులొల్క నల్కమెయి నీలుఁడు శోణితదిగ్ధగాత్రసం
నత్తిఁ దనర్చి యొక్కఘనసాలము వే పెకలించి తెచ్చి యా
యత్తత చొప్పడన్ గదిసి యాశరవర్యు నురంబు దాఁకఁగా
నత్తఱిఁ ద్రిప్పివైచె నది యాఱడి పోవ నొనర్చె నాతఁడున్. ౨౫౩
శా॥ దానం దీవ్ర మమర్ష ముప్పతిల నౌద్ధత్యంబునం బేర్చి వే
గానూనుం డచలాభ నొక్క శిల నొయ్యం దాల్చినం దొంటి దు
ర్మానం బ్రాసతిసేయ నమ్ముసల మమ్మాణంసాశి తాఁ గొంచు నా
పై నొ వ్వెన్న కెదిర్చి తాఁకె జయలాభశ్రీప్రలోభంబునన్. ౨౫౪

—♦ కపిసేనాపతి రాక్షససేనాపతిం జక్కాడుట ♦—

ఆ॥ ముసల మనిన మదికిఁ గిసలంబుగాఁ బొడవెత్తి గ్రావ మతని నెత్తిమీఁద
వైచెఁ గపివరుండు పలువ్రక్కలుగఁ దలవగుల రాక్షసుండు వసుధఁ గూలె.
క॥ వసివాటున మొదలుచెగం బసచెడి పడు పాదపంబు పగిది నసురుఁ డ
ట్లుసు రెడలి వ్రాల సిరి నెఱియుసి సత్త్వము నప్పుడపుడె యుడివోనయ్యెన్.
ఆ॥ శిరము మేను నటు విశీర్ణంబుగాఁ దొట్టు రుధిరపూర మపుడు రూఢమయ్యె
ధాతురాగయుతము తద్ధరాధరమున ప్రస్రవణ మనంగఁ బద్మనయన ! ౨౫౭

ఉ॥ నీలునిచేఁ బ్రహస్తుఁ డటు నీల్గ నకంప్యము తద్బలం బాగిన్
జాలఁ గలంగి లంకకయి. సాగెఁ దలంబున నిల్వలేక వా
ర్జాలము సేతుబంధ మవసన్నము గాఁగఁ దొరంగుచాడ్పునన్
బోలఁగ శోకసాగరము పొందెను పొందిక గానిపింపఁగన్. ౨౫౮

ఆ॥ ఒడయఁ డెడయఁ బ్రశమితోద్యమ హతశేషసేన ముందు వెనుక గాన కరిగి
చిన్నవోయి సన్నసెడి మూఁగ యై నిల్చె దానవాధినాథు దరినిఁ జేరి. ౨౫౯

శా॥ నీలుం డట్లు జయంబుఁ గాంచి బల మున్నీతంబ పో విద్విష
త్కాలుం డీతఁ డటంచు స్వీయకృతిఁ బ్రస్తావంబులం బన్నవా
రాలో నేర్పడ రాము లక్ష్మణయుతు న్వ్యాసక్తిమైఁ జేరి త
త్ప్రాలంబాప్తిఁ బ్రహృష్టరూపుఁ డనఁగా నయ్యెం గదం బ్రియా. ౨౬౦

వ॥ అంత

—♦ ప్రహస్తమృతికి వనరి రావణుఁడు స్వయముగ రణమునకు వెడలుట ♦—

ఆ॥ అట్లు తన్నుఁ బెరసి యరచెడ్డ సైన్యంబు వెఱచి వెల్లమోము వెట్టి గట్టి
లేని పలుకుఁబడిని సేనాధిపతి వహ్ని సూనుచేతఁ బడినచో ప్పనుటయు. ౨౬౧

ఉ॥ ఏయది తావొ శోకమున కేయెడ రోసము నేటుసేసెనో
పాయనిజంట యిర్కటము పాలయి నిర్జరపాలవైరి హా
హా యని యోధపుంగవుల నందఱఁ గన్గొని కన్గొన ల్బొరిం
దోయము విస్ఫులింగములఁ దోయము వెల్వడఁ జేయ నిట్లనున్. ౨౬౩

ఆ॥ చుల్కఁజూడఁ జనునె సూడెంచు నవ్వాని నింకఁ దనదుబలఁగ మొగచిపడఁగఁ
దెగి బలారిబలముఁ ద్రెంచిన నాసైన్యపాలు నెదిరి నేలపాలు సేయ. ౨౬౪

క॥ ఒక్కనిమాటయ కా దాదిక్కునకుం జనినవానిఁ ద్రిక్కొనసీ రిం
కెక్కడిసారము బీరము స్రుక్కెదరే యిట్లు సిల్లుసూపిన వారల్. ౨౬౫

ఆ॥ బలము లిట్లు చేటుపడె నొండు దలఁపకే యంతసేయఁజాలినట్టి నేన
పోవువాఁడ నద్భుతావహ మారణసీమ కరుల నొంప సిరి వరింప. ౨౬౬

తే॥ నేఁడె జొరఁబాఱి వానరానీక మట్లు రాము సహలక్ష్మణు దహింతు నేమ మొప్ప
మించు కాంతారముంబోలె మిడుకనీక మామకశరౌఘదీప్తాగ్నిమండలముల.

మ॥ అనుచుం గట్టడసేసి సన్నిహిత మత్యగ్నిప్రకాశంబు భా
నునికాశంబు విరాజమానము జవాన్యూనోత్తమాశ్వంబు స్యం
దన మెక్కెన్ సురరాజశత్రుఁడు సముద్యచ్ఛంఖభేరీముఖ
ధ్వను లాస్ఫోటితసింహనాదములు భవ్యస్తవ్యము ల్మీఱఁగన్. ౨౬౭

క॥ బహుమానపురస్సరముగ బహుళము బలగమ్ము గొలువఁ బరఁగుచు నసురో
ద్వహుఁడు వెడలె నాజికి దుర్వహరోషభరంబు దన్నవారణ నలుమఱ్. ౨౧౯
ఆ॥ కొండల న్నొగిళ్ళఁ గూర్చు మేనులఁ బావకప్రదీప్తనేత్రకలన లొలయ
నురుబలాఢ్యు లగుచు నొప్పు మాంసాదులతోడ నడిచె ననికి దుష్టదమని! ౨౨౦
క॥ తత్తాదృగమర్షంబున సత్త్వాఢ్యుం డతఁడు ప్రలయసంరంభకలా
యత్తుఁ డగు రుద్రుచాడ్పున నత్తామసవర్గ మెనసి యరిగెం దరుణీ. ౨౨౧
మ॥ నగరాజన్యకుమారి! తేజము మహౌన్నత్యంబుఁ బెంపారఁగా
నగ రారాక్షసరాజరా జెడలి సన్నాహంబుతోఁ జేరనై
నగరాజాచలహస్త మూర్జిత ముదన్వత్తోయదారావ మె
న్నఁగరా దంచు దలంచుచుం గనియె మాన్యం బర్కభూసైన్యముల్. ౨౨౨

—♦ రాముఁడడుగ విభీషణుఁడు వచ్చుచున్న దానవుల తెఱఁగు లెఱిఁగించుట ♦—

ఆ॥ అట్టుదోఁచు రాక్షసానీక మత్యంతచండిమంబు రామచంద్రుఁ డపుడు
సైన్యపరివృతుండు సశ్రీకుఁ డరసి విభీషణు నసపత్నభీషణుఁ గని. ౨౨౩
శా॥ నానారత్నపతాకికాధ్వజమహౌన్నత్యంబు జీమూతనా
గానూనేభసమంచితం బఖిలశస్త్రాస్త్రోపలక్ష్యం బభీ
కానేకోద్భటయోధజుష్ట మమరేంద్రాక్షోభ్య మెవ్వాని దీ
సేనావారము దెల్పు మో ప్రియసఖా సిద్ధంబు బుద్ధంబుగాన్. ౨౨౪
క॥ అని యడిగెడు రామునిఁ గని యనుపమవిభుఁ డింద్రనిభుఁ డయారే యన ని
ట్లనె నసురేంద్రుఁ డనీకము విన్నయము పొసరఁజేయు వేడుక తనరన్. ౨౨౫
తే॥ కాంచితే రామ! మదగజస్కంధగతు మహాశరీరు నవ్వాదితార్కాభవక్త్రుఁ
గంపితేభమస్తకుఁడు గాఁ గదలినాఁ డకంపనుఁడు సుమ్ము వీఁ డధికాంతు సుతుఁడు.
ఆ॥ సింహకేతనంబు చెంగలింపంగఁ దేరెక్కి నిక్కువాఁడె యింద్రజిత్తు
మదకరీంద్రుఁ బోల మలయుదంష్ట్రల మేననొప్పినాఁడు కొఱవిఁ ద్రిప్పినాఁడు.
క॥ అధికవిభుఁ డయ్యె నీతఁడు విధిలబ్ధవరప్రధానవిలసనమున నిం
ద్రధనుఃప్రకాశ మగు స్వీయధనుఃకాండముఁ గదల్చున న్నెఱిఁ గంటే. ౨౨౮
శా॥ ఏవాఁ డస్తమహేంద్రవింధ్యగిరులం దెప్పాటఁ బాటిల్ల నా
త్రివి న్నిక్కనువాఁడొ వీనిఁ గనుఁగొంటే వింతచాపం బతు
ల్యావేశం డయి కర్షణోచితగుణవ్యానద్ధరూపంబుగాఁ
గావింపన్ దొరఁకొన్నవాఁడు రథిముఖ్యత్వాధ్యసత్త్వంబునన్. ౨౨౯
తే॥ వీఁడె యతికాయుఁ డధికవివృద్ధకాయుఁ డన్నిమాయలు లేకున్న నన్నకన్న
మిన్న యౌఁగాని తీసిపోఁ డెన్నఁదగినబీరమునఁ జేతిమొలకువఁ బెనకువలను.

క॥ వేయితురగములఁ బూన్చిన దీయుద్భటభటుని యరద మీతని యెదురన్
జేయాడింపం జాలర పో యింద్రాదు లగు సురలుఁ బురుషోత్తంసా. ౨౮౦

ఆ॥ పొడుచుప్రొద్దుకాంతిఁ బురుడించు కన్నులరం గెసంగ హస్తిరాజ మెక్కి
ఘంట యులివు శ్రుతిగ గర్జిల్లుచున్న యాజోదు గండ డౌ మహోదరుండు.

తే॥ సంజకెంజాయ నొప్పారు శైల మట్టిఁడైన కాంచనచిత్రభాండాశ్వ మెక్కి
ప్రాస మంచద్వికాసంబు పరఁగఁ దగుఁ బిశాచసంజ్ఞఁ గులిశతుల్యజవుఁ డతండు.

క॥ నిశితము శూలముఁ గొని పరవిశసనమున కడరి యచలవిధము చలాభం
బశనిరయము వృష మెక్కెను యశస్వి యీతండు త్రిశిరుఁ డనవద్యగుణా.

తే॥ అతివృథువ్యూఢము సుజాత మైన వక్షమొప్ప నొప్పారు జీమూతమో యనంగ
నాగకేతుండు ధనువు ధూనన మొనర్చు నల్లవాఁడె కుంభుండు మహానుభావ!

ఆ॥ సొరిది హేమవజ్రజుష్టంబు దీప్తంబు ధూమయుతము నైన దొడ్డపరిఘ
మొకఁడు దాల్చి వచ్చుచున్నాఁడు వాఁడె నికుంభుఁ డద్భుతాఢ్యఘోరరణుఁడు.

ఆ॥ కేతుభూతుఁ డితఁడు యాతుధానానీకమునకు మించు తేర్ల ననిచి శరశ
రాసనములు దాల్చి యడరు నవ్వారలు నరసురాంతకులు ననాథశరణ. ౨౮౬

క॥ నగశృంగయోధు లివ్వారగల్పఁజాలుదురు పగఱ నతిరథవర్యుల్
సుగములు గా రేనాఁడును సుగాయులుం గారు దేవసూదను లధిపా. ౨౮౭

క॥ ఇందఱఁ జేకొని నిన్ననిగ్రందుకొనఁగ నరుగుఁదెంచె గాలాంతకుఁడే
యందఱ కైనను నీదగుచందము గనలేఁడు రాక్షసప్రభుఁ డలుకన్. ౨౮౯

శా॥ ఘోరవ్యాఘ్రమృగేంద్రవారణతరక్షుశ్వాపదోష్ట్రాశ్వము
ఖ్యారూఢాస్యులు ఘూర్ణితాక్షులునుఁ గా నా రాక్షసు ల్గొల్వ వి
స్తారప్రాభవుఁ డల్లభూతగణము ల్దన్వెంట సేవింపఁగా
నారుద్రుం డెటు లట్లు దోఁచె సురదైన్యాపాది వ్యాపాది యై. ౨౯౦

సీ॥ అదె నిండు జాబిల్లి యనువున నునువెల్లజిగి నుల్లసిల్లెడు సిరుల గొడుగు
వేఁడివెలుంగునా వెలయుచున్నది లసన్మణికిరీటము స్వీయమహిమఁ బెనుపఁ
జలకుండలంబు లాజతకుఁ జాలినయవిజగడాలు జాల్కొల్పు జాడ నెగడి
భీమ మక్కాయంబు పెరిఁగెడు వింజంబునాఁ డాకిడినభంగి నాడఁదొడరి
తా మహేంద్రవైవస్వతదర్పహంత తామసుఁడు వాఁడె నీపయిఁ దామసమున
వచ్చినాఁడు జయంబు నీ కిచ్చువాఁడు రణమునం బ్రేరణమున నీరాణ నెఱయ.

క॥ సన్నాహ మిట్లు మెఱయఁగ నున్నత మా తేరిపైని నుండి వెలుఁగులం
బన్నుచు నున్నాఁ డలుగుల వెన్నుని వలకన్నుతోడి వెరవునఁ దిరమై ౨౯౨

ఆ॥ అని విభీషణుం డహర్పతితేజుం డరిందముండు వలుక శ్రీనివాస
భూతుఁ డతనితోడ నాతటి నిట్లనెఁ దనదు వచనరచన తద్ద బొసఁగ. ౨౯౩

సీ॥ దీప్తుండు గాఁ డెట్లు దేవారి రావణుం డఖిలరాక్షసనాథుఁ డనఁగ నెగడి
దొరకొను రశ్ముల దుష్ప్రేక్షుఁ డౌట నొండాదిత్యుఁ డన సందియంబు గలదె
యవయవసంస్థాన మరయ రాకున్న దిట్లధిక తేజఃపుంజ మావరింప
నిమ్మొయి మెఱయువాఁడే సురాసురవీరులం దొక్కరుఁడయేని ననవరతముఁ
గొలుచువారు గట్టుకొన లందుకొనువా రగల్ప నేర్చువా రనల్ప తేజు
లస్త్రశస్త్రవిదులు నై యున్నవార లాయోధనముల బిరుదు లొందినారు. ౨౯౪
మ॥ కలఁడే యిట్టిఁడు పాపకర్మములకుం గాకున్న మేకొన్నవాఁ
డలఘుప్రక్రమ మింతకుం దొడరి దీప్యద్ఘాతము ల్పుట్టిరాఁ
జలముం బూనిన యంతకుం డనఁగ నై సంగ్రామరంగస్థలిం
గలయం బేర్చునకాని రిత్తచనఁ డేకాంతస్ఫురద్ధాముఁ డై. ౨౯౫

—♦ రాముఁడు యుద్ధసన్నద్ధుం డగుట ♦—

ఆ॥ నాదు దృష్టిపథమునకుఁ గోచరం బయినాఁడు దుష్టుఁ డెనసినాఁడ సుకృత
మే నిఁకం బలే మహీజాహరణజమ్ము క్రోధ మితని పైనిఁ గొలుపు వాఁడ. ౨౯౬
ఉ॥ ఒక్కట నిట్లు పల్కి పలు కొక్కఁడె బాటయు నొక్కఁడే శరం
బొక్కఁడె చాప మొక్కఁడె యహో రఘువీరున కంచు వేల్పు లా
చొక్కపుబీరముం గనుచుఁ జొక్కన యంగశరాసనంబునన్
జక్కఁగఁ గూర్చె నొక్కఁడు ప్రశస్తము బాణము రాముఁ డత్తఱిన్. ౨౯౭
క॥ అమ్మొయి సన్నద్ధుం డై యిమ్మొనలారంగ నిల్చె నినకులజుఁడు తో
సమ్మొఱయంత లా నితఁ డమ్మక చెల్ల యన ననుజుఁ డటు దనరారెన్. ౨౯౮
శా॥ ఆరక్షోవిభుఁ డావలం గలను డాయంబోయి సైన్యంబు దు
ష్పారం బయ్యెడఁ గాంచి స్వీయము పరీవారంబు వీక్షించి యా
రౌరా యం చెద నుంచి సంబలుల నొయ్యం బాచి యీ నెంచి దు
ర్వారుం డిట్లనె వారిదారవ మఖర్వస్ఫూర్తి వారించుచున్. ౨౯౯
ఉ॥ ఇచ్చటు సేరినాఁ డధిపుఁ డిందఱితోఁ బురి శూన్య గాక యొం
డచ్చట నున్నవాఁడె మగఁ డాయిది యా తఱి యంచు వానరుల్
వొచ్చె మెఱింగి చొచ్చి యది పొల్లునఁ బోవ నొనర్పకుందురే
తచ్చనగాదు పొం డయినదారి సమర్థులు గొంద ఱోమఁగన్. ౩౦౦
క॥ అని తగువారి నియోగం బనితరముగ ననిచి దురమునం దవికలుఁడై
ఘనరఘువము పూర్ణ మర్ణవమునుఁబలెఁ బ్లవగాధిపౌఘమును మొగకొనియెన్.

—♦ రావణు నెదుర్కొని సుగ్రీవుఁడు మూర్ఛిల్లుట ♦—

ఆ॥ తవిలి వానరుల విదారించు నవ్వాని ధృతశరాసశరుఁ బ్రదీప్తుఁ గాంచి
వానరేంద్రుఁ డొక్క వరశైలశృంగ ముత్పాటితం బొనర్చి ప్రౌఢిఁ బేర్చి. ౩౦౧

క॥ ఎదిరి బహువృక్షసానుక మెదిరిపయిన్ వైచె దాని నింతింతలుగా
బదరి యతఁడు ఛేదించెను బ్రదరముల సువర్ణపుంఖభాప్రసితములన్. ౩౦౩

ఆ॥ అంత లట్లుపోవ నర్థాంతరంబున కతఁడు దొడరనున్నయంతలోనె
యంతకాభ మటు మహామహీరూహము రోషమసుర దొడిగె నిజశరాసనమున.

క॥ పవనజవ మశనిసారము సవిస్ఫులింగాగ్నిసంప్రచారము నౌ నా
ప్రవరము శరము ప్లవంగ ప్రవరుని వధియింపఁ బనిచెఁ బటురోషమునన్. ౩౦౫

ఉ॥ రావణబాహుముక్త మతిరావణ మయ్యది యింద్రవజ్రపుం
ద్రోవనె స్కందదేవుకృతి ధూర్వహ శక్తి గిరీంద్ర మట్లు సు
గ్రీవుని వక్ష మున్నతము గీఁడ్పడ నేర్పడఁ జొచ్చి వ్రచ్చెఁ గీ
శావనినాథుఁ డార్తుఁ డయి యాదటఁ గూలె ధరాతలంబునన్. ౩౦౬

క॥ అఱచుచు నాతఁడు పడ నక్కఱ దీఱెనపో యటంచుఁ గడురభసమునన్
వెఱపేద నార్చి రసురులు నెఱాసుమాళంబు తలఁగ నిలిచిరి ప్లవగుల్. ౩౦౭

వ॥ గవాక్షగవయసుదంష్ట్రఋషభజ్యోతిర్ముఖనభు లను వానరవిభులు సముద్యత గిరిబాహులు వివృద్ధదేహులు నై పరవసంబునం బదరి పరువిడి రాక్షసేంద్రు నిపై బఱవళ్ళుసేయుచుం బ్రహరించిన శైలప్రహారంబుల నాతం డమోఘంబు లగు శరంబులచే మోఘంబులుగా నొనర్చి గడిదేఱ యవ్వారలం గడతేర్ప జాంబూనదచిత్రపుంఖంబులు నిశితశిఖంబులు నగు విశిఖంబులం బఱపినం దద్బాణపాతనిర్భిణ్ణశరీరు లగుచు నవ్వా రల్లతీ రెల్లఁ జెడఁ బెనుభ్రమాఁకుల యట్టివ యగు మేనుల గట్టి వట్టిద కాఁగ ధరాతలంబునం బడి పరాగంబులం బొరలుచుండ నిండువేడుక నట్లు చండకార్ముకనిస్సృతోద్దండకాండంబులం గడమసైన్యం బాచ్ఛాదించి కడలుముట్ట నార్చునవసరంబున. ౩౦౮

ఆ॥ వధ్యమాను లగుచు వారలు భయశల్య విధ్యమాను లగుచు విపులఁ బడిరి
ననుచు వీరవరులె నానద్యమానులు నగుచుఁ బగటు దెరల నగలు మిగుల.

ఉ॥ రావణసాయకార్తులు నిరావరణు ల్దొలుదొల్తఁ దారె యై
రావణసత్త్వ లయ్యుసమరంబు దెఱం గెడలన్ బ్లవంగముల్
రావములం బొనర్చుచు సురప్రకరార్చిత! రామ! కావవే
నీవ కదే శరణ్యుఁడవు నేర్తు వి దే మని వేఁడఁజొచ్చినన్. ౩౧౦

క॥ అనలసుఁడు ధనుష్మంతుఁడు ధను వమ్ములుఁ గొంచుఁ దోన తారసిలె విభుం
డనుజుఁడు ప్రాంజలి యై తా మొనకొని పరమార్థయుక్తముగ ని ట్లనియెన్ ౩౧౧

—♦ కపివీరులఁ దునిమి తూటాడు రావణు మార్కొన లక్ష్మణుఁడు రామునను జ్ఞగొనుట ♦—

తే॥ ఎంతలెంతలు సేయంగ నేని నేర్తు వీశ్వరుఁడ వఖిలంబున కీవ కాన
నైన నా కాన యిడు మిద్దురాత్ము నీచు నేన వధియించెద ననుగ్రహింపు మిట్లు.

తే॥ ఆర్య! నాకోర్కి దీర్పవే యనుచు వేఁడుతమ్మునిం గని యభినివేశమ్ము మాని
యమ్మహామహుఁ డిట్లనె నతనితోడఁ దనదుప్రాభవ మన్నెఱిఁ దలకు మిగుల.

చ॥ ఎయిదుము వేడ్క యట్టిఁ డగునేనిఁ బ్రయత్నపరుండ వైయని
న్నియతిమెయి న్మెలంగుము వినీతి దలంగక రావణుండు దు
ర్నయుఁ డటుగాక యద్భుతపరాక్రముఁ డుద్ధతసత్త్వుఁ డాతనిన్
స్మయితముని గిట్టి మార్కొనఁగజాలదు ముజ్జగ మొంట లక్ష్మణా. ౩౧౪

తే॥ క్రుద్ధుఁడై వాఁడు కలనునఁ గూడెనేని దుష్ప్రసహ్యుండుసురలకుఁ ద్రోవ యిడఁడు
గానఁ బరరంధ్రములు స్వవక్రతలు గనుము కంటిచే వింటిచేవ రక్షణ మొనర్పు.

క॥ అతులము విజయము సుసమాహితత్వ మొప్పారఁ గొను మహీనుఁడ వౌ దీ
నతివాత్సల్యం బొండొకగతిఁ జొరనీయ దటు లొటుఁ గాంచి పలికితిన్. ౩౧౬

క॥ అని గట్టిసేసి యాలింగన మొనరించి జయవాక్యకలన లొలయ న
మ్మనుకులతిలకుఁడు సెల విడ ఘనుఁ డతనికి మ్రొక్కి పొగడి కదలె గలనికిన్.

ఉ॥ వారణహస్తబాహుఁ డనివార్యమహోద్యతభీమచాపు దు
ర్వారశరౌఘవర్షి ముదిరప్రతిరూపు సకోపు నాకల
క్ష్మీరసికప్రతాపు నవిచింతితపాపు సురారికీర్తివి
స్తారకరాజ్యభూపుఁ గనెఁ దద్దయుఁ గాంచె హతాత్మసైన్యమున్. ౩౧౮

క॥ వారక శరనిర్భిన్నశరీరుల హరివీరవరుల రిపువిధ్వంసి
ప్రారంభుఁ డరసి క్రోధసమారూఢుం డగుచు నసుర నఱిమెడు నంతన్. ౩౧౯

—♦ హనుమద్రావణులు గ్రుద్దుకొని యొండొరుల బలాబలమ్ము లరసికొనుట ♦—

ఆ॥ ఎచట నున్నవాఁడొ యెఱు లెంచినాఁడొ మహామహుండు మారుతాత్మజుండు
వచ్చి తాఁకె నసురవరుఁ దచ్చరౌఘము ల్వాయఁ ద్రోచుకొనుచుఁ బ్రౌఢి నెఱయ.

క॥ భుజ మూర్తిమయ మహామము భుజంగమేంద్రాభ మెత్తి పొరి సురరిపుఁడుం
గజిబిజిపడ వానిం గని విజేత వాఁ డిట్టు లనియె విధిముఖవినుతా. ౩౨౧

సీ॥ తప మొనర్చి తెడంద దాఁకుతలంపుల నష్టకష్టముల కై యలఁతిఁబోక
గోరితి వరములఁ గొనముట్ట దేవగంధర్వాద్యవధ్యత్వతత్త్వ మొలయ
నరుల వానరుల నెన్నవ కాదె యెంతవా రనుచుఁ దత్ఫల మిప్పు డనుభవింపు
మేనుగొమ్మలు గల దిదె నాదు దక్షిణబాహు వెత్తితి దీనిఁ బరఁగఁ గనుము
పాపకర్మంబులకు మన్కిపట్టు గాఁగనొప్పు నీమేనిలోనఁ జిరోషితమ్ము
రోషితమ్ము సురేంద్రాద్యరుంతుదమ్ము జీవముం బాపునది యింక సిద్ధపడుము.

ఆ॥ అనిన రోస మొగువ నసుర పోల్లుంతన మొప్పఁ జేయు మట్టు లుత్తమాట
లేల యేలరాదొ యీజగంబుల యెల్ల యెల్లఁ దాఁక వీఁక నెసఁగు నేల. ౩౨౩

క॥ ఒకతఱి నీనెఱి గని యొండొకపరి నీమేను పఱియ లొనరించి యిలన్
వికలముగఁ ద్రోఁచివుచ్చెద వెకలితనం బూడ నీదు విభుఁ డల్లాడన్. 3౨౪

క॥ అన మెనయు మమల మింకిట ననసన లేల యన వాయునందనుఁ డలుకన్
వసమఱి మఱచితొ ప్రహ్వాతున్ స్వసూను నక్షున్ స్మరింపఁజనెదే యనినన్.

క॥ వెనుపొందిన తేజము గల తన కంతటి యె త్తిపొడుపు దవ్వుల నడఁచె న
ద్దనుజేశుఁడు బీరమ్మున ననిలజు నెడఁదం దలమున నతిసాహసుఁ డై. 3౨౬

ఉ॥ పో టటు లందఁగాంచి నెఱిపోటరి కంపము మాటిమాటికిన్
జోలెనయంగఁ గీడ్పఱిచి నొవ్వక బ్రువ్వని మేటితెల్వియుం
దేటయుఁ దేజమున్ బలము దిట్టతనంబును ముట్టనిల్పి బ
ల్వాట మెఱింగి యమ్మొయిన వాని యుర మ్మరచేత వ్రేసినన్. 3౨౭

తే॥ ఆమహాత్ముని వ్రేటున నసురవిభుఁడు భూప్రకంపంబు నొందవకొ భూధరంబు
పగిదిఁ గరము సమాధూతుఁ డగుచు దెరలి చేడ్పడె నిఁ కేమి చెప్పుదుఁ జిద్విలాస.

క॥ కరతలనిహతి నసురవిభు వరసచ్చినవానిఁ జేసె నచ్చెరు వనుచున్
సురలు మునులు సిద్ధులు వానరులునుఁ బవనజుఁ బొగడిరి నాకేశనుతా. 3౨౯

ఉ॥ అంతటఁ దెప్పిఱిల్లి యమరాంతకుఁ డాహనుమంతు విక్రమ
క్రాంతునిఁ గాంచి యా బళిర రాక్షసనాథు యమాలయాంతసం
భ్రాంతు నొనర్చి తే మనఁగవచ్చును నీబల మిట్టివాఁడు గా
కంతటివీనికిం బగతుఁ డన్యుఁడు వోలునె పోల్ప నొక్కఁడున్. 33౦

ఆ॥ మేలు మేలు నిన్ను మెచ్చఁగావచ్చుఁ జో దాయ వైన శ్లాఘనీయభావ
మందినాఁడ వనుఁడు హనుమఁ డవ్వానిపైఁ జూడ్కి నెఱపి పలికెఁ జోద్యముగను.

క॥ అంతలు వొగడఁగవలెనే యింతటి దగు బీర మెంచి యితని యడుపునన్
గంతుగొనఁక బ్రదికిన నీ వెంతటివాఁడ వనవచ్చు నే మనువాఁడన్. 33౨

క॥ ఓరీ! దుర్బుద్ధీ! నను నోరికి వచ్చిన వినుతుల నొంప కొకటఁ జే
సారింపుము పై వ్రేటున దారియిడుదు నీకు జముని దర్శింపంగన్. 333

ఉ॥ ఎన్నకు మన్న వాని పలు కేద్దెఱసూపిన దైత్యుఁ డల్కమైఁ
గన్నుల నిప్పుక ల్చెదర గాసిలియు న్మగపాడి వీడ కా
యన్న యురంబునం బొడిచె యత్నమునం బొనరించినట్టి ము
ష్టి న్నెఱపారఁ బోరగిలె శ్రీకరుఁ డంజనసూనుఁ డత్తఱిన్. 33౪

—♦ మూర్ఛితుఁ డగు హనుమని మొఱంగి రావణుఁడు నీలుపైఁబోవుట ♦—

ఆ॥ వీఁ డవధ్యుఁ డెట్లొ విహ్వలత్వముఁ గొన్నవాఁడు చలము పూన వలవ దనుచు
నీలుఁ డున్న దెసకుఁ దోలించె నరదంబు శీఘ్రగమనమున విశీర్ణుఁ డగుచు. 33౫

శా॥ రక్షోనాథుఁ డతిప్రతాపుఁ డటు దుర్మంత్రంబు పాటించి ప్ర
త్యక్షప్రోద్ధతు నీలుఁ దాఁకి రభసవ్యానద్ధము ల్పన్నఁగా
ధ్యక్షాఘంబులు భీమమూర్తు లరిభేదారీణము ల్బాణముల్
దక్షత్వంబునఁ బేర్చి త త్తనువున న్నాటె న్వనాటు ల్గనన్. ౩౩౬
ఆ॥ అగ్ని చిదుగు లిడిన నాదీపితుం డగునట్టు లట్టు హరిగణేశ్వరుండు
ప్రజ్వలించి శైలపాద మొక్కం డొక్కచేతఁ గొంచు నసురఁ జేరఁగాంచి.

—♦ మూర్ఛదేఱిన హనుమని పలుకులు రావణుఁడు విననియట్లు నటించుట ♦—

క॥ పడవైచె నతనిపై నప్పుడె హనుమంతుఁడు మేలుకాంచి పురికొని కడలం
గడలుకొను దృష్టి నసురుని బడలుపడం జూచి యలుక బయలుపడంగన్. ౩౩౮
ఆ॥ అమ్మహామనస్కుఁ డాయుద్ధలంపటుఁడరి వినంగ నిట్టు లనెఁ దలంగ
నైతి వన్యుఁ దొడరి యాయోధన మొనర్చువాని నన్నుఁబోఁటివా రఱుమరు.
క॥ అనిన విని విననియట్టిద యునికిం గొని నీలుచేఁ బ్రయుక్తం బగు నా
ఘనగండశైల మాతఁడు వినిహత మొనరించె నేడు విశిఖంబులచేన్. ౩౪౦
తే॥ హరిచమూపుఁ డయ్యది యట్టు లాఱడిచనఁ బరభటవిపాటనక్షమప్రతిభ మెఱయ
ప్రజ్వలించెనుఁ గాఱాగ్నిపగిది గ్రోధమును మొనసినట్టి యప్పటి మూర్తినెగడ.
తే॥ అశ్వకర్ణంబు లట్లు ధవాఖ్యములునుఁదాలములు సాలములు పుష్పితములు చూత
ములును మున్నగుమ్రాఁకుల మొనయఁజేసె నసురపై వానియును ఱెంత లనఁగనగునొ.
ఆ॥ అఖిలవృక్షములు మహాద్భుతంబుగఁ దనపై నిగుడ్చు నతని పరుసఁదనము
నెంచి యవియు నెల్లఁ జించి చెండాడెఁ బ్రత్యస్త్రములఁ గడంగి యసురవిభుఁడు.
క॥ ఘోరశరవర్ష మన్నెఱ పోరాట వ్రేసంగ నట్టె పొనరించె మహా
వీరుఁడు పావకిపై నతఁడూరక నిలిచె న్గిరీంద్రమో యన నగుచున్. ౩౪౪
తే॥ తనతనువు హ్రస్వ మొనరించి తనదురూపు వహ్ని రూపింప వానరవల్లభుండు
పగతుని ధ్వజాగ్రమున వ్రాలెఁ బా టెఱింగి వాఁడు సక్రోధుఁడై మీఁది వలనుదలఁప.

—♦ నీలుఁడు రావణుఁ జీకాకుపఱచుట ♦—

క॥ అతఁ డార్చినఁ దా నార్చుచు నతఁ డరయం దాను నరయు నట్టేఁడ యగుచున్
వితతబలుఁ డతనిఁ బొదువఁగ యతమానతఁ దనరె వాఁ డహర్పతితేజా. ౩౪౬
తే॥ పడఁగపై వింటిపై మౌళిపై నదల్పరాక వీఁకఁ దనర్చి మాఱాకుఁ గూర్చు
ప్రమానిమొకములపడవాలు మగఁటిమిఁ గని యలరి రమరులు బలువిస్మయంబు గదుర.
క॥ అబ్బుర మనె హనుమంతుఁడు కడు నిబ్బర మనె రాముఁ డొప్పు నీలుని కృతి యం
చు శ్చెనసె లక్ష్మణుండును దబ్బిబ్బుపడంగడంగె దానవుఁ డంతన్. ౩౪౮

తే॥ నీలలాఘవసంభ్రాంతు సర్వినేషు ననిమిషారిం గనుంగొని యగచరౌఘ
మెల్ల నాక్రోశనినదంబు లుల్లసిల్లఁ జేయఁ జేయి కాలాడ కజేయుఁ డతఁడు. ౩౮౯
క॥ వ్యగ్రత్వం బటు మొనకొన సుగ్రీవానీకపతినిఁ జూచుచుఁ దగు సా
మగ్రి యెదియొక్కొ యాతని నిగ్రహ మొనరింప నని యనిర్ణయుఁ డగుచున్.
తే॥ ఎట్టకేలకు నూహించి యెట్టయెదుర నాడు నవ్వానిఁ దూలించి యాట లుడుగఁ
జేయ నాగ్నేయమంత్రసంశీలితంబుఁ గొనె శిలీముఖ మక్కాళి గోల యగుచు.
మ॥ ధ్వజశీర్షంబున నున్న యున్నతబలోద్దాముఁ సుధాముఁ గృశా
నుజనుస్సంభృతశీలు నీలుఁ గడఁక న్నొంపం దలంపొప్ప న
య్యజరామర్షణుఁ డెంచి వానిదెస డాయం దృష్టులం బంచి ద
ర్పజ ముల్లాస మెసంగ నిట్లనె రిపుధ్వంసప్రశంసోచితా. ౩౯౨
సీ॥ అన్నిఁట లాఘవం బందినవాఁడవే మాయాబలంబు నేమమునఁ గొంటి
గంటి లే దని పెక్కుగతుల మెలంగితి వేరుపర్చితి వెన్నియేని రూపు
లాముకొన్నవితాన బూమెలు పచరించి యోముకొంటివ కాక యొండు గలదె
యిదె వచ్చుచున్నది యెసలారు నస్త్రంబు జాలిఁదప్పకొనంగఁ జాలి నిలుము
తప్ప దింకిట నెట్లును ముప్పు నీకు బఱచెదో యుండి పడరాని పాట్లు పడెదొ
పిలిచెదో తోడివారల బిలుకుమార్తు నాకు మార్తుఱె యొక్కండ్లు ననుచువారె.
చ॥ అని యనలాస్త్రయుక్త మగు నమ్ము రయమ్మునఁ గార్ముకమ్మునన్
గొనయము మీటి సూటి గని కూర్చి మహార్చిరుపేత మై క్షణ
మ్మున నది వీక్షణమ్ములకు మున్కొనరానిద కాఁగ రాగ వాఁ
డనిచెను నీలువక్షమున నంటఁగ నొంటని దర్ప మేర్పడన్. ౩౯౪
క॥ దుర్దముఁ డయ్యున్ శరపీడార్దితుఁ డై యచట నిలువ ననువుపడమి వే
నిర్దహ్యమానుఁ డగుచు న్నర్దిల్లుచు వ్రాలె వాఁ డనంతం గాంతా. ౩౯౫
మ॥ పితృమాహాత్మ్యము స్వాత్మ తేజ మమరాభిప్రీతి రామేంద్రు స
న్నుతకారుణ్యము ప్రాణము గ్లెడపు నానొ వ్వొందఁగానీక సం
తతరక్షం బొనరింప రాక్షసుని యస్త్రం బట్లు సోఁకంగ జా
నుతలం బూఁతగఁ గూలి మూర్ఛిలె సుజన్యుం డుద్ధతత్వం బఱన్. ౩౯౬

—♦ రావణుఁడు నీలు మూర్ఛ నొందించి లక్ష్మణునకుఁ గవియుట ♦—

తే॥ అతఁడు దెరలినయంత వీఁ డంత మొందుఁగాత మని గాతమనిపింపఁ గడఁగు నెడఁద
నొండు దలఁచుచు లక్ష్మణుం డుండు నెడకుఁబోయె నెడ పోయె నని వాఁడు పూవుఁబోఁడి!
క॥ అంబుదనాదం బగు నరదంబున డంబెసఁగఁ జని మదద్విరదవరం
బుం బొందిన పొందిక నెదిరిం బొరిఁ దిలకింపఁ గాంచి ప్రీతుం డగుచున్. ౩౯౮

తే॥ ఉజ్జ్వలుం డయి జ్వలనుని యోజ నెఱయ నెఱ యనీకంబు గోరెడు నీటు గాఁడు
క్రందుకొనునాదమున భూమి కంప మొంద నారి సారించెఁ గడఁక దేవారి దొడరి.
చ॥ పెరయ నదీనసత్త్వుఁ డపభీకుఁడు లక్ష్మణుఁ డాశరేంద్రు వి
స్ఫురితధనుఃప్రచారుఁ గని పొచ్చెము లే కిట రమ్ము నీకు వా
నరులకుఁ బోలునే దురమునం గడిదేఱినవాఁడ వెన్న భీ
కరములు నీశరంబు లవి గానివిగా నొనరింపఁ జెల్లునే. ౩౬౦
మ॥ ప్రతిపూర్ణార్ణవనాద మైన నుడితోఁ బాటిల్లు జ్యాఘోష ము
ద్ధతిమైఁ దార్కొన నట్లు పల్కు విని ప్రత్యక్షంబ మై సోఁకు రో
షితవృత్తిం బురుడించి తాఁకి సమవస్థిత్యంచితుల్ లోకస
మ్మతు రాజేంద్రసుతుం గనుంగొని గణోన్మత్తుండు వాఁ డిట్లనున్. ౩౬౧
ఉ॥ నాదగు దృష్టిమార్గ మిది నాక బలే చొర నైతి మిత్రికిం
బా దిది సుమ్ము రాఘవ! విపత్తికిఁ బాల్పడి తంతగామికిం
బో దరిలేని దారిఁ జను బుద్ధి జనించు మదీయబాణముల్
మీఁదటివాదు లెన్న వరిమీఁదఁ బొరి న్విహరించు నత్తఱిన్. ౩౬౨
మ॥ అని యుద్వృత్తసితాగ్రదంష్ట్రుఁ డయిదుర్వ్యాసక్తి గర్జిల్లు న
మ్మనుజాశీంద్రు నవిస్మితుం డగుచు సన్మాన్యుండు సౌమిత్రి క
న్గొని యిట్లంచు వచించె రాజపదముం గొన్నాఁడ వెట్లైన నీ
కనుభావోచితమే వికత్థనము శౌర్యాస్పందు లిట్లందురే. ౩౬౩
ఆ॥ పాపకృద్వరిష్ఠభావంబుతోఁ డిదయా వరిష్ఠభావ మనువదింతు
రెల్లవారుఁ గొంత యేను నెఱుంగుదు నీదు తేజ బలము నిష్ఠ నెఱియు. ౩౬౪
క॥ వచ్చితి సాయుధుఁడన నై యిచ్చటు ద్రొక్కితి నిలిచితి నింకేల వితా
గచ్చులు చెచ్చెర బఱపుము క చ్చొకయింతయును లేని ఘనవిక్రమమున్.
ఆ॥ అనుచు మాటపడిన యంత ననంత మై క్రోధ మెగువ ననవకుంఠితుండు
వాఁడు తోడుతోడ వాలమ్ము లేడు లక్ష్మణునిపై నిగిడ్చి క్రాలుటయును. ౩౬౬

—♦ లక్ష్మణరావణుల ద్వంద్వ యుద్ధము ♦—

ఉ॥ కాంచనచిత్రపుంఖములుగా నలువొంది శితాగ్రధారతం
గాంచిన మేలి బాణములఁ గ్రన్నన నాశరుహేతులం బటా
పంచము లై పడ న్నఱికెఁ బార్థివసూనుఁడు ఛిన్నభోగభూ
ర్వ్యంచితభోగు లట్లయిన వానిఁ గనుంగొని క్రోధమూర్తి యై. ౩౬౭
క॥ లంకేశ్వరుఁ డస్త్రములఁ గడంకఁ బృషత్కములఁ బఱపుటయు నవి చెడఁగా
నింకఁ బ్రయోగించిన మీనాంకసదృశుండు వాని నన్నిఁటిఁ దునిమెన్. ౩౬౮

ఆ॥ వర్షధార లొనవ వజ్రొడ్డి నట్టు లా నాశరప్రయుక్త మాశరౌఘ
మటఁ దెరల్చె నాతఁ డర్ధచంద్రక్షురకర్ణిభల్లముఖ్యగణము లనిచి. ౩౧౯
క॥ ఇంచుక చలింప కమ్మెయి ముంచెన్ శరవృష్టి నసురముకుటుని హరి లీ
లాంచితుఁ డాఘనుఁ డదియును బంచాననవిక్రమ ప్రపంచం బయ్యెన్. ౩౨౦
చ॥ అవి యవి యట్లు మోఘములె యౌటయుఁ గాక తదీయహేతుల
య్యవి యవి దన్నుఁ గప్పుటకు నాతఁడు విస్మయమంది వాని లా
ఘవ మసదృశ మంచు నెదఁ గైకొనుచు న్నిశితాగ్రపత్రన
త్ప్రివరముల న్నిగిడ్చె నపభంగుఁడు రక్కసుఁ డొక్కపెల్లునన్. ౩౨౧
ఆ॥ తొంటియట్లె యవియుఁ దొలఁచి రాక్షసువధ నెంచి వజ్రనిభము లీహితములు
జ్వలననిభము లైన శరములఁ బఱపె సంధానలక్ష్యమోక్షతత్త్వ మెసఁగ. ౩౨౨
చ॥ అటు లొనరించు లక్ష్మణుని యాశయ మాశరనాథుఁ డెంచి యా
పటుశరము ల్దెరల్చి బహుపాటన మగ్నిసమప్రభాఢ్య ము
ద్భటము విధాతృదత్త మనసాయము నౌ శరమున్ లలాటభూ
తటమున నాటె వాని ఘనదార్ఢ్య మెఱుంగక భావితాత్ముఁ డై. ౩౨౩
ఆ॥ అది యమోఘ మౌట నాతనిఁ జేరి యొక్కింత దెరలఁ జేయ నెలమిఁ బాసి
శిథిలముగను విల్లు చే ధరించి చలించె నొంట నవల సంజ్ఞ నొందఁగాంచె. ౩౨౪
క॥ తెలివిమెయి వాఁడు పట్టిన బలువి ల్లవలీలఁ ద్రెంచి పార్థివపుత్రుం
డలయించె నట్లు మూ డమ్ముల రక్షోవిభుని సురలు మునులుం బొగడన్. ౩౨౫
ఆ॥ చాప మట్లు వోవ శరతాడితుం డయి యొల్లఁబోయె రుధిర మురల మెదడు
సెదరఁ గొంతవడికి సేదదేఱంగ నై ప్రతిభఁ గాంచి యసురపాలకుండు. ౩౨౬
ఉ॥ కన్నుల నిప్పు లుట్టిపడఁగా నరనాథకుమారుఁ గాంచి నీ
వన్నియు నేర్చినాఁడ వటులైనను దీని భరించిచూడు మం
చన్నైరి నాడుచున్ సముదయాఢ్య విరించివితీర్ణ నొక్క శ
క్తి న్నిలకొల్పనెంచి కొనె దేవసపత్నుఁ డరీణయత్నుఁ డై. ౩౨౭
తే॥ ఎగచి పొగ లేని యగ్గి కేనీడుజో డటంచుఁ గపివాహిని భయాబ్ధియందు ముంచు
నట్టిదై ప్రజ్వలించు నాగట్టిశక్తిఁ బఱపె సౌమిత్రిపై సురపాలరిపుఁడు. ౩౨౮
క॥ భరతానుజుఁ డమ్మెయి దుర్భర మై పఱతెంచు దానిపై నస్త్రములం
గురిసె హుతాగ్నినిభంబుల బరా కొంకితయును లేక పర్వేందుముఖీ. ౩౨౯
ఆ॥ అది యమోఘపాత యగుట నన్నియు ద్రోఁచుకొనుచు వచ్చి వాని ఘనవిశాల
బాహుమధ్యసీమఁ బాటించి చొచ్చె నచ్చెనఁటి పనుపుఁ గొనిన సిగ్గు పొదువ.
క॥ ఆసత్తి శక్తిమంతు సమాసత్తిం దాఁక మెఱసె నాతఁడు దోట్త్రోఁ
ప్రాసంగికప్రసక్తసమాసత విహ్వలుఁడ కాఁగ నాదటఁ దొడరెన్. ౩౩౧

క॥ శక్తులు శక్తు లనంగా శక్తులె యన్నియును నదియ శక్తం బయ్యెన్
శక్తున కశక్యమై తన సూక్తియనుగతార్థ కాఁగ సూనృతమూర్తీ! ౩౮౨

తే॥ అవశుఁ డగు నాతనిం గని వివశుఁ డయ్యె
స్వవశ మెనయునపో యంచు సరభసుఁ డయి
పోయి మతిపోయి పొదివి కొంపోవఁ జూచె
నాస భుజములు సాఁచి పలాశివిభుఁడు. ౩౮౩

ఉ॥ మందర మెత్తు నేమొ మహిమప్రతిభాసిహిమాచలంబు చే
వం దరలించు నేమొ కడువాలిన మేరుధరాధరంబుఁ దాఁ
గ్రందుకొనంగ నై కడఁక గాటియపెట్టున యేమొ కాని యా
స్యందనముం బొనర్పఁ గతి గానఁడు లక్ష్మణు రాక్షసుం డనిన్. ౩౮౪

క॥ మనకందువ కైలాసము మునుఁ గదలించెఁగద యపుడు ముజ్జగముల నై
నను సురలతోడ నసురకుఁ జనుఁ దాల్పం జనదు రాము సహజు భరింపన్.

తే॥ తన స్తనాంతరమునకు నిస్తంద్ర బ్రాహ్మిశక్తి నాటిన సౌమిత్రి జలదరింపఁ
డాత్మతేజంబు వైష్ణవం బతుల మమితమప్రతర్క్యంబు స్మరియించె నంబుజాక్షి.

క॥ దానవదర్పఘ్నుం డద్దానం గురుఁ డయ్యెఁ జమ్మ దానికి విలయ
స్థానము జన్యమునకుఁ జని యా నెలవే కద ప్రకార మన్యం బగునే. ౩౮౭

ఉ॥ దానవుఁ డెట్లు భూతమయుఁ దాల్చెడుఁ దాఁ జెడుఁగాక యింకిటన్
మానవుఁ డయ్యె నన్న యొకమాటయె కాని సుమానితంబు ని
ర్మానవికార మాత్మమహమండల ముచ్ఛ్రిత మచ్యుతాంశ మా
వానిఁ గదల్పలే కొదిఁగె వారణరాజమరాళగామినీ. ౩౮౮

క॥ తరలింపఁజూచుఁ దరలుం దెరలుం దెరలింపలేక దివిజారి కడుం
బరవళ్ళు సేయు నాసం బరవస మొదవంగ నట్లు పద్మదలాక్షీ. ౩౮౯

తే॥ అంతలో నంతకుఁడు దన కరుగుదెంచె ననుమఁ డారసి రక్కసి నాక్రమింప
వజ్రకల్పోరుదృఢముష్టి వఱలఁ బొడిచె నుసులు లెడలంగ నపుడు బింబోష్ఠి! వింటె.

—♦ రావణుఁడు హనుమని పోటున మూర్ఛమునుంగుట ♦—

క॥ జానువులు నేల మోవఁగ దానవుఁడు చలించెఁ బడె వితాకుపడెన్ బె
ట్లై నేత్రశ్రవణాస్యస్థానకములవలన రుధిరఝరతతి యురలన్. ౩౯౧

ఆ॥ తిరిగితిరిగియాడి తేరెక్కె తేఱని మూర్ఛమునిఁగి వ్రాలె మురువడంగ
ఘూర్ణమానుఁ డగుచుఁ గూలంకషుఁడు వాఁడు చేష్ట లుడిగి సన్న సెడి మృగాక్షి.

క॥ అసురుసురుపడుచుఁ బడె వీఁడును జెడలెనొ యేమొ కడురణోద్ధతుఁ డనుచున్
వసమఱి నాడిరి మౌనులు వసుముఖ్యులు సురలు వాసవపురస్సరులై. ౩౯౩

క॥ రక్కసులు దెరలి తమ కిఁక దిక్కన్న దియే యటంచు దీర్ణహృదయు లై
దిక్కులకుఁ బఱవఁబూనిరి చక్కటి గనలేక హరిణశాబకనేత్రా. ౩౯౪
శా॥ తేజోరాశి యుదీర్ణుఁ డాహనుమఁ డుద్రేకించి యూర్జస్వితా
భ్రాజిష్ణుస్వకబాహువు ల్సోనిపి దీప్యన్మూర్తి సౌమిత్రి న
ల్లా జాడం గొనిపోయె రాముదరి కావ్యాపార మొప్పారఁగా
నాజన్మంబు ఫలించె వాని కెన యానాతం డొకం డుండునే. ౩౯౫
తే॥ శత్రువుల కప్రకంప్యుఁ డాసన్నుఁ గ్రోఁతి
వానికటు వశ్యుఁడయ్యె నవ్వలనునందుఁ
దూలమాత్రలఘుత్వంబు దోఁప నతని
పరమభక్తిసుహృత్త్వంబు పాటిసేసి. ౩౯౬
క॥ ఆశక్తి శక్తిమంతునియాశ న్విడనాడి యాపలాశాధిపు న
భ్యాశ మెలసి స్వక మైన నివేశముఁ గనఁగాంచె నపు డవేలప్రతిభా. ౩౯౭
తే॥ శత్రుసూదనుఁ డప్పు డాశ్వస్తుఁడునువిశల్యుఁడును నయి మేల్కొని చాల మెఱసె
విష్ణుభాగ ముమీమాంస్యవిధము స్వాత్మ రూపము స్మరించు మేలి నియూఢి దొరయ.

—◆ మూర్ఛఁదేఱి విజృంభించు రావణు శ్రీరాముఁడు హనుమదారూఢుఁడై తలపడుట ◆—

ఆ॥ అట్లు తెరలినట్టి యాశరభర్తయుఁ దెలివిఁగాంచి తొంటితేజ మొనసి
యమ్మహాహవమునయందుఁ గ్రహించె బల్విల్లు నిశితము లగు విశిఖములును.
క॥ హరివీరుల మార్కొని యయ్యరిందముఁడు వేఁపఁదొడరె నటునిటు నై వా
నరి సేన తల్లడిలుట నృహరి రాముఁడు గాంచె మించె నాఁటినియలుక౯. ౪౦౦
శా॥ సింగం బాకటిపెల్లునం దొడరఁగాఁ జింతించుచో మత్తమా
తంగం బొక్కఁ డెదుర్పడంగ నగు తాత్పర్యంబు దోఁప౯ జగ
న్మాంగల్యోదయుఁ డుష్ణితాఘుఁడు స్తువన్మాసీంద్రుఁ డా రాముఁ డ
ప్డంగమ్ము ల్పులకింప దైత్యు నఱుమ న్వ్యాసక్తి నుంకింపఁగ౯. ౪౦౧
చ॥ హనుమఁడు చేరి యిట్లను మహాహవ మియ్యది రక్కసుండు ది
వ్యని రథ మెక్కి యేయ రఘునాయక నీ విల నిల్చి పోర నా
పనిఁ గొననేల నాభుజము భాసిల నా బలుమూఁపునందు నీ
వనితరవృత్తి నుండి రిపు నార్పుము తీర్పెడు దర్ప మేర్పడ౯. ౪౦౨
తే॥ గరుడి లావరి నెక్కి శ్రీకాంతుఁ డైన హరినిఁబోల మదీయాంస మాక్రమించి
యరిని శిక్షింపఁ గడఁగి దైత్యారి వగుము జానకీప్రాణనాథ! ప్రజానాథ! ౪౦౩
క॥ సంతమస మెడలి వేలుపులింత యనఁగరాని తృప్తి నెనయఁ బ్రథితసా
మంతుఁడ వీక్రతువున నీ వంతుపడిన పశువు వీని వధియింపు మిఁక౯. ౪౦౪

క॥ నానోములు ఫలియింపఁగ నానాలోకములు ముదమునం దేలఁగ ని
ధ్యాన మొనరింపుమయ్యా యానందమయాత్మ! రామ! యసురవిరామా! ౨౦౫

మ॥ అనినఁ సంతస మంది యెంతటిఘనుం డౌరా యితం డంచు నె
మ్మన ముప్పొంగఁగ మేను మేల్పులకల న్మిక్కొంచు నొప్పార నా
తని యంసం బవతంసితంబుగ మహాధాముండు రాముండు తోఁ
చెను బూర్వాద్రిని భానుఁడట్లు నిభృతశ్రీ నంజనాసూనుపై. ౨౦౬

ఆ॥ ఆమహాత్ముఁ డధిబలాఢ్యు మహాకపి నధిగమించి మించి యలరువేడ్క
రథము నెక్కి నిక్కి రావణు సరిసరి గాఁగఁ జూచె నపుడు కమలనయన!.

మ॥ కనిసంతం గనదుద్యతాస్త్రుఁ డవనీకాంతావనుం డొయ్యనం
జనె వైరోచనుపైఁ ద్రివిక్రమునియోజన్ రాక్షసాధీశుపై
ఘనరోషంబు విభూషణంబుగ సమాక్రాంతం బొనర్పంగ నె
ట్టనఁ జాలండె యతండు ముజ్జగ మొకంటం గంటకం బేర్పడన్. ౨౦౮

క॥ జ్యాశబ్ద మధిక మై వజ్రాశనినిష్పేషతీవ్ర మై యలుమఁగ న
ద్దాశరథి రాముఁ డత్తఱి నాశరనాథుఁ గని యిట్టులనె శుకవాణీ. ౨౦౯

—♦ శ్రీరాముని పలుకులు. ♦—

క॥ గంభీరహృదయుఁ డాతని గంభీరవచఃప్రసక్తి కా దన్యుల కో
గంభీరవేదినామక కుంభిలసత్కుంభసదృశకుచకుంభయుగా. ౨౧౦

సీ॥ నిలునిలు మెదిరించి నీదర్ప మేర్పడి కానిపింపంగ రాక్షసగణేంద్ర!
యిమ్మెయి విప్రియం బిట్టి నా కొనరించి యెట్లు విమోక్షణం బెనయువాఁడ
విటమున్నుఁ జరియించి తెల్లెడ శార్దూల మట్టిఁడ యనుచుఁ బే రంది జగతిఁ
గడచె నక్కాలంబు కాలమంతయు నొక్కప్రాతిగాఁ గడతేఱు రీతి గలదె
యింక శమనునేని నినునే ననలునేని నీశునేని నాప్రజేశునేని
శరణు సొచ్చి దశదిశల డాఁగియేనియు నాదుకంటఁబడి మనంగలేవు. ౨౧౧

ఆ॥ ఎవనిఁ గొట్టినాఁడ విద్ధశక్తివి శక్తిచేతఁ జేతనంబుఁ జెనయు నలుక
వాఁడె కడఁక వచ్చినాఁడు నీపాలిటిమిత్తి యగుచు నొకనిమేషమునకు. ౨౧౨

క॥ నీవు సపుత్రామాత్యుఁడవై వేగమె యవని వ్రాలు దంతర మిఁక సం
భావింపవలవ దొండెడఁబోవలతో నిలుతొ వలయు బుద్ధిఁ దలంపన్. ౨౧౩

క॥ ఈనాఁటియుద్ధమునసే యానాకౌకసుల కస్తు లపనీతము లై
పోనొనరించెదఁ బాఱక నీనెఱబీరంబు నెఱప నేర్చెదవేనిన్. ౨౧౪

మ॥ తతభీమాద్భుతదర్శను ల్కృతజనస్థానాలయు ల్సంతతో
చ్ఛ్రితశస్త్రాస్త్రకరు ల్చతుర్దశసహస్రీభూతసంఖ్యాకు లు

ద్యుతవీర్యు ల్ఘనశౌర్యు లైతనరు దైత్యాధ్యక్షు లానాఁటి కే
గతికిం బొల్పడిరో తలంపు మటు వీఁకం దాఁకనై వీనిచేన్. ౪౧౫

క॥ అని ముట్టనాడు రాముని గని వేల్పులసూడుకాఁడు గనలుచు నితనిం
గొని తెచ్చె నింత కనుచున్ హనుమని నోనాడుచు న్మహాదర్పమునన్. ౪౧౬

—♦ శ్రీరామ రావణ ద్వంద్వ యుద్ధము ♦—

తే॥ ప్రలయకాలానలశిఖావిభాసురంబులౌ శరంబులు నిశితంబులౌ శరంబు
లతని పోకడ లెన్నుచున తనివోక సూటి గని నేటుకొన మేన నాటి యార్చె.

క॥ ఆరాటపడి నిగిడ్చినయారాక్షసు సాయకంబు లనిలజు నొడలం
దారూఢము లై మెఱసెఁ దదారూఢత నెగడఁజేయు నంతటి వగుచున్. ౪౧౮

తే॥ సహజతేజోనుమితమహాసత్త్వుఁ డతని తేజ మంతకు నంతకు దిటవుపడియెఁ
గాని లోపమొకింతయుఁ గలుగఁబోవదెదిరి యవ్వానిఁ గదలింప నేమి గలదు.

తే॥ రాముఁ డధిమహాతేజోవిరాజితుండు వాని తేజ మవ్వానరవర్గ ముందు
నెలవులం దెల్ల నెట్టన నెఱయుచుండుఁగాన వారలఁ దెరలింపఁ గా దొరులకు.

క॥ హనుమని గృతవ్రణునిఁ జేయ నుద్యమించెదునె యీతఁడనుచు మహాక్రో
ధనుడయ్యె రాముఁ డయ్యెడదనరెం దాన బరవసముదారి మెలంగన్. ౪౨౧

ఆ॥ అట్లు పేర్చియార్చి యభిచంక్రమ మొనర్చి శత్రురథము సాశ్వచక్రకేతు
సూత మాతపత్రసునిశితాయుధగణోపేత మవనిఁ గూల్చెఁ బృథుశరముల. ౪౨౨

ఉ॥ అంతట దేవదుర్మ్రదు రయంబున డగ్గరి రాముఁ డల్కఁ గా
లాంతికసన్నిభం బశని యట్టిఁడు నా శర మొండు వాని బా
హ్వాంతరసీమ వ్యూఢతర మౌ నెడ నాటె మహాత్ముఁ డిందుఁ డా
పంతమునన్ సువర్ణగిరిపైఁ గులిశం బెనయించి నట్లుగన్. ౪౨౩

ఆ॥ ఇంద్రవజ్రపాత మొనసి పడంకఁడు పిడుగుఁ జేయిసాచి పిడికిలించు
నట్టివాఁడు రాము నస్త్రంబు సొరఁబాఱ స్రుక్కి వడఁకెఁ దెరలె రక్కసుండు.

తే॥ వీరుఁ డతఁడు భృశార్తుఁ డై విహ్వలత్వ మందుచు స్వచాపమోచనం బాచరించు
టరసి మహితాత్ముఁ డా రాముఁ డందుకొనియె నర్ధచంద్రశరంబు దీప్తాజిరంబు.

—♦ శ్రీరాముఁడు రావణు కిరీటంబు భంజించుట ♦—

క॥ కరుణామయుఁ డద్దానన్ స్ఫురదర్కనిభంబు నిత్యశోభనమును నా
సురవైరివరకిరీటముఁ దరమిడి ముక్కలుగ నతికె ధరణిం ద్రెళ్ళన్. ౪౨౬

ఆ॥ హతకిరీటుఁ డై విగతమహాశ్రీకుఁ డై యప్రకాశుఁ డగుచు నస్త మొనయఁ
జనెడు సూర్యు నట్లు శాంతార్చి యగువానిఁ గాంచె రఘుకులప్రకాండుఁ డపుడు.

తే॥ నిర్విషాశీవిషం బట్లు నేటుసేతఁ బాసి రాకాసి యొదుఁగఁ దద్భావ మెంచి
యిట్టు లనె రాముఁ డాత్మీయ మింగితంబు పడయసేర్చినవా రెల్లఁ బ్రస్తుతింప.

—♦ శ్రీరాముఁడు దీనుఁడగు రావణుపై దయఁగొని యింటికేగ నాజ్ఞయిచ్చుట ♦—

చ॥ పెనుపగు యుద్ధకర్మ మిటు పేర్చి పౌనర్భితి భీషణంబుగాఁ
జెనకి వధించి తెందఱనొ చిక్కనిపోటుల ధిక్కృతుండ వై
తెనసితి శ్రాంతి నిప్పు డిఁక నెద్దియు మేకొనఁజాల విట్టి ని
న్ననయ మటంచు మిత్రివశ మందఁగఁజేయు ప్రసక్తి జంకెదన్. ౮౨౯

తే॥ అనసేసితి పొమ్ము రణార్దితుఁడవు లంక సేరంగనుము నేఁడు శంకదక్కి
ఓయిరాత్రించరాధీశ! యూరడిల్లి యెల్లి రమ్ము దురమ్మున కెసక మెసఁగ. ౮౩౦

క॥ పరికరము లెల్లఁ బొసఁగన్ సరభసముగ నరుగుదెంచి సన్నద్ధుఁడ వై
యరదముననుండి కాంచెద వరయందగు నాదుబలము నంతయు నంతన్. ౮౩౧

మ॥ అని శ్రీరాముఁడు పూర్ణకాముఁ డనినన్ హార్షంబు దర్పంబు నె
ట్టనఁబోవన్ వినికృత్తసన్మణికిరీటశ్రీకుఁ డస్త్రాయుధుం
డు నితాంతాహతసాశ్వసూతసురథుండున్ వాఁడు పెంపేద న
ప్పినువా దెన్నక లంకసొచ్చె నసురు ల్భీతిల్లఁ బ్రోల్లాసినీ. ౮౩౨

—♦ రావణుఁడు సెడి పాఱ శ్రీరాముఁడు లక్ష్మణాదుల విశల్యులఁజేసి యూరడించుట ♦—

ఆ॥ ప్రబలసారుఁ డట్లు రజనీచరేంద్రుండు పోరితంబు వీడి పురిసొరంగ
సకలహరిబలము విశల్యమ్ముఁ గావించెఁ దేర్చె లక్ష్మణుని విధిజ్ఞుఁ డినుఁడు. ౮౩౩

చ॥ అసురుఁడు విద్రుతుం డయిన యంత సురాసురసిద్ధసాధ్యులున్
వసుగరుడోరగ ప్రముఖ వర్గములున్ మును లబ్ధులుం దెసల్
పొసఁగెడు భూతము ల్నదులు భూమిచరాంబుచరంబులున్ సమం
జసధృతిఁ గాంచి యుల్లసిలఁ జాలఁగ మే లిరవెంద దె సుందరీ. ౮౩౪

ఆ॥ సకలహరిబలంబు సంతసంబున నంబరంబు ముట్టికొన డిరంబుపడి దు
రంబునకుఁ దగం గరం బాయితం బైన సంబరంబు సురపురంబుఁ బెరసె. ౮౩౫

క॥ కల్యాణమూర్తి గుణసాకల్యాత్ముఁడు హర్షఘనుఁడు కరుణావీక్షా
వల్యాశ్రితజనసులభుఁ డహల్యావరదుండు రాముఁ డటు లొప్పెఁ జెలీ. ౮౩౬

క॥ అని గిరిశుం డెఱిఁగించిన విని గిరిజ కుతూహలమున వెలయుచుఁ బురికిం
జని వాఁ డేమొయి మెలఁగెను వినిపింపవె యనుచు దనదువిభు నడుగుటయున్.

ఉ॥ శాత్రవసూదనా! సకలసంయమిధృత్యుపపాదనా మహా
మాత్రఫలోదయాఢ్యగుణమండలలక్ష్యజనాను మోదనా!

సూత్రితము క్తిమార్గపరిశుద్ధవచోర్థని వేదనా! జగ
న్నేత్రితరాజయోగపరినిష్ఠితచిత్సుఖసంప్రసాదనా!. ౪౩౮

క॥ మాయావిధాయిజనవిచ్ఛాయాచరణప్రకారసమయాప్తమహా
మాయాసహత్వయోగప్రాయికసంసారతద్విపర్యయసారా! ౪౩౯

మాలిని॥ విస్మృమరరసరాశ్యుద్వేలపీచీసమీచీ
నసరణిభృతయోగానందసాంద్రోక్తిసారా
స్వసుకృతపరిణామాస్పందభావోదయశ్రీ
ప్రసితసుజనలభ్యప్రాజ్యసంపత్ప్రకారా. ౪౪౦

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మాంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబున
షష్ఠాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీశివాయ గురవే నమః.

# శ్రీరామకథామృతము

## యుద్ధకాండము.

### పూర్వభాగము.

### సప్తమాశ్వాసము.



మానితభక్తజనో
ద్దామాహ్లాదనవిశేషతత్పరసత్తే
జోమహిమానన్యాదృశ
భూమైశ్వర్యప్రశంస ! పురుషోత్తంసా !

ఆ॥ అవధరింపు మట్టు లడిగినయద్దేవిఁ గాంచి పలికెఁ గాలకంఠుఁ డవలి
కథ తెఱంగు వినుము కలకంఠకంఠి! వాఁ డిల్లుసొచ్చి కలఁక నెడఁదనొచ్చి. ౨

ఉ॥ రామశరాహతిం దనదురాణ సెడన్ హతదర్పుఁ డై తెఱం
గేమియుఁ బాలుపోక వ్యథితేంద్రియవృత్తి నిరస్తధైర్యుఁ డై
తామసము న్భయంబుఁ బెడదారుల కీడ్వఁ బ్రసక్తి వీడఁగా
నేమఱుపాటుతోడివడఁ కేర్పడఁగాఁ బరితాపఖిన్నుఁ డై. ౩

క॥ తలపోఁతలకుం బాల్పడెఁ దలఁ కటు దలకొనఁగ బ్రహ్మదండద్యోతం
బులు విద్యున్నిభములు రాము లసద్బాణములు దలఁపు మొనకొని వేఁపన్. ౪

క॥ సింగముచేత మతంగజముం గరుఁడునిచేత నురగముంబలెఁ బరిభూ
తిం గనె రఘురామునిచేతం గడుసరి రావణుండు తరుణీమణిరో. ౫.

క॥ కాంచనమణిమయదివ్యసమంచితపరమాసనంబునం దుండియు న
వ్వాంచన కెరియుచు రక్షఃపంచాస్యుఁడు పలికెఁ దత్సభాజనములతోన్. ౬

—♦ రావణుఁడు తనభంగమును దలఁచి వాపోవుట. ♦—

క॥ నాదుపరమతపమెల్లం బూది న్వేల్చినహవిస్సు పోలిక మోఘం
బై దిక్కుమాలి నట్టిదకాఁ దటి నక్కఱకురానిగతిఁ జేడ్పడియెన్. ౭
ఆ॥ ఏమహేంద్రు నంత లెంతకుం జాలిన వాఁడ నాతలంచువలను సెల్ల
వలదె యట్టినేను వ్యర్థుఁ డై మనుజుని చేతఁ బడితిఁ జేతఁజేతఁ జెడితి. ౮
ఉ॥ మాయలమారి బ్రహ్మ నను మాటలసందునఁ బెట్టి బెట్టిదం
బై యగడెంచు పల్కనియె నందవుమిత్తి కనందగున్ భయం
బౌమెనయేని మానవభవాత్మునివల్లన యౌనుఁగాని యిం
కేయెడఁ గా దటంచు నది యింతలు సేయుటఁ గాంచ నెమ్మదిన్. ౯
తే॥ దేవదానవగంధర్వదితిజపతగయక్షరాక్షసోరగముఖ్యు లైనవారి
వలన భయ మింత లేకుండవలయు ననుచుఁగోరితిఁ దలంప మర్త్యులఁ ద్రోఁతివాండ్ర.
క॥ మానుషుఁ డై జనియించె నమానుషసత్త్వాఁడె రాముఁ డౌ నౌ నటులుం
గానియెడ వానిచే నిమ్మై నవమానంబు నొంది మరలనగుదునే. ౧౧
సీ॥ ఇక్ష్వాకుకులనాథుఁడే యనరణ్యుఁ డన్జనపాలకుఁడు వానిఁ జెనకి యేను
సంగరం బొనరించి సత్త్వహీనునిఁ గాఁగ మదినెంచి యాతనిఁ ద్రోచి యిడక
పైఁబడి మడియింపఁ బార్థివుం డనఘుండు ద్రెళ్లెను ననుఁగాంచి త్రుళ్లిపడకు
మీవంశమునఁ దోఁచు నిద్ధతేజుఁ డొకండు పురుషుండు పూజ్యుండు భూరిబలుఁడు
నిను సపుత్రు సబలనివహు సామాత్యు ససారథికునిఁ గాఁగ సంహరించుఁ
బోరఁ బోర నాదుపున్నెంబునన రాక్షసాధమాధమా యటంచుఁ దిట్టె. ౧౨
క॥ ఆదేవనిభుని శాపం బౌదెసదాసఁ గిడఁగనుండ నాదట మునిజన్
వేదవతిం ధర్షించితి శ్రీదయితుంగూర్చి తపము సేయుచునుండన్. ౧౩
ఉ॥ ఆయమ రుష్టయై తప మనామయమునుం బొనరించుపొంటె న
న్నాయెడఁ గాంచి యోరి యిటు లాడిననోటికి బుద్ధిసెప్పఁ లే
న్యాయమ యైన నేమిసెడె నానుడి కింకను లేదె కాల మే
నోయెడ లిట్టు లుంచ నని యొక్కట యోగమహాగ్నిఁ జొచ్చుచున్. ౧౪
క॥ హరికి న్నాపైఁ దన కాహర్రిపై మక్కువ సుసిద్ధమగునేని నినుం
బోరిగొన మూలమ నగుచున్ ధరఁ బుట్టెద ననియె నడియుఁ దార్క్యనె నొంటన్.
తే॥ ఆమహాభాగయే సీత యనఁగఁ జనకనందినియ కాఁగ నతని జన్నంపునేలఁ
బొడమె నింతయుఁ దలఁపఁగఁ బూర్వకర్మఫలమె యిప్డిఁ ప్రబల మై ప్రాప్తమయ్యె.
మ॥ ఉమ కైలాసగిరీంద్ర మెత్తుతఱి స్త్రీ యొప్పు న్నిమిత్తంబుగా
నమరద్వేషణ నీదుచేటున కనెన్ హా నంది యానంది శా

ప మొసంగెన్ గపిరూపు నన్నగితి నీపక్షంబువారిన్ బ్లవం
గములే కూల్తు రటంచు రంభకృతియు న్గారింపఁగాఁ జొప్పడెన్. ౧౭

తే॥ పుంజికస్థల వరుణునిపుత్రి నొడిసినట్టి కచ్చున కజుఁ డట్టు లార్చితిట్టెఁ
గద యెఱుంగుదు రిమ్మెయి కథలు గొన్ని మీరుఁ దపసుల నుడిచొప్పు మిథ్య యగునె

క॥ ఇది యంతయు మది నారసి గొదకొని జతనమున నుండఁ గూర్తురు మీరే
యది యెట్టు లానొ తుది నియ్యదనునఁ గనుమూసియుండు టర్హంబగునే. ౧౯

తే॥ చర్యలందు గోపురశిరస్థలములందు మేటిసుభటులు గాపుండి మేలుకొనఁగఁ
దగిన కట్టడిసేసి దుర్దమునిఁ గుంభకర్ణు నెట్టన మేల్కొల్పఁ గడఁగవలయు. ౨౦

క॥ అప్రతిమగభీరుం డని దీప్రాశనివేగుఁ డఖిలదేవాసురద
ర్పప్రతిభానఘ్నుఁడు వాఁ డప్రతిఘాతమున నిద్ర నెనయంజనియెన్. ౨౧

చ॥ అని తనభంగపా టటు ప్రహస్తుని పాటును శత్రుపాటనుం
డనుపద మెంచి భీమ మసురౌఘము నానతిసేసె ద్వారము
ల్గొని ఘనవప్రము ల్వెరసి కొంకక పాలనసేయుఁ డెట్టులై
నను ఘటకర్ణు జాగరమున న్నలువొందఁ బొనర్పుఁ డిత్తఱిన్.

తే॥ ఉరక సుఖముగ నిద్రించుచున్నవాఁడు చింతలేక కాలాక్రాంతచేతనుఁ డయి
బ్రహ్మశాపంబుకతన నిర్భాగ్యుఁ డయ్యెఁ గాని యాతనిఁ దొడరంగఁ గలరె జగతి.

తే॥ నిద్రవశమునఁ బడి వాఁడు నెఱేఁదొఱంగి యాఱునెల లుండు నంతకునంత లయ్యె
మఱియు సప్తాష్టనవదశమాసములును సుప్తుఁ డౌఁ దేఱు నొకనాఁడు చొప్పు నెఱయ

క॥ ఆనాఁడు కార్యమంత్రము పూనికమెయినుండి యవలఁ బోయి పరుండెన్
గా నేఁటికి నవమదినం బైనది యది గాఢసుప్తి యలవడ దీలోన్. ౨౫

ఉ॥ నెట్టనఁ దేర్పవచ్చు రజనీచరులార! చనుండు వైళ మీ
పట్టున వాఁడు మేల్కొనినఁ బాఁచును రామకృతావమానమున్
దిట్ట యతండె రక్కసులదేవుఁడు సుండు మహాభుజుండు దాఁ
గట్టిగ నిల్వ మార్కొనఁగఁ గారు సురాసురు లెత్తివచ్చినన్. ౨౬

తే॥ వానరుల రాజపుత్రుల వరుసఁ బట్టి మ్రింగఁగా నేర్చు నొక్కనిమేషమాత్ర
లంక కొక్కఁ డితండెపో లావరి యని యెత్తినజయధ్వజంబు దైత్యేశ్వరుండు.

తే॥ మూఢుఁ డై గ్రామ్యసుఖరతి మొనసినాఁడు నిద్ర నది విధికల్పన నిరత యయ్యెఁ
గాని మేల్కొన్న నవ్వానిఁ గాంచి రేని వానరులు ఖేచరులు నేలవట్టి చనరె. ౨౮

ఆ॥ ఆజి రాముచే నిరస్తుఁడ నైనాఁడ నన్న బన్న మింత లనఁగఁ బోల
దతని బుద్ధుఁ జేసి యందిచ్చితిర యేనిఁ గాంచువాఁడఁ బుట్టుగనినఫలము. ౨౯

ఆ॥ ఇట్టివ్యసనమున ననీదృశుం డవ్వాఁడు సాయ మొనరఁ జేయఁ జాలకున్న
నుండనేమి యవల నొందుగానేమి మహేంద్రసముఁడు బలమహీయసుండు. ౩౦

క॥ ఘనుఁ డతఁ డాతని బోధింపన నెఱయఁగనలయు నొందుపద్ధతి యిప్పు
ట్టునఁ బొసఁగనేర దియ్యని ననివార్యుఁడు మొసయుఁదేర నగు జయమొసరన్.

ఆ॥ అనుచు రాక్షసేంద్రుఁ డాడుజాడనె సంభ్రమాత్తచిత్తు లగుచు సరిగి కసిగి
కుంభకర్ణభవన కుధరకందరముఁ బ్రసక్తిఁ దగులు రాక్షసప్రవసులు. ౩౨

ఉ॥ రావణు నానతిం గొని నరప్రకరాసులు మాంసశోణితో
ద్భావితభోజను ల్మోసని భక్ష్యతతు ల్బహుపానకుంభముల్
వావిరి గంధమాల్యరసవర్గములు న్నెఱయంగఁ గూర్చి ర
త్త్రావసయందు వాని ధృతి దార్పఁగఁ దేర్పఁగ సౌ తలంపునన్. ౩౩

తే॥ సకలగంధప్రవాహప్రచార వితతసుప్రతీహార యోజనాయత్యప్రకార
కలితసర్వతోవిస్తారఁ గొంభకర్ణకందరాసారఁ జేర రక్కసులు దొరసి. ౩౪

క॥ ఆతనియూరుపుగాడ్పుల ఘాతు లగుచుఁ గాలు నిలువద్రొక్కుకొనుచు ని
ష్ణాతులు సుబలోపేతులు నాతటి వా రందుఁ జొచ్చి రతియత్నమునన్. ౩౫

ఉ॥ కాంచనకుట్టిమాంచితవికస్వరశోభశుభాఢ్యసత్కలా
భ్యంచలఁ దద్గుహం గని శయాను మహాబలు భీమదర్శనున్
గాంచిరి కుంభకర్ణు నొకకైవడిఁ బండిన దండికొండతీ
రెంచుచు వ్యాఘ్రము న్మొకము లట్టులు సేరిరి విశ్వధారిణీ. ౩౬

సీ॥ ఒడలిపైఁ బొడకట్టు నూర్ధ్వరోమంబులు జయవైజయంతికాచర్చ లూన
భీమనాసాపుటోద్భిన్ననిశ్వాసము ల్పైషాహి యూర్పుల చెలిమిఁ గోర
మేదోరుధిరగంధమిలిత మహా వక్త్రంబు పాతాలకుహరంబుఁ బ్రస్ఫురింప
శయ్యాతలన్యస్తసకలావయవములు పాథోధిభూధరపఙ్క్తి నొరయఁ
గాంచనాంగదముకుటముఖ్యప్రరోచులం దిరమ్మదసంతాన మావహిల్లఁ
జేయఁగ నజేయుఁ డాసురసింహుఁ డటు గుహాశయుండయియుండఁ దదాశ మొనసి.

తే॥ వికృతుఁ డయి నిద్రవోవు నవ్వీరు నరసి వెఱవుఁ బొంద్రోచి కర్ణమ్ము వెగవుచూచి
వానిఁ బ్రతిబోధితు నొనర్ప వలనుపడిరి సహితులై రక్కసులు జలజాతనేత్ర. ౩౮

క॥ తొలుదొల్త రాశివోసిరి బలుమాంసవితతుల మేరుపర్వతశిఖరం
బొలసి తులఁదూఁగ దనుజులు బలీయు లది వాని కెదురుపడి తృప్తి నిడన్. ౩౯

క॥ మృగమహిషవరాహాదులు నగపడ వేర్వేఱ రాసు లగముల యట్లై
సుగమము లై యుండఁగ వారు గడించిర యుగ్గడించురూఢికి సరిగన్. ౪౦

క॥ అన్నిఁటి కెక్కుడుగా నిడి రన్నపురాశిని సులక్ష్యమై తగ భక్ష్య
ప్రోన్నతసంచయముల నిఁక నెన్నం బనిలేదు పెచ్చు లివి యవి యనుచున్. ౪౧

ఆ॥ మద్యకుంభశతము లుద్యద్ఘణాసృక్ప్రకాండభాండలక్షకములు వాని
దరిని దరికొనంగ దారి యియ్యదె యంచు నేర్చి కూర్చి రసురనేత లపుడు. ౪౨

క॥ మొదలిడి రాతని సంతం గదలింప నిలింపరిపులు గా దన్యుల క
యుద్యదనునఁ దేర్పఁగ విధి తన యెద నిడిన తలంపు ముట్టనెనయదయేని౯. ౪౩

సీ॥ తనువు సుగంధిచందనకర్దమముల నలంది పన్నీరు మొల్లముగఁ జల్లి
దివ్యమాల్యములు గంధిలములు గుదులుగా మలయించి ధూపధూమములు వెట్టి
స్తోత్రపాఠంబు లస్తోకంబులు రచించి జలదనాదంబులు సంతరించి
సంకులు పూర్ణశశాంకసన్నిభములు పూరించి ఢక్కోళిలఁ బొడవు పఱిచి
విసువ కెల్లరు నొక్కట విలయభైరవారవంబుల నెలకొల్పి హత్తుకొని క
దల్చి యాస్ఫోటనంబులు దవులుకొలిపి నిద్ర మేల్కొల్పఁదొడరి రున్నిద్రులగుచు.

తే॥ శంఖభేరీపణవముఖజనితశబ్దమట్టు లాస్ఫోటితక్ష్వేళితాదినర్ద
మొక్కఁ డగుచు బ్రహ్మాండభాండోపరిగతకర్పరం బగలింపఁగఁ గడఁగె నపుడు.

ఆ॥ దెసలు ముట్టఁ బాఱి దివ మంటఁ బ్రాఁకి యేపట్టునందు నిలువ మట్టులేక
తిరిగితిరిగి భూప్రదేశంబునం బడె నారవంబు విని విహంగములు. ౪౫

క॥ నిద్దురమబ్బునఁ బడి యేప ద్దరయఁగ లేక మొద్దుబాఱినవాని౯
దద్దయు నసురు లొనర్చెడు నిద్దపుఁజప్పుళ్ళు దేర్పనేరని వయ్యెన్. ౪౬

క॥ కసిమసఁగి యసురుఁ గొట్టిరి ముసుండ్ల ముసలముల గదల ముద్గరముల బ
ల్వసుల శిలల వృక్షంబులఁ బ్రసుప్తు మేల్కొలుపఁబూని పలలాశు లొగి౯.

క॥ నిట్టూర్పు లెగువ నెదుట న్నిట్టనిలువలేక తలఁగి నెఱయుచు మరలన్
దిట్ట లగుచు బ్రయోగించిరి కట్టలుకఁ గటాహభేరికాముఖ్యములన్. ౪౮

క॥ పదివేవురు రక్కసు లటు పదిలముగాఁ బట్టుపట్టి పరఁగించెదు న
య్యుదుటుతన మెన్న నేరఁడు ముదితరా! శాపోక్తి యెంత మొగకొనఁగలదో.

ఆ॥ కొట్టికొట్టి విసువుకొని యంతమాత్ర కీహంత కదలఁబోవఁ డని తలంచి
యవల గురుతరప్రయత్నం బొనర్చిరిదారుణంబు నాక ధీరయన. ౫౧

సీ॥ తోలిరి పై నాగతురగోష్ట్రఖరముల దండకశాంకుశతాడనముల
నూదిరి చెవులలో నునిచి యుంకించి పెన్బూరాలు గొమ్ములు బూరటిల్ల
బ్రయోయించిరి బలంబు మొనయించి రణరంగభేరు లన్నియుఁ దెచ్చి భీషణముగ
మోదిరి ఘనకాష్ఠములఁ గటారమ్ముల మే నిది యను బుద్ధి మెలపుఁ గొనక
త్రోచి రటు గండశైలము ల్దొరలఁ బెద్దబ్రమాఁకులం గొట్టి వైచిరి మల్లచఱచి
పొడువఁజొచ్చిరి వజ్రమ్ముకడఁక వెలితిబుచ్చు పిడికిండ్లు గూర్చి యప్పాలసుదిండ్లు.

ఆ॥ అగడం బొనర్పు నాఱడియే కాని వాని కెట్లుఁ దెలివి వఱలదయ్యె
లంక దానఁ గదువడంకఁగాఁ దొడరె సహాబ్ధిభూమిధరవనాంత యగుచు. ౫౩

క॥ ధక్కాసహస్ర మొక్కటఁ బెక్కురు కోణపులు హైమపృథుకోణములన్
నెక్కొని బ్రయోయించిరి తమ చిక్కనిమేనుల బలమ్ము సీమం బెరయన్. ౫౪

ఆ॥ దానికేని నింత దలకఁడు కదలఁడు గుఱ్ఱువెట్టు నెదిరిగుండె లవియఁ
బెద్ద నిద్ర యదియుఁ బెద్దనిద్దుర గాదు బ్రహ్మవ్రాతఁ గుడువఁ బరుల కగునె.
శా॥ ఆశాభంగకృతంబు రోస మెగుర్పన్ హా యంచు మాంసాశనుల్
పాశంబు ల్దవిలించి యీడ్చియు ఘనప్రస్థానభేరీరవం
బాశ ల్వ్రీల ఘటించియున్ బ్రబలగర్జారావము ల్బూర్చియున్
గేశంబు ల్పెకలించియుం గఱచియుం గించిత్తుగా నొంచియున్. ౫౬
ఆ॥ కుంభకర్ణు కర్ణకుహరము ల్నిండ వాఃకుంభశతము లెత్తి గ్రుమ్మరించి
రదియు లెక్కసేయఁ డాతని నిద్దురసుఖము కష్టములనుఁ జూచునదియె. ౫౭
ఆ॥ కూటముద్గరములఁ గొట్టిరి పెల్చన గఱకువోవ నెల్లగాత్రములను
శిఖరిశిఖర మెంచు శిరమున బలుకట్లు గట్టి వగు శతఘ్నికాశతముల. ౫౮
క॥ ఇంతకుఁ దలఁకనివాఁ డీక నెంతకునోపఁ డని మత్తమిభసాహస్రం
బంతటఁ దోలి రతనిపైఁ బంతంబున నవియుఁ ద్రొక్కె బలు వానంగన్. ౫౯
ఆ॥ స్పర్శవిషయకంబు సంజ్ఞాన మసురున కొదవె నవల నదియుఁ గుదురుకొనఁగ
నిదుర సెడె నటంచు నీల్గుచు మూల్గుచు నుబ్బతిల్లె నాతఁ డుత్పలాక్షి! ౬౦
క॥ క్షుత్తృష్ణాభయపీడితుఁ డత్తఱి వాఁ డెన్నఁ డగము లచలశిఖరముల్
సత్తువకొలఁదికి నసురులు మత్తతఁ దొలఁగింప రువ్వనుదు పొక్కటియున్.
ఆ॥ నాగభోగనిభము నగశృంగసారంబు బాహుయుగము సాఁచి ప్రబలుఁ డతఁడు
బడబమొగముఁబోని వదనంబుఁ దెఱచి జృంభణ మొనర్చె సురలు పల్లటిల్ల. ౬౨
క॥ పాతాళకుహరసన్నిభ మాతని మో మప్పు డొప్పె నధిమేరుగిరి
ద్యోతితము తపనమండల మేతావన్మాత్ర మన నసీదృశ మగుచున్. ౬౩
ఆ॥ మేలుకాంచి వాఁడు మెయివెంచి జృంభించి దండికొండభాతిఁ దద్దనెఱయ
దండ వీవఁదొడరు చండవాత మన నిట్టూర్పు వెడలఁదొడరె నుత్కటముగ.
క॥ పలుభూష లొలయ మేల్కొని నెలకొను నవ్వాని మేను నెట్టనఁ దనరెన్
జలదము సజలబలాకము తొలికారున నెట్టు లట్లు ధూతాఘచయా. ౬౫
తే॥ వాని గ్రుడ్లు విద్యుత్ప్రభావర్ణితములు వహ్నికుండసదృక్షము ల్వఱలె నపుడు
దివిరిఁ బరపీడనమునకై తేజరిల్లు శనికుజగ్రహములునాఁగఁ జంచలాక్షి. ౬౬
శా॥ కాంచెన్ భక్ష్యపురాసు లన్నగిరులుం గ్రవ్యోత్కరంబు ల్మృగో
దంచద్గాత్రసహస్రము ల్సుకృతమద్యాసృక్సుమేదఃపయ
శ్చంచత్కుంభశతాయుతంబులు బుభుక్షాతృష్ణిక ల్దీఱ భ
క్షించెన్ గ్రోలె నొకించుకేని నెదియున్ శేషింప నీ కొక్కటన్. ౬౭
తే॥ ఇంద్రరిపుఁ డట్లు తృప్తుఁ డై యెలయు టెంచి వచ్చిపడి రన్నిశాచరు ల్వల నెఱింగి
శీర్షములు వాంచి యంజలు ల్సేర్చి మ్రొక్కి రంచి తత్స్తోత్రములఁ బ్రస్తుతించి రపుడు.

ఉ॥ కన్నుల నిద్రమ బ్బలఁతిఁ గ్రమ్మఁగ నిర్మలభావ మంత లే
కున్నదె మైన దృష్టి నతఁ డొంట గడల్కొనఁ జేసికొంచుఁ గాం
చె న్నిభృతప్రచారుల విశిష్టవిచారుల రాజచారులం
గ్రన్నన మన్నన ల్నెఱపెఁ గార్కొనుచుట్టటికంబు డంబునన్. ౧౯
తే॥ ననుచు సాంత్వన మొనరించి నైరృతర్ష భుండు స్వప్రతిబోధనంబునను విస్మ
యంబున విడంబనంబు నయంబుసూప నిట్టుల నె వారితోఁ గర్జ మెంచుకొనుచు.
ఉ॥ ఏమని నన్ను మేల్కొలుప నెంచితి రిట్టు లకాల మా నెడన్
స్వామికి మేలె యేభయముఁ బాటిలలేదుగదా యటంచు నే
నేమెయిఁ బల్క నేమిగల దెద్దియొ పాల్పడెఁ గాకయున్న నన్
నేమము మీఱఁ దేర్పఁ గృతనిర్ణయుఁ డంపున మీరు వత్తురే. ౨౦
శా॥ నేఁడే తీర్చెద రాక్షసేంద్రు భయ మున్నిద్రుండ నైతింగదా
వాఁ డింద్రుండొ హుతాశనుండొ జముఁడో వాక్రుచ్చి న న్నంపుఁడా
మూఁడు న్వానికి ముజ్జగ మ్మఱిమినం బోకార్చెదం గర్జమం
దేఁ డంబంబులు వల్కనం చెఱుఁగరే యేపట్టువారేనియున్. ౨౧
ఆ॥ అల్పకారణమున కధినాథుఁ డిట్లు నన్మేలుకొలుపుతలఁపు మేకొనండు
గలిగినట్టి యర్థగతి వివరింపుఁడు డాఁపనేల యాతఁ డోపి క్రాల. ౨౩
మ॥ అని సంరబ్ధుఁడ వై వచించు నసురు న్వ్యానద్ధు నీక్షించి యి
ట్లనె యూపాక్షుఁడు కేలుమోడ్చి సచివుం డవ్వాఁడు రక్షోధినా
థున కిట్లింత మెఱుంగుమయ్య తమ కాద్యోనాథముఖ్యు ల్పొన
ర్చిన నేరం బనరాదు కా దొరుల కీచేడ్పాటు వారింపఁగన్. ౨౪
ఆ॥ మానుషంబు భయము మన కిప్డు వాటిల్లెఁబోల దొండు వీనిపుచ్ఛమునకు
లంకఁ జుట్టుకొనిరి లావరు ల్వానరులెల్ల నొక్కఁ డగుచు నెత్తివచ్చి. ౨౫
క॥ ము న్నొకప్లవంగముఁడె కద యెన్నినభటు నక్షుఁ దునిమె నేర్చె బలము సం
పన్నఁ బురిఁ గాల్చె నవ్వాపన్నుం డై చనియెఁ గార్యపద్ధతి పొసఁగన్. ౨౬
క॥ సీతం గొని తెచ్చిన యయ్యాతంకం బింతసేసె నాదటఁ గలదే
సీతోఁ దెలుపఁగ రాముని చేతఁ బోరిన్ భంగపాటు సిద్ధంబయ్యెన్. ౨౭
తే॥ దేవకంటకుఁ బౌలస్త్య దితిజనాథుఁ బ్రాణసంశయ మందించి పాఱఁదరిమె
రాముఁ డాదిత్యతేజుం డరాతు లెవ్వరేని సమకూర్ప రేనాఁడు నిట్టిగోడు. ౨౮
క॥ అన నిద్దురకలఁకయు మదమునుఁ దత్త్వం బెన్నసీక మొనకొని సోద
ర్యున కజయ మనిన యూపాక్షుని న్వివృత్తాక్షుఁ డగుచుఁ జూచి యతఁ డనున్.
క॥ ఇప్పుడె పోయెద నందఱఁ దెప్పలఁ దేర్ప రుధిరమునఁ దృషఁ దీర్చుకొనన్
గుప్ప లగు పలలముల నాయప్పటిక్షుధఁ బాపుకొనఁగ నౌ జతనమునన్. ౩౦

క॥ ఏ నొక్కఁడనే త్రావెద మానవనాథాస్ర మెల్ల మఱి తన్మాంసం
బానెఱి భక్షించెద నాఁ బో న న్నికఁ డాఁకపడునె పోరికలనులోన్. ౮౧
క॥ అని గర్వితుఁ డై రోసము పెనఁగొన నటు లనెడు శత్రుభీకరు నసురున్
మొనసి మహోదరుఁ డంజలి మొనకొనఁ దా నిట్టు లనియె మోహనమూర్తీ.
శా॥ అన్నం గాంచి ప్రసక్తి మించి కయిమో డ్పర్పించి భాషించి యా
సన్నం దన్మహనీయసూత్రితము భాష్యం బెంచి కా కొంటి మైఁ
జన్న న్వారలు చుల్క నౌదు రె విభా సంపన్ను లామీఁదటం
గన్నా కీతఁ డటంచు మెచ్చ మెలఁగంగా రాదె జన్యంబునన్. ౮౩
క॥ అని గెలుతువపో భ్రాతం గని మేలుంగీండ్లుఁ జక్కఁగా నారసి తో
డన కదలి విక్రమము నెఱప నగుం బ్రాభవము వెలయఁ బరబలదమనా. ౮౪

—♦ కుంభకర్ణుఁడు రావణుం గాంచఁబోవుట ♦—

ఆ॥ అనిన వానితోడ నౌనులె మ్మని యెల్లవారిఁ గూడి సహజువలనుఁ గాంచ
నెంచి పయన మగుడు నెలమిమైఁ జనిరి వా రినున కెఱుక సేయ నిత్యచరిత! ౮౫
తే॥ భీమరూపపరాక్రము భీమనేత్రు భీమబలు మేలుకొలిపి నిక్కిభకు లగుచు
వరు వరాసనాసీను నవ్వలని కరిగి కాంచి కైమోడ్చి పలికిరి కమలనయన! ౮౬
క॥ నీతమ్ముఁడు మేల్కాంచె ననేతావన్మాత్రుఁ డాతఁ డిటరాఁజనునో
యాతావున కరిగి సపత్నాతంకముఁ దీర్చి వచ్చి యటఁగననగునో. ౮౭
ఆ॥ అనుడు నాతఁ డుబ్బి యంతకునంత లై వాని వేడ్కఁ జూచువాఁడ మేలి
పలుకు లెలమి మీఱఁ బలికి యౌచిత్యంబు నెగడ ననుచువాఁడ నేన యనిన.
ఉ॥ వారలు పోయి రావణుని వాక్కులు దెల్పి భవత్సమక్షముం
గోరెడు వాఁడు తేఁ డిఁక నకుంఠితధీ వెలయంగఁ గొల్వునం
జేరి ప్రహర్ష మాతనికిఁ జెచ్చెర నెక్కొనఁజేయవే యనన్
దీరగు నద్దియే యనుచుఁ దేఁకువ సెజ్జదొఱంగి హృష్టుఁ డై. ౮౮
ఆ॥ మోము గడిగి కృత్యములు దీర్చి స్నాతుఁ డై మేలిచందనమ్ము మెయి నలంది
భూషణములు దాల్చి పురుబలం బొనగూర్చు పానకములు దేరఁబనుచుటయును.
ఆ॥ మలసి రావణాజ్ఞ మద్యకుంభంబులు రెండువేలు దెచ్చి ప్రీతి వెలయ
నర్పణం బొనర్ప నవి ద్రావి తేజోబలాఢ్యుఁ డట్లు మత్తుఁ డగుచు నతఁడు. ౯౧
క॥ కాలాంతకనిభుఁ డచ్చటఁ గాలానక వెడలి యసురగణములు గొలువం
గా లావరి భ్రాతం గనఁ గాలాహ్వాతుఁ డగుచు నడిచె క్ష్మాధరతనయా. ౯౨
క॥ పాదన్యాసంబుల ధర పా దగలఁగ రా సహస్రపాదుఁ డవనిపై
వాదమున వచ్చె ననియెడు వా దమరెఁ రాజపథము వలగొను ద్యుతులన్.

క॥ అంజలి మాలికఁ గొనుచున్ నెంజిలితే కతఁడు గాంచె నేతనగరు సే
రం జిష్ణుండు స్వయంభువు మంజులమందిరము మలయుమూడ్కి న్మహిలా. ౯౪
ఉ॥ రాజపథంబునం బెరయు రాక్షసభూతముఁ గాంచి వానరుల్
తేజ మిఁదేటి దిట్టి దగు దేహ మొకం డిల నుండునే ధరం
బోజమెయి న్మెలంగు నటు లున్నదిగా కనుచున్ భయంబునన్
వే జనఁజూచి రొండెడకు వేఁకర మెంచుచు సంచరించుచున్. ౯౫
ఆ॥ రామ ! కావవే శరణ్యుండ వీవంచు గొంద అధిపు వేఁడుకొనిరి కొంద
అడఁగి రిలనుఁ గొంద అటునిటుఁ బఱచిరి వ్రాలి రందుఁ గొంద జోల మెడల.
మ॥ ఘనతేజంబున సూర్యునిం బొదువువీఁకన్ శైలశృంగాభుఁ డై
కనదూర్జస్వికిరీటుఁ డై యొలయు నా క్రవ్యాదు నత్యద్భుతుం
గని స్థైర్యం బెడలించు త్రాసముమెయిన్ గాలూనఁగాలేక చి
క్కని దౌ వానరసేన యయ్యదనునం గఁపించెఁ బొంపేదఁగాన్. ౯౭
ఉ॥ అప్పుడు రామచంద్రుఁడు మహోమహుఁ డుజ్జ్వలసత్త్వుఁ డాతనిం
దెప్పునఁ జూచి భీషణుఁ డుదీర్ణుఁడు వీఁ డని బీర మొప్పఁగా
గొప్పశరమ్ము గార్ముకముఁ గూర్చి విభీషణుఁ గాంచి సైన్య మా
ముప్పున కోహటించుటయు మున్నడిమెన్నిక నుంచి యిట్లనున్. ౯౮
శా॥ వింజంబొక్కో త్రివిక్రమప్రభుఁడొకో విక్రాంతిమై నాకసం
బంజంజాలి సతోయతోయధర మ ట్లై స్వర్ణభూషాప్రభా
పుంజం బొప్పగు వైద్యుతద్యుతులతోఁ బోరాటముం గోరఁ దా
నంజిల్వట్టెడుఁ బృథ్వి గ్రక్కదలఁగా నాలంక నిశ్శంకుఁ డై. ౯౯
క॥ అంగదఁ బఱచెడు వీనిం బింగళలోచనునిఁ గాంచి పిఱికిపడి మహా
పింగలదృగ్వాహిని యదె సంగతి నెడఁబాసి యిది విచార్యముకాదే. ౧౦౦
ఆ॥ పుడమికెల్లఁ గేతుభూతుం డొకం డీతఁ డంచు నామదిం దలంచువాఁడ
నిది యదృష్టపూర్వ మీభూత మెద్దియో తెలుపుమయ్య నాకుఁ దేటపడఁగ.

—♦ రాముఁ డడుగ విభీషణుఁడు కుంభకర్ణువిధముఁ దెలుపుట ♦—

మ॥ అని రాజేంద్రుఁడు రామచంద్రుఁడుదితుం డక్లిష్టకర్ముండు ద
న్ననుయోగాదృతుఁ జేయఁ బ్రాజ్ఞుఁ డుచితవ్యాపారుఁ డభ్యస్తరా
జనయుం డిట్లనె నవ్విభీషణుఁడు విశ్వవ్యాపకా! నీయెఱుం
గని దొం డె ట్టెఱిగించు నీదగుకటాక్షం బంతకుం జాలఁగన్. ౧౦౨
క॥ తెలుపుదు భ్రాతయ యితఁడుం గలుషాత్మకుఁ డైన పఙ్క్తికంధరు ననుజుం
డలఘుండు మధ్యముఁడు గా నలవిశ్రవువలనఁ బొడమె నరిదుర్దముఁ డై. ౧౦౩

సీ॥ పుట్టినప్పటినుండి పాడవారునంతలో మేలిసత్త్వము లేర్చి మెక్కినాఁడు
వైవస్వతుని నొంట వాసవు నొక్కొంటఁ బట్టి తాళము గాఁగఁ గొట్టినాఁడు
దానవదేవగంధర్వాదిగణములఁ దోలుబొమ్మ లటంచుఁ దోలినాఁడు
శూలపాణిని నేన చూ జగంబులకెల్ల నొం డెవం డని యూఁపు లూఁపినాఁడు
చావులేనట్టివారలఁ జంప పీని నంతకునిఁగా సృజించినాఁ డజుఁ డటంచుఁ
దిట్టువారి నడిమినెత్తి మొట్టినాఁడు గట్టివాఁ డీతఁడే కుంభకర్ణుఁ డధిప! ౧౦౪
ఆ॥ పీని జోడు మూడు విష్టపంబుల లేఁడు వేల్పులందు దనుజవితతియందు
మనుజులందు ననఁగ మాయయ్య! నోరాడ దేను నీకుఁ దెలుపు నిఱుకటమున.
క॥ ప్రబలుండు విరూపాక్షుఁడు కబలింపఁగనోపు ముజ్జగంబుల నొకఁడే
యబలలపాలిఁటిమృత్యువు సుబాహు పీతండ చువ్వె సుగుణాభరణా. ౧౦౫
ఆ॥ ప్రకృతిచేతఁ దేజు బలము బీరము పీడు పట్టుగాఁగ నెపుడుఁ బ్రబలుచుండు
నన్యులం దనంగ నన్యంబులే వరోపాధికంబు లగుచుఁ బరఁగుచుంట. ౧౦౬
చ॥ తపమొనరించినాఁ డురక దద్దయుఁ గోరక కోరినాఁడు నా
కపగతవిఘ్నుఁ డై సుఖము నందఁగఁ జేయు సుషుప్తిఁ గూర్చు మం
చపకృత మంచుఁ దాఁ దలఁపఁ డత్తఱివేల్పు లిమ్మొయిన్
గపట మొనర్చినా రనుచుఁ గాఱియపెట్టఁదొడంగె వారలన్. ౧౦౭
తే॥ ఇతఁడు భక్షింప భక్షింప నిమ్ము నెడఁగ నెల్లవారలు మొఱవెట్టి రింద్రుఁ జేరి
యతఁడు శితవజ్రపాతాభిహతు నొనర్చె నెఱుఁగఁడో మీఁద నా కర్జ మెంచినాఁడో.
క॥ ఇంచుక కదలియుఁ గదలక చంచలచిత్తుఁ డయి రాక్షస ప్రవరుఁడు గ
ర్జించె నశనిశత మురలెడు సంచున ఘోషించు జలదసంచయ మెనగాఁ. ౧౧౦
క॥ దాన నృడఁకెను మేదినితో నంబుధి ఘూర్ణిలంగఁదొడఁగెను బ్రజలుఁ
మే నెఱుఁగక వ్రాలిరి సంధానం బెడలంగ దిశలు తల్లడపడియెఁ. ౧౧౧
ఆ॥ కోప మెక్కుడగుచు గొనకొన నైరావతంబు దంత మొందు దద్ద బెఱికి
వాసవుని యురంబు వగులఁగొట్టెను నైరృతుండు దుండగంబు తోడుపడఁగ.
తే॥ కుంభకర్ణప్రహారాప్తిఁ గుంఠితుఁ డయిశక్రుఁ డల్లాడె దేవత ల్భయములు వి
షాద మందిరి వారితో సంగతుఁ డయిచేరె స్వాయంభువాస్థానసీమ కతఁడు.
క॥ అందఱుఁ దా నొక్కఁడుగా నందించెం గుంభకర్ణు నతిదౌరాత్మ్యం
బం దరిగి శతానందునకుం దీ రగు నతులు నుతులు గూర్చి భృశార్తిఁ. ౧౧౪
ఆ॥ ప్రజల భక్షణము సుపర్వశిక్షణ మాశ్రమాపకరణ మంగనాపహారణ
మొక్కఁ డొకఁడు గాఁగ నుగ్గడించి గడించియుంచినట్టి నుడి వచించె నపుడు.
తే॥ ఈతఁ డిమ్మొయిఁ జెలరేఁగి యెల్లవారిహింససేయంగ మెసవంగ నెంచెనేని
నచిరకాలంబుననె జగం బడఁగి శూన్యమగును మది నెంచుమయ్య లోకాధినాథ!

క॥ అను వాసవముఖ్యుల ప్రార్థన విని వాణీశ్వరుండు తద్దయు సురలం
బనివినుఁ డని యసురుల నెట్టనఁ జనుదెం డనియెఁ దనకడంక దొలంకన్. ౧౧౭
ఉ॥ అందఱు రా ఘటశ్రవణు నందుఁ గనుంగొని ధాత యెవ్వఁ డీ
సుందరుఁ డంచుఁ బిల్చి యెడఁ జుక్కి పదంపడి కైతవంబునన్
గ్రందుకొనంగనీక తగు కందువపల్కులఁ బల్కరించుచున్
ముం దననెంచిన ట్లనియె మూర్ఖుని దెంపుఁ దలంచి రాఘవా. ౧౧౮
తే॥ నిన్నుఁ బౌలస్త్యుఁడు సృజించె నెగడు జగములెల్ల ఘూర్ణిల్ల మడియింప నెంచి యట్లు
గాన నావాక్యమున నింకఁ గదలనీనినిద్ర నెవ్వేళ మృతుఁబోల నెఱయఁగనుము.
క॥ అని శాప మిడిన నెల్లరు దనికిరి తా నొల్లఁబోయె దనుజవ్యాఘ్రుం
డును సురలు మునులు సంతసమునఁ దేలిరి బ్రతుకుదారి మొనసితి మనుచున్.
ఉ॥ అమ్మహనీయు వాక్యము మహత్త్వ మదెట్టిదొ కాని తోన తా
నమ్మొయి సోలె రక్కసుఁ డహో యని రందఱు చూచుచుండ మే
ల మ్మిది యింతలాయె నని లావరి రావణుఁ డావిధాతపా
దమ్ములమీఁద వ్రాలి కనుదమ్ముల నద్దుచుఁ బద్దు సూపుచున్. ౧౨౧
తే॥ ఇట్టు లనె నీకుఁ దగునయ్య యింత సేయ దాను వెంచిన పైరు క్రోధమునఁ గోయ
నేరు గాదనువారు నీ కేటిపోరు నేఁడె మడియింపు మదిఖ్యాతి నెఱయ తీరు.
క॥ మునిమనుమని నీవే యిటు లొనరింప నిఁకేమి యొదవు నోగిఁ బ్రబలినకాం
చనము తరువు ఫలకాలంబునఁ గెడపుదె మంచిసేయు ప్రొద్దిదిగాదే. ౧౨౩
తే॥ సత్యవచనుండ వీవు నిస్సంశయముగ వీఁడు శయనించుఁ గాకేమి వెరవు గలదు
శయనజాగరములకు భోజనమునకును గాలనిర్ణయ మొనరించి కావుమయ్య.
మ॥ అనుచుం బౌత్రజుఁ డర్థి వేఁడ ద్రుహిణుం డాలించి మే లెంచి వీ
డనిశం బార్నెలలున్ శయించు నొకనాఁ డౌ సంప్రబుద్ధుండు మే
ల్కొని భక్షించు బుభుక్షు లక్షితములం గ్రొవ్వాడి సంక్రుద్ధు వ
హ్నినిఁ బోలంగఁ జరాచరం బగు జగం బేతద్వశం బయ్యెడిన్. ౧౨౫
ఆ॥ కనలి వానిఁ గెలువఁగాఁబోల దానాఁటి కందఱకును నెక్కుడై చరించు
మలయు నిదురవోవ మఱునాఁడు ప్రసభమ్ము మేలుకొలుప నాఁడె మిత్తిఁ బెరయు.
క॥ అని నిర్ణయింపఁగా నయ్యనఘుని యానతి శిరమున నభినందనముం
బొనరించుచు నిలుసేరెను దనుజులతో ననుజుఁ గొనుచు దశవదనుఁ డటన్
ఆ॥ తనకుఁ దానె శయనతత్పరుఁ డగు లేచు నట్లె యట్టె బహుపలాశి యగుచుఁ
దిరుగు నొక్కనాఁడు దేదీప్యమానుఁడై నాఁడు మొదలు లోకాధినాథ యితఁడు.
ఉ॥ నీదుపరాక్రమం బరసి నిక్క మజయ్యుఁ డటంచు నెంచి పెం
పేదఁ దలంగి కార్యగతిహీనతమై వ్యసనంబు పాల్పడన్

దా దరిసేరఁగా నయినదారి యిదే యని కానికాలమం
దీమరితాత్ము మేల్కొలిపె నింకేట నేయది గాఁగ నుండెనో. ౧౩౧

ఆ॥ ఇతఁడు వెడలె శిబిర మిత్ర తేజుఁడు క్రుద్ధుఁ డగుచు వనచరౌఘ మలమి భక్ష
ణం బొనర్ప నౌ మనంబున నరుదెంచు ముంచు మబ్బుభాతి మొక్కలమున.

క॥ విద్రుతు లగుచున్నా రీరౌద్రుం గనినంతఁ గపులు రభసంబున ను
న్నిద్రుఁ డితఁ డఖిమ మొగకొని ముద్రితునిం జేయనేర్చు మొనగాఁ డున్నే.

ఆ॥ వీరి భయముఁ దీర్ప వెరవిట్టు లూహింతు యంత్ర మొక్కఁ డిది యటంచు నెల్ల
వానరులకుఁ దెల్పి వారిఁ దేర్చుచుఁ దగు వల నెఱింగి వీని సలఁతు మనుచు. ౧౩౨

చ॥ అలుల విభీషణుం డనఘుఁ డాడ సహేతుక మిట్టు లాచరిం
చుటె కడు ల గ్గటంచు రిపుసూదనుఁ డారఘుపుంగవుండు దాఁ
దటుకున నీలునిం బిలిచి తన్మహితార్థముఁ దెల్పి తద్దయున్
బటుతరవాగ్విశేషము ప్రపంచిత మై తనరార నిట్లనున్. ౧౩౩

సీ॥ హా మ్మెల్లవానరపుంగవులం గూడుకొని మొగ్గరం బొసగూర్పు మొలసి
నిట్టనిల్వఁడు లంక సెరయుద్వారంబులు చర్యలు సంక్రమస్థలము లొరసి
మేకొనఁగాంచుఁడు మేలివృక్షంబులు శిల లాయుధంబు లుచ్ఛ్రితము లరసి
యేమఱపా టింతయేనియు లేకుండ దురమున మెలఁగుఁ డో ప్రోనఁ బెరసి
నీవు నేర్తు వెల్ల నేను దెల్పుట పయిపెచ్చనంగ నౌను బృథుబలముల
నిచ్చవచ్చినట్లు లెనయింపుమయ్యా యసం బెసంగు నెఱిఁ బెసంగుమయ్యా.

క॥ అని రాముఁ డానతిచ్చిన ననలసుఁ డనలసుతుఁ డిచ్చ నలరారుచుఁ జ
య్యన నమ్మెయి శాసించెఁ దదనీకముల కెల్ల జయరమాశంసాఢ్యా. ౧౩౪

క॥ హనుమానుం డంగదుఁ డట్లనువములు గవాక్షశరభు లద్రిశిఖరము
లొని ద్వారచయనిరోధం బొనరించిరి మించి రరుల నుజ్జ్వలమూర్తీ. ౧౩౬

తే॥ రామవాక్యచికీర్షావిరాజమానులగుచు హరివీరు లరిసేన నలముపొంటఁ
బాదపంబులు శిలలుఁ జొప్పడ ధరించి పొంచియుండిరి సద్గుణభూష! యోష! 

క॥ శైలోద్యతకరులు మహాశైలచరులు గిరులతోడి సంగడమునఁ ద
త్పాళింబము లౌ నంబుదజాలంబుల భంగి వెలయఁ జాలిరి తరుణీ. ౧౩౮

## —♦ రావణ కుంభకర్ణుల ప్రసంగములు ♦—

ఉ॥ అంతట రాజమార్గమున నంతకుఁడో యనఁ గుంభకర్ణుఁ డ
త్యంతమదాకులుం డగుచు నంచితు లాఢ్యులు నైన మేటిసా
మంతులు యోధులుం గొలువ మానితుఁ డై యరుదెంచెఁ బౌరసీ
మంతిను లాప్తులుం బొరి సుమప్రతతుల్ గురియించుచుండఁగన్. ౧౩౯

శా॥ హైమోద్యన్మణిభాసురంబు వితతం బాకృష్టదృష్టంబు సు
 శ్రీమాన్యంబు సురారిరాజపదలక్ష్మీలాలితం బైన త
ద్ధామం బాతఁడు సేరఁబోఁతె రవి యబ్దం బట్లు సొచ్చెన్ మహో
ద్దాముం డుజ్జ్వలుఁ డెంచె నగ్రజుఁ బ్రశస్తప్రాజ్యపీఠాధ్యుఁగాన్. ౧౪౦

క॥ శక్రుఁడు స్వయంభువుం బలె శుక్రాంతేవాసి విభునిఁ జూచి యతఁడు పా
దక్రమణంబుల మేదిని వక్రం గావించుచొప్పు వఱలఁగ నడిచెన్. ౧౪౧

క॥ కడపటికక్ష్య గడచి తొలి కడంక యుడివోవఁ బుష్పకవరాంతమునన్
గడలుకొను పీఠి నొఱవంబడి నెఱిసెడి యున్న యన్నఁ బ్రబలుఁడు గాంచెన్.

ఆ॥ వానిఁ జూచినంత వాసవవైరి చేకూరె మేలు వీఁడె కుంభకర్ణుఁ
డనుచు నెదురువోయి యాలింగన మొనర్చి చేర్చుకొనియెఁ దనతనర్చునెడను.

క॥ పర్యంకాసీనున కపు డార్యునకు నమస్కరించి యాఘటకర్ణుం
డర్యమతేజు నతనిఁ గని పర్యవసిత మేమి యనుచుఁ బ్రస్తావించెన్. ౧౪౪

ఆ॥ తగినవిస్తరంబుఁ దార్చి యగ్గాని వాఁ డాక్రమింప నసుర యాక్రమమున
నెగసిపడుచుఁ దమ్ము నెనయించుకొనుచు వశ్యం బొనర్పఁ దద్యశంబు వొగడె.

తే॥ ఉబ్బ తబ్బిబ్బుపడి వాఁ డహో యటంచు ననలకుండంబు లగుచు లోచనము లడర
నేల పిలిచితి వేమేమి యొనరివలని భీతి ప్రేతత్వమున కభిప్రేతుఁ డెవఁడు. ౧౪౬

క॥ తెలుపు మనఁ గ్రుద్ధుఁడయ్యెం బలె యీతం డంచు నాచపలుఁ డించుక యా
వలనున వాఁడే యగుచుం బలికెం దా నిట్టు లనుచుఁ బర్వేందుముఖి. ౧౪౭

సీ॥ శయనించి తట్లు నిశ్శంకమై సుఖ మెంచి యెఱుఁగవు నాకర్మ మింతవఱకు
నిదె దాశరథి రాముఁ డెల్లకోఁతులమూఁకతోడి సుగ్రీవునిఁ గూడి వచ్చి
సంద్రంబు దాఁటి నిస్తంద్రత సేతుమార్గం బొనగూర్చి సుఖమునఁ బేర్చి
వానరై శార్ణవం బొ నటు లొనరించె వరగోపురపురోపవనవనముల
నెవరు ముఖ్యతములో యీయెల్లబలములయందు వారు మడిసి రం దొకండ
యేనిఁ జావఁ దొక్కయెడ నేని నోడఁ డిం కేమిదెలుపువాఁడ నీవు వినఁగ. ౧౪౮

తే॥ మూలబలముల నడలింప మొనసి రిపుడు నేఁటి కూరకయున్న నిం కేటి బ్రదుకు
ప్రాణభయ మిట్టియెడ నెడఁబాతు వనుచు నిన్ను మేల్కొల్పితిమి నీవ నేర్తు వవల.

తే॥ శత్రునివహంబు దొడరి నాశన మొనర్చి క్షుపితకోశంబు పుర మిది సత్వరంబు
బాలవృద్ధావశేష మై పరఁగ నైనఁ బాలనం బొనరింపుము ప్రథితి గనుము. ౧౫౦

ఉ॥ అన్నకు మేలు గూర్పు మిటు లన్న! సుదుష్కర మంచు మాన కే
నెన్నఁడు నింతఁగాఁ దెలుప నేపని గల్గినఁ గూర్తు నాకు ము
న్నన్ని సురాసురు ల్దొడరఁబాఱగఁ దోలితి నీకు నీవ సం
పన్నుల దివ్యులన్ భవదుపక్రమ మెన్నెద నాఁటనుండియున్. ౧౫౧

క॥ అది యిది యన కియ్యెడ నీయదభ్రవిక్రమము నెఱప నయ్యెం దఱి త్వ
త్సదృశుఁడు లేఁడు జగంబుల నెదిరి గెలుచువార లింక నెందుం గలరే. ౧౫౨
చ॥ ప్రియహిత ముత్తమం బనుచుఁ బేర్చి ఘటింపుము దీని బాంధవ
ప్రియుఁడ వబంధువిప్రియముఁ బేర్కొని కూర్తు రణప్రియుండ వీ
వయము నయమ్ముఁ దోడ్పడ మహాపవనుండు శరద్ఘనంబు న
ట్లయమిత మియ్యరాతిబల మార్ప గడంగుము దర్ప మేర్పడన్. ౧౫౩
క॥ అనుచు నెఱిసెదరి పరిదేవన మొనరించు సురవైరి వల్లభుఁ గని యొ
య్యన నవ్వి కుంభకర్ణుఁడు దనయరసినతత్త్వ మొకటఁ దార్కొనఁ బలికెన్.
సీ॥ తొలిమంత్రమున నేమి దోసం బొదవు నంచు నేముదెల్పితి మది యిప్పుడిపుడె
నెరయనయ్యెను నీకు నిరయపాతం బట్లు దుష్కృతఫల మొంటఁ దొలఁగిచనునె
యొలయదర్పంబున నొనరించి తొంటిమై నిప్పని ననుబంధ మెంచవైతి
పదరి యొక్కటిసేసి పై రా విచారించు నాతఁ డజ్ఞుఁడు గాక యన్యుఁ డగునె
మొదల నడుపవలయునది యెవ్వఁ డవ్వల నవలఁ దీర్పవలయునదియు మొదల
నాచరించుఁ గడఁక నఖిలేశ్వరుఁడ యేనిఁ జెఱుచువాఁడు గార్యసిద్ధి నధిప. ౧౫౪
క॥ వాఁడు నయానయవిజ్ఞుఁడు గాఁ డను వగు తలము మేలి కాలము గొన కే
వాఁడు పొనరించు గర్జము ఱేఁ డైన న్వేల్పుగముల ఱేఁడే యైనన్. ౧౫౬
ఆ॥ సువిహితములు గాని చో విధు లవిధు లై యప్రయతుల కిడిన హవ్యముల వి
ధంబుదోఁపఁ జెడునుఁ దద్జ్ఞుఁడై పొనరించు నతనికృతులు ఫలము లందఁజేయు.
తే॥ మూఁటి నైదింటితో యోగమును ఘటింపనేర్చు సచివులసభ నొనఁగూర్చి సమయ
మొనర నొనరించు కర్జంబు పొనుపడంగనేర దాతండె సభ్యుఁ డై నెగడువాఁడు.
శా॥ మర్మజ్ఞు ల్హితు లైన మంత్రుల నిజాత్మప్రౌఢి నూహించి యా
ధర్మం బర్థముఁ గామము న్వరుస ద్వంద్వంబు ల్పరీక్షించి యీ
కర్మం బుత్తమ మంచు దీని కిది యౌ కాలం బటంచున్ బొరిన్
నైర్మల్యంబునఁ దెల్ప నర్థిఁ గొను నన్నాథుండె నాథుం డిలన్. ౧౫౮
ఆ॥ దానసాంత్వభేదదండంబులం దేది యుచిత మెప్పుడగునొ యూహఁ గొనక
పురుషకారములనుఁ బోకార్చు నెవ్వాఁడు వ్యర్థ మతని శ్రుతము వార్థిరవము.
క॥ సమయమున ధర్మకామార్థముల న్సదుపాయములఁ బ్రధానానుమతిన్
విమలుఁ డయి చేయునాతఁడఘములం దా నెన్నఁటికినిఁ గనఁబోఁ డెందున్.
ఆ॥ అర్థతత్త్వవేత్త లవు సచివులఁ గూడి యిది హితానుబంధ మిది యకార్య
మనుచు నిశ్చయించి యను వగు కర్జంబు నెఱపుఱేఁడు బ్రదికి నెగడు జగతి.
మ॥ పురుషు లొక్కొందఱు రాజకార్యవిధిసంపూజ్యస్థలిం జేరి శా
స్త్రరహస్యోచితబుద్ధి లేక కడఁకం దర్కింతు రవ్వార లాం

తరశల్యంబుల పో ధరావిభున కుద్యంత్సంపదం గోరువాఁ
డరసాలన్నెఱికొగ్గువారిఁ గొనఁ డా న్యాయ్యార్థ మూహించుచున్. ౧౬౩
మ॥ హితరూపం బహితానుబంధ మయి యెప్డేయర్థ మొప్పారు సం
తతముం దానిన కోరు నప్పశువులన్ దండార్హులం జేసి త
త్ప్రతిపాద్యాంశము లేర్చి వీఁడు నతఁడే ప్రావీణ్యయుక్తుండు దూ
షితుఁడుం గాఁడు శుభాయతిం బెరయు సుశ్రీఁ గాంచి పొల్పారెడున్. ౧౬౪
ఆ॥ కృత్యదూషణంబుఁ గేలిమై నొనరించువారు శాస్త్రవిదులు గారు తగని
పనులు సేయఁబనిచి పగవారిలోఁ జేరి యవల తేని నడఁతు రంత నిజము. ౧౬౫
ఆ॥ ద్రవ్యలాభ మెంచి దాపరించినవారలొరుల యర్థ మొలయు టూహఁ బెనిచి
మిత్రరూపు లా నమిత్రుల నుపసంహితుల విమిశ్రగతులఁ దెలియవలయు. ౧౬౬
తే॥ చపలుఁడై యర్థముల సాహసమునఁ జొచ్చునధిపుదుర్మంత్రికృతరంధ్ర మరయఁగాం
క్రౌంచగిరిఛిద్రమునుఁ బొంచి ఖగములట్లు సేరుదురు వైరు లాతనిసిరి హరింప. [చి
క॥ శత్రువులఁ జేర్చుకొని యెవఁ డతాళ్ళసంబున స్వరక్ష నారయఁ డవ్వాఁ
డాత్ర మెనయు నను నది యొక చిత్రమె తద్వంశమెల్ల శీర్ణముగాదే. ౧౬౮
తే॥ శాస్త్రదృష్టము గురువాక్యసరణి నరసి యాత్మబుద్ధిబలంబున ననువుపఱిచి
చేయునతఁ డెప్డుఁ జెడఁడు దుశ్చేష్ట లెంచు తనతలఁపు మెచ్చువాఁ డనర్థంబు లొందు.
తే॥ అపుడె నొడివితి ననుజుండు నట్లె తెలిపె నదియె హిత మగు కర్జ మయ్యది తలంప
విచ్చవచ్చినదారిఁ బొ మ్మింత యేల తెలివిమై నొడ్లు నీనెరు ద్దీర్చువారె. ౧౭౦
చ॥ చదివితి వేదము ల్విధులు సత్తపము ల్బొనరించి తెల్ల మే
ల్పదములఁ గొంటి భోగములు బాల్పడెఁ బెక్కులు శాస్త్రదృష్ట మా
విదితమున స్మలంగ వీఁక వేయువిధంబులఁ దెల్ప నేమగున్
దుది నిదె పొచ్చె నీయెడఁద దోసము మోసము నెన్న నేరమిన్. ౧౭౧
క॥ రాముఁడె నారాయణుఁ డా శ్రీమానిత యోగమాయ సీత యటంచున్
నేమమునఁ దెలిపినారము నీమది నది సొరదు పాపనియతికతమునన్. ౧౭౨
చ॥ ఒకవని నొక్కనాఁటి నిశ నొక్కవిశాలశిలాతలంబునం
దొకఁడనె నిశ్చలత్వమున నుండ సుదర్శనుఁ డిచ్చె దర్శనం
బకపటవృత్తి నారదుఁ డహర్పతిసన్నిభుఁ డమ్మునీంద్రునిం
బ్రకటితభక్తిఁ గొల్చి సముపస్థితుఁ జేసి సమాదరంబునన్. ౧౭౩
ఆ॥ ఎచటనుండి యెచటికేగుచుంటి యమీంద్ర కుశల మెల్లగతి నకుంఠితంబె
కద యుదంత మొండు గలదేని వివరింప వలనుపడున యేని వలయుఁ దెలుప.
క॥ అని వేఁడిన నాథునుఁ డిట్లనె నేఁ డే నింతదనుక నమరులు మంత్రం
బొనరింపఁగ వినుచుంటి న్వినిచెదఁ దద్వృత్తమెల్ల విఖ్యాతముగన్. ౧౭౪

శా॥ మీచేఁ బీడితులై సురల్ తరలి బ్రాహ్మీవల్లభుం జేరి యా
లోచింప న్విధి వారిఁ దోడ్కొని విభున్ లోకేశ్వరు న్విష్ణునిన్
యాచింపం జని ధ్యానసంగతునిఁ జేయ న్వచ్చి యానేత మీ
రేచాయం దలఁపొప్పఁ గూడితి రఘం బే మంచు వాక్రుచ్చినన్. ౧౭౬
ఆ॥ ఇట్టు లనిరి సుర లహీనతల్పశయాన ! నీయెఱుంగరాని నెఱి యొకండు
గలదె ముజ్జగములు గన్నవాఁడవకాదె యైనఁ దెలుపువారమయ్య వినుము.
శా॥ ముల్లోకంబులు వేఁపుచుండె నొకటన్ ముత్తాతచేఁ గొన్న యా
చిల్లాభావ్యవరంబులం బ్రబలుఁడై చిట్టాడుచుం దమ్ముఁడా
చిల్లాడంబులపోట్లఁ దోడుపడఁగా సిద్ధార్థుఁడౌ రావణుం
డల్లో యంచుఁ జరించువారము గుహాభ్యంతఃప్రదేశంబులన్. ౧౭౮
క॥ ఆవరము లొసఁగునప్పుడె దేవుం డీబ్రహ్మ కొంత తేఁకువ నొడివెన్
గావరమున నెన్నఁడు నరుచే వీఁడు నశించు నింత సిద్ధ మటంచున్. ౧౭౯
క॥ కావున వాని వధింపుము దేవ ! జగత్కంటకంబుఁ దీర్పఁగవలదే
నావుడు వల్లె యనెను హరి శ్రీవల్లభుఁ డాననమునఁ జిఱునవ్వొలయన్. ౧౮౦
ఆ॥ ఆమహానుభావుఁ డాసత్యసంకల్పుఁ డాయధీశ్వరుండు నైన విష్ణుఁ
డిపుడు రఘుకులమున నిద్ధతేజుఁడు రాముఁడై జనించె సందియంబు వలదు.
క॥ ఆతఁడు మి మ్మెల్లర సంఘాతమ్మృతులఁ జేయఁగడఁగి కాన్పించెడు ని
ట్లీతఱి వింటి ననుచు ముని నాతోఁ దెలిపిచనె నసురనాయక వింటే. ౧౮౨
శా॥ నాయన్నా ! యటుగాన రాముఁడు పరానందాత్ముఁడౌ విష్ణుఁడే
మాయామానుషవిగ్రహుం డగుచు ని న్మాయింపఁగాఁ దోఁచె ని
ర్మాయత్వంబున నాసనాతనుని సంభావించి సేవింపు మీ
తోయం బీయుడు కాఱు నిన్నుఁ గొను సంతోషంబు సేకూరఁగన్. ౧౮౩
క॥ ఆఱడిపోక పొసఁగునే మాఱటమఘువుఁడవు నీకు మఱిఁ దరియింపం
గా ఱాఁగతన మిదేలా గాఱాకులు గారె రాముఁ గ్రమ్మెడువారల్. ౧౮౪
క॥ బలి గెడపఁగా జనించియు బలియుఁడు హరి యతనిఁ బ్రోవఁ బాల్పడఁడె తుదిన్
లలి భక్తభావ మొలయఁగ గొలిచెడువారి మనుచును రఘుప్రభుఁ డధిపా. ౧౮౫
ఆ॥ భక్తి జ్ఞాన మిచ్చు భక్తి ముక్తి నొసంగు భక్తి లేక సేయు పను లవెల్లఁ
జెడుఁ దలంపు మింత సిద్ధంబు నాపల్కు గొనుము సకల మరయుకోవిదుఁడవు.
తే॥ విష్ణులీలావతారము ల్వేలయు నెన్నియేనియును రఘురాముతీ రెనయ వవియు
హరి శివుఁడు రాముఁ డజ్ఞానహరుఁడు జ్ఞానమయుఁడు శుద్ధసత్త్వాత్ముఁ డేమఱకుమతని.
క॥ హరి యాహ్వయములు వే యొకదరి నటు రాముపద మొక్కదరిగాఁ దులపై
సరిపోల్పఁ జూచినను వావిరి ములుసూపుం దదాఖ్య వెలసిన దెసకున్. ౧౮౮

తే॥ నిపుణులై రాము భజియింత్రు నేర్చి మనము వాక్కు తన్మయములుగ నవార్యమతు
వా రనాయాసముననె సంసారవార్ధి గడచి పరమాఖ్యపద మందఁ గనెడువారు.[లు
క॥ రాముచరితములు చదువుచు రాముని ధ్యానించుచుఁ ధరాజనియుతు శ్రీ
రామునిఁ బూజించుచు నవిరామసుఖముఁ గాంత్రు రామరము లమరారీ. ౧౯౦
ఆ॥ భవమహాహిభోగబంధంబు లెడలంగ రాము ధరణిజాభిరాముఁ జేరి
కొలిచి బ్రదుకు మవలఁ గోవిదు ల్గోరు ననంతపదముఁ గాంతు వసురనాథ!.
క॥ అను కుంభకర్ణ భాషిత మనవద్యము తనదు చెవుల కధిశూలరుజం
బొనరింప బొమలు ముడివడ ఘనకోపస్ఫురితదృష్టిఁ గని యి ట్లనియెన్. ౧౯౨
మ॥ అనుశాసించెద వార్యుఁ డైన గురు వట్లాచార్యకం బూని యే
మనువాఁడ న్నిను వాక్ప్రపంచ మొనరఁ జేయంబోల దిప్పట్టునం
దనుకూలం బగు కర్జముం గొలుపఁగా నా దంచు మేల్కొల్పితిన్
జను మ ట్లోపవ యేని సెజ్జపయి దీర్ఘవ్యాప్తి నిద్రింపఁగన్. ౧౯౩
ఆ॥ మొనయు విభ్రమంబొ మోహంబొ బలవీర్య దర్పమో యొకొండొ దారి సూప
ననభిపన్న మైన యకార్జముం గూర్చి వితథకథలు పన్ను విధము వెరవె. ౧౯౪
క॥ ఎక్కాలంబున నెది యగుఁ జక్కపఱుతు రదియ పూని శౌర్యఘనులు వే
రొక్కటిఁ గొనరు గతార్థము చక్కం బొక్కిపడఁబోరు సంయమ మెడలన్.
ఉ॥ నీవు పరాక్రమంబునెటి నిక్కమ కల్గినవాఁడవేని నా
పై విహితంబునం బరఁగు భావమునం జరియింతువేని బల్
చేవగలట్టివారి కిది చెల్లఁగనయ్యెడు కర్జ మేని నా
కావల ముంచి నీకడిమిఁ గైకొని దీనిఁ బొనర్పు మేర్పడన్. ౧౯౬
తే॥ పనిసెడఁగ దీనుఁడగువానిఁ బట్టి విడఁగ నెంచకుండెడు నతఁడె సుహృత్తు జగతి
నెఱసి తనవాఁ డొకట నవినీతుఁ డైనఁ బాయ కటు సాయపడువాఁడె బాంధవుండు.
మ॥ అని పల్కందొరఁకొన్న యాదొర ప్రసక్తార్థంబు రోసంబుఁ దెం
పును లక్షించి యితం డొకొండుగతికిం బోఁబోడు క్షుబ్ధేంద్రియుం
డని తర్కించి ఘటప్రశవుం డనునయవ్యాపార మేపారని
ట్లనెఁ దత్కాలనయోచితంబుగ మహావ్యాహారలక్ష్మ్యుదయా. ౧౯౮.
సీ॥ చాలు రాక్షసరాజ! సంతాప ముడుగుము స్వస్థుండ వగుము రోసంబుఁ దొఱఁగి
దీనికై యింతలు దివు లొంది తద్దాని నేఁ జక్కపఱిచెద నేఁడ తొడరి
మది నుంచఁబోకు మిమ్మాటలు దీరెంచి బంధుభావంబునఁ బలికినాఁడ
నన్నవు నీదు మే లరయుకే రిత్తకుఁ జనువాఁడనే మేను శాశ్వతంబె
యదనునను నాపౌనర్చెడు కదన మీవు గాంచి సంతస మంద నా కథ ఘటిల్లె
రాముఁ బఱచెదఁ దమ్ముఁడు రాణువ హితవారమునుఁ దోడుపడ నింతవట్టు నిజము.

తే॥ రాముతల దెగి యే నిల్వ రాముఁ దెరల సుఖివి గా వెట్లు నీ వది చూచి నేఁడు
సీతకును దుఃఖమొదవు నాశిరముఁగాంచ నవలఁ దేటిభవదుదంత మరయఁగలదు.
తే॥ రామునిధనంబు సుమహాత్ప్రియామృతంబు నరయఁగాంతురు గాత లంకాధివాసు
లడలుచుందురొ యెవ్వారు హతనిజాప్తబాంధవులు నయి వారేనుఁ బాలుపడఁగ.
తే॥ బంధువధకారణంబు చొప్పడఁగ నిచట నడలువారలకెల్ల మదాజి నస్ర
మార్జనం బొనరించు నమ్మాట పుట్ట శత్రునాశన మగును నిస్సంశయముగ.
క॥ ఈయెడఁ గాంతు ససూర్యము తోయద మట్టులు వికీర్ణ ధూర్తాగ్రణి యా
నాయర్కతనుజుఁ బర్వతకాయు న్నాసంగరంబు ప్రస్తావమునన్. ౨౦౩
ఆ॥ దాశరథి వధింపఁ దలకొను నిట్టి రక్కసులచేత నెదిరిఁ గసిమసంగఁ
బరఁగు నితనిచేతఁ బరిరక్షితుండ వీవనఘ! యెట్లు మడియు దరులవలన. ౨౦౪
ఆ॥ నన్నడంచికాని నాయన్న నినుఁ జంపలేఁడు రాఘవుఁడు సలేపుఁ డడరి
పరపరాభవంబుఁ బాటింప నొక్కింతయేని నెడఁదలోన నింతవట్టు. ౨౦౫
క॥ ఒండొక్కనిఁ బనుపకు మే నుండఁగ నా కాజ్ఞసేయు మురువిక్రమమా
ర్తాండ పరంతప!యాజిఁ బ్రచండుల సమయింప నాక సమయంబొదవెన్. ౨౦౬
ఆ॥ ఇంద్రుఁడేని యముఁడయేని పావకపవమానులేని వరుణమనుజధర్ము
లేని నన్నుఁ దొడరి యెదయువారల కాని నిలువనేర రింత నిక్కవంబు. ౨౦౭
క॥ గిరియంత లేను శూలముఁ గరమున ధరియించి తొడరఁగాఁ గలనఁ బురం
దరుఁడు వడఁకు శితదంష్ట్రిని పరవ శ్చైదవగులఁజేయఁ బ ట్టెటుఁ లేమిన్. ౨౦౮
ఆ॥ శస్త్రములను వదలి శత్రుకీటకముల నులుము నన్నుఁ బోరికలనిలోన
బ్రమకుఁ గోరువాఁడు గొదకొని నిలఁబడఁ డెదిరి నిక్క మనుచు నెదఁ దలఁపుము.
ఆ॥ నెగడు శక్తి గదయు నిశితాస్త్రములు ససియును ధరింప కేను యుద్ధమునకుఁ
దొడరి చేత శత్రుఁ బొడవడంపఁగ నైనఁ జాలువాఁడ నమ్ము మేలువాఁడ! ౨౧౦
క॥ నాముష్టివేగ మిత్తటి రాముఁడు తా నోర్చి యునిఁ బరంగున యేనిన్
బ్రాముకొని త్రావు నవ్వల నామెయి రుధిరంబు మేలి యస్త్రౌఘంబుల్.
తే॥ చింతచే బాధ నొందెదు చిక్కి యిట్టులేల యేలెడువాఁడ! యే నెలయుచుండ
నేఁడె శత్రువినాశంబు నీకుఁ గూర్ప గూర్చుచున్నాఁడఁ బయనంబు గొనరవలదు.
సీ॥ లంకఁ గాల్చినవాని లావరి రక్షోఘ్ను హనుమంతుఁ దోడివా రైన కపుల
రాము సలక్ష్మణు రవితనూజుని నేఁడ పొలియింతు నాదగు పూన్కి నెగడ
నను మాట కలిమి నీ వధిపునివలని దా భయము దొఱంగుము పట్టుగనుము
సవిశేష మగు యశస్సంపాదనంబు నీ కై యొనరింతు నెయ్యమున మనుము
నలువవలననేని నాకేశువలనన యేని నడ రొకింత యెనయఁబోకు
మేను గలిగియుండ నింతలుపడనేల యవల నేది యెట్టు లగునొ కాని. ౨౧౩

వ. ఏను నిక్కంబుగా రోసం బూనితినేని దేవత లందఱును మహీతలతల్పంబున శయనించువారు. శమనుని శమయింప సర్వభక్షకు భక్షింప నాదిత్యు నధఃపాతితుం జేయఁ జుక్కలు ముక్కలు గావింప శతక్రతుఁ గ్రతుపశువు నొనరింప వరుణాలయంబు జలంబులు నట్టిపోవం గ్రోలఁ బర్వతంబులఁ జూర్ణింప ధారుణి విదారింప నొక్కం డన చాలుదు. దీర్ఘకాలప్రసుప్తుం డైన కుంభకర్ణు పరాక్రమంబు సర్వశోభక్ష్యమాణంబు లగు భూతంబు లెల్ల నేఁడు చక్కఁగనుంగొని యెఱునవి. వింటివా యొక్కవార్త వింటివాలమ్ములం గ్రొచ్చి పడఁద్రోవకమున్న మున్నఱికమెయి నే భక్షింపం దొడరితినేని ముజ్జగంబు లొక్కఁడై పయింబడియు నాయుదరంబుఁ బూరింపం బర్యాప్తంబులు గా వింక నాదు విన్నపం బవధరించి యానతిసేయుము. ౨౧౭

తే. దాశరథివధ పరమముదంబు నీకుఁ గూర్ప నేఁ బోదు నిదె యానుకూల్య మరసి
వారి నెదిరింతు హరివీరవరుల నెల్ల మ్రింగి త్రేపుదుఁ గడఁకమై మేను వెంచి.

తే. కడఁగి రాముని నాయమక్షయముగూరఁ బనుతు సీత వశంపడు భద్ర మొనర
సంతరించి సుఖింపుము జ్వరము వీడి పాన మానంగ సత్క్రియ ల్పడయఁగనుము.

—♦ మహోదరుఁడు నీతి సెప్పుట ♦—

ఆ. అనుడు బలి సుబాహుఁ డతికాయుఁడును నగు కుంభకర్ణు మేలి గుంభనంబు
తోడి నుడుల విని సుధూర్తుఁ డైన మహోదరుండు వలికె నిట్లు క్రూరదమని.

క. ఓ కుంభకర్ణుఁడా! నీ వీకులమునఁ బొడమియును మహేచ్ఛత తలఁగన్
బ్రాకృతదర్శిన వైతివి నీకవలేపంబుకతన నెఱి లే దెందున్. ౨౧౮

చ. అరయని వాఁడు గాఁ డల నయానయముల్ విభుఁ డేటిమాట యు
ద్ధుర మగు బాల్యదోషమున దూషణ మొంచెదు కేవలంబు ధా
ష్ట్యరతియ కాని కానఁబడ దర్థ మనర్థ మెఱుంగు నేర్పు కా
వర మొనయించు నే తెలివి వైరి గూర్చెడి కృత్యసంపదన్. ౨౧౯

ఉ. స్థానము వృద్ధి హానియుఁ బ్రసక్తత నెక్కొను దేశకాలముల్
దా నివి యన్నియున్ స్వపరతత్పరము ల్గను రాక్షసర్షభుం
డా నెఱిబుద్ధి లేక బల మా నను మూర్ఖ వినీతుఁ డైన య
వ్వానికి హేయ మైన పని వారక పూని బుధుం డొనర్చునే. ౨౨౦

తే. ధర్మమర్థము కామంబుఁ దత్పురులకు భిన్నఫలములఁ గూర్పంగఁ బెరయు ననుచు
నీవు నొడివితి వమ్మాయి నియతి గలదె యనుభవవిరుద్ధ మాఁగాదె యది జగమున.

ఆ. పాపకర్మములకు ఫల మగు శ్రేయంబు పుణ్యకర్మములనుఁ బొడము దుఃఖ
మీవిపర్యయమున నెంచ నోఁ గర్మంబులెల్ల నెదియొ ఫలము నిడు నటంచు.

క॥ ధర్మార్థంబులువోలె నధర్మానర్థములు నుభయథాఫలముల నే
మర్మము లే కిడుచుండఁగ ధర్మముఁ దలపోయువాఁడు ధరణిం గలఁడే. ౨౨౩

ఆ॥ ఐహలౌకికంబు నట్లు పారత్రంబు నాచరింత్రు ఫలము లందుచుందు
రొంటఁ గామపరత నున్నవారలు శుభఫలము లెనయుటయునుఁ బరఁగుచుండు.

ఉ॥ కావున నింతఁ దా నెడఁదఁ గాంచి సుఖింపఁదలంచి దీని కొం
డొ విధి లేమి నెంచి యవు నం చొనరించెను జేఁడు కర్జ మే
మా వెరవే మతం బనఁగ నైతిమి నేఁ డిటు సాహసించి దు
ర్భావులఁ దోలనెంచుటయుఁ బథ్యమ కాక తలంగ నెట్లగుః. ౨౨౪

ఆ॥ ఒంటిఁ గవిసి నారి యుడుకార్తునంటి వయ్యాదియుఁ జెల్లు నెట్టు లనుపపత్తి
దెలుపువాఁడ వినుము తేటతెల్లంబుగ సౌనసాధు వనుచు నంద అనఁగ. ౨౨౫

క॥ మున్ను జనస్థానంబున నున్నమహాబలుల బహురణోల్లాసుల సం
పన్నుల ఖరప్రభృతికుల నన్నేత వధించె నొకఁడ నై గడెలోనః. ౨౨౬

మ॥ హతశేషు త్రిదశారు లందు నిలలే కావన్ను లై యిందుఁ జే
రి తదేకాకృతి లక్ష్య మైన మతి నిర్వ్యర్థార్థు లై యున్నవా
రతిభీతిం బరికింతు రెల్లదెసలః హర్షంబు తీ రెన్నఁబో
రితరు ల్గా రెవుడేని వారిఁ గనలేదేమొ యెదం దార్పవో. ౨౨౭

సీ॥ గొదకొని కుపితమై కుప్పించి దుమికెడు సింగ మయ్యది దానిఁ జెనకె దెట్లు
కదిసి నిద్రించెడు కాలసర్పము మేలుకొనఁజేసి యేమేలు కోరువాఁడ
వెల్లశత్రువనంబు లేర్చు నద్దావాగ్ని నాఁకట్టి శలభంబ వౌదు సుమ్ము
పఱతెంచుచున్నది ప్రబల మా వక్త్రింబుఁ దెఱచి మిత్తియ యది తెరలు మింక
నీదు సంశయస్థనిర్ణయం బొక్కటఁ జెడునకాని పొడవుపడ దొకండ
నేన నేర్తు నంటి వెదిరింప మదమున మార్పకాక యదియు మాట యగునె.

క॥ ఎదురుపడి బ్రదుకుటయె లేదదనున నచ్చోటి కరిగి నట్టిఘనులలోఁ
దుది నొక్కఁడేనియును నీవది గా దిది యా ననంగ నర్థం బెదియో. ౨౩౦

తే॥ అతిసమృద్ధార్థుఁ బగతు హీనార్థుఁ డయ్యు జీవితత్యాగ మొంట నిశ్చితము సేసి
ప్రాకృతపుమానిసింబలె వశ మొనర్చుకొనఁ దలంచు నె యెంతటి కూళ వైన.

శా॥ ఇల్లోకంబున నొక్కఁడేనియును లేఁ డీమేటికిః సాటి యా
ముల్లోకంబులుఁ దాఁక నెవ్వఁ డలుక నోర్చేతఁ ద్రోవం గలాఁ
డల్లావణ్యనిధాను నారవిశశీంద్రాగ్నిప్రతీకాశు నా
యుల్లోకప్రతిభుం దలంతె యెదు రై యూఁపం బలాశోత్తమా. ౨౩౨

ఆ॥ అనుచు నమ్మహోదరాఖ్యుండు సంరబ్ధుఁ డగుచుఁ గుంభకర్ణు నంటనాడి
రావణుం ద్రిలోకరావణుఁ దిలకించి యెల్లసభ వినంగ నిట్టు లనియె. ౨౩౩

ఉ॥ సీతనుఁ జేర్చి తద్దెసఁ బ్రసిద్ధుఁడ వైతి ధృతిం జరింప కి
ష్వాతురత న్వహింప వెర వయ్యెదియే తలఁ పున్న నాయమర్
ప్రాఁతికిఁ దెచ్చుకొంట కొకపద్ధతి నేఁ గనుఁగొంటి దాని సం
ప్రీతుఁడ వై గ్రహింపు మెడఁ బెట్టుము తక్కినవారి వాదముల్. ౨౩౪

వ॥ ఏనును ద్విజిహ్వుండును సంహ్రాదియుఁ గుంభకర్ణుండును వితర్దనుండును నీవైదు
గురము రాముని వధించుపొంటె సన్నద్ధుల మై యరుగువార మిట్లని యియ్యు
దంతంబుఁ బురంబు నల్లడలఁ జాటంబనుపుము. నేమంబున నే మారిపునిఁ
జేరంజని జతనంబు మెయి నాతనితో నాయోధనం బొనరించెద మయ్యధిపుఁడు
దోడివారితోడఁ గూడ మాచే రణరంగంబునం బడినచో నేయుపాయంబుల
వలనిపనియు నలవరింపం బనిలేదు సరిగదా! యొండువిధంబున నేటుకొని యా
దుర్వ్రాదుండు జీవించి యుండునేని మానితం బగు సంగరంబు మాని యెదం
గరం బూనిన యాసంగరంబునం బూనికమై వర్తించువార మయ్యాది యవధ
రింపుము. ౨౩౫

సీ॥ అచ్చోటు విడచి యే మరుదేరఁగాంతుము రుధిరోక్షితుల మస్త్రరూఢతనుల
మగుచు భక్షించితి మారాఘువుని లక్ష్మణాదుల ననుచు బిట్టార్పు లిడుచు
నీపాదములమీఁద నేర్చి వ్రాలెద మెద నాతత్త్వ మునిచి మమ్మాదరింపు
మవల మాకోరిక లరసి పూరింపుము గజమెక్కి పురమెల్ల గలయఁజాటఁ
బనుపు మగువారి నవ్వైరి పాటు దోడివారి మారిమసంగుట వలను మీఱఁ
బెరయ గామార్థసంపద లెప్పరుపేర బ్రాఁతిమెయిఁ బిల్వఁగాఁ బంచి పంచి యిడుము.

ఉ॥ భృత్యులఁ బ్రీతిదానములఁ బ్రీతులఁ జేయఁగడంగి నేఁడు వహా
యత్యయ మెల్ల దీరె నని యాడుచుఁ బాడుచు వీరపాణముల్
ప్రత్యయ మొప్పఁగానెఱపి బాట దలంగక వస్త్రమాల్య సం
ప్రిత్యుచితానులేపముల రాణమెయిందనరారుఁ డెల్లరుక్. ౨౩౭

శా॥ కౌలీనంబటు సర్వతోగతము గాఁగా భక్షితుం డయ్యె భూ
పాలుం డన్నదె మాటగా మహిజ నాశ్వాసింపు మీ వేగి యా
జాలం బింతయుఁ దోఁపనీక యెటులో జాడ ల్ఘటింపంగ నా
శాలీన ల్దరిఁ జేరకుండ నిడ నా శాస్త్రిప్రశస్తు ల్లగన్. ౨౩౮

క॥ కామము కామార్థంబుల నేమము మెయిఁ గూర్చి సద్వినిర్ణయ మరయం
బూ మెలు పచరింపుము తత్కామార్తిభయంబు లడఁగఁ గైకోల్పడఁగన్. ౨౩౯

తే॥ నష్టనాథ యకామయు ననుచు నొంటిఁ దగిన యట్లు ప్రబోధింపఁ దవిలెనేని
రక్తిగలభర్త పైని విరక్తిసూపుఁ గష్టనష్టము లొందవుట కారణముగ. ౨౪౦

క॥ అఘకృతనైరాశ్యము స్త్రీలఘుత్వమును హేతువులుగ లలనలు పోరి గాం
త్రు ఘనుంబెరయఁగ మొదలి ప్రతిఘ ముడుపంజాలు మేలి తెఱఁగు ఘటింపన్.

క॥ సుఖసంవృద్ధ సుఖార్హా యసుఖకర్శిత సీత నేఁటి చొఱవ నకామో
న్ముఖి యయ్యు నీదుకోలువున నఖండసుఖలాభ మొడఁద కందీకున్నే. ౨౮౨

మ॥ ఇది నిర్ణీత మొనర్చినాఁడఁ గదనం బేవేళ నేనిన్ సుఖ
ప్రద మంచుం దలపోయఁబోకు మఱి తత్ప్రాయుండు రాముండు నీ
కెదిరింపంగ నసర్థ మయ్యెడు ముదం బిప్పాటఁ జేకూరెడున్
పదరంగా నగునే ఫలంబు సులభోపాయాప్తి సిద్ధించుచోన్. ౨౮౩

ఆ॥ పగఱసేనవంకఁ బాఱక యుసుఱుపై నందియం బెడంద నందనీక
యొంట గెలుచు నాతఁ డూర్జితుం డవ్వాఁడె శ్రేయ మసము సుఖము సిరియుఁ గాంచు.

క॥ అనుచు మహోదరుఁ డాడిన ఘనుఁ డతని నదల్చి కుంభకర్ణుఁడు కడఁకన్
దనయన్నతోడ నిట్లను ననితరవాక్ప్రౌఢి నిజమహత్త్వముఁ దెలుపన్. ౨౮౪

శా॥ గర్వం బొప్పఁగ నేర్చికూర్చిన కృతిం గాదంచు లోఁ డాఁగినన్
నిర్వైరంబు ఘటిల్లునే సుఖము నిర్ణిద్రం బనం జెల్లునే
ఖర్వం బౌనె భయంబు ఘోర మది యెక్కాలంబు రాపాడెడిన్
దోర్వీర్యంబునఁ గాక గెల్వఁదరమే దుర్వారు రామాధిపున్. ౨౮౫

క॥ ఆతఁడు దురాత్ముఁడై నిన్నీతఱి భంజింపవచ్చె నెదిరించియ కా
కేతలఁపులు గొన నేమగు నేతలముం బట్టి కెడసి యిటునటుఁ జెడెదే. ౨౮౬

తే॥ వైరి నిర్జించి సుఖపడువలను మేలు సుమ్మ దియు నిప్డు నాపాలిసొమ్మనంగ
నయ్యె నద్దాన నీదగు నానఁగొంట నెట్టులేని రిపుక్షతి నెలయువాఁడ. ౨౮౭

క॥ గర్జిల్లరు వ్యర్థముగా నిర్జలతోయదము లట్లు నెఱిగల శూరుల్
తర్జించి పగఱఁ బైకొని యూర్జించెదు కీర్తివంక నొవ్వారెంచున్. ౨౮౮

ఆ॥ మెచ్చుకొనరు తమ్ము మెయిమెయిఁ బోనీయ రెదిరి పరిభవింప నెంచెనేనిఁ
జెప్పి చెప్ప రయవిశేషపుష్కర మగు కృత్య మాచరింత్రు కీర్తిపరులు. ౨౯౦

ఉ॥ ఓరి! మహోదరా! పలికెదో ననుబోంట్లు వినంగ మేల్సభన్
సారము లేని పల్కుల నశక్తు లబుద్ధు లసాధు లస్థిరుల్
భీరువు లంచుఁ బేర్కొనఁగఁ బెంపఱఁ బండితమాను లైన మి
మ్మారసికొన్నదోసమున కాయెను మోసము ప్రేని కిన్నెఱిన్. ౨౯౧

ఆ॥ కాపురుషులు మీరు కర్జంబు నడుపంగ నై యధీశు తలఁపు ననుసరించి
ప్రియముగా వచించి పేరొందఁగా నెంచి యిట్టికర్మ మొడిని గట్టినారు. ౨౯౨

క॥ మీయాలోచనకతనన్ దాయలు పఱపంగ నొంటఁ డాగుటయో లే
దా యసువులు వీడుటయో యాయెన్గద యధిపునకు దురాత్మకులారా! ౨౯౩

ఆ॥ లంక రాజశేష లాగున నయ్యెఁ గోశంబు క్షీణ మటు బలంబు శ్లథము
నాఁగ నయ్యె నిట్లు ననుచు సుహృత్పదామిత్రచయము విభుని మేలుకొలుప.

మ॥ ఇదె నేఁ బోవఁగడంగినాఁడ ననికిన్ హీనార్థు లౌ మీర లు
న్మదులై గూర్చిన దుర్నయంబు ధృతిమై మార్పొందఁగాఁ జేయ నో
డ్లది గా దియ్యది నాఁగ నేమగుఁ గృతం బాయోధనం బెంచి ప
ల్కఁ దలం పుండినఁ బల్కువారలు తుదిన్ గన్పట్టు మేల్కొడులన్. ౨౫౫

ఆ॥ అనుచుబుద్ధి మెఱయ నాకుంభకర్ణుండుపలుక నతని పలుకుబడి తెఱంగు
గలయ నరసి నవ్వుగదుర మేకొని రాక్షసాధినాథుఁ డిట్టులనియె నపుడు. ౨౫౬

ఉ॥ యుద్ధమునేఁతఁ గోరఁడు మహోదరుఁ డిమ్మెయి రామభీతుఁ డై
యుద్ధతుఁ డెట్టు లయ్యెడు మహోద్యమశాలివి నీక చెల్లు నో
యుద్ధవిశారదుండ! ప్రతియోగుల దుండగము ల్మరల్ప సం
బద్ధసుఖాత్ముఁ గాఁగ నను బాటిలఁ జేయఁ గడంగు మిత్త్రతన్. ౨౫౭

ఆ॥ సౌహృదమున బలమునంపదఁ బౌరుషంబున నొకొండు నిన్నుఁ బోలువాఁడు
గలఁడె నాకుఁ దండ్రి! కదలుము శత్రుసంహారమునకు జయవిహారమునకు. ౨౫౮

ఉ॥ ఆధి దొలంప నీక చను నంచుఁ గలంక దొలంక నిన్ను సం
బోధితుఁ జేసినాఁడఁ గలప్రొద్దు కొలంబు చలంబు పాడియు న్
గాధము గాకయుండ సరిగాఁ బచరింపు చరింపు మాజి నో
యోధవరేణ్య! నీదగు మహోద్ధతి పద్ధతి మేర మీఱఁగన్. ౨౫౯

తే॥ కాలపాశంబుఁ గొనివచ్చు కాలుఁ డీతఁడంచుఁ బగతురు భీతిల్ల నరిదిశూల
మెనసి త్రిప్పుచుఁ జని యని నిసకులీను లనుఁ బొదువుమట్లు గపివీరులను మొసవుము.

క॥ నీరూపముఁ గని వానరులారూఢి తలంగఁ దెరల నొదురు నరులుం
దీ రెడల గుండె లవియఁగఁ బో రదనునఁ బాసి యొంట బో రనఁజనునే. ౨౬౧

ఆ॥ అనుచుఁ బలికి యమ్మహాబలు ఘటకర్ణు ననుమతింపఁజేసి యసురవిభుఁడు
మరలఁ బుట్టుఁగాంచి మనినాఁడ నం చెద నెంచి యూరడిల్లె నేణనయన. ౨౬౨

చ॥ ఎఱిఁగినవాఁడు వాని బల మిత్థపరాక్రముఁ డింకఁ జొచ్చి యే
డ్తెఱ నెఱపంగలాఁడు తనదిక్కునఁ ద్రుప్పుడురాలనీయఁ డ
క్కఱ సమకూరు నం చెద నఘం బఱ రక్కసి చంకురుండు గా
దొఱసెను నిర్మలత్వము విధుంతుదు బాటి దలంగు టేర్పడన్. ౨౬3

—♦ కుంభకర్ణుని యానసంరంభము ♦—

మ॥ ఘటకర్ణుం డట హృష్టుఁ డై కొనియె నిర్ఘాతోగ్ర మత్యాయస
స్ఫుటసారం బరిసూదనంబు జ్వలనస్తోమోగ్రమోఘాభస్య ము

ద్భటభూషాఢ్యము రక్తమాల్య మశనిప్రత్యుద్యతం బామరో
త్కటదర్పాపహ మిద్ధతేజము జిఘత్సాశీలముం శూలముం. ౨౬౪

క॥ పరమాంసవసాదిగ్ధము పరమాయుధ మసుర దాల్చి పరఁగెను లోకో
పరమాత్తరూపభైరవపరమానభిదావిధానుభావాంచితుఁడై. ౨౬౫

తే॥ నిశిత మగు శూలము ధరించి నిట్టనిలిచి రావణుం గాంచి లోకవిద్రావణుండు
కుంభకర్ణుం డుదీర్ణవాగ్గుంభ మొప్పఁ బలికెఁ దేజస్ఫురణ లెడఁ బ్రాఁకుచుండ.

క॥ నే నేకాకిని చనిమొద సేన యిచట నిలుచుఁ గాత సెలఁగెద నరులం
బూనికమెయి భక్షించెద వానరులనుఁ బ్రబలకోపవల్గన మొప్పం. ౨౬౭

చ॥ అని పరవల్గుసేయ ముదితాత్మకుఁ డిట్లనె రావణుం డనీ
కినిఁ గొని యేగుమయ్య పృథుకీర్తి వహింపఁగదయ్య వానరుల్
సునిశితబుద్ధు లూర్జితులు సువ్యవసాయు లుదీర్ణకాయు లా
ఘనరయులం దెరల్చుపనిఁ గా దొకటం జన నెంతవారికిం. ౨౬౮

తే॥ ఏకకుఁ బ్రమత్తు నఖదశనేరితముల నే క్షయం బెనయింతు రహీనసత్త్వ
లట్లుగావున నవ్వారి నడఁపఁ బ్రబల సాధనానీకపులతోడఁ జనఁదలఁపుము.

క॥ పెక్కురు రక్కసులను జముచక్కి కనిచినారు రిపుల చలమేదఁగ నీ
యు క్కెఱఁగింపుము వారల మక్కలు మక్కెలుఁ దెరల్చి మారిమసఁగుచోం.

క॥ అని పెనుగద్దియ విడి దిగ్గన దుమికి సుతేజుఁ డతఁడు ఘటకర్ణునకుం
దనువునఁ బ్రసాధనోచిత మనుబంధ మొనర్పఁదొడరె నధివీరనుతా. ౨౭౧

సీ॥ మణికృతాంతర హేమమాల్యం బఱుతఁ గూర్చెఁ గ్రొంజిగు ల్చిఱుతనగోడులాడఁ
దారహారము దానిదారిన నెలకొల్పె దారితారి యశఃప్రచార మొదవ
నంగదుఁ డీతఁ డయ్యంగదుపై నాడు నని చేర్చె మహితరత్నాంగదముల
నంగుళీవేష్టంబు లంగుళీకృతవైరి కౌఁగాత మని తార్చె నంగుళములఁ
గలితచందన మలఁది సుగంధిదివ్యదామములు వెట్టె సంగరోద్దాముఁ డనుచుఁ
గుండలములు శీమత్ప్రభామండలములు లావుఁ బేర్కొనఁ జెవుల నలంకరించె.

తే॥ కాంచనాంగదకేయూరకటకమకుటవర్ణితాభరణాఢ్యుఁ డా వలను మీఱ
ఘనబృహత్కర్ణుఁ డాకుంభకర్ణుఁ డపుడు వఱలె సుహుతాగ్నికల్పుఁడై వామనయన.

క॥ గట్టి మొలత్రాఁడు పెట్టిన దిట్ట యసుర మెఱసె నంబుధిం ద్రచ్చునెడం
జుట్టిన యహీంద్రుచేఁ దరిమెట్టు దఱిసినట్టి సిరిని మేకొను నెఱితోం. ౨౭౪

ఉ॥ కాంచనమూర్తి భారసహకారి నివాతము విద్యుదుద్యతం
బంచితదీప్తిదీప్తము మహాకవచంబు ధరించి మించు రా
త్రించరముఖ్యుఁ డొప్పెను బరిస్ఫుటసాంధ్యపయోధరప్రభా
సంచితరాగ మస్తగిరి చాడ్పున భూధరరాజకన్యకా. ౨౭౫

తే॥ సురుచిరాభరణప్రభాచ్ఛురితదేహుఁ డాప్తశూలాయుధుం డయి యసుర వాల్చె
మునుఁ ద్రివిక్రమణస్ఫురన్మూర్తి యగుచు ననుచు నారాయణుం బోలి వనజవదన!
ఉ॥ అన్ననుఁ జుట్టివచ్చి విహితాంజలి యై పరిరంభణౌచితిన్
మన్ననఁగాంచి యానఁగొని మాఱటరుద్రుఁ డితం డటంచు నా
సన్నులు సన్నుతు ల్మెఱపఁ జాటునకు న్సుర లోట మెంచుచున్
దిన్నగఁ జేరఁబోఱ దురతిక్రముఁ డై తరలెన్ శుభక్రమా. ౨౭౭
క॥ భీమబలు భీమనాదున్ భీమాక్షు న్భీమకాయు భీమక్రముఁ బూ
ర్వామరవిభుఁ డాశీర్వచనామోదితుఁ జేసె ననుజు నయ్యెడఁ దన్వీ. ౨౭౮
ఉ॥ అబ్బురమయ్యె నత్తఱి వరాయుధు లా బలుయోధవీరు లా
గుబ్బుకొసంగ నార్చుచు నకుంఠితు లై తతిగొంచు నాతనిన్
బ్రబ్బిన సంగరేచ్ఛ నిరపాయునిఁ జేయఁ గడంగి చుట్టి రా
నిబ్బర మింత లేద కనునిర్జరవర్యుల కంబరంబునన్. ౨౭౯
ఆ॥ అంబుదస్వనంబు లౌ స్యందనములఁ దురంగమముల మదమతంగజముల
నెక్కి యతనితోడ నెయిదిరి శంఖదుందుభిరవంబు లేచి తోడరుచుండ. ౨౮౦
శా॥ అంహస్సంగ్రహకారు లాగ్రహులు మాంసాశు ల్కడంక న్మహా
సింహవ్యాఘ్రఖరోష్ట్రనాగమృగపక్షిగ్రాహసంఘాతముల్
రంహోయుక్తము లైన వాహములుగా రారాపులై విద్విష
త్సంహారం బొనరింపఁ దర్లిరి మహాసంతాపసంహారిణీ. ౨౮౧
ఉ॥ తా నటు దేవవైరి రణతత్పరుఁ డై వెడలంగ నాగరుల్
సూనచయంబులం గురిసి సూనృతము ల్గనాడి మంగళ
స్వానములున్ ఘటించి జయసంశ్రయరక్ష లొనర్చి రేరికిన్
స్వానుకృతిప్రచార మనుపాహత మాఁగద ధర్మవర్ధనీ. ౨౮౨
ఆ॥ ఆమదోత్కటుఁడు ధృతాతపత్రుఁడు శితశూలపాణి ప్రథితశోణగంధ
పరవశుండు నగుచుఁ బఱతెంచె సంతతసంగరోద్యమంబు సందడింప. ౨౮౩
మ॥ ఘనసత్త్వో ల్లసదేహు లుద్యతఘనాక్రాంతస్వను ల్మేచకాం
జనసంకాశులు రక్తనేత్రులు గిరిస్థానీయు లౌ రక్కసుల్
ఘనశూలాసిగదాపరశ్వధమహాకాలాయసాద్యాజినా
ధనము ల్గొం చరుదెంచి రాతని సముత్సాహంబు పెంపొందఁగన్. ౨౮౪
క॥ తాలస్కంధములం గొని యాలముసేయంగ దఱిమి రధిపతి చక్కిన్
సాలంబు లై పదగు లక్కాలము శీలము వచింపఁగాఁ దరవానే. ౨౮౫
తే॥ దారుణము రోమహర్షణదంబు నైన యొండు దేహము దాల్చె నాదుండగీఁడు
దుమికెఁ దేజంబు దోడ్తోడఁ దొడరఁగా నకాలదండధరుఁడు కుంభకర్ణుఁ డబల.

ఆ॥ నూఱువింటిపెట్లనూల్కొను వైశాల్యమమర పట్ఛతోఁ బ్రచ్ఛితాఢ్య మైన
మేను బండికండ్ల మితి మీఱు కండ్లును దనరె నప్పు డల్లదానవునకు. ౨౮౭
క॥ దగ్ధాచలాభుఁ డసురుఁడు దుగ్ధాబ్ధిశయాను రాముఁ దొడరి గెలువఁ దా
దృగ్గీర్వేరణమున నోముగ్ధాక్షీ ! వెడలె నెంతమోసము తలఁపన్. ౨౮౮
క॥ ఆరౌద్రుఁ డట్లు కదలి మహారౌద్రోల్లాస మొప్ప ననుయాయులతోఁ
జేరి హసించుచు సాహంకారత నిట్లనియె హంసగామిని! వింటే. ౨౮౯
ఆ॥ ఏను రోస మెగువ వానరముఖ్యుల యూథములను భాగయోగ మొప్ప
నిర్దహింతు నింక నెఱసి కృశానుండు శలభములనుఁ బోలె సరభసమున. ౨౯౦
క॥ వనచారు లైన ప్లవగులు నను నొకఁడుం జేయఁగలరె నాబోంట్లకు వీ
రన నెంతలు పురవనభూవినోదముల కనుమతింప వెర వగు వారల్. ౨౯౧
ఆ॥ ఎవ్వ రెట్టు లున్న నిద్ధతేజుఁడు రాముఁ డనుజుఁగూడి నగర మాఁకపెట్టి
యింతసేసె వాని నెనసి వధించెద నాజి నతఁడు మాయ నగడువాయు. ౨౯౨
క॥ అని కుంభకర్ణుఁ డాడిన విని రాక్షసు లెల్ల నేకవిధమున నాదం
బొనరించిరి ఘోరముగా వననిధి బిట్టడరి యెల్లవలనులు మ్రుంపన్. ౨౯౩
క॥ ధీమంతుఁడు సామంతుఁడు దీమసమున నతఁడు బయలుదేరఁగఁ దోడ్తో
నామయములో యనఁగ నెదు రై మొనసె నిమిత్తములు మహాక్రూరము లై.
ఆ॥ ఉల్క లశను లోలి నురలంగఁ జేయుచుఁ గర్దభారుణములు ఘనము లడరె
వసుధ సాబ్ధిగహన వడఁకె ఘోరలు శివ లఱచె జ్వాలభీషణాస్య లగుచు. ౨౯౪
క॥ అపసవ్యమండలాచిత విపరీతవిహంగమములు వెడయులివులతో
నుపగతములుగా గృధ్రమ్ము పరీత మ్మయ్యెఁ బత్త్రి మొనసి పయిపయిన్.
క॥ వామనయన మ్మదరి సీనేమము సెడనేల యిట్లు నెఱసెద వనియెన్
వామభుజము వడఁకుచు నీ కామెయిఁ బదరంగ నేమి యాఁ దాళు మనెన్.
క॥ మండుచుఁ గొఱవి యొకఁడు గలగుండువడుచు బ్రమోల బ్రాలెఁ గ్రూరనినద మై
చండఘృణి నిష్ప్రభుం డై యుండె నసుఖుఁ డగుచు వీచె నొగి మారుతుఁడున్.
శా॥ ఆతంకంబులు పెక్కు లట్లొదవిన న్వ్యాసక్తుఁ డై వాఁడు ని
ర్ణీతంబు న్గడిదాఁటనేరక వినిర్ణిద్రప్రతాపంబు సం
కేతింపం జనుచుండె దైవబల మాక్షేపింప వారింప నిం
దేతావంతుఁడు శక్తుఁడే విధియుఁ దా నీశుండు గాఁ డన్నచోన్. ౨౯౯
సీ॥ ఎగచి వప్రము సాల మిట్టట్టు లూఁపాడ వానరౌఘము లున్న వలనుఁగాంచెఁ
గాంచి యవ్వారల కలఁకపా టెంచుచు భీమవేగంబున పెనుపునెఱపె
నెఱపుచో మొగిళు లనిలు వీకఁ దెరలిన యట్లుగా బిట్టదరంట నార్చె
నార్చినఁ జాపక ట్లై నేల బ్రాలంగ వాలుమెఱుంగులఁ గోలుపఱిచెఁ

బఱిచె నిఁక నోట మాట కేర్పఱుచు ననెడు వారి కెదురయ్యెఁ బర్వతాకారుఁ డగుచుఁ
గదలి నతికినవన మనఁగాఁ బొనర్చెఁ గూడముట్టి బలము నెట్లు గూల్పఁగలఁడొ.
తే॥ శూలము ధరించి రుద్రునిచొప్పు నూపెఁ బరిఘదండముఁ గొని జముపగిది నొప్పె
రెండు నెట్టన లయవేల నుండునవియ కా యని తలంకె దివి దివౌకశ్చయంబు.
ఉ॥ కింకరభూతదండధరుఁ గృష్ణశరీరు శరారుఁ గాంచి యీ
వంకకుఁ గల్పకాలుఁ డిదె వచ్చె నటంచుఁ గపు ల్భయార్తు లై
క్రుంకెడు పాడిమై నొదుఁగఁ గ్రుద్ధుఁడు వాఁ డగకూటసన్నిభుం
డంకెకు రాని సాల మొకయంజఁ దటాలున దాఁటి నూటిగ౯. ౩౦౨
క॥ ఘూర్ణిల్లుచురాఁ బొర్లుచు నర్ణవ మొనరింపఁ దొడరె ననువాదన మ
ట్లర్ణోదము పిడుగుల నభ్యర్ణంబునఁ గురిసె మంట లగములఁ బొడమె౯. ౩౦౩
తే॥ మఘవుచే వరుణునిచే శమనునిచే నవధ్యుఁ డితఁ డన నెగడినవాఁడు వాఁడు
గూడముట్టెడు నని కలగుండుపడుచు వానరులు కాందిశీకులై రానతాంగి! ౩౦౪
క॥ విప్రద్రుతు లౌ ప్లవగుల క్షిప్రకరుల నరసి వాలి సిరిఁగాంచినకా
న్వ్రాప్రాకృతుఁ డంగదుఁడు తత్ప్రారంభుండు పలికెఁ దద్దయుఁ గడఁక౯ ౩౦౫
మ॥ నల నీలా!కుముదా!గవాక్ష!తగవౌనా? స్వీయవీర్యంబు ని
ర్మల మా స్వాభిజనంబు నెన్నక మహారంభంబు వోనాడి యి
ట్లలఁతింబోయెద రెన్నినా ళ్ళుసుఱు లాహా వీడనీ కాఁగువా
రలు బండాటపుఁగ్రోఁతు లైతిరి కటా ప్రావీణ్య మల్లాడఁగ౯. ౩౦౬
తే॥ మంచిపని సౌమ్యులార వే మరలుఁ డింక నసముఁగాపాడఁ గానివా నసువు లేల
నిసువులాకాన రియ్యది నెఱయు వెనువి భీషిక యటంచు నింతటి వెరవులేదె.
ఆ॥ యుద్ధమునకు వచ్చు నురువగు రక్కసికాదు కల్పితం బొకండు జంత్ర
మిపుడె తొడరి దీని నింతింత లొనరింతు మెడయు టొప్ప దింక నెనయుఁడరసి.
క॥ అని బోధించిన నెట్టన జనక నిలిచి స్థైర్యమెనసి సంప్రస్థితు లై
రనికిఁ దరుశైలకరు లై యనివార్యులు వనచరులు చిదానందమయీ. ౩౦౯

—♦ కుంభకర్ణవానరసంగ్రామము ♦—

ఆ॥ మఱలివచ్చి క్రుద్ధమదకుంజరము లట్లు ప్రాంశుశిఖరిశిఖరపాదపాద
పములఁ గొట్టికొట్టి శ్రమపడిరే కాని వాఁడుతనుకఁ డద్రివరతనూజ! ౩౧౦
తే॥ వానిగాత్రంబులం బడి వాఁడి దక్కి పొడవుసెడి పొడు లై కూలె భూతలమున
శైలశృంగంబు లుచ్చైర్విశాలశిలలు పుష్పితాగ్రంబు లైనట్టి భూరుహములు.
క॥ ఆతఁడు సంక్రుద్ధుం డై యాతతకపిబలములను మదాయత్తుం డై
యాతతిఁ నలంచె వనముల నాతంకోత్థితదవాగ్ని యటు లుజ్జయినీ ౩౧౨

ఆ॥ లోహితాస్రు లగుచు లోఁబడి పడి రక్తతామ్రకుసుమము లైన తరువులట్లు
తిరిగిచూడ కొకట దెసలకుఁ బఱచిరి వానిపీడనమున వారు దెగలి. 3౧3

క॥ మిన్నున కెగఁబ్రాఁకి రిలం బన్నుండిరి సుప్తు లట్లు బలియునిచే నా
పన్ను లయి వారు సంభ్రమమున న్నెఱిసెడి కూలి రోటునం బడి నవలా. 3౧౪

తే॥ ము న్నెనసినట్టి దారినే మొనసి రందుఁగొందఱెక్కిరి కొండలఁ గొందలమున
గుహలడాఁగిరి కుజముల కొనలుఁ గొనిరి నిలువఁబడి రట్లు గొందఱు నిలువరైరి.

—♦ పలా యనపరాయణులఁ గపుల నంగదుఁడువారించుట ♦—

క॥ వారలఁ గనుఁగొని యంగదుఁ డారభటి సెలంగ నిట్టు లనె దుర్వారుల్
మీా రని నేనాఁడును నేఁ డీరభసం బేలకలిగె నింతపడుదు రే. 3౧౬

సీ॥ నిలువుఁడు మఱలుండు నెరసినఁ దప్పునే భంగంబు దమకయి పాలుపడఁగఁ
బుడమి నెల్లెడ ద్రొక్కి పొలివోక యుందు రే ప్రాణరక్షణమున ఫలము గలదె
రుష లేక సంగపౌరుషగతు లయి మీారు పఱచిన నవ్వరే పడఁతులెల్ల
సాధనంబులు వీడి జరుగు శూరావలి కసము వో వైఘాత మదియ కాదె
కులమున నొకింతలునుఁ గొఱంత లనరాక బొడమి బీరము లెట్టనఁ బొడవుపడఁగఁ
బరఁగువారల కిమ్మొయిఁ బట్టువదల నేమివచ్చిపడియె సుంత యెఱుక కలదె.

క॥ భీతి మొయిఁ బ్రాకృతము లగు క్రోఁతులవలె నరుగ నరులు కో యని యార్యా
భూతలమున మి మ్మెవ్వరు బ్రాఁతిగఁ గొనువారు మేలుబడయ నగుదురే. 3౧౮

ఆ॥ పెక్కులాడినారు నిక్కుచుఁ బలువురుగలుగు నెడలఁ బలువికత్థనంబు
లరిగె నెచటి కిప్పు డవియెల్లఁ బలికినపలుకుఁ దప్పి పుడమి బ్రదుకఁగలదె. 3౧౯

క॥ వైరులచే ధిక్కృతుఁ డై పూరుషుఁ డెవ్వాఁడు సగముపాలిసి బ్రదుకు నా
భీరువుఁ డిట్టును రెల్ల రసారుఁ డతఁడు కాటికొఱవిచాడ్పున నడఁగుఁ. 3౨౦

ఆ॥ యుద్ధహతుల మైన నొగి దుర్లభం బగు బ్రహ్మలోకపదముఁ బడయువార
మట్లుగాక శత్రు నడఁచి సత్కీర్తి కైకోలు గందు ముసుఱు గోలుపడము. 3౨౧

క॥ స్థితి చెడి క్షితి నుండెడు జీవిత మొప్పునొ దాని నొసఁగి వీరస్వర్గం
బతులితము గొనుట యొప్పునొ మతి నూహించి బుధజుష్ట మార్గ మొనయుఁడీ.

తే॥ కుంభకర్ణుండు కాకుత్స్థకులునిఁ గాంచి బ్రదికిపోలేఁ డనలుఁ జేరి పతగ మట్టు
లింతలో నొక్కనిం గని యిందఱమునుబఱవ నేల యసము పాడుపఱుప నేల.

క॥ అని కనకాంగదుఁ డంగదుఁ డనితరముగఁ బలుకుపలుకు లాలించి పలా
యనబద్ధబుద్ధు లిమ్మొయి నని రది గర్హితము నాక యమరార్చ్యపదా. 3౨౪

ఆ॥ ఓపినంత లేము నొనరించినారముదురము త్రిదశ వైరితోడఁ దొడరి
కదలఁ డతని గెలుచుకాలంబు గా దనిజీవితేచ్ఛ నిట్లు చెదరుటమరె. 3౨౫

మ॥ అనుచుం గ్రమ్మఱి యాశరుం గనుచు భీత్యాయత్తులై యట్టులే
చనుచుండం జని సాంత్వము ల్వలుకుచున్ సంభ్రాంతి మాయింప నా
వనుమానంబులఁ దేర్చుచున్ గడఁకమై హర్షాత్మతం గూర్చుచున్
ఘనుఁ డాజ్ఞావశులం బొనర్చెఁ గపులన్ గల్యాణి! వాఁ డొప్పఁడే. ౩౨౬

వ॥ పదంపడి ఋషభుండును శరభుండును మైందుండును ధూమ్రుండును నీలుండును గుముదుండును సుషేణుండును గవాక్షుండును రంభుండును దారుండును ద్వివిదుండును బనసుండును వాయుపుత్రుండును గదియఁబాఱి యంగదుం గూడుకొని తక్కుంగలయోధవరుల నెల్లం గూర్చుకొని బలముల నేర్పఱించి నేటుకొన నెట్టనం బురికొల్పి నిలువంబెట్టి యయ్యువరాజువచనంబులు పాటిసేసి నైష్ఠికబుద్ధి నవలంబించి సంగ్రామకాంక్షులు సముదీరితవీర్యులు సమారోపిత విక్రములు పర్యవస్థాపితచిత్తులు నై యురవడించి యసుర నెదిరించి వానింజయించుటొండె నవ్వానిచేఁ జచ్చుటొండె గాకుండునది యొండు పొసంగ దనుచు జీవితాశ మాని యమ్మానితులు తరులు గిరులు సానువులుం బూని పూనికమెయిం గుంభకర్ణుపై నడరి తుములయుద్ధంబునకుం దొడరి రయ్యవసరంబున. ౩౨౭

—♦ కుంభకర్ణ విభీషణ సంభాషణము ♦—

ఉ॥ అన్ననుఁ జేరఁగాఁ జని మహామతి యైన విభీషణుండు పే
రెన్ని నమస్కరించి దయ నేలుకొనం గదవయ్య తమ్ముఁడన్
మన్నన సూపి నెయ్యమున మామకవాక్యము లాలకించి యే
తిన్ననిపల్కు పల్కెదవొ తేఁకువ నమ్మెయి నే మెలంగెదన్. ౩౨౮

క॥ అన్నయ యమువేళఁ జని పెద్దన్నకు నే మ్రొక్కి సీత యా శ్రీసతి యా
వెన్నుఁడు రాముఁడు తగ దీపన్నగడ యటంచుఁ బలికి పలు కొప్పారన్.

తే॥ అమ్మహాసాధ్వి రామునకిమ్మటంటి నోమహారాజ! కుల మిట్టు లోముమంటిఁ
బుణ్యుఁ డాతని కొలు వందఁబోలునంటిఁ బొగడి నా కిట్టి చనువీయఁ దగుదువంటి.

క॥ నానుడిఁ గొన కాగ్రహమున నానతవైరి యసిఁ బూని యదలించి యటన్
బోనడఁచెఁ దన్ని మూర్ఖుఁడ! యీనెలవున నిలకు మెచటికేఁ జను మనుచున్.

మ॥ పలుకంబాఱిన మోముతో విరతికిం బ్రాఁకాడుచిత్తంబుతో
వలనిష్ఠానను బుద్ధితో నతనికి న్వ్రాక్రుచ్చి నాకూర్చువా
రెలమి న్నల్వురు మంత్రులే మనుచు రా నే నిత్థచారిత్రు కొ
ల్వాలయం గాంచితి రాముఁ డాశ్రితుల నెయ్యం డన్న చొప్పెన్నుచున్.

క॥ అనిన విని కుంభకర్ణుం డనుజుని తగ వెంచి ధృతి సమాలింగితునిం
బొనరించి యిట్టు లనియెను గనుకొలుకుల బాష్పజలము గ్రమ్ముకొనంగన్.

తే॥ వత్స! జీవింపుమయ్య నీవలనఁ గొలముమనియె నిది నాకు హితమ నేమమునఁ బెరసి
రాము శరణంటి వింక రారాపు గలదె బ్రదుకువారలఁ గొని కొమ్ము ప్రాభవమ్ము.
క॥ నీవు మహాభాగవతుఁడ వేవలనువ నేని దొసఁగు లెనయవు నిను నీ
ప్రావీణ్యము వెలయును మా కావల మెల్లనఁ గాంతు ఘన మగు యశముల్.
ఆ॥ ఈరహస్యమెల్ల నెఱిఁగించె మును నాకు నారదుండు నయవిశారదుండు
కర్మబంధ మెవరు గడచువా రెల్లన మేలుకొంటి వింక మేలుగనుము. 336
క॥ పౌ మ్మరులు స్వీయు లని నా కిమ్మదమునకతన మదికి నేర్పడకునికిన్
గ్రమ్మెదనొ యేరి నెమ్మొయి నిమ్మడలక గాంచుచుండు మెదియెల్లెనన్. 337
క॥ అనినొడివి యతఁడు సెలవిడ ననఘుం డశ్రుముఖుఁ డగుచు ననువుగ నభివం
దనము నొనరించి నెట్టనఁ జని రాముని కెలన నిలిచె జాలింబడుచున్. 338
మ॥ గదచేఁ బూని కడంక మీఱ సుమహాకాయుండు కుంభశ్రవుం
"డిదమిత్థం"బని యెన్న కే ప్లవగులన్ హేవాక మొప్పారఁగాఁ
బదులు న్నూఱులు వేలుగా నఱిమి యాస్ఫాలించుచు న్గూల్చుచున్
బొదుక ల్దార్చుచు మ్రింగుచు న్గెలనికింబోనీక యాకట్టుచున్. 339
క॥ చరియించె బలములో మునుజరియించె మహార్ఘుషంబు జలధిజలములో
బరుసఁదన మరయ నొకఁడుగ సరిపోల్పంబడియె నపుడు జలజాతాక్షీ. 340
తే॥ పది పదా ఱిరువదియు ముప్పదియు నైన లెక్కకుం జోదులం బట్టి యుక్కుమిగిలి
భక్షణ మొనర్చె గరుడుండు పన్నగముల నెట్టు లట్టులుగాఁ ద్రిదశేంద్రవంద్య.
క॥ నెట్టన సమాశ్వసితులై కట్టలుకం దొడరి తరునగంబులు గొని యా
కుట్టాకునిపై విసరిరి పట్టెనయుచు నవియు ద్రుళ్ళిపడుచుండె సఖీ. 341
మ॥ ప్రవరుం డౌ ద్వివిదుం డదల్చుచు విలంబం బౌ పయోదంబు ప్రా
భవ మొప్పన్ గిరిశృంగతుల్య మగు గ్రావం బొండు గైకొంచు వే
గవియంబాఱి సురారి మే నవియ నొఁ గాకంచు వైవంగ న
య్యవయోగంబు తలంగ నయ్యది తదీయాఘుంబుపైఁ దూలినన్. 343
తే॥ ఏనికలు గుఱ్ఱములు తేరు లెందఱేని భటులు మడియంగ నాతఁ డప్పాట నొందు
శైలశృంగంబు వైచెఁ దజ్జవముకతన వ్రాలె రక్షోబలాశ్వసారథిరథములు. 344
క॥ అన్నెల యెల్ల రుధిరక్లిన్నం బయ్యెనుఁ గడంగి కీశులఁ బొలదిం
డ్లన్నఱి గ్రొచ్చిరి శరములఁ బన్ని నిలిచి యేలువాని ప్రాభవ మొప్పన్. 345
క॥ ఉరుకాయులై పరఁగు వానరు లటు చెలరేఁగి చెట్ల నగముల వేట్లా
డిరి నుగ్గునూచమై కరితురగరథోష్ట్రరథితతులు దోడ్తో దొరలన్. 346
మ॥ హనుమం డుక్కునఁ బెక్కు లౌ తరు లహార్యంబు లొప్పారిం గొంచు న
వ్వనుపీదిం జని కుంభకర్ణుతలపై వేవేగ వర్షించె నా

ఘనసత్త్వుం డలశూలరాజమున నాక్రవ్యాశను ల్మెచ్చ నా
య్యన వానిం దెరలంగఁజేసి హరిసైన్యారణ్యముం జొచ్చినన్. ౩౮౭

ఆ॥ కుపితుఁ డగుచు హెచ్చి కొండ నొక్కండు వాఁడడరి పెల్లగించి యార్చి పేర్చి
గిరిసదృక్షుఁ ద్రిదశకీనాశు గుఱిసేసి యెదిరి వీచివైచె సుదతి వింటె. ౩౮౮

శా॥ ఆ యుద్దాముఁడు వ్రేయ వ్రేటుపడి యొయ్యం గ్రొవ్వు రక్తంబు బ
ల్కాయం బెల్లెడ నుర్లఁ బుల్లసిలి యాకంపించి దెర్లాడుచున్
బోయెంబో యని తెప్పిఱిల్లి వడిఁ బెన్భూతంబు వాఁ డార్చుచున్
బోయెన్ శూలముఁ గొంచు నప్పవనసంభూతు న్విదారింపఁగన్. ౩౮౯

క॥ మిణుఁగురులు సెదర విద్యుద్ఘృణులు గడల్కొనఁగఁ ద్రిప్పి కీలించె సమీ
రణసుతు నెద దానిన్ శరవణజుఁడు గ్రొంచమల సత్త్రివాలున ననఁగాన్.

క॥ శూలవిభిన్నహృదయుఁ డై గాలికొడుకు శోణితము మొగంబున వెడలన్
దూలుచు బిట్టఱచెఁ బ్రలయకాలజలదగర్జితంబు గడలుకొనంగన్. ౩౯౧

—♦ కుంభకర్ణుని యుద్ధౌద్ధత్యము ♦—

ఆ॥ ఆతఁ డట్లు వ్యధితుఁ డయ్యె నంచుఁ బ్రహృష్టులగుచు నార్చి రసురు లగచరేంద్రు
లడరు గదురఁ దలఁగి రటునిటు దుష్టపలాశి పొడుపుపై నిరాశు లగుచు. ౩౯౨

క॥ బలవంతుఁ డైన నీలుఁడు బలము నవస్థాపనమునఁ బరఁగించి మహో
పల మెత్తి వైచె రక్కసుఁ డలబల మొనరింపఁ దొడరి యాతని మీఁదన్. ౩౯౩

ఆ॥ ఎదిరి నిలిచి దనుజుఁ డేచి ముష్టి విదుర్పఁ గొండయంత లదియుఁ బిండియయ్యె
వెడలె జ్వాల లట్లు విస్ఫులింగంబులు నేలవ్రాలె నవల నివురు లగుచు. ౩౯౪

వ॥ ఋషభశరభులు గవాక్షగంధమాదనులు నీలునితో నైదుగురు వానరవ్యాఘ్రు
లొక్కపెట్టునఁ గుంభకర్ణుం దాఁకి శైలంబుల వృక్షంబులఁ బాణిపాదతలంబులఁ
బిడికిండ్లం బ్రహరించిన నమ్మహాబలుల యభిఘాతంబు లాసమున్నతకాయునకు
సంవాహనసౌఖ్యం బొడగూర్ప నౌ నౌ నంచు బరిపోటులం గనలిన మత్త
మాతంగంబు చందంబునం జెలరేఁగి తొలుదొల్త పృథువేగుం డగు ఋషభు
సందిట నఱిమి యలమి విడిచిన నంతటిఘనుండును వాంతశోణితుం డగుచు
నేలంబడుటయుఁ బదంపడి ముష్టిఘాతంబున శరభుని జానుసంహతి నీలునిఁ
దలోపఘాతంబున గవాక్షుని బాదతాడనంబున గంధమాదనునిం దాఁకించిన
నాకంచుమించుసంచున నందఱుం దత్ప్రహారవ్యధితు లై శోణితోక్షితు లగుచు
నికృత్తంబు లై పడు వికచకింశుకానోకహంబుల విడంబించుచు భూతలంబునం
బోతరం బుడిగి వ్రాలిన దేలిన యప్పోటుమగల పాటు గాంచి వానరవీరోత్తంస
సాహస్రంబు లొక్కట నాదుష్టరాక్షసు నెదిరించి విడిబడి పైఁబడియు నెక్కియుఁ

ద్రొక్కియుఁ బళ్ళంగఱచియు నఖంబులఁ జీల్చియు ముష్టుల ఘట్టించియు జాను వుల ఘట్టించియు బహుప్రకారంబులం బీడింప నానిలింపవైరిశార్దూలుం డారూఢ శాఖామృగశతసహస్రంబులచే స్వాత్మరుహంబులచేఁ బెనుగొండవోలె నొప్పారి యవ్వారిపైఁ గినిసి బాహువులం బొదివి తార్క్ష్యుం డురగంబుల నెట్టు లట్లు కబ ళింపందొడరిన మ్రింగుడువడక వెలువడియుఁ బాతాళకుహరంబుంబోని తద్వ క్త్రంబు సొచ్చి కర్ణనాసాపుటంబులదారిం బయలుదేరియు మాటిమాటికి నెది రింప సైరింపక భృశసంక్రుద్ధుం డై యవ్వారల విఱచుచుఁ జఱచుచు రాచుచు వేఁచుచు పోరికల నెల్ల మాంసశోణితకర్దమదుర్దమంబుగా నొనరించుచో నయ్యాది యుగాంతకాలరుద్రనితాంతాక్రాంతతాంతప్రదేశోపదేశకం బై కాన్పింప శూల హస్తుం డై వజ్రపాణి యగు శక్రునిఁ గ్రేణిసేయుచు బాశధరుం డగు నంతకున కింతలంత లగుచు నెడలుగ్రమ్మి గ్రీష్మదావపావకుండు శుష్కారణ్యంబుల ఛాడ్పున వలీముఖ సైన్యంబుల నిర్దహించుచుండ వధ్యమానులు నిర్మథ్యమా నులు నష్టయూథులు వినష్టయోధులు హతనాథులు ననాథులు నగుచు వాన రులు భయసంవిగ్నులై విస్వరంబుగా నఱచిన వెఱచి రని పీడక పఱచి రని చూడక కొట్టినవారినే పచ్చడిగొట్టుచు మెట్టినవారినే యడుగంటమెట్టుచు గారింప వారింప నైన దారిఁ గానక మాన కలమిన వ్యథ విధంబు నెడి ఖిన్న మనస్కులై సుమనస్కుం డగు రఘురాముని శరణు జొచ్చి రయ్యవసరంబున.

చ॥ పనిగొని వాలినందనుఁడు భగ్నుల విగ్నుల నూరడించుచున్
మొనసెనుఁ గుంభకర్ణుని సమూలసశృంగ మొకండు కొండ సే
కొని తదుపాశ్రితాసురులు ఘూర్ణిల నార్చుచు వానినెత్తి పై
ననితరపాత మొప్పు విడనాడె మహాహవమం దుదగ్రుఁ డై. 3౫౬

క॥ ఆవేటుపడి యదరి చటులావేగముతోడి కోప మతిశయితముగా
నావానరవృషభమునుమనిపై వావిరిఁ బఱతెంచె నెల్లవానరు లదరన్. 3౫౭

తే॥ బెగ్గిలం బగు నలుకతోఁ బెరిఁగి యమ్మహాబలుఁడు శూలముం బూన్చి యార్చి వైచె
నంగదుఁడ వీ వనంగుఁడ వౌదు వనుచు నదియు మంటలు మిణుఁగురు లడరదొడరె.

ఆ॥ మలయు దాని యుద్ధమార్గవిశారదుండాలయు లాఘవమున నొండుదరికి
లంఘనం బొనర్చులాగున వీటివ్రోఁ జేసె మగతనంబు వాసికెక్క. 3౫౮

తే॥ ఉఱికి చలమునఁ దలమున నురము వగుల నడచె నెడయాక యవ్వానరర్షభుండు
కొండ నగలించు నలశతకోటికోటి కెక్కె నయ్యాది యద్దాన నసుర తెరలె.

క॥ పడి లేచుచునే తన బలుపిడికిలి గూర్చుకొని పెరసి పేరిడి నీవుం
బడు మనుచుం బెడచేతం బొడిచె హరిపు వాఁడు స్రుక్కి పుడమిన్ బడఁగన్.

తే॥ వనచరవ్యాఘ్ర మట్టులు వ్రాల వాఁడు శూలముం గొని సుగ్రీవుఁ జూచి యడరె
రక్కసుని రాపు గాంచి బీరమున నెగిచి పర్వతాగ్ర మొడిచి తెచ్చెఁ బ్లవగపతియు.
ఆ॥ దానిఁ ద్రిప్పి వైచు దారిన పఱతేర వానిఁ గాంచి దనుజవల్లభుండు
సంభ్రమించి వికృతసర్వాంగుఁ డగుచు సమున్ముఖత్వ మెనసి మొనసి నిలిచె.
క॥ హరిశోణితదిగ్ధాంగుఁడు హరిభక్షణచణుఁడు నైన యసురుని రణత
త్పరునిఁ గని యిట్టు లనియెను హరివరుఁ డూర్జస్వితాఢ్య మగు బీరమునన్.
ఉ॥ పాతితు లైరి వీరు లెడఁబా టొకయించుక లేని యుద్ధక
ర్మాతతవృత్తి సైన్యముల నన్యములం గబళించి తంతలో
నే తఱిఁగాంచి కీర్తి కొనె నెక్కటిపోటరి వంచు నిన్ను నా
చేతినిపాత మొం డెనసి సిద్ధిపరుండవు గమ్ము నెమ్మితోన్. ౩౧౫
క॥ వదలుము ప్రాకృత కపులం బదరుచు నీ వఱుమఁ జేటుపడుచుం జెల్లా
చెదరౌ వారల నెల్లం బొదివి మెసవ దాన నేమి పురుషార్థ మగున్. ౩౧౬
వ॥ అని యిట్లు నొడివిన. ౩౧౭
ఆ॥ సత్త్వధైర్యసారసంపన్న మగు హరిరాజు నుడికిఁ గనలి రక్కసిపులి
కుంభకర్ణుఁ డమరకూలంకషుం డిట్టులనె ఘనార్భటిన్ షడాస్యజనని! ౩౧౮
క॥ మనుమఁడవు ప్రజాపతి కటు లనుత్తముఁడు ఋక్షరజున కైతి తనూజుం
డన విశ్రుతపౌరుషుఁడవు ఘనుఁడవు నీ వేల యురక గర్జిల్లె దనిన్. ౩౧౯
మ॥ అనినన్ శైలముఁ ద్రిప్పివైచెఁ గడఁక న్వా కూలి తంచు న్మహా
శనికల్పం బది వజ్రసారకృతరక్షఃపాలవక్షస్స్థలిన్
వినిపాతంబునఁ జూర్ణ మై పడియె నావేగంబున న్వానరుల్
వనటంబొందిరి సల్పి రుత్సవమున న్వ్యాఘోషణ లొక్కణపుల్. ౩౨౦
తే॥ శైలశృంగాభినిహతి రాక్షసవిభుండు కనలి వక్త్రింబుఁ దెఱచి నిర్ఘాతకల్ప
నాద ముప్పతిలంగఁ గ్రవ్యాదు లలరఁ గపులు బెగడొంద నఱచె నిష్కాసితారి!
ఆ॥ శూల మెత్తి త్రిప్పి సూదున హర్యక్ష పతి వధింపనెంచి పఱపె నసుర
యది తటిత్ప్రకాశ మగుచు నేతేరంగ నంతరమునఁ జొచ్చి యనిలసుతుఁడు.
చ॥ భుజములు సాఁచి పై కెగసి పూర్ణమనస్కుఁ డతండు స్వీయ మా
ప్రజవ మహో యటంచు సురపాలముఖు ల్పొగడం గడంగఁ దా
రజనిచరప్రయుక్తము బిరాన గ్రహించెను శూల ముద్ధతిన్
గజిబిజివుట్టె రక్కసులకాండమునన్ ధృతి క్రోఁతిపిండునన్. ౩౨౩
తే॥ వేయిబారువ లుక్కిడి విశ్వకర్మఁ డొనరఁ గూర్చిన దయ్యది యురక విఱచెఁ
దనదు మోకాలిపైఁ బెట్టి దారుమయము నట్లు బెట్టిదుఁ డతఁడు హృష్టాత్ముఁ డగుచు.

క॥ ఆశూల మట్లు నెఱచిన యాశుగసుతుఁ గాంచి పొంగె హరివాహిని స
ర్వాశలఁ బూరించుచు విద్యాశమితాజ్ఞానవిలసితా! యిది వింటే. 321

ఆ॥ సింహనాదములనుఁ జేసిరి వనగోచరులు ప్రహృష్టు లగుచు బలసి కొలిచి
పొలుపుమీఱ హనుమఁ బూజించి యిట్లని పొగడి రెలమి దొనుకఁ బూవుబోఁడి.

క॥ ప్రాణహరము దీని జగత్ప్రాణతనయ! కడిమి నెఱయ భంజించితి మా
ప్రాణము లొసఁగితి లోకత్రాణఫలము దీన నీకొదవె సదయాత్మా. 322

ఆ॥ అట్టు లతనిఁ బొగడ నంతకోపమితుఁ డయ్యసుర గినిసి శూల మలఁతివోయె
ననుచు విసువుకొనుచు నాలంక మలయమ్ము కూట మెయిది తెచ్చికొని కడంగి.

—♦ సుగ్రీవమూర్ఛ—హనుమద్విచారము ♦—

శా॥ సుగ్రీవుం దఱియంగఁబోయి యెదురై నూడించి సర్వగ్రహా
శాగ్రాహగ్రసితుండు దైత్యవరుఁ డాశైలమ్ము శృంగ మ్మపా
స్తగ్రీవుండవు గమ్మటంచు విసరెన్ సంజ్ఞావిపర్యస్తతా
వ్యగ్రత్వంబున వాఁడు వ్రాలె నిలపై వైరు ల్కరం బుబ్బఁగన్. 323

ఉ॥ అద్భుత ఘోరవీర్యుఁ డటు లై పడ వాని హరింపనెంచి యం
చద్భుజసారుఁ డాశరుఁడు చయ్యనఁ జేరి ప్రభంజనుండు వ
ర్షోద్భవమేఘముంబలెనె యొత్తిలఁజేసి గ్రహించి వే చనన్
జిద్భవను ల్హరీంద్రు లెడఁ జేడ్పడి చూచుచునుండి రార్తులై. 324

ఆ॥ మేరుశిఖరిపైని మేలిశృంగము నాఁగఁ గుంభకర్ణుపై నిగుంభితుండు
ప్లవగనాథుఁ డొప్పెఁ బ్రాతిస్వికం బయి యుభయ తేజ మొకట నుల్లసిల్ల.

తే॥ అట్టు లవ్వీరుఁ జేకొని హర్ష మొప్ప లంకకై చనె నసుర నిశ్శంకుఁ డగుచు
దండిపొలదిండ్లు గూర్చుస్తోత్రములు సురలు వెఱచి పలికెడుపలుకులు వినుచుఁ బొలఁతి.

ఆ॥ ఇంద్రనిభు హరీంద్రు నేఁ గొంటి దక్కొండు గొన్నవాఁడ నింకఁ గొఱత గలదె
నరులు చనరె యొదిఁగి నాప్రోల నిలుతురే కపు లటంచుఁ దలఁచెఁ గ్రవ్యభుజుఁడు.

ఉ॥ వానరనాథు నొండు గొని వారక జాఱుట యెల్ల సేనయున్
బూనికదక్కి చేడ్పడుచుఁ బోకకుఁ బాల్పడియుంటయున్ జగ
న్మానితుఁ డంజనాత్మజుఁడు మారుతతుల్యుఁడు గాంచుచుండియున్
దా నెదలోన నుంచె నిటు తథ్యము పథ్యము నా ప్రసంగమున్. 325

సీ॥ పతి యొంటిచేతిలోఁ బడె నిప్పు డెయ్యది సేయంగ నయ్యెడు సిద్ధబుద్ధి
న్యాయ్య మై పెనుపారు నయ్యదె కొనువాఁడ నన్య మొల్లన యది యట్టులుండె
ఱెక్కలుగలకొండ యుక్కున నుక్కిని దండింతు నటిమి యుద్దండవృత్తి
నటులేని నెల్లవా రానంద మందుదు రధిపు విమోచనం బందె కలదు

త్రిదశు లసుర లెవనిఁ దేఱిచూడఁగనేర రట్టివాఁ డితండు పట్టువడియుఁ
దెలివిగాంచి యెదిరిఁ దీర్పక రాఁబోవ డతనితెఱఁగు నిచ్చ లరసినదియ. ౩౮౫
క॥ ఈరెండుపక్షములలో సారతరం బెద్దియగునో చర్చింప మనం
బారూఢం బగు నేయెడ నారీతి మెలంగ మేల యలరారుఁ దుదిన్. ౩౮౬
క॥ గాట మగు ఱాతిదెబ్బ న్వాటముసెడి యున్నవాఁడు వల్లభుఁ డింకన్
దేటపడు నొక్కగడెకున్ నేటుకొనంజేయుఁ గార్యనిర్ణయ మవలన్. ౩౮౭
క॥ కాదని యేఁ దొడరిన రిపు సూదనుఁ డతఁ డప్రతిష్ఠ చొప్పడె ననుచున్
నాదెసఁ బ్రీతిఁదలంగునొ మీఁదఁ దలంపంగనేల మేళము సెడఁగాన్. ౩౮౮
ఆ॥ కాన నొకముహూర్తకాల మీక్షింతుఁ బార్థివుని విక్రమంబు ధృతి తెఱంగు
నంతలోన వానరానీకము విభిన్న మూరడిల్లఁజేయ నోలయువాఁడ. ౩౮౯
క॥ అని యిటు లాలోచనమున్ ఘనుఁ డాతఁ డొనర్చి యచటు గదలి చని మహా
వనచరసైన్య మదైన్యమ యను వాసి దలంగనీని యనువున నిలిపెన్. ౩౯౦
క॥ అంతట ఘటకర్ణుఁడు తనపంత మొకింత నెఱవేర్పఁబడె ననుచు మదిన్
సంతాప మెడల లంకకు సంతస మెగువంగఁ జనియె సైన్యము గొలువన్. ౩౯౧
ఉ॥ గోపురచర్చల న్భవనకోటుల నిల్చి పురోత్తమంబునన్
గాపురమున్నవా రెలమిఁ గన్పడఁ గూర్చిరి సూనవృష్టి న
ప్లోపు రహిన్వహించి ప్లవగేంద్రునిఁ దెచ్చె నధీశుతమ్ముఁ డం
చోపు రమోపదేశమున నోయనఁ దెమ్మెర నెమ్మిఁ గ్రమ్మఁగన్. ౩౯౨
క॥ చల్లని గంధోదకముల మెల్లనిగాడుపుల విరులమేలఁపు జడులన్
బల్లవితుఁ డయ్యెఁ గపిపతి యుల్లం బుల్లసిలఁ దెలివినొంది రసకలా. ౩౯౩

—♦ సుగ్రీవుఁడు మేల్కని కుంభకర్ణు నకర్ణనాసు నొనర్చుట ♦—

ఉ॥ చక్కనిరాజమార్గమునచక్కిఁ జన న్నెఱిగన్న యావిభుం
డక్కట పీనిచేఁ బడితి నాదట నె ట్లొనరింప నేమగున్
బొక్కఁగఁబోల దొందుగతిఁ బోవఁగరా దటు లొట నేర్పునన్
జక్కటి జాతికృత్యమున సల్పి తలంగెద బంధ మిత్తఱిన్. ౩౯౪
క॥ ఇది పథ్య మిదె హితం బిదె విదితం బగు కార్య మంచు వే సురశత్రుం
బొదివి ఖరనఖరముల శితరదముల విదలించెఁ బ్లవగరాజు కడంకన్. ౩౯౫
ఆ॥ చెవులు ముక్కుఁ గొఱికి సెలవుల సీల్చి పార్శ్వము లగల్చి సగము సంపి కాలు
చేయు నాడనీక సిలుఁగులు వెట్టుచుఁ గాలఁ జేత నులిమి కడకు దుమికె. ౩౯౬
క॥ హృతకర్ణనాసుఁడు విదారితమర్దితతనుఁడు శర్వరీచరవరుఁ డా
క్షతజప్రవాహ మారసి యతులితకోపానలోజ్జ్వలాత్ముం డగుచున్. ౩౯౭

క॥ పట్టుకొని మెట్టి మట్టిన గొట్టాడుచు రాత్రిచరులుఁ గొట్టినఁ దనుకం
డట్టె యెగసె నుప్పరమున కుట్టిపడెన్ రాముప్రోల నొప్పగు నేలన్. ౩౯౮

ఆ॥ చెవులు ముక్కు లేని శిరము శృంగంబుగా రక్తధార లెడల రక్కసుండు
ప్రస్రవణచయములఁ బర్వతం బన నొప్పె వక్త్రకందరమ్ము వలనుసూప. ౩౯౯

తే॥ కాలమేఘం బడరి తొలుకారుసందు సంజకెంజాయఁ బెనఁగొన్న చందమునను
శోణితోద్గారమున నప్డు చూడ నొప్పె నంజనచయోపముఁడు రావణానుజుండు.

మ॥ క్రమమే వ్యుత్క్రమ మైన నింకఁ బురిఁ జేరంబోఱ నే మా పరా
క్రమలీలాయిత మంచు సంగరసమారంభాత్తసంరంభుఁ డై
యమరేంద్రారి గిఱుక్కున న్మరలెఁ గ్రోధాయత్తుఁ డై తోడిప్రా
గమరు ల్నాథునితోడి దే బ్రదు కటం చావృత్తికిం బొల్పడన్. ౪౦౧

ఆ॥ అట్లు తరలి యే నిరాయుధుండ నటంచు రౌద్రుఁ డొక్క ముద్గర మతిఘోర
మందుకొని కడంగె ననికి వీడెడలి వనాటవీరు లున్నచోటుఁ బెరసి. ౪౦౨

క॥ భక్షింపఁదొడరె గ్రోఁతుల నాక్షయకాలాగ్ని ప్రజలనట్టు లెగిచి వాఁ
డక్షముఁ డై స్వీయము పరపక్షం బను నెఱుకమలఁచు పరవస మొదవన్.

ఆ॥ తృష బుభుక్షయుం బ్రతీక్షింప శోణితమాంసగృధ్నుఁ డగుచు మలయుఁ గాని
కపులు భల్లుకములు క్రవ్యాదులు పిశాచములు నటంచుఁ దెలిసి మొనయఁ డతఁడు.

ఉ॥ ఒక్కని నిర్వుర న్ముగుర నోజ ననేకుల నొక్కచేతనే
చిక్కినవారి నెల్లఁ బరిశీలన సేయక యుక్కుమీఱఁగా
మెక్కుచునుండెఁ గ్రోఁతులను మేవడి రక్కసులన్ యుగాంతమం
దుక్కివ మొప్ప మేకొన నియోజిత మా పెనుమిత్తి చాడ్పునన్. ౪౦౫

చ॥ గిరిశిఖరంబు లెత్తి వడిఁ గీశపతు ల్విసరంగ నాతఁడుం
ద్వరపడి మొత్తము ల్దివియఁ దార్కొని ప్రింగఁగడంగ శోణిత
స్ఫురణము మైదస్రుతియుఁ జొప్పడ మోము భయంకరమ్ముగా
శర ణని రాముఁ జేరిరి ప్రచారము దక్కి హరు ల్తొలోదరీ ! ౪౦౬

క॥ అక్కాలంబున లక్ష్మణుఁ డుక్కిని న్వాని నెదిరి యురుతరశక్తిన్
గ్రక్కదల నేడుశరముల నక్కున నాటించె రుధిర మడరఁ బురంధ్రీ. ౪౦౭

—♦ కుంభకర్ణుఁడు రామునితోఁ బోరాడుట ♦—

ఉ॥ పాటన మోర్చి బీర మొకపాటిగ నెంచి తలంగి రాముఁడే
సాటి యటంచుఁ బోయె నెఱసాహసి వాఁడు ధరిత్రి గ్రుంగ న
ప్పాటనె రౌద్రసాయకము భంగి ప్రయోగమునన్ శితాస్త్రముల్
నూటిగ నాటె వక్షమున నూ డడరన్ రఘునాథుఁ డత్తఱిన్. ౪౦౮

శా॥ రామాస్త్రంబు లురంబునం జొరఁగ ఘోరం బారవం బొప్పఁగా
నామర్త్యాళి చిరాకునం గవిసె నొయ్యం జేతిఖడ్గాదు లు
ద్దామం బైన గదాయుధంబుఁ దెరలన్ దర్పోద్ధతిం దొంటిపై
బ్రామెం జేతులఁ గాళ్లఁ గ్రోఁతిగములన్ బల్వారు క్రౌర్యంబునన్. ౪౦౯

తే॥ అధిపతిశరాతివిద్ధుఁ డౌ నసురమేన శైలవరమున దొరఁగు ప్రస్రవణ మట్లు
రుధిర మురలెను గ్రోధంబు రూఢమయ్యె నవల నగచరులను దిను టదనమయ్యె.

క॥ బలవంతుఁ డంతకుఁడై వాఁ డలఁతిగ గిరిశృంగ మొక్కఁ డారాటమునన్
దలఁకం గైకొని విసరెను వలఁతి రఘూద్వహునిపై నవారితుఁ డగుచున్. ౪౧౧

క॥ వంచన నారసి వల నటు గాంచి విభుఁడు సప్తవజ్రకఠినాస్త్రములన్
గాంచనచిత్రాంగములం బంచి విదారించె దానిఁ బ్రౌఢిమ నెఱయన్. ౪౧౨

క॥ పతిబాణశిథిలితం బది పతితం బగుచు నిరునూఱుబలము నఱిమి సం
హత మయ్యెను క్షితితలమున వితతద్యుతి మేరుశృంగవిధ మొప్పారన్. ౪౧౩

ఉ॥ అయ్యెడ లక్ష్మణుండు మహితాత్ముఁడు శత్రువిపాటనక్రియం
డయ్యని యోగము ల్బలుకడంకఁ దలంచుచునుండి రాముఁ డా
నొయ్యనఁ గాంచి యియ్యసుర యుక్త మయుక్తము నాక యెల్లరన్
దయ్యమునా మెసంగెడు వితాన నెఱుంగఁ డొకండు మత్తుఁ డై. ౪౧౪

మ॥ కలవా రొక్కట వీనిమేను గలఁతం గంపింపఁగా నెక్కి మొ
క్కల మా రీతి నలంచి బిట్టు భరముం గల్పింప నుత్తాల మై
యలవై వ్రాలఁడె యాపయిం దొలఁపఁగా నశ్లైనఁ జింతింప నొఁ
దొలిలాభం బగు దుష్టుఁ డీప్లవగులం దోడ్తోఁ దినంబోమియున్. ౪౧౫

ఆ॥ అనుచు రాజపుత్త్రుఁ డనునంత వా రంత వానిమేనికెక్కి వంపఁజూడఁ
గ్రుద్ధుఁడై విదిర్చెఁ గోటికిలెక్క లేదనఁగ నిభము మత్త మట్టు లెగిచి. ౪౧౬

క॥ తన్నిర్ధుతులం గని రామన్న యమర్షాత్ముఁ డగుచు నహిపతిచోఱవం
గన్న మహితము శరాసన మన్నయమునఁ దాల్చె రుద్రుఁ డన భీషణుఁడై.

చ॥ పరిబృఢుఁ డట్టు లేచి బహుబాణము తూణయుగంబుతోడి దా
పరికర మొప్ప దానవునిపైఁ బఱతేరఁగ మేలియూథపుల్
గర మరుసంబునం దఱిమి గార్కొన మార్కొన నైప్లవంగులన్
వెరవున నూఱడించుచు వివేకమునం బరికించె నాతనిన్. ౪౧౮

సీ॥ వింజమ్ము నెఱసిన విధమున నూర్ధ్వతలము కిరీటరుచు ల్దొలంప నొరసి
రుధిరాప్లుతాంగనిరూఢి రక్తిమతోడి సాంధ్యమేఘంబు సంసక్తిఁ గాంచి
రుష్టదిశాగజావష్టంభమున నొండు కడలెల్లఁ దానకాఁ గలయఁ గ్రమ్మి
కాంచనాంగదముఖ్యఘనభూషణద్యుతు ల్దావాగ్నికీలలఁ దార్ప నెగడి

సెలవులం దొట్టుకొను నల్ల నోలయ నాల్క సాచి తడవుచుఁ బ్రలయావసానశమను
నోజ హరియూథపుల మ్రింగనుఱుకువానిఁ గాంచెఁ గ్రవ్యాదు రాముఁ డోకంజనయన.

క॥ మిడిగ్రుడ్లు కుండములుగా మిడుంగుఱు లెసదర నగ్గిమేకొను నల్లే
కడఁక హరులఁ బసు లని యేర్పడ నులిమెదువానిఁ జూచి పటువిక్రముఁ డై.

ఉ॥ తోడును నప్పు డప్పునికిఁ దోడ్పడ రక్కసిపిండుతోడ వాఁ
డాడుచురా నదల్చి మహితాత్ముఁడు రామనరాధినాథుఁ డా
జాడ నెదిర్చి కార్ముకముచక్కటి శింజిని దిక్తటంబుల
ల్లాడ సుగాఢవిస్ఫురిత మై తగ స్ఫార మొనర్చె పెల్చనన్. ౪౨౧

క॥ దోషాచరుఁ డాపటునిర్ఘోషంబు సహింప కధికరోషం బఱుమన్
భాషాపతిసంస్తుతు శ్రీయోషాధిపు రాముఁ బొదువ నొలసె న్గడఁకన్. ౪౨౨

క॥ వాతోద్ధతజలదనిభున్ వాతాశనరాజభోగవల్గద్భుజు ని
ర్యాతధరణీధరాభు నుపేతు న్ఘటకర్ణుఁ గదిసి యినుఁ డిట్లనియెన్. ౪౨౩

మ॥ చనుదె మ్మోదనుజాధిపా!వ్యసనదుస్సాంగత్య మేలా?యహం
యును నిన్నోర్వఁగ నిద్ధకార్ముకుఁడ నై యున్నాఁడఁ గన్నాఁడ నీ
ఘన మా పౌరుష మేను రాముఁడ జగత్కల్యాణ మూహించి యొ
క్కనిమేషంబునఁ ద్వచ్ఛరీరవిరతిం గల్పింపఁగా నెంచితిన్. ౪౨౪

చ॥ అన వెడనవ్వు నవ్వి యహహా సఫలంబననయ్యె జన్మ మే
నును నినుఁ గాంచు చొప్పరయ నొవ్వకఁ ద్రిమ్మరుచున్నవాఁడఁ జ
క్కనిలు మటంచు నక్కపులఁ గ్రక్కదలించుచు నిక్కి యార్చి య
య్యనిమిషవైరి గ్రమ్మఱ ఘనారవ మొప్పఁగఁ బల్కె రాముతోన్. ౪౨౫

సీ॥ కాను విరాధుండఁ గాను కబంధుండఁ గాను ఖరుండ నేఁ గాను వాలిఁ
గాను మారీచుండ ఘనరవాస్ఫాటితదిక్కుంభికర్ణుండఁ దెలిసికొనుము
కుంభకర్ణుండ ని న్గూర్చి వచ్చితి నిదె సర్వకాలాయససముపహితము
ముద్గరం బియ్యది మూలంబు జయమున కిటమున్ను దీనిచే నెందఱెంద
ఱరులు సుర లసురులు నరులు మడఁగ రిపు ముక్కుఁ జెవులుఁ దెగియె మొఱ్ఱివోయె
నని హసింపఁబోకు మది లెక్కగాదు నా కింతవట్టు బీర మెఱయఁబోదు. ౪౨౬

తే॥ నెఱసి యిక్ష్వాకుశార్దూల! నీదు పౌరుషంబు వెలయింపు మాదట సంతసమున
నిన్నుఁ గబళింతు రాహువు నీరజారి నట్లు సందియమందకు మంతరమున. ౪౨౭

క॥ కడుదర్పంబున నటు లను దుడుకుబొలసుదిండి పైనిఁ దొడియేసెనుఁ దో
నడరి రఘురాముఁ డార్చుచుఁ బిడుగులకున్ సాటివచ్చు పెనుమార్గణముల్.

ఆ॥ ఎవ్వి సాలవరము లేడింటిఁ దెగఁజూచె వానరేంద్రు నైంద్రి వాలి మడఁచె
నాశరములు చాల వాశరుఁ గదలింప వజ్రజవము లచలవరకుమారి! ౪౨౮

క॥ మ్రింగెను శరధారల వాఁ డంగారపుఁ రాశి యట్టిఁ డై మేనున ను
ప్పొంగుచుఁ ద్రిప్పెను ముద్గర మంగజనిభసాయకముల నలునిటుఁ జేయన్.

క॥ క్షతజానులిప్త మత్యూర్జిత మజితామరబలౌఘచింతాకర మా
యతము మెఱసె ముద్గర మాతతసారము దెసలఁ గపులు దల్లడిలంగన్. ౪౩౧

తే॥ అట్లు సుడియించుచు సురారి యరుగుదేర రాముఁ డీక్షించి పొసఁగు విరామ మెంచి
నఱికె వాయవ్యబాణంబునను సముద్గరము తదీయము దోర్దండ మమరవంద్య !

క॥ నెఱిసెడి కూలుచు నే యక్కఱగలయది పోలెఁ జదిపెఁ గపిబల మొంటన్
నెఱగుదియతోడి దది బిట్టఱచెను వాఁ డంత భైరవారవ మొప్పన్. ౪౩౩

క॥ నగశృంగకల్ప మాభుజ మగలించిన బలగ మెడలి యాదట శేషం
బగచరబలమెల్ల వడంకు గదుర నెడ నిలిచి యొరసికొని కనుచుండెన్. ౪౩౪

క॥ నరపతిరక్షోధిపతుల యరవా యొకయింత లేని యాసంగరపుం
దెరు వరయుచు నబ్బురపుం బరవసమునఁ దేలి రుభయబలములు సురలున్.

తే॥ అస్త్రవినికృత్తబాహుఁ డై నమరవైరి యర్ధవిచ్ఛిన్న మైన మహాగ మట్లు
గానిపించుచుఁ బెకలించె ఘనతరంబు సాలము గరంబునఁ గరంబు సంభ్రమమున.

క॥ దానింగొని దానవుఁ డద్దానం దానవవిరోధిఁ దడవుదు ననుచున్
దా నరుగుదెంచెఁ గ్రోధవ్యద్దానము వనగజము పోలె దర్పాన్వితుఁ డై. ౪౩౭

ఉ॥ పన్నగభోగకల్ప మవిపన్నగ మా కర మెత్తి చేరఁగా
నున్నతిమైఁ గడంగు బలయోధరిపుం గని రాముఁ డైంద్రసం
పన్నము స్వర్ణపుంఖ మసమంబు శిలీముఖ మేసి వాసిమై
నున్నభుజంబుగూడఁ దెగి యోజ దొఱంగ నొనర్చె నత్తఱిన్. ౪౩౮

ఆ॥ అది నికృత్త మగుచు నవనిపైఁబడెఁ గొండవోలె దానిక్రిందఁ బొలిసెఁ దరులు
గిరులు శిలలు శాఖచరు లసురులుఁ జాపకట్టుగా నడంగి కడలు మ్రోయ. ౪౩౯

క॥ అమ్మెయి నై తెరలక వాఁ డమ్మానుషవిభు మారింప నార్చుచురా రెం
డమ్ముల నరనెలలం బాదమ్ములు దెగనేసె దశరథసుతుం డలుకన్. ౪౪౦

క॥ పడెనవియు నవిసి యన్నియుఁ గడ లార్వం గిరుల గుహల గడకొని చప్పు
ళ్ళడర నుభయసైన్యంబులు కడంకసెడి మ్రోయ ముజ్జగమ్ములు వడఁకన్.

శా॥ చేతు ల్గాళ్ళును లేని మొండె మగుచుం జేడ్పాటునం బోక యు
త్పాతాప్తిం బడబాముఖాభ మగు వక్త్రిం బుత్క్రమం బొప్పఁగా
శీతాంశుం గ్రసియించు రాహువు క్రియం జేరంగఁ దత్తూణముల్
శాతాస్త్రంబుల నించె రామవిభుఁ డోజ స్వేల్పు లగ్గింపఁగన్. ౪౪౧

—♦ కుంభకర్ణహననము ♦—

క॥ శరపూర్ణవక్త్రుఁ డై యాశరుఁ డటు రోదసేసెఁ బలుకఁజాలమి మోహం
బారయు తెఱం గలవడఁగా దారలెన్ దోర్ద్వో జగమ్ముదార యుజ్జ్వలుఁ డై.

ఉ॥ భానుమరీచికల్ప మతిభాసుర మంతకకాలసన్నిభం
బానెఱి బ్రహ్మదండమున కంతలు నింతలు నై యమోఘసం
ధానము సాగఁ జెల్లు మహితప్రదరంబు మహేంద్రయోగసం
స్థానముఁ గూర్చి మార్విఁ ద్రిదశప్రభుముఖ్యులు దేఱిచూడఁగన్. ౨౨౨

తే॥ ఇంద్రవజ్రాతిగజవం బహీనసార మినవిభావసుయోగసమిద్ధతేజ
మమలవజ్రసువర్ణపుంఖాతిచిత్ర మాశరం బాశరుంద్రుంప నధిపుఁ డనిచె. ౨౨౩

ఆ॥ మింట మంటలెగయ మెఱుఁగులు మిణుఁగుఱు ల్వెంటనంట దెసల వెలుఁగు లడర
దోఁకచిచ్చునాగఁ దోతెంచె రామేంద్రబాహుముక్త మశని ప్రక్రమమున.

ఉ॥ పర్వతకూటసన్నిభ మపచ్ఛదదంష్ట్రము చారుకుండలం
బుర్వర వ్రాల దైత్యు శిర మొయ్యనఁ ద్రెంచెను రామబాణ మా
సర్వధరప్రహర్త నెఱసాయక మేడ్తెఱ వృత్రు శీర్షమున్
గర్వ మఖర్వముం గెడపి క్ష్మాస్థలిఁ గూల్చిన చొప్పు చొప్పడన్. ౨౨౭

ఆ॥ కుంభకర్ణు శిరము కుండలాలంకృత మపుడు మెఱసె నతిమహత్తరముగ
నదితిదేవతాక మగు చుక్కనడుచక్కిరేఁ దనర్చు చంద్రు వాదు నెఱయ.

తే॥ రామబాణాభిహత మయి రాక్షసుని శిరంబు పర్వతనిభము ధరం దొరంగు
కొలనె లంకాపురద్వారగోపురాట్టసాలచర్యల సమయింపఁ జాలెఁ గిరిజ !

ఉ॥ కాయము వ్రాలె వానరనికాయముఁ గోటుల లెక్క ధావనో
పాయము మే లటంచు ననపాయము వెంట మెలంగఁ ద్రోయుచున్
దోయమురాశిలోఁ బారలెఁ దోయము గ్రాహభుజంగమీనముల్
గాయము లొంది చేడ్పడ సుగాయము స్వర్గము గాఁగ నత్తఱిన్. ౨౩౦

క॥ దేవబ్రాహ్మణశత్రుం డావలనునఁ బ్రబలుఁ డసురుఁ డవనిం ద్రెళ్ళన్
భూవలయము భూధరములు మేవడి వడకంగఁ దొడరె మిహికాధరజా. ౨౩౧

ఆ॥ తుములనాద మొదవె ద్యోలోక మంతయు సంతసంబుకాఁ బొసంగఁదొడరెఁ
బొగడు నదియ యయ్యె భూతభౌతికజాల మధిపు విక్రమంబు నరసి యొరసి.

శా॥ ధైర్యోత్సాహము లొక్కటం దెరల నాదైత్యాధిరాడ్బంధువుల్
శౌర్యోత్సాదితశత్రుఁ డట్లుపడ నిస్సారు ల్భయభ్రాంతులున్
గార్యాదక్షులు నై వ్యథంబడుచు నాక్రందించుచున్ రాము శ్రీ
హార్యాత్ముం గనుచుం దలంగిరి కపీంద్రామర్త్యు లేపారఁగాన్. ౨౩౩

తే॥ దేవలోకమ్ము చీఁకటి దితిజు నడఁచి రాహుముఖముక్తుఁ డగు సూర్యురాణఁ దనరి
వానరౌఘంబు నడిచక్కి వఱలె రాముఁ డంబరాంతరమునయట్టు లచలతనయ.
ఆ॥ అట్టిశత్రు నడఁచి యరిదురాసదుఁ డయి యిష్టభాగి యగు నధీశుఁ గాంచి
యాననంబు లొప్ప నర్చ లొనర్చిరి కపులు పద్మషండకలన దనర. ౨౫౫
ఆ॥ వృత్రహంత నమరవీరుల యట్టులై తన్ను వానరప్రతతులు వొగడ
నలఁతి శత్రుఁ దునిమి యానందసాంద్రుఁ డై నాథుఁ డొప్పె నపుడు నగకుమారి.
క॥ సుర లరుసముమెయి నత్తఱిఁ గురిసిరి కుసుమములు గానకూటమ్ములు వా
ద్యరుచిరనాదమ్ములు నద్దిర యనఁ బతి యుల్లసిల్ల దివమున నెసఁగెన్. ౨౫౭
క॥ సురసంఘమర్దనుని సుఖపరాజితశ్రముని భీమబలుని బలద్వే
షిరిపునిఁ బొరిగొని నెఱిఁగను హరిఁ గాననియవియుఁ గన్నులనఁ బోల వుమా.
ఉ॥ ఆయెడ దివ్యహాని మహితాత్ముఁడు నారదుఁ డాదరంబునన్
శ్రీయుతు రాముఁ జేరి నుతిసేయుతలం పెదఁ దత్తరింపఁగన్
స్వీయరుచు ల్దిశాముఖవిశేషముల న్వెలయింప నింపుచున్
దోయము దోఁచె వేలుపులత్రోవన వచ్చి ధరాతలంబునన్. ౨౫౯

—♦ నారదుఁడు శ్రీరాముని వినుతించుట ♦—

సీ॥ ఇందీవరశ్యామ మీయభీమము ధామ మెంతకోప దటంచు నెంచుకొనుచుఁ
బ్రాంతరక్తవిశాలపద్మరేఖలు కన్ను లివి యెన్నిలోకంబు లేల వనుచు
నమృతవృష్టులు దృష్టు లడరుచున్నవి రణాహతులఁ దేర్చెదు పని కౌర యనుచు
నీయించువింటికా? యెల్లరాకాసులుఁ బ్రాణార్పణలు సేయువా రటంచు
నరసి యరసి గద్గదాంచితవాఙ్మయ మలరు భక్తితోడి దగుచు నెగడ
విశ్వమూర్తి రాము వేనోళ్ల కొకనోరె చాలు ననఁగఁ బొగడె జటి వధూటి.
ఆ॥ నతులు దేవదేవ నాథా! జగన్నాథ! హరి! సనాతనా! పరాత్మ! విశ్వ
సాక్షి! సర్వలోక సంశ్రయ! నారాయణా! మనోజ్ఞనామ! రామ! నీకు. ౨౬౧
క॥ అరయ విశుద్ధజ్ఞానస్వరూపుఁడవు నీవు మాయచక్కటి సుఖదుః
ఖరచన కొగ్గినయ ట్లీనరాకృతిం గొంట వంచనయ కాదె హరీ. ౨౬౨
క॥ ఉందు వధీశ్వర సంతత మందఱ హృదయముల మాయికావ్యక్తతఁ గై
పొందిన జను లొందరు నినుఁ గందు రరసి స్వప్రకాశకవిభాత్మ బుధుల్. ౨౬౩
ఆ॥ ఈజగత్త్రయమ్ము నోజ సృజించెదు కనులు దెఱచి చూచు గారవమున
నొంట నవియె మూసి యుపసంహరించెదు నీదుమహిమ దెలియ నేర మభవ!.
క॥ ఈసచరాచర మౌ జగ మేస్మృతి నెవ్వానివలన నేస్థానమునన్
భాసిల్లు ననన్యము మై యాసకలాత్మునకు నీకె యంజలిఁ గూర్తున్. ౨౬౫

ఆ॥ ప్రకృతిఁ బురుషుఁ గాలు వ్యక్తాత్ము నవ్యక్త రూపుఁ గాఁగ బ్రహ్మాదు లైన
మునులు గాంతు రెవని మోహంబెడలి నిచ్చ లట్టినీకు శరణు లయ్యా రామ!.

ఆ॥ నిను వికారరహితు నిర్మలజ్ఞానరూపునిఁగఁ దెలుపు శ్రుతియె పొసఁగునిష్ఠ
సర్వలోకనివహసంశ్రయుఁగా నిశ్చయించె నదె విరుద్ధ మేల కాదొ. ౪౬౭

సీ॥ ఈ వైదికవిరోధ మేనాఁటికిని నిన్ను శరణుఁజొచ్చినఁగాని చక్కపడదు
మాయతోఁ గ్రీడింతు మలయుదు సాక్షి వై నీభక్తు లెంతురు నెఱయు వింత
లంతలు మరుయుక్తి నర్కాంశుజాలమ్ము భిన్న మౌ జలమునఁ బెరయుచుండు
నట్లఖిలంబు నీయందుఁ గల్పిత మయి భ్రాంతిచే నిజమగాఁ బరఁగుచుండు
దేవ యట్లుఁగాక భావనాతీతంబు నిర్గుణంబు పరము నీదురూప
మెట్లు దృశ్య మగుచు నెనయంబడుట యైన దిరముపడుట యెట్లు దెలివిఁగనుట.

క॥ కావున నీయవతారము లై వెలయు విలాసముల సదర్థము నిపుణుల్
భావింతురు భజియింతురు పావను లై కాంతు రవల భవవార్ధిదరిన్. ౪౬౯

క॥ కల వంచుం బెక్కులుగా నలకామక్రోధముఖము లౌ పరిపంథుల్
దలకింపఁగఁ బొలియింపఁగ నెలుకకుఁ బిల్లులవిధమున నెప్పుడు రామా. ౪౭౦

శా॥ నీనామంబె స్మరింపుచు న్నియతిమై నీరూపె ధ్యానించుచున్
నీనానావిధసేవల న్నెఱపుచున్ నీపూజఁ గావించుచున్
నీనవ్యామృత నిశ్చితోచితకథ ల్నిత్యంబు వాక్రుచ్చుచున్
నీనంద్యాస్పద మందఁగాంతురు జను ల్నిర్ణిద్రచిన్మూర్తు లై. ౪౭౧

తే॥ రామ! త్వద్భక్తు లెచట నిరామయులు చరింతు రవ్వారి సేవించి ప్రీతి మించు
వార లందఱు ధన్యులు వారికెల్ల దాయ భవవారినిధి గోష్పదాయితంబు. ౪౭౨

క॥ ఇది మూలంబుగ నే నెమ్మది నీసగుణమ్ము లోకమాన్యము రూపం
"బిదమిత్థ"మని తలంచుచు ముదమునఁ జరియింతు నిత్యముక్తుఁడ నగుచున్.

క॥ పూజింతు రెల్లవేల్పులు పూజితు లౌ మానివరులు బుధులున్ నను నీ
తాజాని! యేకొఱంతయు నీజనుఁ డగువాని కగునె నిఖిలజగములన్. ౪౭౪

ఉ॥ దేవహితంబుఁ గోరి జనదేవసుతుండవుగా జనించి య
ట్లే వనచర్యఁ బూని తగ వెంచి వధించితి పాపకర్ములన్
వావిరి లంకపైఁ దొడరివచ్చితిఁ గ్రచ్చితి కుంభకర్ణునిన్
శ్రీవర! తీఱె భూభర మశేష మడంగెడు నేఁట శేపటన్. ౪౭౫

ఆ॥ ఇంద్రజేత నెల్లి యీసుమిత్రాసూతి గెలుచు నలదశాస్యు గీటడంతు
వీ వపరదినమున నింద్రాదు లేమును జొచ్చి యాకసమునఁ జూచుచుండ. ౪౭౬

క॥ ఏ నరిగి వత్తు సెలవీవే నాకౌకసులఁ జేరి యెలమిమెయిన్ స
న్మానోచితముగఁ బల్కి యనూనసుఖముఁ గాంతు,నిమ్మహోదయకలనన్.

క॥ అని రాము దేవు నాపృచ్ఛన మొనరించి తనయిచ్చఁ జనె భగవంతుం
డనఘుఁడు సురముని దివ్యార్చన లెనయుచు నెగడి సర్వజన తార్క్ష్యపదా. ౪౭౮
తే॥ వింటె నలినాక్షి ! యన్న చే విశ్వకంటకుండు రావణుబల మర్ధకోటి సెడియె
నున్నయది యింద్రజిత్తుతో నున్నయదియ తమ్మునకు భాగ మనఁగ విధాతమదిని.
ఆ॥ అనిన విభునిఁ గాంచి యగరాజకన్యక యభవ! పెనుపిశాచ మట్లు నేల
వ్రాల రావణుం డవల నెమ్మెయి మెలంగె వెలయఁ దెలుపు మనుచు వేఁడుటయును.
ఉ॥ ఆశ్రితరక్షణా ! స్తుతగుణౌఘచణేక్షణ ! శత్రుశిక్షణా !
ప్రశ్రయభూషణా ! ప్రహితపన్నగభూషణ ! బంధుతోషణా !
విశ్రమకారణా ! సుఖనివేశవిచారణ ! పాపదారణా !
సుశ్రుతధీషణా ! భువనశోభనరూషణ ! నిర్ణిరూషణా. ౪౮౧
క॥ నిగమాగమమంత్రరహస్యగతాగతతత్త్వభేదసంభృతబహురూ
పగుణావిర్భావాంచత్త్రిగుణాత్మైకరూప్యపరమవిలాసా. ౪౮౨
మాలిని॥ నవవిలసితవిద్యానందసంపత్తియోగప్రవిహితనిజభావప్రాపణాత్మప్రచారా
ప్రవరమననశీలప్రస్తుతబ్రహ్మతత్త్వస్తవనవిదితక్ష్మీలక్ష్మసారమోక్షప్రకారా.

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబున
సప్తమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ శివాయ గురవే నమః.

# శ్రీరామకథాఽమృతము

## యుద్ధకాండము.

పూర్వభాగము.

## అష్టమాశ్వాసము.



మాఘవనారివన
స్తోమానలధామ భూమసుగుణోద్ధామ
స్థేమానుభూతవిక్రమ
సామాంచితయోగిముఖ్య సంస్తుతనామా!.

వ॥ దేవా యవధరింపు మట్లు దేవి తన్నుఁ బ్రార్థించిన దేవదేవుం డగు మహాదేవుండు కుతూహలాయత్తచిత్తుం డయి యవ్వలికథాంశం బిట్లని వివరింపందొరకొనియె. నవ్విధంబున దిక్కుంభికుంభకర్ణవిదారణచణరణగుణారణనుం డగు కుంభకర్ణుండు రామబాణనిహతుం డై రణరంగంబునం దెగిపడిన హతశేషు లగు రాక్షసులు తమ్ముఁ గపివరేణ్యులు తఱుమ నొచ్చి లంకసొచ్చి రాక్షసేంద్రుని కొలువుగద్దియమ్రోల వ్రాలి జాలింబడి యాక్రోశించుచుఁ గరయుగళంబులు మోడ్చి ధైర్యస్థైర్యంబులు వీడ్చి యిట్లనిరి. ౧

రావణుఁడు కుంభకర్ణునకై శోకించుట.

సీ॥ కాలకర్మంబులు గవగూడ నమ్మెయిఁ గాలసంకాశుండు గదిసె రిపుల
వానరి వరసేన వలను విద్రావించె భక్షించెఁ గొందఱఁ బ్రధితబలుల

నేకముహూర్తములోన నుజ్జ్వలులోఁగిరి శాత్రవు ల్దానవశత్రువులును
గడఁగి రక్షోహరి గారింప మనుజేంద్రపుత్రుల నొరసె నబ్బురము వొదల
నేమి దెలుపుదు మనురేంద్ర! యెనక మెసఁగె రాము తేజం బవల దెసలాము కొనుచు
నెరశిఖులు విశిఖము లంట నీయనుజుఁడు దానవద్గ్రుమమం బట్లు ధరణిఁదెరలె.

చ॥ నగముశరీర మంచుఁబడ సాగర మాగర మట్టిఁ డయ్యె నొం
డగలఁగఁజేసె నూరుభుజ మా నది వానరసంచయమ్ము నె
వ్వగఁ బొగులంగఁ బైఁబడి యవారణ వారణ నిర్గమోచితం
బెగచి పురమ్ముద్వార మవహిత్థకుఁ గూర్చె నిరోధ మేర్పడన్. ౪

ఆ॥ రాము శరము కంధరానాళముల్ గోయ నపుడు వెడలె విభు ఘనాంగపర్వ
తమునఁ బొడమి రక్తధారాప్రవాహంబు ధాతునిర్ఘరోచితత్వ మొదవ. ౫

క॥ కాకుత్థ్సశరరార్దితుఁ డై కాక వికృతుఁ డైలగండగతి కయ్యెడువాఁ
డే? కదనంబున నాతఁడు నాకాధిపు నడరనీని నయమున మనఁడే. ౬

ఆ॥ అనుచుఁ దెలుపఁ బ్రబలుఁ డౌ కుంభకర్ణుండు పడినమాట చెవినిఁ బడినయపుడె
వాలె నేల శోకవజ్రాహతుం డయి కొండవోలె నైర్ఋతు ండు వగఁజ!

చ॥ తమపినతండ్రిపాటు విని తద్దయుశోకరయాభిభూతు లై
రమరనరాంతకుల్ త్రిశిరుఁ డయ్యతికాయుఁడు నట్టు లిత్థవి
క్రములు మహోదరాదులును గ్రిందనము౦ బొనరించి రన్నకై
క్రిమమున లంక చేడ్పడియె గాఢవిషాదము తన్ను ముంపఁగన్ ౭

తే॥ అవల నెట్టనఁ దేటి దశాననుండు దీనుఁ డై విలపించె నదీనుఁ డితఁడు
కుంభకర్ణుండు దిక్కుంభికోటిబలుఁడు గూలె నెవఁ డింకఁ దను మన్పఁజాలు ననుచు.

సీ॥ ఓవీర! పొలిసితె యొంటిమై నను వీడి దైవతంత్రమున కీద్రఢిమ గలదె
నీబలం బేమయ్యె నిమిషార్థమునఁ దండ్రి! కలఁచివైచిత కాదె కపిబలంబు
బంధు లనాథు లై పడఁగ మచ్ఛల్యంబుఁ బాప కేగుట నీకుఁ బాడి యగునె
యే నిప్డు భూమిలో లేనివాఁడన యైతిఁ గాదె నీదగుప్రాపు గడచిచనఁగ
నాదు కుడిదండ సడలె సన్నాహ మెడలె యెది సురాసురు లొక్కట నెదిరివచ్చి
రేనిఁ దనుకక తన్మద మింకఁజేయు వజ్రసారం బసారితవాసవంబు. ౧౦

క॥ ఆలముసేసి కదిసె నెటు లాలములోఁ గెలిచె నెట్టు లలఁతిపడక దు
ష్కాలమ కా కెదిరించునె కాలానలరుద్రు శ్రీరామకందర్పుఁ డొగిన్. ౧౧

ఆ॥ వ్యసనపడవు నీవు వజ్రనిష్పేషంబు పాలుపడిన నట్టిప్రభుఁడ వొక్క
నరుని బాణనిహతి నవసితి పడితి మహీతలమునఁ బలుక నేమిగలదు. ౧౨

ఆ॥ తపసు లరుగొ దేవతలఁ గూడి యాకసంబునఁ బొసంగి హర్షపూర్ణు లగుచుఁ
బదరుచున్నవారు పాకారి నుడికించువాఁడ వీ వొరగిన వలను గాంచి. ౧౩

తే॥ నిక్కువం బిది నేఁడ నీనిహతివలన లబ్ధలక్షు లై ప్రావి యిలాధ్రచరులు
దుర్గములు లంక ద్వారము ల్దోలఁచువారు దిక్కుమాలిన తెఱఁ గిట్టు తేటపడఁగ.
ఆ॥ రాజ్య మేల నాకు రమణులజోలి యిఁకేమిటికి ధరాజ యెట్టు లున్న
నెద్ది సేయువాఁడ నిటు కుంభకర్ణుండు గూల జీవితాశ కుదురుపడదు. ౧౫
క॥ ఈతఱి భ్రాతం దునిమిన యాతనిఁ దెగఁజూడనేని నావల మరణం
బే తగుఁగాని యకించన మేతావన్మాత్రజీవితేహిత మగునే. ౧౬
క॥ ఇమ్మెయి నిట్టిసహోదరు వమ్మొనరించుకొని బ్రదుకువాఁడనె యే నా
యిమ్మెనయుదుఁ గా కాతం డిమ్మునఁ జరియించు నెచట నిక్కాలమునన్. ౧౭
క॥ నవ్వెదు రమరులు ననుఁగని నొ వ్వొనగూర్చెదె యటంచు నోనాడుచు దా
దవ్వుల వారిం గాంచుచు నవ్వలి కేగుదునె యజ్ఞనాధిపుఁ డెగువన్. ౧౮
తే॥ కోలుపోయితి ని న్నాజిఁ గుంభకర్ణ ! యింక నింద్రుని వదలించు టెట్లు గలుగు
విడుతురే నక్కఁ గనువాంద్రు వేఁటకాంద్రు గారె పూర్వాపకారి న స్గలఁచియిడరె.
ఉ॥ మున్ను విభీషణుం డనిన ముచ్చట మెచ్చక త్రోచిపుచ్చి యా
యన్నఁ బరాభవించితి మహాత్ముఁడు వాఁ డటు లేగె నజ్ఞతం
బన్నితి నిట్టిపాటులకుఁ బా లయితిన్ శుభ మిచ్చు వాని ప
ల్కెన్నద నాప్రహస్తుఁ డటు లీఘటకర్ణుఁడు నేలఁగూలఁగాన్. ౨౦
ఆ॥ సిగ్గుపడెద నేఁడు చేచేఁతులం దెచ్చుకొంటి ననుచు ధార్మికుండు సిరికి
నెలవు తమ్ముకుట్ర నెఱివీడి త్రోపాడు పాపుఁ డాపదలకుఁ బాలుపడఁడె. ౨౧
క॥ అని పలుదెఱఁగులఁ గృపణుం డన వ్యాకులితాంతరాత్ముఁ డై దశవదనుం
డనుజుం గూర్చి పనవుచున్ బనిసెడుగతి నేలవ్రాలెఁ బద్మదలాక్షీ. ౨౨

—♦ రావణు నూరడించి త్రిశీర్షాదు లనికి వెడలుట ♦—

చ॥ అటు లెడఁదూలు రావణు దురాత్ము భృశార్తుఁ ద్రిశీర్షుఁ డాదృతిం
దటుకున లేవనెత్తి ధృతి దార్కొన నూఁది వినోదనోక్తులం
బటుగతిఁ బ్రస్తుతించుచు విపన్నతఁ బాపెడుభంగి కర్గమై
యిటులనెఁ దృప్తభావమున కెక్కటి చాలుననం గృశోదరీ!. ౨3
ఆ॥ ఔను నిహతుఁ డయ్యె నమ్మహావీర్యుండు తాత మధ్యముండు దర్పకలన
నెఱపి నిన్నుఁబోలు నెఱజోదు లిమ్మెయి నేడ్చువారె వాసి యింక వలదె,
క॥ నీపే రన ముల్లోకము లేపుసెడ స్వడఁకుచుండు నెల్లనెఱపఁగా
నోపుదు వొంటికి నై ధృతిఁ గాపురుషునిభంగిఁ దెరలఁగా గతి గలదే. ౨౫
ఆ॥ బ్రహ్మ యొసఁగె నీకుఁ బటుసాయకము శక్తి ధనువు కవచమును రథము సహస్ర
ఖరవరోఢ మదియు ఘననిస్వన మభేద్యమిన్నిగలుగు నీవె యొడలుదయ్య. ౨౬

ఉ॥ ఎక్కటి గెల్వ వీ వరుల నెందఱనెందఱ దేవదానవుల్
ద్రుక్కఱె ని న్నెదిర్చి బలుజోదులు గూలరె యిట్టిసాధనం
బొక్కఁడయేనిఁ దాల్ప వపు డుద్ధతిమై నిపు డిన్ని గొంచునే
ద్రక్కదలింపరాదె యచిరంబె రిపు న్నరదేవమాత్రునిన్. ౨౯

తే॥ ఇచ్ఛమెయి నిల్వు మింకిట నేన పోయి నీదు శత్రులనెల్లర నెమకి నెమకి
గరుడుఁ డాపన్నగంబులకరణిఁ గెడపు వాఁడ నయ్యెద ననుఁ బంపువలని కగుము.

తే॥ ఓమహారాజ నాచేత నుక్కుసెడి నిపాతితుం డయి శయనించు భూతలమున
రాముఁ డాశంబరుఁడు దేవరాజుచేత నరకుఁ డటు విష్ణుచేత నా నయము నెఱయ.

క॥ అనుచుం ద్రిశిరుఁడు నొడివిన విని రాక్షసనాథుఁ డెలమి వెలయం గనుచున్
మనమునఁ దన్నుఁ బునర్జాతునిఁగా నెంచుకొనెఁ గాలదోషాహతుఁ డై. ౩౦

ఆ॥ త్రిశిరుఁ డట్లు వలుక దేవాంతకనరాంతకాతికాయు లధికహర్షమునను
బొదలి రానఁగొనిరి కదలిరి గగ్జిల్లి గంతకోపమాను లధిపు సుతులు. ౩౧

ఉ॥ అందఱు మాయలాండ్రె యటు లందఱు యుద్ధమదోద్ధతాత్ములే
యందఱు దేవదర్పహృతి కార్చుచు నే మని పేర్చువారె తా
రందఱు శక్రవిక్రములె యంబరచారులె సారకీర్తులే
యం దరుదయ్యె వారల ప్రయాణము బాలకురంగలోచనా. ౩౨

సీ॥ పగటు మేకొన నిచ్చఁ బరఁగు బల్మికిఁ దోడు పురుషకారంబునఁ బొల్చినారు
శస్త్రాస్త్రవిద్యాప్రచారంబుతో నెల్లవిద్దెలఁ జుళుకించి వీఁగినారు
తాత దేవునిఁ జేసి తరముమీఱిన మేటి వరము లెన్నెన్నియో వడసినారు
మాటకేనియు నొక్కచోట నెప్పాటఁ దా రోటమొంద రనంగ నొప్పినారు
వీటువోని కలిమి వెలయింతు రిన్నాళ్ళ వీటిపేరిసాని వెరవు మీఱి
వెడలినారు వారు విశ్వజిద్యాగంబు సేయఁబూని మేలిసిరి భవాని!. ౩౩

ఉ॥ దానవదర్పహారు లగు దైవతవీరులతోడి శక్రునిం
బూని హసించునంత లగు పోఁడిమి భానునిభప్రకాశు లా
సూనులు గూర్పఁ దా నెడఁదఁ జొక్కుచు వారి నలంకరించి బ
ల్మేనఁ గదించి సేసలిడి మే లని పొం డనెఁ బుణ్యవర్ధనీ. ౩౪

క॥ మత్తుని యుద్ధోన్మత్తునిఁ దత్త్రరక్షకులు గాఁగ దనుజేంద్రుఁడు దా
నత్తఱిఁ బనిచెను రిపుల యుదాత్తత లో నెంచి జళుకు తద్దయు గదురన్. ౩౫

క॥ వా రరిరావణురావణు వారని కుతుకమునఁ బొగడి వందనములు దై
వారఁ బ్రదక్షిణములు తని వార నెఱపి తరలి రుద్యతారభటులతోన్. ౩౬

తే॥ అలరు సర్వౌషధీగంధ మలఁది మేను లన్నియునుఁ గొండలన దేశ మలముకొనఁగ
వెడలి రవ్వారు సురలకు వెఱపు గదుర నలువు రిరువు రనికి స్త్రైణనాయకమణి.

తే॥ కాలచోదితు లై వారు గదలినారు మొనల కగువారు వారల మొనసినారు
కాఁగలది కాకపోదు పో కంజభవుఁడు వెర వరసికాక యొండుమై నెలయువాఁడె.

వ॥ త్రిశీర్షాతికాయదేవాంతకనరాంతకు లను కుమారులును మహోదరమహాపార్శ్వాపరపర్యాయు లగు యుద్ధోన్మత్త మత్తులను సహోదరులును రాక్షసేశ్వరు నానతిఁగొని యాస్థానంబుఁ బాసి ప్రస్థానంబుసేసి. రందు మహోదరుండు సుదర్శనాహ్వయంబు జీమూతసన్నిభంబు నభ్రమాతంగకులసంభూతంబు సర్వసాధనసముపేతంబు స్వలంకృతంబు నగు గజరాజంబు నధిష్ఠించి యస్తశిఖరిశిఖరంబునం బొల్చు భానుమంతుం బురుడించె. నుత్తమహయసంయోజితంబును సకలాయుధసమాకులంబు నగు రథోత్తమం బధిరోహించి త్రిమస్తకుండు కొండల తేనిపైని మెండుకొను బంగరుగుండు లనం గరంబు డంబెనయు మూఁడుకిరీటంబులతో నొప్పారుచు శైలాగ్రంబున సవిద్యుదుల్కంబును సేంద్రచాపంబు నగు నంబుదంబు చాడ్పునం బరంగె. రాక్షసరాజప్రియతనూజాతుండు తేజోధనుండు నిఖిలధనుష్మద్వరేణ్యుండు నగు నతికాయుండు సుచక్రాక్షంబును సుసంయుక్తంబును స్వనుకర్షంబును సుకూబరంబును దూణీబాణబాణాసనప్రదీప్తంబును ప్రాసాసిపరిఘాకులంబును నగు స్యందనశ్రేష్ఠంబు నలంకరించి కాంచనవిచిత్రమకుటంబును మణిభూషణంబులును గిరణస్ఫురణల దెసలాక్రమింప మేరుగిరీంద్రప్రధానకూటంబు పై మోమోటలేక మాట యిడి యమరారిశార్దూలులు గొలువ నమరారి యమరులతోడి వజ్రపాణిఁ బోణి నొడిచిపుచ్చుకొనె. నుచ్చైశ్శ్రవంబు దన కాశ్రవం బన నై మనోజవంబును మహాకాయంబును గనకాభరణంబును నగు తెలివారువం బెక్కి యుల్కానిపాతోగ్రంబైన ప్రాసం బాసక్తి మెయి మైకొన్న యన్నరాంతకుండు శక్తింబూని నెమ్మిజక్కిపైఁ జక్కనమరి తేజున నుక్కుమీఱు కుమారుండు దనకు మాఱురూప పో యను నాలాపంబు లావహిల్లంజేసె. వజ్రభూషణంబగు పరిఘాయుధంబుఁ దాల్చి దేవాంతకుండు దోర్యుగ్మంబున మంథానగిరిం బూని ప్రక్రమించు త్రివిక్రముని డంబు విడంబించుచుం దనరె. మహాకాయుండు వీర్యవంతుండు నగు మహాపార్శ్వుండు పెను గద నవధరించి సంయుగయుగంధరుం డై కుబేరునిచందంబున నొప్పె. నప్పగిది నమ్మహాబలు లొక్కట నుక్కు మీఱి యప్రతిమంబులగు చతురంగబలములతో నమరావతిం బోని లంక వీడి సౌరబలంబులతోడి యధ్యక్షుల ననుకరించుచుఁ బ్రవరాయుధమహాదేహులు సూర్యవర్చస్కులు కిరీటులు శ్రీసమేతులునై యంబరంబునఁ బొలుపారు గ్రహంబుల డంబరంబు సూపుచు సంబరంబునం దమతమ ప్రశస్తనిశితసితశస్త్రావళి శారదాభ్రప్రతీకాశ యగుహంసావళి వీఁకఁ జౌకసేయ మెఱయించుచు యోద్ధుకాములవ్వారెల్ల నీనాఁటియుద్ధంబునన విల

యంబొండె విజయంబొండె నిశ్చితంబ కాక యొండుత్రోవం బోవందగ దని ప్రతిజ్ఞాతంబు లొనరించుచు గర్జిల్లుచు ఘూర్ణిల్లుచు నాక్షేపించుచు నాస్ఫోటించుచు సాయకంబులెత్తి జళిపించుచు నెదిరియాపత్తి నూహాలం గలిపించుచుఁ బ్రధన దుర్మదులై పదరుచు వదరుచుం బఱతేరం దదారవంబుల వసుంధర వడంకు నాకడంకకు గగనంబు స్ఫుటితం బగునట్లు గాఁగఁ గడలు మ్రోయఁ గందరలు ప్రతిధ్వను లీయ మురియుచు నభినిష్క్రమించి సముద్యతశిలానోకహం బగు నవ్వానరానీకంబుం దఱియవచ్చి రయ్యవసరంబున.

చ॥ హరివరు లట్లు గాంచిరి మహోత్కు లహర్పతితేజు లుద్ధతిం
బరవడి నేగుదెంచు సురపాలవిరోధిబలంబు సారవ
త్సురథపతాకికాశతసుశోభిత మాఢ్యఘనప్రకార ము
ద్ధురతురగేభ మాత్తశరధూర్వహయోధము నిర్నిరోధముల్. ౪౦

క॥ దీప్తాగ్నిరవిప్రఖ్యు లనాప్తు లసురవీరు లట్టు లరుదేరఁగ సం
ప్రాప్తసులక్షులు ప్లవగు లసుప్తక్ష్వేళు లయి యఱుమఁజొచ్చి రుదారా! ౪౧

ఆ॥ కొండలగము లెత్తుకొని క్రోఁతు లుద్ఘుష్టనాదు లగుచుఁ దఱుమ నైరృతులును
బ్రతిని నాదములను బరఁగింప రోదసు లైనలు ఘూర్ణిలె న్విధిప్రపూజ్య ! ౪౨

శా॥ సంచారం బొనరించి రుద్ధతము రక్షస్సైన్యముం జొచ్చి యా
పంచాస్యప్రతిభు ల్హరిప్రవరు లుత్పశ్యు లురితిం దివిక్
గొంచుం గుండులు వృక్షము ల్పయిపయిం గూటస్థితిం దెల్ప నా
వంచం గొండల పోరితంబుఁ దలఁపింపంజాలి లీలావతీ! ౪౩

శా॥ రక్షోవానరసంకులం బగుచు ఘోరం బైన యప్పోరఁ బె
న్వృక్షంబు ల్శిలలుక్ హరిప్రవరు లుద్వృత్తిం బ్రయోగింప స
త్పక్షంబు ల్వరము ల్వరు ల్గురియ విస్ఫారస్ఫురన్నాదముల్
సక్షోభంబులుగా బయల్నెఱసె నాశాచక్ర మల్లాడఁగాక్. ౪౪

సీ॥ నామరూపంబు లనం గానఁబోలని క్షోదంబులుగ దాలఁ గొట్టికొట్టి
కవచాభరణములు గలగొనఁ బిడుగులఁ బోలిన పిడికిండ్లఁ బొడిచిపొడిచి
యదరి గ్రుడ్డును వ్రీల నదరంట నడినెత్తి నలవ్రూక తలముల నడఁచియడఁచి
తలవట్టి వెనుక కుద్ధతి లాగి కినుకమై గొదకొంచుఁ గుత్తుక ల్గొఱికికొఱికి
గుండ్లు వైచి పెద్దక్షోణీజముల రాచి ప్లవగు లార్వఁ గలఁగి లాఁతు లుదిల
పడిరి నేలఁబడిరి పసనెడి నడిఁకి బిట్టఱచి రార్తు లై యహార్యసమయ ! ౪౫

ఆ॥ దండిరక్కసులు పదంపడి కొల్తలసేసి ప్రాసముద్గరాసిశూల
శక్తిముఖ్యతీక్ష్ణసాధనంబుల విదారించి రగచరుల గిరిప్రసూత ! ౪౬

క॥ శోణితదిగ్ధాంగులుగా క్షోణిం బడవైచి రెదిరి సొరిది జయశ్రీ
పాణిగ్రహేచ్ఛ నుభయులు ప్రాణము లున్నంతవట్టు బర్వేందుముఖీ. ౮౭

క॥ హరిరాక్షసస్సృష్టము లగు నురుశైలాయుధవరముల నొకగడెలోనన్
ధరణి సమావృతతలయు రుధిరాప్లుతయు నయ్యె సకలదివిజస్తుత్యా. ౮౮

క॥ పెనుగొండలట్టు లరిమర్దను లాజిమదాన్వితులు సురప్రతిపక్షుల్
దునిసి నెఱయ వసుమతి పూర్ణనప్రోల్లాసాఢ్య యగుచు రాణాదనర్చెన్. ౮౯

ఆ॥ భగ్నశస్త్రు లగుచుఁ బగతు రాక్షేపింప క్షిప్యమాణు లగుచుఁ జేరి దనుజు
లంగసాధనముల నాప్లవంగులతోడ దవిలి పోరి రద్భుతంబు పొనర. ౯౦

తే॥ వానరుల వానరులఁ బట్టి వరుసఁ గొట్టి యసుఱు లెడలింపఁ దొడరి రయ్యసురు
రాక్షసుల రాక్షసులతోడ రాచిరాచి చంపి రగచరు లాజగజగడమునను [లపుడు

ఆ॥ పగఱ ఱాలె యొడిచి పరఁగించి రాశరు లట్లు వారి హేతు లాక్రమించి
కొంచు రక్కసులనుఁ గూలిచి రమ్మానిమెకముజోదు లోజ మెఱయుచుండ.

తే॥ శైలశూలాస్త్రముల నిర్విశేషముగనువారు వీరును విజయేచ్ఛ వఱలుచుండఁ
బోరిత మెసంగఁ బోరిరి భూతగణము నడుఁక నడరించి రటు సింహనాదములను. ౯౩

క॥ కంకటము లుచ్చిపోవ విశంకటగాత్రములు నులియఁగా రక్కసులా
వంక క్షతజం బెడల్చిరి కంకాళము మిగుల రస మగమ్ములపోలెన్. ౯౪

సీ॥ రథమున రథము వారణమున వారణ మశ్వ మశ్వమ్మున నడఁచువారు
శిల లెత్తుకొని మనశ్శిల లాముకొని తొంటివాని రక్కసుల పై వైచువారు
బహుశాఖశాఖులఁ బలువుర మడఁగించి యొల్లపై నడరంగ నొలయువారు
పరు లర్ధచంద్రము ల్భల్లము ల్పరఁగింప నొడిఁగి పట్టుకొని పై నుఱుకువారు
వారు వానరులే కద వారిచేష్ట లొప్పె నప్పాట చెర్లాటలో యనంగఁ
బోరితము పోరితము గాదు పోలిసి రసురు లందు నగపాలు పాడ్వడి నట్లు గాఁగ.

తే॥ కొండలును బండలును శైలకూటములును పాదపమ్ములు నిటునటుఁ బడిన వివిధ
సాయకమ్ములు మెం డైన సరణిఁ బాసి యొడ్డొఱక మయ్యె నాప్రథనోర్వి గారి.

ఉ॥ గర్వితహృష్టచేష్టు లయి కార్కొని రక్కసులన్ సడల్చి త
త్సర్వవిధాయుధంబులు ప్రసక్తిమెయుం గొని వారి భీతి లే
కర్వములం బలె న్నలికి యార్వ బలే బలుజన్న మిద్దియే
పర్వ మటంచు నాకపుల బల్విడి మెచ్చిరి నాకపు ల్మనుల్. ౯౭

—♦ నరాంతకుఁడు విజృంభించి యంగదునిచే నడంగుట ♦—

మ॥ ప్లవగు ల్మీఱ నరాదు లట్లు పడ దౌర్భాగ్యంబు వాటించి వా
రువము న్మారుతతుల్యవేగము సమారోహించి శక్తి న్నితన్

ప్రవర నైకొని యానరాంతకుఁడు తేవ న్వానరానీక మ
ర్ణవ మభ్యర్ణమహార్ఘుమంబు గతి రారాహొప్పఁ జొచ్చెన్ ధృతిన్. ౫౮
తే॥ చొచ్చుచునె యేడునూర్లకు వచ్చెఁ గపులఁ దనరుశక్తికిఁ దనశక్తి దవులు గాఁగ
నెంతసేయుఁడు వాఁడు నరాంతకుఁడట యాఁకపడె హరిసేన చీఁకాకుపడఁగ.
మ॥ హయపృష్ఠస్థితు సన్మహాతను రణవ్యాసంగవశ్యాత్ముఁ బ్రా
సయుతు న్వానరసైన్యసంచరణవైశారద్యపద్యాంచితున్
గుయివెట్ట న్విదలించువానిఁ గని రాక్రోశించి రీదుర్మదున్
జెయియీ కెవ్వఁ డడంచువాఁడొ యనుచున్ సిద్ధర్షి విద్యాధరుల్. ౬౦
తే॥ వాని మార్గ మరసి చూడరాని దయ్యె మాంసశోణితకర్దమమలిన మగుచుఁ
బర్వతాకారు లగచరు ల్పాతితు లయి తెట్టెలుగ నందు మునుఁగుచుఁ దేలుచుండ.
సీ॥ యెడఁదఁ దన్నఁబుమంగ నిచ్చసేర్చుచునుండ నదరంట నంతలో నడిచిపొడిచి
తరులు గిరులుదెచ్చి తార్కొన నొనెడఁ జేపట్టెడలఁ బొడిసేసి యార్చి
యోలాకుపడి చూడ్కు లొలయించు టారసి ప్రాసస్ఫుర ల్వాపి బడలుపఱచి
యోల మాసపడంగ నుంకింప నెదురేగి మలయించి ప్రాన్పడ మారిమసఁగి
పిడుగుపడినట్లు దావాగ్ని పేల్చినట్లు ప్రళయఝంఝానిలంబు పాల్పడిన యట్లు
వానరానీకిని నలంచె వాసవారితనయుఁ డాత్తనయుఁడు నరాంతకుఁడు గినిసి.
క॥ ఏదెసఁ గాంచినఁ దానే యై దానవుఁ డెగిచి నిలువ నటఁజన నైనన్
గా దనక వ్రచ్చియిడ సమ్మోదం బేదఁ గపివరులు మొరసిరి తరుణీ. ౬౩
తే॥ ఎయిదుగతి గాదు స్థితికి నొ నిరవు లేదు కదలఁగారాదు వాని విక్రమముకతన
భయము దఱుచయ్యెఁ బతనంబు ప్రబలమయ్యె నగచరానీకమందు జన్యంబునందు.
తే॥ ఒక్కఁ డంతకకల్పుఁ డయ్యోజఁ దేజ మెసక మెసఁగెడు ప్రాసంబు నెత్తిమొత్తి
పొడుపులొప్పారఁ బొడువంగఁ బొలుపుదక్కి వానరౌఘంబు పుడమిపై వ్రాలె నవల.
క॥ ఓర్వంజాలక యొదుఁగుచు నర్వాచీను లననైరి హరివరు లపు డా
గర్వితునిపాలఁ బడుట సుపర్వబలము లెక్కగొనరు వఱపరె రిపులన్. ౬౬
ఆ॥ అఱచుచుం బ్రభిన్నులై పడు నవ్వారి రూపు లొప్పె నెదిరిరూపణమున
నశనిపాతనిర్హ్రాతాగ్రకూటము లయియురలు గిరులబాట నొలసికొనుచు. ౬౭
క॥ మును గుంభకర్ణుతో ననిఁ బెనఁగొని మూర్ఛమునిఁగిన కపిప్రవరులు నె
ట్టనఁ దేలి స్వస్థచిత్తతఁ గని సుగ్రీవు కొలు వెనయఁగాఁ జని రార్యా. ౬౮
ఆ॥ చేరినట్టివారి స్థితి నెంచి సైన్యంబు పిచ్చలించు టరసి భీతిగొలుపు
వాఁడు వీఁ డటంచు వారక సప్రాసు నానరాంతకున్ హయస్థుఁ గాంచి. ౬౯
ఉ॥ శూరతనూజుఁ డప్డు బలసూదనవీర్యుఁ గుమారు నంగదున్
సారపరాక్రమక్రము ససారుఁ గనుంగొని వీరవర్య!యా

నైరృతయోధుఁ గంటె జతనన్ బలముం దెరలించుచున్న వాఁ
డారభటుల్ సెలంగఁగ మహాశ్వము నెక్కి జితశ్రమస్థితిన్. ౭౦

తే॥ వాని మదహస్తిఁ గేసరి వలను మీఱ విక్రమంబను వారంగ నాక్రమించి
ప్రాణవిరహితుఁ జేయుమ భద్ర మనయు మనకులీనుండు మదిమెచ్చ నీక్షణంబ.

ఆ॥ అనుచు నధిపుఁ డనఁగ నాలించినంతనే బలము తలపొలమునఁ బరఁగె నతఁడు
కాఱుమొగిలు డించి ఘనతేజమున మించి యడరు నంశుమంతు ననుకరించి. ౭౧

ఉ॥ అందఱిలోన మేటి కడె యంగదుఁ డంగదవర్ధుఁ డప్పుడిం
పొందె సధాతుపర్వతము నోజమెయిన్ బరకాలుఁ డట్టివాఁ
డెందును లేఁ డనాయుధుఁడె యై నఖదంష్ట్రల దాడి శత్రునిన్
ముందలపట్టి యీడ్చు ధృతి మున్ దలకెక్క నసెం దలోదరీ. ౭౩

ఆ॥ ప్రాకృతుల నలంచి ప్రాఁకెడ నీ కేప్రతిష్ఠ వచ్చు నిలుము తెరల కిచట
నీదు ప్రాసమునకు నేనిత్తు వక్షమ్ము వజ్రభేదకమ్ము వజ్ర మసుర! ౭౪

ఆ॥ అనుచు నొడువ విన్నయంత నరాంతకుం డొడుగఱచుకొనుచు నలుక వింత
రూపుఁగొనె ననంగ రోజుచుఁ బఱతెంచెఁ బ్రాస మొప్పఁబట్టి ప్రధనమునకు.

క॥ మదమున దిద్దిరఁ ద్రిప్పుచు నెదిరియెద నైవ్రెచె దాని నే డ్డెఱ నెఱయన్
బదిల మగు నచటునం దది పది తునుకలు గాఁగ నేలఁబడె మధురాస్యా. ౭౫

ఉ॥ ప్రాసముపన్నగాశనవిభగ్నమహోరగభోగవృత్త్యను
ప్రాసము సేసి నాకపతిపౌత్త్రుఁడు దాఁ దల మెత్తివైచె న
త్రాసము నత్తురంగమ మదల్చి తలన్ దళమెల్లఁ గాంచి స
త్రాసముగాఁగ దైవతవితానము మే లని యుబ్బియాడఁగన్. ౭౭

క॥ కొండవలెఁ బడెఁ బుడమిఁ దలపండు వగులనాల్కజాఱఁ బలుతాల్వకుల్
కండలు గడికండలు గాఁగం డంబముతోడ నదియు గండడఁగి సఖీ. ౭౮

తే॥ వికలుఁడును గ్రోధవశమున వివశుఁడు నయి యన్నరాంతకుఁడంతకు నంతలుగను
వాలి దృఢముష్టిఁ గూర్చి యవ్వాలిసుతుని శీర్షమదరంగఁ బొడిచె నుచ్ఛ్రష్టుఁ డగుచు.

క॥ తల బీఁటగిల రుధిర ముత్కలముగ నుష్ణముగ వెడలఁ దలరుచు మోహం
బొలసియుఁ దోడ్తోఁ దెలిసి ప్రబలుం డనుచు విస్మయమ్ముగ వడి సన్మయుఁ డై.

చ॥ అశనిసమానవేగము మహాగిరిశృంగనిభమ్ము వైరిహృ
ద్విశసనశీల మాఢ్యము ప్రధృష్టము ముష్టి నమర్చి క్రోధవ
హ్నిశలభ మంచు రక్కసులనేతతనూభవు నెంచి వైచెఁ బ్రా
గ్దిశదొరపౌత్త్రుఁ డాతని యుదీర్ణము వక్షమునం దుదగ్రుఁ డై. ౮౦

ఆ॥ వాని పేరుగొన్న వడిగలపిడికిఁటిపిడుగుదెబ్బనలిగి పిండి యైన
యెడఁదతోడ రక్త మెడలించుచుం బడె నసుర నేల శైల మట్లు బాల. ౮౧

క॥ ఆకసమునం ద్రిదశులు వనౌకసు లిల నొక్కెడుగ మహాహర్షాబ్ధి
ప్రాకటతరంగకలనం గైకొని రైంద్రిజుఁడు నిర్భృతుఁ గలనునఁ గూల్పన్. ౭౩

ఉ॥ ముష్కరుఁ డౌ నరాంతకుని మోసమునం బడ కున్మనస్కుఁ డా
విష్కృతముం బొనర్చె నిజవిక్రమ మంగదుఁ డిద్ది యొడ్డకుం
దుష్కర మంచు నుబ్బె మది దోర్బలభీముఁడు రాముఁ డాతఁడున్
నిష్కృతి గల్గె దీని కని నెయ్యముచూపి మెలంగె నద్రిజా! ౭౪

క॥ కన్నులఁ ద్రోల నరాంతకుఁ డన్నెఱిఁ గూల సయిదోడు లటు పినతండ్రుల్
చెన్నలఱ నాక్రోశించిరి బన్నము వీడి యని వెంటఁ బరఁగిరి తోడ్తోన్. ౭౫

—♦ అంగదుఁడు మహోదరదేవాంతకత్రిశీర్షులతో నొక్కఁడ మార్కొనుట ♦—

తే॥ సాంద్రజలదాభ మగు వారణేంద్ర మెక్కి వారణాయుతబలు దేవవరు మనుమనిఁ
బొదివి పగనీఁగఁ బఱతెంచెఁ బోరన న్మహోదరుఁడు రాక్షసేంద్రుసహోదరుండు.

క॥ భ్రాతృవ్యసననిపీడితుఁ డాతఱి దేవాంతకుఁడు మహాబలుఁడు కపి
వ్రాతపతిసుతు నలంపఁ గృహీతారిహపరిఘుఁ డగుచు నేత్తెఱఁ బెరసెన్. ౭౬

అ॥ అగద ముచితతురగ మాదిత్యసంకాశ మెక్కి నిక్కిచూచి యెసక మెసఁగ
నటు త్రిశీర్షుఁ డలుక నరుదెంచె నవ్వాలిపుత్రు నాక్రమించి పోరొనర్ప. ౭౭

క॥ ముప్పురు సురారు లఱిమిన నివ్వెఱపాటైనయుఁ డాజి నేటుకొనె న్వాఁ
డవ్వారి నెదిరి పైకొనె నవ్వారిఁగఁ దనదు విక్రమార్భటి నెఱయన్. ౭౮

ఆ॥ ఆశతార మట్టిఁ డగు మహావిటపంబు విటపవంత మించు వేడ్కఁ గొంచు
వచ్చి దీననోరి నొచ్చితివే యంచు వడి సురాంతకుపయి వైచుటయును. ౮౦

శా॥ వీరుం డా త్రిశిరుండు దాని నడుమన్ వ్రచ్చె నరౌఘవి
స్ఫారోగ్రప్రదరంబులం బనిచి దీప్తక్రోధుఁ డై చెచ్చెరన్
ధీరుం డంగదుఁ డానెఱిం గురిసె నుద్వృక్షాగరాసు ల్తదా
సారం బాఁగె శరాళి నాశరుఁడు దోస్సారం బపారంబుగాన్. ౮౧

క॥ దేవాంతకుఁ డావృక్షము లావిధిఁ బరిఘాగ్రపృథుశరాస్ఫాలనముం
గావించుచు విదళించెను గావర మొప్పారం దనదుకడిమి మెఱయఁగాన్. ౮౨

సీ॥ త్రిశిరుఁ డంగదు వీరు దిష్టాంతరుద్రు నభిద్రవించె శరౌఘవృష్టి నెఱయ
నామునేనుఁగు నెక్కి యల్లె యున్నత్తాఖ్యుఁ డశనిసన్నిభతోమరాళిఁ బొడిచె
గడుకొని పరిఘాభిఘాతం బొనర్చి సుపర్వాంతకుండు వ్యపక్రమించె
వెండియు ముప్పు రవ్వీరవరునఁ దొంటి జా ప్రక్రమంబునకె యుపక్రమించి
రన్నియు సహించి తలమెల్ల నాక్రమించి యందఱకు నన్నిరూపులై యధిగమించి
తలమున నడంచె నమ్మహోదరుగజేంద్రుతలఁ బరమదుర్జయుఁడు వాఁడు తద్దగనలి.

ఆ॥ గ్రుడ్డు లెడల నఱచెఁ గో యని యని మహావారణంబు తత్ప్రహారమునను
దానికొమ్ము వెఱికి తవిలి దేవాంతకుఁ గొట్టె గట్లపగతు కొడుకుకొడుకు. ౯౪
క॥ విహ్వలితావయవుం డై జిహ్వాపాదల లాక్షరసముఁ జెనయఁగ నోటం
బహ్వస్ర మెడల సురశమ నాహ్వయుఁ డిల కొఱఁగఁబడె మహాసురశమనీ!. ౯౫
క॥ వాతోద్ధూతద్రుమ మటు లాతతబలుఁ డట్లు వ్రాలి యాదట నెటులో
చైతన్య మెనసి పురికొనెఁ దాత తలం బొందుదారిఁ దలకొనుచుండన్. ౯౬
ఆ॥ వాఁడు పరిఘ మూని వలనొప్ప దిర్దిరఁ ద్రిప్పి హరివరేణ్యుఁ దెరల నడఁచె
నతఁడు మొగ్గతిల్లి యవశుఁ డై యంతలోఁ దేఱి యడరు నెడ నుదీర్ణుఁ డగుచు
క॥ త్రిశిరుం డజిహ్మగము లగు విశిఖమ్ములు మూఁడు నాటె వృత్రారితనూ
జశిశులలాము నొసట వజ్రశరీరుఁడు తత్ప్రసక్తి జంకెనయఁ డుమా. ౯౮
క॥ ముప్వురు నైరృతపుంగవు లవ్వానరయూథనాథు నఱిమి కడిమినై
నొవ్వనయింపఁ దలఁప దాదవ్వలఁ గని హనుమఁ డగ్నితనయుఁడుఁ దోడ్తోన్.
తే॥ వచ్చితాఁకిరి దనుజు లవ్వరుసఁ గడిసి రందు నీలుండు త్రిశిరస్కు నాక్రమించి
మించు గిరిశిఖరం బెత్తి మిత్తిపాలఁ బడితి వం చదలించుచుఁ బదరి వైచె. ౧౦౦

—♦ హనుమఁడు దేవాంతకుఁ జంపుట ♦—

క॥ ధీమంతుఁడు రావణసుతుఁ డామెయి ధరకూటమును మహాశరముల ని
ర్నామముగాఁ జూర్ణించెను దా మిడుఁగుఱు లెడల నదియు ధరఁ బైఁ దొరఁగెన్.
తే॥ అనుజుని ప్రతాప మారసి యరుస మెనసియలఁతి గాని పరిఘ మొంట నడర మెఱసి
యాతఁ డీతనికిం జాలు నే నిఁ కేల యనుచు హనుమనిఁ దాఁకె దేవాంతకుండు.
శా. పైపైవచ్చెడు రావణాత్మభవు దేవప్రాణహర్తన్ జవుం
డై పైవ్రాలి యదల్చి సాంద్రతర వజ్రానూనముష్టిం దిరం
బై పైత్రం బగు చేవ యావహిల నొయ్యన్నెత్తిపై మొత్తి దా
పై పై నార్చెఁ బ్రభంజనాత్మజుఁ డమిత్రానీక మల్లాడఁగన్. ౧౦౩
చ॥ పిడికిటిఁ ద్రేటునం దెరలి పెందల పుందల లొంటఁ బిండిగా
బడిబడి గండ్లుఁ బం డ్లురలఁ బ్రామిడి నాల్కయుఁ జుల్క వ్రీల బ
ల్విడి రుధిరౌఘ ముట్టిపడ వీరుఁడు వాఁడు ధరిత్రిఁ జేడ్పడన్
మిడుకుచు వ్రాలె వేలుపులు మేకొన వానరసేన లుబ్బఁగన్. ౧౦౪
తే॥ అటు మహాబలుఁ డసురయోధాగ్రగణ్యు డమరవైరి తటాలున నవనిఁ గూలి
త్రెళ్ల సక్రోధవేగుఁ డై త్రిశిరుఁ డడరి నిశితశరవృష్టి నీలుపై నెఱయఁ గురిసె.

—♦ నీలునిచే మహోదరుఁడీల్గుట. ♦—

ఆ॥ ఆమహోదరుండు నమ్మెయిఁ బర్వత ధూర్వహంబు భిభంబు తోఁగలింప
మందరమున రశ్మిమాలినా దానిపైఁదనరి తఱిమి నీలుఁ దాఁకెఁ బెలుచ. ౧౦౬
తే॥ నీలగిరి నట్లు తోయదనియతిఁ గ్రమ్మి చాప మలశక్రచాపంబు సన్న నెగడ
గర్జ లెసఁగంగ విద్యుదుపార్జనమున కౌ ద్యుతులతో శరాసార మడరఁజేసె.
ఉ॥ అగ్నికుమారుఁ డట్లడరు నాజఘలం బడి ఛిన్నగాత్రుఁ డు
ద్విగ్నుఁడు స్తంభితుండు నయి వేగమె తెప్పిఱి యమ్మహోదరుఁ
భగ్నుఁ నొనర్ప నెంచి బహుపాదప మొక్కటిధరంబుఁ దచ్చిరో
లగ్నము సేసె వాఁ డిభము లావఱి జంటగ నేల నంటఁగఁ. ౧౦౮
తే॥ దంతితోఁ దొంతిగాఁ బినతండ్రి మోఁలె నశనిహతశైలయుగలీల నవనిఁ గూలఁ
దొంటి హనుమనితోఁ బోరె దొడ్డుసేసి నిశితశరతతిఁ బరపె నాత్రిశిరుఁ డపుడు.
ఆ॥ కఱకుటమ్ము లట్లు గాత్రమ్ము సోరఁ బాఱి నెఱకులంటి నొవ్వ నెఱయుటయును
వాఁడు గినిసి కొండవాలొండు గొని ఋవ్వ నసుర దాని ద్రచ్చె నస్త్రశక్తి. ౧౧౦
ఆ॥ భగ్నమయ్యె నాదు పవిసంగ మవిశృంగ మనుచు నాహరీంద్రుఁ డలుక గదురఁ
దొడరఁజేసెఁ దోన ద్రుమవర్ష మనుతర్ష మదియు రిపుఁ డెడల్చె నాశుగముల.
క॥ గర్జిల్లు నసురరాట్సుతు భర్జించుచు నెగిచి కరులఁ బంచాస్యము నాఁ
దుర్జయుఁడు వాసి వాజుల నిర్జరపతిహయనిభముల నిర్మూలించెఁ. ౧౧౨
తే॥ అంతకుఁడు కాలరాత్రి న ట్లలఁతిగాని శక్తిఁ జేకొని పౌలస్త్యసంభవుండు
పవనపుత్రునిపై వైచెఁ దివ్రఁబోకు మాట లడఁగెడు లెమ్మంచు నదరిపడుచు.
ఆ॥ మింటనంటి యుల్క మేల మాడుచు మంట లొంటఁ దనరుచుండ నొరయవచ్చు
ఘోరశక్తి నొడిచికొని హరిశార్దూలుఁ డలఁతి విఱిచివైచి యార్చిపేర్చె ౧౧౪
క॥ ఆశక్తి భగ్నమై పడ నాశనముం గాంచు నింక నైర్ఋతుఁ డని య
స్త్రాశంకు లగుచు మొరసిరి కీశవరు ల్మొగిళు లట్లు గిరిరాజసుతా. ౧౧౫
ఆ॥ సాంద్రహాస మెసఁగఁ జంద్రహాస మొకొండు దాల్చి యసుర వాయుతనయుఁ గదిసి
యడఁచె నతని యెడఁద నదరంట నది యుల్క యాకసమున నట్టులచటమెరసె.
తే॥ హనుమఁ డాఖడ్గనిహతిఁ దా నలఁతిసేసి తలముచే రాక్షసుని యురస్తలము వ్రేసె
ప్రస్తహస్తాయుధుండు నిస్సంజ్ఞుఁడు నయి యమితతేజుం డతఁడు దాన నవని వ్రాలె.
క॥ పడునపుడె వానిఖడ్గం బొడిచికొని ప్లవంగవర్యుఁ డుజ్జ్వలుఁ డైద్రుమ
క్కిడుల నదల్చుచు నార్చెఁ గడుఁబొడు గై కొండఁబోలఁగా నొడలొప్పఁ.
క॥ ఆనాదము చెవిఁబడి లో నానఁగ నవధాన మొదవ నదియె విధానం
బౌ ననఁ దేఱి యసుర పవమానజు దృఢముష్టిఁ బొడిచె మానని యలుకఁ.

క॥ పిడికిలిపోటునఁ దడబడ కడరెడు క్రుద్ధ నతఁడు సింగమట్టు లెగసి యా
వడువునఁ గిరీటమునఁ బట్టెడలఁగనీ కట్టె నిశిచరేభముఁ బట్టెన్. ౧౨౦
శా॥ స్పష్టాహంకృతితోడి దా తతసముత్సాహంబు వాటించి సా
వష్టంభుం డయి క్రోధ మొప్ప నిశితస్ఫారాసిఁ గోసె న్మహో
త్కృష్టంబు ల్సకిరీటకుండలము లై దీపించు తచ్ఛీర్షముల్
త్వష్టృప్రోద్భవు మస్తకంబు లచలవ్యాపాది యె ట్లట్లుగాన్. ౧౨౩
ఆ॥ వాని తలలు మూడు వరుస నవ్వసుధపై వ్రాలె ధరనిభములు వ్యాయతాగ్ని
దీప్తలోచనము లుదీర్ణముల్ రవిమార్గ మెడలి ధరకుఁ దొఱఁగు నుడులయట్లు,
తే॥ ఆక్రమంబున శక్రపరాక్రముండు దేవరిపుఁడు త్రిశీర్షుఁ డుద్రిక్తుఁ డైన
హనుమచేఁ ద్రెళ్ళ హరిబలం బడరె భూమి వడఁకె రక్కసు లటు దెస ల్వట్టి రబల.
చ॥ త్రిశిరుఁడు నమ్మహోదరుఁడు దేవనరాంతకులున్ రణస్థలిం
బశువులభంగి వ్రాలఁ దనపాటు దలంపక మత్తుఁ డుద్ధతిన్
వశమునరాని మానసము వైపున కొగ్గి ప్రకాండవేగుఁ డై
విశసనవృత్తికిం దొడరె విశ్వజనీనచరిత్రలక్షణా ౧౨౪

—♦ మహాపార్శ్వ మరణము ♦—

మ॥ ప్రలయాగ్నిప్రతిమానుఁ డమ్మెయి మహాపార్శ్వుండు సన్నద్ధుఁ డై
జ్వలదర్చిర్గణ స్వర్ణపట్టతతరాజద్భూష రక్తస్రగు
జ్జ్వల తేజోనిధి ఘోరసారకలిత న్సర్వాయసిన్ దిగ్గజా
విలతాపాదిని శోణితాక్త గద నుద్వృత్తిం బ్రచాలించుచున్. ౧౨౫
ఆ॥ పేర్చి తాల్చి కపులఁ గార్చిచ్చుకైవడిఁ బొదువ నరసి దొరసి పొల్చె నెదుర
ఋషభుఁ డగచరౌఘుఋషభుండు పృథుబలుం డసురబలము మెచ్చ కడరు కడిమి.
చ॥ ఎదిరి కడంక వానిఁ గని హెచ్చినకిన్కఁ బులస్త్యనందనుం
డద నిదె యంచు శైలనిభుఁ డా ప్లవగేంద్రు నురస్థలి న్మహా
భిమరనిభ న్గదం బదరి వ్రేసిన వ్రేటున భిన్నవక్షుఁ డై
పొదలుచు వ్రాలె నెత్తురులు బోరన నోల్కఁ ధరన్ ధరాత్మజా. ౧౨౬
చ॥ తెలివి యొకింతలోనె కని దిట్టతనంబున మట్టుమీఱి యా
వల ఋషభుండు వాని గద వారని బీరమునన్ హరించి క్రే
వలను మిణుంగుఱు ల్నెఱయ వావిరి ద్రిప్పుచు నప్పుదీర్ప నా
దలఁ దమకించి వైచె నవధాని యితం డని వేల్పు లుబ్బఁగన్. ౧౨౭
ఆ॥ వానివ్రేటు దగుల వరుసనె బలుతల వగులఁ గండ్లుఁ బండ్లు వలనులేని
యవియ కాఁగ నవియ నసురుం డుసుఱుఁబాసి నేలవ్రాలెఁ దుహినశైలబాల.

క॥ రావణసహోదరుం డై రావణనిభుఁ డట్లు గూల రహి సెడి యలుఁగుల్
గ్రేవల వైచి నరాదులు కేవలజీవార్థు లగుచుఁ గెడసిరి సుముఖీ! ౧౩౦
క॥ భిన్నార్ణవనిభ మిది యని యెన్నఁగ నై యసురబల మహీన మెడల న
ట్లన్నలుఁ బినతండ్రులుఁ బడఁ గన్నుల నిప్పుకలు సెదరఁగా నుజ్జ్వలుఁ డై. ౧౩౧
సీ॥ కొండమట్టునకుఁ బైకొండపో యిది నాఁగ నొఱపొందు బలితంపు టొడలు మెఱయ
బ్రహ్మదత్తవరప్రభావం బెడందలో దుండగం బందియఁ దొడరుచుండ
దేవదానవుల నిర్దిష్టులఁ బణముంచి గెలిచినదర్పంబు గిరికొనంగ
మోటువారల బల్మి పాటిసేయదు వీని రణవిద్య యనుచు జ్యారణన మడర
వేఁడివెలుఁగు లొక్కవే యొక్కటఁ బొసంగఁ గూర్చినట్టి కూర్పు గొఱలు నరద
మెక్కి నిక్కి చూచె నింద్రారి యాయతికాయుఁ డగచరప్రకాండబలము.
*క॥ హితులకు మే లహితులకు న్వెతఁ గూర్పఁగజాలువాఁడు వెరవరి యాతం
డతులితము దర్ప మేర్పడ నతిరావము సింహనాద మని పొనరించెన్. ౧౩౩
చ॥ తనదు కిరీటకుండలసుధామమణిద్యుతు లాత్మ తేజముం
బెనగొని దిక్కుల న్నెఱయఁ జే రెనయించుచు నించు గర్జలం
ఘనగుణనిస్స్వనంబులను గాసిలి వానరు లొసరిల్ల నా
పనిఁ బొనరింపఁగాఁ ద్రిదశపాలవిరోధి నిరోధి యా నెడన్. ౧౩౪
ఆ॥ అతనిఁ జూచి తొంటి యాకుంభకర్ణుండ మరలఁ దొడరవచ్చె మాన మనఁగఁ
గలదె యింక ననుచుఁ గడలొత్తుకొన హత్తుకొనఁ గడంగి రచలకూటచరులు.
తే॥ హరి త్రివిక్రమతం గన్న యల్లనాఁటి రూప మాతనియందు నిరూఢముగను
గనుపడం దేఱిచూడంగఁ గానివార లగుచుఁ దెరలిరి తరుచరు లసురదమని!.
క॥ అతికాయసంజ్ఞుఁ డతె తా నతికాయుం డతనిఁ గాంచి యగచరవర్యుల్
వితథేహు లగుచు నూర్మిళపతియన్న శరణ్యు శరణుఁ బ్రాపించి రుమా. ౧౩౭
ఆ॥ పెద్ద మే నెసంగఁ బిఱువ్రాక పెనుగొండబోని రథము నెక్కి పొలుచు విల్లుఁ
దాల్చి కార్మొగిలు విధంబున గర్జిల్లువానిఁ గనెఁ గకుత్థ్సవంశ్యుఁ డపుడు. ౧౩౮
క॥ స్మయమానముఖసరోజుఁడు దయమానహృదయుఁడు మేటి దాశరథి స్వకా
భయమాననలఁ గపుల నిర్భయమానసులం బొనర్చుపాడిఁ దనరుచున్. ౩౩౯
క॥ విభుఁ డఖిలశత్రుభీషణు విభీషణుం గాంచి చక్క వివరింపు సఖా
సుభటుఁడు వీఁడు విభాసురవిభాసమానుఁ డయి వెలయు విధ మెట్టిదియో. ౧౪౦
సీ. గట్టుపుట్టినపుట్టుకకు శృంగ మౌ దల మకుటకుండలము లమర్చినాఁడు
హయసహస్రముఁ బూన్చినట్టి స్యందనమునఁ దనరి కోదండంబు దాల్చినాఁడు
నిఖిలసామగ్రులు న్నెఱయ భూతములతో భూతేశువలనికై పొల్చినాఁడు
కాలజిహ్వాభశాక్తద్యోతవిద్యుత్తు లొలయఁ దా ఘనుఁ డయి యొప్పినాఁడు

చాలు నొక్కండె యిన్నిఁట సమరభూమి కనఁగ సభ్యసితుండయి యఖిలదిశల
వెలయఁజేయుచున్నాఁడు విశిఖశిఖలవెలుఁగు లెవ్వాఁడొ యీవింత వేఁడివెలుఁగు.
ఆ॥ హేమపృష్ఠములు మహేష్వాసములు మార్వలొప్ప నేకకలన నొఱపు నెఱప
నైంద్రచాపసంయుతాంబరంబు న డంబరంబు నూపు వీని రథవరంబు. ౧౮౨
తే॥ రాణ ధ్వజశృంగ రాహువిరాజితప్రతిష్ఠ మివ్వాని యరద మెుదీర్ణ మగుచు
సూర్యరశ్ముల హేతులఁ జొనుపు హేతుభావ మక్కజ మగుచు నేర్పడని దయ్యె.
తే॥ ధ్వజముతోడిపతాకలు దనర సానుకర్ష ముచితచతుర్యంత్రతర్క్షక్లిష్ట
మై స్తనితనిస్వనంబునై యమరె నిమ్మహారథము తాన దెసలెల్ల నాఁకపడుచు.
క॥ పది యెనిమిది యిరువదియును బొదు లున్నవి కార్ముకములు బొదలెడు నారు
లదియ నెలకొనుచు నష్టాపదపింగళ లవి నిజప్రభాపముఁ దెల్పన్. ౧౮౫
క॥ పదిచేతులపొడవున నున్నది ఖడ్గయుగంబు పార్శ్వసద్ధం బగుచున్
విదితచతుర్హస్తత్సరు వదె చాలు స్వీని నధికుఁ డనిపింపంగన్. ౧౮౬
క॥ త్రిణతము ఘననిర్హ్రాదము గుణసంగత మశనికల్పకూటాస్త్రము నై
రణవేది యితనికరమునఁ బ్రణుతం బింద్రధను వనఁగ బలుధను వొప్పెన్. ౧౮౭
ఆ॥ వచ్చుచున్నవాఁ డవార్యతేజుఁడు రక్తకంఠగుణుఁడు ధైర్యకలితుఁ డలఁతి
గాఁడు కాలమూర్తి కాలమహావస్త్రిఁ డంబుదంబుపైని యర్కుఁ డగుచు.
ఆ॥ కాంచనాంగదాఢ్యఘనభుజద్వయ మను తుంగశృంగయుగము తొంగలింప
మహితపర్వతోత్తమము హిమవంతంబు దనకు సాటి యనఁగఁ దనరె నితఁడు.
క॥ పొం దగు కుండలయుగిచే నందంబై యదితితారకాంతస్థను పూ
ర్ణేందవబింబంబో యనఁగం దనరెడు వీనిమోము కలితేక్షణమై. ౧౯౦
చ॥ భయ మెనయంగ నొకలఁకపాటునఁ దర్లుచునున్నవారు స
న్నయులు ప్లవంగమోత్తములు నా కెఱింగింపు మహాభుజా! జయం
బయహిత మా నలంచు నితఁ డఁదఱకుం దలకట్టటంచు ని
శ్చయ మిది తోఁచుచున్న దెదఁ జయ్యన స్వస్సదరాతివృత్తమున్. ౧౯౧

—♦ విభీషణుఁ డతికాయు నుదంతము రామునకుఁ జెప్పుట ♦—

ఆ॥ అట్టు లమితతేజుఁ డధిరాజపుత్రుండు రాముఁ డడుగ సుగుణరాశి తేజు
మెట్టు పుట్టుఁగన్నమేలు విభీషణుం డిట్టులనియెఁ దనమ హితవు నెఱయ. ౧౯౨
చ॥ ఎఱుఁగుదుగాదె రావణు మహేచ్ఛు మహామహు భీమకర్ము నే
డ్తెఱ నెల విత్తసారుఁడు కడిందిమగండు లసద్భుజుండు చి
చ్చుఱపిడు గీతఁ డాధనదసూనునిసూనుఁడు రాక్షసేంద్రుఁడ
క్కఱపడి ధాన్యమాలిని సకాశమునం గనె వీని నద్భుతున్. ౧౯౩

సీ॥ వృద్ధుల సేవించి వేదవేదాంగము లఖిలాగమంబులుఁ జదివినాఁడు
సర్వాస్త్రవిదులలో సారభూతుం డీతఁడే యను మేలిపే రెనసినాఁడు
నాగాశ్వరథవల్గనప్రేరణంబుల సరిలేని యేడ్తెఱఁ జాలినాఁడు
చతురుపాయాఖ్య యా సన్మంత్రశక్తి మద్భావిని యే యంచుఁ బలికినాఁడు
వీని బాహ్వవలంబంబు వెరయఁగాంచి లంక నలువొందుచున్నది శంకదక్కి
యప్సరస్సంభవుండు మహామహుండు ప్రథితుఁ డతికాయనాముండు రఘువరేణ్య.
ఆ॥ భావితాత్ముఁ డితఁడు బ్రహ్మనారాధించి యస్త్రశస్త్రవితతు లందినాఁడు
గెలిచినాఁడు సురల గిరికొని యన్యుల గెలికొట్టినాఁడు కీర్తి వెలయ. ౧౫౫
ఆ॥ వేయుమార్లు దేవవితతి దానవతతిఁ గొసరి తా దిసంతుగొట్టి యింద్రు
వజ్రమాఁగి యట్లె వరుణపాశముఁ బ్రతిహత మొనర్చి వీఁడు దయ్యె నితఁడు.
చ॥ పదరి స్వయంభువుండు పరిపాటిగ నెందు సురాసురేంద్రులున్
బొదలెడు వీని గెల్వ రని పొల్పెసలార వరం బొసంగున
య్యదనునఁ గూర్చె నీయ్యరద మద్భుతకర్మము దివ్యవర్మమున్
మొదల నవధ్యుఁ డయ్యె రవిమూర్తి హసించు వికాస మేర్పడన్. ౧౫౬
క॥ సామాన్యుఁడు గాఁ డివ్వాఁ డేమొయినేనిఁ దగు జతన మిప్పటి కిపుడే
నీమది సంభావింపుము దీమసమున నితఁడు కపులఁ దీర్పకయుండన్. ౧౫౭
తే॥ పురుషపుంగవ! శ్రీరామ! పుణ్యమూర్తి! నైరృతులు నిన్నుఁ జెనకి యేనాఁటికేని
బొడవుపడనేర్తురే? దాన భూరియశము నీకుఁ గూర్తురుగాక సన్నియతి తనర.
క॥ అనునెడ నాయతికాయుఁడు దనమగటిమి మెఱయ యుద్ధదర్పితుఁడై కా
ననచరవాహిని దరికొని ధను వాస్ఫాలించి యార్చెఁ దద్దయుఁ గడఁకన్.
ఆ॥ భీమమూర్తి వాఁడు పృథివి కాకసమున కొక్కఁ డగుచు రథము నెక్కి నిక్కి
యనికిఁ దొడరినంత నగచరోత్తములు మహాత్ము లెగచి నిట్టలాక్రమించి.
క॥ గిరిశృంగంబులు దరువులు సరభసముగఁగొంచు నొకట శరభకుముదకే
సరిమైందద్వివిదర్షభ మరుత్సఖాత్మజులు నెఱయ మార్కొని వైవన్. ౧౬౨
సీ॥ కాంచనపుంఖము ల్గల శరమ్ముల నోలి శైలవృక్షౌఘము ల్చక్కుసేసి
సర్వాయసములు ససారంబు లగు మేటినారాచముల వారి నడలడంచి
వెడవాతియమ్ముల విసువక పరఁగించి చెక్కుడపుంబని చక్క నెఱపి
నిశితాస్త్రచయముల నెఱకులు నోనాటి యతిరభసంబున నార్చి పేర్చి
భీమకాయుఁ డాజిభీముఁ డయ్యతికాయుఁ డడర భగ్నగాత్రు లగుచు నేటు
పాటు వీడి యొందుభంగికిఁ జొరలేక యోలమెంచు చొదిఁగి రుత్పలాక్షి. ౧౬౩
క॥ హరివీరసైన్య మసురుఁడు హరి మృగయూథంబు నట్టు లటిముటి వడ నా
పరుసునకుఁ దెచ్చి యావనపరిశ్రుధ ల్దన్ను దర్పభరితు నొనర్పన్. ౧౬౪

క॥ ఈహరివాహిని యిమ్మెయి నోహరిసాహరిఁ బెనంగు నోజకుఁ జెడి పై
యూహాఁగొన కోహటింపఁగ సాహసమున రిత్త దీనిఁ జమరంజనునే. ౧౬౫
క॥ అని రామునిఁజేరంజని తనతూణీరంబు ధనువుఁ దద్దయు మెఱయన్
దనరుచు గర్వితుఁ డై యిట్లనె సురరిపురాజతనయుఁ డాతనితోడన్. ౧౬౬

—♦ అతికాయుఁడు రామునితో మాటలాడుట. ♦—

మ॥ అనిసేయం జనుదెంచినాఁడ నెదు రై హా నిల్వఁడొక్కండు స్వం
దనమం దే శరచాపపాణి నయి మాద్యల్లీల నల్వొంది యే
మని యీప్రాకృతసంఘము న్గెడపఁగా నో వాఁడ నేవాఁడయే
ననుభావంబున మించి న న్నఱుము దాయన్ బోల నూహింపుమా. ౧౬౭
ఆ॥ అట్టివానిఁ గూర్పు మప్రాకృతుని యుద్ధభిక్ష వాఁడొసంగఁ బేర్మిగాంచు
వాఁడ నట్లుగాని వలనెంచి తేని నీనేర్మి సూపు మిదిగొ నిలిచినాఁడ. ౧౬౮
ఉ॥ మానము లే దనంగ ననుమానము లే దొకయింత రాజస
న్మానము గాన వున్కియు వినాకృత మేనయ మెన్న రా దెటో
మానిసి వైతి మార్కొన సమానుఁడవే కులగోత్రసద్గుణా
ఖ్యానము లొప్పునే తనప్రయత్నమున న్నెఱయింపఁజూచినన్. ౧౬౯
శా॥ మీా నై వారిధిలోఁ జొరంబడిన నేర్మిం గట్టు మోయింప ను
డ్డీనంబుం బొనరించిన న్బుడమిఁ గ్రోడీకార మూహించినన్
గోనం బం డ్లికిలించినన్ దెరలి భిక్షుత్వంబు గైకొన్న నా
త్రానం దల్లినిఁ దండ్రిఁ గూల్చినను నిధ్యానించి ని న్మెట్టెదన్. ౧౭౦
ఆ॥ ముసలి వైన శాంతి మొనకొని యని మాననైనఁ గలికివైన నసముఁ గోరి
నిన్నుఁ బోవనీను నీమీాఁది లక్ష్యంబుఁ దలఁగనీను నాదుతలఁ పరయుము. ౧౭౧
ఆ॥ అనుచు నొడువువాని యానుడి వినినంతఁ గ్రోధమున సుమిత్రకొడు కమిత్ర
హంత దాఁగృతాంతు నంత యై విలుదాల్చె నసురు పరుసదనము నలఁతిసేసి.
మ॥ పదిలం బౌ పొదినున్న దొడ్డశరము న్బాటించి పా టించె యా
మదవద్దైత్యు దహింపఁబోలుకడఁక న్మానం బనూనంబుగాఁ
బ్రబదరాసంబున నారిఁ దీర్చె రిపుసంత్రాసాచితిన్ భూమిభూ
ధ్రదిశావ్యోమసముద్రము ల్మారయ భూతత్రాత మగ్గింపఁగాన్. ౧౭౩
క॥ ప్రతిభయగుణనిర్ఘోషం బతిస్మయుఁడు విస్మితుండై యగుచు విన న్స్వః
పతి వైరికొడుకు బల ముద్ధతి తేజము నగ్గలముగఁ దనరుచునుండన్. ౧౭౪
క॥ కుపితుం డై యతికాయుం డపరిమితారంభు భరతునసుజుం గని తై
క్ష్ణ్యపరీత మొక్కశర మయవిపరీతతఁ దలఁప కొరసి వెస ని ట్లనియెన్. ౧౭౫

ఉ॥ బాలుఁడ వీవు కయ్యముల పాడి యెఱుంగవు మిత్త్రిపౌరుషం
బాలము సేసి పైకొనెద వాలము నీ కిది పోల దే సుహృ
జ్జాలము నేనిఁ గూర్చుకొనఁజాలి సమాను నదల్పఁబొమ్ము మ
ర్త్యాలపితంబు గా దమరు లైనఁ గడంగరు నన్ను మార్కొనన్. ౧౭౬

—♦లక్ష్మణాతికాయుల ద్వంద్వయుద్ధము♦—

క॥ మద్బాహుసృష్టబాణము లుద్బుద్ధము లగుచు వేగ మొలసి పయికొనన్
క్రోద్బలమున మొగకొనునే చిద్బ్రంహితుఁ డచలభర్త క్షితియు న్నభమున్.
ఆ॥ నను సుఖప్రసుప్తు నడలార్చు కాలాగ్ని నేల బాధసేయ నెంచె దింక
విల్లు నమ్ము లునిచి వెడఁబాసి చని మను మనుజుమీఁది యాస వెసఁగ కున్నె.
క॥ నిలఁబడు మటుగాకున్నం జలమున నెదిరించి ప్రాణసంచయ మెడయన్
బలమఱఁ గానంజనె దావల వైవస్వతు పురంబు వల నేర్పడఁగన్. ౧౭౯
తే॥ చూచితే నాదు బాణము ల్సునిశితములు వైరిదర్పనిషూదనవలితంబు
లీశ్వరాస్త్రసంకాశంబు లిద్ధహేమ భూషణంబులు స్వజనసంతోషణములు. ౧౮౦
క॥ అగపడు నిప్పుడ పో యీప్రగుణం బగు శరము తనపిపాస తలఁగ మే
లగు రక్తముఁ గ్రోలఁగ నలమృగరాజిభరాజు నటుము మెల పేర్పఱుపన్.
ఆ॥ అనుచుఁ బలికి వేఁడియలుక వాడియలుంగు మోడి మెఱయ వింట వాఁడమర్చెఁ
దోడివాని మదముతోడి దా నప్పలు కోర్వ కిట్టులనె రఘూద్వహుండు. ౧౮౨
ఉ॥ ఓరి!దురాత్ముఁడా!పలికె దోటమి లే కిటు మాటమాత్రనే
పూరుషధర్మ మొప్పునె విభుత్వము పాల్పడునే తలంగ కి
ప్పోరున నిల్వు మెల్లయొడుపుం బొడుపు న్వెలయంగఁజేయు మే
నోరిమి నేటుసేసితి ధృతోచ్చశరాసుఁ డ నై రణార్థి నై. ౧౮౩
ఆ॥ పొగడుకొనునె యెంతపొగరున్నఁ దన్నుఁ దాఁ బౌరుషంబు నెఱపి ప్రబలుఁగాక
శూరుఁడైనవాఁడు చూపెట్టు మింక శస్త్రాస్త్రశక్తి వట్టి యఱపు లేల. ౧౮౪
సీ॥ పడునేమొ నీతల పాపంబుపండిన తాటిపం డన వీడి ధరణిపైని
మద్బాణజాలము ల్మర్మము ల్సోనాటి త్రాగునేమో?నీప్రధానరక్త
మబ్బురం బై తోఁచు నరదం బధిష్టించి తఖిలాస్త్రసంచయ మవధరించి
తింక సందియ మేల?యీతండు బాలుఁడో వృద్ధుఁడో నీకయి వెలసినాఁడొ
పిన్నవాఁడు గాఁడె పేర్చి మూడడుగుల నలమఁడే జగత్త్రియమ్ము విష్ణుఁ
డగునె దుండగమున నాక్షేపణ మొనర్ప జాణతనము మెఱయఁ జఱచుతఱిని.
క॥ నీపాలిమిత్తి యనుకొని యోపిక నెయి దండడింపు మోలముగొనఁబో
కాపయిఁ గానగు నదె యగుఁ బాపముఫల మిట్టి డనుచుఁ బ్రజ లాడఁకొనన్.

ఆ॥ అనుచు హేతుయుక్తమై పరమార్థమై తనరుపలుకు పలికి దాశరథి క
డంగ వాఁడు గడుకడంకమై మేలి తూపొకర వింటఁదాల్చి యురవడించి. ౧౮౭

క॥ మండిపడి వైవ నడరుచు నుండం దివి దివిజదానవోరగముఖ్యుల్
నిండి నెలకొనిరి పున్నెము పండువు సౌమిత్రి యుద్ధపటిమ మరయఁగన్. ౧౮౮

ఆ॥ ఆకసము గ్రసింప నౌ నిది యన రయమారఁ దొడిగినట్టి యాశరము మ
హాశరుండు విడువ నాశీవిషోపమం బదియు రాఁగ జనవరాత్మజుండు. ౧౮౯

క॥ పరవీరహంత యాతం డరవాయి గొనంగ తోనె యాప్రవర మొకం
డర నెలయమ్ము నయమ్మున సరాళముగఁ బూన్చి యేసి చక్కొనరించెన్. ౧౯౦

ఆ॥ కృత్తభోగ మగుచుఁ గెడయు మహోరగ మట్టు లది విభిన్నమై పడంగ
వాఁడు బిట్టు కనలి వాలమ్ము లేనిమ్మిగా ధరించి పఱపెఁ గమలనయన!. ౧౯౧

క॥ అవి యప్రాప్తంబులయై యవియ నొనర్చె నృపతనయుఁ డాశుగములనై
కవియునె ఘనుఁ డస్త్రకలాకవి యురవుగ మెలఁగ నెదిరికల్పన లెవియున్.

క॥ పరదర్పఘ్నుఁ డుదీర్ణుఁడు భరతానుజుఁ డపుడు మార్వీఁ బరఁగించె మహా
శర మొకఁడు దే జెసఁగ నాశరపతిసుతు పొగ రడంచు సన్నాహమునన్. ౧౯౩

తే॥ దాని నాకర్ణకృష్టంబుగా నొనర్చి వీర్యవంతుండు వానిపై విడిచెఁ బేర్చి
యదియు రాక్షసు సులలాటమంటఁదాఁకి మగ్నమై యొప్పె మాఱ్తు బుష్టలిక మంద.

ఆ॥ రక్తమురల వాఁ డలక్తకారక్తుఁడై పొసరె బాణమల్లె పొసఁగి మేరు
భూధరంబు నందుఁ బొలుపారు నురగేంద్ర మనఁగఁ దనరె నప్పు డచలతనయ!.

క॥ ఉర వడఁగి వడఁకె రక్కసుఁ డరసావై రౌద్రబాణహతము త్రిపురగో
పుర ముపమితముగఁ బీడాకరుఁడే తన కితఁ డటంచుఁ గలఁగినమతితోన్. ౧౯౬

ఆ॥ ఊరడిలి విమర్శ మొనరించి యమ్మహాబలుఁడు శత్రునూజుఁ బ్రస్తుతించె
మేలు మేలు నిన్ను మెచ్చవచ్చును నాకుఁ దగు నరాతి వంచుఁ దలఁపుఁ దెలిపి.

క॥ ఆతనితో నిట్లని తనయాతంకం బెడల వదన మవనతముగ సం
స్ఫీతములు భుజము లుచ్చైర్ణితనియమితములు గాఁగ నెఱయించి వెసన్.

క॥ ఎసలారు తేరి మొగమున నసురులు దేఱంగ నమరి యారథచారం
బస దనఁ బోలక యుండన్ బొసఁగించుచు నేటుకొని విభుత్వము వెలయన్.

క॥ అహితుండికుండు భోగుల వహి నిరుమూడైదు నేడు వరసాయకముల్
వహియించెను మెఱయించెను మహితోచితదివ్యరత్నమాలా!బాలా!. ౨౦౦

క॥ సంధానగుణాకర్షణ సంధుక్షణధర్షణము లెసంగఁగ రక్షో
బాంధవుఁడు పఱపె సురయోధాంధంకరణము లనంగ నవు నవ్వానిన్. ౨౦౧

ఆ॥ అవి కృతాంతనిభము లసురనాథసుతోరు చాపవిచ్యుతములు స్వర్ణపుంఖ
ములు రవిప్రకాశము లొనర్చె దీప్తమై యంబరంబుదెస కరంబుఁ బొసఁగ.

ఉ॥ రక్కసుఁ డట్లు పంచిన శరప్రకరంబుల రాఘవానుజుం
డుక్కున మించి కాంచి విలయోగ్రుఁడ వై శితసాయకంబులన్
ముక్కలు సేసివైచె సురముఖ్యులు వాని యసంభ్రమంబుఁ జే
రెక్కినలాఘవంబుఁ గని యెన్నినజో దనుచు న్నుతింపఁగన్. ౨౦౩
ఆ॥ తనదు ప్రదరములు వృథాస్థూలతూలము ల్గాఁగ నాగ్రహంబుకలన మించి
త్రిదశవైరి నిశితదీప్తశరం బొండు దాల్చె సురలు మునులుఁ ద్రాస మొంద.
క॥ దానిన్ సంధానించి ప్రభానూన మొనర్చి వైవ నదియు సుమిత్రా
సూను సువిశాలవక్షం బాని చొరం బాఱుటయు మహామహుఁ డలుకన్. ౨౦౫
ఆ॥ దానిఁ బెఱికి వైచి తద్దయు రుధిరంబు దొరఁగ మదజలంబుతోడి ద్విపము
నాఁగ నొప్పి వాఁడు నాగాధిరాణ్మూర్తి యపుడె తీక్ష్ణశస్త్ర మవధరించి. ౨౦౬
క॥ జ్వలనాస్త్రయోజితం బుజ్జ్వల మరివైపై నిగుడఁజేయఁ జయ్యన నసురుం
డలఁతిఁజనక సౌరాస్త్రము సులక్ష్యముగఁ బూన్చి వైచె సుర లరుదందన్. ౨౦౭
తే॥ అంతకుని కాలదండమో యనఁగ వచ్చు రాఘవానుజు నస్త్ర మమోఘ మెదిరి
యసురసూతి ప్రయోగించినట్టి హేతి పోరఁగాఁజొచ్చె రోదసు ల్బోరుకొనఁగ.
క॥ తేజోదీప్తాగ్రంబులు రాజద్భుజగములు నాఁగ రారా పొఱి పా
నోజం బెనఁగెఁ బ్రయోజిత మోజం బొప్పారఁ దన్మహోగ్రాయుధముల్. ౨౦౯
ఆ॥ కడఁగి కూలె నేలఁ గాలి యాఱిన కట్టియలె యనంగ రూప మందరాక
భస్మశేషములుగఁ బాడ్వడి నెఱివీడి యెదిరి కుభయసత్త్వ మేర్పడంగ. ౨౧౦
క॥ అతికాయుం డతిరోషుం డతిమానకృతాగ్రహుండు నై యైషీకం
బతిరయమునఁ బఱపిన రఘుపతియనుజుఁ డెడల్చె దివిజపతియస్త్రమునన్.
ఆ॥ కనలి రావణాజుఁడు కైనాశ మస్త్రంబు యోగవత్ప్రయోగయుక్తి నెఱప
నాజిజుండు మారుతాస్త్రంబు బలిమి నడంచె దాని దివిజు లెంచి పొగడ. ౨౧౨
మ॥ శరధార ల్బరఁగించు తోయదమునోజన్ లక్ష్మణుం డుద్ధతిన్
శరధార ల్వరపంగ నాశరుఁడు బల్ శైలంబునా నొప్పె న
బ్బురమయ్యెన్ సహావజ్రపాతములు నాఁ బోలంగ నౌ వానికిన్
దెరువీ దబ్బలితంపు మే ననుచు బ్రాఁతిం గాంచు నవ్వారికిన్. ౨౧౩
ఆ॥ వాఁ డమోఘలక్ష్యవరపాతదక్షుండు వాఁడియలుగువాన వమ్ము గాఁగ
ఘనమహేషుకల్పకల్పనం బొసగూర్చి యదియు నిష్ఫలంబ యైనఁ బదరి. ౨౧౪
తే॥ అసురవరు రథసూతధ్వజాశ్వవితతి బాణమయి గాఁగ నొనరించి పరుఁడు భోగి
భోని శర మేయ నొచ్చి తోడ్తోన హెచ్చితద్వధోపాయ మూహామైఁ దడవుచుండ.
క॥ తగ వెఱఁగి జగత్ప్రాణుఁడు జగజెట్టి న్వానిఁ జేరఁజని యిప్పాటన్
నొగులఁ డభేద్యకవచధృతి మగసిరిఁ గన్నాఁడు పోటుమానిసి యగుచున్.

ఆ॥ ఇంతెకాక ద్రుహిణుఁ డిచ్చె నవధ్యత్వ మెవ్వఁడేనిఁ జెనకి హీను లౌదు
రడఁగ నీవు మామకాస్త్రంబునం దక్క నని తపఃప్రసక్తిఁ గాత్మ మెచ్చి. ౨౧౮

క॥ భేదింపుము బ్రహ్మాస్త్రముచే దైత్యు న్వలనుమీఱు సిరిఁగొను మీతం
డేదాన నవధ్యుఁడు గాఁ డాదిట్టం బైన కవచ మంచుట ననఘా. ౨౧౯

ఆ॥ అనుచు బోధసేసి యనిలభట్టారకుం డరుగ నింద్రతుల్యుఁ డౌ సుమిత్ర
కొడుకు భావ మెంచి గొనకొనె నయ్యమోఘాస్త్రయుక్తిఁ శరము ననువుపఱుప.

ఆ॥ ఆమహాస్త్ర మాతఁ డరివోయునంతనే కడలు చంద్రతారకాగ్రహములు
నభము పృథివి దివసనాథుండును వడఁక నసురుఁ జెదఁ గలంగె ననువుసెడఁగ.

—♦ లక్ష్మణుని బ్రహ్మాస్త్రమున నతికాయుఁడు హతుఁడగుట. ♦—

తే॥ బాణము సుపుంఖ మశనినిభముకృతాంతహూతకల్పము వాఁడేయఁ దొడరునపుడ
మింటికిని మంటికినిఁ జాలు మెఱుఁగు లిడుచు గంటిలేనట్టి జ్వలనప్రకాశ మొదవె.

చ॥ విడిచె సువర్ణవజ్రమణివిశ్రుతపుంఖ మమోఘవేగ మ
ట్లడరెడు బాణరాజము సురారితనూజునిపైఁ గడంకమై
నుడుగనికిన్క రాజసుతుఁ డుజ్జ్వలమై యది యేగుదేర నే
ర్పడఁగనె రక్కసుం డెదిరి పన్నక మౌ నవిపన్న మం చొగిన్. ౨౨౨

తే॥ మిన్నకుండక పోటరిమిన్న వాఁడు పన్ని పరఁగించె సాయకప్రతతు లదియు
నన్నిఁటిని దునుమాడుచు నడరెఁ బ్రలయకాలకాలాభమై మహోగ్రప్రసక్తి.

ఉ॥ ఉసుఱులార్పఁగ వచ్చునాశరముపై నొంటిన్ గదాశక్తియ
ష్ట్యసిశూలాదు లనేకము ల్వఱపి విద్యాయుక్తిఁ భేదింపఁ బెం
పెసలారం దమకించె నాశరుఁడు లోకేశాస్త్ర మవ్వాని నె
ల్ల సురాళించుచుఁ జేరెఁ బట్టి విభులీలాలోలదాశాంతమై. ౨౨౪

ఆ॥ మింట మంట లెసఁగ నంటదాఁకి కిరీటజుష్ట మసురశిరముఁ జుల్క నాహ
రించె సురలు పొగడురీతు లాసురుల హాహారవంబు లొకట నానహిల్ల. ౨౨౫

క॥ సౌమిత్రిబాణపీడితమై మిడుకుచు దైత్యు శీర్ష మవనిం గూలెన్
హైమనగశృంగమో యనఁగా మండనకాంతిపూరకలితం బగుచున్. ౨౨౬

ఉ॥ పచ్చిసెడంగ నౌ నెదలఁ బాములు వుట్టఁగ నిల్వ లే కెటో
విచ్చిచనంగ నైన పరవీరులు శ్లిష్టవిభూషణంబు సం
పచ్చలితంబు భూతలనిపాతిత మాదివిజారిమస్తకం
బెచ్చిన యార్తిమైఁ గనిరి హీనదశాప్రవిభాగ మేర్పడన్. ౨౨౮

క॥ రహిసెడ నేడ్వందొడఁగిరి ప్రహరజనితశ్రములు విపన్నులునై వా
రహిఁ బోల్పం జను దయితుఁడు నిహతుఁడుగాఁ బోరియాస నెట్టనఁ దలఁగన్.

క॥ త్వరితులు దీనాననులు న్నిరపేక్షులు నగుచు నున్న నిశిచరు లెల్లన్
బురి కభిముఖు లై భీతిన్ జరియించిరి విస్వరములు స్వరములు నిగుడన్. ౨౨౯
తే॥ వానరానీక మెల్లఁ బ్రబుద్ధసరసిజాననం బయి యానంద మతిశయిల్లఁ
బ్రబలు రిపుఁ బోరిగోని యిష్టభాగి యైన లక్ష్మణుం బూజసేసెఁ గలాసమగ్ర!
ఆ॥ అంతలోనె చారు లతికాయుపా టొకపాటఁ దెలుప వీర్యభరితుఁ డైన
లక్ష్మణేంద్రు చలము లా వెంచి యుద్వేగమందె మందభాగ్యుఁ డసురవిభుఁడు.
సీ॥ శస్త్రభృద్వరుఁడు ప్రశస్తుం డమర్షి ధూమ్రాక్షుండు మడిసె నొయ్యన నకంప
నుండు గండడఁగెఁ బన్నుండెఁ బ్రహస్తుండు కుంభినిఁ గూలె నాకుంభకర్ణుఁ
డపరాజితులు రిపుహంతలు ఘను లింతవట్టువా రధికు లవార్యతేజు
లన్యు లేనియు శూరు లట్లు మహాకాయు లెందఱెందఱు పడి రీకలనున
నెదిరిబల ముల్లసిల్లెడు నే మనంగ వచ్చు నక్లిష్టకర్ముండు వరగుణుండు
రాముఁ డొప్పారుచున్నాఁడు ధామ మెసఁగఁ గర్మబల మవిజ్ఞేయంబకాదెయెందు.
మ॥ బలవీర్యంబు లసంవరంబు లగుచున్ భాసిల్ల నాపుత్రుఁ డిం
ద్రలఘుత్వప్రతిపాది యమ్మెయి మహాదర్పాఢ్యులన్ భ్రాతలన్
సులభాపాయులఁ జేసి కట్టి విడిచెన్ జొక్కొంది యవ్వారు దు
ర్బలు రై రేగతిఁదేటిరొక్కొ విధి ప్రాబల్యంబు నిర్ధార్యమే. ౨౩౩
ఆ॥ బ్రహ్మదత్తవరనిబంధ మాబంధ మయ్యది సడల్ప బ్రహ్మకైన నరిది
సురల కగుట యె ట్లసురు లైన నేర్తురే యితర జనుల మాట యెంచ నేల.
తే॥ ఎంతటిప్రభావమో మాయ యేమొ మోహ సప్రయోగవిధంబొ కానంగఁబోల
దంతలోన విముక్తు లై రంత మున్నె వారిమహిమ విమర్శించువలని కైన. ౨౩౪
శా॥ ఏయోధు ల్పురి నిర్గమించి చనిరో యెంతెంతవా రేని యు
న్వేయేలా హతు లైర కాని యొకఁడేని న్మర్లఁబోఁ డింతకున్
శ్రీ యుత్సాహము పెంపు సొంపు నచటం జేడ్పాటు లిచ్చోటునం
దాయెం దాయుల నాఁగ నొ వలను కద్దా యింక నెవ్వానికిన్. ౨౩౫
ఆ॥ అంతవారు వార లననేల వానరు లెంతవారు గా రహీనబలులు
వంతునకును వారివారిలో నొకఁడేని మడియఁబోఁడు మీఁదిమాట గలదె.
క॥ ఏ నెన్నఁజాల నీఁక సీతానాథుఁ దదనుజుఁ బ్లవగతతిఁ దత్పతి న
ట్లా నెటి విభీషణుని నెటు బోసీ కడఁగింపనేర్చు పురుషోత్తంసున్. ౨౩౬
మ॥ అవురా సాహస మద్దిరా బలము దివ్యాస్త్రప్రభావంబు సం
స్తవనీయం బగుఁగాదె రాముఁ డొకఁడే దర్పాఢ్యుఁ డవ్వావి దా
ప్రవరప్రక్రమవిక్రమాకలనచే బ్రహ్మాస్త్రమే రిత్తవో
వొ విభుం డీశ్వరుఁడే యతం డసఁగరాదే తత్త్వ మూహించినన్. ౨౩౭

మ॥ పిహితద్వారకవాటతోరణయుతం బెంపేద నీలంక యం
క హతప్రాయగఁ దోఁపకున్నయది యేక్ష్మానాథు ధాటిన్ బలే
యహితధ్వంసకుఁ డయ్యానామయుఁడ కాఁడా? యాదినారాయణుం
డు హతాశు ల్సురలే ఘటించి రిది తోడ్తోఁ దెల్లమై యిప్పుడిన్. ౨౮౦

తే॥ అప్రమత్తుల రగుచు మీ రందఱునుఁ బురాభిరక్షణకృత్యమే యవధరింపుఁ
డుసుఱు లున్నంతవట్టు నే నోసరిలక పొలఁగువాఁడ మగంటిమిమేల్మి నెగడ.

ఆ॥ స్వీయబలములెల్లఁ జీకాకుపడకుండఁ జొచ్చి గుల్మవితతి చోట్ల వెరస
యుండునవియ కాఁగ నురవుమై నాయాజ్ఞ సెల్ల నెఱపుఁ డిట్టిప్రల్లదముల,

క॥ సీతాభిరక్షణంబున కేతావత్కాల మెచ్చొ కేర్పఱుపఁబడెన్
జ్ఞాతము నాకై చెల్లెడు మాతావు ప్రవేశనిర్గమాస్పద మగుచున్.

ఉ॥ వానరులే యటంచు నెఱి వాయ నవజ్ఞ పొనర్పఁబోల దె
వ్వైనియతిం జరింతురొ యహీనతఁ జొత్తురొ యెప్పు డెచ్చటన్
బూనిక నుందురో తొడరి పోరఁగ సంజల రేఁబవళ్ళ సం
ధానము లెంచ నా ధృతిన దానవు లుండురుగాత మింకిటన్. ౨౮౪

క॥ అని నిర్దేశించిన వా రనుశాసనవర్తు లగుచు నయ్యోపనులం
బొనరింపఁజనిరి రావణుఁ డనుపదమె స్వశాలయంబు నందెఁ బురంధ్రిన్. ౨౮౫

తే॥ మన్యుశల్యాకులుఁడు దీనమానసుండు నగుచు నిట్టూర్పు లెడలంగ నొగులుచుండె
నెదిరిగుఱియల్క తన్నెదహించుచుండ నెదియు నొదవింపఁగాని యయ్యుఱకటమున.

ఆ॥ చేరి యట హతావశిష్టులు రాక్షసుల్ రాక్షసేశ్వరుం బిరానఁ గాంచి
నరసురాంతకులు త్రిశిరుఁ డతికాయుఁ డున్మత్తమత్తు లొకట మడఁగిరనుచు.

క॥ కన్నుల నీ రొలుకఁగ వారన్నరిఁ దెలుపంగ వినినయంతనె వల నే
ద న్నేల వ్రాలె నాతఁడు మున్నగు పిడుగుపయిఁ గొఱవి మొనయుట గాఁగన్.

ఆ॥ తెలివిగాంచి యొంటఁ దెప్పిర్లి యశ్రుపరిప్లుతాక్షుఁ డగుచు రీతి సెడఁగ
నట్టితనుజు లనుజు లాఱడిపోకపాలైరె యనుచు నొడివి యడలియడలి. ౨౮౯

ఉ॥ సంపద నేఁటిమల్లడిన జాఱె నిఁకే మని శోకవార్ధిలో
సంపరిప్లువానుఁ డగు జాడనె తండ్రినిఁ గాంచి యింద్రజి
త్తంపఱ గల్గ నేఁ గలుగ నక్కట యిమ్మొయివాఁడ వౌదె నీ
పెంపు దలంపకుంట తగవే పరికింపుము మన్మహోన్నతిన్. ౨౯౦

తే॥ అసురేంద్ర! యింద్రారిబాణాభినిహతుఁ డెవ్వఁడు సమర్థుఁ డని జీవితేచ్ఛఁగొనఁగ
నుసుఱు లున్ననుఁ దనతొంటియోజ కగునె మఱచితే నాఁటిరణములు మద్గుణములు.

తే॥ కాంచు మీనాఁడు రాములక్ష్మణసమేతు స్వాశుగవిభిన్నదేహు గతాసుమహిత
గాత్రనిచయాచితకలంబు క్ష్మావిలంబు వేగిరం బేల మాటలు వేయునేల.

ఆ॥ వినుము శక్రశత్రువిశ్రుత నిశ్చితమైన ప్రతిన పౌరుషాభియుక్త
దైవబలపరీత దాశరథులఁ గూర్చి శరథులుగ మదాత్తశరతతులకు. ౨౮౫
మ॥ బలిజన్మంబున వెన్నుఁ డెట్టు లటులే ప్రాగ్భార మొప్పార మ
ద్బలవిక్రాంతు లెసంగఁ జేయుతఱిఁ ద న్బ్రస్తోత్ర లై కాంచువా
రలఘు ల్జిష్ణుయమానిలానలజలాధ్యక్షార్క-చంద్రోరగేం
ద్రులు ము న్నా తెగుదార్లు దారి యిఁక నెందుం దోఁప దం చార్తులై.
ఆ॥ అనుచుఁ బొనరఁ బలికి యమరేంద్రశత్రుం డదీనసత్త్వుఁ డుఱిది తేటపడఁగ
నతనియానఁ గొంచు నరిగె సాంగ్రామిక మరద మెక్కి దిక్కు లదరుచుండ.

—♦ రావణు విషాద మపనయించి యింద్రజిత్తుని కేతెంచుట ♦—

క॥ ఆరథము హరిరథోపమ మారాక్షసవిభుఁడు తనయుఁ డారోహింపం
గా రాము గెలువు మనుచుం గారామున నిడెఁ బొసంగఁగా దీవెనలన్. ౨౮౬
ఆ॥ అట్టు లురవడించు నాయరిందముతోడఁ బిడుగుతోడి కొఱవిపిండు లట్లు
గూడముట్టిచనిరి కూళ లౌ రక్కసు లరిదిసన్నహనము లడర ధరజ. ౨౮౭
చ॥ అరుస మెసంగ రక్కసు లహంయులు నెక్కొనువానిప్రాపునం
బరుసదనంబు మీఱ శరపాణులు ప్రాసగదాసిశక్తిము
ద్గరముఖసాధనోద్వహులుగా రథనాగహయాధిరూఢు లై
వరుస పొసంగఁ దోడ్పడిరి వాకొని దిక్తటము ల్చలింపఁగన్. ౨౮౮
శా॥ భేరీశంఖనినాదము ల్సెలఁగ నిర్భీకా!రణోగ్రా!మహేం
ద్రారీ! యంచు నుతించు దానవుల వాగ్వ్యాసంగము ల్మీఱఁగా
వీరోత్తంసున కాతపత్ర మిడి రవ్యాక్రాంతుఁ డద్దానిచే
నీరేజాతసపత్నుచే నభము మన్కింబోల నొప్పారఁగాఁ. ౨౮౯
ఉ॥ హేమవిభూషితంబులు సమిద్ధము లౌ వరచామరంబులఁ
ధామనిధిప్రతాపు సవిధంబున నిల్చి పొసంగ వీవ నై
రామెయిఁ బొల్చు రక్కసు లయత్నజయం బొనఁగూర్చుపొంకె ను
ద్దామవికాస యశః సిరి తథాకృతులం గనుపట్టెనో యనఁ. ౨౯౦
శా॥ ఆలంకాపురి యట్టివేళ నమరేంద్రారాతిరాట్పుత్రుఁ డ
చ్ఛాలంకారవిశేషయోగకలనాసాపేక్షతేజోమయ
శ్రీలాలిత్యమునం బొసంగ రుచిరస్థేమాకృతిం బొల్చెఁ దాఁ
బోలం ద్యోస్థలి చండభానుకిరణస్ఫూర్తిద్యోత మెట్లట్టుగాఁ. ౨౯౧
తే॥ అమ్మహాతేజుఁ డాజిరంగాంతరమ్ము సొచ్చి చెచ్చెర నిలిపెఁ బ్రస్తుతముఁ గూర్చి
తేరిచుట్టు నుద్దీపించు దితిజబలముఁ జలమువలనున కెద బాఱ సాచుచుండ.

క॥ హుతభుక్సదృశప్రభుఁ డాహుతభోక్తం గూర్చి మంత్రయోగవిధివదూ
ర్జితముగ హోమ మొనర్చెను జితలక్ష్మి వరింపఁ దనదుచేడ్పా వెడలన్. ౨౬౩
తే॥ గంధమాల్యపురోగసంస్కారయుక్తతతహవిర్లాజతతులఁ బ్రతాపవంతుఁ
డసురరాజతనూజుఁ డ ప్డనలు వేల్చె వేల్పులమొగం బనక వాని వేఱు సేసి.
క॥ శరపత్రంబులు శస్త్రము లరాతిభీషణుఁడు వాసి దా కృతికిఁ బరి
స్తరణము లక్షేంధనములు బరఁగెన్ గార్ష్ణాయసంబు వాటిలె స్రువ మై. ౨౬౫
తే॥ రక్తవస్త్రము లట్టి విరాజమానుఁ డగుచుఁ గృష్ణము ఛాగమ్ము నాక్రమించె
గళమున సజీవ మై యుండఁగాఁ బ్రసక్తి జయము గావలె ననెడు ప్రస్తావ మొప్ప.
క॥ ఒకపరి వేల్వ విధూముఁడు సకలార్చిర్వలయుఁడు నయి జయలింగబుల్
ప్రకటము లొనర్చె హుతవహుఁ డకలంకుం డనుచు నాతఁ డలరుచునుండన్.
ఆ॥ ఆతఁ డొసఁగినట్టి యాహవిస్సుఁ గొనెం బ్రదక్షిణార్చు లలరఁ దప్తకాంచ
నాభరణములొప్ప నప్పావకుఁడు స్వయమాస్థితుండ కాఁగ నాక్షణమున.
శా॥ ఇంద్రద్విష్టుఁడు బ్రాహ్మ మస్త్రము నిజాభీష్టాప్తి నూహించి ని
స్తంద్రుం డై జపియించుచున్ హావన ముత్సాహంబునం గూర్చి త
త్సాంద్రప్రక్రమణక్రియాకలనచే సన్మంత్రణం బేర్పడన్
రుంద్రస్యందనశస్త్రచాపశరధు ల్రూపించి రోపించుచున్. ౨౬౯
క॥ ఆథర్వణతంత్రోత్థిత యై ధర్షిణి కృత్తి తోనె యాదల నూపన్
వేధోమయి దానిం గొని వేధింపఁగ నింక నేఁ బ్రవీణుఁడ ననుచున్. ౨౭౦
క॥ ప్రాపించెడు వానిం గని కోపించిన తెఱఁగు చక్కఁగొని బ్రహ్మాస్త్ర
వ్యాపార మొంచి యన్నెఱి నాపావకు తెలివితేట లారసి భీతిన్. ౨౭౧
క॥ వడఁకెను గ్రహేందుతారక లడరారు నభస్థ్సలం బహం బనఁ గాఁ క
ట్లుడికె సురరాజు చిత్తము నడికె న్భూతౌఘ మెల్ల నగరాజసుతా. ౨౭౨
తే॥ అట్లుహోమం బొనర్చి దీప్తాగ్నితేజుఁ డసురరాజు తనూజుఁ డ ప్డధిగమించె
స్థాన మొకఁడు తిరోధానసంజ్ఞితంబు చాపశరయంతృరథరథాశ్వములతోడ.
ఆ॥ వాఁ డచింత్యరూపవర్తనోద్వర్తనుం డైన నర్దనంబు లర్దనంబు
లమర నమరవైరు లగచరులం దాఁకి వేఁకరంబొనర్ప విడిసిరార్య! ౨౭౪
చ॥ సురథము లెక్కి రక్కసులు సూరెల శా ఱెలయించి మించి వా
నరుల నలంచి రొక్కట ఘనప్రదరాంకుశఖడ్గయష్టితో
మరనికరంబులన్ దితిజమండనుఁ డుద్ధతి మీఱి హృష్టు లై
యురవడి వ్యాపరింపుఁ డని యుత్సుకతం బ్రబలింపుచుండఁగన్. ౨౭౫
ఆ॥ వానిప్రాపుఁ గాంచి వార లార్చుచుఁ బేర్చి వానరాఘ మంపవాన ముంచి
రసురవరసుతుండు నదనెంచి చించి చెండాడఁదొడరెఁ దనదు మోడి మెఱయ.

క॥ నానాయుధముల నంతర్ధానప్రోల్లసితుఁ డతఁడు దలపడి పోదువం
గా నోపి పాదపాయుధు లై నెక్కొనఁ గాంచి మించు నాగ్రహకలనన్. ౨౭౭
ఆ॥ కడఁగి యేర్చె నసుర కార్చిచ్చుపొదివిన కరణి హేతిహేతికల నిగిడ్చి
నేర్చువారు లేరు నియతి యిట్టిద కాఁగ నుండెనేమొ యనుచు నొరులు దెరల.
క॥ శర మొకఁడు వఱపి గ్రొచ్చెను హరు లైదుగు రార్గు రేడ్గు రటు దొమ్మండ్రున్
వరుస న్గుదులు గుఱులుగా నర గాని మగంటిమి న్మహాశరుఁ డంతన్. ౨౭౯
తే॥ భానునిభములు శాతకుంభప్రసాధితములు నగు శరములఁ బ్లవంగముల సమర
తలమున నలంపఁదొడఁగె నిస్తంద్రు డగుచు గర్జ లెసఁగంగ నావైరిదుర్జయుండు.
ఆ॥ భిన్నగాత్రు లగుచుఁ బేరు పెంపెడలంగ శస్త్రహతి సహింపఁజాల కపుడు
కపులు నేలవ్రాలి కాల్సాచి రలనాఁటి యని సురారులట్టు లచలతనయ. ౨౮౧
ఉ॥ హేతిగభస్తు లొప్ప సుసమిద్ధమహాం బలభానుమండలం
బాతతిఁ బోల్ప నా ననఁగ నైన సురారిపదంబు సేర రూ
పౌ తలఁపూర గృద్ధు లయి యానముసేసిరి భిన్నదేహహృ
చ్చేతను లట్లు రక్తపరిషిక్తులు నై ధర వ్రాలి రద్రిజా. ౨౮౨
ఆ॥ రామునర్థమునఁ బరాక్రమించి కడంగి శిలలు చేతఁబూని జీవితేచ్ఛ
మాని మరలి సమరమహి వ్రాలి రాశైలచరులు హతవిధిప్రసంగమునను.
శా॥ మేటు ల్గొందఱు పర్వతాగ్రశిలలు న్మేకొన్న వృక్షంబులున్
బాటిల్ల న్వహియించి తత్పదము సంభావించి యాకాశ మె
ప్పాటం దా నవకాశశూన్యముగఁ గప్పంబూనఁ బాటచ్చరుం
డాటోపించి తెరల్చెఁ దీక్ష్ణవిశిఖవ్యాపార మేపారఁగాన్. ౨౮౪
తే॥ ప్రాణహారిణి యావర్షభంగి భంగమందఁజేసి మహాతేజుఁ డాశరుండు
వహ్నినిభము లాశీవిషవర్ణితములు నైన శరముల హరిసేన యడ రడంచి. ౨౮౫
సీ॥ గంధమాదనుని నిర్గంధుగా నొనరించెఁ బదరి యష్టాదశప్రదరములను
నలుఁ బరానలు రిత్త నలమాత్రుఁ జేసెఁ దొమ్మిదిబాణముల నొంట మిడుకుచుండ
మైందు నమందు మర్మవిదారణంబుల నేడింట స్రుక్కించి యీసడించె
గజు గజప్రతిము నుత్కటుఁ జక్కడఁచెఁ బంచపంచాననఖోగ్రభల్లములను
జాంబవంతు యుగాంతాగ్నిసమయవంతు బాణదశకంబు వఱపి నిష్ప్రాణుఁ డీతఁ
డనియె నీలు ననిలవేగు నగ్నితేజు నార్చె ముప్పదివిశిఖంబు లనిచి యార్చి.
ఉ॥ ఘోరవిధాతృదత్తవరకూటశరారుశరావలంబితా
సారము సారము న్నెఱపఁజాలి యసంజ్ఞునిఁ జేసె నర్కజున్
వారక యట్టు లాఋషభు వాలిసుతున్ ద్వివిదున్ దదన్యులన్
నేరిచి కాలవహ్నిపరినిష్ఠితుఁ డై నొగిలించె నుగ్మలీ. ౨౮౭

క॥ చీఁకటి సూర్యులఁ గనియెడు పోఁకం దన్మక్త హేతివితతులు పర్వం
బ్రాఁకిడ లేక కపులు తమ యేఁకట లెడలంగ వ్రాలి రేణాంకముఖీ. ౨౮౯
తే॥ ఉరక మందరగిరివైచి సురలసురులు ద్రచ్చిరటు వాహినీంద్రు నాలచ్చిఁ బడయ
శరతతి హరీంద్రవాహిని యురవడంచి జయముసిరి నలవార్చె రాక్షసవరజుఁడు.
క॥ రక్తఝురీవహ యయ్యె నరక్త యనం దగె ధరిత్రి రక్షస్తనుభూ
రక్తప్రకరాలబ్ధి విరక్తత మది బ్రుంగఁ దనదు రాణ తలంగన్. ౨౯౦
తే॥ వరబలం బాత్మబల మిరువరుసఁ దన్నుఁ బ్రబలుఁ జేయంగఁ జెలరేఁగి పాపుఁడపుడు
బాణశస్త్రప్రవర్షణభంగు లొప్పఁ జదిపె వానరసేన నిస్తంద్రుఁ డగుచు.
చ॥ అరమర లేక స్వీయ మగు నాబలు సైన్య మహాస్త్రదైన్యమున్
బురికొనఁ జేసి యొల్లపయిఁ బొమ్మని తాఁ బయి వ్రేటులన్ దురు
ద్ధర యగు మాయ మాటుపడి తద్ద నిగిడ్చె సడల్చుచుండె వా
నరనివహంబు పేర్చుజడి నాశన మందు దవాగ్ని యట్లుగాన్. ౨౯౨
తే॥ ఇంద్రవజ్రాభిహతభూధరేంద్రములుగ నింద్రజిద్బాణశీర్ణదేహేంద్రియు లయి
విరసవిస్వరరసితము ల్వెడల వ్రాలి రరిభయంకరవీర్యు లయ్యద్రిచరులు. ౨౯౩
క॥ మాయానిగూఢుఁ డగు నమ్మాయవి సురేంద్రశత్రు మలయురు పటుశ
స్త్రాయుతములు నిశితంబులు డాయంగాంతు రనిఁ జేడ్పడమిఁ బడయుదురే.
ఆ॥ నిశితబుద్ధిశాలి నిరృతాధిపతిపుత్రుఁ డఖిలదిశలు భూనభోంతరంబు
నస్త్రశస్త్రతతిసమాచ్ఛన్నము లొనర్చె నది రవిప్రకాశ మగుచు నెగడ. ౨౯౫
సీ॥ నెఱి విస్ఫులింగము ల్నిగుడఁ గార్చిచ్చులఁ బోని తూపులఁ బంచి పొడవడంచి
పూచిన కింశుకంబుల గుముల్ రూపింప నవ్వారి మేనుల నలవరించి
నోళ్లెత్తి యఱచిన నొవ్వరా యని వాని నపుడె యమ్ములపొదు లట్లు సేసి
మిన్నువంకకుఁ గను ల్మోకొన మెలఁగింపఁ జూతురు గా కంచు సొలయనేసి
పదరనీక యెట్లుఁ బొదలంగనీక యెం డొల్ల గాంచుగతియు నొదవనీక
కాలమృత్యు వన నకాలమృత్యు వనంగఁ దాన యై తనర్చె దానవుండు. ౨౯౬
క॥ ఒండొరుల యొడ్లే తమ కండలుగాఁ గండ లవియ నని య శ్శైలన్
గండడఁగి చనిరి కపివరు లుండం దరిలేక యమ్మహోత్పాతమునన్. ౨౯౭
వ॥ సుగ్రీవాంగద హనుమ ద్గంధమాదన జాంబవ త్సుషేణ వేగదర్శి మైంద
ద్వివిద నీల గవాక్ష గజ గోముఖ కేసరి హరిలోమ విద్యుద్దంష్ట్ర సూర్యానన
జ్యోతిర్ముఖ దధిముఖ పావకాక్ష నల కుముదప్రభృతు లగు వానరాధ్యక్షుల
జిత్వరుం డగు నాయింద్రజిత్తు మంత్రతంత్రోపబృంహితంబు లగు ప్రాసశూల
గదాశక్తిపరశ్వధప్రముఖనిశితశస్త్రాస్త్రంబుల నెడయాక తనివోక సడల్చి తక్కు
వార లింక నీవంకం జీమలో దోమలో యనుచు నైన నుడివోని బీరంబుతోడి

వైరంబున వానరుల నఱువదియేడుకోటుల లెక్కకుం జక్కాడి యయ్యాదనునం
గదనంబు తెఱంగు రంగు గన్నులారఁ గనుంగొనుచున్న రామలక్ష్మణులం
దఱిసి కినిసి భాస్కరరశ్మికల్పశరవృష్టిజాలకల్పంబులం బరఁగించి యురవడించి
యార్చు నయ్యవసరంబున. ౨౯౮
క॥ ఆబాణవర్షతతి విద్యాబోధాత్ముండు రాముఁ డలఁతిం జలధా
రాబాహుళ్యంబుగఁ గొని తాఁ బదరక యిట్టు లనియెఁ దమ్మునితోడన్. ౨౯౯
క॥ పరమాద్భుతాయితశ్రీపరతత్త్వము వాఁ డొకండు పాటించునఁటే
పరు లెట్లు పడిన వారల బరు లెఱుఁగ నడంచుగాక పటుసత్త్వమునన్. ౩౦౦
సీ॥ కంటె లక్ష్మణ వీఁడు కారాడుచున్నాఁడు బ్రహ్మాస్త్రశక్తిచేఁ బరిఘవిల్లి
హరిసైన్య మబ్బంగి నఱవఱ ల్గావించి మనపై నెసంగె నేమము దొలంక
మాటుగొన్నాఁ డతిమానుండు దా నుద్యతాయుధుం డగుచునే యంబరమున
నీతనిసమయింప నీరేడులోకంబు లేక మైనను నోప వీక్షణమున
బ్రహ్మదత్తవరము బాటించి యి ట్లూరకుంటి నింతవట్టు గంటిపడియు
నాస్వయంభు వగ్ర్యుఁ డమితప్రభావుఁ డద్దేవు మహిమ వలదె తేటపఱుప.
క॥ ఆభగవంతుని నుడికై నే భంగము గాంచి యైన నెక్కొని యట మ
త్ప్రాభవము వెలయఁజేసెద నాభంగికిఁ గూర్చు మీపు నడుకక వత్సా. ౩౦౨
ఉ॥ బుద్ధిమదగ్రగణ్యుఁడవు భూరిబలుండవు నీవు మద్వచో
బద్ధుఁడ వై సహింపుము విపాకశుభోదయ మీవ్యళీక మ
త్యుద్ధతిమై మడంచె నెఱినొప్పు ననీక మనీకనాథులన్
నద్ధుఁడు గాక పోఁదలఁచు నాథుని మె చ్చనయంగ నెంచుచున్. ౩౦౩
క॥ భువి నొరగి విమోహితులము నివృత్తయుద్ధులము రోషనిర్వృతివిరహ
ప్రవణులము గాఁగ నుండినఁ బ్రవరుం డతఁ డరుగు జయముఁ బడసితి ననుచున్.
ఆ॥ అనుచు నొండొరులు సమాలాప మొనరించి మిన్నకుండ వాఁడు మిన్నువగుల
నార్చి శస్త్రతతుల నన్వారి నొప్పించి యరుగఁదలఁచెఁ దంద్రి కరుస మెసఁగ.
క॥ హరిబల మ ట్లగలించి నృహరిఁ దమ్ముని నొంచి సచివు లలరుచు రా నా
సురవరభుజాభిగుప్త నగరి సొచ్చె నతండు దివ్యకాంతార్చ్యపదా!. ౩౦౬

—◆ ఇంద్రజిత్తుబ్రహ్మాస్త్రంబున బద్ధు లగు స్వీయుల హనుమద్విభీషణు లరసి యూరడించుట ◆—

ఆ॥ వార లట్లు దెరలి వడిసెడి యుండ దుర్వార మఘుచరౌఘ మూరు బేరు
లేని దనఁగ భువి నిలీనంబ కా హరీంద్రాంగదాదు లెడలి నట్లుగాఁగ. ౩౦౭
చ॥ అపుడు విషణ్ణ మైన బల మంతయుఁ గాంచి విభీషణుండు స
న్నిపుణుఁడు బుద్ధిమంతుఁడు వినీతుఁడు రాజతనూజు లమ్మెయిన్

గ్లపితుల కా నడంగుటయుఁ గన్నన నారసి కర్జ మెంచుచున్
గపివరులన్ స్వవాక్యులన గాఢతమశ్చ్యుతులం బొనర్పఁగాన్. ౩౦౮

క॥ వలనెంచి పలికె ని ట్లని వల దిమ్మొయి ముట్టమునుఁగ వలసె నతనిదో
ర్బల మీనాఁ డిటు నెలకొన నలవియె విధికృతము గడవ నఱిమెడు నెడలన్.

చ॥ తఱి యిది గా దటంచుఁ దనతమ్ముఁడుఁ దోడుగఁ జిక్కి నాథుఁ డే
డ్తెఱ నెఱపం గడల్కొనక తీరు సెడం బడియుండ వారి య
క్కఱఁ దలపోయఁగావలయుఁ గాన భయంబునవంకఁ బోక యా
తెఱఁ గెదలోఁ దలంచి సముదీర్ణత నెక్కొనఁజూడుఁడా ధృతిన్. ౩౧౦

తే॥ స్రష్ట యొసఁగిన వరము ప్రసంగమునను నేఁడు వీఁ డిట్లు క్రాలినవాఁడు బ్రాహ్మ
మస్త్ర మెందు నమోఘ మై యలరుచుండు నసురమాయ నప్రతిహతంబయ్యె మఱియు.

క॥ సన్మానించె న్నరహరి తన్మాన్యాస్త్రంబుఁ దా విధాత్మవి గరిమం
బున్మాలింపందలఁపమి నున్మనులు న్మోహ మొంది రోపమి నెఱియన్. ౩౧౨

తే॥ కానఁ గర్జంబుసెడ దొండు గాకయుండ నగు విధానంబున నెలంగనాఁ గడంగి
యనుచుఁ బౌలస్త్యుఁ డొప్పంగ నాడు నుడుల సరణి చెవినాట మాఁగుతవరనుతుండు.

క॥ మున్నే బ్రహ్మాస్త్రము నడి సన్న లరసి మన్నవాఁడు సాంగ్రామిక యో
గోన్నతుఁ డతం డజునిపై మన్నన న ట్లుండి తెలివిమై నిట్లనియెన్. ౩౧౪

క॥ ఈవానరసైన్యం బిటు లై వాఁవిరి దక్కి ప్రాల నందఱ తెఱువుల్
భావింప నూఱటల సంభావింప న్వలయు మనకు వల నదె యనుడున్. ౩౧౫

ఉ॥ అంజనగన్ననోముఫలమా! చనుదె మ్మని వానిఁ గొంచు వే
గం జనె నాతఁ డిర్వురు యుగంధరు లుల్కలు దాల్చి యుద్ధభూ
మిం జరియించి రార్తి ధృతి మేకొనసీక యడంచుచుండఁ దా
రంజలు వైచుచున్ బడినయాప్తుల యాపద లుగ్గడించుచున్. ౩౧౬

సీ॥ కాళ్లు చేతులు మస్తకములు దోఁకలు దొడ ల్పెఱికి వైచినచెట్ల తెఱఁగు నూప
నురువులు గట్టుచు నురలు నెత్తురువాఁక లలఁతులు గాక దా ర్లాఁకపడఁగ
నెడనెడఁ గొండ లేర్పడి చూడఁబడి నట్లు బలు మేను లొండొండఁ బరఁగుచుండ
సవిధనానావిధశస్త్రజాలంబులు జలజంతుసంతతి సంతరింప
సాగరాఘ మగుచు సాంగ్రామికబలంబు భీమ మసురబాణపీడితంబుఁ
జూచి రల్లవారు స్రుక్కి నిపేరాసఁ జూచుకన్నులకును జొక్కి గదుర. ౩౧౭

చ॥ అఱువది యేడుకోటులు మహాత్ములు వానరు లట్లుగాఁగ వా
రఱిముఱి పాటునం బడుచు నానడిరే నెడవ్రాక నెట్టనన్
దెఱఁగు సెడెంగదా యనుచు ద్రిమ్మరుచుండిరి జాంబవంతుఁ డి
త్తఱి నెటు లున్నవాఁడొ యని తత్పరత న్మన ముత్తలంబుగాన్. ౩౧౮

ఆ॥ అట్టు లరయువార లగచరాధీశుఁ దత్తనయు మైందు ద్వివిదు పనసు శరభు
గంధమాదనాహ్వకగవాక్షనలనీలముఖుల యూథపతుల మొనసి కాంచి. ౩౧౯
క॥ నిహతప్రాయుల చూపీ రహహా విధిచేఁత యంచు నలజడివడుచున్
ద్రుహిణాత్మజాతు శామ్యద్దహనోపము జాంబవంతుఁ దద్దయు నెదురన్. ౩౨౦
ఆ॥ కనిరి శరశతముల గాసిల్లి తొల్లింటి వార్ధకమ్ము తఱిని వ్రాలఁజేయఁ
గాయ మిట్టు నట్టుఁ గాకుండఁగా నున్న వాని నగవరేణ్యవరకుమారి! ౩౨౧
క॥ కాంచి దరిఁజేరి పౌలస్త్యాంచత్కులభూషణుండు హా యిట్లున్నే
మంచి మనిన యీయెడలికిఁ బంచత్వము చెట్ట వ్రేట్లఁ బ్రాపింపదుగా. ౩౨౨
క॥ అనునెడ నమ్మెయిగళరవమున నాతని పలుకు తెఱఁగు మొనయం గని నె
ట్టన నెలుఁగేర్పడ నెలుఁగులవినేత వాఁ డిట్టులనియె విధిసంస్తుత్యా. ౩౨౩
ఉ॥ కన్నులఁ జూడనేర నొడికంబుగ నైరృతనాథ! నీస్వరా
భ్యున్నతి నూహసేసి యెటులో పరికించుచునున్నవాఁడ ను
క్తి స్నెరయింపు మంజన సుకీర్తిత పూజ్యుఁడు మారుతుండు నే
యన్న కతాన సుప్రజులా యాతని దా విధ మెట్టు లుండెనో. ౩౨౪
ఆ॥ అతని మేలు విందు నయ్యా నాచెవులార ననిన నెవ్వ రెట్టు లైరొ యార్య
పుత్రు లెచట నెట్లు పొడకట్టుచున్నారొ యనవు తలఁప వధిపు నతని తనయు.
క॥ మారుతిదెస స్నేహంబునఁ బూరించిన నుడి నొడివితి పొసఁగంగాఁ ద
త్కారణ మొకింత దెల్పుము గారవమున నన్నుఁ దేర్పఁగాఁ దలఁతేనిన్. ౩౨౬
ఆ॥ అనిన జాంబవంతుఁ డనియె నయ్యాది వినుమయ్య యాతఁ డున్న హాత మహాతమ
యతని కొండు వుట్ట నైన నందఱు మున్న నిర్హతులమ యిదియె నిర్ణయంబు.
ఉ॥ మారుతునంతవాఁడు ప్రథమానబలుం డతఁ డగ్నికల్పుఁ డీ
తీ రని వాని బీర మనిఁ దెంపు వచింపఁ దరంబె యాఘునుం
డారభటిం బొనర్ప జగ మంతయు జంకు సురారు లెంతవా
రూరక పల్కుప ల్కనక యోజఁ దలంపుము తత్ప్రభావమున్. ౩౨౮
ఆ॥ జీవితాశతోడి సిరిగాంతు మాతనిఁ దెలుపు మనిన వరుస మలసి హనుమ
సర్వవృద్ధుఁ డతని చరణయుగ్మముఁ గొని నియతి మ్రొక్కెఁ దాత! నే నటంచు.
క॥ ఆహనుమని వాక్యము తన యూహంగొని శరకృతార్తి నురవడఁగియు ని
ష్ఠాహా బ్రదికితి మిఁక సందేహము లే దనుచుఁ దెలివి తేట వొలంకన్. ౩౩౦

—♦ జాంబవంతుఁడు హనుమంతు నోషధుల దేరంబనుచుట ♦—

శా॥ రావోయీ కపిసింహమా! కృతములన్ రారాపులే కుంటివో
యీ ? వీ రెల్లరు నీసఖు ల్ధరణిపై నిట్లున్నవా రుద్ధతిన్

తేవోయీ మనుపంగ విక్రమము నుల్లేఖింప నా వేళ సు
మ్మే వారు న్మెఱయంగ నేరరుకదోయీ యిట్టికర్జంబునన్. 330

క॥ అని మేలున కెనయింపఁగ ననీకములకుం బ్రహర్ష మందీయఁగ రా
మనరాధిపు సానుజు ధృతి మనుపన్ నినుఁబోల నొకఁడు మహిలోఁ గలఁడే.

ఆ॥ ఎల్లవారిఁ జేయు మిత్థతెజా విశల్యులను సాదితులుగ నున్నవారు
తఱియు నిదియ నీదు దర్పంబు సఫలంబుగా నొనర్చ నగుము కడిమినెఱప.

సీ॥ మున్నీటి పైపైని మొనయు ముత్తరమున కౌ మేలిమార్గమ్ము నధిగమించి
మునుమున్న హిమవంతమునుఁ గనుంగొను మది నగములలో సమున్నతవిభూతి
గాంచు మత్యుచ్చంబు కాంచనం బటమీఁదఁ గైలాసబుబుమభము లనుము కడఁగి
యారెండుకొండల యంతరాంతరమునఁ బరఁగు మహౌషధిపర్వతంబు
కన్నుదోయికి వ్రేఁగౌ ప్రకాశకలన ననుచు తచ్ఛిరమున నొప్పు నలుదెఱఁగులు
గలుగు తీఁగెలు సంజీవకరణి మున్నుగాఁ బ్రసిద్ధపదాప్తి జగమ్ము వొగడ. 334

వ॥ మఱియును విశల్యకరణి సౌవర్ణకరణి సంధానకరణియు నను నమ్మూడును సంజీ
వకరణితోడివ యై తనరారుచుండు నన్నాల్గును నాల్గుచందంబులం దేటపఱుపం
దగినయవియ. యమ్మేలియౌషధమ్ముల నేర్పఱించికొని తెచ్చి నీదు బాంధవుల
కిందఱకుం బ్రాణదానంబులు సేయ నియ్యకొను మని యర్థించి తత్తల్లక్షణం
బుల నెల్ల సవిస్తరంబుగా వివరించిన. 335

చ॥ హనుమఁడు తద్గురూక్తి విని నంత నె సంతస మావహిల్లఁ బ్రా
క్తనము తమంబు వీడ బలదర్పజవోన్నతు లుల్లసిల్లఁ దో
యనిధి ప్రవాహవేగముల నట్లె ప్రపూర్ణుఁ డనం దనర్చె న
ట్టనఁ గని వేలుపు ల్మఱి గడంగెఁ ద్రివిక్రముఁ డంచుఁ బల్కఁగన్. 336

క॥ అచలతటాగ్రస్థుండు వనచరోత్తముఁ డపుడు చూడ ననిచె ద్వితీయార
బచలోత్తంసంబో యన విచికలగంధీ! ప్రయాణవేగితుఁ డగుచున్. 337

క॥ హరిపాదవినిర్భగ్నము ధరాధరము గూలఁబడె బ్రథమసాధ్యం బౌ
పరుసునఁ గన నై యాతని సరభసవృత్తి కది యెంత సారసగమనా! 338

సీ॥ శృంగము ల్శిలలు విశీర్ణంబు లైపడెఁ బాదఘోషము వ్రాలి ప్రజ్వలించె
గాలూనలే రైరి కాననౌకసు లందు ధరణి యట్టిట్టగు సరణిఁ దోఁచె
లంక సాశంక యై లావఱి పో నయ్యెఁ గూలె గృహద్వారగోపురములు
ఘూర్ణిల్లె గుహలెల్లఁ గొనకొనె నర్ణవం బఖిలభూతంబులు నదరెఁ బెలుచఁ
దననిపీడనంబు గొనఁబోల దిది యిప్పు డనుచు మలయశైల మాక్రమించె
నాతఁ డెట్టులెంచ నది యట్లె యౌఁ దనతలఁపు మలఁచు పనియుఁ దరమె విధికి.

ఉ॥ కందర లెన్నియో పౌనరంగా సురసిద్ధమునీంద్రు లప్సర
స్సుందరు లెందఱో నిలువఁ జూడ్కు లకింపులు నింపు మేలి ని
ష్యందములుల్ లతావలయసారసపారసరశ్శతంబులుల్
బొం దగు శాఖిబృందములుఁ బోడుము లై తనరం గనంగ నై. ౩౮౦

తే॥ మేరుమందరములుఁ దనమేలు వడయునే యటంచు హసించుచు నెసఁగి షష్టి
యోజనోచ్ఛ్రిత మయి సిరు లొప్పు మలయు మలయగిరిపైఁ దనర్చె నమ్మానితుండు.

మ॥ పెనిచె న్మే నగరాజ మూఁగ స్వగతు ల్వొంపేడ నిట్టట్టుగా
ఘనసంకాశుఁడు వాఁడు నెమ్మనమునం గార్కొన్న యర్థంబె నె
ట్టన నొండెద్దియుఁ దోఁపనీక నెఱితోడ స్వీకర్తై ప్రాఁకిడన్
బొనరింపన్ సుర లాదరంబునఁ గనన్ బూర్ణప్రమోదాత్ముఁ డై. ౩౮౧

తే॥ పాదముల గిరి నడఁచెఁ దత్పాదపాదపముల గములు దొలంగ దర్పము సెలంగ
నార్చె వహ్నిముఖం బట్టిఁ డా ముఖంబుఁ దెఱచి యరచెడి రక్కసు లఱచుచుండ.

ఆ॥ అద్భుతంబు వాని దౌ నినాదము విని లంకలోనివారు శంకవొడమ
నింక నెట్టు లౌదు మేమో యనుచుఁ గా ల్గదల్పరైరి భూమిధరకుమారి! ౩౮౪

తే॥ రామునకు మ్రొక్కి మారుతి భీమవిక్రముఁడు మనంబుననిడి భక్తి మొనయుదేరఁ
బరమము తదీయ మర్థంబు పరఁగ నాపరంతపుఁడు గూర్చెఁ బ్రాభవప్రక్రమమున.

సీ॥ భోగిభోగాభ మౌ భోగంబు పైకెత్తె శక్రుఁ డెత్తిన జయస్తంభ మట్లు
పృథ్విఁ దాల్పనపోలె వె న్నొకించుక వంచె శేషు నుల్లాఘుని జేయఁగడఁగి
సలిపె వీనుల నికుంచన మాంతరుం డైన విధి దెల్పు విధులెల్ల వినఁగ ననఁగఁ
గాల్తు ముజ్జగములు గడెలో నని యె వివృతాస్యంబు బడబాస్య మాఁగి నెఱయ
మెట్టె నమ్మెట్టు పౌలస్త్య మేలిగెల్పు మగసిరి యడంగు నని తెల్పుమాడ్కిఁ గ్రుంగ
నెగసెఁ గుప్పించి రాము సమిద్ధతేజ మంతట నెసంగు నిట్లని యనిలసుతుఁడు.

ఆ॥ ఊరుబాహువేగ ముద్ధతంబుగ నుభయాగములును శిలలు నచటనున్న
సత్వములునుఁ దోడఁ జనుదేరఁ జనె నవి యవల నుడిగి జలములందుఁ బడియె.

క॥ ఉరగేంద్రాయితములు ప్రత్యరిఘ్నములు గరుడవీర్యుఁ డౌతనిభుజముల్
పరఁగె దివి నరుగునెడ విజయరమాప్రతిహారతోరణాంకము లనఁగాన్. ౩౮౫

మ॥ నగరాజంబును మేరువుం బెరయు సన్నాహంబులం దిక్కులున్
గగనంబున్ హరియింపఁగా నగుచు నిర్ఘాతోగ్రవేగంబునన్
దగవొప్పం జనె విష్ణుపాణితలముక్తం బైన చక్రం బనన్
దగి వీచిస్ఫురదాఢ్యసత్త్వము సముద్రం బొంట వీక్షించుచున్. ౩౮౬

చ॥ పురవరము ల్జనాంతములు పుణ్యనదీనదము ల్తటాకముల్
సరసులు సారసాథ్యములు సద్వనరాజములుం బ్రశస్తభూ

ధరములుఁ గాంచుచుం జనియెఁ దండ్రిని బోలినవాఁడు వేగముం
దరయొకయింతలేని బలమందుఁ బరాక్రమమందుఁ బోల్పఁగన్. 3౫౦
తే॥ అతఁ డాదిత్యపథ మట్టు లాక్రమించి జనునుఁడు గరుత్మముఁడు సత్త్వసహితుఁడు సయి
మారుతుఁడె యన నరుగుచో మారుతియనె యాప రేఖావిలాసనిరూఢి నడఁగి.
క॥ దెస లెల్ల శబ్దకలన న్వసమటఁ బూరించుచుం బ్రనగశార్దూలుం
డసదృశము జాంబవంతుని ప్రసంగముం దలఁచుకొనుచు బలురఁడు మెప్పన్.
క॥ చనిచని హిమవంతముఁ గనె ఘనుఁడు హనూమంతుఁ డెలమి కోరనమునుఁ జ
య్యనఁ దోఁపఁ దద్విశేషము లనుపద మరయంగఁ గాంచె నఖిలయోగసుమసన్.
శా॥ నానాకందరనిర్ఝరసుప్రతిసరిస్యందవ్యంబు పుణ్యాప్సర
స్థానం బచ్ఛతరాభ్రసంచయనికాశద్యోతమానాత్మసం
గానంత్యమ్ము నగేంద్ర మాశ్రమశతవ్యాసక్త మత్యుత్తమ
శ్రీనిత్యమ్ము సురర్షిసేవితము నద్రిం గాంచి సంతుష్టుఁడై. 3౫౪
తే॥ వాఁడు మహనీయముల దానివరుస నరసెఁ బుణ్యాపదముల చాలు సహస్రాలనుమేలు
నవల నుపదిష్టము విశిష్ట మధిగమింప నంతరాంతరన్పృష్టము నరుగుచుండె.
వ॥ బ్రహ్మకోశంబును రజతాలయంబును శక్రాలయంబును రుద్రశరప్రమోక్షంబును
హయాననంబును దీప్తం బగు బ్రహ్మశిరంబును వినస్వత్కింకరవిశసనస్థలంబును
వజ్రాలయంబును వైశ్రవణాలయంబును సూర్యప్రభవంబును సూర్యనిబంధనసం
బును బ్రహ్మాసనంబును శంకరకార్ముకంబును వసుంధరానాభిప్రదేశంబు నసం
గల మహాస్థలంబుల సందర్శించుచుం బోయిపోయి గమ్యస్థానంబు దలఁచి నురి
యుచు న్నెఱసి ముందట. 3౫౬
తే॥ అగ్ర్య కైలాసహిమవచ్ఛిలాంతరమున మేలి కాంచనశైలమ్ము మేలసమున
దీప్తసర్వౌషధీసంప్రదీప్త మగుచుఁ దనరు నోషధిపర్వతేంద్రమ్ముఁ గాంచె.
తే॥ కాంచినంతనె జానకీకాంతచరణ నలిననిష్యందమకరందనందితాత్ముఁ
డగుచు నగధీరుఁ డమ్మారుతాత్మజుండు విస్మయంబందుచునె తత్స్వవిధము దొరసి.
క॥ అనలస్ఫురణలు వెల్గుఁ దనర్చు బుధభాఖ్య మహౌషధనగం బిదె యం
చు నవీనోత్సాహంబున మొనకొనుచుం దాని తత్త్వముం బేర్కొనుచున్. 3౫౮
తే॥ యోజనసహస్రములు దనయోజ గడచి యోజమున నొప్పు నద్దాని నొరయగాంచి
యాజయార్థి మహౌషధు లందు వెదకె నాజిబోధితలక్షణాఖ్యాన మమర. 3౬౦
ఉ॥ వాసవదూతసూతి యనివారితుఁ డై యటుసొచ్చి చిత్రవి
న్యాసములం బ్రవర్తిలుచు నాలతలం బరికించుచుండ వ్య
త్యాస మొనర్పఁ బూని తమయంతన తాము యదర్శనంబునం
బో సమకట్టి యట్లగుడు బుద్ధిమదగ్రణి యాగ్రహంబునన్. 3౬౧

క॥ కన్నుల నిప్పుక లెగయఁగఁ గన్నదె కా న్పట్లు దెరలఁగాఁ జూచిన దా
నన్నగము చెయిద మోర్వక యన్నాళీకాసనాభుఁ డపు డి ట్లనియెన్
ఆ॥ ఏమి యిదియె యిట్టులే సువినిశ్చితం బయ్యెనే త్వదంతరంగమునను
రాముపైఁ గృతానురాగుఁడ వై కాక తలఁగి తీవు శ్రేయ మొలయవాక్కా.
మ॥ ఘనమద్బాహుబలాభిభూతుఁడవ యై కంపింపఁగా నిప్పుడే
పౌనరింతుం గను మంచు భూధరసముద్భూతంబు శృంగంబు కాం
చనజుష్టంబు సధాతుసంచయము ప్రాంచన్నాగ ముచ్చాగ మొ
య్యాన బల్మిం బెకలించి యె త్తె నచలం బల్లాడ నుల్లాసి యై. ౩౬౪
క॥ జ్వలితాగ్రసానుకూటము కలితౌషధిఘాట మన్నగము జంజాటం
బలవోక దాల్చె సుర లసురులు మున్నుగఁ ద్రాస మెనసి బ్రుంగుడుపడఁగన్.
ఉ॥ రోహణశాఖిశాఖఁ గొని రూఢిమెయిం బఱతెంచు తార్క్ష్యునిన్
సాహసవృత్తి వేగము ప్రసంగములన్ సరిపోల మిన్నుసం
దాహరివర్యుఁ డ ట్లైనయ నంబరచారులు సన్నుతించి రు
త్సాహము మీఱ మ మ్మితఁడు చాలి భరింప జనించె నం చొగిన్. ౩౬౬
క॥ భాస్కరనిభ మగశృంగము భాస్కరమార్గమునఁ గొంచుఁ బఱతేరంగన్
భాస్కరవిభుఁ డొప్పెం బ్రతిభాస్కరుఁ డతఁ డనఁగ నుదితభాస్కరతేజా!.
ఉ॥ శైలము భాస్వరం బనిలసంభవుఁ డోజ ధరించి వ్రేల్చె స
జ్వాలసహస్రధార మగు చక్రముఁ దాలిచి విష్ణుఁడో యనన్
బోలెఁ ద్రివిక్రమాకృతియుఁ బుష్కరమార్గగతిన్ సమాగతిన్
జాలఁ బొసంగె సర్వజయసారరమాసహయోగశక్తియున్. ౩౬౮
మ॥ హరిముఖ్యు ల్హరివర్యు వానిఁ గని నిర్హ్రాదంబులం దార్చి రా
స్వరువేగుం డటు వారిసంబరము సంభావించి తా నున్నత
స్వర మొప్పారఁగ నార్చె నింతయును సంసక్తంబ యై పేర్చినన్
సురవైరు ల్దిటవేది తా రఱచి రస్తోకస్ఫురత్త్రాసులై. ౩౬౯

—♦ హనుమంతుఁడు తెచ్చిన యోషధుల గాలి సోకి రామలక్ష్మణులు స్వబలముతోఁ దెప్పిరిలుట ♦—

ఆ॥ అమ్మహాత్ముఁ డరిగి హరిసైన్యమధ్యంబునందు శైలరాజ మందు డించె
మహిత మా ర్తిహరము మహీధరశృంగమ్ముఁ బరఁగ నందఱకునుఁ బ్రణతుఁ డయ్యె.
క॥ ప్రణయి విభీషణుఁ బరిరంభణమునఁ బరితుష్టుఁ జేసెఁ బ్రాజ్ఞుఁడు విలస
ద్గుణుఁ డంజనాతనుజుఁ డీక్షణతతులం గ్రోలి రతని సకలహరీంద్రుల్. ౩౭౧
ఆ॥ గంధవహసుతుండు కడిమిమైఁ దెచ్చిన యమ్మహాద్రికూటమందు గలుగు
నోషధుల సుగంధ మొలసినమాత్రనే యెల్లరుం బ్రబోధ మెనసి రబల!. ౩౭౨

క॥ ప్రహతులు నిహతులు నన( జన దహామహామిక గదుర( దేటి యాయోధనభూ
ర్వహు లై యందఱు( బరదుస్సహతేజమునం దనర్చి పర(గిరి తరుణీ. ౩౭౩
మ॥ శరశల్యంబులు వీడ వర్ణము ప్రశస్తం బై తగన్ సంధులున్
వరసంధానము లై మహాాజములు నై వర్తిల్ల(గా గంటు లె
ల్ల రుజ ల్వో సుఖసుప్త లట్లలరు లీలాఖేలనోల్లాసముల్
తరము న్మీఱ(గ( దెల్వి(గాంచి రచటం దార్కొన్న వా రొక్కటన్. ౩౭౪
ఉ॥ మానవరాజపుత్రు లతిమానుష మా పవమానసూను స
న్మానితవీర్యసార ముపమాకృతిదూర మటంచు భావసం
ధానము లొప్ప మేలుగని తద్ద( గవుంగిట( జేర్చి రాతనిన్
జానరొ యామహామహము జాల్పదె మూ(డు పోలాల నత్తఱిన్. ౩౭౫
ఆ॥ మున్ను( జనిన సో(కుమూ(కల నెప్పటి కపుడె సాగరంబునందు వైవ(
బనిచె నసురవిభు(డు పర(గదు రక్కసిపీనుం గొక్కటియును( బేరుసకును. ౩౭౬
క॥ కావున( గపులకె యాసంజీవని మే లొదవ(జేసె సిరి దక్కనె యే
కావరున కైన( దన దౌ భావము కర్మమును గూడి పర(గుచు నుండన్. ౩౭౭
ఉ॥ అంతట రాము నానమెయి నాహరివర్యు(డు సంతసంబునన్
స్వాంతము వొంగ నయ్యసురసమ్మతి గ్రుంగ నహార్యశృంగ మ
త్యంతరయంబునం గొని తదాస్పదసంస్థ మొనర్చి వచ్చె శ్రీ
మంతు ననామయుం డగుచు( జెచ్చెర( జేరి భజింప భావినీ. ౩౭౮

—♦ సుగ్రీవు(డు లంకం గాల్పించుట.♦—

తే॥ అత్తఱి( బ్లవంగమేంద్రు(డు హనుమ( గాంచి యర్థ్యమగు కార్యమెంచి రామాప్తి
యిట్టులనె( దేజ మొప్పార నెలమి మీఱ రాజసంబున( బర్వతరాజతనయ!. [మించి
ఆ॥ కుంభకర్ణు( డడ(గె( గూలిరి కొడుకులు మాయలాని( బెట్టి మాటుపడిన
వా(డు పొలసుదిండిఱే(డు కడంకతో రా(డు కదలి యిది దిరంబసుమ్ము. ౩౮౦
క॥ కావున లావరులెల్లం దేవునియానతిన యిపుడె తెరలని యుల్కల్
గావించుకొనుచు( జను(డా కావరుపురి( గాల్ప నా ప్రకారంబునకున్. ౩౮౧
మ॥ అనునంతం గడక న్నిశాముఖపరం బౌ రౌద్రకాలంబునన్
హనుమన్ముఖ్యులు వల్లె యంచు( జని రస్త్రాశంకు లై లంకపై(
గనదుల్కాశతము ల్గడల్కొన(గ రక్షస్సైన్య మారక్షగం
బనివార్యంబు క్షణంబునం దెరలి యాయాదిక్కులం బోవ(గన్. ౩౮౨
తే॥ శ్రీపురాట్టప్రతోలికాగోపురముల( జర్యల మహాగృహముల( బ్రాసాదములను
వెదకి వెదకి తవిల్చిరి విశ్వమూర్తి నాహుతాశను( గపులు హృష్టాత్ములగుచు.

క॥ కాల్పం దొడరె ననల్పుఁడు కల్పాంతాకార మొప్పఁగా హుతవహుఁ డా
కల్పోజ్జ్వల యప్పురిపైఁ గల్పితధృతి నెంత దలఁచి కన్నిడినాఁడో. 3౮౪

సీ. పర్వతాకారము ల్ప్రాసాదము ల్గూలె హరిచందనాగరు లలఁతిఁబోయె
నాణిముత్తియముల పోఁగుము ల్పెడె పొడులయ్యె వజ్రప్రవాళాదిమణులు
క్షౌమకౌశేయము సమసె దు మ్మట్టు లై వివిధావికౌర్ణము ల్విధముసెడియెఁ
గాంచనాస్పదములు గరఁగి నీరయ్యె నానాసన్నివేశము ల్నవయఁబాఱెఁ
దుమురుగాఁ దొడంగెఁ దునిసి యాయుధవర్మబాణఖడ్గవాజిభాండహస్తి
కక్ష్య లరదములు వికస్వరములు క్రోఁతిగములవాండ్రు లంకఁ గాల్చునపుడు.

క॥ గొడుగులు సిడములు చామర లడరెడు వైయాఘ్రరోమజాండజముఖముల్
పొడిపొడి సేసెఁ గృశానుఁడు దడయక తత్సఖుఁడు దెసలఁ దార్చెం గడఁకన్.

క॥ వివిధగృహచ్ఛందంబుల సవిధంబునఁ గాంచి మొగసి సత్వరుఁ డై పె
ల్లవియ దహించెను దివిజప్రవరుఁడు పవమానహితుఁడు పంతం బలరన్. 3౮౭

శా॥ స్రగ్దామాంబరధారు లంచితతనుత్రాణు ల్మదవ్యాపృతుల్
దిగ్దంతిప్రతిము ల్చలాక్షు లబలాతిస్నేహసంసక్తు లా
యుగ్దర్పు ల్ప్రతిఘాఢ్యు లాయుధధరు ల్వ్యాఘ్రాన్నపానేచ్ఛులున్
బ్రాగ్దివ్యు ల్హతము ల్సహస్రములుగాఁ బా లైరి తద్వహ్నికిన్. 3౮౮

ఆ॥ సెజ్జలందుఁ గొమలఁ జెంది నిద్రించువా రార్తు లగుచు నఱచునట్టివారు
దెరలు సుతులఁ గొంచుఁ దెరువుపట్టెడువారు మడిసి రగ్నిమహిమ మఱియు నెఱయ.

తే॥ సారవద్గుణగాంభీర్యసంతతములు
హేమచంద్రార్ధచంద్రసమీడితము ల
మూల్యములు చంద్రశాలాఢ్యములు దహించె
దహనుఁ డప్పురి గృహములఁ దడవితడవి. 3౯౦

ఉ॥ చిత్రగవాక్షము ల్మణివిచిత్రము లాస్థితభానుబింబముల్
సూత్రితవల్లకీనిచయసుస్వనబర్హిణనృత్యకృత్యస
త్పాత్రవిశేషభూషణవితాననినాదసముచ్ఛ్రితంబు ల
ట్లాత్రముపా లొనర్చె శుచి యద్రిసకాశపురీనివేశముల్. 3౯౧

క॥ జ్వలనపరీతము లగుచుం బలుతోరణవితతు లపుడు భాసిలె విద్యు
త్కలనల ఘర్మాంతగతాత్యలఘుజలదజాలకముల యట్లు సురూపా. 3౯౨

క॥ అనలావృతముల యగుచు భవనరాజము లవనిపైనిఁబడె నొయ్యన న
య్యనువున వజ్రధరాశనివినిహతగిరికూటములకు వియ్యము లగుచున్. 3౯౩

ఆ॥ దహ్యమాన లగుచుఁ దద్విమానాగ్రప్రసుప్త లలస లైన సుందరాంగు
లస్తభూషణలు నిరస్తవస్త్రలుగ హాహారవంబు లొప్ప నడలి రార్య. 3౯౪

క॥ నిర్దహ్యమానములు జ్వలనార్దితములు తద్విమానహర్మ్యము లొప్పెన్
నిర్దరదీప్తౌషధివననిర్దిష్టహిమాద్రిశిఖరనివహము లనఁగన్. ౩౯౫

ఆ॥ అంటఁగాల్చుచున్న యనలుని శిఖలు పైఁగ్రమ్మ హర్మ్యరాజి గానిపించె
నల్లనాఁటిరాత్రియందు సంపుష్పిత యౌ పలాశవనిక యనఁగ నగజ!. ౩౯౬

ఆ॥ హస్తిపకు లెడల్ప హస్తు లశ్వాధ్యక్షు లట్టు లలమి విడువ నశ్వములును
దెరల లంక నెఱసె దిష్టాంతసంభ్రాంతసత్త్వ మర్ణవంబు చందమునను. ౩౯౭

క॥ ముక్తం బశ్వముఁ గని నిర్ముక్తము గజ మడరుదోఁప మొనకొనెఁ బాఱన్
రక్తిఁ జెడఁ బఱచె నశ్వ మసక్తము గజ మరుగుదేర సంభ్రమ మొదవన్. ౩౯౮

క॥ ఆసనెడఁ గాలు నప్పురి భాసముదీర్ణ యయి యర్ణవము జలముల ఛా
యాసంసక్త యగుడు నది యాసంగతి రక్తి నెఱయ నై యొప్పెఁ జెలీ. ౩౯౯

తే॥ ఒక్కగడెలోనఁ గ్రోఁతుల యుక్కివమున దీప్త యప్పురి వహ్నిసందీపిత యయి
ఘోరలోకక్షయాగ్నిప్రకోపమునఁ బ్రదీప్త మైన వసుంధర తెఱఁగుఁ గాంచె.

తే॥ ధూమసంవ్యాప్త మనలసంధుక్షితంబు నైన నారీజనంబు బిట్టడలుచుండ
నాస్వనము పదియామడ లాక్రమించి మించి వినఁబడె వినువారు మిడిసిపడఁగ.

ఆ॥ దగ్ధకాయు లైన దానవు లపరులు వెలికిఁ బాఱ నఱిమి వెడలనీక
యురువడంచి రాయుయుత్సువు ల్హరివరుల్ హరిహరీ విధిచ్ఛ యాఁగవశ మె.

తే॥ రక్కసుల యఱపులు వానరప్రవరుల యార్పు లొక్కట భూనభోభ్యంతరమ్ము
దెసలు కీలాలరాశి పృథ్వియునుఁ బిక్కటిల్లు ప్రతిఘోషము ల్గార్ప నుల్లసిల్లె.

ఉ॥ అంతట రామలక్ష్మణు లహర్పతితేజు లశల్యులున్ విసం
భ్రాంతులు నై మహామహిమ పాదుకొనన్ దెఱవెంచి రక్కసుల్
చింతల పెల్లున న్మనిఁగి చేడ్పడ స్వీయశరాసనంబు ల
త్యంతరయంబునం గొని రయం బిడె యం చసురారు లుబ్బఁగన్. ౪౦౪

క॥ ఉత్తమము ధనువుఁ గొని లోకోత్తరచరితుండు రాముఁ డురుగుణకర్షం
బత్తఱిఁ గావింపంగ వియత్తలమున ఘోరతుముల మారవ మొదవెన్. ౪౦౫

క॥ బన్నములకుఁ దోడే నని పన్నె భయానకము దైత్యపక్షులు దెరలన్
మున్నెగయు నాదయుగ్మము నన్నిర్ఘోషమ్ము గడచి యడరు చునుండన్. ౪౦౬

తే॥ వేదమయ మదె యిది హాం డవేలవిభవు భవు శరాసనమునఁ బేర్చు పరిభవ మని
రాముఁడె పురారి యనియుఁ గీర్తన మొనర్చి రమరవరు లెల్ల సానందు లగుచు మగువ.

ఆ॥ ఉభయపక్ష్యరావ ముత్కట మద్దానిఁ గొని మహాత్ము రాము గుణరవంబు
భూనభోంతరంబుఁ బూరించె దెస లొంటఁ బసలువీడి బీఁటవాఱ బాల!. ౪౦౮

శ॥ కార్ముకముక్తశరమ్ములు కార్మణములు తత్పురమ్ము ఘనగోపురమున్
నిర్మలమద్గిరిశిఖరసధర్మము నడలించి త్రొఁచెఁ దరుణీమణిరో. ౪౦౯

ఆ॥ మహితు లాణములు విమానరాజంబుల హర్మ్యతతుల గృహములందు నెందు
నెడము లేక నిండు లెటికిఁ సన్నద్ధు లై రసురవరులు సంభ్రమాత్ము లగుచు.

క॥ ఆసంరంభం బెగువఁగ నాసలు విడనాడి వార లాయితపడుచో
నాసంజిత యా శర్వరి యాసందున రౌద్రి యనఁగ నై యొప్పె సఖీ. ౨౧౧

శా॥ ఆసన్నోన్నతమై తనర్చెడు ప్రతీహారమ్ము హారమ్మునం
దాసన్నాసుల గెల్వ నిల్వ నగు డయ్యంబోక యాపీఁకకుం
గానంతేనిఁ దలంగు నాతనివధం గాంక్షింతు నంచుద్ధతిన్
బాస న్నొక్కొనఁజేసె భానుజుఁ డనర్వాచీన యా సేనకున్. ౨౧౨

ఆ॥ రాజవదన! వారు రాజశాసనదూషకత్వ మంది యొండుగతికిఁ బోవు
వారలటె!మహోల్క లారూఢిఁ గరముల నెఱయ ద్వారరోధనిహితు లైరి.

—♦ సపరివారు లైన కుంభనికుంభాదుల తుములయుద్ధము ♦—

క॥ వారల యుద్రిక్తత కనివారణరావణమదాంధవారణము మదిం
బూరించెఁ గోపవహ్నిస్ఫారశిఖావితతు లొంట సంభ్రమ మొదవన్. ౨౧౩

క॥ జృంభణవిక్షోభణసంరంభములన్ రూపుదాల్చె రౌద్రక్రోధా
రంభక మిదె యన జగముల స్తంభింపంజాలు మన్యుదర్పము మహిలా. ౨౧౪

వ॥ కుంభకర్ణాత్మజాతులు ప్రథితసంరంభులు శుంభద్బలోదీర్ణు లుచ్చైశ్శరవిద్యా నిగుంభులు నగు కుంభనికుంభులం గాంచి మీర లిప్పాట నరిపాటనంబునకుం గడలొని యాపాకశోణితాక్షప్రజంఘకంపనులుం దోడరా వీడరాని యలుకం బలుకదనంబునకుం బోక బలుకదనంబునకై యడరారుచున్న యాసన్నంబు లగు బలంబుల మహాబలప్రతిబలంబులం గొని చని జయముసిరిం జేకొని రా నగుదురుగాత మని దీవించి యానతిం గావించిన నిర్దిష్టప్రకారు లవ్వీరు లెల్ల నొక్కపెట్టునఁ జెలియలికట్ట దాఁటి యురవడించు సంద్రంబులభంగి సాంద్రనినదంబు లొప్పార నిష్పారంబు లైన పూరంబుల యట్టు లగు పరివారంబులతోడఁ బ్రజ్వలితాయుధు లాదోర లాయోధనంబునకుం దరలునయ్యెడ నెడయాని మేనికాంతులకుం గాంతు లగు తులలేని భూషణద్యోతంబు లనపేతంబులుగా నభంబు సప్రభం బొనరింప నిలింపగిరు లన గిరులుకొను హరివరులును స్వాభరణమణిగణజాలావేలకరస్థోల్కాజ్వాలాభీలాభలుం గడలుకొన నురవడింపం దత్తాలోపనతతారాతారాధిపసముద్యోతితస్ఫురణలుం దోడుపడం బ్రజ్వలజ్జ్వలనంబు లగు నివేశంబుల ప్రతిబింబప్రవేశంబులం బారావారంబు తరంగంబులు సారంగంబులు నొక్కండుగా వెలుంగుల కనుంగు లగుచుండం దండోపతండంబు లై

నిండారు నిరమ్మదంబులకుం బండారుగా ద్యావాపృథివ్యంతరంబు నిరంతరప్రభా
సమానం బై భాసమానతేజోరాశి వాసిం గనుపట్టునట్టిసమయంబున. ౨౧౬

మ॥ ధ్వజరాజద్రథరాజి హస్తితురగోద్యత్పత్తిసంపత్తి సా
రజవ్రాపేతము భీమతోమరగదాప్రాసాసిశూలాసితం
బజరోల్లాసనిరాసకారణ మమర్త్యద్వేషిసైన్యంబు దు
ర్వ్రజినం బట్టులు దాఁకె వానరుల నుద్వృత్తిం గురంగేక్షణా. ౨౧౭

ఉ॥ కింకిణికాసహస్రరవకీర్ణదిశార్ణవ మాత్తకార్ముకా
స్త్రాంకగుణస్వనంబు జలజాదినినాదవినోదితాంబుభృ
త్సంకులగర్జితోర్జితము సారసుగంధిలగంధమాల్యస
ర్వాంకషగంధవాహ మమరద్విడనీకము వీఁకఁ బైకొనన్. ౨౧౮

క॥ శూరజనాకీర్ణం బతిఘోరం బవు దాని లెక్కఁగొనక ప్లవంగో
దారబల మార్చుచున్ సమిదారంభ మొనర్చెఁ గడఁక నమ్యైవిధులన్. ౨౧౯

ఆ॥ జవ మెసంగ రాక్షసబలంబు సబలంబు నరిబలంబు నఱుమునపుడు శాల
భంబు పావకాస్యపద మాప్తిఁ జొరఁబాఱు తెఱవ కానిపించెఁ దెఱవ! వింటే.

ఆ॥ మెఱసె మిగుల భుజవిసృష్టపుష్టాశనిపరిఘ మగుచు దైత్యవరబలంబు
తొడరి యప్పుడప్పుడు దొలుకారుకార్మబ్బుగమికి నీడు గాఁగఁ గంబుకంఠి!.

ఉ॥ మత్తత మీఱ నుత్సుకత మై గఱుపాఱ యుయుత్సువు ల్కపు
లుత్తలపాటునం దరుశిలాతతులం బ్రహరించి ముష్టులన్
మొత్తి యిలాతలాగ్రమున మోది నిశాచరులన్ హరించి రు
న్మత్తుల కారె వారెదిరి మార్కొని పోరెడు తీ రెలర్చినన్. ౨౨౨

తే॥ కోసి రసులఁ దల ల్కతమోసి ఖండితోసి యనుచు హరుల గిట్టి యాసురు లిలఁ
ద్రోసి రవ్వానిఁ గొని నిహతోసి మారితోసి యనుచునె వార లయ్యాసురులను.

ఆ॥ చెవులు గోటికి తలలు చేడ్పడఁ బిడికిండ్లఁ బొడిచి యవయవములు పొడులు గాఁగ
ఱాలు వైచి యార్తిఁ జాలుకొనం జేయ నడఁగిమడఁగె రాక్షసౌఘ మపుడు.

తే॥ కపిబలములోని మేటులు గదిసి రక్కసులఁ గసిమసంగి రొడళులు సొలయ మెదిపి
హరులఁ దెగఁజూచి రట్టు లయ్యసురు లసుల ఘోరరూపంబు లొప్ప సంకోచ మెడలి.

క॥ తొడరి తనుఁగొట్టఁ దఱి వేచెడువానిం గొట్టె నెదిరి సేడ్పడ నైవం
దడవునతనిఁ బడ వైచెఁ దెగడఁజూడం దెగడెఁ గొఱుకఁగడఁగం గొఱికెన్. ౨౨౬

ఆ॥ పొడువు మను నొకండు పొడుచు తేరా యను నొండు పొడుచుచుంటి నూరడిల్లు
మను నొకొండు మిన్న కలయిక నొందెదవోరి యనును గొండొకొండు వొడుచు.

ఉ॥ వస్త్రవియోగ మెంచ రపవల్గిత మెన్నరు ప్రాసముఖ్యశ
స్త్రాస్త్రలయంబుఁ బేర్కొన రయత్నసపత్ననిమీలనాస్త్ర మా

శాస్త్రమువంకఁ బో రెదిరి సావక వీడరు పోరు చర్మపుం
భస్త్రిక లాడు నాట కనుబద్ధమునాఁ దగె యుద్ధ మత్తఱిన్. ౪౨౮
క॥ పదిపదు లేడేడులు నని పొదులుపొదులు గాఁగఁ గపులఁ బొరిగొని రసురుల్
పదిపదు లేడేడులుగా గుదిగూర్చుచుఁ గూల్చి రల్ల గ్రోఁతు లసురులన్. ౪౨౯
ఆ॥ భ్రస్తకేశవసన మస్తవర్మధ్వజ మగుచు నడరు రాక్షసౌఘ మాఁగి
కోలుపులుల యట్లు కోఁతులసూపి రా ఘోరసంక్షయమునఁ గ్రోఁతివాండ్రు.

——♦ అంగదుఁడు కంపనాదులఁ జంపుట ♦——

ఉ॥ సంకులజన్య మట్లు గొనసాగఁ బ్రకంపనవేగుఁ డంగదుం
డంకిలి లేక కంపను మహాబలు గిట్టి యదల్ప వాఁడు ద
ర్పాంకిత మారవం బెసఁగ నాఁ బఱతె మ్మని సాగి పెన్గదం
బొంకముగా నమర్చుకొని బో రన మోఁదె సురారు లుబ్బఁగన్. ౪౩౧
క॥ భృశతాడితుఁ డై యతఁ డొకదశకుం బొల్పడియుఁ దేఱి తద్దయుఁ దేజో
వశగోన్నతి నెఱయుంగా నశంకితుం డగుచుఁ దొడరి యార్చుచుఁ దోడ్తోన్. ౪౩౨
మ॥ గిరిశృంగం బొకఁ డేర్చి తెచ్చి ప్రసృతిం గీల్కొల్పి రాకాసి దా
శిరమున్ లక్ష్యము సేసి వైవ హతివిశ్లిష్టోత్తమాంగాతిపీ
వరసర్వాంగుఁడు గా ధరంబడియె నవ్వాఁ డంతకు న్మన్నె కా
వరముం గొం చసువు ల్చనం దెరలి నిర్వాంతాస్రజాలాస్యుఁ డై. ౪౩౩
చ॥ భయ మొకయింత లే కతనిపాటున కూర్చుచు శోణితేక్షణా
హ్వయుఁ డడరారు నల్క దహనాకృతిఁ గైకొన స్యందనంబు బల్
రయమున కాటప ట్టగుచు రాఁగఁ, బరాగత మాత్మసైన్యము
ల్చ్ఛయగతి మూఁగఁ దాఁకె బలసాగరు వానరరాజనందనున్. ౪౩౪
శా॥ నారాచక్షురవత్సదంతశలవన్నాలీకముఖ్యాశుగ
స్ఫారాసార మెసంగఁ గూర్చి పగతున్ సంభ్రాంతునిం జేయ నా
దారి న్మేకొని పైకొనం గనలి యుద్ధాముందు వాఁ డాశరున్
సారం బొప్ప శరాసరథ్యరథశస్త్రధ్వస్తుఁ గావించినన్. ౪౩౫
ఆ॥ వాలు పలక గొంచు వాఁడిమగం డాతఁ డడర వాలికొడు కహంకరించి
చేతిఖడ్గ మొడిచి చేకొని యార్చె నెమ్మేను వొంగ రిపుఁడు మిడుకరింప. ౪౩౬
తే॥ వాని మే నుపవీతంబువరుస దప్పకుండ ఖడ్గంబున నగల్చి యురవడించి
యన్యయోధులపైఁ జనె నంత సేయు నంతకుఁడు వీఁ డనుచు వార లలుకుచుండ.
క॥ ఆయసి గదఁ గొని గొదగొని యాయతధృతి శోణితాక్షుఁ డుఱుమం గని తా
నాయత్తపడెఁ బ్రజంఘుం డాయోధనమున సురేంద్రజాత్మజు నడఁపన్. ౪౩౭

తే॥ ఇరుగెలంకుల నసురు లిర్వురు విశాఖ లనెడు చుక్కల తెఱంగున కగుచు మెఱయఁ
బూర్ణచంద్రుఁడు నాఁదగి పొలుపుఁగాంచె నంగదుండు కనత్కనకాంగదుండు.

క॥ ఓపినవాఁ డక్కొమరుని నూఁపుము నని దఱియవచ్చె యూపాక్షుం డా
పాపులకుఁ బ్రాపు దా పై పాపోన్మూలనసురూపపదపంకరుహా. ౪౪౦

ఆ॥ ఎదిరిచలము డింప నినుఁ బరిరక్షింప నరుగుదెంచిరప్పు డధికబలులు
మహితమతులు హితులు మైందుండు ద్వివిదుండు సరభసప్రసక్తి చక్కనెఱయ.

క॥ అసిచర్మగదాధరులై యసురులు ప్రతియత్న మొప్ప నలుకం జులుకం
గసిమసఁగుదు మని ప్రేలుచు గసిమసిలే కడరి రనికిఁ గల్యాణగుణా. ౪౪౨

ఉ॥ రాక్షసపుంగవు ల్మొదరి రాపొనరింపఁ గడంగి కీశవీ
ర్యక్షు లెదిర్చి వారి నద నారసి నొంపఁదలంప నామహా
ధ్యక్షుల పోరు తీరు గనునయ్యల కయ్యెను రోమహర్షణం
బాక్షణ వీక్షణంబుల కనంతర మై బలుభార మేర్పడెన్. ౪౪౩

తే॥ రథము లశ్వము ల్దారు దూరము మునుంగ వారు వరుసన నింపెడి ధారుణీధ
రాగమముల విదారించి రసురవరులు ముప్పురును ఖడ్గశరగదాముఖ నిహతుల.

ఆ॥ ముగురువీరు లెగచి ముందల గ్రిందల సేఁగు వైవ ముంచుచాయనడరు
తరుల గిరుల నడఁచుదారిమైఁ బెనఁగొన నొక్క రొకర చాలి రుత్పలాక్షి.

శా॥ ఆలోనం బలుఖడ్గము న్గొని ప్రజంఘాఖ్యుండు సాటోపుఁడై
వ్రాలె న్వాలిసుతు న్మడంచుకడఁక న్వాఁ డశ్వకర్ణాఖ్య మా
సాలం బొక్కఁడు దాల్చి రక్కసుఁడు నిస్సారుండ కా మోఁది యా
లీలన్ జాఁచిన సాసితద్భుజము నుల్లేఖించెఁ బెన్ముష్టిచేన్. ౪౪౬

క॥ ఆహతి నాహతకుఁడు పరు లాహా యన విడిచె ఖడ్గ మది గొని యరి ని
ర్దేహు నొనరింపఁ గవిసిన నాహరివరు వజ్రముష్టి నాతఁడు వ్రేడెన్. ౪౪౭

చ॥ పిడికిలిప్రేటు ఫాలమునఁ బెల్చనఁ దాఁకిన నైంద్రిసూతి మై
దొడిబడ సంచలించి ధృతిఁ దొడనె కాంచి యదల్చి ఖడ్గ మే
ర్పడఁ గొని వానిశీర్ష మెడఁబాపె శరీరముతోడఁ గానివా
రడ రెడఁ బాల్కొనం దెరల నైనజను ల్మది నుబ్బియార్వఁగన్ ౪౪౮

తే॥ ఆపితృవ్యునిఁ బగతుఁడట్లులఁతిదునుముటరసియూపాక్షుఁ డశ్రుపూర్ణాక్షుఁడగుచుఁ
దూణముల బాణముల లేమి దొలఁప దలఁపడం గడఁగెఁ దేరుడిగ్గిఖడ్గంబు దాల్చి.

తే॥ ఒరయనొలయు నసురు నొరగిల్లం దాఁచె నురమునందు ద్వివిదుఁ డురవడించి
యంతఁబోవనీక యనువెంచి పొదివి పీడింపఁ దొడరె నెదిరి డిందువడఁగ. ౪౫౦

ఆ॥ సోదరునిఁ బట్టెనంచు నిర్వేదమొదవ శోణితాక్షుండు శత్రుసంక్షోభణుండు
ఘనగదాగ్రంబుననురంబుగమియఁ బొడిచె ద్వివిదునతఁడొల్లఁబోయియూదిటవు సెడగ.

క॥ తెరలియుఁ దెరలని యమ్మొయి తెరువున నురుబలుఁడు వాఁడు తెప్పిరిలి తోడ్తోఁ
బురికొని రిపుఁ డెత్తిన గద హరించి యెదిరించి పెలుచ నార్చెం దిరమై.
ఆ॥ అంతలోనె ద్వివిదుఁ డరవాయి గొనని ప్రవీరుఁ డలఁతిఁబోని బీర మొప్ప
నొలయు కరతలమున యూపాక్షు నురము దాఁ కించెఁ బ్రబలుఁ డతఁడు క్రిందుపడఁగ.
క॥ ఆయిరువు రిరువురం గొని యాయోధనముం బొనర్చి రలయిక లొదవన్
ద్రోయుచు వ్రేయుచుఁ దీవ్రం బీయది యని స్వీయు లెడఁద నెంచి తలంకన్.
చ॥ కవిసిన శోణితాక్షుని ముఖంబు నఖంబుల గ్రొచ్చి వ్రచ్చి యా
ద్వివిదుఁడు నేలఁద్రోచి పులితీరునఁ బైకొని యొత్తియొత్తి మే
నవియఁగఁజేసి బిట్టుసొగయం గడఁకం దెగటార్చి యార్చె మా
కవుర రు వీర లెప్పు నని యంబరచారులు సంభ్రమ మొందఁగన్. ౨౫౫
ఆ॥ జోడుకోడె వానితోడు మైందుండు యూపాక్షుఁ గొఁగిటం బ్రయత్న మొప్ప
నలమి వెసకనీక యలయించి సొలయించి యుసురు లెడలఁజేసి యుర్వి వైచె.
ఉ॥ రాక్షసరాజసేన హతరక్షణ యై వెగడొంది కుందుచున్
లక్షణహీన యై చనియె లావరి కుంభుఁడు జృంభణంబు సం
వీక్షణముం బొనర్చు నెడ వేగమ కన్గొని దానిఁ గాంచి వాఁ
డాక్షణమే పరాకెడలి యాదృతిసూపి రణోత్సుకాత్ముఁ డై. ౨౫౭
ఆ॥ తనరు వీరు లట్లు తరుచరవరులచే పడియు టెంచి తనదు మంతనమునఁ
గోపమెగువ మేటికోదండముం గొని యడరెఁ గపులసేన మడఁతు ననుచు. ౨౫౮
చ॥ పొదలుగ గ్రొచ్చి గ్రొచ్చి బరిపోటుల వ్రేటుల నొంచినొంచి పె
న్గుదులుగఁ గూర్చికూర్చి యెడఁ గోయని డీయని యార్చియార్చి య
య్యదనునఁ గుంభుఁ డొక్కరుఁడ యందఱముందర నన్నిరూపు లై
యద రదరంట ముల్కిగమి కర్పణసేసెఁ బ్లవంగమావళిన్. ౨౫౯
క॥ ఆశీవిషవిఖ్యాతము లాశరు శరములు సొరంగ నటునిటుఁ బోవం
గా శరణ మరయఁ గాక వినాశముపా ల్గాఁదొడఁగిరి నగచరు లొకటన్. ౨౬౦
ఆ॥ వాని సశర మాత్తవల్గనం బుత్తమం బైన చాపరాజ మపుడు మెఱసె
నధికలక్ష్యవిద్యుదైరావతార్చులఁ దగు ద్వితీయ మింద్రధనువు వోలె. ౨౬౧
శా॥ కర్ణాకృష్టవిముక్తసత్కనకపుంఖప్రోల్లసత్పత్రకా
కీర్ణోదీర్ణశరమ్ము చే ద్వివిదునిం గీశేంద్రుఁ దాఁకింప న
భ్యర్ణక్ష్మాస్థలి వాఁడు గూలె గతివిన్యాసంబు చూపట్ట సౌ
వర్ణాద్రిశృతకూటమో యనఁగ వైవశ్యం బవశ్యంబు గాన్. ౨౬౨
ఆ॥ పెద్దపోరులందుఁ బేరొందియున్నాఁడు వీఁడు పడె నిదేమి వింత యనుచు
శీఘ్రు మొక విశాల శిల యెత్తి రక్కసుమీఁద వైచె నతనిసోదరుండు. ౨౬౩

క॥ పరువిడి వచ్చితి వెంతటి పరు వొందెదో యనుచు నసుర భల్లము లై ద
వ్వరుసఁ బరగించి దానిన్ ధరఁ దునుము రై వడ నొనర్చి దర్పోద్ధతుఁ డై. ౪౬౪
క॥ సుముఖము శర మొక్కఁడు దొడి ప్రముదితుఁ డవ్వాఁడు విడువ ఫణినిభ మది మ
ర్మము నోనాటిన మైందుఁడు శ్రమమెగువం గూలె నిల నశక్తుఁడపోలెన్. ౪౬౫
మ॥ బలరాసుల్తనమేనమామ లిలపై వ్రాలం గరాలాస్యుఁ డై
బలభిత్పుత్రుఁడు రావణానుజసుతుం బంహిష్ఠచాపోద్ధతున్
గలనన్ రంహ మెసంగఁ దాఁకె నతఁడున్ బాచాయసంబుల్ త్రిశా
తలసద్బాణములుం దవిల్చి నిలిపెం దత్పక్రమం బెంచుచున్. ౪౬౬
క॥ మదహస్తి తోమరంబుల నదవదపడురీతిఁ గైన యైంద్రితనూజున్
బ్రదరశతంబుల వివిధాపదానముల గ్రొచ్చి యలఁచెఁ బటువేగమునన్. ౪౬౭
ఉ॥ అంతలుసేయు రక్కసుని యాగడ మెన్నక విద్ధుఁడయ్యు న
త్యంతబలప్రతాపరచితాకృతి యై గిరిపాదపాదపా
క్రాంతు నొనర్చె నయ్యదియ కార్ముకను వృష్టిగ నంగదుండు వి
భ్రాంతి దలిర్పఁ దా నెదిరి ప్రల్లదమార్పఁ దనర్చు నేర్పునన్. ౪౬౮
ఆ॥ అంతకాభుఁ డసురుఁ డన్నింటి మునుమిడి నిశితబాణటంకనివహములఁ దె
రల్చి యఱుము రిపుని రా పెంచి సంధించెఁ గార్ముకమున రెండుఘనశరములు.
క॥ ఆరెంట నగచరోత్తము గారింపఁ దలంచి నాటెఁ గనుబొమ్మలఁ ద
త్పారిప్సితకర్మము సెడఁగా రాక్షసుఁ డలుకతోడి కరకరినెరయన్. ౪౭౦
ఆ॥ పమ్మె రుధిర మెడలు గ్రమ్మె నేత్రమ్ములు దెఱవఁ గాక గొంతుతెఱవు లేక
యుల్కలం గరీంద్రునోజ నాజవనాగ్ర్యుఁ డుల్కె నట్టిముల్కులోరయ నవల,
ఉ॥ కన్నులు చేతఁ గప్పుకొని క్రన్ననఁ దక్కినపాణిచేతఁ నా
సన్నము సాలముం దడవి స్కంధ మురస్థలపీడనంబునన్
మన్నన పాదుకో లెడలి మ్రాన్పడఁజేసి పెకల్చె నాతఁ డ
భ్యున్నత మా గజాధిపతి యోజము మీఱ నరాతి నొంపఁగన్. ౪౭౧
క॥ తలవంచె శాఖిఁ గైకొనఁ దలయెత్తెందాని దాల్చి తరలెం బెలుచన్
దలరింతు విమతు ననుచున్ దలకింతయు లేక వాఁడు దర్పోద్ధతుఁడై. ౪౭౩
ఆ॥ ఇంద్రకేతునిభ మహీంద్రవిస్తారమ్ము మందరమ్ముఁబోని మ్రానిఁబూని
పగతు నడఁప నడరు ప్లవగేంద్రసుతుఁ గాంచి యసురులెల్ల నడిఁకి రమరవంద్య.
క॥ నెమ్మె లెడల్చెడు నవి యే డమ్ములు వడిఁ దొడిగి యసురుఁ డార్చుచు నమ్మా
నిమ్మారసి దునుమాడెను బమ్మెరపా టెనసి కీశపతిసుతుఁ డఱవన్. ౪౭౫
ఆ॥ ఎయిది వ్యధితుఁడయ్యె నింద్రపుత్రజుఁ డదె యబ్ధిమగ్ను నట్టు లనుచుఁ గపులు
రాముతోడఁ దెలుప రణకోవిదులఁ బంచె వరుఁడు హరుల జాంబవత్ప్రముఖుల.

క॥ ఆవానరశార్దూలులు శ్రీవఱలెడు రామునాజ్ఞ సేకొని రుషకుం
దావలము లగుచు దుమికిరి స్థావరములు ఱాలుఁ గొంచు సంరంభమునన్. ౪౭౭

ఆ॥ పతిరిరక్షిపం బ్రబలు రట్లు దాఁకినఁ గుంభుఁ డోజ మెసఁగఁ గ్రుద్ధుఁ డగుచు
వారిఘురము వృక్షవరవాట మటు లాఁగె నడరు బాణనివహ మడ్డుసేసి. ౪౭౮

క॥ ఆశుగపదవిం బడి వా రాశుగతు ల్గడవఁజాల రై ర త్తఱి వే
లాశ న్మహోద్ధు ల ట్లమరాశంసితు లయ్యు దుర్మదాశరదమనీ. ౪౭౯

మ॥ శరవృష్టిప్రచయార్దితాగచరసంస్థానేశులం గాంచి సో
దరపుత్రుల్ శ్రమితుం గనుంగొని రణాస్థం గుంభకుంభిం దెర
ల్ప రహిందాఁకె హరీంద్రుఁడే సరయసంపాతంబు వీక్షించి యం
బరచారు ల్వినుతింప భక్తజనతాపాపావలేపాపహా. ౪౮౦

ఆ॥ కొడుకు వెనుక నుంచుకొని కుంభకర్ణుని కొడుకు దుడుకుతనము గొడవ లెంచి
కురిసె సాల శైలకూటంబు లొక్కట నాకసంబు కుతల మాక్రమింప. ౪౮౧

తే॥ కినిసి యసురుండు నిశితాస్త్రకీర్ణవృష్టి నుపలతరువృష్టిఁ గెడపంగ నోజఁ దనరె
ఘోరరూపంబు లగు శతఘ్నుల గణంబు లారణాంగణమునఁ దీర్చి నట్లు గాఁగ.

క॥ తరువర్షము దెరలించిన దరలఁడు విశిఖౌఘు మడరఁ దనుకఁడు కడు లా
వరి వాఁ డర్థిపైఁ బడి హరి శరాసముంబొని విల్లుఁ జక్కానరించెన్. ౪౮౩

ఆ॥ అటు సుదుష్కరమ్మ యగు కర్మము నొనర్చి యర్చితుం డమాస్కరాత్మజుండు
భగ్నశృంగ మగు ద్విపమ్ముపద్ధతి నున్న యసురుఁ గాంచి యిట్టు లనియె నపుడు.

సీ॥ ఓనికుంభాగ్రజ!యురుబాణవేగుండ వన నైతి నీబీర మద్భుతంబ
రావణు నంతటి రహిఁగాంచితి ప్రభావసన్నతులం గూర్పజాలిన నెఱి
బలివృత్రహాకుబేరవరుణోపముఁడ వీవ బలవృత్తములఁ దండ్రిపాడిఁ గొంటి
విట్టి ని న్నహచాపు నింద్రాదులేని జితేంద్రియు నాధు ల క్లెదురనేర
రింకఁ దొడరి నిల్వ మీజాడ నేఁ జూడ నింద్రశంబరులకు నెట్టు లట్ల
పౌనరెఁ బో రటంచుఁ బొరువులు దిలకింప బుద్ధిగన్న వలను పొడవుపడఁగ.

తే॥ నీపితృవ్యుండు వరదాననియతిఁ జేసి గెలిచెను సురాసురుల నను కీర్తిఁగాంచెఁ
దా నొగి జయించె ననమానదర్పమునసె నీదుజనకుండు బలయోగనిష్ఠితుండు.

క॥ అవ్వారలఁ దలకడచితి వవ్వాసవజిత్తుకన్న నద నన నై తీ
వవ్వారములు గిరములు లే కివ్వరవీర్యమున సాటి యెవ్వ రనంగన్. ౪౮౭

ఆ॥ తనుకుచున్నవాఁడఁ దారసిల్లియు నిన్నుఁ దొడరి యేయ బిట్టు బడలినాఁడ
వెదిరి గడఁచి మడఁచియింతలంతలు సేసి యానొ కాదొ శ్రాంతు నలఁచుటనుచు.

క॥ కావున విశ్రాంతిం గొని నీవెరవుం బలము నెరపి నెగడుము తోడ్తో
దీవరబడ నేమయ్యెడు నావల నరయంగఁ దలఁచి నాకవిరోధీ. ౪౮౯

ఆ॥ సావమానసరణి నావహింద్రోయు సుగ్రీవు వాక్య మాజ్యరీతిఁ దోనుక
నగ్ని తేజ మట్టు లతని తేజము వృద్ధిఁబొందెఁ గ్రోధకలన పొంగిపొరల. ౪౯౦
క॥ తటుకున నినసంభవుఁ దన పటుబాహాయంత్రణమునఁ బట్టి విదిర్చెన్
జటులుఁడు రక్కసుఁ డమ్మెయి దిటమున నాతండు వాని దిమ్మడఁగించెన్.
క॥ ఆహితమదము లిభము లవ్యాహతదర్పమునఁ బోరునట్టు లిరువురున్
సాహంకారతఁ బెనఁగొని రూహాపోహక్రమంబు లోజ దలిర్పన్. ౪౯౨
ఉ॥ పట్టులు పట్టుచున్ విడుచుపట్టుల నొండొరులం దెరల్చుచున్
మట్టులుమీఱుచుం బొడుచు మార్గము లెంచుచు నూర్పు లూర్చుచున్
గట్టులుకం ప్రబధూమితవికస్వరకీలిక లాస్యసీమలం
బుట్టుచు మెట్టుచు న్నెఱయఁ బోరిరి పో రరుదార నయ్యెడన్. ౪౯౩
క॥ తదుభయపదాభిహతులన్ జదికిలఁబడియెన్ ధరిత్రి సంక్షోభించెన్
గొదకొనుతరఁగలతో నయ్యుదనున వరుణాలయం బయంత్రిత మగుచున్. ౪౯౪

—♦ సుగ్రీవుఁడు కుంభు గండడఁచుట ♦—

ఆ॥ ఉదధితలముఁ జూడు మోరి! యనుచు సౌరి వాని నెత్తి వైచె వార్ధి నదియు
వింజ మట్టు లెగసె విస్మృమరజలధార లాకసమ్ముతలము నాక్రమింప. ౪౯౫
క॥ ఆలీల మునిఁగి తేలి చివాలున వా లట్టు లెగచి వడి రవిజుఁ బవిన్
బోలినపిడికిటఁ బొడిచెం గీలాలము లురల నురము గెఱకొని పగులన్. ౪౯౬
చ॥ పటపట మంచు నస్థిభృతపంజర మొయ్యన మ్రోయ వజ్రపుం
జటచట లుద్వహిల్ల గిరిచాల్పునఁ జా ల్పొనర న్మిడుంగుఱుల్
పటుతరకీలలుం దొడరు ఫక్కికి వక్షము పక్షమై తగన్
జటులుఁ డతండు చేడ్పడక శాత్రవు నాత్రప ముంచి యుగ్రుఁడై. ౪౯౭
మ॥ బలుముష్టిం బలుఘృష్టు లుల్లసిల భాస్వద్బింబసంకాశమై
వెలయం జక్కనమర్చె వజ్రనిభ ముద్వీర్యంబు నౌ దాని సం
బలుఁ డర్కాత్మజుఁ డాబలారిరిపు చేడ్పాటొంచి తద్వక్షము
న్మలయించెన్ బొలియించె నంచుఁ గపు లానందాబ్ధి నోలాడఁగన్. ౪౯౮
క॥ బహ్వాశిసుతుఁడు దాన న్విహ్వలుఁడై కూల నుసుఱు వెడలెను శమనుం
డాహ్వానించిన యట్లుగ జిహ్వాక లాలాస్రవితతిఁ జేడ్పడి యెడలన్. ౪౯౯
ఆ॥ అగ్గి యాఱినట్టు లంగారకగ్రహం బవని వ్రాలినట్టు లగుచు నసుర
రుద్రసమభిపన్నరూపుఁ డౌ నర్యము మూర్తి దగు ప్రకారమునఁ దనర్చె. ౫౦౦
ఉ॥ భీమపరాక్రముండు రిపుభీముఁడు నౌ ప్లవగర్షభుండు సు
త్రామవిరోధి నట్టి బలుతాఁకునఁ ద్రోవ సశైలవస్య యా

భూమి వడంకె రక్కసులు పోఁడిమి దక్కి భయార్తు లౌచు నొం
డేమియుఁ దోఁప కుండిరి దిగింద్రులు పొందిరి విజ్వరత్వముల్. ౧౦౧
ఆ॥ కుంభుపాటుఁ గని నికుంభుండు తనయన్న నింతసేసెఁగాదె యీతఁ డనుచుఁ
క్రోధమున దహించి కూల్చునో యనఁగ సుగ్రీవుఁ గాంచెఁ గనులకీల లెగయ.
శా॥ స్రగ్దామప్రతిభిన్న మద్రిశిఖరోచ్ఛ్రాయంబు సారోల్లస
ద్దిగ్దంతావళసాధ్వసప్రద మసంవిగ్ధప్రతాపం బధి
ప్రాగ్దేవాభయదంబు వజ్రకనకప్రఖ్యోరుభూషం బనీ
దృగ్దర్పావహ మా మహాపరిఘ మర్థిం గొంచు యుద్ధార్థి యై. ౧౦౩
క॥ ఇది కాలదండమొకో యదియే యగునేని నీతఁ డంతకుఁ డౌ ని
య్యది యింద్రుధ్వజమొ వజ్రమొ యెది యైన బలారి యంచు నెదిరి తలంకన్.
సీ॥ పరిఘంబుఁ ద్రిప్పునప్పాట సైన్యంబెల్ల దూరదేశము ద్రొక్కి తొట్రుపడఁగ
వదనంబు దెఱవ నివ్వాతిపా లౌదుమో యని భూతనివహంబు లాత్ర మెనయఁ
జుఱచుటఁ జూడంగఁ జూచెఁబో యింకేది గతియంచు ఖేచరు ల్గడచిచనఁగఁ
గాల్గదల్చినయంతఁ గదలె నాపైవచ్చు ననుచు వీరావళి యలస గాఁగ
మారుతగ్రంధి విస్ఫోట్యమానభావమంద మిన్నందు మంట ల ట్లదను లగుచు
ధూమలేశంబు దోసంబు దొడరనీక దొడర ఘూర్ణిల్లుచు సురారి దొరసె ననికి.
ఆ॥ మాలతోడి భూషణాలితోఁ బ్రహరణపాలితోడ వాఁడు పరిఘవిల్లి
యింద్రధనువుతో సమిద్ధవిద్యుత్క మా నభ్ర మనఁగఁ బెరసె నభ్రకేశి! ౧౦౬
ఆ॥ త్రిప్పెఁ బరిఘ మయ్యుదీర్ణుండు దానితోఁ దిరిగె నలకతోడ దెసలతోడ
ఖచరనగరితోడ గంధర్వపురితోడఁ బ్రాంచితేందుభము నభస్థలమ్ము. ౧౦౭
తే॥ అసుర ప్రలయాగ్ని యట్టు లయ్యదనుర్ దురాసదుం డయి తోఁచె విభాసమాన
పరిఘ పరితస్సరత్ప్రభ ల్పరిఘవిల్లఁ గపు లకాలాంతకులు గాంచు కన్నులకును.

—♦ హనుమ నికుంభు మ్రందించుట ♦—

క॥ రక్కసులయ్యేని వానరు లుక్కళులేయేని మెదలనోపరు భీతిన్
జక్క నిలిచె నంజనదా నక్కా న్పెకఁ డురము సాఁచి యక్కాలమునన్.
క॥ పరిఘోపమ భుజుఁ డసురుం డరిఘ్ను మాపరిఘరాజ మర్కాభము ది
ర్దిరఁ ద్రిప్పి బలి మహాబలవరతనయుని యురము దాఁక వైచెం దరుణీ. ౧౧౦
తే॥ సంస్థిరవ్యూఢ మతని వక్షస్స్థలమున నదియు శతధావిశీర్ణ మై యపుడు మెఱసె
నంబరంబునఁ దోఁచి యొయ్యన విదీర్ణమైన యుల్కావిశేషమో యనఁ దనర్చి.
ఆ॥ కొండ యతఁడు గదలెఁ గోయని యార్చెఁ గంపించెఁ దోడిదగుచుఁ బృథ్వి యన్ని
యసురుపాటు దెలుపు నట్టి యుత్పాతంబు లయ్యె నయ్యెడను సురారిదమని.

చ॥ తనబలమెల్ల నొక్కఁడుగఁ దార్చె ననం దనుపారు ముష్టిఁ దె
ప్పునఁ బొనఁగూర్చె నయ్యనిలపుత్త్రుఁడు సంబలుఁ డానిశాటు చి
క్కనియెద దీని కగ్గమవుఁగావుత మం చని వ్రేసె నగ్గి తో
డనినటులై స్ఫులింగతతి యగ్గలమై నెఱయంగఁ బార్వతీ. ౫౧౩

ఆ॥ మెఱుఁగు మెఱయు తెఱగు మేకొనె నొకజ్వాల వాయుసూను ముష్టివర్తనమున
వాని యురము ప్రిదిలె వఱదలై నెత్తురుల్ వఱలఁజొచ్చె నొడలి వడఁకు హెచ్చె.

తే॥ తెరలి స్వస్థుండగుచుఁ దోన మరలివచ్చి పట్టుకొనియెఁ బ్రబలుగాడ్పుపట్టిఁగడఁకఁ
గడఁగి యార్వఁదొడఁగిరి లంకానివాసు లంతయుం గాంచి యిఁక నెట్టులగునొ

మ॥ తనుఁ గొంపోయెడు దానవుం గడఁకమైఁ దాఁకించెఁ బెన్ముష్టి వ [యనుచు.
జ్రనిభం బయ్యది దానఁ జేడ్పడు రిపుల్ సంక్షీణుఁ గావించు నే
ర్పున క్షోణిం బడవైచి రాచి బలితంపున్వ్రేటు లొందించి వే
గనిపాతం బెనయించెఁ బైకెగసి వక్షమ్ము న్మహోదగ్రుఁడై. ౫౧౬

తే॥ అమ్మెయిం గాల నసురయురమ్ము ద్రొక్కి బాహుయుగమునఁ గంధరఁ బట్టి త్రిప్పి
సిరము దెరలించె భీషణస్వరముగాఁగ నది యఱవ వైచి యవలఁ దానార్చి పేర్చె.

క॥ పావని పగతు నవాగ్దిక్పావనిఁ జేరంగఁ బనుప నయ్యెడఁ బొడమెన్
భావరణీయము లగుచున్ భూవరసుతరాక్షసేంద్రపుత్త్రాజికథల్. ౫౧౮

ఉ॥ చేడ్పడి యానికుంభుఁ డటు జీవముఁబాసినయంత హృష్టులై
గాడ్పుకొమారుఁగూర్చి యొడికంబుగఁ గూర్చిరి సంస్తవంబు గే
ల్మోడ్పు లమర్చుకొంచుఁ గపులు న్సురలు న్మునులున్ దిశౌఘ మా
చాడ్పున మ్రోసె రోదసుల సంచలనస్ఫురణంబు లేర్పడన్. ౫౧౯

క॥ బలమఱి రక్కసు లింకం బల మున్నదె మన కటంచుఁ బాఱిరి పురికై
వలనిది యని తోఁపమియును వల నిది యని చూపఁ దోడివారిం గొనుచున్.

తే॥ తోడుతోడఁ జనినవారితోడఁగూడఁ గుంభుఁ డుక్కఱిమడిసె నికుంభుఁ డడసె
నాన యే మను నుడి చెవి నానఁ దెరలె రావణుండు త్రిలోకీవిరావణుండు. ౫౨౧

క॥ అనలుం డాజ్యాహుతిగతిఁ గనలునఁ దా నెగసిపడియు గాఱించెడు శో
కనికాయం బమ్మెయి ధృతి కని కాకుండు మని పొదువ నతివిహ్వలుఁడై. ౫౨౨

ఆ॥ రెంటినడుమఁ జిక్కురీతి రీతికిఁ బాపఁ బాపరతుఁడు వాఁడు పఙ్క్తిముఖుఁడు
మడఁగునట్టు లగుచు మకరాక్షు ఖరపుత్త్రుఁ గాంచి యిట్టులనియెఁ గంబుకంఠి.

—♦ రావణునాజ్ఞ మకరాక్షుఁ డెదిర్చి రాముచే మడియుట ♦—

ఉ॥ పుత్త్రుఁడ! సైన్య మొప్పఁగొని పొమ్ము రణమ్మునకున్ ధరాధిరా
ట్పుత్త్రులఁ గ్రోఁతులం గెలిచి పొంపెసలార జయమ్ముఁగొమ్ము నా

యాత్రముఁ బాపు మెందును సయాత్రుఁడ వీ వయియుండ శ్రీలకుం
బాత్రుఁ డనంగఁ బే రెనసి పాలనసేయఁగఁ జాలితిం జుమీ. ౨౨౪

క॥ ఆరావణుఁ డటులనినఁ శూరంమన్యుండు ఖరునిసుతుఁ డా లె మ్మో
నారూఢి నెరయ నంతలు రారాపొనరింతు ననుచు రణలాలసుఁ డై. ౨౨౫

ఉ॥ ఆతనికిం బ్రదక్షిణవిధాంచితసన్నతు లాచరించి వి
ఖ్యాతుఁడు వాఁడు తేనిదగు నానతి శీర్షమున న్ధరించి ని
ష్ప్ర్యాతరుచిప్రరోహ మయి యొప్పు స్వదేహము వీడఁగాంచి సం
పాతసహు న్బలాధిపుఁ బ్రపన్నుఁ గనుగొని చీరి యిట్లనున్.  ౨౨౬

శా॥ సన్నద్ధం బొనరింపు మద్రథము శ స్త్రం బైన సైన్యంబు నా
సన్నం గూర్పుము దర్ప మొప్పఁ బ్రథనోత్సాహంబు పాటింపు మీ
వెన్నంబోలిన బంటు విట్టితటి నీయేర్పాటు మెచ్చంగ నా
నౌన్నత్యంబున మన్ను మి న్నలము సాయంబంచుఁ గాంక్షించితిన్. ౨౨౭

తే॥ అనిన నింతలు గావలెనయ్య దీని కానసేసినఁ జాలదే యనుచు నేగి
యన్నియుం గూర్చెఁ దెలిపిన యంతకన్న మిన్న సేసినపని యను మెలపు దోఁప.

క॥ తనదు సిరి యని ప్రదక్షిణ మనువొందఁగఁ జేసి యాఖరాత్మజుఁ డా స్యం
దనముపయిం దనరా రెను గనదుజ్జ్వలమూర్తి కార్ముకముఁ గైకొనుచున్.

క॥ సూతుం బ్రేరేపించెను మాతలి నింద్రుండపోలె మహనీయగుణో
పేతుఁడ వీ వీతటి నా కాతతజయ మొసఁగ మెలఁగు మని సంప్రీతిన్. ౨౩౦

ఉ॥ రక్కసులం గనుంగొని బిరాన వరానతిచొ ప్పెఱింగి మీ
చక్కటి వానరౌఘములఁ జక్కనరింపఁ దలంపుఁ డట్టు లే
నెక్కటి రామలక్ష్మణుల యే పుడిగింతుఁ గపీంద్రు నొంతు పే
రెక్కినవానరాధిపుల నెల్ల వధింతు శరోత్తమంబులన్. ౨౩౧

శా॥ శూలోత్పాతనిపాతసంభవమహాశుష్మార్చు లొండొండ ఘ
ష్కాలోలేంధనసంచయంబుఁ బలెఁ గీశౌఘంబుఁ గాల్పంగ న
న్నాలోకింపఁగలారె శాత్రవులు మి మ్మా యందు రే మందు రే
యాలంభంబునయందు నా పనులయ ట్లాపన్నతం బొందరే. ౨౩౨

చ॥ అను మకరాక్షు నన్నుడుల కందఱు ముం దరుదంది సంతసం
బను వెనయింప లెస్స యని యాదృతిమైఁ బయనం బొనర్చి ర
ద్దనుజుల దండు వెల్వడెఁ బ్రధానవిధానము లొప్ప భేరికా
స్వనము లెసంగ ఢ్వేళలుఁ బొసంగఁ బ్రహాసకృతు ల్దెస ల్గొనన్. ౨౩౩

ఉ॥ అందఱు కామరూపులె కృతాస్త్రులె దంష్ట్రులె పింగలాక్షులే
యంద ఱిభేంద్రతుల్యులె భయానకమూర్తులె ముక్తకేశులే

కొందలమందువాఁ డనఁగఁ గోటికి నేనియు లేఁడు క్షోణికిన్
స్పందముగూర్పనయ్యె రభసంబు రసోచిత మా భరంబునన్. ౫౩౮
తే॥ శంఖభేరీసహస్రము లనంహతములు ష్వేళితాస్ఫోటితములు సుశ్రీ రహించి
యొక్కఁ డై పిక్కటిలి దివ ముర్వి దెసలుఁ జాల విక్కథ కని నగఁజాలె నగజ.
సీ॥ తొలుదొల్త సూతు ప్రతోదంబు కరముననుండి ప్రభ్రష్ట మై యుర్వి వ్రాలె
నాదట రక్కసు శరదంబునఁ దనర్చు విజయధ్వజము రిత్త విఱిగిపడియె
రథ్యము లీవిక్రమరహితంబు లై సాస్రముఖము లై యడుగిడి మొగ్గతిల్లెఁ
బాంసుయుక్తుం డయి పవనుండు ఘనదారుణావేశమున నెదురై విసిర్చె
రౌద్రుఁ డౌ మకరాక్షు దుర్మతి మతము మహాహవమునకుఁ గూర్చు నిర్యాణమునను
గాని పోని నిమిత్తము లలిగెఁ గాని యాతఁ డస్వస్థుఁ డనుమాట యంసు లేదు.
ఆ॥ వీర్యవత్తములు ప్రవీణులు రక్కసు లావని నెన్నికొనిన వలనుపడదు
కర్జ మనుచుఁ జక్క గడచిరి చేరిరి తాఁకి రరిబలముల దాశరథుల. ౫౩౯
ఆ॥ ఏనుఁగుల ఘటలకు నెనుబోతులకును సవర్ణు లైన దనుజనరులు తొడరి
నేను నేన యనెడు నెఱు లొప్పఁగ గదాసి భిన్నభేదు లగుచుఁ బెరసి రబల!.
ఉ॥ ఆర్పులు మిన్నుముట్ట నడియాసల కాస లెదుర్పడంగ బల్
నేర్పులు సాగ వేగములు నివ్వటిలం ద్రిదశారు లేడ్తెఱల్
మార్పుల కందనీక గరిమంబుల సన్నగిలంగనీక ని
ట్టూర్పు లెసంగనీక సమరోద్ధతు లై విలసిల్లునయ్యెడన్. ౫౩౫
మ॥ మకరాక్షుం డనువాఁడు వచ్చె ననికి న్మల్లాడఁగాఁజొచ్చి రా
ప్రకటోద్రేకుని తోడిబంటు లరుల న్బాటింపఁబో రన్న వా
ర్తకుఁ గుప్పించిరి మింటిపై కెగసి రాసం బెంచి రాయోధనం
బకలంకం బెపు డెప్పు డం చనిరి వీరాగ్రేసరు లావనరుల్. ౫౪౦
తే॥ దేవదానవులకు నైన తెలివు దోఁప నానిశాచరులకుఁ బ్లవంగాధిపులకుఁ
జరిగె రణ మది రోమహర్షణము గాఁగ నమరు లియ్యది సుమహత్తరమ యనంగ.
తే॥ కపినిశాచరు లయ్యెడఁ గడఁగి శూలపాదపశిలాస్త్రపరిఘనిపాతనముల
నొండొరులఁ దాఁకి మర్దించి రుక్కడంచి రెగిచి పయిఁబడఁదొడరి రిభేంద్రగమన.
తే॥ శక్తిశూలగదాపరశ్వధము లసులు ముసలముద్గరతోమరముఖ్యములును
విసరి విసరి విదారింప విరులుకొలిరి రక్కసులు వానరుల నగరాజతనయ. ౫౪౩
ఆ॥ వారిసాధనముల వారించుచు సహించు వార లగుచు శిలలు వరతరువులు
పోలఁగా నెఱపుచుఁ బో రొనరించిరి కపులు నాకపులు వికాస మొలయ. ౫౪౪
చ॥ అది గని దుర్దముండు వివిధాస్త్రపరంపర లుచ్చిపోవఁగాఁ
బొదలుచు నేసి యేసి ఖరపుత్రుఁడు వానరులం గలంప న

య్యదనునఁ జేవిదిర్చుటకు నైనఁ దటాలునఁ జాల కెల్లరున్
మదమఱి పాఱఁజొచ్చి రని మార్గ్యానలేక వ్యలీకవారణీ. ౧౪౫

ఆ॥ అట్టివారు వనచరాధిపు ల్విద్రుతమాత్రు లగుట కుబ్బి మార్తు రెగచి
సింహనాదములు విశిష్టులై పొనరించి రంతలోనె విజయ మబ్బె ననుచు. ౧౪౬

చ॥ అదిగని తాటకాంతకుఁ డహో నిలుఁ డం చని బాణవర్షముం
బదరుచుఁ గూర్చి రక్కసుల పంకము బింకముఁ బాపి దీపిత
ప్రదరములన్ ధరించుటయుఁ బాపరతుండు ఖరాత్మజుం డస
ద్విదితుఁడు క్రోధమూర్ఛితుఁడు వేగయుతుండును నొచు నిట్లనున్. ౧౪౭

సీ॥ నిలునిలు మోరామ! నీకు నాతోడి దా ద్వంద్వయుద్ధంబు సిద్ధంబ సుమ్ము
కార్ముకనిర్ముక్తఘనబాణఫణుల కి ష్టర్పింతుగాక ప్రాణాశుగముల
మును దండకారణ్యమునఁ దండ్రిఁ జంపితి వెదురైతి విప్పటియిఱకటమున
నిన్ను స్వకర్మస్థునిం దిలకించినఁ గోపంబు గోపమై గొనయ మెనసె
నామకన్నుగవకు నాఁడు గాన్పింపని దోసముననె యంతదొసగు వొడమె
నోదురాత్మ నేఁటి కుడుకుచున్నవి మదీయావయవము లింక ననినఁ గలదె. ౧౪౮

తే॥ దర్శనం బొసఁగితి బలే తద్దమెచ్చి నాఁడ నాఁడట్టు లగునె యీనాఁటికలిమి
బలిమిగలవాఁడవేకదా పట్టువిడకు మెంతవట్టు ధరించెదో యితనిఁ జెనకి. ౧౪౯

క॥ ఏను క్షుధార్తము సింగమనైన నితరమృగమ వౌదు వంతయుఁ దెల్లం
బౌ నెటులేనియుఁ గాంక్షితమైనది సేకూరె నింక నఱగొఱ లున్నె. ౧౫౦

తే॥ నేఁడు మద్బాణవేగంబు నెఱయ నవలఁ బ్రేతరాడ్విషయంబు నివేదితంబు
గాఁగలదు మున్ను నీచేత గంతుకొనిన వారితోడిద లోక మా వలనుగాంతు.

ఆ॥ ఇన్నిమాటలేల యేమన్న నే మగు రామ! నాదుపలుకు రాణగనుము
గాంత్రుగాత జగతిఁగలవార లెల్లరు నిన్ను నన్ను నేఁటి నిష్ఠితమున. ౧౫౨

మ॥ గదయో యస్త్రములో భుజాయుగళమో కాదన్న వేఱొక్కఁడో
యద నైయున్నది దెల్పుమిప్పటికి స్వభ్యస్తంబు నా నొప్పు న
య్యదియే కైకొని పోరువార మది గా దం చేను వంచింపఁబో
ను దిరం బౌఁ జుమి నాదు వాక్కు గువ మున్ము న్నొం డుపేక్షించినన్. ౧౫౩

క॥ అని మకరాక్షుఁడు నొడివిన విని దాశరథి యనె గతి వివేచించి యనం
జను నుత్తరోత్తరాభాషిని మెచ్చరు తథ్యవాగ్విశేషితు లెందున్, ౧౫౪

క॥ పలికినయంతలు సేసినఁ బలికినపలు కొప్పుఁగాక బహుభాషణసం
వలనమునఁ గలుగునే జయ మలయిక చేకూరు వట్టియూరాటమునన్. ౧౫౫

చ॥ మునుఁ బదునాల్గువేలు రథము ల్గొని యుక్కులకెక్కి నిక్కి ని
న్ననినయతండు దూషణుఁ డఖండితుఁ డౌ త్రిశిరుండు మున్నుగా

ననిఁబనిఁబూని వచ్చి హతులైరి ముహూర్తములోన నీవు తే
కునికియ తక్క నేకొఱఁతయుం గనుపట్టద నాఁటిపద్ధతిన్. ౫౫౬
ఆ॥ నాఁటఁగోలె బిట్టు నవయుచున్నవి కాకకంకగృధ్రవంచకప్రభృతులు
మేటి నంచు నీవు మెయివెంచుకొను టెంచి యేమొ యిపుడు తృప్తి నెనయఁగలవు.
క॥ అని నగుచు రాముఁ డనినం గినిసి ఖరాసురునికొడుకు గీలించెనుఁ దో
డనె శరపరంపరల నవి మొనయకమునుపే ఖరారి మొగకొని నఱకెన్. ౫౫౮
ఆ॥ ఆశరుండు వైచు నాశరంబుల రుక్మపుంఖముల నరేంద్రపుంగవుండు
తనదు ప్రదరముల విదారింప ధారుణి కవియు భూషణంబులై తనర్చె. ౫౫౯
తే॥ వేలకొలఁదిగ నవి నేల వ్రాలునపుడుపుణ్యమెడలిన పురుషులఁ బోలుచుండె
వారి చల మంతకెక్కుఁడై వఱలెఁ దేజ మోజముఁ బ్రమాణగతి మీఱి యురవడించె.
క॥ ఖరసూనునితో దశరథవరతనయుఁడు పోరఁ జిత్రవర్తన మని కి
న్నరగంధర్వసురాసురు లరయుచు దివి నిలిచి రద్భుతావహచరితా. ౫౬౧
చ॥ మొగిళులయట్టివై గొనయము ల్స్వనము ల్స్వనరింప విండ్లపై
నెగసి యొకండుగాఁ బెరసి యెక్కటిపోరఁగ నయ్యె నవ్వియ
వ్వగలకుఁ దోడుగాఁ బెనఁగు వారల తీరిఁకఁ జెప్ప నేల క్రొం
బొఁగలెగయించి రిర్వురు నపూర్వ మనందగు సంగరంబునన్. ౫౬౨
ఆ॥ ఒంటికన్న నొండు యుక్తం బయుక్తంబునాక నాకసదులు నడుఁకుచుండ
నాటుకొని రొడళ్ల నారాచములఁ గృతప్రతికృతముల తెలుఁగు ప్రకృతి కిడఁగ.
తే॥ రక్కసుం డెన్ని బాణముల్ రభస మెసఁగ నేసె నన్నియుఁ దునుమాడె నినకులీనుఁ
డట్లు జనవిభుఁ డేసిన యవియు నవియఁజేసెఁ గడఁగి శరంబుల నాసురుండు.
క॥ బాణౌఘంబులు గప్పిన క్షోణియు నాకసము దెసలు శోభిల్లక సం
క్షీణము లౌ నననయ్యెం ద్రాణం బనరాని వింతదశ పాల్పడఁగన్. ౫౬౫
వ॥ అట్టియెడ. ౫౬౬
ఆ॥ కుపితుఁడై విభుండు కోదండపాణి మహాభుజుండు రాముఁ డసురధనువు
నఱికివైచి నిశితనారాచముల రథరథ్యసారథులఁ దెరల్చి యార్చె. ౫౬౭
మ॥ విరథుండై కరము ల్విదిర్చి కర ముద్విగ్నత్వ మొప్పార భూ
మిరథుం డయ్యెనొ యంచు వేల్పు లలుకన్ మేకొన్న శూలంబు శా
ర్వర మాశార్వరుఁ డొయ్యనం గొనియె సర్వప్రాణిసంత్రాసనం
బురుతేజంబు యుగాంతవహ్నికలనాయుక్తంబు సక్తంబుగన్. ౫౬౮
ఆ॥ చిరసమర్చితంబు శీఘ్రసంపాతం బయంత్రితంబునైన యమ్మహాగ్ర
సాధనంబుఁ ద్రిప్పి సరగున రాము లక్షించి వైచె దీనఁ జెడితి వనుచు. ౫౬౯



శా॥ మింట న్మంటలు విద్యుదున్మిషితసోన్మేషస్ఫులింగావళుల్
వెంటం గంటికిఁ గంటకంబు లగుచున్ వేవేలుగా నంటిరాఁ
బంటం గంట విసంబు చి చ్చుమియు నాబంట్లం దలంపించు నీ
తంటాదంట యటంచు నెల్లరుఁ గలంతం గాంచ నేతెంచుచున్. ౧౭౦
ఆ॥ మూఁడమోఘబాణములఁ దొడి రాముండు దివ్యభూషణం బుదీర్ణ మైన
దానిఁ దుంటలుగ విదారించె హరిసేన లుబ్బియాడ నసురు లులికిపడఁగ. ౧౭౧
క॥ శ్రీరామశరార్దిత మై యోరామ!మహోల్క-యట్టు లురలి తెరలు నా
ఘోరాయుధ మీక్షించి వికార మెడలి సాధువాఙ్ముఖరు లై రమరుల్. ౧౭౨
శా॥ ఆశూలం బటు భగ్న మైన సురరాజారాతి కొండొక్క-ని
ర్దేశం బొయ్యనఁ దోఁపమిం గడఁకమై దిష్టాంతవేలాంతకా
భ్యాశం బౌ దృఢముష్టిఁ గూర్చుకొనుచున్ వ్యాపాది యై రాక్షసా
భ్యాశంస ల్తగ నిల్వు నిల్వు మని రామాధీశుపై వచ్చినన్. ౧౭౩
క॥ నవ్వుచు రఘునందనుఁ డపు డవ్వికలుం గాంచి పావకాస్త్రము వింటన్
జివ్వనఁ దొడిగి మిడుఁగురు ల్దవ్వులకు న్నిగుడ నేసె దర్పోద్ధతుఁ డై. ౧౭౪
క॥ ఆయస్త్రము తోన యసృక్పాయి హృదయ మేర్చి వ్రచ్చె బలునాడికలన్
దాయ యిలఁగూల ననుపద మాయినకులు శరధి సేర నది వచ్చెఁ జెలి. ౧౭౫
ఆ॥ నాథుఁ డట్లుచన ననాథ యై రాక్షససేన రామబాణశీర్ణ యగుచు
సారిది లంక సేరె సొక్కు-చు సోలుచు దితిజపతియ యిఁక దిక్క-టంచు. ౧౭౬
క॥ హతుఁ డైన ఖరాత్మజుఁ గని వితతము దాశరథి విశిఖవిక్రమ మతులం
బతిలోకం బని పొగడిరి సతతోత్సాహజము మేలి సంభ్రమ మొదవన్. ౧౭౭
ఆ॥ వజ్రహతగిరీంద్రవర్ణితం బగువాని మేను గాంచి యింక మేలె యనుచు
నుబ్బి గంతులిడుచు నుల్లాసమున నొప్పి రగచరేంద్రు లలికులాంచదలక!. ౧౭౮
మ॥ హతశేషు ల్తెలుపంగ నంగబల మి ట్లయ్యెంగదా యంచు దీ
పితరోషుం డయి రావణుండు దశనోత్పీడోత్థనిర్ఘాతసాం
ద్రతనిర్ఘోషము లుల్లసిల్ల సురజిద్భావంబు మానెం గటా
దితిజాధీశున కింక మించువిధ మేదీ యంచు ఘూర్ణిల్లుచున్. ౧౭౯
క॥ సుతు నింద్రజిత్తుఁ గని నీ వతిలోకేశప్రభావుఁ డన నెగడితి సం
మతి దాశరథులఁ బోరిగొన నతులితవిభవుండ వగుచు నరుగుము కడఁకన్.
ఆ॥ దృశ్యమానుఁడవొ యదృశ్యుండవో యై రయంబు నెఱయ నెట్టు లైన నమ్మ
హాజనుల జయింప యత్నింపు మది నాకుఁ బ్రీతికరము నీకుఁ బెనుపుఁ గూర్చు.
క॥ అప్రతికర్ము హరి గెలిచి తప్రాకృతుఁ దత్సుతుం జయంతు జయింపన్
ధీప్రతిభం దనరారితి వీప్రకృతుల నరుల గెడపు టెంతలు నీకున్. ౧౮౨

క॥ అను రాక్షసేంద్రు నానతి వినీతుఁడై మాళిఁ దాల్చి వెసఁజని హోమం
బొనరించె విధియుతంబుగ ననలుం బ్రజ్వలితుఁ జేసి యసుర కడంకన్. గీ౭౩

—♦ ఇంద్రజిత్తుసవరణ ♦—

ఆ॥ ఆతఁ డాభిచారికాయత్తుఁడై వేల్వఁదొడరఁ బొలసుదిండితొయ్యలులు ర
యంబు మీఱ శోణితాంబరోష్ణీషము లూని చనిరి సవనభూమి కార్య. గీ౭౪
మ॥ శరపత్రంబులు తోమరప్రముఖము లస్త్రంబులున్ వహ్ని కా
స్తరణంబు లసమిధ ల్విభీతకజము లెంరక్తవస్త్రంబులున్
వరకార్ష్ణాయస మా స్రువంబు దనర న్వాఁ డత్తఱి న్వేల్చెఁ జె
చ్చెరఁ గృష్ణాజగళగ్రహం బొనరఁజేసెన్ వేల్పు లల్లాడఁగన్. గీ౭౫
తే॥ అట్లొనర్ప విధూమమహాహోమాగ్ని వెలుఁగ విజయచిహ్నంబు లొప్పారు వెరవు దోఁపఁ
బ్రక్కమావర్తశిఖలతోఁ బావకుండు హవ్యము గ్రహించి స్వర్ణాభుఁడై తనర్చె.
తే॥ దేవదానవరక్షోగ్నితృప్తి నవ్విధంబునం బొనరించి యంతర్ధి నెఱయు
రథముపై రథివర్యుండు రాణఁదనరె శరశరాసనముఖ్యము ల్పూలఁగొనుచు.
ఉ॥ నాలుగు గుఱ్ఱము ల్పొగడ నవ్యగుణోత్తమలీల లొప్ప ని
ర్వేలకలాభిరామము సవేగము నై పెనుపొందు తేరిపైఁ
జాలన మెంచు చాపము ప్రసంగము చొప్పడ వజ్రవర్మభూ
షాలసితాంగుఁడై తనరి సంభ్రమవిభ్రమము ల్దలిర్పఁగన్. గీ౭౭
క॥ దీప్తానలసంకాశము తప్తకనకవలయము ముచ్ఛ్రితము వైడూర్య
ప్రాప్తాఖిలభూషణ మమరాప్తేతరు కేతనము మహారుచిఁ బొనరెన్. గీ౭౮
శా॥ ఆదిత్యాభము సజ్జ మారథము బ్రహ్మాస్త్రంబు సంమంత్రితం
బా దేవారికి రక్షణప్రవణపర్యాయంబులై చొప్పడం
గా దైత్యుండు పురంబు వెల్వడి సమిత్కల్యాణలీలాయిత
ప్రాదుర్భావకరాపిధానకలనాప్రాగల్భ్య మూహించుచున్. గీ౮౦
తే॥ దుష్టరాక్షసమంత్రనిర్ఘాతవిఘ్నయత్న నిఘ్నుం డగుట నొడ్డ కలవిగామిఁ
దనదుతలఁ పునఁ దలపోసికొనుచు హితులఁ గాంచి యిట్లనె నతఁడు నిష్ఠాశితాత్రి.
ఆ॥ మాయదారి వ్రతము మానించి పురి వీడి యరుగుదెంచి యసురు లనినఁ దొడరి
మడఁచువారి వీరి మాయించి పితృతృప్తిగూర్చువాఁడ సిరికిఁ గూర్చుజాడ.
క॥ ఆనెఱి నిర్వానరఁగా నే నొనరించెద ధరిత్రి నేఁడె కనుఁగొనుం
డీనాసంగర మనుచున్ దా నంతర్ధానమున్ రథముతో నెనసెన్. గీ౮౩
తే॥ ఆదశగ్రీవుఁ డట్లు ద న్ననుప మాయలాఁడు శక్రసపత్నుండు వాఁడు తీక్ష్ణ
కార్ముకాశుగములు పూని కదనముతల నభ్రతలమున నిలిచి బిట్టార్చి తొడరి.

ఉ॥ రాము సలక్ష్మణుం గని పరాకు దొలంచి చిరాకు లెంచి సు
త్రామవిరోధి సాయకపరంపర లేడ్తెఱ మీఱ గుప్పఁగా
దీమసమొప్ప మేకొనె సుదీర్ఘుఁడు వాఁడు ఘనాఘనంబు ప్రో
ద్దామకబంధధారల విదారణ మేర్పడ రొప్పుచాడ్పునన్. ౧౯౮

తే॥ అంసములతోడఁ ద్రిశిరస్కు మైన పన్నగేంద్రయుగ మట్టు లొప్పెడు నినకులీను
లెదిరి నలఁచెడు వారు వీరే యటంచు నెంచి గుర్తిడెఁ దొలుతఁ దా నెగచె నవల.

తే॥ సరథుఁ డసురుఁడు వైహాయసపథ మెనసి యల్లె చక్షుర్విషయమున కందరాక
ధనువు సజ్యం బొనర్చి తత్తనువు లగల నార్చుచుఁ గడంక శరము లేయంగఁదొడరె.

మ॥ శరసంవేగపరీతు లై కినిసి యాశాచక్ర మల్లాడ దా
శరథుల్ స్వీయశరాసము ల్సశరము ల్సజ్యంబులుం జేసి య
స్త్రరహస్యజ్ఞులు సూర్యసన్నిభము లౌ శస్త్రప్రతానంబు లం
బరముం గప్పఁ దమఃప్రహాణకలనాప్రాగల్భ్యముం జూపినన్. ౧౯౯

క॥ సహలక్ష్మణుఁ డౌ రాముని సహస్రసంఖ్యాకనిశితశరముల కతిదు
స్సహముల కెదు రైనం దన,విహార మే మగునొ యనుచు విహ్వలుఁ డగుచున్.

సీ॥ ఆకసంబెల్ల ధూమాంధకారమ్మునఁ గప్పినయప్పాటఁ గడుకొనంగ
మఱియు నీహారతమస్సాదితంబు లై దెసలు శూన్యంబు లౌ తెఱఁగు వడయ
జ్యాతలనిర్ఘోష మేతాదృశం బనరాక నేమిస్వనోద్రేక ముడుగ
నశ్వఖురారావ మంతలింతలు గాఁగ రూపనిర్ణయ మపహూప మనఁగ
నైన దశ పాల్పడంగ ఘనాంధతమసనక్తశరవర్ష మిది యనఁ జాలుకొలిపి
ముంచె నారాచవృష్టి రాత్రించరుండు నరవరేణ్యుల విధిదత్తవరబలమున. ౨౦౦

ఆ॥ సర్వగాత్రముల ససంగం బనంగ లేకుండ దాశరథుల నోజ మెఱసి
స్రుక్కనాటె నసుర సూర్యసంకాశమ్ము లైన యాశుగముల నచలతనయ!

క॥ శరధార లెనయఁ బర్వతవరము లనన్ దనుక కుండి వా రిరువురు నం
బరము వగులఁ దిగ్గంబులఁ, బరఁగించిరి ప్రదరముల సుభాస్వరరూపా. ౨౦౧

తే॥ కంకపత్రులు పత్రులు గగన మెనసి లక్ష్మితేతరు రావణి లా వఱంగ
నెఱసి తచ్ఛోణితోక్షితోన్నిద్రము లయి ధరణిపై వ్రాలుచుండె విద్యావిలసిత!

క॥ అతిమాత్రవిద్ధు లయ్యుం దితిజేంద్రాత్మజుఁడు వనుచు దీప్తశరములన్
మతిమంతులు భేదించుచు వితథము లొనరించి రొగిఁ బ్రవీణత వెలయన్.

తే॥ వానిహేతు లేతెంచు నవ్వాల నెఱింగి శబ్దవేధుల నుత్తమాస్త్రములఁ బంచి
మించి వేధింపఁదొడరిన మెలఁకువ గ్గణించి వంచనఁ బెంచి నక్తంచరుండు.

ఆ॥ ఉన్నచోట నుండ కొండొండఁ దిరుగుచు నిశితవిశిఖతతులు నివ్వటిల్లఁ
జేయుచుండెఁ దనదు శీఘ్రగామిత్వంబు శస్త్రవేత్తృతయుఁ బ్రశస్తములుగ.

క॥ మాయావి శరకలాభ్యా,సాయాసితతనుఁ డసురుఁడు యత్నము తనరం
జేయాక మోకటిల్లఁగఁజేయందొడఁగుటయు రాజసింహులు కడఁకన్. ౬౦౮

చ॥ విసువక యెల్లదిక్కుల నవేళశరాహతులం దెరల్చుచున్
గుసుమితకింశుకమ్ముల నుఁ గూర్చినమె త్తనిమేను లొప్పఁగా
నసురుసు రందనీయని మహ త్త్వమునం దులకించుచుండి ర
య్యసమశరాభు లయ్యదనునందుఁ దటిల్లతికాసమద్యుతీ. ౬౦౮

శా॥ రూపం బెన్నఁగరాని దన్న గతియున్ రూపింపఁగాఁబోల దీ
రోపం బీధను విట్టు లిట్టు లన నా రూఢప్రపరూఢత్వముల్
దోఁపం బో వినుఁ డభ్రసంప్లవమునన్ దుర్భావ్యుఁ డై నట్టు లై
పాపం బాపతితుం డొనర్పఁదొడఁ రెం బాపాపనోదాదరా!. ౬౦౯

తే॥ స్యాతు లటు నిహతులు గతాసువులు నగుచు వానిశరములపా లయి వానరవరు
లవనిపైఁ జాపకట్టుగా న త్తమిల్లి రొకనిపై నొండు గాఁ దపోయోగనిపుణ!

ఆ॥ అన్నఁ గాంచి యిట్టులున్న నేమగు సర్వరాక్షసుల వధింప రాణ నెఱయ
బ్రాహ్మ మస్త్ర మిపుడె పరఁగించువాఁడ నంచనియె లక్ష్మణుఁడు మహాస్త్రకుశల!.

క॥ శుభలక్షణు లక్ష్మణుఁ గని విభుఁ డిట్లనెఁ దగని దట్టి విధి యొక్కనికై
యభగుల నందఱఁ దునుముట ప్రభావవిలసితుల కెందుఁ బ్రస్తుత మగునే.

శా॥ అన్నా! లక్ష్మణ! యెన్నఁడేనియు రణావ్యాసక్తు నున్మత్తుఁ బ్ర
చ్ఛన్నుం బ్రాంజలి రక్షణార్థి విజితున్ సన్నాహసంశూన్యు నా
పన్ను న్విద్రుతునిన్ వధింపకుము తత్పాపంబు నీ కిచ్చి నీ
పున్నెం బందుకొనంగ వా రగుదు రాపో టొప్పు నా నొప్పునే. ౬౧౩

ఉ॥ ఎట్టులయేని వీని వధియించుతెఱం గెనయించువార మీ
పట్టున ముట్టుచో నుసుఱుఁబాపఁగ నోపు శిలీముఖంబులన్
నెట్టనఁ బన్నగాభముల నేర్చి విదిర్చి యసమ్ము రెమ్మ నా
కట్టడిసేయఁగానగును గర్జముపైఁ దలఁ పూర్జితమ్ముగాన్. ౬౧౪

తే॥ తోఁచినంతన యీతని త్రుళ్ళడంతు రడరనీక మహామహు లగచరవరు [చరిత.
లలికి యంతర్హితుం డయ్యె ననఁగబోలు మాయికుఁడు క్షుద్రుఁ డతఁడు సమ్మాన్య

ఆ॥ మింటికెగసెనేని మేదినిఁ జొచ్చెనయే నధ స్తలమ్ము నెనసెనేని
నెటు నిగూఢుః డయ్యెనేనియు మదిషుదగ్ధుఁ డయి పుడమిపైనిఁ బడు నితండు.

—♦ ఇంద్రజిత్తు రామాస్త్రముఁ జూచి పాఱిపోవుట ♦—

మ॥ మహితాత్ముండు రఘుప్రవీరుఁ డటు సన్మంత్రంబు పాటించి ప్రా
ప్తహార్దుం డయి రౌద్రు ఘాతుకు రిపుం దండింపఁ జండక్రమ

ప్రహితం బౌ శరరాజమున్ మనమునన్ భావించి వీక్షించినన్
విహ్వృతిం బాసి తలంగనెంచె సురరాడ్విద్వేషి యుద్వేగియై. ౬౧౭

తే॥ అఖిలలోకమాయాతమోహారము శరముఁ
దొడిగి రఘువీరుఁ డేయ నిర్ధూతుఁడగుచుఁ
దోఁచి యెడఁద్రోచి లంకలో దూఱి దూఱు
వుట్ట నాచెట్ట దిటవు గోల్పోవ మగువ!. ౬౧౮

క॥ తెప్పిఱిలి ప్లవగసేనలు ముప్పొడఁబాసె నని మేలి మురిపెంబున రా
మప్పఁ గొనియాడఁదొడఁగిరి తప్ప దిదియె యసురుఁ డడఁగుతఱి యని రమరుల్.

తే॥ అనుచుఁ బురహరుఁ డెఱిఁగింప నచటుబాసి యఘరి యాకష్టుఁ డెట్లు సేయంగడంగెఁ
దెలుపవే యవ్వలనికథ తెఱఁగటంచు విభుని గిరిరాజకన్యక వేఁడుటయును.

మ॥ శ్రుతిసీమంత విశేషకాంచిత కలాశుంభద్రజోగుంభ వి
శ్రుతపాదాబ్జ!మహాధ్వరప్రవణ సంస్తుత్యాత్మసంస్థాన సం
శ్రుతలోకావనకృత్య సర్వజననాస్తోకప్రభావాఢ్య ల
క్షిత సాక్షిత్వ విభావ్యతత్వ మునిసంసేవ్యత్వరూఢోదయా. ౬౨౦

క॥ భూతజయ!బోధగమ్య! ప్రభూతదయాత్మీయనయవిభుత్వాంచితసం
పాతహరణచణచరణా! చేతశ్శుద్ధిప్రకరణ! శ్రితసంభరణా ౬౨౧

వసంతతిలక॥ శాపాయుధోత్తమ వచశ్చయలక్ష్యకోపా!
పాపాపనోదనసవ ప్రవణాంఘ్రియూపా!
దీపాంకురాయిత మతిస్థితిలభ్యరూపా!
నీపాలయాది వినినీషు కలాకలాపా! ౬౨౩

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్య మహితాత్రేయగోత్రపవిత్ర హనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబున
సప్తమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ శివాయ గురవే నమః.

# శ్రీరామకథామృతము

## యుద్ధకాండము.

### పూర్వభాగము.

### నవమాశ్వాసము



కరుణావేశభృత
ప్రాకామ్యవిభూతియోగ భద్రోద్దేశ
స్వీకారరిపున్యక్కా-
రాకారవిశేషవద్భ్రు శా! పరమేశా! ౧

ఆ॥ అవధరింపు మట్టు లడిగిన గిరిజతో నిట్టు లనియె గిరిశుఁ డింతి! పూల
బంతి! వినుము రుష్టభావం బెసఁగ వాఁడు పురము సొచ్చి దుష్టబుద్ధి హెచ్చి.

మ॥ కనులం గ్రోధము దొన్కుచుండ నన రాగం బొప్పఁగాఁ బశ్చిమం
బన నా ద్వారమునం బయల్పడి కదభ్యాసు ల్ధృతాసు ల్వలా
శను లొంటం దనుఁ గొల్చి రా నశనిభృచ్ఛత్రుండు పౌలస్త్యుఁ డే
చిన వేరమ్మున రామలక్ష్మణులఁ గాంచెం బొంచి దుర్లక్షుఁ డై. 3

ఉ॥ ఉద్ధతు లై రణోన్ముఖత నొప్పు నరేంద్రులఁ జూచి చూడలే
కుద్ధృతవిక్రముండు సమయోచితమాయికవృత్తిఁ బెంచి సం
బద్ధుఁడు గాక మోహపరిపాటిన వారల ముంప నెంచి యా
పద్ధతికిం దగంగ నొక భామినిఁ గొంచుఁ గ్రమించి నొంచుచున్. ౪

తే॥ తోడవచ్చినవారలుఁ దొడరుచుండ వానరాభిముఖుం డయి వాఁడు సొచ్చి
యరదమున నున్న యంగన నట్టె తివిచెఁ జంపఁదలఁచు స్వభావంబు చక్కఁబెరయ.

ఆ॥ మాయలాఁ డతండు మాయామయాంగన నట్లు గొనుచు సీత యూ ననంగఁ
గానవౌకసులకుఁ గాన్పింపఁ దనపూన్కి నెఱయ వచ్చి యెదుర నిలుచుటయును.
క॥ సంక్రుద్ధు లగుచు వారలు చంక్రమములు పొనర శాఖిశైలవరశిర
స్సంక్రాంతుఁ జేయఁగడఁగి రసంక్రమముఁ డవ్వానిఁ దొడరి చంపుదు మనుచున్.
తే॥ అందఱకుఁ దాన ముందల యగుచు హనుమ రిపుఁడురాసదుఁ డటు చెలరేఁగి దొడ్డ
గట్టు పట్టినపట్టునఁ గదలఁబెఱికి దానిఁ గొనివచ్చె దనుజు దుర్గము మడంప. ౮
క॥ అభ్యాశగతుం డగుచు దురభ్యాసుం జూచె నసురు నావల రథమం
దభ్యాగతఁ దత్పీడిత సభ్య యనం దగిన యొక్కజవ్వనిఁ గాంచెన్ ౯

—— (హనుమంతుఁడు మాయాసీతావధముం గని చింతిల్లి రావణు దూఱుట) ——

సీ॥ ఉపవాసములఁ గ్రుస్సియును శరద్దాకాశశాంకు గేరుచు నిజాస్యంబు దనర
వినిహతానంద యై వెల్లనై ననుఁ దొంటి చిఱునవ్వుసిరి బాట స్పృక్వు లెనయ
నేకవేణీవస్త్ర యే కాఁగ రామనామావృత్తి శుద్ధభావాప్తిఁ దెలుప
నమృజరజోవిలిప్తాంగసౌష్ఠవసుషమలు వరస్త్రీధర్మమర్మ మనఁగఁ
తే॥ దెరువు లే కతిదీన యై దెసలుసూచు తెఱవునవె తనుఁగావ నేతెంచువారి
నరయుతలఁపున నున్న యా యన్నుమిన్నఁ గాంచి యంజన నోము చక్కటిఫలంబు.
ఆ॥ అచిరకాలముననె యామానినీమణిఁ గాంచియున్నవాఁడు గానఁ జాన
మైథిలియ యటంచు మది నిశ్చయించి రథస్థ యగు నవస్థతరము నెంచి. ౧౧
క॥ కన్నుల నీరెడల మహాపన్నుఁడు దా నగుచు సీతపస్విని గతి యీ
కన్నులఁ గననయ్యెఁ గదా యన్న తెవ్రులు పాల్పడన్ భయవ్యథితుం డై. ౧౨
ఆ॥ ఏమిసేయువాఁడొ యీదురాత్ముఁడు కష్టుఁ డింత దలఁచు విధి యహీనుఁ డగునె
తొంటి మేలికూర్పు దొడిబడ సీనోట దొసఁగునుడువు మనియె ధూర్తుఁ డతఁడు.
శా॥ శోకార్తవ్యథిత న్రథస్థలమునంజొప్పించి దర్పించి య
ట్లాఁకొన్నాఁ డిపు డాహరింప నదిగా కన్నెంబు పున్నెం బోకం
డీకాలంబునఁ గల్గునే యనుచు వాఁ డీక్షించియాత్మించి స్వ
ప్రాకట్యం బెద నెంచి వానిఁ దఱియంబ్రస్థాన మూహించుచున్. ౧౩
తే॥ వానరబలంబు తోడ్పడి వరదపొల్లు
గా నెఱయ నొక్కత్రుటిలోనఁ గదిసి యఱుమ
నంతకుఁడు రావణియుఁ గ్రుధాక్రాంతుఁడగుచు
ఖడ్గము వికోశ మొనరించి గఱితఁ బొదివి. ౧౪
క॥ తలవంచి తాఁచి క్రోఁచియు నలయించిన రామ ! రామ ! యని యాక్రోశం
బొలయించెను సుస్వరముగ నెలనాగ యతండు గూర్చు నిడుమలు పడుచున్.

మ॥ తలవంచెం గద పాపుఁ డిట్టి సుచరిత్రం బట్టి యొం డేటికిన్
దలవంపు ల్ఘటియించె నిందఱకు మీఁదం జచ్చునో నొచ్చునో
తలఁపంబోలదు నన్ను బోంట్ల మహితోత్సాహంబు వమ్మయ్యె నే
తల పంతమ్ముల తీర్పు మార్పడియెఁ గద్దా ధర్మ మం చార్తుఁడై. ౧౭

ఆ॥ శోకమోహవార్ధిఁ జొరఁబాఱి విధి దూఱి దీనుఁ డగుచు నేది తెరు వటంచుఁ
గనుల వేఁడినీరు కాల్వలై ప్రవహింప నడలి సడలె మారుతాత్మజుండు. ౧౮

తే॥ చారుసర్వాంగి సౌమ్య యీసాధుచరిత
రాము ప్రియమహిషియ యంచు రాణఁ బేర్చు
భక్తి విశ్వాసములు తన్నుఁ బ్రాముకొనఁగ
నంతవాఁ డింతలయ్యె హిమాద్రితనయ ! ౧౯

క॥ క్రుద్ధుఁడు తజ్జీవాశాబద్ధుఁడు నై యసురఁ దఱిసి పరుషాక్షరసం
బద్ధము లగు భాషణముల నద్ధార్మికుఁ డాడఁదొడరె నబలామణిరో. ౨౦

సీ॥ ఓదురాత్ముఁడ ! సాధ్వి నుదుటార్చుకొనఁ గేశపక్షంబునం బట్టి పరిభవింతె
యేయపరాధంబు నీయమ పొసరించె నెఱిఁగింపు మొక్కింత యెఱుకయున్న
బ్రహ్మర్షివంశంబు పాడ్వడె మీయిట్టి రక్కసికాన్పు నేరంబుకతనఁ
గాల్పనే పాపు నత్యల్పసమాచారు నిర్దయు నవినీతు నీచు నిన్నుఁ
దొడరి తెంతటిపనికి నీదుష్టబుద్ధి తెలిసెఁ గా కింతమాత్రన తెఱఁగు గాంతు
వొాటు నాచేతిలోన నీయుసుఱు నిలిచి యున్నయది సీతఁ జంపి నీవుండ విలను.

ఉ॥ ఇల్లటు వీడి రాజ్యమహితేందిర కెంతయు దూర మై మదిం
దల్లియుఁ దండ్రియుం బతియు దైవము ధర్మము రాముఁ డంచు సం
పల్లలితంబుగాఁ గొలుచు పావనమూర్తిఁ దెరల్చి తెచ్చి నా
ప్రల్లదుఁ డీవు చంపఁ దెగఁబాఱితి వింతటి పాపు లుందురే. ౨౨

తే॥ లోకవధ్యుండ వీవు స్త్రీలోకహంత లంతమందినయంత నేయంధతమస
లోక మతికుత్సితము తమ్ము లోఁగొనంగ నడఁగువారలా యాగతి నందఁగలవు.

ఆ॥ అనుచుఁ బలుకుచు న్మహోత్సుండు హనుమ సామర్షుఁ డగుచుఁ బ్లవగమండలంబు
దోడ రాఁగఁ దొడరి త్రుంచితూటాడెడు నంత లగుచు నసుర నభిగమింప. ౨౪

—♦ మూఁడు నాలుగు నైదవు నాళ్ళయుద్ధము ♦—

క॥ ఆవానరవరసైన్యము దావాగ్ని నడంచు తోయదముప్రక్రియనుం
దావల మగుచుం దాకెను దేవారిబలంబు సర్వదివిజస్తుత్యా ! ౨౫

తే॥ అట్టి సంఘాతరణమున నమరనాథవైరి తనవారి కొంటఁ దోడ్పడి కలంబ
శతసహస్రంబులం గీశతతిఁ దెరల్చి యిత్థబలుఁ బావమానిఁ బేరెత్తి పిలిచి. ౨౬

శ్రీశివాయ గురవే నమః

# శ్రీరామకథాఽమృతము

## ఉత్తరకాండము

—:o:—

### —• ఉత్తరభాగము — ప్రథమాశ్వాసము •—

—:o:—



సీతారామపదా
బ్జాసంచితభూవివిధవిహారవిలాస
ప్రాసంగికైకవీచీ
భాసురమహిమార్ణవప్రవణనిజసత్త్వా! ౧

వ. అప్రాకృతదివ్యవైభవా! దేవా! యవధరింపు మవ్విధమున నర్థిమెయి నర్థించిన యర్ధాంగి ప్రార్థితమ్ము సమర్థింపం బూని యర్థిజనర్థి యగు నయ్యర్ధేందుకిరీటుం డనుపదంబ. ౨

గీ. వింటివికదా సభాస్థితివిలసనములు భరతసంప్రార్థనంబు తత్ప్రాభవంబు
వినుము తన్వంగి! యటమీఁది విభువిహార లనుచు నొకనవ్వు నవ్వి యిట్లనెఁ బొసంగ.

వ. అమ్మెయి విమానరాజమ్ము సమ్మానిత మ్మయి వీడ్కొని చిత్తజ్ఞ మ్మయి నిత్య సాన్నిధ్యమ్మునఁ గొలువుఁ గొనుటయు. ౪

#### సీతారాముల వనవిహారము

క. ఆరామమహీశుఁ డశోకారామమహీవిహార మది మదిఁగొన సే
తారామ మహీసుత "విస్తారా మమ హీయ మభిమతా" యని కొలువన్. ౫

వ. తదనురూపం బగు నుద్యోగంబునం బ్రవర్తిల్లె నంత. ౬

గీ. అన్నరేంద్రుని రాక నాఁ బున్నె మెన్నుకొనుచు వనపాలు రుచితనందనసమృద్ధి
మున్నె సంస్కృత మగు వనమున్ నవీనగతిఁ బరిష్కృత మొనరించి రతివమిన్న !

వ. అదియు. ౮

గీ. నాకు వర్ణించు శ్రమ మేల? నవల! యవల మీ కతిశయోక్తులుగఁ దోఁచు మేల మేల?
యొక్కనాఁ డింపు నింపవ యొక్కనాఁడు మేలు మే లన్న సొమ్ములే మెలఁతలకును.

క. ఉద్యానపాలు రాగమవిద్యార్థ్యులు నాగరికులు విభుఁ డత్తఱి కా
మాద్యద్గజగతిత్రో రా నుద్యోగము సేసి రెంత యుచితమొ? యువతీ! ౧౦

సీ. పవలింటి దివిటీల ప్రభలు నభంబంటి యినవంశ్యు కొలువున నెలమి పొగడ
బెత్తముల్ గైకొన్న బిత్తరుల ప్రచార మంద మింద మటంచు నవని కొసఁగఁ
దాల్చిన సొమ్ముల ధగధగన్మణికాంతు లంతరాలంబు రవ్వంత సేయ
నాత్మీయసహజతేజోంకురవిస్ఫూర్తి దిక్కు లన్నిఁటి నొక్కటెక్క ప్రాయ
మనుకులారామపారిజాతనగ మట్లు రామదేవుండు పోయె నారామవాటి
కాత్మరామామణిం గూడి హారివివిధవిహృతు లే మే మటంచు నిర్వృత్తములుగ

క. ఏమణి నెనసినఁ బటికం బామెఱుఁగున మెఱయు స్వచ్ఛ మగు కతముననా
రామగతుల నామెయి కయి భూమానందమయుఁ డతఁడు పొలిచెన్ సాధ్వీ! ౧౨

శా. శ్రోణీబింబములన్ దుకూలముల వీచు ల్తాఱుమాఱైన ని
ర్మాణం బూహ రహింప నీవులకుఁ దార్పంబడ్డ కెంగేళ్ల స
న్మాణిక్యాభరణాభ నాభికుహరాంతప్రాంతము ల్గప్పఁగా
వేణీబంధము లూడ నూడఁ జని రా వేళం గుమారీమణుల్. ౧౩

గీ. ఉత్సవము రూపమొనసిన యుదుటు దోఁప నుచితసమ్మద మైన తదూథమరిగె
నాథు సన్నిధిఁ గొన్న విన్నాణ మొప్పఁ జెలయు ప్రకృతిప్రవాహవీచిక యనంగ.

వ. రామామణీ! యారామచంద్రమూర్తి. ౧౪

గీ. వానరులచేత రాక్షసప్రవరభటులఁ బట్టి కొట్టించెఁ దనప్రాభవంబు మెఱయ
నాఁడువారలచేత ననంగు రాజ్య మాహరించుకొనం బట్టె నట్టి పట్టు. ౧౫

శా. చూచుం జూడఁ డటు ల్వినున్ వినఁడు మెచ్చున్ మెచ్చఁ డానంద మ
గ్నై చెన్నొందఁగ రాజయోగమున నా నావృత్తికిం బ్రీత యై
సాచివ్యమ్మునఁ జిత్త మొత్తిన మహీజ న్మెచ్చఁగావచ్చుఁ ద
త్ప్రాచుర్యం బభయంకరం బనుభవప్రాప్యంబ చూ శాంభవీ! ౧౬

శా. విద్యారణ్యము మాధవానుగత మూర్వీన్ నిల్చె నాఁ బొల్చు నా
యుద్యానస్థలి నింతనంతఁ దఱియన్ యోగ్యస్థితిస్థానకం
బుద్యోగం బనఁ బూలపంజరమునం దొప్పారు రాచిల్క త
త్పద్యం బల్కె "మహాప్రభు ర్జయతు నిత్యం" బంచు మున్నంతటన్. ౧౭

శ్రీరామచంద్రునితోఁ జిలుక వనవిశేషంబులు మనవిసేయుట

ఉ. నాపలు కాలకింపు ద్రుహిణస్తుతచిత్రచరిత్ర! రామదే
వా! పలుపోక లిందుఁ గల వాత్మతదర్థము సంస్కరించి రీ
వే పొరపాటు లే కెనయవే యల వేదమునందుఁ బోలె నే
యే పద మింపు నింపు నదియెల్ల సమర్థసుఖం బమర్పఁగన్. ౧౮

మ. సవిశేషం బవిశేషకం బను విశేషం బొందు లేకుండ సం
స్తవము ల్గూర్చి విరించనుండు మును తత్సారస్య మట్లుండనీ
యవివేకంబొ వివేకమో పొగడఁగా నస్మద్విధు ల్పానుకో
నవుఁ గైకోవలె నీకు నీ వ్యవహృతిన్ వ్యక్తేతరప్రాభవా! ౨౦

గీ. ఓమహారాజ! చూచితే? యుల్లసరణి దేవదారుద్రుమావళి దివ్య మరయఁ
జుట్టుకొనివచ్చె నీతోట సురుచిరముగ నిందు విశ్రమ మొనయక యేగరాదు.
గీ. దాని కవ్వలఁ జూడు చందనవనంబు నందనవనంబు నందంబు నందుకొనుచు
సాహసంబున నాత్రోవఁ జరణ మిడెదొ? త్రాఁచు లేచిన వందు సీతాకళత్ర! ౨౨
క. పోనిమ్ము పువ్వుక మ్మీ దానిమ్మలచాలు వెంటఁ దత్ఫలబీజ
ప్రాణమ్ములు మా చిలుకలు మీ నెమ్ములకలిమిఁ బొగడ మేకొనవలదే? ౨౩
గీ. పొగడలే కల వామీఁద బొగడనేల? నెగడుగన్నది తత్సుమనిచయ మెందు
నగడువడుచుండె నీవు రా వని మనమునఁ జూడవలె నేఁడు తద్వని సొంపు జంపు.
సీ. సహజరాగరసాలసాలపల్లవముల నధరీకరించు నాస్యమ్ము లెత్తి
కనకసప్రభకర్ణికారవనంబుల నవకుంఠనంబుల నతిశయిల్లి
కులకితతిలకసంకులతరతలముల లాలాటికరమోపలాలిత యయి
కదళీప్రకాండప్రకామకాంతోత్సంగసంగతులకు సరసత్వ మొనసి
విశ్వపూరుషరూపంబు విస్తరించు పూరుషోత్తము దేవేరి భూమిదేవి
విశ్వనారీస్వరూప మావిష్కరింపఁ బూనిన ట్లున్న దిన్నెలవున మహాత్మ! ౨౪
క. కదళులు కాకోకిలములు మదకింశుకముఖవిలాసమంజిమములు కు
చ్ఛదసుమగుచ్ఛఫలమ్ములు పొదలు వనముఁ గృత్రిమమ్ముఁ బొడగంటె నృపా.
గీ. శిల్పవిజ్ఞాను లధిప! నీచిత్త మలరఁ గడఁగి కల్పించినారు తత్కాననమ్ము
నసలుదాని సౌభాగ్యమ్ము నతిశయించు పసల నెసలారుచున్నది పరిసరమున. ౨౬
గీ. అల తటాకము గంటె? రత్నాకర మనఁ బొలము లెల్లను ముంప నై పొంగివచ్చు
చున్నదియొ? నాగకూర్మమహోర్మికలన నీఁదఁబోయినఁ ద్రావఁగా నేది? నీరు. ౨౭
క. పొగలేని జ్వలనకాంతులఁ బగళులు రే లనఁగ రాక ప్రాంతము లెల్లం
దగిలి వెలింగించెడు నత్తెగ దేవా! పారిజాతదివ్యనగంబుల్. ౨౮
గీ. సర్వదాకుసుమంబులు సర్వదాఫలంబులు మనోరమంబులు లలితదివ్య
గంధరససముపేతముల్ గ్రాలుచున్న వెన్నఁ డడ వగు నింతలి వృక్షము లిన! ౩౦
గీ. వేలుపుల కీ వొనర్చిన మేలు దలఁచి దోహదాపేక్ష లేకుండ ద్రుమలతాని
కుంజముల బాముకొని ఋతుకుంజనారములు సంజితము లయ్యె నిట్టు లిక్ష్వాకుతిలక!
క. పెరుఁగఁడు తఱుఁగఁడు పవనుం డరుదగు నొకనడకఁ బట్టె నవనీశ్వర! నీ
తరుమండము నెడబాయఁడు హరిణగతి శనైశ్చరుఁ డగు టచ్చెరువ కదే. ౩౨
గీ. మూడు వానలు నెలకు మామూలు గాఁగఁ బౌదపాళికి నీ రెత్తు పనియు లేదు
తినుచునున్నారు నీసొమ్ము మనుచువార మే మనుచు ధామరాజ్య మనామయముగ.
గీ. మున్ను మాజాతి వెడజాతి భూమినాథ! తిన్న ఫలములఁ దిను నూడ్చు నున్న ఫలము
లిపుడొ? యవసర మవు నంతో యింతో మెసవి పలుకు నీ నామ మిశ్శనవలెనె? వీరు.
ఉ. ఇ శ్శన నేమి య శ్శనిన నేమి రుచించిన పండ్లు దింపుఁ బా
ఘమ్ము భసత్సరస్సమితి దప్పి వేలార్చుచు నీవనంబె యా

యుశ్శతకాలముం దమకు నూర్జిత మౌ నవనంబు గాఁగ భూ
యశ్శమితాఘ! మాకొలము లన్నియు నిన్నె నుతించు నెప్పుడున్. ౩౫

గీ. సురల నేలెడువాఁడ వాసురులఁ గొంటి నరుల నేలఁగఁ బొడమి వానరుల నేలి
తండజాఖండులుండు నీ కైన బంటు ననదె? నీరాజ్యమున నింత చనవుమాకు. ౩౬

ఆ. కాలయాపనంబు గా నేల? ఛాయానగాధ్యుషితము మార్గ మనుసరించి
యరయు చరుగు మ య్యనంతరచన మా శారి నేర్చి కూర్చు సరసముగను. ౩౭

క. అను చిలుకపలుకులను విని యనుస్మితముఖాబ్జుఁ డనియె నారాముఁ డోహో
చనునే? నీ లేనియెడం జనవునఁ ద్వచ్ఛారితోడి సల్లాపంబుల్. ౩౮

వ. శుకోత్తమమ! మహాజనాచారవిచారప్రచారమునకు నీ కెంతదవ్వు? చెప్పిన చొప్పున నప్పగించుట తప్ప నీజాతికి జ్ఞానాతిశయం బుండునా? యని యనుచుండ నయ్యండజంబు వెండియు ని ట్లనియె. ౩౯

శా. దేవా! నిక్కమె నీవచించు నుడి సందేహంబు లే దిందుఁ గా
నీ వైకుంఠుఁడ వైన నీవె యిటు మా నేత్రాబ్జము ల్లల్లగాఁ
బ్రోవౌ పున్నెము పంటగా నగపడం బోలేదె? యజ్ఞానముల్
తావన్మాత్రకు నిన్నుఁ గోరి మునులెల్లం గాసిగానేటికిన్. ౪౦

వ. ఇందు బ్రహ్మలోకంబుఁ గనుంగొనఁబోవుచున్న యిన్నగచయమ్మె ప్రమాణమ్మటులుంచు మది. నినుఁ గొల్చు రామతమ్ములకుం దక్కిన పక్షులకు నెక్కడి సామ్య మది కాక. ౪౧

క. ప్రథమాన! "యథా రాజా తథా ప్రజా" యనఁగ లేదె ధర్మము ధుతవే
పథు వయి జీవగణము నీపథమున వర్తించుకలిమిఁ బరికింపు మనా! ౪౨

చ. అదియుఁ బ్రబుద్ధరాలు మరియాదయు మాటలపొం దెఱుంగు మె
చ్చొదవెడు భంగి ని న్గొలువనున్న ది తా నదిగాక రాజ వీ
వుదయము నొందువేళఁ దమయుత్సవముం బ్రకటింపకుండ నె
ట్లొదుఁగును లోకలోక మిదియున్ దురితంబులె నిన్నుఁ బోటికిన్. ౪౩

వ. ఐన నిన్ని మాట లేల? నేను నీకు ధర్మపన్నమ్ములు నుడువు నంతలా? యచ్చటి యౌచిత్య మరయఁగల కలిమి రాచవారిద కాక. ౪౪

క. అని యుపరమింప రాఘవుఁ డనువ్రతం జూచి మెచ్చు నవు వింటివె? యీ
మినుకులు ఘనవేణీ! యన ననుగ్రహము నాపె లోచనాంతము గురిసెన్. ౪౫

క. అంతం గాంతాకాంతులు కాంతానివహంబు గొల్వఁ గాంతారమునం
గాంతలతాతరువేల్లితకాంతవిశేషముల మెచ్చు చరసిరి కాంతా! ౪౬

సీ. తమప్రేమలత లట్లు తరమెఱుంగక యల్లిబిల్లిగా నల్లిన వల్లరులను
వల్లరీరాగము ల్వలఁగొన మినుఁజూచు తలఁపున నిలఁజూచు తరువరముల
వరతరుచ్ఛాయానివారితాతపము లై కుట్టు లనఁగ సాఁగు గుల్మములను
గుల్మమ్ముల మఱింత కల్మికిఁ గూర్పఁగాఁ బూనిన భ్రమరీవితానములను

జూచి చూచి ఘనంబున నేచినట్టి పండువులకు లోనయి యల్ల పతియు సతియు
దాఁచియుంచిన యింగితతత్త్వములను వాచికంబుల నెలయించి రీ చతురత. ౪౭

సీతారాముల సంలాపములు

మ. అవె కల్పంబులు దర్శనీయము లనన్యా! కాంచితే? నూత్నప
ల్లవరాగంబుల నింబుకొల్పుచు నసుల్లంఘ్యంబు లై యొప్పుచు
న్నవి సంకల్పశతంబు లిం దడుగు లూనం గల్గు సంకల్పసం
భవసంభావితధర్మకర్మతతశర్మస్వానుకూల్యస్థితిన్. ౪౮

మ. ధనముల్ ధాన్యము లిండ్లు వస్త్రములు రత్నంబు లొప్పెద ల్గాఁగ న
ర్థనముల్ వింతగ నేర్చి కూర్చు నివె స్వర్గశ్రీలకుం గామ్యతా
ఘనతల్ దేవి! యిదంసమృద్ధికృతముల్ గావా? నివారించు ర
త్యనుజాతశ్రమఘర్మతోయముల నుద్యచ్ఛక్తిఁ గల్పించుచున్. ౪౯

గీ. కర్మకాండంబుఁ గా దని కదలరాదు కల్పములె దిక్కు తత్కర్మకలనములకు
స్వల్పములు గాని కామనాఫలము లెల్ల నందుకొనవచ్చు నిందుఁ బొం దమరెనేని.

వ. అనుచున్న ప్రియతము నెన్న నగు నవ్వులుకులు మందాందోలితకుండల స్తబకం
బవు శిరఃకంపంబున నాదరించుచుఁ బ్రియతమ యి ట్లను నవు నవు నాథా! యవ
ధరించితె? ౫౧

శా. శిక్షాపాటవ ముల్లసిల్ల నగు వాసిం దన్నవవ్యాకృతి
ప్రేక్షావత్సమితింజయత్వకలనాస్ఫీతస్వనచ్ఛంద మై
యక్షుద్రంబు నిరుక్తవైభవ మనన్యాపప్యంబె నా నొప్పు నీ
పక్షివ్యాహృత మిందు సాంగమె సమాప్తజ్యోతిషం బైనచోన్. ౫౨

గీ. పుణ్యగంధముల్ గ్రమ్మెడు పూవు లొరసికొనుచు నివ్వాతపోతముల్ జనుల నెల్ల
నిందు రం డని పిలిచి సుఖేచ్ఛఁ గొలిపి కట్టివేయుచునున్నవి కలిమి వెలయ. ౫౩

క. సుమగంధము ఫలరసముల్ సమంచితము రూపు నీడ చల్లదనము నం
దము చందముఁ గల పులుఁగుల సుమహితగీతార్థ మర్థి సుఖ మమృత మిడున్.

ఉ. ఇంద్రియ మొక్కఁడొక్కఁడు మహిం గనుఁ దృప్తుల నందు నందు స
ర్వేంద్రియము లుపిహింప నగు నియ్యది యయ్యమృతంబ కాదె? ని
స్తంద్రత నిందుఁ జేడుటయె సౌఖ్యము ముఖ్యము గాకయున్న దే
హేంద్రియజాతి కండని సుఖేందిత నిర్విషయప్రసక్తయే. ౫౫

గీ. మున్ను సుఖవించినది యొల్లఁ బూర్వభవము కృతము నట్టులు మఱపించి యింకననాగ
తం బనాఘ్రాతముగ నద్యతనసుఖంబె సుఖ మనుచున్న దిచ్చోటు సురుచిరంబు.

క. పన్నీటికొలఁకు లవె సంపన్నవనవసద్వికాసభరభరితము లై
ని న్నాహ్వానించెడు సిరికి న్నేటికిఁ దావల మగు కెలసము నెనసెన్. ౫౭

క. అడుగడుగున కొండొకఁడుగ వెడవెడ వేసములఁ బూని వెలసెడు సిరి నీ
యడుగుల బడిఁ బ్రాణేశ్వర! నడయాడఁ గడంగుచున్న నాణె మరసితే? ౫౮

గీ. ఏకపత్నీవ్రతస్థుండ వీ వటంచు నిన్నుఁ జేరు నుపాయంబు లెన్ని యెన్ని
యాడుచున్న రమం జూడు మనుగణేశ! వ్రతముఁ గాపాడుకొనుటె సాంప్రతము
వ. అనుచు మందస్మితసంస్తుతలోచనాంత యగు కాంతం గనుంగొని. [కృతికి.
క. పలుపోకలఁ బోదురు పొల్తులు పొల్తుల నెన్నఁబోరు లోలుప లెందున్
జలజాక్షి! చూడు మాలతి యలకురవక మాక్రమించి యర్జున మెనసెన్. ౬౧
క. సమరసకంటకితము దాడిమము సమాశ్లేషణము నటించుచు నోరా
యమితోత్సాహమునఁ గదంబముమీఁదికిఁ బ్రాఁకువెట్టు పాటలిఁ గంటే? ౬౨
క. విస్తృతములు గనుఁగొను మీ గోస్తని యధికప్రసంగకోలాహలముల్
సుస్తని! ప్రస్తుతములె పో యస్తవ్యస్తములు కావో? యటు నిటు పడినన్. ౬౩
వ. అని రామదేవుం డన నవ్వాని వామలోచనయు. ౬౪
ఉ. ఇంతకు నింత యేల? హృదయేశ్వర! యిట్టి స్వభావ మున్నవా
రెంతకుఁ జాల రంచు మది నెంచక వీరల పొందుగోరి యా
చెంత మానిద్రుమంబు లవె చేరఁగ రమ్మను సన్నలన్ లతా
కాంతల బాహుశాఖకలఁ గైకొను హావములం దలంచితే? ౬౫
గీ. కట్టుబాటని మగలకుఁ గలిగియున్న మగువలను నూలుపోఁగున మలఁచివైవ
వచ్చు నెచ్చటఁ దెచ్చెద మచ్చరిత్ర మన్యులకు నీకుఁగాక మహానుభావ! ౬౬
వ. అనియె నిట్లు. ౬౭
క. అన్యోన్యప్రియభాషల మాన్యము దాంపత్య మెనయు మార్గమున నెత
జ్జన్యలు కన్యలు వన్యల ధన్యలఁ జేయం దలంచి తారొక్కని రబలా! ౬౮
క. ఆడిరి పాడిరి పూవులఁ దోడెము గాకుండఁ గోయఁదొడఁగిరి సరసీ
క్రీడలకుఁ జొచ్చి రమ్మోయి దాడి యనఁగనయ్యె నది లతానతగాత్రీ! ౬౯
క. ఆనందంబున మెలఁగెడు నానెలఁతల కెలనమునకు నల సతి పతియున్
మానససీమలు పొంగంగా నందం బంది రాస్యకమలము లెలయన్. ౭౦
క. వను లట సరసులు నట యావనవతు లట మల్లికాదివల్లీవితతుల్
కనుమఱుఁ గట యుత్సవ మట కన విన వర్ణింప వశమె కాంతల వింతల్. ౭౧
గీ. తాను స్నానంబొనర్చె సీతావిభుండు తన్వితో నొక్క సరసి తీర్థమ్మునందు
దివ్యభూషణవసనము ల్దేవి మును ధరింపఁ దాల్చె నతండు నిలింపవంద్య! ౭౨
గీ. కొంతదూరమ్ము పోవ నిష్కుటమునందుఁ జిత్రసంచారశీలిని చిలుకసాని
దేవితో వచ్చు దేవుని దివ్యవైభవంబుఁ గని "జయజయ" యని ప్రణతిసేసి. ౭౩
వ. సముచితంబుగా నిట్లనియె. ౭౪

శుకాంగన సీతతో ముచ్చటించుట

శా. దేవీ! మ్రొక్కెద నీకు నీవిభునకున్ స్త్రీజాతిధర్మంబుతో
నే విజ్ఞాపనఁ జేయుచుంటి నిది నానేరం బటం చెంచునా?

యీ విశ్వేశుఁ డెఱుంగఁడా? యుచిత మీవే పో ప్రమాణంబ విం
దో వైదేహి! వచింపనా? సెలవులా? యుద్యానిఁ గన్గొంటి వా?. ౭౫

సీ. విభు మేనికాంతి పర్విన మెత్తవడు మయూరముల బర్హముల కేశములు ప్రేల
సురభికౌసుంభకౌసుమరక్తదిక్తటు లంశుకమ్ముల కల్మి నాహరింప
నాస్యభాగంబున నలదారు తిలకాళి యలకలకళుల నెయ్యమునఁ గూర్పఁ
గోకిలకీరశారికలకలతులు జాణతనమునఁ బ్రసంగము లనఁ
గంచవడకల నడయాడు చదువు మనసు నాఁచికొనుచున్న దే మైన నగును గాక
నైపు మపరాధ మంబ! నీ సవతి యనఁగ సవతు లేకుండ వనలక్ష్మి గవిసె నేఁడు. ౭౬

వ. అనుచుండ సస్మితవైలక్ష్యలక్షితాక్షి యగు నిజకమలాననం గనుంగొని యయ్యజ
తనయ ప్రియతనయుండు. ౭౭

గీ. తవ్వి! వింటివె? యెంతలెంతలు సదివెడునో? శుకాంగన ప్రౌఢ సంతోషసమయ
మనుచు విడఁబడె నింతటి యడియరితన మతనియందు నరయరాద యబ్బ మిదియు.

వ. ఇట్టి చట్టము లాడువారలకే చెల్లుంగాక. ఆలకింపు మయ్యనంతరవిషయం బనుటయు.

గీ. ఆడిపోసికొనన్వలె నాడువారి నాట వారలు లేకున్న నడుగసాఁగ
దమ్మ మగవారి నే మన నగును మన సొకింత సిగ్గాకకొంత యై యెరియుచుండ్రు.

గీ. ఆడువారల వలదన్న నాటయేది? స్థాణువులె కారో? మగలెల్ల జగముతల్లి.
వారికోటికె కదా వార్ధి వంతెనలును గ్రోఁతులను గొండ్రుముచ్చులఁ గూర్చుకొనుట.

వ. ఈమీమాంసల కెన్ని యహర్నిశము లైనఁ జాలనే చాలవు. ప్రస్తుత మవధరిం
పుము. జగదేకఖ్యాతా! సీతామాతా! ౮౨

క. తరుణాంకురపల్లవములు తరువరములు దివ్యగంధతతములు రససం
భరితఫలమ్ములు ఛాయోత్తరములు వాతేరితములు ధన్యము లయ్యెన్. ౮౩

క. మిమ్ముఁ గొలుచు కలిమి నేఁటికి సమకూరెఁగదా యటంచు సంకులముల ను
త్తమకోకిలకూజితముల భ్రమరీ ఝుంకారముల నుపచితము లయ్యెన్. ౮౪

గీ. చిత్రచిత్రముల్ మామిడిచెట్లు చూడు కాననేందిర కవతంసకలన కయ్యెఁ
దచ్ఛతమ్ములె కద రాగవచ్ఛదములఁ గాకభృతకంధరక్తికిఁ గారణములు. ౮౫

గీ. శాతకుంభద్రవప్రతిషక్తము లన నొప్పుచున్నవి కన్గొను మువిదమిన్న!
కొన్ని వనసన్నివేశమ్ము లెన్నఁదగిన పూలఁ గాయల నిగనిగ ల్మించుకొనఁగ. ౮౬

క. అగ్నిశిఖోపమమూర్తీ! యగ్నిశిఖాదిసుమకాంతు లంతటఁ బర్వెన్
మగ్నశిఖామూలం బిది సాగ్నిశిఖం బనఁగ నొప్పె నవ్వనము కదున్. ౮౭

క. నీలాంజనసమపాదపపాలీ తేలిహ్యమానపవనాఢ్యం బౌ
నీ లీలావన మలరెను శ్రీలీలాపాంగవల్లరీక్రాంత మనన్. ౮౮

క. సర్వర్తుకుసుమశోభిత ముర్వీతనుజాత! యీవనోద్దేశము దృ
క్పర్వ మొనరించు నప్పనిపూర్వపహముగ నిన్ని యోషధులఁ దాల్చెఁ జుమీ. ౮౯

గీ. మర్లమాతంగి నందందు మలఁచుకొనియె నొక్కెడ ధరించె మెఱయు మయూరశిఖిని
మఱవ దేనాఁడు గురుదత్తమంత్రజపము లోకసువశంకరము లివి లోలనయన! ౯౦

క. ఏవేసము వేసిన నేమీ? వినుతచరిత్ర! నీదు మెఱుఁగున మెఱసెం
గేవల మీవనభవన మ్మేవిధమున సిరి యనంగ నెక్కడఁ గలదో? ౯౧

క. సురభిళములు వివిధమ్ములు సురతరుణీవందనీయసుప్రచిరచరణా!
పరిగతములయ్యె సుమనోభరములు నీ సేవకొఱకు పాదపధృతముల్. ౯౨

వ. అదె భుజిష్య లమూల్యమ్ము లగు మాల్యమ్ములు నీకుఁగా సంతరించుచున్నారు. రాజరమణీ! ౯౩

గీ. తిన్నగాఁ బరికింపు మీ దీర్ఘికలను పరమవారిప్రపూర్ణసంపద్భరితల
సవిధవివిధప్రకార సంస్కారసహితసుహితతం దెల్పుచున్నవి శుద్ధము లయి. ౯౪

క. అపరంజిబొమ్మ! కంటే? సుపరీతము లా మహార్హసోపానములన్
విపులముల మణియమ్ముల తుపలం జవళులుగఁ జేయఁజాలిన వానిన్. ౯౫

గీ. స్ఫాటికాంతరకుట్టిమస్థలము లొప్ప ఫుల్లపద్మోత్పలవనమ్ము లుల్లసిల్లఁ
జక్రవాకోపశోభితప్రక్రమములు స్వాగతము లిచ్చుచున్నవి సరసు లవిగొ.

క. సరసిజముఖి! తద్గతములె తరతమసంఘుష్యమాణదాత్యూహసుఖం
కరఘోషానుగసారసమరాళముఖసలిలశకునమంజుధ్వనులున్. ౯౭

గీ. పుష్పశబలమ్ము లంచితభూరుహములు తీరజమ్ములు ప్రతిబింబచారుతమము
లెందు వేష్టింప లో వెలి నింపు లొలుకు కలిమి వీక్షింపు మాకర్ణకలితనయన! ౯౮

గీ. సారసాంచితము లగు కాసారములకు సవిధమునఁ గూర్పఁబడిన ప్రాసాదకముల
లీలలకు రాచవారియిల్లాల! నీదు కలికిచూపులు పసదనంబు లగుఁగాక. ౯౯

గీ. లలి సమర్చిరి చుట్టు శిలాతలములఁ ద్వాదృశజనానుకూల్యంబుఁ దలఁపున నిడి
యందు నీయిచ్చవచ్చిన యాట లెల్ల నాడుకొనవచ్చు నధిపుతో నమ్మవారు?.

ఉ. ఆర్య! వనప్రదేశమున నచ్చటనచ్చటఁ బాఱఁజూడు వై
దూర్యమణీప్రణాలికలతో విలసిల్లెడు శాద్వలస్థలుల్
ధైర్యము సెడ్డ యమ్మరునిఁ దద్దయు ధీరు నొనర్ప నెంచు ప్రా
చుర్యము దోఁచుచున్నది విశుద్ధలతాద్రుమసూనమానసన్. ౧౦౧

మ. అవలోకింపుము తల్లి! యల్లదిగొ మాత్యద్దంతిసంఘర్షవా
తవిలోలత్సుమశాలిపాదపచమోత్తారప్రచారంబులన్
దివి తారాగణభాసురం బయిన యా తీరొప్ప భూదేవి పు
ష్పవృతప్రస్తరనిస్తులప్రబలశాబల్యంబుతోఁ గులుకొడున్. ౧౦౨

గీ. ఇంద్రు నందనకాననం బేని నజుని చైత్రరథమేనిఁ గాదు పసందు నేఁడు
కలికి మంగళదేవత కనులకలిమిస్ఫురత్కబ్బెఁ జుబ్బనచూఱగా నధిపు వనము. ౧౦౩

మ. అనుకుండం జననాథుఁ డాత్మసతి నెయ్యంబొప్ప నీక్షించి మా
నిని!యే మే మనశారి కేఁదలఁచితేని న్వేగ మందీఁగదే

యనురూపంబు ప్రసాద మన్న నవు నమ్మా! మమ్ము నిట్లుండ ని
మ్మని యిమ్మానవనాథుతోడ ననుమా యానంద మే మందఁగాన్. ౧౦౪

సీ. ఆకలి దప్పియు నైన నివ్వని సమాస్వాదించెదము పండ్లు సలిలములును
సురలకు మునులకుఁ జొప్పడ దెప్పుడు మీ దర్శనముసేయ మేలుకొందు
మవసరం బై నప్పు డబ్బురంబుగ నేర్చి కైవారము లొనర్పఁగా నగుసుము
స్వాగతప్రశ్నంబు సౌఖశాయనికత్వ మెడనెడ నేర్పడ నెనయుచుందు
మింతమాత్రము చన విచ్చి యేలుకొన్న మే లెనయువారిలోన మా మేలె మేలు
రక్కసుల కాలితాఁపుల రకముమాఱు నింద్రచంద్రత్వముల జోలి యేల మాకు.

క. అను చిలుకపడఁతిఁ గై కొని తనచేతం దడవి మేలి తగవరివ కదే
జననాథు లేలుకొనరో? ధనధాన్యము లడుగకున్న త్వాదృశజనులన్. ౧౦౬

వ. నీయిచ్చవచ్చిన రీతిం జరింపుము కుమారీ! శారీ! యని మహారాజ్ఞి విడిచిపుచ్చిన
మహాప్రసాదం బని యది యాసన్నతరం బవు నీరంబున దూఱియున్న తనకీరంబు
నెనయం జనియె. ౧౦౭

గీ. కడిఁదిశత్రుల రణము శాఖామృగముల సంతతులసంతరించె నజ్జలధితోడఁ
జిలుకలును శారికలు వాని సేవసేయవా? యతఁడు మెచ్చ నేరఁడా? యచ్చెరువెది?

వ. తదనంతరంబ. ౧౦౮

## సీతారాముల యశోకవిహార వైభవము

ఉ. హెచ్చిన సౌమనస్యమున నింగితవేదిను లాదరంబుతో
నచ్చటికి న్నమర్చ మగు నయ్యుపచారమునన్ మెలంగ న
భ్యుచ్ఛ్రితబహ్వాగారకలనోజ్జ్వలదాసనభాసురాసవన్
జొచ్చెను రామభూవిభుఁ డశోకవనిన్ వనితానుయాతుఁడై. ౧౧౦

గీ. ఊఁగుచున్నారు తీఁగలయూయెల లెలనాగ లదె తూఁగుటూయెల లైనపుణికయి
బాఱసాచిన యంఘ్రుల వైభవంబు లచ్చరల డీకొనఁగఁబోవు టనుచు నుండ.

గీ. తుమ్మెదల యులివను శ్రుతి రెమ్మకొనఁగఁ బాడుచున్నారు పాటలు పద్మముఖులు
వినెద మని వచ్చి వేల్పుల వెలఁదులు వనదేవతల పేర నందందు దాఁపుకొనఁగ.

ఉ. ఆరఘురాముఁ డాసనమునందు సుమస్తబకాభిశోభివి
స్తారమునందు శోభనవిధానమునందుఁ గుథాస్తృతంబునం
దారచిత్రప్రసాథనమునందు మణీమయమందుఁ బొందుగా
నారమణీయతో నెనయ నాస్థితుఁ డయ్యె గుహాస్థితక్రమా! ౧౧౩

క. సుచరితుఁడు రామచంద్రుం డుచిత మెఱిఁగి సాదరముగ నుర్వీసుత నా
విచికిలగంధిని గై కొని శుచి యగు మైరేయక మను సురఁ ద్రావించెన్. ౧౧౪

క. ఇంద్రుఁడు పౌలోమి నమృతముం ద్రావించెడు విధానమును మించెన్ రా
మేంద్రు సతి పానగోష్ఠు లుపేంద్రవిధీంద్రాదివినుత! వీతాసదయా! ౧౧౫

క. వివిధఫలమ్ములు మాంసములు విచిత్రము లుపచితములు లోకేశ్వరు న
భ్యవహారార్థము కింకరులు వెసం దెచ్చి యిడి రుజ్జ్వలు లభక్తిమెయిన్. ౧౧౬

ఉ. అత్తఱి నృత్తగీతముల నందెల నందినయట్టివార ల
త్యుత్తమరూపసంపదల నూర్జిత లాసవపానమానితల్
పుత్తడిబొమ్మలే యనఁగఁ బొల్చెడు బాలలు లీల లొప్ప రా
జోత్తము ముందు నాడిరి జయోపహిత ప్రవర ప్రబంధముల్. ౧౧౭

గీ. రమయిత్పవరిష్ఠుఁ డైన శ్రీరామచంద్రుఁ డంచితాభరణాలంకృతాంగుఁ డగుచు
ధర్మమూర్తి సతమ్ము సీతాసమేతుఁ డై యలరఁజేసె నలరించు నలరుఁబోండ్ల.

క. ఆదేవుఁడు నిత్యము సీతాదేవీయుతుఁ డగుచునె తగ నాసీనుం
డై దొఱసె నరుంధతికిన్ సేదిష్ఠుం డగు వసిష్ఠు నిరతిశయరతిన్. ౧౧౯

క. అనుకూలనాయకుం డకొ జనపతి స్వాధీనపతిక జనకజ కాదా?
జనవిదితమె తచ్ఛృంగారనవోల్లాసము మహోర్వరాధరతనయా! ౧౨౦

గీ. సురసుతోపమ యైన భూసుత విదేహనందినిం బ్రత్యహంబు నానందవెట్టె
దేవతుల్యముగా రామదేవుఁ డప్పు డంచితామోదభాగ్యయోగ్యప్రసక్తి. ౧౨౧

గీ. పౌరకార్యంబులును ధర్మపరమకార్యములును ధర్మజ్ఞుఁ డన్నేత ముందుఁ దీర్చి
శేష మా దినభాగంబు సీతతోడ నంతిపురిఁ జొచ్చి పుచ్చు నట్లహరహంబు.

శా. ప్రాతఃకాలము దేవకార్యములు సంభాళించి మధ్యాహ్నమం
దాతిథ్యాదిక ధర్మకర్మముల చాయం బోయి శ్వశ్రూతతిం
జేతోమోదమునన్ యజించి యవిశిష్టిన్ శిష్టకాలంబు సం
స్ఫీతాలంకృతి యై భజించుఁ బతిఁ దత్సీతామహాదేవియున్. ౧౨౩

గీ. ప్రియుఁ ద్రివిష్టపమున నుపవిష్టుఁ డైన దేవదేవు సహస్రాక్షుఁ దెలివి వొదలఁ
గొలుచు పౌలోమి లీల నిచ్చలు భజించు సీతకుం బ్రీతుఁడయ్యె నన్నేత గీత!.

కవులు సీతారాముల వనవిహార మనువర్ణించుట

క. ఆపుణ్యదంపతుల మే లీపగిదిఁ దలిర్చు టెల్ల నెంచి కవులు మా
కీపట్టె పట్టనుచు వాగ్వ్యాపారరమావిహారకలఁ గొని రగజా! ౧౨౪

క. ఎంతని వర్ణింతుము శ్రీకాంతా! యే మని నుతింపఁగల మే మేమో
సంతసమునఁ బలికెద మా యొంతం గలవేని దోసముల గొనకు మినా! ౧౨౬

వ. అని యుపక్రమించి. ౧౨౭

శా. ఔరా భాగ్యమకాదె? మావిభుఁడు దైత్యశ్రేణి మర్దించి వి
స్తారాత్మీయవనప్రదేశవిహృతార్థప్రార్థిజాయానుకూ
లారంభస్పృహణీయసద్విలసనవ్యాపారపారీణుఁ డై
సారామోదము వెల్లి నిల్లలిఁ బ్రపంచంబెల్ల నోలార్చుటల్. ౧౨౮

గీ. చూచునప్పుడు సుఖమునఁ జూపు మునుఁగు నోడువునెడ సాఁగు మామూలు నోటి
చూచినది చూచినట్లు లేశకము నియతి వలచి వర్ణింప నగు సదోవై భవంబు.[పాట

గీ. నాయకుఁడు వేయు వేసంబునకుఁ దగుగతి నాయికయుఁ దాల్చు భూమిక నవనవముగ
నడుగడుగునందు నొక వింత యలరుచుండుఁ దత్ప్రసక్తి నడంగు నేతత్ప్రవృత్తి. ౧౩౦
గీ. ఆఱు సంస్థానములు కల వాత్మకువలె నందు రామారమణుల విహరణములకు
నంచలం గట్టిన విమాన మందుఁ జెంది రుత్తమగతంబు జన్యలు నొనరి కొలువ.
వ. అట్టిఁడగు యోగంబున. ౧౩౨
గీ. నాల్గు దిక్కుల దళములు నాల్గు కల్గి యనలసచ్ఛాయ మైన దివ్యాంబుజంబు
చాయ దీపించు మొదలి సంస్థ్యాయమందుఁ గర్ణికాంతరమణిపీఠికాతలమున. ౧౩౩
వ. పుష్టివిశిష్టుం డగు గణేశిత విధంబున. ౧౩౪
క. వరదాదినిషేవిత యై వరదానప్రసిత యయిన వల్లభతోడం
గర మరుదుగఁ గ్రీడించెడు ధరణీశ్వరుఁ గొల్తు మెపుడుఁ దాత్పర్యమునన్. ౧౩౫
ఆ. అచటి భోగభాగ్య మఖిలం బుపాసించి మించు మెఱుఁగుల పొలిమేర యైన
తద్ద్వితీయసంవిధానంబున నెలర్చు రాజతన్మహిలల రతికి స్వస్తి. ౧౩౬
క. బందిన్యాదిభుజిష్యాబృందము తత్తత్పదముల కెమ్ముకొని మహా
నందమునఁ గొలువుఁ గొనఁగా నందలి మణిమహితపీఠమం దుపగతుఁడై. ౧౩౭
వ. ఉత్తమమ్ము లవు మైరేయమ్ములఁ గ్రావియు నిమ్ము లవు మాంసమ్ముల నుపదం
శించియుఁ గమ్మ నవు ఫలమ్ముల నాస్వాదించియు నానందనగీతికల నాలకించియు
మానితాభినయమ్ముల నాలోకించియు సద్వితీయుం డయ్యు నద్వితీయ సుఖం
బనుభవించుచు. ౧౩౮
క. వాణీభావిని తన నిర్మాణము మానింప నెసఁగు బ్రహ్మ యనఁగ నై
యేణీలోచన మెచ్చన్ రాణించు మహాత్ముఁ బొగడరా? మముఁబోటుల్. ౧౩౯
వ. అల్లదె యచ్చటనుండి. ౧౪౦
క. మాధవితో విహరించెడు మాధవుఁడుం బోలె సారమతి సీతారా
మాధవుఁడు గదలిపోయెడు మాధవమధుమాధవీద్యమంటపమునకున్. ౧౪౧
మ. అలికేశీదశకంబు చుట్టు నెనయన్ హాలామదోల్లాసని
స్తులహేలాబహుభంగు లంగకములన్ శోభిల్ల నాభూమికిం
జెలువౌ గోష్ఠుల నిష్ఠమై నెలమి సంశీలించి మాఱేఁడు మై
థిలితోఁ గూడి విలోచనంబులకుఁ బ్రీతిం గూర్చుచున్నాఁడిటుల్. ౧౪౨
శా. మందారప్రమదావనప్రసవసంపత్సంపరిష్వక్తని
ష్పందేందిందిరబృందకంబులకుఁ జాంచల్యంబుఁ గల్పింప నా
చందం బంగకసౌమనస్యములతో సాధించు నేచిత్ర? మా
సందర్భంబు మనుష్యజాతి ననిమేషస్ఫూర్తికిం గూర్పఁగన్. ౧౪౩
మ. వ్యతిభాస్వన్మణికాంతిపూరణకలావ్యాఖ్యాతతత్త్వంబు న
ప్రతిరూపంబును దత్ప్రదేశమును సత్ప్రశ్రీలఁ గై సేసి స్వం

తతదేవీపరిచర్యలం దనియుచుం దద్ధంసయానం బనా
హతపర్యంతము నొక్క రమ్యవనవిన్యాసాంతముం జేర్పఁగన్. ౧౪౪

వ. చేరి హిరణ్మయప్రభాచక్రప్రక్రాంతోపక్రాంతం బగు నచ్చోట నచ్చెరువుగా.

సీ. కప్యాసపుండరీకవిలోచనప్రభావిభ్రమంబులు ముఖవీధి నెఱయ
హారకిరీటకేయూరకమకరికాకుండలకాంతు లఖండములుగ
మహితహిరణ్మయశ్మశ్రులోమశ్రీలు స్థానబలమ్మునఁ దాండవింప
నాప్రణఖం బగు నవ్విశేషస్ఫూర్తి దలఁచిన తలఁపుతోఁ దారసిల్లఁ
దనకుఁ దగిన వేస మనపాయినియు నూన సరసిజాసనమున సన్నివిష్టుఁ
డగుచు మా ధవుం డుమాధీశు భూమిక నవధరించి మించె నంచితగతి. ౧౪౬

క. పండ్రెండు స్థానకమ్ముల నాంద్రు మహాయుధశయముల ననువేష్టింపన్
దీండ్రించు రవికి నెనయై మండ్రాటము లేక వెలిచె మా కన్నులకున్. ౧౪౭

క. స్నిగ్ధవివిధపాకమ్ములు దుగ్ధరసమ్ము లొడగూర్చి తోయజవదనల్
ముగ్ధవిలోచన లందీ జగ్ధమ్ములఁ బీతముల రసమ్మున నలిపెన్. ౧౪౮

ఉ. మేనక రంభ నూర్వశిని మేకొనఁబోని విలాసినీమణుల్
గానకలాకలాపములఁ గావ్యపుధోరణులన్ విశేషవి
జ్ఞానవిలాససంపదల సౌఖ్యము దాగ్పఁగఁ గొంతసేపు స
న్మానము పేర్మితో నిలిచి మానినితో నటవోఁదలంచెదున్. ౧౪౯

వ. అనుచుఁ బరిక్రమించి చూచి తత్పరతమెయి నామాన్యకవులు. ౧౫౦

శా. ఔరా యిన్నిఁటికన్న మిన్న యలతా వాక్రాంతచంద్రస్ఫురా
స్ఫారం బై యకలంకమై వెలసెడు నత్త్వస్వరూపాప్తి నే
యేరంగు ల్సరిరావు తెల్పన కటం చీ చోటె చాటించెదున్
సారామోదభరంబు చిత్తమునకున్ సంస్థానముం గూర్చెదున్. ౧౫౧

గీ. ఈవిశుద్ధతలమ్మున నెవ్వరేనిఁ జొచ్చిరా? యొచ్చెములు దక్క సురుచిరంబుఁ
దత్స్వరూపంబు నెనయక తలఁగరాదు తన్మణిస్ఫురణమ్ముల తత్త్వము అవి. ౧౫౨

శా. ఆయాదేశములందు సాయుధలు నై పై ప్రెష్యావరన్ షోడశ
ప్రాయశ్రీ లమృతాదిసంజ్ఞితలు భూపశ్రేష్ఠు సేవింపనా
నాయం బెంచి నిరీక్షసేసెద రనన్యాయత్త లై యంతలో
జాయం బ్రాణము ప్రాణముం గొని చనన్ ధన్మనాధుఁడా నేలకున్. ౧౫౩

ఆ. అచట పాయసమ్ము లశనించి వింతలఁ గొంత ప్రొద్దు పుచ్చి కొదుక కరుగు
చున్నవాఁ డనంతరోద్దేశమున కందుఁ జేరి చూడవలయుఁ జెలువుచెలువు.

క. హంసపతి క్షమావతియును సంసత్పాలికలు గాఁగ జా నగు తల్పీ
తాంసతలమ్మున బ్రుసిపై సంసత్తుండయ్యె సీత సమ్మతి నెనయన్. ౧౫౪

శా. ఉచ్చైశ్శ్రవస మిరంమద హ్రదము నా నొప్పారు నప్పొంత స్ఫా
యచ్చిత్రోత్తమవేషభాషుఁ డయి యిచ్ఛాయత్తతోఁ జూడఁగాఁ
జొచ్చెన్నాభిమ మభౌమమహా నఖిలవస్తువ్రాత మేతత్సమం
చచ్చాతుర్యము నిచ్చ మెచ్చుచు నతుచ్ఛంబౌ ప్రభావంబునన్. ౧౫౬

గీ. అదె తదంతఃపథమ్మున నలరుచున్న వేయిఱేకుల తామరవిరి విధమున
సంస్కృత మ్మగు నచ్చోటఁ జరణ మూంచె నంచితుం డట్టి సిరి నెంచ నా నెవనికి.

క. అదె విశ్వరూప మదె సంపదముల నెల వదె విచిత్రతుండనములతీ
రదె భోగాపణ మదె సంవిదుపార్జితవైభవం బవేలంబు భలే. ౧౫౮

ఉ. ప్రాభవనిస్తులంబు నిజభావవిభావ్యము సర్వవర్ణసం
శోభిత మాయుధీయశతసుస్తనికాపరిపాల్యమాన మ
క్షోభ మనంత మద్భుత మగోచరతత్త్వము తత్పదం బన
న్యాభుఁడు సెందె రాఘవమహాప్రభుఁ డప్రమిత ప్రమేయుఁ డై. ౧౫౯

సీ. కామేశ్వరీమహాకామేశ్వరాద్వైతసౌఖ్యసంపత్ప్రకాశ మిదె యొకొ?
లక్ష్మీసమహృషీకేశలక్ష్యవిశేషితాద్వైతవిద్యాప్రమేయ మిదె యొకొ?
బ్రాహ్మణీబ్రహ్మప్రభావసంపాదితద్వైతైతిహాసికార్థ మిదె యొకొ?
పౌలోమకన్యాదివస్పతిప్రస్ఫురద్వైత సాద్వైతబంధ మిదె యొకొ?
యెడసి నట్టులుండి యేకత్వ మెనసిన సర్వవేదముల రస మిదె యొకొ?
వివిధహాత లేకవిధగతి కయ్యెడు తఱికిఁ దోఁచనగు పద మిదె యొకొ? ౧౬౦

మ. అనుభావంబుల కిక్క యౌ నిచటఁగాదా? మోద మెవ్వారికిన్
మునిమూర్ధన్యులు నిశ్చలప్రణిహితాత్ముల్గాంచువా రట్టె ము
న్ననిరూప్యప్రకృతిప్రకారకలనావ్యాసక్తు నెట్టెట్లొ? నేఁ
డనిమేషస్థితి సర్వదృశ్య మగు భాగ్యం బన్యసామాన్యమే? ౧౬౧

శా. దృశ్యాదృశ్యము కద్దు తద్దిశ లసత్పీఠంబు దానన్ నని
ర్దేశ్యశ్రీసుఖసంప్రసాద మన మాదేవుండు దీపించు సం
పశ్యు లాకనఁగలేరు చెప్పఁగలరా? వర్ణింపఁగా రాని సాం
కాశ్యాతీతమహామహఃకలితముత్కల్యాణలాలిత్యముల్. ౧౬౨

ఉ. ఆగుహాలో ధృతం బగు రహస్యము తత్పరివేద్యమే సుధీ
ధీగతి కందఁబోవ దిఁక స్త్రీ పురుషుం డను లింగభేద మా
భోగము చాయఁ గానఁబడఁబోదు చిదేకరసత్వసంభృత
శ్రీగరిమప్రసంగ మవిశేషసుసంగత మందు రిం దొరుల్. ౧౬౩

గీ. స్త్రీకిఁ బ్రాధాన్య మెసఁగ శాక్తేయమతము పురుషప్రాథమ్యమున మతములు బహు
లగును దల్లింగభేదం బపగత మైన నఖిలసమ్మత మద్వైత మనుమతంబు. [థము

గీ. బిందునాదకలాతీతభేదరహితవాదదురవాపనామరూపప్రకార
తాఽనవచ్ఛిన్నకేవలత్వావభాసమాన మద్వైతసుఖ మభిమతమతంబు. ౧౬౫

ఉ. శంకరసంస్తుతం బయిన సన్మత మయ్యది స్వానుభూతితోఁ
గింకరత న్వహించు వహిఁ గీల్కొనఁజేయునుగాత దన్గురు
త్వాంకితభావుఁడయ్యు మును ప్రాప్తవిచిత్రవివేకుఁ డైన మీ
నాంకుఁడు నేఁ డదోగురుతకై నృపదంపతిముక్త్యసక్తికిన్. ౧౬౬

ఉ. కాముఁడు రాముఁడుం జలముఁ గైకొని పోరఁగ నేమిసేయుఁ ద
ద్రామ విదేహనందిని పదంబుల ప్రాలెనొ? కాకయున్న నా
కాముఁడు సూపు మార్గములె కా దన కూఁకొననేల? రాముఁడా
రా మహిలల్ ఘటింతురు చిరాఘటమానము లోకమాత్రలోన్. ౧౬౭

ఆ. కాముఁ దూరకున్న రాముఁడు రాముఁడా రాముఁ దూరకున్నఁ గాముఁడేడి?
రామరామ కామరామయుఁ దలపడి యొతసేయతే రోకింతలోన. ౧౬౮

ఉ. రాముఁడు కాముఁ డయ్యుభయకామిను లెక్కడివార లోకుఁ డా
క్షామములోని చీరికలె కారొ? యఖండత ఖండఖండతల్
మే మని చూచువారల నిమేషము దోషము లంతెకాక ని
ర్ధామము తన్మహార్థ మనిరూప్యము నిర్వికృతిప్రకారమున్. ౧౬౯

ఆ. అట్టి రామచంద్రు నానందనసమాధి కగునుగాత సత మనంతరాయ
మిదియు సిద్ధకథన మేము దీవించువార మొకొ? యైన భాగ్యరమయె యదియు.

వ. అను నిర్వాహణముతో. ౧౭౧

ఉ. ఇమ్మెయిఁ జిత్త మెట్టు లెటు లేగునొ? యమ్మెయిఁ బోక లెల్లఁ దా
రిమ్ముగఁ గూర్చు వారల మనీషితము ల్మనుకూర రాము నే
స్తమ్మును బుష్పచందనలసద్వసనార్ఘ్యమణీవిభూషణౌ
ఘమ్ముగఁ జేర్చి తార్చిరి సగౌరవభావన భావినీమణుల్. ౧౭౨

వ. అట్లు సంభావితు లగు నాకవుల పరమానంద మే మని వర్ణింపఁదగు నరసికొనుము.

రాముల ఋతుసమాజము సేవించుట

మ. సుముఖీ! వింటివె? రాముశోభనవిధాసంభద్విహారప్రకా
రము తత్కాలకృతప్రచారశిశిరప్రాగ్భారసంభారసం
గమనప్రాంచితచాతురీతురియ లోకప్రావృతిప్రేయ మా
రమ నేసెన్ నిజధర్మతం బ్రకృతివస్త్రమ్ముమ్ము న్విశాలమ్ముగన్. ౧౭౪

క. వ్రణములు గూర్చును మేనం బ్రణయం బెడలంగనీని బాధపరీరం
భణాఖ్యము విశ్రమమున్ క్షణము సహింపఁడు శిశిరుఁడు జారుఁడ కాఁడే. ౧౭౫
[illegible] మెల్లుంగవా? యుల్లని యాగడ మెల్లజగంబులందు నో
[illegible] పూరుషున కౌ నెటిఁ గట్టలుకట్టుచున్న వాఁ

డితవుఁడు వోలె నీదయకు నీతని యల్కకుఁ బాత్ర మైన యా
మతకరి పంచబాణుని సమాజమువాఁడటె? యెంత సేయఁడే. ౧౨౬

ఉ. వానికిఁ దప్పుకోవలయువారలు గుంపటు లూనఁగావలెన్
దాని కెడంద బెగ్గిలు నతం డదె కారణ మెల్ల దిక్కులం
దాను జరించుపొంటె హిమధామమహాజలయంత్రసంభృతం
బౌ నివ మూవరింప నవు నప్పని సేమటఁ డేమి వచ్చినన్. ౧౨౭

గీ. ద్వివిదునకు లంచములు వెట్టి వెడలినాఁడొ? యగ్గి వెలవెల వాటెడు నతనిఁ జూచి
యట్టు లేచిన వాని పద్మన మెలఁగని పాంథులే లేరు లోకసంవాదమందు. ౧౨౮

క. తదనంతరుఁడు వసంతుఁడు మదకోకిలకూజితములు మలయానిలముల్
మృదుపల్లవకుసుమములు విశదచంద్రప్రభలు వెలయ సంగతుఁడయ్యెన్.

గీ. కర్మఠుల సోమయాజులఁ గాఁ బొనర్చు యోగులకుఁ గూర్చు పండువు లొగి నమర్చు
నొత్తిగిలువారి హత్తించు నురక తేర్చి యందఱకుఁ గావలయువాఁడె యతఁ డతంద్రి!

ఉ. చల్లదనంబుఁ గేవల మొసంగఁడు కేవల మర్కతాపమున్
జెల్లఁగనీఁడు రాజగతి చింతతము ల్సమకూర్చుచుండు నే
యల్లరి కూడదాతని కహమ్ములు రేలును నిర్మలమ్ము లి
ట్లెల్లరు వారి వారి విధులే నెరవేర్ప రహించు నంచితా. ౧౩౧

మ. మధునామంబు వహించినాఁడు జనసమ్మాన్యత్వమున్ జెందినాఁ
డు ధరాచక్రము నాక్రమింపఁగనినాఁడున్ జేఁ డన న్వాఁడె పో
విధుబింబానన! సామరస్యమున భావింపంగ నై యెవ్వఁ డి
వ్విధ మా త్రోవ మెలంగనేర్చు సభికు ల్వీరు ల్మను ల్మే లనన్. ౧౩౨

ఆ. దేవి రామదేవు దేవీసమేతు నదే విధమునఁ జేరి సేవసేసె
నామనియును నయంబు నటునిటు గానీక సుఖరసవిషయములు సూపిచెప్పి. ౧౩౩

ఉ. ఇంతటిలోనె నే ననుచు నేర్తెఱఁ దోఁచె నిదాఘకాల మో
యింతి! మదీయమంశము నొకించుక దాల్చెనొ నా ననవ్యమై
కాంతులఁ గాంతలం బ్రణయకల్పితకోపవశంవదాత్ములం
గంతున కప్పగింప నొడికంబు తృతీయ ముపాయమున్ గొనెన్. ౧౩౪

మ. రజనిన్ సన్నము సేసి తత్కలన వాతంబందు హెచ్చించె నీ
రజనిర్వాతము కల్మి నుల్మి సరసిన్ రాజీవనేత్రాముఖ
వ్రజమున్ గూరిచె మౌక్తికప్రకరహారవ్యాపృతు ల్మార్చి ఘ
ర్మజలాంకూర ములంకరించె నొడల న్రాఁబోవుచు న్వచ్చియున్. ౧౩౫

క. వీఁ డొక దొంగకదే పూఁబోఁడీ! యెడవెట్టె దేహముల భావములం
బోఁడిమి నొక్కటిసేసెం గాఁ డట్టులు మరునొఱపుల కలిమిం బెంపన్. ౧౩౬

సీ. ఘర్మజలంబులఁ గాయంబులం దెల్ల సంఘటించెను సర్వసామ్యముగను
కేశబంధంబులఁ గీల్కొననీయక చితచిత మనిపించు గతికిఁ దెచ్చె

చిత్రించి నట్టులు చేతి కొక్కఁడు గాఁగ వీవన ల్సమకూర్చె విభవ మొప్ప
నేత్రావధానంపు నేర్పు లలవరించెఁ బతులకు సతులకుఁ బహువిధముల
తపననామంబు లోకబాంధవున కొనరఁ జేసి కమరించె లోకముల్ స్వీయకలన
గ్రీష్మ మూష్మల మగుచు నింగికిని నేల శోకముగఁ దాన చాలి మహేంద్రపుత్రి!

సీ. రాముఁ డి ట్లంబుధి దా పొనర్చె నటన్న వగ జలాశయముల నిగురఁబెట్టి
రావణుపై నిట్టి తీవరముం జూపె నని గాలిఁ గేలిగా నతకరించె
మగలు మల్లాడంగ మగువ లి ట్టై రని చెమటలు పొక్కలుఁ జేర్చె నెందుఁ
గపుల కోల్తల కిట్టిగతిఁ జిక్క రరు లని ద్రుమములఁ జూపె మొద్దులుగఁ జేసి
చెలసి హనుమని పనిఁ బ్రదర్శింపఁబూని యక్కడక్కడఁ గొంపల నగ్గిఁగొల్పెఁ
గాని యేలొకొ? యాగినాఁ డా నిదాఘుఁ డాప్రకరణమ్ము సంగఁ దదభినయమ్ము.

సీ. ఆసమయమ్మున నవ్వని మవ్వమ్ము మీఱు స్ఫాటిక మైన మేడమీఁద
చంద్రకాంతాస్తృతచంద్రికాసుందరచంద్రశాలలఁ బుష్పశయ్యయందు
జలయంత్రములను బాటలముల నొరయుచుఁ బఱతెంచు వాయుశాబకుల కొలువు
లంగీకరించుచు నంగనతో రామదేవుఁడు లీలాక్షదేవనములఁ
బ్రొద్దుఁ బుచ్చుఁదలఁచి పూఁబోఁడిఁ గనుఁగొని పందె మేది?యని సభంబుఁ జూడ
స్మితకపోల యయిన చెలువ భావము లెంచఁ బట్టెఁ గొంతకాల మట్టె నవల!

శా. అంతం బంతము రోసముల్ నెఱయఁ దా నై వచ్చె వర్షర్తు వా
వం తైన న్వలదే? విమర్శ మొకటా యక్షోభ్యుఁ డీ రామభూ
కాంతుం డీ ప్రజ స్వప్రజన్వలెఁ గటాక్షవ్యాప్తి రక్షింప నా
నాంతర్యంబున నుండ నన్యు తగ వేనా? వేచ నై యేచుటల్. ౧౯౦

చ. అని తన నెయ్యముల్ వినయ మార్జవముం బ్రకటంబు లై చనన్
మొనసి సువృష్టిఁ గూర్చి జగముల్ సుఖలోయధిఁ దోఁచె నంత వి
చ్చిన నిచులాగ్రమంజరులఁ జేకొని వీవన పూనె నెల్లెడన్
ఘనకుటజప్రసూనములఁ గ్రమ్మిన తెమ్మెర లావరింపఁగన్. ౧౯౧

మ. ఘనసాంగత్యము గల్గువారల యనర్ఘం బైన మార్గం బిదే
యన నై ప్రేలు డడంచె స్వేద ముడిచెన్ హాయిం గనం జేసె ను
న్నన శైత్యంబు నమర్చె మేల సుఖసంతానప్రమోదంబులం
గనుఁ డం చ ట్లైనకొల్పె దంపతులఁ దత్కాలంబు కాలేశ్వరీ! ౧౯౨

క. వికసించెఁ గదంబము లామ్లుక్రొన్నం గేకుల విలాసములు కేకల బ
ర్హాకలాపమ్ముల నాటలఁ గకవిక లడరెంగదే జగమ్మునఁ గొమ్మా! ౧౯౩

ఆ. అంతరాగృహముల నపరంజి సెజ్జల హంసతూలికల విహారములను
సంతతముగ వేడ్క సలిపిరి మైథిలీదాశరథులు జగము తనివు మెచ్చి. ౧౯౪

గీ. అన్నియుం గల్గువారికి హాయిఁ గూర్ప నున్నదే?యిట్టిసమయ మొండొక్కఁడవనిఁ
బెరలును శాద్వలమ్ములు ప్రజలఁ బసులఁ దృప్తి మొనయించుచుండు నిందా ప్తకామ!

గీ. సీతఁబోలు సౌదామని సేకరించి తాను రాముని రం గైన తనువుఁ దాల్చి
జగము తృప్తి దయాప్రవర్షములఁ దార్చె ఘనుఁడు తద్విశిష్టాద్వైతకలన లలన! ౧౯౬

వ. ఇవ్విధంబున. ౧౯౭

క. ఆరామారాములఁ గొని యారామములందుఁ బడి మహారాగముతో
నేరీతిఁ బ్రవర్తించెనొ నీరదసమయ మది వర్ణనీయమె? రమణీ! ౧౯౮

వ. ఇంతలో. ౧౯౯

చ. మరువము శాకచామరసమాజము దామరపూవులున్ నిరం
తరకరిదానతోయములు దార్కొను వెన్నెలవెల్లవల్వలుం
దొరకొనఁగా వనీకమలతోఁ జనుదెంచె నుదారమూర్తి యా
శరదృతు వల్ల సీతమకు స్వామికి నూడిగ మాచరింపఁగన్. ౨౦౦

మ. అహముల్ నిర్మలనీరదాంచితము లాహా సాంద్రచంద్రాతప
స్పృహణీయంబులు రాత్రిభాగములు రామేశున్ సుఖింపంగఁజే
య హసన్నీరజముల్ లసత్కువలయవ్యాపారముల్ గా మహా
త్మహనం బొప్పఁగ నిల్చి పొల్చె నపు డిచ్ఛానంచితాచ్ఛక్రియా! ౨౦౧

ఉ. మానససీమఁ బాసి గరిమంబున భూమికి వచ్చు నమ్మరా
ళీనిచయమ్ము పక్షపటలీపరిచాలనముల్ సృజించె మ
మ్మో నెటి నంచుఁ జాటుచు రహించె సమీరము లన్ని దిక్కులన్
మానితమైన సౌరభము మాంద్యము చల్లదనమ్ము నెక్కొనన్. ౨౦౨

క. జలదాగమ మందలి గొనములఁ బోనీ కలవరించి పొచ్చెము లెల్లం
దొలఁచి యొక మెఱుగు వెట్టెన్ సలలితముగ జగతి కెల్ల శరదృతు వతివా! ౨౦౩

గీ. గ్రీష్మకాలంబు మెచ్చు నా రీతి మార్చె వార్షికం బవు సమయంబు వఱలఁజేసె
దాని తీర్పులను శరత్తు ధన్యుఁడు తదనంతరుఁడు పూర్వసిరిఁ బెంప నగునె కాదె?

గీ. కాల మెల్లను సుఖదాయకంబె భాగ్యవంతునకు నైన లోకప్రవర్తనమున
నీ శరత్తె శరత్తు నిరీతిగతికి నమ్మొయి వసంతమె వసంత మంబుజాక్షి! ౨౦౪

ఆ. ఇంట నున్న గింజలే మంటఁ గలిపించి పైరు పచ్చఁ జూపు వారిదర్తు
వట్టి సస్యముల ఫలాధిక్యముం జూపి యలరఁజేయు నిది మహాగుణనిధి ౨౦౫

గీ. కాలచక్రము తిరుగ కొక్కగతి నిలుచునా? విలోలవిలోచనా! నాయమునకుఁ
దత్కృత సమృద్ధి నిండ్లలోఁ దార్తు ననుచు వచ్చె హేమంత మొకవింత వైభవమున.

గీ. తమ్ము లోకమ్ము కొఱకె విధాత సేసె నందఱు నొనర్చు పని యొకఁడైన నేమి
కొన్ని మార్పులు గలిగించె గొనము లేని దోసముల యేని నాతఁడుం దోయజాస్య!

మ. చలికిం దాళఁగలేని వారల మహాశ్చర్యంబుగా నష్టు నె
చ్చెలికిన్ దాసులఁ జేసె మంచుఁ గురిసెన్ జీర్ణింపఁగాఁ జేసెఁ బ
ద్మలసత్సౌరభసంప్రదాయముల నే ధర్మంబు లెట్టున్నఁ బూ
వుల విల్కానికిఁ గూర్చి యార్చెను జగంబు ల్సంభ్రమింపం బొరిన్. ౨౦౭

వ. అట్టితఱి. ౨౧౦
క. అభీకుఁడు రామనరేంద్రుం డభయంకరి సీత తనకు నభయం బిడఁగా
నుభయముల సంధ్యలం దక్క భవనముధ్యములయందుఁ గాలముఁ గడపెన్. ౨౧౧
గీ. హిమభరంబుల మునిఁగిన హిమకరునకు నప్పు డెవ్వ రపేక్షించునట్టివారు?
మొల్లపూవుల నలకలఁ బొంగుపఱిచినట్టి లలనావదన మవ్యయమునుఖ మిడ.
శా. ఈరీతిన్ సకలర్తుసంచయమునం దిచ్ఛావిశేషంబులన్
శ్రీరమ్యుం డయి నిర్విశంకముగ నిర్వేశించి యుత్కంఠతో
నారీరత్నము ఛాయచాయఁ గొలువన్ మన్నించె రాజన్యుం
దారుం డుత్సుకుఁడై తృతీయపురుషార్థమ్మున్ గృతార్థమ్ముగన్. ౨౧౩
క. వంతులు పంతంబులు నీవంతునఁ బొలుపార మీఱి పౌనఃపున్య
క్రాంతమహీతల మయి శ్రీమంతుఁడగు రామేశు బుతుసమాజము గొలిచెన్. ౨౧౪
ఉ. రాముని సీత లక్ష్మణు నరణ్యముఁ బోఁచి గృహంబు చేర్చి యా
యా మునివేషముల్ దులిచి యక్కఱఁ గూర్చి సుఖంపఁ జేసె నా
యామని పూర్వజుండు శిశిరాగముఁ దన్వహభోగదాయకుం
డామనిత్రప్రచారముల నందె శుభత్వము కల్మి సుందరీ! ౨౧౫
వ. అది మొదలుగా. ౨౧౬
మ. మదిరాక్షీ! మహితాత్ముతో జనకజామన్వన్వయగ్రామణుల్
తదిదంశబ్దవిశేష్యతానవగతార్థప్రాయసంభోగసం
పదలం దేలుచుఁ గ్రాలుచుండు నెడ సంభావింప నర్హంబు లో
పఱవే లబ్దము లేగ నొక్క త్రుటిగా భావింప నై చెచ్చెరన్. ౨౧౭
వ. శక్తిత్రయాత్మికా! తత్కాలప్రకామకాంతక్రాంతం బగు హేమంతానంతరం బగు
సమయంబు. ౨౧౮
గీ. మరలవచ్చితి నిదె యని మరులుకొలిపి పట్టుపట్టి సౌఖ్యరసపు నిట్టఁదేల్చి
జానకీరాఘవుల సుప్రసాద మెనసి పోయివచ్చెద నన్నట్లు పోయె సాధ్వి! ౨౧౯
ఆ. ఎట్టివేళలందు సేవను లెట్లున్నఁ బౌరజానపదుల గారవించు
తఱి యొకింతయేని తప్పింపఁగా రాదు రామురాజ్యమందు రామ! వింటె. ౨౨౦
ఉ. రాముని కింపు నింపు జనరంజన మొక్కఁడె యంతకెక్కుఁడౌ
రాముము లేని భూసుఖపరంపర లే ననుజన్మ లేని స్నే
హామరలోకశోచకరుణాదికమేని మహీజయేనిఁ గా
వా మెయిఁ బ్రీతిసేయవలె? ప్రాణము లన్నము లెన్న నేటికిన్. ౨౨౧
శా. వైకుంఠాస్పదమందు నుండి డిగి మైత్ర్యాకాశవాయంబు సు
శ్రీకిం బట్టుగఁ దోఁచి రాజ్యరమఁ గైసేయంగ నొసట్టి నాఁ
డే కీర్తింగొన నేగెఁ గానలకు నేఁ డింకం దదన్యంబు లో
నాకాంత్యంబులు వానికిన్ జయరమావ్యాసంగవశ్యాత్మికా. ౨౨౨

మ. క్షితిజానాయకు నానుకూల్యముసిరిం జె న్నేకపత్నీవ్రత
స్థితిసంపాదిత మందు రిం దొకళు లా తీ రొప్ప రన్యాల్పదా
ర్థతిరోధానవిధానచాతురులఁ దద్దాక్షిణ్య మూహింతు శే
గతి నే నంమను ధృష్టుఁ డం చతని నొక్కండ స్వడిన్ భామినీ ! ౨౨౩

మ. స్థిర పై గన్నను మున్ను జంచలపయిన్ స్నేహంబు మెం డిప్పుడున్
స్థిరపుత్రిం గను చూపుకన్న నొకవాసిం జూచు ముల్లోకముల్
సరవిం ద్రిమ్మటు ఖ్యాతినాతి నది తెల్లం బెల్లవా రొప్పుకొం
దురు కానీ తగు పే రిడంజనరు నేను న్వారితోఁ బోయెదన్. ౨౨౪

క. చాటి వచించెదఁ జు మ్మోంబోఁటీ! సీతావధూటి పున్నెము లే దే
జోటికి నంతకు మిక్కిలి కోటికి నె క్కె నసముసిరి కూర్మల పేర్మల్. ౨౨౫

సీ. సీతావిభవ మంకసీమాచితము గాఁగ మొగమున నగవుల మొలక లెత్తఁ
దనచేతిధర్మంబు నతుజుఁ డింపునఁ దాల్ప నభయముద్రాంకితహస్త మొప్పఁ
దనుఁ గొల్చువారి చిత్తము లేకరసము లై యానందభూయస్త్వ మంది వెలయ
నిటు నట్లు కాని కా న్పోలమికిఁ గుమరొచు మునుల శాంభవిముద్ర ముచ్చటింప
సింహాముఖదివ్యపీఠికాసీనుఁ డగుచుఁ గనులకలిమి దయావృష్టి గడలుకొనఁగ
లోక మేలెడు శ్రీరాము నేకమూర్తి యార్తు లెడలించుఁగావుత మాత్మ నిలిచి.

క. అని కన్నుల నానందముఁ గొనియాడు నిజేశుఁ గొలిచి కుధరేశ్వరనం
దిని తాను నాదళకు నై యమకూలశుభేరితముల నభినందించెన్. ౨౨౭

వ. అభినందించి తదనంతర కథాశ్రవణప్రవణశ్రవణానుబద్ధమనోంబుజాత యై యమ్మాట
త్రుట్టించుటయు. ౨౨౮

శా. తత్త్వజ్ఞానగతాధిదైవవిలసత్తత్తద్గుణోపేయభా
స్వత్తాసంప్రచితస్వరూపకలనాశాబల్య! నైర్మల్యసం
విత్తానుత్తమశాప్రకారపరసంవిద్భావ్యభవ్యక్రమా!
సత్తామాత్రపరిస్ఫుటప్రకృతినిస్వస్వైరసంభావనా ! ౨౨౯

క. ఆసన్నముద్రాముఖ్యవ్యాసంగవశప్రకాశ! యద్వద్భావో
పాసితృతత్తద్భావోద్భాసితకామాయమానతనువిస్ఫురణా! ౨౩౦

మాలిని. మధయుతదురవాపా! మాన్యమానాదివిద్వ
ద్హృదయగగనభాస్వద్దీతిభాస్వత్ప్రకాశా !
సదమలచిదుపాంతస్ఫారనానాప్రకార
స్వదయితనిజమాయాస్వస్వరూపప్రవేశా! ౨౩౧

గద్య:— ఇది శ్రీమదుమామహేశ్వర ......... వేంకటప్పాభిధానకవికుమార
..................శ్రీదేవీసేవ్యమానరాఘవనారాయణప్రపూరితం బైన
రామకథామృతంబను మహాప్రబంధంబు నుత్తరకాండంబు
నుత్తరభాగంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీశివాయ గురవే నమః

# శ్రీరామకథాఽమృతము

## ఉత్తరకాండము

—:o:—

### —♦ ఉత్తరభాగము — ద్వితీయాశ్వాసము ♦—

—:o:—



రంజితమునివాక్యా
చారాధ్వపరిక్రమణవశప్రారబ్ధ
ప్రారబ్ధానుభవప్రతి
సీరాంతరితస్వరూప! శ్రితసుఖరూపా! ౧

ఆ. అవధరింపు మభవ! యామీఁది రామకథాఽమృతమున చవికి నాదరమునఁ
జెవులు దార్చెడు తన సీమంతినీమణి యచ్చెరువడ నిట్టులనియె భవుఁడు. ౨

క. పర్వతవంశవివర్ధని! సార్వపథీనంబు రాముచరితము రస మే
ధూర్వహు లేగతిఁ గొనిన నపూర్వత దోఁచుఁగదె పానఁ బున్నముకలిమిన్. ౩

క. జటిసేవితాంఘ్రికమలా! యిటమీఁదటి తత్కథాంశ మే రస మనెనో?
యెటు లే నన నేమి? మన స్తటమున నీనిర్ణయించు దారిఁ గొనవలెన్. ౪

వ. కావునఁ దత్ప్రసంగవ్యాసంగభంగివిశేషంబు లాద్యంతంబుగ నాడివెద శ్రద్ధ మైకొన నిర్ధారణసేయుదువుగాక. విను మవ్విధంబున సీతారామసుఖదాయకం బవు శరద యుతంబు సంపూర్ణంబుగాఁ గృతకృత్యం బగుటయు. ౫

గీ. పలుతెలుంగుల రాఁబోవు పద్ధతులకు ననుగుణములు నిమిత్తమ్ము లగుచువచ్చె
నట్టు లన్నింటికిం దలకట్టనంగ నైనదికదే మహాత్మ్య హ్రాదాచరితము. ౬

వ. ఆలకింపు మయ్యదియు. ౭

#### రాముఁడు సీతతో సుఖప్రసంగము సేయుట

ఉ. పూని స్వధర్మనిష్ఠముల భూతములం బొనరింప నైన భూ
జానికి నీ కధర్మ్య మయశస్యముఁ గాదొకొ? దేవ! భూసుతా
జానిత యంచుఁ దెంపుమెయి జ్ఞాపనసేయఁగ ఛోటి మీఁకె నా
కోఁ? నియతిప్రధాని యన గుండియ జల్లనె రాముమూర్తికిన్. ౮

ఉ. పొంగునె యంతమాత్రకు విభుండు విభూషితుఁ డౌచు నొకనాఁ
డంగన చెంగటన్ మఘవు నంగనకుం గరువంబు నేర్పు న

ట్లింగితముం గ్రహింప నగు నింగిత మొప్పఁగఁ గొల్చుచున్నచో
నంగజజీవనీ! కడుఁ బ్రహర్షముఁ బొందుచు నిస్తులంబుగన్. ౯

క. కల్యాణసమన్విత సకలల్యాణిం బల్కెఁ గాంచి కాకుత్స్థుఁడు సా
కల్యాత్తసుఖముఖం బవిచాల్యంబుగ మేలు మేలు సాధ్వీ! యనుచున్. ౧౦

ఆ. సురసుతోపమాన ధరణిజ సర్వ్వరారోహ నెంచి యుర్వరాహితుండు
తద్ధితార్థనంబు దారి మెలంగెడు నెలమి నలము కొనుచు నిట్టులనియె. ౧౧

శా. వైదేహీ! సముపస్థితం బయిన దీభవ్యంబు నీయందు నా
ప్రాదుర్భావము సార్థకంబ పితృదేవప్రార్ణము ల్వాయ నా
మోద మ్మేర్పడెఁ బో న్నపత్యకరణమ్ముం గూర్ప నై యుంటి విం
కేదీ? యిందుఁ గొఱంత భాగ్యమునఁగాదే యిట్టి మే లబ్బుటల్. ౧౨

గీ. ప్రాప్తకాలంబు నటు నిటు పడఁగనీక నీకుఁ గలకోర్కి దీర్ప యత్నింపవలయు
నోవరారోహ! కాదని యూరకున్న నసదృశం బగు సంతాన మబ్బుఁ జుమ్ము.

ఆ. నేను తీర్పవలయు నీకోర్కి యెయ్యది? యేమి కోరుచుంటివే? మహేచ్ఛ!
నెలఁత! మానిలాలనీయం బపత్యంబు నీకు ననముఁ గూర్ప నెగడవలయు. ౧౪

వ. కాన నీకామితంబు దాచక వెలిఁబుచ్చు మనుటయు. ౧౫

ఉ. ఆననమందుఁ జిన్నగ వద్దిర నా నొక ముద్దు నూప నా
మానిని ప్రాణనాథుని సమక్షమునం దొకకల్కిఁ గొల్పి దే
వా! నిను నాథుఁగాఁ బడయ నైన మనీషితముల్ తదర్థసం
దానితముల్ సుకర్మములు నాయెడఁ బూర్ణఫలంబు లై తగెన్. ౧౬

గీ. లోకనాథుని నాథుఁగాఁ గైకొనుసతి కిట్టినమయమ్ములందు నె ట్టెట్టు లెద్ది
యెద్ది జరుగంగవలె నన్న రద్ది గలదె? కాని నీకోర్కిఁ దీర్చుకాంక్ష ననుచుంటి.

గీ. ఆప్తకాము నగుదుఁగాక యడిగినప్పు డేదియును నాకు సకలఅ లే దటన్నఁ
జిన్నవోదె? నీమనము మహోన్నతుండ! కానఁ బ్రార్థింతు ననుకూలకథకుఁ గమ్ము.

మ. ఫలమూలాశను లుగ్రతేజులు మునుల్ భాగీరథీతీరవా
సులు తత్పుణ్యతపోవనంబు లనఘా! చూడంగ నా నంచుఁ దోఁ
చె లసత్తన్నసపాదమూలముల నర్చింపం బ్రవర్తింపఁ ద
త్తలమందుం దలఁ పుద్భవించె నగునో? ధర్మాత్మ! కాదో? కదే. ౧౯

క. ఏకాహ మేకరాత్రమ్మో కానీ నేను దర్వసేందిరఁ గనుచున్
బ్రాకటముగ నివసించెద నా కిది యి మ్ముచితమేని నరనాథమణీ! ౨౦

ఆ. అని యడిగిన రాముఁ డక్లిష్టకర్ముండు దాను నొప్పుకొనెఁ దథా యని యనె
రే పచటికిఁ బైవ మోపుణ్యకాంత! విస్రబ్ధ వగుము లేదు సంశయమ్ము. ౨౧

మ. అనవే కాని ముహూర్తముండె మది నయ్యర్థంబె చింతించుచున్
ఘుని శైవె వ్యాకులమానసాబ్జుఁ డయి నిర్మోదంబు నాస్యాంబుజం

బున రానీక సుహృత్పరీతుఁ డగుచుం బోయెం బదాసీనతన
ప్రణయప్రగ్రహయుక్తి మధ్యమ మగారంబంతఃఁ గూర్చుండఁగన్. ౨౨

క. అచ్చట నుపవిష్టుం డగు నచ్చిత్రచరిత్రు నృపు నుపాసింపంగా
వచ్చిరి కథాకథనకృతు లిచ్చ మెయిన్ హాస్యకారు లింగితవిదు లై. ౨౩

గీ. విజయుఁడును మధుమత్తుండు పింగళుండు కాశ్యపసురాజకుటులును గాళియుండు
భద్రుఁడు సుమాగధుఁడు దంతవక్త్రుఁ డనెడు నామములవారు హాస్యసన్నాహవిదులు.

మ. మహితాత్ముం డవు రాఘవేంద్రుదరి సమ్మానం బనూనంబుగా
బహుభంగీపతిహాసవాసితకథావ్యాసంగముల్ సద్రసో
ద్వాహము లెల్లఁ జరింతు రెప్పు డపు డాత్మ వోఁదమొప్పార నా
వహి వర్తిల్లఁగ వారిఁ గన్గొని కథాభాగప్రసంగంబుగన్. ౨౪

గీ. ఎందులకు వచ్చె నీయాగ మెవ్వఁ డెఱుఁగు నెప్పటి సమాచరణము లాం నే ముక్తాని
క్రొత్త లే? యని వార లూఁకొనుచునుండ భద్రుఁ జేరఁ బిలిచి రామభద్రుఁ డనియె.

ఉ. భద్రుఁడ! యస్మదీయకులభవ్యయశోలతికావికాసని
ద్రిద్రుఁడ! చెప్పరా నను మనీషుల యేమిఁ దదన్యులేని య
ద్యద్రసమందు నెట్లు లెటు లాడుకొనంగలవార లైరొ? త
త్తద్రభసంబునన్ జనపదంబున రాష్ట్రమునం బురిన్ దరిన్. ౨౬

వ. కల నిజం బనువదింపు మిదియుంగాక. ౨౭

సీ. భరతు సచ్చరితంబు వాటింపఁబడుచుండెనా? ప్రసంగముల ననారతంబు
లక్ష్మణశత్రుఘ్నులను గూర్చి యేమేని వాకులాడరు కదా! పరు లపలును
మాతల్లి కైకేయి మాట లే మనుకొం ద్రనింద్య కవ్విధి నింద నియతి సేసె
నకట సీతాసతి యాచార మేలాగు చర్చింతు రా యూయి సమయములను
మఱియు నే యే విశేషము ల్నన్నుఁ గూర్చి చాటుచున్నారు నైన సత్సభల నైన
వెలయుచున్నవి చెప్పు నవీన మైన రాజ్యమున రాజులకు దూఱు రాకపోను. ౨౮

క. అని యడిగెను రామునితో వినతుం డై భద్రుఁ డనియె వివిధములు కథల్
నినుఁగూర్చి నీదు విక్రమమును గూర్చియుఁ గొనెద రుచితముగఁ బురి ననుచున్.

గీ. వాని మాటల కడ్డమువచ్చి యడిగె రాఘవుం డున్నయట్లు సర్వంబు నిరవ
శేషముగ నాడవలె దానిచేతఁ గలుగు మేలు మేలాచరింతు నేమింతుఁ జెట్ట. ౩౦

చ. భయము దొలంగి నమ్మకము వమ్మగు నమ్మొయిఁ బాక సంజ్వరా
మయరహితుండ వై యనుము మంచియుఁ జెడ్డయు నేర్పిరించి నా
పయి నిదె యొట్టు వెట్టితిని పాపుల పాపకథానకంబు లే
నయమునఁ జెల్లుచున్నవియొ? నా కవె యిప్పు డవశ్యవాచ్యముల్. ౩౧

అను రఘురాము నుక్తులకు నట్టిటు పోవఁగరాక వాఁడు సం
తీవ్రభయశోకతాపముల తీరునకుం బుయిలోడి చేయఁగాఁ

జనియెడుదానిఁ గానక విచారము దక్కి వచించె వాని యిం
పున కగు పల్కు లిమ్మెయి విభుండు సమాహితచిత్తుఁడై వినన్. ౩౩

లోకాపవాదము

గీ. చెప్పరా దిట్టిమాటలు చెప్పకుండ నుండరా దిట్టులడుగఁగా నుర్విపతికి
విధివిలాసముఁ దప్పించు వెరవరి యెవఁ డాలకింపు మిఁ కేమైన నగునుగాక. ౩౪
మ. ధరణీంద్రా! ప్రజలా? శుభాశుభము తా దార్ల్యం బురిం బల్కుచుం
దురు రథ్యాపణచత్వరోపవనులందున్ నీసమాచారముల్
సరవి న్నిందురుఁ గొంద ఱుత్తములు శీర్షంబు ల్గడు న్వంచి య
య్యరవిందాసనుఁ దిచ్చలంబుఁ గొని నాయం దేమి సేతుం గటా. ౩౫
ఉ. అంబుధి సేతుబంధనము? దానవు మెచ్చఁగ దుష్కరంబె కా
ర్యం బెవ రాచరించి రెపు డాశరులా? సురలా? నృపాలురా?
సంబలవాహనుం దవు దశాననుఁ జావొ? తదేకసాధ్య మ
న్యంబు విచిత్ర మెల్లులు వనాటులు రక్కసు లిట్లు కొల్చుటల్. ౩౬
గీ. రాము వీర్యంబు కార్యంబు రాజసంబు విన్నదియుఁ గాదు మున్నెందుఁ గన్నయదియుఁ
గాదు కానీ కలంక మొక్కండు గలిగె నిందునకుఁబోలె నినున కధీశువలన. ౩౭
ఉ. రావణు నాహవంబున నరాతి వధించెన పో మహీజ సం
భావనసేసి రాఘవుఁడు మర్త్యముఁ బృష్ఠగతం బొనర్చె నె
ట్లావిధి వైరి యంకమునయుం దమరం గొనిపోవు పోయి లం
కావనిఁ బెట్టె రక్కసులఁ గాతలిఁ బెట్టిన దానిఁ దే నవుర్. ౩౮
గీ. సీతఁ గుత్సింపఁ డేమి విశేష మరసెనో కొక్క? యాభుక్తభోగయం దోడయఁ డింక
నిట్టిపను లెల్లవారు సహింపవచ్చు రాజుసేసినపనిఁ జేయరా? ప్రజలును. ౩౯
చ. అని బహుభంగులం బలుకనై పురవాసులు నిన్న నేఁడు నె
ట్టనఁ దెగఁబాఱి రిట్టి వికటంబు లెఱుంగము వత్సరంబులో
యినకులసార్వభౌమ! చనియెం బదివే లిది యిప్పు డేల వ
చ్చెనో? మును వేల కా దసరో? చిత్రము లింకెవి పుట్టనున్నవో? ౪౦
ఉ. అందఱు నట్టులుండ నిటు లప్రియము ల్వలుకంగ నా మొగం
బందు విధాత వ్రాసె నని యశ్రుల నస్రము లుర్లఁ గంధరం
బందునఁ గద్గదత్వ మెనయంగ నతం డవు డంగలార్పు న
య్యందఱిఁ గాంచి ఱేఁడు పరమార్తుఁడువోలె విషాదమూర్తియై. ౪౧
క. ఇది యేటి మాట? ప్రజకే యదయత నిటు లాడి రన్న నది నమ్మ నెటా
విదితాత్ములార! నిర్ణయ మిది యెట్టిదొ? నొడువవలయు నెల్లరు ననినన్. ౪౨
వ. దీనుం డవు నామహీజానిం జూచి చేయునది లేక కన్నుల చెన్నుఁ జెఱచు
మున్నీరునాఁగియు నాఁగలేక దేవా! యుందఱుఁగాని యింకం గొందఱుగాని యున

నిందుఁ గొండొకదారి యుండినఁగదా! మా భాగ్య మి ట్లున్నది యని మోములు వాంచుటయు. ౪౩

క. జనవాక్యముఁ గాకుత్స్థుఁడు వినినంతనె యుస్సు రనుచు విడిచె న్వారిన్
చనుఁ జన దనక మహామహులు మునుకొని వర్తించె శోకమును పిలిచినటుల్. ౪౪

క. చింతాక్రాంతుం డై యొకకొంతతడవు పలుకకుండి గొదకొని గోత్రా
కాంతుఁ డెద నిశ్చయించి యనంతరమే ద్వాస్థుఁ బిలిచి యనె నాతురుఁ డై. ౪౫

శా. పోరా లక్ష్మణు భవ్యలక్షణు మహాపుణ్యున్ సుమిత్రాసుతున్
సారజ్ఞున్ భరతున్ పరాక్రమపరున్ శత్రుఘ్ను నొక్కుమ్మడిన్
వే ర మ్మం చిటఁ దోడితేర క్షణమేని న్నైపగా రా దిఁకన్
రారా యిక్కడనున్నసన్న నన ద్వారస్థుం డవార్యత్వరన్. ౪౬

క. తా నా మూల మెఱుంగమి దీనము కాకున్న మోము తేకువ నేదేఁ
గానొప్పు రాచకజ్జం బానెటిఁ జిడిముడివడు విభు వ్యగ్రత కనుచున్. ౪౭

క. అంజలిబంధముఁ దలనిడి యంజక లక్ష్మణుని గేహ మనివారితుఁ డౌ
చుం జొరఁబాఱి తనుం గని రంజిల్లు మహాత్ము ముందరం దీవించెన్. ౪౮

ఉ. ఆపయి రాజశేఖరుఁ డనా! నినుఁ గాంచఁ దలంచె వేగమే
యాపని నిర్వహింపు మన నంతకు మిక్కిలి యొక్కఁ డేది? యం
చా పురుషోత్తముం గనఁగ నయ్యనుజుం డపుడే వడింజనెన్
దీపితవేగవర్ధయము తే రొకఁ డెక్కి సముత్కచిత్తుఁ డై. ౪౯

వ. అంత నాప్రతీహారి యప్రతిహత మైన రయమ్మున. ౫౦

క. భరతునియింటికి వినయానదరావనతుఁ డౌచు నేగి తదుచితముగఁ జె
చ్చెరఁ బెంపుఁగూర్చు పలుకుల వరుసనె రామప్రజేశు పని వినిపించెన్. ౫౧

ఉ. రాముని ద్వారపాలకుని రాకకుఁ జిత్తము దత్తరింపఁగా
నా మెయి నుండి యాన యను నానుడితోడనె గద్దె వీడి యు
ద్దాముఁడు పావనుండు భరతప్రభుఁ డేగెను బాదచారి యై
యా ముకువ్రొవ్వు లక్ష్మణునికన్నను మున్నుగ నెట్లు సేర్చెనో? ౫౨

వ. అనంతర మా ద్వారాంతికచరుండు శత్రుఘ్ను హజారంబున కరిగి. ౫౩

ఉ. వర్ధిలు మింతకన్న రఘువల్లభ! రాగదె యన్నఁ గొల్వ న
ప్పార్థివుఁ డర్థితోఁ బిలువఁ బంపెను దమ్ముల మిమ్ము నెల్ల సే
వార్థులు పూర్వజు ల్సనఁగ నై రదె యింతకుమున్న యన్న వా
క్యార్థము వించు నాసనము నప్పుడ డిగ్గి మనం బెలర్పఁగన్. ౫౪

ఉ. చయ్యన రాముఁ జిత్తమున సన్నిధిసేసికొనంగ నై శిరం
బొయ్యన భూమిఁ జేర్చి మహితోక్తుల భక్తినమస్కరించి యా
యయ్యయు నన్న యున్నెడకు నమ్మొయివోయె రయంబు దోఁప నా
నెయ్యము లెప్పు డట్టివిమె నేఁడు నవంబులె? ప్రేయసీమణీ!. ౫౫

క. ఆ వాకిలికావలివాఁ డావెంటనె ముందఁబోయి యవనీశునితో
నావిధి వచ్చిన తమ్ముల సేవావసరంబుఁ గోరి చెప్పి నిలిచినన్. ౫౬

క. విని యనుజన్ముల వచ్చుటయును జింతావ్యాకులేంద్రియుఁడు దీనమనుం
డు నవాఙ్ముఖుఁ డై తన తీరని గోరము మోము దెలుప రా జాతనితోన్. ౫౭

ఉ. ఓరి! కుమారులం ద్వరగ నొక్కట నిక్కడఁ దోడితేర య
వ్వారలయందు నాకు నగు ప్రాణము లున్నవి వారె సర్వసం
భారము లిష్టముల్ వినవె వారలఁ దెచ్చుట కిన్ని విన్నపా
లా? రభసంబుతో మది కలంగుచునున్నది పోర యం చనెన్. ౫౮

ఆ. విభుని యన్నెఱి నుడి వీతెంచుచుండంగ నరిగి రాకుమారు లన్నదరికి
శుక్లవసనమాల్యసురుచిరుల్ ప్రహ్వులు ప్రాంజలులు సమాహితాత్మ లగుచు.

వ. ఇట్లు సన్నిహితులై. ౬౦

గీ. గాము గైకొన్న చంద్రు మొగంబు వోలఁ జరమసంధ్యాగతుండు భాస్కరుఁ డనంగ
నిష్ప్రభుం డయి బాష్పము లైఱయు కనుల విన్ననగు నన్నఁజూచి యుద్విగ్నులగుచు.

గీ తలలు శ్రీరామదేవు పాదములఁ జేర్చి త్వరితు లయి కూర్చి ర ట్లభివాదనమ్ము
లసువులెల్ల నెటో? వోయినట్టు లుండ నశ్రుపాతం బొనర్చె లోకార్చితుండు. ౬౨

వ. తదనంతరంబ. ౬౩

గీ. బాహువుల లేవనెత్తి సంభ్రమము గొఱలఁ గౌఁగిటం జేర్చి వారలు గలఁగుచుండ
నాసనంబులయం దుండుఁ డనుచుఁ బనిచి గద్గదిక యుద్గతంబుగాఁ గనుఁగొనఁగని.

శా. నాసర్వస్వము మీర జీవితము నెన్నన్ మీర మీచేఁ గృతం
బై సౌఖ్యం బిదు రాజ్య మేలఁగ నిమిత్తార్థంబుగా నుంటి మీ
రో? సచ్ఛాస్త్రసునిశ్చితార్థు లతిధీరుల్ శేముషీనిష్ఠితుల్
మోసం బేద మదర్థ మొక్కఁ డిది యాలోచింపుఁడా యం చనెన్. ౬౫

వ. అంతకు నాసోదరు లెల్లఁ దెల్లవోయి ౬౬

ఉ. ఈగతిఁ బల్కుచున్న వసుధేశ్వరు మార్గ మెఱుంగరామి ను
ద్వేగముఁ జెందు డెందములఁ దెచ్చి వధానపరాయణమ్ము లౌ
యోగముఁ గూర్చి రేనియు నొకొండును దోఁచకపోయె నర్థ మా
యాగ మెదో? యదర్థమొ? యదాగతమో? యదుపజ్ఞమో? సతీ! ౬౭

సీ. మాయమ్మ యే మైన మరల నారంభించెనా? యని ఖిన్నుఁ డై యరసె భరతుఁ
డీసారి మాకొంప కే మైన నెన రామెనా! యని లక్ష్మణుం డలయఁజొచ్చె
నెదొ? వచ్చిపడిమెఁ గాదేనిఁ గంటిమె? యీవిధం బెందు నని యార్చెఁ దదనుజుండు
ప్రజలలో నేమైన రాదుకదా నేర? మని దూర మేగె నామనసు లెల్ల
నక్కట సతీతిలక మైన యమ్మవారు దేవునకు నింత వంత లౌ తెరువు వట్టి
నడచునా? కలలో నైనఁ గడవరాని యిడుమ లెవి యున్నవో? యని యుడికిరి కడె.

సీ. ప్రాప్తరాజ్యము వీడి యడవికి వెడలుచో మోమున దైన్యంబు మొనయఁబోదు
చిత్రకూటంబున సిరు లెసలారంగ భాషించె నొక వెల్తిపాటు లేదు
వననిధి పొడసూపి యనుపుఁ దెల్పని నాఁటికల వేఱు నేఁటి యీ కలయు వేఱు
రావణుఁ బరిమార్చి రామ నగ్గిఁ గరంచు నాఁ డేని నిట్టిసన్నాహ మరిది
యనుచుఁ దమతమ యనుభవంబున కగునటు లెంచి చింతించి చింతించి యెఱుఁగలేక.
పోయి రప్పటి కార్యంబు పోల్కి నంత లక్ష్మణుం డుల్కిపాటున లో వెడలఁగ. ౧౯

మ. అకటా సీతమ రావణుం డటులు గొంపోనై నెడం బర్ణశా
లకుఁ జేరంజను వేల నన్నయెడ నీ లాగింత కాకున్న నిం
చుక గన్పట్టె నొకండు కాదిది హాలా శోకంబ కానోపు న
య్యకలంకస్థిరసచ్చరిత్రకు నపాయంబే లగుం దైవమా! ౨౦

గీ. అన్యకార్యమ్ములకు నేన యరుగువాఁడ రాము శాసన మౌఁదల రాజిలంగ
నకట సీతావిషయ మైన నందుఁ గానిరీతు లెవియైనఁ జెనసి భరింపఁజాల. ౨౧

వ. అనుకొనియె నిట్లనేకప్రకారంబుల దూరదూరగతంబు లగు మానసంబులతో
నమ్మువ్వురుఁ గవ్వకుఁ గాకుండ బెండువడి యుండి యథఃప్రసృతంబులగు చూపుల
నెట్టెట్లో యెత్తియు నెత్తని యత్తెఱంగున రాము మోమునఁ గీల్కొల్పుటయు. ౨౨

శ్రీరాముఁడు తమ్ములతోఁ దన దుఃఖము దెల్పుట

ఆ. ఆయవస్థకైన యనుజన్ములను జూచి నోరు పొడివడంగ నా రఘువరుఁ
డెడయు నెలుఁగుతోడ హీనాతురం బైన యట్టివాక్య మిట్టులనియె సునయ! ౨౩

క. వినుఁ డందఱు భద్రము మీ కనువొందెడుఁ గాత మనము లన్యపథములం
జననీకుఁడు సోదరులార! నితాంతస్నేహులార! ప్రాణములారా! ౨౪

ఉ. ఓకృతులార! నన్నెఱుఁగరో? మహితాత్ములు భవ్యులైన యి
క్ష్వాకుల సత్కులమ్మునఁ బ్రశంసకుఁ బాత్రమునై జనించితిన్
లోకము పాట్లడంగ సురలోకభయంకరుఁ గీటడంచితిన్
ప్రాకటరాజ్య మేలితి భవత్సుసహాయత నిన్ని యబ్దముల్. ౨౫

శా. నాకు న్సర్వవిధంబులం దగిన దీ నారీవతంసంబు లో
కైకారాధ్యుల యింటఁ దోఁచె సిరియే యన్నట్లు లీ సీత నా
నాకల్యాణవిశేషముల్ తఱిఁ గొనెన్ నాతోడ మీ కెల్లఁ ద
త్ప్రాకట్యంబు చరిత్రశుద్ధి సుగుణవ్యాపారముల్ దెల్లముల్. ౨౬

గీ. అమ్మహీజాత సౌశీల్య మాభిజాత్య మాత్మశుద్ధి యెఱుంగు నా యంతరాత్మ
సురలు మునులా యశస్విని తెఱఁ గెఱుఁగుదు రెఱుఁగరే? మీర లెల్లనాయింతిఁ
గొంత. ౨౭

ఉ. లక్ష్మణ! సౌమ్య! నీ వెఱుఁగులా గిది దండకకాననంబునం
బక్ష్మలనేత్ర నెత్తుకొనిపాఱెను రావణుఁ డన్న మున్ను ద

త్మాసక్తిపతివ్రతాచరణశోభన మారసికాదె? శాత్రవుల్
యక్షిమ్ము మందులన్వలె మహాస్త్రచయమ్ముల రూపడంచితిన్. ౭౮

ఉ. పుట్టిను నాకు నష్టై యొకబుద్ధి విదేహజఁ గూర్చి యెట్టు లా
కట్టిడి యైన రక్కసుని కానన మం దటులున్న దాని నా
పట్టునఁ జేర్చుకొందు నని భావిని ప్రత్యయ మీయ నగ్గిలో
నట్టియెడం బడెంగద నయం బగు నష్టి యుపాయ మైనచోన్. ౭౯

శా. నీప్రత్యక్షము హవ్యవాహనుఁడు మాని వ్రాత మగ్గింప ధ
ర్మప్రీతిం గొనితెచ్చి యీయఁడె? సుమిత్రాపుత్ర! తత్సాధ్విఁ బా
పప్రారంభము లిందుఁజెంద వని యవ్వాయుప్రభుం డప్డు నీ
యప్రామాణ్యముఁ జెల్పి కల్పుకొని చంద్రాదిత్యులం గూర్పఁడే. ౮౦

క. దేవర్షులు బ్రహ్మర్షులు దేవగరుడకిన్నరాదిదివ్యులు గొలువన్
దేవేంద్రుఁడు లంకాద్వీపావని సతి శుద్ధిఁ బొగడి యర్పించెఁగదే? ౮౧

క. ధీయుత! నీవు నెఱుంగుదు నీయెఱిఁగినయంతకన్న నే నెఱుఁగుదుఁ జా
మ్మాయతివ శుద్ధభావము నాయెఱుఁగుటకన్న నంజనాసుతుఁ డెఱుఁగున్. ౮౨

గీ. దేవతుల్యులు వానరుల్ దివిరి పొగడ నిట్లు శోధించి శోధించియే గ్రహించి
తెచ్చితి నయోధ్య కభిషేక మచ్చెలువున ననుభవించితిమికద భూజను లగునన.

చ. జరిగినవృత్త మిం దొకటి చాటునఁ బెట్టితిమా? సభార్యు ల
ప్పురుసన మూఁగ సర్వ మశుభంబు శుభంబు వచింపలేదె? య
ప్డరవుగఁ బల్కరేని యెది యేవిధ మయ్యెడునో? తలంప వ
త్సరములు వేలు వందలు గతంబులు గా నిపుడా? తదీరణల్. ౮౪

ఆ. సీత విషయమున నిసీ నన్ను లక్షించి నగర నగరమున జనపదములను
నాడిపోసికొనఁగ నై రెల్లరను వార్త చెవికి సోఁకె నేమి సేయువాఁడ? ౮౫

గీ. మందబుద్ధు లజ్ఞానంబునం దలపడి రెట్టి పాపమ్ము లొడిఁగట్ట? నెంత మాట
వడె ధరాపుత్రి జనకసంవర్ధిత సతి దశరథుని కోడ లీ రాము దయిత నేఁడు. ౮౬

గీ. ఇట్టి బీభత్స మింక నే నెట్టు లోర్తు? మర్మకృంతన మొనరింప మాఱుకొనియె
శోక మేకాంతదుస్సహం బా కృతాంతు చెయిదమునఁ దత్ప్రతిక్రియ సేయఁగలదె.

క. నాయట్టివాని కింతటి యీయపవాదంబు వచ్చెనే? యే మందుం
దోయజముఖి వర్జింతునె? యాయువుఁ బెడఁబాయుదునె? మహాయశులారా! ౮౫

వ. ఇంత యేమిటి కంటిరేని. ౮౬

శా. ఏపుణ్యాత్ముని మంచిమాట లిలపై నెందాఁక వర్తించునో?
యాపుణ్యాత్ములు పూజలందెదరు తా రందాఁక నాకంబునం
బాపం బోపి గడించు దుర్యశము త్మాపై నెంతకాలంబు సం
దీపించున్ నరకంబు లంత కతనిం దేలంగనీ వెట్టులున్. ౯౦

ఉ. కీర్తిని గౌరవించెదరు కేవల మెల్లజగంబులందు దు
ష్కీర్తికిఁ జోటు లేదు నృపశేఖరు లెల్లరు నాససేయరే
కీర్తికి? నెంతలేనిఁ బడి కీర్తితులార! తదర్థమేకదా?
యార్తికి సైచి పోయితి మహాటవిఁ గ్రుమ్మఱి మున్ను గ్రన్ననన్. ౯౧

గీ. అడఁగియుండరు తమ కెంత లమరియున్నఁ బెద్ద లేయపవాదము ల్వేగయునో?యని
యేను భయమందువాఁడ మఱింత దాని నామమును విని పిన్నటనాఁటఁగోలె. ౯౨

ఉ. నే నెడలింతుఁ బ్రాణములనేనియు మిమ్ములనేని నొక్కటన్
జానకిమాటకేమి? యది సద్వ్రత యంచుఁ దలంకుచుంటిఁ గా
నీ నరవర్యులార! యిటు నిష్ఠురదుఃఖపయోధిలోఁ బడం
గా నయినాఁడ నేఁటి కెటు కాతురొ? పెద్దఱికంబుఁ గీరితిన్. ౯౩

క. కడచిన దుఃఖంబుల నెప్పుడు నింతటి వంత లేను మును గన్గొనలే
దుడుబింబానన గర్భిణి నెడలించి గృహాంగణంబిఁ కే మయ్యెదనో! ౯౪

వ. ఏమైన నేమి? ధార్మికులకుఁ గీర్తియ పత్ని దానిఁ గాచికో లుఱదె? ౯౫

సీతా వివాసన శాసనము

శా. సౌమిత్రీ! మది సంశయింపకుము వత్సా! రేపు రేపాడి యు
ద్దామాంగంబు సుమంత్రసారథిక మా దత్స్యందనంబందు నా
భామారత్నముఁ జేర్చి నీవ చని సంవర్జింపుమా యస్మదీ
యామేయభ్రియమాణభూమితలసీమాంతంబునం దొంటిగన్. ౯౬

వ. కాదు కాదు. మునిమాననీయ యగు నమ్మానినిని. ౯౭

ఉ. ఆకమలాయతాక్షిఁ దమసాపరపారమునం దెలర్చు వా
ల్మీకికులయాశ్రమం బమరు మేదినికిం దగ నింత నంత మం
దాకినిపొంత నిర్జనవనాధ్వమునం డిగబెట్ట వేగ మి
క్ష్వాకుకులేశ! పొమ్మగును గా దనఁబోకుము నీకు మే లగున్. ౯౮

క. ఈయంశమున విచారణ సేయకు చన వున్నదేని సీతకు నైనా
శ్రేయ మెడల మాటాడకు మాయుమ్మంతుండ! చని రయమ్మున రమ్మా. ౯౯

వ. నీ వీపనిఁ బరిహరించి నా ప్రీతిఁ జెఱచెదవో? యప్రియుండ వని వేఱ చెప్పనేల?
యని తలయెత్తి యుత్తలపాటుతో నెల్లర నాలోకించి. ౧౦౦

ఉ. మానితులార! నన్నుఁ బ్రతిమాలఁగ నెక్కొని మాట మాటతో
మానుప నెంతురేని ననుమానము లేదు సతంబు శత్రులే
కా నెద నెంతు మిమ్ముల నికామ మభీష్టవిఘాత మేర్పడం
గాన మదీయశాసనము గావలెనో? కృతి నాదరింపుఁడా. ౧౦౧

గీ. పాతములతోడ నాదు జీవనములోడ నొట్టు వెట్టితి మీ కెల్ల నొప్పుకొనుఁడు
దుండితులకేని మాఱొడ్డవశము నియతి యప్రతిహతప్రచారము లన్నలార!. ౧౦౨

వ. లక్ష్మణా! యిచ్చటినుండి యిప్పుడ యప్పుడఁతి నెడలింపుము. నాయిష్టము నెరవేర్చె దవా? ప్రతిఘటించెదవా? పోనీ యదియేని వివరింపుము. ౧౦౩

ఉ. ఇంతకుమున్నె నే నడుగ నింతియు గాంగతటాస్థితాశ్రమ
ప్రాంతముల న్మెలంగవలె నంచు వచించెను దౌహృదంబుగా
నింత యవశ్యభావ్య మనియే తలఁతుఁ గాని మేన కాదు నీ
మంతినియుం దలంచె నిదె మార్గము దప్పఁగఁ ద్రోవ నేటికిన్. ౧౦౪

గీ. నన్నుఁ గైకొని యేనాఁడు నారి సుఖముఁ జెందె నీనాఁటి కీర్తిఁ జేయవలసెఁ
గదె ఋణము దీర నాకు నాజ్ఞాజ కనుచు బాష్పసంపిహితేక్షణపద్ముఁ డగుచు.

చ. ధరణివిభుండు శోకజము తాపము వేఁప భరింపలేక కుం
జర మన నూర్చుచుం జనె నిశాంతములోనికిఁ దమ్ము లట్టులే
యరిగిరి భ్రాతతోడ ననయమ్మునకు న్మనముల్ దలంక నో
ప్పి రెటులో? మూఁడుమాట కెడబెట్టని యట్టి విధిప్రసంగమున్. ౧౦౬

గీ. రాచగుట్టు బయల్పడరాదకాదె? యేమి సేతురు చెప్పరు రెవరితోడ
శోకమున డిల్లవోయిన చొప్పుఁ దప్పఁ గొనిరి తాటస్థ్యగుణదోషగూహనమున.

వ. మఱియు నమ్మువ్వురు నెమ్మిమైమాటగా. ౧౦౮

శా. సీతామాతను జూచిరం డనుచు సౌశీల్యంబునం బత్నులన్
జేతస్సంస్థ మెఱుంగనీ కనిచి రిస్సీ యప్పుచెల్లెంద్రసం
ప్రీతుల్ సెల్లినయంతకే నెఱప కేడ్పింపంగ నేలా? యటం
చాతన్వంగులు గానవచ్చుటయు నౌ నౌ నంచు నా యక్కయున్. ౧౦౯

ఆ. వారి నాదరించి బహుశోభనపదార్థముల నొసంగి మేలి మురువు మెఱయ
ననుజలార! చూడనరిగెద రేపాడి తాపసాశ్రమముల తగవు లనిన. ౧౧౦

వ. సహజస్నేహనిబద్ధబుద్ధు లగు నాసహజాతలును వ్యాజ మెఱుంగమి తీఱ్బులై. ౧౧౧

చ. ఇది యిపు డేల వచ్చిపడియెన్? జననీ! మదు లులికె నన్న న
మ్ముదిత యి దేమి దోసము విభుండు మదర్థితుఁడై సరే యనెం
గదె యటు కోర్కెవుట్టెనటె కా దన నేల? సుఖాస్పదంబ లై
మదవతులార! యుండుడు సుమాళమునన్ మఱివత్తు నం చనెన్. ౧౧౨

వ. ఆసల్లాపము లట్లుండె నింక. ౧౧౩

గీ. భరతశత్రుఘ్ను లొకపాట బహులదుఃఖకలన లోర్చిరి తమచేతఁ గాకయుంట
నంతకంతకు మున్నర మగుచు ముంచె లక్ష్మణునిఁ దత్ప్రకరణసంలగ్నుఁ డగుట.

గీ. రాము కరుణాతిశయము వర్ణనకు రాదు మొదలువెట్టిన నేండ్లును బూండ్లుఁ బట్టు
బట్టరాని యఱుసమునఁ బ్రబలు ప్రజల మదులు చెయివెట్టి కలఁచిన మాడ్కిఁ గలఁగె.

ఉ. ఎప్పుడు తెల్లవాఱు నెపు డేగెద వన్యల కందుఁ గందు నే
నెప్పుడు మౌనిమండలిఁ దదీయ్యసతీతతులందుఁ దాఁగ మే

నెప్పుడు నూపురుల్ సుకృత మెప్పుడు చొప్పడు నంచు నున్న యా
యొప్పులకుప్పఁ జూచి మనమోర్వమి వెల్వెలవోయె రాత్రియున్. ౧౧౬

గీ. అప్రభాతప్రచురమయ్యె నా ప్రభాత మాస్య మొందుచునుండ దైన్యమున మునిఁగి
యలసుమంత్రాఖ్యు నప్పుడే పిలిచి యిట్టు లనియె సౌమిత్రి ధుర్యధైర్యప్రవృత్తి.

సీతాప్రయాణము

ఉ. ఓయిసుమంత్ర! కూర్పుము రథోత్తమమందు హయాలి నిప్పుడే
శ్రీ యొసలార స్వాస్తృతము సీతమ శాసన మొందమర్పు మా
యాయతనేత్ర రాజవచనాదరణంబునఁ బుణ్యకృన్మునీం
ద్రాయతనంబులం బొరయ నా విధి నే నొనరింపఁగావలెన్. ౧౧౭

ఉ. అన్న నుడు ల్విసంబడినయంత సుమంత్రుఁ డతంద్రుఁడై సుసం
పన్నజవాశ్వయోజితము భాస్వర మంచితరత్నకంబలా
చ్ఛన్నసుతల్ప మా రథముఁ జయ్యనఁ దెచ్చి సుహృన్నిరంతరా
భ్యున్నతికారణా!యిదె నియోగ మశూన్య మొనర్చితింగదే. ౧౧౮

గీ. ప్రభుఁడ! చేయఁదలంచిన పని యొనర్పవచ్చు నింకేల యాలస్య మిచ్చటి? నన
రాజగృహముఁ బ్రవేశించి రామపత్ని సముచితమ్ముగఁ గాంచి లక్ష్మణుఁడు పలికె.

క. అమ్మా! నీవడిగితివటె యమ్మానవపతి వర మని యమ్మహితుఁడుఁ దా
సమ్మతి నొసంగెనటె కర్జ మ్మాజ్ఞప్తమ్మయినది ప్రభువన్యునిచేన్. ౧౨౦

క. మా రాజు శాసనమ్మున నో రాజ్ఞీ! నిన్ను మునుల యుటజమ్ముల భా
గీరథితీరమ్మునఁ గల యారణ్యకసీమఁ జేర్పనై వెడలితిఁ జూ. ౧౨౧

గీ. ఇట్లుచితవేది లక్ష్మణుం డెఱుఁగనట్లు విన్నవింపఁగ వైదేహి విని యతులము
నందెను బ్రహర్ష మాత్మ ననంతరము ప్రయాణమునకైన సన్నాహ మనువుపఱిచె.

ఉ. రత్నము లుజ్జ్వలంబు లభిరామము లాభరణంబు లింబులౌ
నూత్నవిభాంశుకమ్ములు ననుత్తమతత్తదుపేయవస్తువుల్
ప్రత్నసభాజనార్హములు రాజితకుండికలుం బ్రసీతతుల్
యత్నసమాహితమ్ములు శుభార్థము లందిడఁబంచి గ్రక్కునన్. ౧౨౪

గీ. వత్స! లక్ష్మణ! యివి మునిపత్నులకును దరమెఱిఁగి యిచ్చుదాన సంతర్పణముగ
వట్టిచేతులతోఁ బోవ వల్లకాద యట్టివారలఁ జూడ నాయట్టివారు. ౧౨౫

వ. అనవుడు నవిదితకైతవ యవు పవిత్రగృహమేధిని నుపధిమెయి ననవధివనవాసా
యాసము పాలొనర్పంజను తన యనయమునకుఁ దాన యనూనశోకాను వేశమ్మున
నిమ్మెసెడియుఁ దోఁపనీక యేకావనీశ్వరు పత్నికి నింతమాత్రము స్వాతంత్ర్యము
లేదా? యను భావంబున ననుభావసభ్యగ్ర యగు నయ్యగ్రజు మహిషి నుద్దేశించి
నేలచూపులు సూచుచు. ౧౨౬

గీ. ఇష్టమైనది యెల్ల నీయిచ్చవచ్చినట్టు లొనరింపుమమ్మ నీ కది తగనిదె?
పేలరధ మెక్కు మన్న సౌమిత్రిఁ గాంచి మురియుచుం దగుననుపున ముద్దరాలు.

ఉ. రాముఁ దలంచి మ్రొక్కి యనురాగముతో గృహదేవతాతతిం
గామితపూర్తిగాఁ బొగడఁ గాఁ గని యత్తలఁ జిత్తమందు నా
యా మెలపొప్పు మెప్పుమెయి నాడి వడి న్విరిబోఁడి యెక్కెఁ దే
రామహితాటవిం జొరఁగ నా మతి రామహితానుబంధితన్. ౧౨౮

శా. ఆసౌమిత్రియుఁ దద్రథాంతరము నధ్యాసీనుఁ డై పోయె వి
శ్వాసం బొప్పగ నన్న యాన నెఱవేర్పంబూని వేగంబ యా
లో సీతాసతి చిత్తముత్తలపడన్ లో లో విచారించి ల
క్ష్మీసంవర్ధను లక్ష్మణుం గని యనుం గీడెంచి భద్రాంచితా! ౧౨౯

ఉ. ఓరఘునందనా! యరయవో?యశుభంబులు పెక్కు లోకకంటం
దోరము దోఁచెఁ దత్ఫల మెదో?హృదయం బభయంబు గాదు శా
రీరకకంప మద్భుత మరిందమ!సవ్యము కానిలోచనం
[illegible]ారక విస్ఫురించెడు నహా యధృతిం గనుదాన నెంతయున్. ౧౩౦

గీ. భ్రాతృసమ్మత!నీభ్రాత స్వస్తి గలఁడె?యత్తలకు నెల్ల నిప్పు డనామయంబె?
పురిని జనపదముల రాష్ట్రములను బ్రాణిజాతి కెందు నశుభములు జరుగవకదె?

క. ఓపృథులోచనపద్మా! యీపృథివియు శూన్య గాఁగ నీక్షణములకుం
జూపట్టెడు నిప్పుడు విభు నోపి యెడసిచని యిఁకెట్లు లుండెడుదానన్. ౧౩౨

వ. అని యనేకవిధమ్ములఁ దోఁచు ననిమిత్తములకుఁ జిత్తముత్తలపాటెనయ.

క. ఆరామదేవతకు సురలారా! మునులార! స్వస్తి యగుఁగాత మటం
చా రామ దేవులాడెన్ భీరూ! యంజలులఁ బన్ని వేల్పుల కృపలన్. ౧౩౪

క. ఆయర్థమునకు లక్ష్మణుఁ డాయమ్మకు శిరమువంచి యభివాదనమున్
జేయనయి హృదయ మెండఁగ నాయాసముఁ దోఁపనీకయ శివం బనియెన్. ౧౩౫

గీ. ఆమెయిం బోయి వారు సాయంతనమున నలరు గోమతీతీరమం దాశ్రమమున
నశ్రమమ్మున విడిసి రనంతరంబ రామరామను దర్శింప రాత్రి వచ్చె. ౧౩౬

క. నిద్దుర నెలార్చి కలవర మెద్దియొ సమకూర్చి యెడఁద లేఁకటఁ జెనయం
దిద్ద నయినట్లు తా నొక పెద్దతనము పూని నిలిచి పిదప నిశ చనన్. ౧౩౭

చ. తెలతెలవారునప్పుడె విధిం గయిసేసి సుమిత్రనందనుం
డలయుచు సారథిం గని రయమ్మునఁ బోవలె తేరఁ బన్ను మా
వుల వెస నేఁడు గాంగజలపూరము నేరము లేద నూది యాఁ
దలను ధరింపఁగావలయుఁ ద్ర్యంబకుఁ డద్రివిభుండు నెట్లటుల్. ౧౩౮

మ. అనుచుండంగఁ బ్రవీణుఁ డాతఁడు రథంబందున్ మనోవేగముల్
ఘనవాహంబులు నాల్గుఁ బొందెనయఁ బ్రగ్గంబు లక్కరంబందుఁ గూ
ర్చి నృపప్రేయసి నాదరం బెసఁగ రాజ్ఞీ! యెక్కు నా స్యందనం
బన నద్దేవియు నప్పు డం దమరె మున్నా లక్ష్మణుం డెక్కఁగన్. ౧౩౯

గీ. దూరమున ముందుఁ గననగు ద్రుమములెల్ల నిట్టె చూచుచునుండంగ నెనసి వెనుక
దూరమునఁ బడిపోవంగఁ దేరుదోలె సుస్థుమంత్రుం డను సుమంత్రసూతుఁ డతివ!
గీ. అఘవినాశని యైన జాహ్నవిఁ గనుఁగొనె నావిశాలాక్షి యోవిశాలాక్షి! వింటె?
మఱఁది సారథియుం దన్ను మాననీయ గరిమఁ గొంపోవఁ బోయి సకాలమునకు.
గీ. తనకొలంబునవాఁడైన దాశరథికి వచ్చిన జనాపవాదమ్ము నాసిపోయె
దీన నావారు నేనుఁ గీర్తులమైతి మనుచు నడిమింటి కెక్కె నహస్కరుండు.
ఆ. గంగమడువుఁ జూచి ఘనుఁ డఘ మాకృతిఁ జెందినట్లు దైన్యమంది యేడ్చె
నక్షరార్థరహిత మతితరనిస్వనం బైన స్వరముతోడ నజు మనుమఁడు. ౧౮౩
ఉ. అత్తఱి నుత్తధైర్యుని మహామహు లక్ష్మణుఁ జూచి చిత్త మా
యత్తము గాక బుద్ధిలత నట్టిట్టు లాగఁగ మెత్తనై సతీ
సత్తమ వాక్య మిట్టివరుసం బలికెఁ విదితార్యధర్మ! ని
ర్వృత్తమహార్థ! రోదనము వృత్తికి నెద్ది నిమిత్త? మిత్తఱిన్. ౧౮౪
క. అరుమగనున్నది నాకుం జిరార్థితము గాంగతటముఁ జేరితి నని నే
నరుస మెనయంగనగుతఱి నరవర్య! విషణ్ణఁ జేయ నని చెద వేలా?. ౧౮౫
ఉ. ఎప్పుడు రాము పార్శ్వమున నే నివసింతువు పూరుషర్షభా!
యప్పుని కీ ద్విరాత్ర మెడమయ్యె నటంచుఁ గుఁదించి శోక మా
తెప్పున నిన్ను ముట్టికొని తీవ్రతఁ జూపెడు చంద మొక్కొ? యే
యొప్పమి వేఱ లేదకదె? యూర్జితచిత్తుఁడ విట్టు లయ్యెదే? ౧౮౬
గీ. నాకు నా రామవిభుఁడు ప్రాణములకన్న దయితుఁడేకద లక్ష్మణా! త్వాదృశముగ
నేను యేడువకున్నాను నీకు నేల? బాలిశత్వము ధైర్యసంపద నెనయుము. ౧౮౭
మ. అనఘా! గంగఁ దరింపఁజేయు మిపుడే యాతాపసావాసముల్
మొనయంగూర్పుము తత్సతీతతికి సొమ్ముల్ వస్త్రముల్ భక్తిమై
వినయస్వర్పితము ల్వానర్తు విధితో వేయేల? యిం దుండు నొ
క్క నిశం బోవుద మంత స్వీయపురికిం గానీను జాప్యం బిఁకన్. ౧౮౮
ఉ. నాకును బద్మపత్రనయనున్ విలసన్మృగరాజమధ్యు మే
ఘాకుశలుం బ్రియున్ సుమహితక్రము రామునిఁ జూడఁగా మనం
బోకులదీప! కొట్టుకొనుచున్నది చువ్వె ముహూర్త మోర్తునే?
యా కమనీయమూర్తి విరహం బిదె పోవుద మూరడిల్లుమా. ౧౮౯
గీ. తాపసుల నెల వెనయుదుఁ దడయ కనఘసంతతిని గాననయి వచ్చి స్వామి మెచ్చ
నచ్చపుంగీర్తి వెలయ నిత్యసుఖ మందుదాన శపథం బొనర్తు నింతకును సౌమ్య!
క. నీయన్నకు నీకునుఁ గలదే యెడబా టెన్నఁడేని నేఁ గనఁ బో నా
తోయమునడపడి నేఁ డీయోగవిభాగమునకె యేడువ నేలా? ౧౯౧
క. ఇన్నిటి నూరడఁబలికెడు క్రొన్ననబోఁడి వచనములు కొన్నట్టు లాగిం
గన్నులుదుడుచుకొనుచు నాయన్న పిలిచె నావికుల రయమ్మునఁ గొమ్మా!

గీ. ప్రాంజలి ప్రహ్వు లగుచుఁ గైవర్తు లెఱిఁగి పడవ సిద్ధ మిదే యంచుఁ బలుకుటయును
శత్రువీర ప్రహర్త దాశరథి గంగ దాటఁ దమకించి యెక్క నబ్బోటు బోటి. ౧౫౩

వ. అంతకుమున్న భువనపావని యగు నాభాగీరథియందు స్నానాదివిధుల నధిగతములం
బొనరించిన. ౧౫౪

చ. జనకజ సాధ్వి మున్నుగ నిషాదవరప్రతిపాదితోరు విశా
లనయన సుందరిం దరిని లక్ష్మణుఁ డెక్కి సుమంత్రు సూతు ని
ల్వ ననిచి శోకతప్తవికలద్దయనీయహృదబ్జసంపుటుం
డు నిభృతుఁడై సుధీవర! కడు న్వడిఁ బోవఁగని మ్మటం చనెన్. ౧౫౫

క. తత్సంచోదితుఁడై వాఁడుత్సాహము నెఱయ స్వీయసోదరయుతుఁడై
తత్సమయమ్మునఁ బడవ సముత్సర్జించెం దెరయెత్తె నొప్పుఁగ నడపెన్. ౧౫౬

క. ఆపరమసాధ్వి యెక్కిన యాపడవను మౌళిఁ దాల్చి యాటాడినయ
ట్లాపారు భంగకరముల నాపరపారంబు నీదు నగ్రజ సేర్చెన్. ౧౫౭

క. నావ డిగి పోవు త్రోవన్ భావిని గతిఁ దలఁచి హృదయబంధం బగలన్
భూవరు తమ్ముఁడు బాష్పప్రావృతలోచనుఁడు గద్గదాంచితగళుఁడై. ౧౫౮

క. కరములు జోడించి మహీశ్వరు పత్నిం జుట్టివచ్చి పాదములం ద
త్తరపడి పడివిహ్వలుఁడై కర మరుదుగ నేడ్చుచుం బ్రకంపితుఁ డగుచున్. ౧౫౯

వ. అతిదీనుండై యవ్వీరవర్ణియుఁ దనయవస్థకు నెవ్వారికి నేమిమూఁడెనో? యన్నట్లు
మిన్నూడి పయింబడినట్లు నుద్విగ్న యగుచుండ ని ట్లనియె. ౧౬౦

సీ. ఓయమ్మ! శల్య మ్మొకొండు దుర్వారమ్ము నాహృదయమ్మున నాటుకొనియె
నవిచికిత్స్యం బిద్ది యందఱనోళ్లలో నానెడు గతి పట్టె దీనికతన
శ్రేయంబు మరణం బుపేయ మూ నేని నా కంతటికన్న మే లన్నె మున్నె?
లోకనిందితము వివేకిని! యీ కార్య మిందు నియోగింపనేల నన్ను?
బుద్ధిమంతుఁ డార్యపుత్త్రుండు సెలవిచ్చె సువ్రతా! ప్రసాదసుముఖి వగుము
నీకు రోషవహ్ని నే దుమారము గానె? కాకయున్న నేమి కలదొ? కాక. ౧౬౧

గీ. న్యాయ మిది యిది యన్యాయ్య మని యెదియునుఁ జెప్పరాదట చెప్పినఁ జేయకుండ
నుండరాదట కట్టెఁ దా నొక్కకట్టు ప్రభులపూనికిఁ గా దనువారు గలరె? ౧౬౨

క. అని శోకము దను ముంపఁగఁ దనువున తా నెఱుఁగకుండఁ దడబడి యెటో మే
దినిపైఁ బడి పొరలాడెన్ దినకరవంశ్యుండు పార్వతీ! యే మందున్. ౧౬౩

ఆ. అట్టు లేడ్చువానిఁ బ్రాంజలిబంధుఁడై చెడి మరణముఁ గాంక్ష సేయువానిఁ
దనమఱందిఁ గాంచి తన్వి నివ్వెఱవడి గుండె రాయిసేసికొని యిటు లనె. ౧౬౪

సీ. ఎదియు నే నెఱుఁగనే యేమి వచ్చిపడియెఁ దత్త్వ మ్మెఱుంగ నుత్తముఁడ! తెల్పు
మమ్మహీపతికి నేమమ్మెగా? యిల్లేల? నీకు నస్వాస్థ్యమ్ము నేటుకొనియె
నొట్టు పెట్టెద నమ్మహోదారుతో నీకు సంతాప మేచాయ సంభవించె
నాసన్నిధానంబునను సమస్తం బది విన్నవించినఁ గార్యవిధ మరయుదు

నరసి యాజ్ఞాపన మొనర్తు నైన కృతికిఁ గానిదానికి పగచినఁ గలదె ఫలము
చూడనగువారి డెందము ల్గాడబడవె? యెఱిఁగి యేద్చెడివారల నొడఁద లుండ.
క. నీవిధమువాని కక్కట యీవిధి శోకంబె? నే నిఁ కే మాడుదునో? నీ
వావిధముఁ దెల్పు మన్నా! భావించెద నేవిధమునఁ బ్రతికార్యంబో?. ౧౬౬
గీ.ఇంద్రున కజేయుఁ డైన యా యింద్రజిత్తు మూఁ డహోరాత్రములు పోరి పొలియఁజేసి
నట్టి నీ వ్రప్రతీకార మని తలఁచిన యాపదయ యేనిఁ జెప్పు మి ష్టమ్ముభవింతు.౧౬౭
క. నాజన్మము దుఃఖములకు భాజన మై యొనరె నిట్లు బహువిధముల నె
ట్లో జగదీశిత పతి యన నొ జతనము దనకుఁ బున్నె మందున కలిగెఁ. ౧౬౮
గీ. తన్వి యిమ్మాడ్కిఁ గాఁ బ్రబోధన మొనర్చ నేలసూచుచుఁ బలికె నన్నైత భ్రాత
బాష్పవశ మైన వాక్యంబుఁ బ్రస్తరించి దీనచేతనుఁ డై సర్వదేవవంద్య! ౧౬౯
మ. జనకాధీశ్వరవంశపావని!స్వరాష్ట్రింబాదు దేశంబులం
దు నరేంద్రుం డతిదారుణంబు నెనసెఁ దూ ఱద్ది నీమూల మొ
య్యనఁ దత్కర్ణపథంబునం బడియె నేఁ డంతస్సభం జే మనం
జను నింకఁ జననీ! మదాచరిత మీచాయఁ ఫలించెంజుమీ. ౧౭౦
క. సంతప్తహృదయుఁ డై ధర్మాకాంతుఁడు ననుఁ బనిచిచనె నగారంబున కే
నింతలు సేసితి సాధ్వీ!యనంతర మెది యెట్లు జరుగ నై యున్నదియో? ౧౭౧
క. దేవీ!నీకట్టిదుటఁ నావిధమునవాని కె ట్లనం గొన వచ్చుఁ
నీవలని యవచనీయము లావసుధేశుండు స్వాంతమం దెవి యిడెనో? ౧౭౨
క. పౌరాపవాదభీతుం డారామవిభుం డమర్ష మడఁచికొని నెటో
నారామ నిట్టు లాడెద రే?రహితనయు లని ధిక్కరింపఁడు వారిఁ. ౧౭౩
ఉ. మాటల నేమి కార్య మజమాన్యచరిత్ర!చరిత్రశుద్ధి యఁ
మాటకు నేన పూఁటకడె మాయెమటఁ జ్వలనుండ చెప్పఁడే?
పాటికిఁ దేఁడు తేఁ డది నెపం బెదియో? నిను పీడ న్యేడ జం
జాటము మాననెంచెనో?విచారము లే దన నాకుఁ జెల్లునే?. ౧౭౪
ఉ. కంటికి మంటి కేకముగఁ గాఱుచునున్నది వారిధార వా
కొంటకుఁ గాదు నీమొడలఁ గూరిమి మున్నును నీ వెఱుంగవే?
కంటకమయ్యె వాడు నరకంబునఁ గొన్నటులున్నవాఁడు నా
కంటె నభాగ్యుఁ డేడి? యవకార్యముఁ గార్య మటం చొనర్పఁగఁ. ౧౭౫
క. కాంతాశిరోమణీ!పతి సంతసమున వర మొసంగ జటాల్యాశ్రమభూ
ప్రాంతము లరయఁ గొనవె విభు పంతము నీస్వాంత మొక్క బాటం బొఁటఁ ౧౭౬
ఉ. కావున నీవుకోరిన సుఖంబు తపోవన ముత్తమర్షి సం
భావిత మిందు డించిచనఁ బార్థివు శాసన మేమిసేయ నోఁ
పావనము న్మనోహరము భవ్యము నైనసురాపగాతట
స్థావని సంచరింపుము శుభాస్పద వై యవిషాద వై సతీ! ౧౭౭

క. మాజనకుఁ డైన దశరథభూజానికి నిష్టుఁ డైన మునిపుంగవుఁ డీ
భూజనివాటికి సవ్వల భ్రాజిష్ణుయశుండు విప్రవర్యుం డుండున్. ౧౭౮
క. ఆకారుణికోత్తము వాల్మీకిమునిం గాంచి చేరి మెలఁగుము తత్పా
దాకలితచ్ఛాయవు నై నీకుం దగుఁగీతి నిఖిలనిర్జరవంద్యా! ౧౭౯
సీ. జనకాత్మజా! లోకసంభావనీయ వై నైకాగ్ర్య మెప్పుడు నలవరింపు
ముపవాసపరత సంయోజింపుము చిదాత్మ భావించునెటి నుపవాసరసిక!
రామపత్నీ! పతివ్రతము నేమఱకు మయ్యది కాదె మున్న ని న్నంత సేసె
క్షమ నీకుఁ దగిన భూషణ మయ్యదె ధరింపు మోక్షమాగర్భభూతోజ్జ్వలమణి!
తల్లి! మాబోంట్లమీఁద వాత్సల్య ముంచు మాచితవు కమ్ము దేవవిప్రాంచితుండు
రామదేవుండు హృదయాంతరమణిపీఠి నటునిటు తొలంగకుండ నాయత్తుఁ గాన.
క. అమ్మహితుఁ జెట్టవట్టితి వమ్మ యి ధర్మమ్ము లెల్ల నారసితి సతీ
త్వమ్మన నీసొమ్మె కద యెమ్మెయిఁ బరమమ్ము శ్రేయ మెనసెదొ? కనుమా. ౧౮౧
క. అని లక్ష్మణుఁ డనుచుండఁగ వినుచునె జనకాత్మజాత విహ్వల యగుచున్
ఘనతరవిషాదయోగంబునఁ బుడమిం బడియెఁ దుహినభూధరదుహితా!. ౧౮౨
ఆ. నఱుకఁబడ్డ తీవ నాఁగ డాసేపు విసంజ్ఞ యై మరల ససంజ్ఞతఁ గాని
బాష్పబిందుబృందపర్యాకులేక్షణ యగుచు మఱఁదితోడ ననెఁ బురంధ్రి! ౧౮౩
క. నాతను విధ్యాది నూనం బాతతదుఃఖములకొఱకె యజుఁడు సృజించెన్
పూతచరిత్రా! నాదగు చేతము మూర్త మగు శోకమే యనుకొందున్. ౧౮౪
గీ. ఏమి పాపంబు సేసితినో? మును పిటు లెవని దారల నెడఁబాపి యెలమిఁగంటి
నో? విశుద్ధసమాచార నై వెలసియు నిపుడు విడనాడఁబడితిఁగా నృపతిచేత. ౧౮౫
మ. మును పున్నాపు మునీశ్వరాశ్రమముల నోమ్మదంబుతో నందు వే
మొ? నిరస్తాఘరఘూద్వహాంఘ్రికమలమ్ము ల్సర్వదుఃఖమ్ములం
దును ముం దై ననుఁ దేర్ప నుంటి నెటులుందున్ ముందు సౌమ్యాకృతీ!
వనులందున్ విమనస్క నై విజన నై వాతాతపాధూత నై. ౧౮౬
క. దుఃఖపరాయణ నగు నాదుఃఖముఁ జెప్పుకొన విభుఁడు దొడుపడునె? వే
ధఃఖేలన మిట్టిద పో నిఃఖేతత సంభవించునే? నా కెట్లున్. ౧౮౭
ఆ. తండ్రి లేఁడు తల్లి దయలేని మూఁగ పెంచిన ఘనులకు మాట సెల్లె నెట్లొ
నాథుఁ డిపుడు విడువ నన్ను ర క్షించువార లెవ్వ రేది దిక్కు కెందుఁజొత్తు.
చ. జనకుఁడు నట్టివాఁడె? తనసంగతి యింత వినంగ నైన నా
కు నెటులఁ గూడు వెట్టి యొకగుడ్డయు నీయఁగ లేఁడె? యకటా
వనిత పతిం గొమారుల శుభస్థితిఁ గైకొని పోవఁగాక యొం
టి నరిగి యిట్టి వా దని నటించినఁ జేర్తురె పుట్టినింటికిన్. ౧౮౯
ఉ. చెట్లవా ళ్లోనర్చెఁ జెట్టవట్టిన ఱేఁడు తాపసులకు నేల? తన్వి గోల
పిన్నవాఁడ ఘోరముఁ బొంధన మోహములే గన్నవారికన్నులఁ గాల్చుత లయి. ౧౯౦

మ. మహితాత్ముం డపపాపుఁ డైన రఘుసంమాన్యుండు ధర్మోత్తరుం
డహహా పాణిగ్రహీతిఁ బాపిడుచునే? యంతంతమాత్రంబునన్
మహిలా! చెప్పుము మంచి చేష్ట లెవి? యస్మన్మునిసంఘంబులో
"నహ" మంచున్ వివరింతు నేమని మహావ్యాపాద మిట్లబ్బెనన్. ౧౯౧

క. గంగాజలముల జీవితముం గలిపెద నిపుడె యన్న బుద్ధి మొలయు గ
ర్తుంగ మిను వంగడము నాసంగతిఁ జెడు ననియు భర్త నడిఁ బడు ననియున్. ౧౯౨

ఆ. ఇట్టి నన్ను ననదఁ బుట్టింపకుండిన బ్రహ్మ జగములందు నా వెనయనో?
యేమి సేయుదాన నెటు పుత్తుఁ గాలంబు రాముఁ బాసి యపకరంబు డాసి. ౧౯౩

క. అని లక్ష్మణుఁ డెను రేడ్వఁగ ఘనతరముగ నేడ్చి యేడ్చి కాంతారత్నం
బనద యన నుండి వెండి మగని యానకు శోక మొనయఁగాఁ గాదనుచున్. ౧౯౪

వ. లేచి ధైర్యం బవలంబించి. ౧౯౫

శా. సౌమిత్రీ! విడు దుఃఖభాగిని ననున్ దుర్మనాధు నాజ్ఞాపనం
బేమైఁ జొప్పడె నమ్మెయిం జరుగనీ యే నీవుఁ గాదన్న నా
భూమప్రజ్ఞుని శాసనం బొరులు సమ్మోదమ్మునం దాల్తురే?
యామర్యాదఁ దొలంగనీక చని రాజాదేశనం బుండుమీ. ౧౯౬

క. ఓరామసోదరా! నా యీరితముల సంగ్రహించి యిదె తుది పంపం
చారితిఁ జేయవయ్యా కారుణ్యము వొసఁగ నని తగం బ్రార్థింతున్. ౧౯౭

క. అవిశేషముగా గురువులకు విశేషించి కరయుగము గూరిచి భక్తిన్
సవిశేషముగా మ్రొక్కుల నవనిజ యర్పించె ననుచు ననుమా మొదలన్. ౧౯౮

సీ. మాయత్త కౌసల్య మాదిరిఁ గోడలిమాటల మన్నించు మహిళఁ గాన
నాసుమిత్రాదేవి యాహ్వాయమే తెల్పు నందఱయెడ నామె యట్టిద యని
నాఁటిప్రారబ్ధంబు ననిచె నట్టులు కైక ననుఁ జూచు నెపుడుఁ బ్రాణముల కెనగ
రామమాతలు కల రామానితల ప్రేమలతల యల్లికల కెల్ల యనరాద
అందఱకుఁ జెప్పు ప్రారబ్ధ మనిచెఁ దన్ను నాకు నై శోక మొనయకుఁ డాకుల లయి
పెద్దతనమున మిమ్ము సేవించుభాగ్య మీమొగంబున లేదు మీ కేమి కొఱత?

వ. అన్నింటికి నాదేవుండె కలం డమ్మహాత్ముఁ దననిమిత్తముగ మీరలెల్లరు నొత్తి
మొత్తిపొడుపు లాడకునికియ సీతకుం బరమప్రియ మ్మనుము. ౨౦౦

గీ. నాడు చెల్లెంద్రకుం జెప్పు నయము చొప్పు నాపరాభవ మొంచిచింత పడవలవ
దిదియుఁ బ్రారబ్ధ మెడయఁగా నెట్టు లగు నటంచు మే లెంచి యాశీర్వదించితి నని.

క. భరతుని శత్రుఘ్నుని నాదరమునఁ గుశలం బడిగితిఁ దగ ననుము ధరా
భరణము నానేస్తమ్ముల బరణిఁ దరణివంశమణినిఁ బ్రాపించి ధృతిన్. ౨౦౧

గీ. సీత ప్రణమిల్లె ననుము నీ సేమ మడిగె ననుము శోకము దిగమ్రింగె ననుము నీవు
నట్లు సేసిన సంతోస మావహిల్లు ననుము ధైర్యమ్ము తఱి యిది యనుము తొలుత.

క. ధర్మసుసమాహితుం డామర్మజ్ఞునితోడ నాడు మాటలుగా నో
కూర్మిమఱంది యనుమిా కర్మం బిటు సేసె నీవు గా దనఘాత్మా! ౨౦౪
చ. ఎఱుఁగుదు నిశ్చయమ్ముగ మహీజ విశుద్ధచరిత్ర యంచు న
న్నెఱుఁగుదు భక్తియోగమున నెంతయు మంతున కెక్క నంచు న
న్నెఱుఁగుదు వాత్మనిత్యహిత యీహరిణేక్షణ యంచు నింత నీ
మెఱుఁగుట సాలు నాకు జగదీశ్వర!దీని మఱాకు మెన్నఁడున్. ౨౦౫
ఉ. వీరుఁడ!యెగ్గులాడెద నె?వీడితి వీ వని నమ్మియున్న న
న్నీరసహీ నంచు దేవ!తగవే?నినుఁబోటికి నిట్టి వాడు నా
కారణ మేది యెట్లు చనఁగానయినం జనుఁగాక దుర్యశో
భీరుత మిాకొలంబునకుఁ బెట్టనిసొమ్ము కదే?ప్రియంవదా! ౨౦౬
క. అపవాదసముత్థిత మైన పలు కెదియు నీకు వచ్చెనా!యది నాకున్
సుపరిహారము కదె? రాఘవనృపతీ! పరమగతి వీవె నీసతి కగుటన్. ౨౦౭
వ. అని వచించితి ననుము మఱియు లక్ష్మణా!ధర్మావహితుం డవు మనజేనితో. ౨౦౮
క. తమ్ములయెడ నెమ్మాదిరి సమ్మతి వర్తింతువో?పురజనపదజనులం
దమ్మెయి నెమ్మి నడుపు నిత్యమ్ముం బరమమ్ము ధర్మ మదె యన మొనఁగున్.
శా. నీ యీ ధర్మమునం బురీజనము కానీ రాష్ట్రమే కాని యే
చాయన్ సౌఖ్యముఁ బున్నెముం గను నటే సర్వేశ!వర్తింపు మే
నో?యీతుచ్ఛశరీరముం దలఁచి ముంపుం గుందఁగా నోదునే?
న్యాయం బెంచి చరించెద న్వలచెదన్ యావద్భవత్సంగతిన్. ౨౧౦
వ. అని యంటి ననుము వెండియు నిప్పొరుల వాడు చొప్పెఱుంగుదువుకదా
యప్పగిదికి రఘునందనా! ౨౧౧
మ. పతియే బాంధవుఁ డాతఁడే గురుఁడు దైవం బన్న వాఁడే ప్రియుం
డతఁడే పుత్త్రుఁ డతండె యా నగుతటిన్ ప్రాణంబు లవ్వానివే
సతికిం గావున దత్ప్రియంబు సలుపన్ సర్వప్రకారంబులం
జతనం బూనవలెన్ విశేషముగ విశ్వాసంబుతో నంగనల్. ౨౧౨
మ. అనుభూతమ్మను శాస్త్రసమ్మతము నౌ నాధర్మము న్వీడఁబో
నని నే నాడితి నంచు సంగ్రహము నెయ్యం బెంచి శ్రీరామదే
వునితోడం బయిలోటఁ దక్క యనుమా పుణ్యాత్మ!యం చాడు నీ
తను దచ్ఛాసన మట్లు సేయు పతిఁ జిత్తంబందు శంకించుచున్. ౨౧౩
క. అంతటిప్రేమకు నాపద లింతలు వొడముటయు దీన నీ ధర్మం బే
కాంతకుఁ గాంతున కబ్బున్ వింతగఁ దెగఁబాటి రిందు వెర వెదియొ కదే. ౨౧౪
వ. అనుకొనుచు మిాఁదరయ రాము భూమిం జూచుచున్న యన్నరనాథానుజుం
బిల్చి పాల్చియెత్తిన కన్నుఁదమ్ములలో నమ్మానవతీలలామంబు ౨౧౫

శా. అన్నా! లక్ష్మణ! యింక నొక్కటి రహస్యం బౌను గా కే మన
గన్నారం గనిపొమ్మ నన్నిపుడ తత్కాలమ్మ దప్పించుమీ
ము న్నొక్కట్టున కట్టిపెట్టున జనమ్ముల్ బ్రువ్వఁగాఁ దిట్టిరే
యన్నా! వాఁ డతిదీనచేతసత నో రాడింపలేఁ డంగనా! ౨౧౭

క. వెంటనె ధాత్రీస్థలి నరిలుంటాకుఁడు వాఁడు ధర్మలోలుం డగుచుం
గొంటునఁ బడి లేచియు వాల్గంటి న్వెనఁ జుట్టివచ్చి కంఠము వగులన్. ౨౧౮

వ. మహాస్వనమ్ముగా నేడ్చుచు ముహూర్తమ్మను కాలమ్ము నిర్ధ్యానించి యూరడిల్లి తా.

ఉ. శోభనమూర్తి! యే మనెదు? చూడుము నన్నని చూతు నెట్లు? నే
నో? భవదీయ మాకృతిఁ గనుంగొనవైతిని మొన్నఁడేని యూ
యాభరణాళి కాంతి నెఱయం గనవైకనరాని త్వత్పదా
బ్జాభ నెఱుంగుదు న్వినతు లర్పణసేసెదుపట్లఁ జూచుటన్. ౨౧౯

ఉ. రాముఁడు లేనిచోట వనరాజి నినుం గన నెట్లువచ్చు నో
రామ! సుర ల్మునుల్ తెలియరా? మును రాముఁ డెఱుంగఁడా? జగం
బేమెయి పోయినన్ సుకృతమే కరణీయము నిన్నుఁ బోలికిన్
నీమహితానుభావమె వని న్నిరుఁ గాచెడుఁగాత మింకిటన్. ౨౨౦

ఆ. అని నమస్కరించి యద్దేవి వీడ్కొని మరల నావ నెక్కి మరలి మరలి
యనదపోలె నున్న యాయమ్మఁ జూచుచు నేఱు దాఁటి వ్రాయి మొక్కఁ జేసె.

గీ. శోకభారావనమ్రుఁడై సొలయు నలయు నేటి పరపారమున నున్న యింతిఁ గాంచు
మాటిమాటికి రోజుఁ గంపమ్ము నెనయు మనము పరితాపవహ్నికి మ్రగ్గిపోవ.

గీ. అవశమై మేను స్యందనమ్మం దమరఁగ సీతఁ గని లక్ష్మణుండు మూసిరి గోలంగ
నింక నేటి యయోధ్య యింకేటి రాము పోయగము నంచు వనరుచు సూతుఁ జూచి.

వ. కన్నుల నీ రొలుక గొంతు వట్టిపోవఁ బెదవులు దడుపుచు మాటాడలేక తల
యూఁచి రథయానమ్ము సూచించుటయు వాఁడు. ౨౨౧

ఉ. హాయముల పగ్గము ల్వదల నయ్యవి వేగమ పోవఁజొచ్చె న
మ్మెయిఁ జను స్యందనమ్మును సుమిత్రకొమారుని మాటిమాటికిన్
భయపడి చూడఁజూడ నతివం బడలించుచు శోకసాగరో
ర్చ్ఛయరయ మ్మట్టె ముంచుకొనెఁ జారుసులోచన! యేమిం జెప్పుదున్. ౨౨౨

సీత వాల్మీకిమహాముని యాశ్రమముఁ జేరుట

ఉ. ఆసతి శోకభారవివశాంగి తపస్విని రాజపత్ని ని
ర్వాసిత గర్భనిర్భర నిరాశ యశోధన నాథుఁ గానమిన్
దోసము మోసముం దలఁచి ఘోరముగా నపు డేడ్చె బర్హిణా
ధ్యాసిత మా వనమ్మునఁ బదారవముల్ దనవంత కై తగన్. ౨౨౩

ఆదరించువార లటు డాఁగకుండిన నున్న యేమ్ము పోవు గన్న వారుల
గన్నుగానుభావ కటు నిటు గాల్వరు లేమి నట్టి శోక మూఁడుకొనిరి. ౨౨౪

ఆ. ఆకసమునఁ బోవు నాయాయి విహగము లొప్పక లుడిగి సుదతిఁ బొదివికొనియె
నావిమానచారు లల విమానన లెంచి నింగి నంగలార్చుచుం గని రుమ! ౨౨౯

సీ. ఆయశోకార్తశోక మాయతము గాఁగఁ జూడలే కాభగీరథు శుద్ధకీర్తి
యార్తిఁ గని భంగకరముల నటునిటుఁ బడు చనుకరించుచునున్నట్టు లచట స్రోసె.

ఉ. అన్నిరవమ్ములన్ మివిలి యమ్మొయిఁ బర్వెడు రోదనధ్వనిం
గ్రన్నన వించు వచ్చి కని కాఁగలవా రల మానిదారకుల్
సన్నుతు నుగ్రబుద్ధిఁ జిరసంచితపుణ్యుని వామలూరుజున్
దిన్నఁగఁ జేరఁబోయిరి విధిం గని రాదరసంభ్రమంబులన్. ౨౩౦

క. చిత్రితు లై మునికిన్ మునిపుత్రకు లభివాదనములు వొనరించిరి ము
న్నాత్రమున విన్నవించిరి సుత్రామనుతా!తదీయసుచరితవిధముల్. ౨౩౧

సీ. భగవంతుఁడా!మున్ను పరికించి యెఱుఁగ మెన్నం డిట్టి రూపసన్నాహమెందు
నొకదేవి సిరియు కా నోపు నెవ్వండేని నొకమహాత్ముని పత్ని యురుగుణాఢ్య
వికృతాననాబ్జ యై వెఱ నేడ్చుచున్నది సమ్మోహమున నెట్టి చలమొ?విధికి
వ్యోమమ్మునుండి విచ్యుత యైన దేవత యని మేము తలఁచెద మయ్య వాహు!
తద్దశకు నర్హురాలు కా దద్దిర సతి శాపదుఃఖిత యైన యప్సరసయేమొ
యున్న దన్నది యొడ్డున నొనరఁజూడు మా వరాంగన నేభంగి నరయవలెనొ ?

క. అతిశోకపరాయణ యై గతి యొండెది లేనియట్లు కాననమం దా
పతిదేవత యేడ్చెడు చో ప్పతిదీన మ్మేకిక యగు టచ్చెరు వనఘా! ౨౩౩

క. మానుషి యని యనరా దా మానినిఁ గనుఁగొన్న భక్తి మాబోటులకే
మేనులు ప్రహ్వము లగు సమ్మానము సేయఁగదె మానిమండన! సతికిన్. ౨౩౪

ఉ. త్రాత యెవండు నా కను విధంబు వినంబడె సాధ్వి రోదనా
ధీతరవంబునందు మహితేచ్ఛ! త్వదాశ్రమసంవిభాగమం
దేతదవాప్తి నా శరణ మీ నినె చెందెను లేదు సందియం
బాతరుణీమణిం గొని మహాత్మ!సమర్థవిధిన్ భరింపవే. ౨౩౫

గీ. కీర్తికిని బున్నెమునకును గేవలముగ నీవె నిక్షేప మైతివి నియతి కిప్పు
డల్ల సాధ్వీమణిం గన్న నఘము వాయుఁ గావు మెమ్మొయి నైన నకలమలనయన.

ఆ. ధర్మవేత్త యైన తన్మునిముఖ్యుఁ డా బాలవచనములను బ్రహ్మవచన
ములను నొకటి సేసి బుద్ధిసంబద్ధంబు నిశ్చయించి వెడలె నీరజాక్షి ! ౨౩౭

క. అక్షులు గల వందఱకుం జక్షుష్మంతుండు వాఁడె సంపాదించెన్
నక్షుద్రము తపమున నొక యీక్షణ మెక్కుడుగ దాన నెఱిఁగికొనె గతిన్. ౨౩౮

క. ఎక్కడ నెక్కడ ననుచుం గ్రక్కున సంభ్రమము దోఁపఁ గా నాపని కై
దిక్కులు మున్నే కనుఁగొను నక్కీర్తిధనుం డు వోవ నల బాలకులున్. ౨౩౯

వ. వెంటనంటి గౌరవాతిశయంబున హారిసూపుచు నేగుచుండిరి. ౨౪౦

క. ఆదేశముఁ జేరంజని పాదమ్ములఁ ద్రోన యల్ల పరమమునీంద్రుం
డా దేవికి రుచిరార్ఘ్యం బేదీ? యని పాదపముల నెలమిం గనియెన్. ౨౪౧
వ. కని తద్వితీర్ణం బగు ఫలపుష్పాదికముం గొని జాహ్నవీతీరమ్మునకుం జని. ౨౪౨
మ. దరిసించె న్మునినాథుఁ డయ్యెడ ననాథప్రాయ లోకైకనా
థ రఘుశ్రేష్ఠు నభీష్టపత్ని సతి సీతన్ శోకభారార్త దీ
న రసారేణుపరీతగాత్ర సతిసంతప్తన్ భృశోద్విగ్న నా
తురఁ దేజంబున దీని సౌఖ్యమెనయుంతుం జూడుఁ డన్నట్లుగన్. ౨౪౩
వ. మఱియు నయ్యాదిమకవీశ్వరుండు. ౨౪౪
గీ. ప్రాఁదను నాఁ దగు గంభీరహృదయమందు మధురమధురసభావసంభావిత మవు
ప్రియవచనపూగ మెలనాఁగ విందుసేసెఁ జెవుల త్రుప్పుడు వదల వాంఛితము వొదల.
గీ. ఓపతివ్రత! స్వాగతంబో? దశరథభూతలేంద్రునికోడలా! పున్నె మేను
సేసితిని రామవిభుమహిషీ! కుశలమె? జనకలాలిత! నేఁడు పావనుల మేము. ౨౪౬
గీ. ఓమహాభాగ! నీ వింటియొద్దనుండి బయలువెడలెడునపుడె సర్వమ్ము నేను
మది నెఱింగితి ధర్మసమాధిచేతఁ గారణ మెదేని నీ వనఁగానిఁ కేల? ౨౪౭
క. నీ వెఱుఁగుదు వే నెఱుఁగుదు నావిభుఁ డెఱుఁగున్ సమస్త మది యట్లుండుం
గావుత నాయాశ్రమమే పావవ మొనరింపఁ దలఁచి వచ్చితె? తల్లీ! ౨౪౮
గీ. ఇదియ కాదెద్ది యెద్ది యీ రేడులోకములఁ బ్రవర్తిల్లు నది యెల్లము న్నెఱుఁగుదుఁ
జిత్తమున నుబ్బు కోరుకల చిన్నె లేని దాచుకొనలేర మాకు నేతరము వారు.
క. నీచరితము రాఘవు నయ్యాచరితము మాకు వింతలా? యపపాపా!
యీచత్తుస్సునఁ గాదాలోచనమున నింత యెఱుక లోలాపాంగీ! ౨౫౦
గీ. సాధ్వి, వైదేహి! యింక విస్రబ్ధ వగుము సాంప్రతంబుగ నుండు మీసంశ్రయమున
మలఁక లన్నియుఁ దీఱు నిమ్మళముమీఁద మే లగు నభీప్సితంబు గంభీరభావ!
గీ. స్వాశ్రమమ్మున కనతిదూరావని నటె తప మొనర్చుచున్నారు తాపసులు గ
రిష్ఠ లయ్యెడ ని న్నింతుఁ బ్రీతి నుచిత మాడువారలలో నుంట యాడువారు.
క. వారలు నామాటలచే నీరీతి నెఱింగిరేని నెత్తిన నిడుకోఁ
గారే? తల్లుల బిడ్డల గారాబము నెఱయ నిన్నుఁ గనుఁగొని తనయా. ౨౫౩
చ. సదమలమానసాంబుజ! విషాదము మానుము చింతలేల? ని
ర్గద వయి యింటనుండిన రకంబుగ నుండు మదాశ్రమస్థలిన్
సదయుఁడు రాఘవుండు జతనంబున రమ్మనునాఁడె పోవఁగాం
చెద విదె పాద్య మర్ఘ్య మిదె చేకొని నన్నుఁ గృతార్థుఁ జేయవే. ౨౫౪
ఉ. ఆముని యామెయి న్నొడువు నద్భుతము ల్నుడు లాలకించి సీ
తామహిలాశిరోమణి కృతప్రహితాంజలిబంధ యై తదీ
యామలపాదపద్మములయుం దలవోక శిరమ్ము సేర్చి య
ల్లి మెలఁగంగ నొప్పుకొనియెం బ్రతిషేధము లేని యానతిన్. ౨౫౫

చ॥ సరవి శరీరనాభి యయి సత్త్వమయార్చియు నై శరార మై
సొరిది శరాసనేమి యయి చొప్పడె జ్యాతలఘోషఘోష మై
యురుతర తైజసాత్మగుణితోజ్జ్వల మై తగు రామచక్ర మ
ష్టరితతిఁ గాలచక్ర మన నై హరియించె నిమేషమాత్రలోన్. ౪౮౬

సీ॥ దశసహస్రానీక విశదసంఖ్యాతము ల్వ్యసనవేగము లైన స్యందనములు
సరవి నష్టాదశ సాహస్రము లనీకములు మత్తకుంజరమ్ములు జవనము
లటు చతుర్దశసహస్రానీకములు సాదియుక్తంబు లౌ తురంగోత్తమములు
శతసహస్రద్వయ సంహితానీకంబు లుక్కుతునక లనంగ నొప్పు భటులు
రామశరవహ్నిలోఁ బడి రభస మెడలి పోయె నెల్ల నొకట శలభాయిత మయి
పగటిలో నష్టమం బగు భాగముననె యరిది గాదె తదనుభావ మబ్జవదన. ౪౮౭

తే॥ రాము వహ్నిశిఖోపమప్రదరములను గామరూపు లసురులు నిష్ఠాములగుచుఁ
దెగినవారలు సద్గత్యుదీర్ణు లయిరి శేషభూతులు పఱచిరి శీర్ణు లగుచు. ౪౮౮

క॥ సుమహాత్ముఁడు రుద్రుఁడు క్రోధమున న్విహరింపఁ దొడరఁ దనరు తదాక్రీ
డ మన రణాజిర మయ్యెడ గమనింపఁగనయ్యె ఛిన్నగహనోపమ మై. ౪౮౯

క॥ దేవతలును గంధర్వులుఁ బావను లౌ సిద్ధవరులుఁ బరమర్షులు సం
భావించిరి నెమ్మనముల సేవించిరి రామదేవు శ్రితదుఃఖహరున్. ౪౯౦

ఆ॥ రాముఁ దెలమిఁ దఱియు రవిజు విభీషణు హనుమ జాంబవంతు నట్లు మైందు
ద్వివిదుఁ గాంచి వారి తెఱఁగెంచి యిట్లనె హర్షవికసితాత్ముఁ డగుచు సాధ్వి!

క॥ ఈయస్త్రబలము నా కటు లాయోగివరేణ్యుఁ డైన హరునకు నగుఁ గా
కేయెడ నేరికినేని నుపేయము గా దాప్తులార ప్రీతిఁ దెలిపితిన్. ౪౯౨

వ॥ అని యుగ్గడించిన నవ్వారలెల్ల హర్షపారావారంబునం దోఁగుచుండిరి. ౪౯౩

తే॥ అట్లు రాక్షసవాహిని నడరడంచి శక్రసముఁడు రాఘవుఁ డస్త్రశస్త్రముల జి
తక్లముఁడ యయి తనరఁ ద్రిదశగణములు పొగడఁదొడరె వదనజితపూర్ణచంద్ర.

ఉ॥ కోటులలెక్క కెక్కుడయి కొల్పులులం బురుడించి యేత్తెఱన్
బాటిలు మేటు లుద్భటులు బంటులు గొంటులు స్యందనావళుల్
ఘోటకపంక్తులుం బ్రథితకుంజరసంఘములున్ రణస్థలిన్
వాటము దప్పి వ్రాలె రఘువర్యునిచే నను వార్త చొప్పడెన్. ౪౯౪

—♦ లంకలో నాడువారల యేడ్పులు. ♦—

క॥ హతశేషులు దెల్పఁగఁ బురి వితతం బై నెఱసె నదియు వినిహత మయ్యెన్
సత మైన మూలబల మిఁక గతి యే మని యింట నింటఁ గలవర మొదవెన్.

క॥ రక్షస్స్త్రీ లటు చేరిన రాక్షసులను గుములుకొనుచు రహిసెడు దైన్యం
బక్షుత మై పొల్పడ దెస లక్షమతం గాంచుచు న్వ్యథాత్మిక లగుచున్. ౪౯౭
క॥ చింతాతంతువు లల్లఁగ గంతవ్యము లేమి శూన్యగతి చొప్పడ న
భ్యంతరలు బహిర్గత లై వంతలఁబడి పొరలుచు న్వివశతం గనుచున్. ౪౯౮
మ॥ హతపుత్ర ల్హతభర్తృక ల్హతగురు లాప్యనష్టసద్బాంధవుల్
వితతాక్రోశము లొప్ప నేడ్చిరి మహావీరు ల్గుణాఢ్యు ల్లస
న్మతు లాత్మీయము లాఢ్యనిర్వహణసన్నాహమ్ము లొప్పారఁగాఁ
బతి వంపం జని యిట్టు లై రనుచుఁ దత్ప్రస్తావము ల్గార్చుచున్. ౪౯౯
సీ॥ పాపాత్మురాలు శూర్పణఖ దైత్యేశుతోఁబుట్టు వై యిచ్చోటఁ బుట్టనేల
పుట్టెఁబో మగఁడు గొంపోవ నయ్యెడ నుండి మడియ క ట్లధవ యై మరలనేల
మరలెఁబో యొకమూల మార్పడి కూలక దిట్ట యై యిల్లిల్లు దిరుగనేల
దిరిగెఁబో దిమ్మరి తెవులుగొం టనికాక యాజనస్థానమ్ము నందనేల
అందెఁబో కుమారుఁ గందర్పసుందరు సౌకుమార్యకలితు సత్త్వమహితు
సర్వభూతహితుఁ బ్రసక్తిమైఁ దవులెంచి చేరఁగోరవలెనె చెట్టయగుచు. ౫౦౦
తే॥ అమ్మహామహుఁ డనవద్యుఁ డనఁగ నెగడు రాముఁ డెక్కడ రాకాసిరాలుగాయ
వలిని పలితశిరోజ దుర్వహపిచండ వృద్ధ తా నెక్కడ యొకింత వెరవు వలదె.
చ॥ ఇది యపహాస్య మియ్యదియె హీన మకార్యము నిందితమ్ము దు
ర్మద సుగుణాఢ్యు సర్వగుణమంధరు దుర్ముఖి సన్ముఖుం బొరిం
బొదలుచు సొంగనుం గదియఁ బోవలెనే వల వల్లకాఁటికిన్
గుదివడి కాలుసాచు నెడఁ గూడ విడ న్వలదే వలంతి యై. ౫౦౧
క॥ వారలఁ గని పనిసెడె నని వారక ధర్షింప నెంచ వైరూప్యము దు
ర్వారము పొల్పడెఁ దనయాకారమునకుఁ దగిన దగుచుఁ గారణయుక్తిన్.
ఆ॥ అంతఁబోక పోయి యాజనస్థానమజనము స్థానముగఁ బ్రసక్తిఁ జేసి
యొండు గాఁగ బలికి యోటవెట్టి సజన్మఁ బనిచె వారితోడి వైరమునకు.
ఉ॥ ఆతఁడు వోయి దుష్టుఁ డయి యప్పుడ వారలతోడఁ బోర కా
నీత నొనర్చి సీత సతి నేత లొకొం డెడ కేగఁ బొంచి మా
యాతతదుర్నయంబున నయారె గుణాఢ్య మహానుభావ త
న్నేతటినేనిఁ గొల్చునె మహీసుత వర్తన మెన్నశక్యమే. ౫౦౩
తే॥ ప్రబలవైరమ్ము తనవారిఁ బాడుసేయ నేర్పడెనకాని తన కబ్బె నేమిసౌఖ్య
మగ్నిశిఖ యాపె నంటిన నపుడె చచ్చు రిత్త వెకలితనమ్మున రీతి గలదె?
ఉ॥ ఇందఱ పూర్వకర్మ మిటు లేడ్తెఱ నూపఁగనయ్యెఁ గానిచో
నెందులఁ బుట్టె నింటఁ దలయెత్తఁగ నా మగవాఁడు లేఁ డనన్

మందల శూన్య మెయ్యెఁగద మందులమారిది మందెమేలపుం
బొం దెదఁగోరు టిన్నిఁటికిఁ బొందు నిమిత్త మనంగ నయ్యెడున్. ౧౦౭
క॥ ఎక్కడఁ డాగెనొ యాచెడురక్కసిఁ దెగటార్చి సీత రాముని దెసకుం
జక్కఁగఁ జేరిచి శర ణనఁ దక్కొరులకు నైనఁ జావు దప్పదె యింకన్ ౧౦౮
ఆ॥ అంత పాడువడియె నోఁ గాము లింతకుఁ బుట్టబోవు మీఁదఁ బుట్టు నెట్టు
లింతసేసి యాపెనే వధింతు నటంచు నరిగె నిన్న నేడు నబలలార! ౧౦౯
*క॥ ధిషణోర్జితుఁ డారాముఁడు ధిషణునకుం జదువు సెప్పు తేఁకువగలఁ డా
విషకంఠు నైన నిజపౌరుషమునఁ జీఁకిఁగొనండు రుష్టుం డైనన్. ౧౧౦
క॥ అరయక జనకజఁ గోరిన విరాధుఁ బొలియించెఁ దొల్త విపినతలమ్మున్
బెరయునపుడె దుస్సాధుఁడు నరవరుఁ డనుటకు నిదర్శనం బది కాదే. ౧౧౧
ఆ॥ అగ్నికీలనిభము లాదిత్యసంకాశములును నైన మేలి ములుకు లేసి
చదిపె రాముఁ డొకఁడె పదునాల్గువేవుర గడుసురక్కసులను గడియలోన.
ఆ॥ ఆఖరుం ద్రిశీర్షు నాదూషణుం దన్ను గిట్టితొడరువారి గీటడంచె
నంతలోనె తివిరి మంతిరించినయట్టు లదియు నదియు నెన్న నలఁతు లగునె.
క॥ యోజనబాహుఁ గబంధుని నోజమెయి న్నఱికి రిరువు రొక్కటనె వర
వ్యాజమునఁ దన్ను ద్రిమింగఁగ నాజడుఁ డొడిచికొన నదియు నన్యాదృశ్యమే?
ఆ॥ వేయుఁ గనులు గలుగు వెరవరి కొడుకఁట మేరుతుల్యుఁ డట నిమేషమాత్ర
దునిమె వాలి వాలి ద్రుహిణకల్పుఁడు రాముఁ డదియు సన్నిదర్శ మగునకాదె.
క॥ భగ్నమనోరథుఁ డై యుద్విగ్నతమై ఋశ్యమూకదిశ దుర్గతి ని
ర్మగ్నుఁ డగు రవిజు సుశ్రీలగ్ను నొనర్చె నదియు న్విలాసమ కాదే. ౧౧౬
తే॥ సకలరాక్షసకుల ముపసంహృతంబుగాక మనఁ బుణ్యజననుఁడు ఘనుఁడు మనవి
భీషణుఁడుదెల్పె హితవృత్తి వెలయ నదియు నెఱుక మరలిన దొరమది కెక్కదయ్యె.
ఆ॥ అతని వెడలనడిచె హాంత యీయొడయండు రాముఁ జేరె నాసుధాముఁడరసి
ధన్యుఁ డయ్యె దేవు దర్శించినంత నాకృతి సుసిద్ధుఁ డనఁగఁ గీర్తిఁ బెరసి. ౧౧౮
వ॥ అమ్మలారా! యీధనదానుజుండు బుద్ధిమంతుం డగు విభీషణుని పలుకుబడి
ననుసరించి యడచిపడక తనదు చెడుగునడవడిని మార్చుకొని నడిచి నశ్లైన
నీలంకాపురి యిమ్మెయి నిమ్మసెడి దుఃఖార్త యై శ్మశానభూత యనం గాకుం
డుఁగదరే. తొలుదొలుతఁ జూడవచ్చిన హనుమంతుఁ డక్షప్రభృతుల న్వధించి
లంకఁగాల్చి దురాధర్షుం డై చనిన యవ్వార్తకు మనవారు మేలుకొనంబోరు
సరిగదా మేలుకొని మెసవి త్రావి ప్రతిక్షణజృంభమాణబలార్ణవుం డగు కుంభ
కర్ణుండు రాఘవేంద్రుచే నవలీల వడి చెడి కూల మునుమున్నగా దుర్ధర్షుండు
మహాకాయుండు నగు నతికాయుండును బదంపడి ప్రియపుత్రుండగు నింద్ర

జిత్తును లక్ష్మణకుమారుచే సలీలంబుగాఁ గరాలం బగు నాలం బున నిహతు డై వసమతి నేల్ల వాల నెఱుంగఁజాలని యీరక్షఃపాలకుఁ డింక నేనాఁటికిఁ దెలిసి కొనువాఁడు? ఆశామోదకభక్షణంబ కాక యీకరణి నింటింట నాకొడుకు నాసోదరుండు నాతండ్రి నాభర్త యనువార్తలతోడి విలాపారవంబులు మిన్నుముట్టం గరితురగరథపదాతివర్గంబు లనర్గళంబుగా రాము నెదిర్చి పోరి పోరికలనునం గార్చిచ్చుం బొదలి పొదివిన మినుమిడుతలదండుపోలికఁ గాలి కమరి పోయిన నేఁటికైన నసురనాయకునకు వివేకం బుదయింపవలవదే? రుద్రుండో విష్ణుండో మహేంద్రుండో యట్లుఁగాక శమనుండో రామ రూపంబున నిప్పరం బాక్రమించి మించుక్రుధం గ్రసించుచుండెం గాని యట్లు గానియెడ మనుష్యమాత్రునిచేత శతకోటులు సహస్రకోటులు నొక్కపరి ముహూర్తమాత్రంబున మడియుట యేనాఁడేనియుం గనియు వినియు నున్న యదియే? యింక నేమి యున్నది? యాశ లన్నియుం గడముట్టం జన జీవితనిరాశ యలమై భయాంత మరయనేరక యనదల మగుచుఁ గలకాల మిట్టులెలగో లడర నడలియడలి పనవిపనవి వనరివనరి కాలము సేకూరం గాలుని పురి సేరం బాఱువారము. బీరంబుగల శూరుండ విధాతృదత్తమహావరుండ నని దశగ్రీవుండు రామదేవునివలనం బొడమిన యీయతిఘోరభయం బెన్నకున్నవాఁడు. దేవగంధర్వపిశాచయక్షరాక్షసులలో నెవ్వారేనియు సంగరాంగణమ్మున రాముని చే నుపస్పృష్టుం డగువాని సంరక్షింప సమర్థులు గారు. రావణుని రణసంరంభంబున ననేకంబులగు మహోత్పాతంబు లుత్పన్నంబు లగుచు రామకర్తృకం బగు రావణనిబర్హణంబు నొడువుచునే యున్నయవి. పితామహుండు సంప్రీతుం డై తనకు వరప్రదానముసేయు నప్పట్టున దేవదానవయక్షగంధర్వకిన్నర గరుడోరగాదులవలని భయంబు లేకుండెడు మని యర్థించెన కాని నరవానరులఁ బరిగణింపఁడయ్యె నది కారణంబుగా రణంబున నవ్వారల కసాధ్యుం డై యింత వట్టు వర్తించె నేఁడు మానుషభవం బగు భయంబు వాటిల్లె నియ్యది యతిఘోరంబు జీవితాంతకరంబు నై రాక్షసులకు రావణునకును గ్రమింగరానికడి యయ్యె. వరబలం బొదవెం గదాయని యుడిగిమడిగి యూఁటడిలి వలయు సౌఖ్యంబుల నొలయనేర కఖిలవిబుధుల నెల్లసాధ్వసమణులం బీడింపం దొరఁకొన నవ్వేలుపు లెల్లరు వాణీవల్లభుం జేరి యాతనిపదంబుల ననుపదంబ యర్చించి చర్చించు నప్పు డియ్యర్థంబు నర్థిమై నర్థింప సంతుష్టుం డై మహామహుం డద్దేవుండు దేవహితార్థంబుగా నొక మహనీయం బగు నుపేయవాచాలంబం బొప్పని ట్లనియె.

ఉ॥ దేవతలార! యింకిట నుదీర్ణులు రాక్షసు లైన దానవుల్
కావరు లైన మంచిగతిఁ గానరు కాంచిర యేనియు న్భయ

ప్రావృతు లై చరించెదరు పాపము పండిన నాయతిక్రమం
బావరుస న్వితా యనఁగ నయ్యెడుఁ గా కెటు మేల్మి చొప్పడున్. గీ.౨౦
వ॥ అని యానతిచ్చి యనిచిన— గీ.౨౧
క॥ ఇంద్రప్రముఖులు వెరవునఁ జంద్రకలాధరు మహావృషధ్వజుఁ గరుణా
సాంద్రుం ద్రిపురహరున్ నిస్తంద్రు మహాదేవుఁ గని ప్రసన్నునొనర్పన్. గీ.౨౨
తే॥అహివరకలాపుఁడు ప్రసాదమహితుఁడగుచు నిట్టులనె నింక మీకు మే లెనయఁ
రాక్షసక్షయ మొనరింప రాణ నెఱయ సంభవించు నొక త్రేల సంభ్రమంబు? [జేయ
వ॥ అని యనుగ్రహించి యప్పరమేశ్వరుండు సెల వొసంగిన వేల్పుగమి సముదంచి
తం బై చనియె నని యింతవట్టు వృత్తాంతంబు మున్న వినియుంటి మట్లుకావున.
క॥ ఆయమ యా నీయమ సీతాయువతి ధరాజ దేవతాప్రేరిత మున్
మాయించె దానవుల క్షుధ మాయించు న్నేఁడు మనల మనరావణునిన్.
ఆ॥ దుర్వినీతుఁ డసుర దుర్మతి యగు జేని యపనయమున నింతలావహిల్లె
ఘోరనాశనం బకుంఠితశోకసమాప్లుతంబు దుర్దశాయుతంబు. గీ.౨౬
చ॥ శరణదుఁ డెట్టిఁడో తెలియఁజాలము రామనృపోపసృష్టులం
గరుణమెయి న్భరింపఁగ యుగక్షయకాలపుఁ గాలుబాతికిం
బరువడిఁ బాఱుదేర నగు వారలఁ బాలనసేయు నెవ్వఁ డే
సరణియుఁ గానఁ బోలదు దశాభృత యమ్మెయి వేళ చొప్పడన్. గీ.౨౭
క॥ పెనుభీతిపాలఁ బడితిమి మనుపంగలవారు లేరు మలయు కరేణుల్
వనమున దవాగ్ని వేష్టిత లన ననడల మైతి మింక ననఁ బని గలదే. గీ.౨౮
క॥ ఎచ్చోట భయంబొదవెనొ యచ్చోటికి చని కృతార్థుఁ డయ్యెను సుకృతా
భ్యుచ్చయ మాతని కొదవెను మెచ్చ నగు విభీషణుని సమీహిత మెందున్.
ఉ॥ నెవ్వగ లట్లు పొంగ రజనీచరకాంతలు దోడివారలం
గ్రొవ్వఱియున్న బాహువుల గ్రుచ్చికవుంగిటఁ జేర్చుకొంచు దా
దవ్వుల ఉల్లరంగఁ బృథుదారుణదుఃఖభరమ్ము లాఁగలే
కవ్విధిఁ దిట్టి యేడ్చిరి మహారవము లైన లాక్రమింపఁగన్!. గీ.౩౯
శా॥ ఇంటింటన్ జనసంనివేశయుత మా నిల్లాంద్రడనిర్ఘోష మా
వెంట న్నిక్కొను శోకపూరములతో వేలాతిగం బై బయు
ళ్ళంటం బ్రామెడు నర్ణవంబునగతి న్వ్యాకీర్ణ మా నంత నొ
క్కింట న్వ్యవ్యసనాబ్ధి పొంగె నన నా నుద్వేగ మొప్పారఁగన్. గీ.౩౧
తే॥ రావణుండు జగత్త్రియరావణుండు వేఁడినిట్టూర్పు లెడలంగ విన్నఁబోయి
తన్నుఁ దా నెఱుఁగనిగతి తారసిల్ల నొక్కఁడు ముహూర్తముండె నట్లువిద!వింటె.

క॥ ఆదటఁ బరమ క్రుద్ధుం డై దర్పింపంగరాక యోధు గలుచుచుఁ
మీఁ దరయక రక్తేక్షణుఁ డై దెసలం గాంచుచు స్మహోవ్యగ్రుఁడు నై. ౫౩౩
క॥ కాలాగ్నికరణి మూర్ఛితుఁ డై లావరి వాఁడు చూచు నద్దిశ గాల్పం
బోలు ననఁ బలుకు రాల్పడ నోలగమున నున్నవారి నొగిఁ గని పలికెన్. ౫౩౪
తే॥ ఓమహాపార్శ్వ! సామ! మహోదరాఖ్య! యోవిరూపాక్ష! యిత్తటి నూరకుంట
తగదు మీ రేఁగి చెలరేఁగి తద్ద నాదు పలుకు వివరించి కూర్పుఁడు బలములెల్ల.
క॥ ఆపగిది నుడి వెడల విని యాపదపడి వారు పఱచి యవ్వ్యగ్రుల న
వ్యాపన్నులఁ దరలఁగఁ బ్రేరేపించిరి విభునియాజ్ఞరీతిఁ దెలుపుచుఁన్. ౫౩౬
క॥ వారందఱు నట్లే యని వారక స్వస్త్యయనములు ప్రవర్తిల్లఁగ దు
ర్వారులు రణాభిముఖు లై ఘోరాకారతఁ దనర్చి కూర్చిరి సభటుల్. ౫౩౭
ఆ॥ పొగడి విభుని కొలువు తగ వెంచి తజ్జయాశంస లొలయ నన్నిశాచరవరు
లాన వేఁడుకొనిరి ప్రాంజలు లగుచు నిరంజనప్రతాప మంజ కఱుమ. ౫౩౮
తే॥ రోసమెగువంగ మొగమున హాస మొప్ప వారితో నిట్టులనె మంత్రివరులుమువ్వు
రామహోదరముఖ్యు లౌ నా ననంగ రావణుఁడు తనచలము బీరమ్ము వెలయ.
సీ॥ నేఁడు బాణౌఘము ల్నిజధనుశ్చ్యుతములై నెఱయుయుగాంతార్క నిభములగుచు
నరు లన్నదమ్ము లీనాఁడె మద్వినిహతు లయి జముఁ జేరంగ నరుగువారు
ఖరుఁడు ప్రహస్తుండు ఘటకర్ణుఁ డింద్రజిత్ప్రముఖులు సంతృప్తిఁ బడయఁగలరు
నాదుశస్త్రాస్త్రపాథోదము ల్దొరఁకొను నంతరిక్షదిశాబ్ధు లావరింప
నెంతు నీప్రొద్దు ములుకుల గంతుకొనినవారి మిసిమింతు లైన యవ్వారి నేర్చి
నేర్చి క్రోఁతుల భాగముల్నిర్ణయింతుఁ బక్కులకును బిసాసుల బలఁగములకు.
తే॥ పవనజవన మై యరదంబు పరఁగుచుండఁ గార్ముకసముద్రసంభూతఘనశరోర్మి
లడర మథియింతు శాఖామృగౌఘశతము సారనిస్సారగోచరచర్చ పొనర.రగిం
తే॥ పద్మకేసరవర్ణు లై పరఁగు కపుల వదనములు పద్మములు గాఁగ వఱలు యూథ
వరతటాకము లగలింతు వారణంబనై రణంబున శరకరప్రేరణమున. ౫౪౨
తే॥ నేఁడు వానరయూథపు ల్నెగడఁగలరు తమ మొగమ్ములు శరసహితములు గాఁగ
ననుచు సంసక్తిమెయి సనాళము లగు పంకజమ్ముల వసుధ నలంకరించి.
క॥ ఒక్కొక యిషువునఁ గ్రుచ్చెద నొక్కొక రణచండవృక్షయోధికపిశతం
బుక్కఱ నక్కజ మొదవఁగ నక్కఱ నెడె నని సుకౌఘ మారాటపడన్.
సీ॥ హతుఁడయ్యె నాభర్త హతుఁడయ్యె నాభ్రాత హతులైరి నాబిడ్డలనెడువారి
యస్రప్రమార్జనం బాచరించెద నేఁటి యాయోధనంబున దాయఁ గూల్చి
శరముల హరిసైన్య శవములఁ గప్పంగ జతనమై వీక్షింత్రు క్ష్మాతలంబు
మాంసాశులకుఁ గూర్తు మదిషుసంప్రోతారితతమాంసకృతము సంతర్పణంబు

రథముఁ బన్నింపుఁ డీఁక సశరము శరాస మట్లు పేర్కొనఁబడిన యయ్యాదియకాఁగఁ
దెండు వైశంబ చని చనుదెండు నన్నుఁ జేరి రావలె నష్టావశిష్టులెల్ల. ౫౪౫

క॥ అని నొడువు నధిపు నుడి గొని యనుపదమె బలాధిపతుల కాజ్ఞాపించెన్
ఘనబలుఁడు మహాపార్శ్వుం డెనయింపుఁడు కలబలముల నిప్పుడ యనుచున్.

ఉ॥ వా రవు నంచు నేగి గృహావారములం గలవారల న్నయాం
బారయనీ మటంచు రయమార యమానుగు లట్లు వేపుచున్
బ్రేరణముం బొనర్చి రని పేరణము ల్తగ వారు రాఁగ హా
హారవము ల్దొడంగె నిది యాఱవసారి యటంచు వీటిలోన్. ౫౪౭

ఆ॥ ఒకముహూర్తముననె యుద్ధాను లసురులు భీమదర్శనులు విభీషణాస్యు
లార్చుచు న్మహాయుధార్చులు నివురంబడం గడంగి యొడయనిం గనుటయు.

—♦ రావణుఁడు ముగ్గురు మంత్రులతో యుద్ధరంగమునకు వెడలుట ♦—

మ॥ అసిధారాయసపారఘపరిఘశస్త్రాస్త్రశనిప్రాసస
న్ముసలోద్దీర్ణగదాపరశ్వథముఖమ్ము ల్వ్యాలముఖ్యమ్ములున్
గసిమీఱం గొనివచ్చు వీరవరులం గన్నారఁగాఁ గాంచి య
య్యసురేశుం డెద మెచ్చుచు న్సమరనిర్యాణంబుఁ గాంక్షించుచోన్. ౫౪౯

ఆ॥ అధిపు నానతిం బలాధ్యక్షుఁ డంతకు మున్న తేరఁబనుప సన్నమొయిఁ బ్ర
సన్న మైన రథము సత్వరంబుగఁ దెచ్చి మ్రోలనిలిపి భటులు మ్రొక్కుటయును.

భుజంగ॥ తురంగాష్టకోద్దీర్ణతుంగధ్వజాంచన్నరాంగప్రభాజాలనద్ధాస్త్రశస్త్ర
స్ఫురత్కార్ముకాకీర్ణసూతోత్తమేత్థాసురక్షంబు జేజేలసూ డెంచె దానిన్.

భుజంగ॥ భుజంగేంద్రసారుండు భూరిప్రభావుం డజేంద్రాదివర్ణ్యాట్టహాసోపహాసుం
డజస్రప్రభాభ్యమ్ము నాస్యందనంబున్ గజేంద్రప్రయాతంబు గాన్పింప నెక్కెన్.

తే॥ సత్త్వగాంభీర్యధృతివిలసన్ముఖుండు బహుగణాధ్యక్షరాక్షసప్రవరవినుతు
లంది యానంద మొందుచు నచటు వాసి తరలె సమరమునకు సురాసురులు దలల.

క॥ ధారుణిని విదారించునొ యీరభసము మొయిని జలధు లింకించునొ య
త్తారాపథముం దెసలుం బేరునకును లేకయుండఁ బీఁచ మడఁచునొ. ౫౫౪

ఆ॥ అనుచు బెరుకువార లలుకుచుండఁగఁ దర్లి ముగురుసచివు లట్లు తగు రథముల
నెక్కి నిక్కుచు న్మహీంతల మదరంగ నార్చుచుండ వారి ననుమతించి. ౫౫౫

క॥ కాలాంతకోపముఁడు వాఁ డాలమునకు వెడలెఁ దేజ మారూఢి దిశో
పాలంభమునకుఁ దొడరఁగ సాలంబాసురబలంబు లలరుచు నడువన్. ౫౫౬

ఉ॥ ఆజవనాశ్వ మా రథమునందు మహారథుఁ డొప్పి తత్క్షణం
బాజితనూజు లాజికృతి కాయిత మై తనరారు ద్వార మ

ట్లోజమెయిం గ్రమించునెడ నొయ్యనఁ దోఁచెను దుర్నిమిత్తముల్
దా జితభావముం గనెడు దారి వచింపకయే వచించుచున్. ౫౫౭

సీ॥ ప్రొద్దు నష్టాభతఁ బొనుపడునటు లయ్యె నతిమెఁ జీఁకటులు దిశాంతములను
మిన్నుకు న్నట్లున్న మెయి మేదిని వడంకెఁ బులుఁగు లెలుంగెత్తె బోరనంగ
వర్షించె నెత్తురు ల్వఱలఁ బర్జన్యుండుఁ దురగము ల్త్రెరువునఁ దొట్రుపడియె.
ధ్వజశిరస్థ్సలమున వ్రాలెను గృధ్రమ్ము మొనసె శివారావము లశివముగ
నదరె నెడమకన్ను గదలె వామభుజంబు వెల్లబోయె మొగము వేఱువడియె
స్వరము రాము నెదురు వలనున నాదశగ్రీవునకు మొగుడ్చు కీడు నొడువ. ౫౫౮

ఆ॥ ఉల్క వ్రాలె నప్పు డుప్పరంబుననుండి పిడుగు పడెడు తీరు పెరయుచుండఁ
గాకు లఱచె గ్రద్దగములతోడం గూడి యశివలక్షణంబు లలవడంగ. ౫౫౯

క॥ ఆమెయి ఘోరనిమిత్తము లామత్తుం డెన్న కడరె నది మోహామ కా
కామయమె కాలచోదితుఁ డామోదింపఁడె శుభేతరార్థం బెడఁదన్. ౫౬౦

తే॥ కలని కేతెంచు రక్కసిగముల మేలి
తేజమునఁ దద్రథముల యుద్రిక్తఘోష
మున మొనసి రల్లదె యటంచు మొనయఁ బొఱి
రావనాటులు సుభటు లొయ్యారి! వింటె. ౫౬౧

క॥ తుములము సమరం బప్పుడె సమకూరెం బ్లవగరాక్షసప్రవరుల కా
క్రమమున నాహ్వానము లత్యమర్షములు విజయగోచరాస్థలు వెలయన్. ౫౬౨

చ॥ అది గని దానవేశ్వరుఁ డహంకృతి మీఱఁగ నెల్లదిక్కులన్
బడ నదనంబు నాఁ దనరు బల్విడితూఁపుల రూపు లేర్పడం
గదన మొనర్చె వానరులు గాసిలి నాసిఁ దొఱంగి విన్ననై
చెదర మహాద్భుతం బయి విశిష్టవిదారణ మొప్పుచుండఁగన్. ౫౬3

సీ॥ తల లొకండ్లవి మహీతలమునఁ దెగి వ్రాలెఁ బరిపక్వములు తాళఫలము లట్లు
కొండొండ్లహృదయముల్ గుమిలి యామంబున గుండ లట్లొరపిడి గూడ విచ్చె
వీను లొక్కొరులవి విడె మెక్క విఱిచిన చక్కిలంబుల వింత జాడ దోఁప
బొంద లయ్యెను మఱి కొందఱి వగు కండ్లు నడిబండికండ్ల సున్నా లనంగఁ
గొందఱకు నూర్పువెడలుట ల్గొఱత లయ్యెఁ
గొందఱకును సాఁబాలుచెక్కబడు లొదవెఁ
గొందఱ శరీరములు పిండిగొట్టి యుడిన
ప్రోవులై యావరించె నప్పొరికలను. ౫౬౪

ఉ॥ క్రోధవివృత్తనేత్రుఁ డయి కూళ దశాననుఁ డేదిశం జనె
న్నావ్యధుని దారి పక్షు లయి వ్రాలిరి నేలఁ దదాశ వానరుల్

వేధ ఘటించె నవ్వైరవు వేఱొకనిం దెగడంగ నే మగుఁ
సాధు లిఁ కెంద ఱిట్లయి రసజ్జనుఁ డీతని బ్రాఁతి సొచ్చుచోఁ. ౧౬౫
ఆ॥ క్రోఁతివాండ్రు గూలఁ గుతలంబు తన్మయం బనఁగనయ్యె దచ్చరాక్షు లడర
నున్నవార లయిన నుత్తుంగ మనలంబు దఱియలేని మిడుతతండ మయిరి.
ఆ॥ నిశితహేతితతులు నిగుడించు దావపావకుఁడు చుట్టుకొనిన వనగజములు
పరుగు లిడఁగ నైన భంగి పాల్పడె భంగపాటు మేటు లగు వనాటులకును.
క॥ ప్లవగానేకానీకముఁ బ్రవరవలాహకచయమ్ముఁ బవనుఁడ పోలెఁ
గవిసి యడలించి తఱిమెను బవరంబున రాక్షసాధిపతి భద్రగుణా! ౧౬౮
ఆ॥ లాఘవంబుకలిమి లావరి యవ్వాఁడు గడియలోనె క్రోఁతిగముల నలఁచి
త్వరితుఁ డగుచు రాము దఱియంగఁ బఱతెంచె సంగరంబువేడ్క జాలుకొనఁగ.
చ॥ కపు లటు భంగపా టొదవఁ గాననము ల్గనఁగా నదల్చుచుఁ
గపిపతి సేరి వారల మొగమ్మున నాఁగ సుషేణు నిల్పి కో
ణపపతితోడి దా నదె రణం బనుచుం జనుదెంచె గట్టిపా
దప మొకఁ డేర్చి తార్చుకొనె దర్ప మెలర్ప మహాద్భుతంబుగఁ. ౧౭౦
తే॥ పార్శ్వతఃపృష్ఠతోగతి పరఁగ యూథపతులు పతితోడివార లై పరుగులిడుచు
వచ్చి తాఁకిరి తాఁకుస వైరివర్గ మర్గళము వెట్టి నట్టఁ డై యడరకుండ. ౧౭౧
తే॥ శైలశిలలు మహాశాఖిశాఖ లెత్తి యేఁచి వైచుచు వానరు లెగువఁ బేర్చి
యార్చుచు విదుర్చుచుం దెగటార్చె రాక్షసోత్తముల నేర్చి రవిసుతుం డోజ మెఱయ.
ఆ॥ ప్రలయసమయమునను బ్రబలు ప్రభంజనుం డెట్లు చెట్లు విఱచి యింత నంత
నెనుచు నింతలంత లేర్పడకుండ న ట్లెదిరి సేసె నాహరీశ్వరుండు. ౧౭౩
తే॥ కాననంబునఁ బక్షిసంఘములమీఁద నశ్మవర్షంబు గురియు మహాబ్దమట్లు
రాక్షసానీకములపయి రవిజుఁ డపుడు శైలవర్షంబు వఱపె నిర్జరులు పొగడ.
క॥ ఆశైలంబులు పైఁబడ నాశలు దిగనాడి యుత్తమాంగము లెడలం
గా శైలము లశనుల నటు లాశరు లిలఁగూలి రుద్భటాశరదమనీ! ౧౭౫

—♦ సుగ్రీవునిచేత విరూపాక్షుఁడు మడియుట ♦—

ఆ॥ తొడరు నోఘ మెల్ల ధూత మై యిలఁగూలఁ గూలునదియు మఱలఁ గొఱలకుండ
సైన్యసాగరంబు సంక్షీణ మై పోవఁ బ్రోవకుండు టెట్లు పొసఁగు ననుచు. ౧౭౬
శా॥ ఉగ్రాకారమున న్విరూపనయనుం డొప్పారుచుఁ స్వీయనా
మగ్రాహం బొలయంగఁ దేరు డిగి సన్మాతంగకుంభస్థుఁ డ
వ్యగ్రాత్ముండును నై శరప్రతతుల న్వ్యాలీఢుఁ గావించె నా
సుగ్రీవుం గదలంగనీ కసువులఁ జోకొట్టు మె ట్టొప్పఁగఁ. ౧౭౭

గీ॥ నిలువరించె సుగ్రీవు నిర్జిద్రుఁ జేతఁ డనుచు రక్కసు లానంద మందుచుండ
బాణవిద్ధుండు కుపితుండు భానుజుండు వాని నగలించు తలఁ పెదఁ బూనియుండె.
ఉ॥ శూరుఁడు వానరాధిపుఁడు చొక్కపుఁబాదప మొక్కఁ డెత్తి దు
ర్వారబలంబు వైరిమదవారణము న్నడిచె త్తి వైవఁగా
ఘోరనినాద మొప్ప నది కూలె ధనుఃప్రమితస్థలంబునన్
నైరృతుఁ డోసరిల్లె నిజనాశన మీశతమైఁ దలంగుచున్. ౫౭౯
ఆ॥ అర్ధభంబు చర్మ మసిరాజముం గొంచు లఘుపరిక్రమంబు లావు నెఱయ
నెదిరి నిల్చి కూల్చు నినసుతు భర్త్సించు నటులు వాల్చె నప్పలాశనుండు. ౫౮౦
కం॥ కుపితుం డై సుగ్రీవుఁడు విపులశిలం దెచ్చి వైచె వికృతాక్షుని పై
నపసరణశరణుఁ డంబుభృదుపమిత నద్దానిఁ దలఁగ నోపె నసురుఁడున్. ౫౮౧
ఉ॥ అంతటఁ బోక ఖడ్గమున నర్కతనూజు నడంచిన న్మహా
ర్తాంతర మాతఁ డొడ్డగిలి యాదటఁ దెప్పిలి వానివక్ష మ
త్యంతదృఢోరుముష్టి నరయాహతముం బొనరింప వాఁ డప
క్రాంతుఁడు గాక యయ్యసిన క్రమ్మఱ వానరనాథు నేసినన్. ౫౮౨
ఆ॥ అతని కవచ మెడలి యసితోడ నిల్పవాలె నతఁడు మోకరిల్లె నల్ల యవనిఁ
బతితుఁడయ్యుఁ గీశపతి తలాహతి ఫణి భాతి నొడుపు మీఱ వైచుటయును.
కం॥ అశనిసమానం బయ్యది పిశితాశి తలంగెఁ దన్నుఁ బెరయకయుండన్
గుశలతమై నుడివోవక ప్రశస్త మగు ముష్టి యెదిరిపైఁ బరఁగించెన్. ౫౮౪
చ॥ అది యెద వ్రాలినంతనె యహర్పతిసూతి మఱింత క్రుద్ధుఁ డై
పదిలముగా నమర్చి యరిపాటన మెంచి విరించి వ్రాఁతప
ట్టదర మహాశనిప్రతిభ మైన తలంబున వైచెఁ గాలుఁ డ
య్యదనునఁ గాలదండబల మాభుజదండమునందుఁ జేర్పఁగాన్. ౫౮౫
మ॥ అది దాఁకం దనవీఁక వో రుధిర మొయ్యం గ్రక్క నారక్కసుం
డది స్రోతస్సులనుండి ప్రస్రవణనిర్యాద్వారిపూరంబు తీ
రొదవించెం బడె వాఁడు క్ష్మాతలమునం దొప్పారె ఫేనంబు ల
ట్లదనం బయ్యె వివృత్తనేత్రతతయు పేయత్వంబుఁ బోకార్చుచున్. ౫౮౬
తే॥ మునువిరూపాక్షుఁ డవ్వాని మొనసె నప్పు డతివిరూపాక్షభావ మ ట్లవనిఁ బొరలి
నెత్తుటం దోఁగి యొత్తిలి నిక్కి నీల్గి యెలుఁగు నెడి దీనుఁ డౌ కెంచి రెనసి కపులు.
ఉ॥ పో రొనరించు నయ్యుభయపూర్ణబలార్ణవము ల్తరస్వు లా
తీరునఁ బడ్డవానిఁ గనెఁ దెల్పియు నార్తియుఁ గారణంబు లౌ
దారిని వారి నిస్వనవిధానము లేర్పడె భిన్నవేలముల్
గా రణ మాఁగి భూతలము గంపము నొందఁ జలింప నత్తఱిన్. ౫౮౭

ఆ॥ ఆవిరూపనేత్రుఁ డటు హరీంద్రుని ప్రేటుగాంచి యసురకూలఁగ కపిబలము ప్ర
యుక్త మొప్పె నఖిల మున్మత్తగంగాప్రసంగసంగతం బనంగ నగుచు. ౨౮౯
చ॥ బలములు రెండు నల్లిదిరి పాయని పట్టుదల ల్సెలంగ దో
ర్బల మలరారఁ బోరఁగఁ దిరం బగు ఘర్మమున న్సరస్సు ల
ట్లలవలఁ బోకఁ బొల్పడిన యంతి యలంతకుఁ జొచ్చి చేడ్పడన్
దలఁకుచు రావణుండు పరితాపము కోపముఁ దన్ను ముంపఁగన్. ౨౯౦
తే॥ ఆవిరూపాక్షుఁ డటు గూలె ననుచుఁ బలవి
ఘాత మొదవించె ననుచు నక్కాన మెకము
లడరని రున్నవారల నైన ననుచు
విధివిపర్యయ మెంచి యవ్వీరవరుఁడు. ౨౯౧

—♦ రావణుఁ డుద్విగ్నుఁడై మహోదరుఁ బ్రేరేచుట. ♦—

ఆ॥ వ్యథితుఁడయ్యుఁ గ్రోధ మవశునిఁ జేయంగ నోడుగఁబచుకొనుచు నమ్మహోద
రుం దరి న్నెఱాయరిందముం దిలకించి పలుకు దోట్రువడఁగఁ బలికె నతఁడు.
శా॥ ఇక్కాలం బిటు దిక్కులే కెరియు నాయిచ్చ న్జయాశంస వీఁ
డొక్కం డోపు మహాభుజుం డని సముద్యోగిం బొనర్పంగ ని
న్జక్కం గొంటిసి వేఁడుకో ల్సెరపెదన్ సన్నాహము ల్శత్రులన్
జక్కాడం దమకింపు ముజ్జ్వలము నీశౌర్యమ్ము గాంభీర్యమున్. ౨౯౩
తే॥ భర్తృపిండనిర్దేశమ్ము పఱప నైన కాల మియ్యదె సుమ్ము నీకతన మేలు
గాంతునని యున్నవాఁడ నో కదనమునను తనరఁ జేయు ముత్సాహమ్ము తలకు మిగుల.
ఆ॥ అనిన నట్లుసేయు నోదుఁ గా కంతకు నింత వేఁడవలెనె యేను లాఁతి
నే యటంచుఁ బలికి యెనసె వాఁ డరిసేన దహనుకీలవెసఁబతంగ మట్లు. ౨౯౪
క॥ తనబీరము విభుబేరము దనుఁ బ్రేరేపింపఁ బొగరు డార్కాణముగా
ననిసేసె వానరులతో ననిసేయం గలఁడె చెల్ల నని వేల్పు లనన్. ౨౯౬
ఆ॥ విపులశిలలు గొంచు విపులఁ గా లూనక యలబలమ్ము నలమి యలపు లేక
యలబలమ్ము లొప్ప నలయించి రెలయించి రధిపు మదిఁ బ్లవంగమాధిపతులు.

—♦ మహోదరుని సుగ్రీవుఁడు గీటడంచుట ♦—

ఉ॥ కాంచనభూషణమ్ములు వికాసనమంచితము ల్వరమ్ము ల
ర్పించి యలంచె శత్రుల శరీరములం దెరలించు నేర్పునన్
మించి చరించె నమ్మోదరు మేకొన నేర మటంచుఁ బొటి ర
క్ష్యంచితు లైన వానరు లహంకృతి మాని యమానితస్థితిన్. ౨౯౮
క॥ వానికిఁ దోడుగ నసురులు పూనికనై నఱుమ నెసఁగు పో రుడిగిచనన్
గా నైరి కడఁగి యినసుతు దీనులరై వేఁడుకొనిరి ధృతి వెలితిపడన్. ౨౯౯

క॥ వానరసేన కలంగుట దానవుఁ డదరిపడుచుంటఁ దదనుగు లమ్మై
నానిక సూవుటయుం గని లో నూనిన యలుక నుజ్జ్వలుం డయి కడఁకన్.

క॥ బలుగొండఁ బోలి ఘోర విపుల యా శిల నొండు గొంచు బోరన వానిం
బొలియింప నేగుదెంచెను బలారినిభుఁ డినజుఁ డధికబల మొప్పారన్. ౬౦౧

ఆ॥ దాని వైవ నదియుఁ దరలిరాఁగ మహోదరుం డసంభ్రమంబు రూఢి నెగడ
నశనిసన్నిభంబు లౌ శరంబుల విదారించె నద్రిభేది రీతి దసర. ౬౦౨

ఆ॥ తలరి శిల సహస్రధాభిన్న మై పడె గృధ్రచక్ర మన వికీర్ణ మగుచుఁ
గ్రుద్ధుఁ డగుచు సాలకుజ మొండు కపిపతి వైవ దాని నసుర వ్రయ్యఁజేసె.

క॥ క్రిందఁ బడియున్న పరిఘం బందుకొని హరీంద్రుఁ డలుక నడరి తదీయ
స్యందనహరుల నడంచె నమందస్ఫురణం బెసంగ మలసినవేడ్కన్. ౬౦౪

చ॥ హతహయ మమ్మహారథ మహంకృతి పీడక పీడి యల్కనై
నతిరయ మొప్పఁ బెన్గదియ హస్తమునం దులకింపఁ బైకొనన్
వితతబలుండు రక్కసుఁడు వేగమె వాని నెదిర్చె భానుజుం
డతులితవిస్ఫురత్పరిఘ మన్నిటి దీర్చి విరుర్చుచున్ ధృతిన్. ౬౦౫

పృథ్వీ॥ గదాపరిఘహస్తులై కదనదేశ మట్టిట్టుగా
నదన్మదవృషంబుల న్నవసవిద్యుదబ్దంబులన్
మదింప నగు పద్ధతి న్మలసి రుద్ధతి న్వార ల
ప్డుదంచితమహాగ్రహాఽభ్యుచితవిగ్రహోదగ్రులై. ౬౦౬

క॥ రజనీచరుఁడు మహోదరుఁ డజగరనిభ మైన గల మహాస్వర భా
నుజుపై వైచెఁ బరిఘమునఁ బ్రజవుఁ డతం డడఁచె రెండు భగ్నము లయ్యెన్.

క॥ వసుధాతలస్థ మాయసము సర్వతస్స్వర్ణఘటితము సుఘోరము బె
న్ముసలముఁ గొని యసురునిపై విసృమరతేజుఁ డినసుతుఁడు వీఁచె న్వైచెన్.

క॥ అన్యుం డన్యుం గదఁ గొని యన్యోన్యాఘాత మొదవ నడరించినచో
విన్యాసోపేతము లై సన్యస్తము లయ్యె రెండు సమరతలమునన్. ౬౦౯

ఆ॥ ముష్టియుద్ధమునకు మొనసిరి వారు భగ్నప్రహరణు లగుచు ననుచు తేజ
మోజ మలము చలము నొప్ప హుతాశనులొండు నొండు నొరయు నొఱపు నెఱయ.

క॥ నాదములు వినోదంబులు మోదములు గ్రహమ్ము లట్లు మోదనములు వ్యా
పాదపతనోత్పతనసంస్వేదనఘాతప్రఘాతవిధులుం దనరెన్. ౬౧౧

క॥ ఒండొరులం ద్రోయుచు భుజదండముల వ్రేయుచుం బ్రధానత మీఱన్
జండిమమై నెక్కొన నుద్దండు లెనసి రిరువురుం బదంపడి యలఁతన్. ౬౧౨

ఆ॥ ఆహరించె ఖడ్గ మటు చర్మ మురువేగుఁ డమ్మహోదరాఖ్యుఁ డసురవరుఁడు
పరిసరప్రదేశపరివర్తు లగుచుండ నవియ తాల్చె వానరాధిపతియు. ౬౧౩

క॥ ఇరువురు శస్త్రవిశారదు లరమఱలే కలిమి రుద్యతాసులు వరభా
సురహాసు లమర్షాత్ములు సరభసు లుచ్చైర్నినాదసహితులు నగుచున్. ౬౧౪
ఆ॥ సరగఁ బరఁగ నైరి సవ్యాపసవ్యప్రచారవల్గనప్రసక్తు లొలయ
మండలప్రయుక్తమార్గం బనర్గళం బయ్యెఁ దజ్జయేచ్ఛ లతిశయిల్ల. ౬౧౫
క॥ వీర్యశ్లాఘి మహోదరుఁ డర్యమసుతుచేతి చర్మముం దసి వ్రేసెన్
దుర్యోగంబున మఱలఁ గదర్యుం డద్దాని నొడియు తవులునఁ దవిలెన్. ౬౧౬
ఆ॥ అంతరమ్ముఁ గాంచి యర్కాత్మజుఁడు వాని కుండలప్రభ ల్నిగుడఁ బొసంగు
శిరము సహశిరస్త్ర మురుఖడ్గమునఁ గోసి ధరణి కొసఁగె బలివిధాన మెసఁగ.
క॥ తలదెగిన వాఁడు రణభూతలమునఁ బడెఁ దద్బలంబు తలఁపు సెదర నై
తలఁగెఁ దలకొనె హరిపుఁ డుత్తలపడె రావణుఁడు రామదయితుం డలరెన్.
ఆ॥ సన్నహృదయు లటు విషాదసద్వదనులు నగుచు రాక్షసులు భయార్తులైరి
వికసితాస్యు లగుచు వినిపాత మెడలంగ హరివరేణ్యు లరుస మందఁగనిరి.
క॥ హరిపతి మహోదరు మహాగిరిశృంగము న ట్లగల్చి గెలుపుగనిన మే
ల్సిరిఁ గీర్తిం గొని మెఱసెను గిరికొను తేజమున సురలు కీర్తింపంగన్. ౬౨౦
ఆ॥ అంతరిక్షగంబు లవనీతలగతంబు లైన భూతగణము లఖిలమునులుఁ
బొగడఁదొడఁగి రినజుభూరితేజముతోడి పురుషకార మెంచి పుణ్యమూర్తి!

—♦ మహాపార్శ్వుఁ డంగదునిచేఁ బడుట. ♦—

క॥ ఇనజునిచేత మహోదరుఁ డని నిహతుం డగుట గని మహాపార్శ్వుం డా
య్యన నెత్తిసేసెఁ గనులం దను గ్రుంగెడు క్రోధ మెడఁదఁ దారసిలంగన్.
ఆ॥ భీమసాయకముల భేదింపఁగాఁ జొచ్చె నంగదోపపన్న మైన సేన
నందు ఘనుల తలల నంగమ్ములకుఁ బాపెఁ బండ్ల వృంతములకుఁ బాపినట్లు.
క॥ కొండలబాహువుల న్మఱి కొండల స్కంధముల ముట్టఁ గోసెఁ గ్రుధాంధుం
డందుం గొండల పార్శ్వములం దెగఁజూచెన్ ధనుఃకలాకలితుం డై. ౬౨౪
క॥ శరవర్షార్దితు లై వానరవీరులు నర్దనము లొనర సువిషాద
చ్ఛురితు లగు టరసి యంగదుఁ డరిమర్దన మొంచుచు న్మహావేగుం డై ౬౨౫
ఆ॥ పర్వమయ్యెఁ దనదు ప్రజల రక్కసుఁ డట్టు లతిముఱిం దెరల్ప నఱుము నగుట
దా సముద్రుఁడయ్యెఁ దదనంతరప్రకారంబు మనమునం దిరమ్ముపడదె. ౬౨౬
క॥ ఆయసపరిఘుం బొక్కం డాయతబాహుండు దాల్చె నది హేమాప్తిన్
స్ఫాయద్రవిరశ్మివిభాచ్ఛాయం బై తనరఁ దత్ప్రసంగం బొప్పన్. ౬౨౭
తే॥ అది మహాపార్శ్వుపై వైచి యార్చుటయును వాఁడు సూతుండు స్యందనవరముఁ
వ్రాలి రిల మేను లెఱుఁగని వ్రాతగ్రమ్మఁ గ్రమ్మఱంబడు నపు డేమి గలుగునొక్కొ. [బాసి

శా॥ సంభిన్నాంజనపుంజమంజిమతనుచ్ఛాయుండు తేజస్వితో
జ్జృంభోత్తంభితశత్రుఁ డూర్జితుఁడు సశ్రీకమ్ము స్వానీకమున్
సంభావించుచు జాంబవంతుఁడు రణశ్లాఘిత్వసంపాది యా
శుంభద్వీర్య మెసంగ గ్రావ మొకఁ డక్షోభ్యంబు గొంచు న్వడిన్. ౬౨౯
క॥ పఱతెంచి దాన హయముల నఱిముఱిఁ దెగటార్ప నరద మఱిమి గవాక్షుం
డఱవఱలు గాఁగ విఱిచిన నఱగొఱగా నసుర తేఱి యారటపడుచున్. ౬౩౦
ఆ॥ వాలిసూను బిట్టు వాలమ్ముల నగల్చి జాంబవంతు మూఁడు శరములన్ స్త
నాంతరమున గ్రొచ్చి యటు గవాక్షుని మేన నాటె నెన్నియేని నారసముల.
క॥ అంగదుఁడు క్షుధాలహరి మునింగిన మనమునఁ దనర్చి నెయ్యురు శరవి
ద్ధాంగు లగు టరసి ద్విగుణితముం గావించుకొని రోసము న్రభసమ్మున్. ౬౩౨
ఆ॥ ఆయసంబు పరిఘ మర్కరశ్మిప్రభ మందుకొని భుజద్వయమునఁ బట్టి
త్రిప్పి యసురుఁ గడకఁ దెగఁజూడఁగా నెంచి విసరివైచె మసరు ముసురుకొనఁగ.
క॥ సరగ నది శరశరాసనశిరస్త్రములఁ బాచి పగతు సిగ్గుపఱిచిన్
గరమున శిరము దడవుకొని సరభసుఁ డగు నసురుఁ గాంచి సరిలె మ్మంచున్.
ఆ॥ తన ప్రతాప మొలయు దర్పంబునం జని చొచ్చి పెచ్చుపెరుఁగు మచ్చరమున
గొంటు వాని రుచిరకుండలకర్ణమూలము హరీంద్రజుఁడు తలమున నడఁచె.
ఆ॥ పెద్దకోప మెగువఁ బెడచేఁ బరశ్వథ మంది పుచ్చుకొని మహాసురుండు
శైలధౌతవిశదధరసార మౌ దాని వాలిపుత్త్రుపైని వైచి యార్చె. ౬౩౬
క॥ ఆమాంసభుక్కుఠారము వామాంసమునందుఁ దవుల వడిఁ బెఱికి మహా
శ్రీమాంసలతనుఁ డాతఁ 'డరే మాం నముపైహి' యనుచు రెచ్చిన యలుకన్.
చ॥ జనకుపరాక్రమంబు తనజాడఁ బ్రవృద్ధము గాఁగ వజ్రమున్
మొనకొనఁజాలు సందృఢము ముష్టి నమర్చి తనర్చు వీఁకమై
దనుజుస్తనాంతరస్థలము దాఁకఁగ మర్మవిదుండు వైచె న
య్యినతనయుండు నమ్మెయిన యెత్తి నిగుడ్చెను గాలదండమున్. ౬౩౮
ఆ॥ ఆనిపాత మెనయ నానిపాతమ్మున కాని పాత మట్టులైనయపుడు
హృదయ మగల దుష్టహృదయుఁడు నేలపైఁ బడియె నిదియ చెల్లుబడి యటంచు.
ఉ॥ వాఁ డటు వ్రాల వానిదగువర్గము దుర్గముపా ల్పడంగ నా
గో డెనసె స్సురారివిభుక్రోధము రోధము మీఱి పొంగెఁ జే
ర్వాడుచు సింహనాదములు వానరు లానరులన్ సుఖింపుఁ డం
చాడుచుఁ గూర్చి రట్లొదవె నాశరనాశరవంబు లంకలోన్. ౬౪౦
ఆ॥ ఇంద్రుఁ గూడి యాదిగింద్రులు దేవతల్ సంతసించు టొకఁడు సంతరించి
యంతవార లగుచు నలరు వానరులతీ రెంచి రాత్రిచరమహేశ్వరుండు. ౬౪౧

క॥ ఆముప్వు రమాత్యులు నన నాముకొనిన బా మమర్ష మై నెలకొనఁగా
ధీమహితు సూతుఁ గనుఁగొని దీమస మొప్పారఁ బలికె దివిజస్తుత్యా! ౬౮౨

మ॥ హతు లై చన్న యమాత్యవర్యుల నిరుద్ధావన్న లౌ పట్టణం
బు తత్రశీల యపార మహా వ్యసన మేఁ బొల్పారు సామర్థ్యల
క్షిత యోగంబున నీఁగువాఁడఁ గడఁకం జిట్టాడుచున్నట్టి దు
ర్మతులన్ ఘస్మపతుల న్వధించి విహితామర్ష ప్రకర్షంబుగన్. ౬౮౩

శా॥ సీతాపుష్పఫలోచితం బయిన దీర్శ్రీరామవృక్షంబు ని
ర్ణీతం బయ్యెను భానుజానిలసుతైంద్రిప్రౌఢపుత్రర్క్ష ప
ఖ్యాతానీకపకాండపల్లవితశాఖాంచత్ప్రపంచంబుగా
నేతావంతము దీని దున్మెద ననిన్ హేతుప్రసక్తస్థితిన్. ౬౮౪

ఆ॥ కాన నేర్మి మెఱయఁ గడపు మీ వరదంబు నేఁడు నేటుకొనిన నియతికతన
ననిన వల్లె యనుచు నతఁ డట్టు లొనరింపఁదొడరె నదియునడరెఁ దోడుతోడ

—♦ రావణుఁడు క్రోధమూర్ఛితుఁడై రాము నెదుర్కొనుట ♦—

క॥ పది దెసలు రథస్వనములు నదరఁగఁ బదితలలయాతఁ డతిరథవర్యుం
డదనున రాముం జేరఁగఁ బొదలె న్మంజేత ధనువు భూరిధ్వనులన్. ౬౮౫

క॥ ధారుణి తదారవంబులఁ బూరిత యై సంచలించె భూధరవరదు
ర్గారామనదీనదయుత యై రక్షఃకపిబలంబు లటునిటు గాఁగన్. ౬౮౬

ఉ॥ ఘోరము తామసాస్త్ర మతిఘోరుఁడు వాఁ డెనయింప నాకృతిం
దారుణహేతు లుప్పతిలఁ దద్ద దహింపఁదొడంగెఁ దన్మయా
సారము కీశసైన్యము ప్రచారముఁ దక్కి యసార మై ధరన్
బోరనఁగూలె రోదసులు భోరుకొనెం బలుధూళు లేర్పడెన్. ౬౮౭

క॥ అది విధిచే నిర్మిత మై యదనున రావణుని బెరసె నమ్మాయాస్త్రం
బొదవిన సహింపనేరరు త్రిదశులు నైరృతులు సర్వదేవోపాస్యా! ౬౮౮

క॥ ఆకరణి ననేకంబు లనీకంబులు భంగ మొనసి నెరసినఁ గని సు
శ్లోకుఁడు రాముఁడు రావణు నాఁకపడెం దఱియఁ జని మహాకల్పలతా! ౬౯౦

క॥ అంత నసురశార్దూలుఁడు వింతగ హరివాహినిం బ్రవిద్రావితఁగా
సంతసమునం బొనర్చి తదంతమునం గాంచె రాము నధిగుణధాముస్. ౬౯౧

సీ॥ తన సౌమ్యె యపరాజితత్వమ్మనఁగ మహితస్థానకస్థితిఁ దనరువాని
లీలమై నింగి నుల్లేఖించు బలువిల్లు భూరికాండముఁ జేతఁ బూనఁగువాని
విష్ణుతో వాసవువిధము చూపట్టంగఁ దమ్మునితోడి యందమ్మువానిఁ
దమ్ముల మీఱు కన్దమ్ముల సోయగంబునఁ దొంటి హరిలక్ష్మి నఁ బొల్చువాని

దీర్ఘబాహు నరిందము దివ్యతేజు భవ్యలావణ్యశేవధి భద్రమూర్తిఁ
గాంచె ననుమాటయేకాని కానఁడయ్యె రావణుఁడు రాము జగదభిరాముఁ బెరయ.

క॥ సౌమిత్రిసహితుఁ డాతం డామిత్రేతరునిఁ జూచి యగచరవరు ల
ట్లామునెడు టరసి సుమహాశ్రీ మీఱ ఘటించె వింట శితశరగుణముల్. ౬౫౩

క॥ అల్లన విస్ఫారించిన యల్లాఘవమాత్రమునను యవని దెసలు ఘూ
ర్ణిల్లెం దజ్జవరవములు ఫుల్లాంబుజపత్రనేత్ర! పొగడఁ దరము లే? ౬౫౪

ఆ॥ రావణుని శరౌఘరావముల్ రామవిస్ఫారితోదితంబు శబ్దచయము
గడలఁ గడలుకొనఁగ గాసిల్లి యుం దిందుఁ గ్రాలువారు నేల వ్రాలిరపుడు.

ఆ॥ రావణుండు వొల్చె రాజపుత్రుల శరలక్ష్య మగుచు నిలిచి లావు మెఱయ
సైంహికేయుఁ డొకట శశిసూర్యు లొనరినయపుడు వారి నెదురు టచ్చుపడఁగ.

క॥ తొలుదొల్తఁ దానె యనికై సలక్షణుఁడు లక్ష్మణుండు సంరంభించెన్
బలుశరములఁ దొడి యేసెను బలియుఁ డసుర వాని నెల్లఁ బ్రతివారించెన్.

చ॥ అనలశిఖోపమంబు లగు నట్టి శరంబుల రాఘవానుజుం
డనుపద మేయుచుండె నతఁ డన్నియు వార కెడల్చుచుండె న
య్యనువునఁ బాణిలాఘవ మనల్పము తద్దిశఁ దోఁప నైన న
ద్దనుజుని మేన నొక్కటియుఁ దార్కొన దయ్యె మహాద్భుతంబుగన్. ౬౫౮

ఆ॥ ఒండు రెండు మూఁడు నొకపది పదిపదుల్ నిండుమది శరముల నిగుడఁజేయ
నన్నియును నడల్చి యతఁడు సౌమిత్రి నతిక్రమించి మఱియు విక్రమించి. ౬౫౯

చ॥ కని పెనుగొండ యాఘనునిఁ గార్కొని కాని గరంపనంచుఁ దె
ప్పునఁ జనె రాముబాఱి సరి పోలఁగ నాసమితింజయుండు లో
చనముల కెంపు డా లెదుఁగ శస్త్రములం బరఁగించె వృష్టు ల
య్యనుపమమూర్తిపై నడరి యాగడ మట్లుడివోవకుండఁగన్. ౬౬౦

మ॥ శరధారల్నిగుడంగ రాముఁడు ధనుశ్చక్రజ్వలజ్జాలికా
స్ఫురదుష్ణాంశునిశాశభల్లతతులం బోకార్చెఁ దద్వృష్టులన్
బరుఁ డాశీవిషసన్నిభంబు లటు పైఁ బై నింప ఖండించె న
వ్వరుస నక్కసు ముంచె నైజ మగు దుర్వారత్వ మొప్పారఁగన్. ౬౬౧

క॥ అతని కితం డితని కతం డతిరయమున సాటివత్తు రన నొప్పిరి బా
ణతతుల వర్షించుచుఁ దత్ప్రతాన మెడలించుచుం బ్రభాస్వరు లగుచున్. ౬౬౨

సీ॥ సవ్యదక్షిణచిత్రసన్మండలప్రచారంబులఁ బాణివేగంబు లొప్ప
నవ్వాని నాఁగుచు నపరాజితులు వీర లంతకాంతకు లన నగుదు రనుచు
భూతము ల్ప్రాసంబు వొంద సంతతశరసంతతు లెఱయ నిరంతరం బ
నంతంబు నాఁ జను నభ్రమ్ము ఘర్మాంతశంపాయుతాబ్దసంఛాదనముల

నెట్టు లట్లుగాఁగ నిషువృష్టుల గవాక్షితంబు దిమిరతత మతత్ప్రకార
మగుడు భానుఁ డస్త మంద పీడనివారివాహాముల ప్రసక్తి వా రెనసిరి. ౬౭౩
తే॥ అట్టు లన్యోన్యవధ కాంక్షు లైన వారి సంకుల మచింత్యగుణ మనాసాద్యమునగు
సమర మొప్పారె వృత్రవాసవులు మున్ను నెఱపిన విధాన మంతయు నివ్వటిల్ల.
మ॥ పరమేష్వాసులె యిర్వు రిర్వురును సంప్రజ్ఞాతశస్త్రాస్త్రులే
వెరవొప్పారఁ జరించువారలె జగద్విఖ్యాతులే ఘోర నే
యిరవుం గొంచు మెలంగ నెంచి రచటన్ హేలాగతి న్మించె సా
గరయుగ్మాహతి నా శరోర్ములు సదాగత్యాధిపత్యంబునన్. ౬౭౪
తే॥ రావణుఁడు లోకరావణుం డావలనున రాచబిడ్డని నొసఁట నారాచమాల
రౌద్రచాపప్రయుక్త బిరాన నాటె నదియు నీలోత్పలదలాభ యచట మెఱసె.
క॥ శిరమున దాని ధరించియుఁ బరమపురుషుఁ డెన్నఁబోఁడు భర మం చెదలోఁ
బరఁగించె రౌద్రమంత్ర స్ఫురితశరము లసురపైఁ బ్రసూనశరకలా!. ౬౭౫
ఆ॥ అవి యభేద్యకవచమందు వ్రాలెనె కాని దాని కేకొఱఁతయుఁ దారసిలదు
పాలఫలకమునను బరమాస్త్రమంత్రితాస్త్రముల మఱియు నాటె శస్త్రవిదుఁడు.
క॥అసు రేంద్రుఁ డేయు శరములఁ గసిమసఁగుచుఁ గవచ మొంటఁ గలఁచుచుఁ గడకన్
మిసిమింతలుగాఁ బంచాస్య సర్పములభాతి బుస్సు మని యవి తెరలెన్. ౬౭౬
తే॥ రాము నస్త్రము ల్మరలించి రావణుండు క్రోధమూర్ఛితుఁ డై యతిఘోర మైన
యాసురం బస్త్ర మొదవించి యందె యుద్భవింపఁ జేసె మహాదుష్టవిశిఖములను.
వ॥ అవి మఱియు సింహవ్యాఘ్రముఖంబులు కాకకంకముఖంబులు గృధ్రశ్యేన
ముఖంబులు సృగాల వదనంబులు వ్యాదితాస్యంబులు భయానకంబులుపంచాస్య
లేలిహానలపనంబులు ఖరవరాహవృశ్చికకుక్కుటవక్త్రంబులు మకరాశీవిషాన
నంబులు నగు శస్త్రాస్త్రంబులు తంషోపతండంబులుగాఁ గావించి యమ్మాయావి
ప్రకుపితదర్పితం బగు మహాసర్పం బట్లు రోజుచు ఘన తరౌజం బగు నిజతేజంబు
దెన లావరింప రఘునందనునకై యార్జించినయవి యెల్ల విసర్జింప నమ్మహా
మహుండు. ౬౭౭
తే॥ఆసురాస్త్రంబు తనమీఁద నడరునంతఁ దాను సృజియించెఁ బావకాస్త్రముగడంక
మీఱఁగాఁ బావకనిభుండు మిహిరకులుఁడు తనమహోత్సాహ మంతకంతకును మిగుల
మ॥ అనలజ్వాలకరాలవక్త్రములు దీప్యత్సూర్యబింబాస్యముల్
ఘనఖండోజ్జ్వలచంద్రలక్ష్యముఖముల్ గ్రస్యద్గ్రహార్క్షోల్కికా
ననవిద్యుద్ద్యుతిధూమకేతుముఖసన్నాహంబులుం బొల్చె రా
మునియాగ్నేయమహాస్త్రవిస్ఫురితనిర్ముక్తాహు లేతేరఁగన్. ౬౭౮

తే॥ రావణాసురఘోరశరప్రపంచ మడరి రాఘవాస్త్రజ్వాల లందు స్రుగ్గి
విలయమొందె నాకసమున వేలకొలఁది కొఱవు లేర్పడె బూదెవై కూలెఁ గడఁగి
తే॥ రమణ నక్లిష్టకర్ముఁడౌ రాముచలన నాసురాస్త్రంబు నిహతమై యవనిఁ వ్రాల
నగచరులు కామరూపు లాహ్లాద మొదవ నధిపుఁడుం దారు నార్చి రొయ్యనఁ దనర్చి
క॥ రావణభుజనిస్సృత మగు నావరశర మట్లు గాఁగ నభయప్రదుఁడౌ
శ్రీవరుఁ గొలిచిరి పొగడిరి దేవత లవ్వారు నొక్కతీరున గారి! ౬౭౬
మ॥ తనయస్త్రం బటుగాఁగ రాము నెఱియుం దార్కాణగా రావణుం
డనువేలంబ యమర్షితంబు గుణితం బై పొంగఁ గ్రోధాత్మకా
స్త్రనివేశం బొనరించె నయ్యది మహారౌద్రంబు మాయామయా
ఖ్యనిసృష్టంబు రఘూద్వహుం గెడప నా నంచు న్సముంచద్ధృతిన్. ౬౭౭
శా॥ శూలమ్ము ల్గదలు న్మసుంఢిముసలాసు ల్కూటపాశౌశనుల్
వాలమ్ము ల్పలుముద్గరమ్ములు మహావజ్రప్రసారమ్ములై
క్రాలంజొచ్చెను దన్మహాస్త్రమున నాకంపించె భూతౌఘ మ
ప్డాలీలం గనుగొంచు రామవిభుఁ డుద్యత్స్మేరవక్త్రాబ్జుఁడై. ౬౭౮
ఆ॥ ఉత్తమాస్త్రకుశలుఁ డొయ్యన గాంధర్వ మనెడు పరమమైన యస్త్రమున నె
యస్తమింపఁజేసె నద్దాని శ్రీమంతుఁ డనఁగఁ దాన యగుచు నర్కకులుఁడు.
తే॥ క్రోధతామ్రాక్షుఁడై వాఁడు గొనెను సౌర
మస్త్రము ప్రయుక్త మటు వ్యర్థ మయ్యెఁ ననుచుఁ
జక్రములు భాస్వరము లందు సంభవించె
గగనమతిదీప్తమయ్యె వేగము పొసంగె. ౬౮౦
తే॥ చంద్రసూర్యగ్రహాద్యత్ప్రసక్తి సంపతత్పతచ్ఛస్త్రచిత్రాయుధతతిఁ బాపెఁ
దనసుదర్శనబాణసంతతికతమున నది సుదర్శనధరుని సొమ్మగున కాదె. ౬౮౧
క॥ తనయస్త్రము నిహతముగా దనుజేంద్రుం డదరిపడుచుఁ దద్దయు శరముల్
ఘనమర్మస్థానంబులఁ జొనిపెం బది నిజధనుఃప్రసూతంబు లొగిన్. ౬౮౨
క॥ అవి యేసిన నివి యేసిన నవికంప్యుం డతఁడు దనుకఁ డధిబహుశరముల్
గవియించి నొంచె గాత్రము లవియించి మహాసురు న్రయం బొప్పారన్. ౬౮3
మ॥ తొలుదొల్తం దనతోడఁ బోరుచునె యస్తోభుండు గా కేచి మో
సల రాముం దిలకించి రావణుఁడు తత్సామ్యంబుఁ జింతించుచున్
దలపడ్డం దరిగొంచు బాసటయకాఁ దా నున్న సౌమిత్రి సం
విలసద్బాణము లేడు కార్ముకమున న్వే దాల్చి సంరంభియై. ౬౮౪
ఉ॥ అందు మనుష్యశీర్షము మహాధ్వజ మొంట నగల్చె నొక్కటన్
బ్రమందఁగఁజేసె సూతునిశిరం బురుకుండలముం జెరల్చి యా

క్రందున నైదుకాండముల ఖండితముం బొనరించె హస్తిసం
స్పందకరోపమం బయిన చాపముఁ గోపము రూప మొందఁగన్. ౬౮౫

ఆ॥ నీలఘననిభములు శైలోపమములు నా రథమురథ్యముల సవిధచరుండు
కదనమున నడంచె గదఁగొని యవ్విభీషణుఁడు భ్రాత దొఱసి సంభ్రమమున.

ఆ॥ అమ్మహారథమ్ము హతరథ్య మైన రయమ్ము మెఱయ నమ్మహారయుండు
క్రోధ మెసఁగ డిగ్గి క్రూరుఁడై తమ్మునిఁ బిడుగుఁబోనిశక్తిఁ బేర్చి వైచె.

ఉ॥ రాకకురాఁగడంగిన నిరాకృతిఁ జేసెను మూఁడు బాణముల్
గైకొని లక్ష్మణుండు గడఁక న్ఘనశక్తి నగల్చె నంచు న
ప్రాకృతు లెల్ల వానరులుఁ బ్రస్తుతి జేసిరి వ్రాలె నుల్కనా
వీఁకసెడంగ నయ్యదియు విశ్వజనీనచరిత్రశోభితా! ౬౮౮

మ॥ పలుపూజ ల్బలు లుల్లసిల్ల నియతప్రఖ్యాతమై కాలు సం
బలుని న్మెచ్చని మేటిశక్తి మయసంప్రాప్త న్మహాతేజస్వి
యలసత్తేజమున న్మెలంచి బలి యొయ్య న్వేగితం జేసి వాఁ
డలఘుప్రక్రియఁ దమ్మునిం గెడపఁగా నంకించి యుంకించినన్. ౬౮౯

ఆ॥ అది మహాతిఘోర యన్యదురాసద యైంద్రవజ్రనిభయు నగుచు నడరు
నంతఁ బ్రాణసంశయాపన్నుఁడై విభీషణుఁడు తనదు మ్రోల సంచలింప. ౬౯౦

క॥ దత్తాభయు నాతని సంసక్తిమెయిం గావకుంట చనునే యని సం
పత్తికరుఁ డెదిరి లక్ష్మణుఁ డుత్తంభితుఁ జేసె శత్రు నురుశరవృష్టిన్. ౬౯౧

ఆ॥ శక్తిహస్తుఁ డగుచు శరపీడితుం డయి యనుజుమీఁద వైచు టాగె నసుర
లక్ష మెడలె నింక మోక్షితుఁ జేసెఁబో యతనిఁ దననిబంధ మరయఁ డనుచు.

—♦ లక్ష్మణ మూర్ఛ ♦—

క॥ సౌమిత్రిం గని యిట్లనె నేమోయీ! వానిఁ బాచి యీ వెనసితి విం
కేమెయినేనియు నొక్కని నేమంబున నడఁచుఁ జిక్కి నిలువుము కడఁకన్.

ఆ॥ రోహితాక్త యతినిగూఢ యీశక్తి నీప్రాణముల హరించి పఱచు హృదయ
మగలఁ గూలువాఁడ వడరెదు మద్భుజసృష్ట నిలువు మనుచుఁ జేర్చియార్చి.

తే॥ అష్టఘంట మహాస్వన నత్యమోఘ శత్రుఘాతిని దేజఃప్రసక్తికలిత
విడిచె లక్ష్మణుపై మహావీరుపై నతం డెదిరి నిల్చె బంగరుకొండవోలె. ౬౯౫

తే॥ భీమవేగుండు వాఁ డట్లు విడుచుటయును వజ్రనిర్ఘోష మగుచుఁ బై వఱలిమంట
లంటిరా నంటరా నది యతిరయమున నుంటఁ గని రామవిభుఁడు మహోజ్జ్వలుండు.

క॥ మోఘ వగుము నీయుద్యమ మోఘాయితమ ముడుగుఁగాత మొగి నానుడి సు
శ్రీఘను నీతనిఁ ద్వచ్చరితాఘ మెనయ కెడయుఁగాత మనె సత్వరుఁడై ౬౯౭

తే॥ క్రుద్ధుఁ డగు రావణునిచేతఁ గ్రూరుచేత ముక్త యాశీవిషోపమ శక్తియభయుఁ
డైన లక్ష్మణు నురమున నంటి మెఱసె దీప్తయురగేంద్రజిహ్వాక తెఱఁగు దోఁప.

శా॥ మాయాసంభవశక్తు లన్నిఁటికిఁ దా మానింప నాధారుఁ డా
శ్రీయోషావిభు నంశసంభవుఁడు సుశ్రీకుం డనంతుండు స
న్మాయామానుషవేషధారి యగుట న్మగ్నత్వముం గాంచిన
ట్లాయెంబో యటు వ్రాలె నేలపయి మూర్ఛాయత్తుఁ డై చెచ్చెరన్. ౧౯౯

ఆ॥ అధిపుఁ డనుజునకు ననతిదూరగతుఁ డయి కడఁగి చూచె నతఁడు గండడంగి
వ్రాలుటయు విషాదవశమున నున్నట్టు లుండె క్షణము బాష్పకలన నవల!

ఆ॥ అంతరమ్ముఁ గాంచి యసుర లక్ష్మణుఁ దొంటియట్ల కొనిచనం బ్రయత్నపడిన
హనుమఁ డెక్కెఁగి యెడఁద నడఁచెఁ దలాహతి నతఁడు మోకరిల్లి యవనిఁ బడఁగ

క॥ నెత్తురులు నోట నురలఁగఁ దత్తరపడి రావణుండు తలఁగి నిలువ శూ
రోత్తంసుఁడు రాముఁడు ప్రలయాత్తాగ్నిస్ఫురణ లెసఁగ నవశత పౌసఁగన్.

క॥ కా దిది విషాదమునకు న్మోదమునకుఁ గాల మనుచు మొనసి తుములయు
ద్ధాదృతుఁ డగుచుఁ బగతు నపుఁడే దర్పం బెడలఁజేయ నెంచుచుఁ దఱియన్.

ఆ॥ అసురశక్తిభిన్నుఁ డై కలంక దొలంకఁ దన్నుఁ దా నెఱుంగకున్నవాని
నచలుఁ బన్నగోచితాచలసన్నిభుఁ గాంచి ఱిచ్చపడెను గతిఁ దలంచి. ౨౦౪

—♦ రాముఁడు రావణు లెక్కసేయక లక్ష్మణుహృదయమున శక్తిని బెఱికి ముక్కలుసేయుట. ♦—

క॥ రక్షఃప్రణిహతశక్తిం దక్షులు వానరులు వట్టి తరలింపఁగనై
విక్షేప మెనసి రొడళుల నాక్షిప్రకరుండు వైచు నలుఁగులు సొరఁగన్. ౨౦౫

మ॥ ధరణి న్నాఁటిన శక్తి లక్ష్మణు నెదం దారించి వాఁటించినన్
దరమే కూర్చుచు బాహుయుగ్మ మొగి సంధానించి రాముండు సం
గరభీముండు తెరల్చి దానిఁ బలుముక్కల్ సేసి వైచె న్సురల్
భర మంచు న్వివరింప రావణుఁడు సంభ్రాంతాత్ముఁ డై చూడఁగన్. ౨౦౬

ఆ॥ సర్వగాత్రములఁ బ్రసక్తంబు గాకున్న యదియ లేదనంగ నధిపుపైని
మర్మభేదు లైన మార్గణమ్ముల నేసె నసుర లెక్కసేయఁ డాతఁడవియు. ౨౦౭

తే॥ ఆలవానఁ గొనని యద్రిలీల వానియస్త్రజాలము ల్సరకుసేయక మహాత్ముఁ
డామహాశక్తి గరుడి ఘనాహినట్లు చక్కఁపడ విదళించి నిశ్శంకుఁ డగుచు.

క॥ తమ్మునిఁ గౌఁగిటఁ బొదివి హిత మ్మలరారంగ హనుమఁ దపనజుఁ గని యి
ట్లమ్మహితకులుఁడు పలికెను నెమ్మనము పరాక్రమైకనిరతము గాఁగన్. ౨౦౯

సీ॥ అన్నలారా! మీర లనవద్యు లియ్యెడ వీనిఁ గాపాడుచు వెలయుఁ డింక
మగఁటిమి సూపంగ మలసెఁ జిరేప్సితం బైన కాలంబు దైవార్పితంబు
ఘర్మాత్యయమున మేఘప్రాప్తి స్తోకకంబున కెట్టు లట్టులు పోల్పవగుచుఁ

బాపనిశ్చయుఁ బాపుఁబాపుదు రక్కసు జగములవారెల్ల సంతసిల్లఁ
దడవు లే దింక నొకముహూర్తంబె చాలునియతిఁ బాయక యాతండు నిలిచెనేని
రాముఁడో రావణుండో దిరం బొకండెయుండువాఁ డటుగాకిర్వు రుండ రిలను.

చ॥ పొనరిన రాజ్యము న్వదలి పొల్తి దొఱంగి వనంబు సొచ్చి ని
ర్ధను నటు దండకాటవుల ధావనము ల్పచరించి భూమినం
దన నెడఁబాసి కర్గొనువిధంబున కిచ్చటు సేరి నేఁటికిం
గననవు కష్టము ల్దలఁగఁగా ఖలు వీనిఁ దొలంతు నిత్తఱిన్. ౨౧౧

ఉ॥ వానరసైన్యమెల్ల నిటవచ్చెనో వాలినిసంహరింపఁగా
నైన విధంబుగా రవిజుఁ డప్పదమందఁగ నయ్యెనో గుణా
ధానము సేతుబంధ మవధానముమై ఘటియింపఁగూడెనో
దేని కతండు గన్పడియె దీరుగఁ గన్నులఁ గట్టినట్లుగాన్. ౨౧౨

క॥ దృష్టివిషసర్పరాజము దృష్టిం బడి మనని జనుని తెఱవున నాయీ
దృష్టి కెదురై బ్రదుకఁ డీ దుష్టాత్ముఁడు వీని కొదవె దుష్కాల మిఁకన్. ౨౧౩

తే॥ నాకు వీనికి నగు ప్రధనంబుడంబు గాంచుచుందురుగావ్రత గదిసి మైన
గొండతల లెక్కియైన సంకోచ మెడలి యెందు దుర్ధర్షు లగు వారి కేమికొఱత.

క॥ సచరాచరలోకంబులు ప్రచితం బగు దేనిఁగూర్చి ప్రస్తావంబుల్
సుచిర మిల నుండుదనుకం బచరించునొ యట్టికృతిన పరఁగింతు నిఁకన్. ౨౧౪

మ॥ అనుచుం బల్కుచునే శితాశుగముల న్వ్యానద్ధభూషంబులన్
గొనయంబందు సమాహితత్వ మొనరం గూడంగ నంకించి యే
సె నరేంద్రుండు నిశాచరేంద్రునిపయిన్ శ్రీమీఱఁగా వజ్రపుం
బను లొప్పన్ క్షతజంబుతోడి క్షతము ల్ప్రాగ్భారముం బాపఁగాన్. ౨౧౫

తే॥ రామరావణు ల్పరఁగింప రాణ నెఱయు బాణము ల్బాణము లొప్పేరు వడయఁజొచ్చె
నవియు విసివి వికీర్ణంబులై కడంగి యిలవయిని వ్రాలె నిస్వనంబులు సెలంగ.

క॥ జ్యాతలనిర్ఘోషంబులు భూతలసంపాతనములు పొడ వగు దీప్తుల్
భూతనివహములకెల్ల నభూతోత్పాతాదిభీతిఁ బుట్టించె సఖీ! ౨౧౬

మ॥ ఎడలేకొక్కడ బాణధార లఱుమన్ హేతిస్ఫురద్దీప్తు లె
ల్లెడలుం గ్రమ్మ ధనుర్విశేషధృతి సాహిత్యంబు చెన్నొంద నే
యెడనేనిం దనరూప మొప్పఁ బిడుగు ల్వినేతరాస్త్రంబు లే
ర్పడ రంహస్సముపేతరామఘనసంరంభంబు మీఱెం బోరిన్. ౨౧౭

—♦ రావణుఁడు పాఱుట ♦—

తే॥ భయము నయ మెడలింప నిల్వ దరి లేక పఱచె రావణుఁ డమ్మేటి పజ్జ గొనక
లాఁతివాతంబు తఱుమ వలాహకంబుభాతి నచ్చోటు విడనాడి పద్మనయన!.

క॥ పిడుగుల కీడుగ నెడపక తోడఁ రెడు నిజశరవితతుల దోషాచరునిం
బడలించి కెడపి తమ్ముఁడు పడియున్న తెఱంగుఁ గాంచి పతి దుర్మనుఁ డై.
తే॥ అల సుషేణునిఁ గాంచి యిట్లనియె వీఁడె శక్తినిర్భిణ్ణహృదయుఁ డై జాడ లేక
ధరణిపైఁ బడియున్నవాఁ డురగమట్లు నాదుశోకంబు పెనుచు సన్నాహమునను.
క॥ ఈ నెఱి రుధిరాప్లుత మై నానెయ్యపుఁబ్రాణ మున్న నయమే తలఁపే
ధ్యానమె శక్తియె యుద్ధాఖ్యానము రుచియించుటయె వికాసం బున్నే? ౭౨౩
మ॥ సమరశ్లాఘి సులక్షణుండు సుజనస్తవ్యుండు శుద్ధాంతరుం
డమరప్రఖ్యుఁడు నాకుఁ గూర్చు నిరతం బన్యాన్యుఁ డీ సోదరుం
డమరె న్నాకని సంతసించితి వనం బాకట్టి నన్గాచె న
న్నము సుప్తిం గొనియే యెఱుంగఁడు సుసన్నాహాఢ్యుఁ డై యెన్నఁడున్. ౭౨౪
ఆ॥ ఇట్టి భక్తు నెన్నియేని జన్మంబులఁ బడయఁగలనె తనకుఁ బ్రాపు దాపు
నితఁడ కాదె యింక నెట్టులేనియు నైన నసుఱు లేల సౌఖ్య మురవదేల.
శా॥ సిగ్గుం గాంచెడు బీర మొల్లగిలుచుం జేనున్న విల్లమ్ములున్
మొగ్గంబోయెడు దృష్టి బాష్పవశఁగా మున్నాడి గాత్రస్రజం
బుగ్గంబట్టిన యట్టిఁ డయ్యెడు సుషుప్త్యన్మార్గమం చెన్న నై
వగ్గంజూపెడుఁ జింత మూర్ఛగొలుపం బ్రాగల్భ్య మూహించుచున్. ౭౨౬
చ॥ అనుచు దురాత్ముఁ డౌ నసురుఁ డట్లభిఘాత మొనర్ప వ్రాలి నె
మ్మన మురువేదనం దెరల మర్మము కర్మ మెఱుంగకున్న య
య్యనిమిషకల్పుఁ దమ్ముఁ గని యార్తి మునింగి తెఱంగు వీడ ని
ట్లనియె విషాదమూర్తి యయి యర్కకులోద్భవుఁ డందఱు న్వినన్. ౭౨౭
సీ॥ తన కేల యుద్ధంబు తగ వొందు కర్జంబు జీవితం బిం కేల సీత యేల
మున్నె రాజ్యమువంక మొనయదు చిత్తంబు నేఁ డట్టిదానిపై నెనరు గలదె
దుష్టులఁ గెడపంగఁ దొడరితి సుజనుల యొత్తిడి గన నైన యుడుకుకతన
నాబహిఃప్రాణంబు నవసె ముఖ్యం బిది యున్న వానికి నొకం డురవు గలదె.
యెందు నేనిఁ గళత్రంబు లెల్లబాంధవులును గాన్పింతురు లభింత్రు పుత్రులు హితు
లట్టిదేశంబె కనుపట్ట దనువుసెడిన భ్రాత సహజన్ముఁ డెచ్చోటఁ బడయఁబడునొ.
చ॥ అడవికి వచ్చునప్పు డటు లాకృతబుద్ధి సుమిత్ర నాకు నే
ర్పడ నిను నప్పనం బిడెఁ బ్రపన్నత నీ కొనగూర్చె నిప్పు డే
కడచిచనంగ నైన నినుఁ గానక యాయమ వల్క నేమనం
దొడరెద నూరకుండి కడు ధూర్తుఁడ నౌదునటోయి తమ్ముఁడా!. ౭౨౯
తే॥ తెలివిగలమాట గా దిది తేటపడియె నిన్నినాళ్లును నాకొలు వీ వొనర్చి
కడకు నాకొఱకై యిట్లు గాసివడిన నిన్ను వీడి యే నీభువి నిలుతునయ్య? ౭౩౦

క॥ అని యెల్లరు నొగులఁగ వగ నను వెడలి వచింపఁదొడఁగె నధిపు ధరావే
ష్టనకలితు సనిశ్వాసుం గని నేర్చి సుషేణుఁ డొప్పఁగా నిట్లు వల్కెన్. ౨౩౧
సీ॥ అయ్యా! నీవెఱుఁగని దఖిలలోకంబులఁ గలదె మాకొజ్జవ కావె తెలుప
నాయగసినయది నయమొప్ప వివరింతు నరక సుప్తునియట్టు లున్నవాఁడు
మృతుఁడు గాఁ డీతండు మేలితే జొప్పెడు వైకృతం బొరయ దేవలనువందు
సుప్రభం బిమ్మోము చూడ్కులతోడఁ బ్రసన్నమై తనరుచు నున్నయదియ
పద్మరక్తములుగఁ బాదహస్తతలంబు లొఱపు నెఱపుచున్న వ్రాజ మెసఁగ
హృదయ మదరుచున్న దిదిగొ యాయుష్మంతుఁ డనుచుఁ బలుకుచున్న యర్థ మొలయ
క॥ లక్ష్మణుఁడు గాఁడె యీతఁడు లక్ష్మీవర్ధనుఁడు నీవు లాఁతుల తెఱఁగై
పక్ష్మలము లైన కన్నుల లక్ష్మము సెడ నీరు నించె లాలితచరితా! ౨౩౩

—◆ హనుమంతుఁడు సంజీవనికై ద్రోణాద్రి కరుగుట. ◆—

తే॥ ఇతఁడు జీవించు సప్రాణుఁడే విషాదమందఁ బోకుము దీవింపు మందఱకును
మేలు గలిగెడు మీఘను మేలుకొలుపఁ దగుప్రయత్న మొనర్పంగఁ దలఁపు మెదను.
చ॥ అని హనుమంతునిం గని మహాత్మక! తెల్పెను జాంబవంతుఁ డీ
వును గనుగొంటి తెచ్చి మముఁ బోలఁగఁ బ్రోఁచితి వప్పు డిప్పుడుం
గొని పఱతేరఁగాఁ దలఁచి గొబ్బున నేగుము దివ్యమోషధుల్
దనరెడు పర్వతోత్తమము దారినిఁ గైకొని రక్షణార్థివై. ౨౩౪
క॥ సౌమిత్రిం బ్రదికింపుము నీమైత్రీప్రతిభ జగతి నెఱపుము నీవీ
స్వామికృప నెగడఁగాంచుము భూమియు నాకసము బ్రొద్దు పొనరెడు దనుకన్.
వ॥ లవణసముద్రము లంఘించి కుశద్వీపంబు దాఁటి యుద్వేలం బైన పాలవెల్లిం గడచి చని యద్దాని కుత్తరంబునం బరఁగు ద్రోణచంద్రగిరివరంబు సేరంగను మం దమృతంబుతోడివ యై మందులతీవియ లున్నయవి విశల్యకరణియు సౌవర్ణ్యకరణియు సంధానకరణియు సంజీవకరణియు నను నవి యిప్పట్టున వలసిన వన్నియు రాత్రులయంద వెలయుంగాని పవలు గానిపింపవు గంధర్వరాజు లచ్చోటనం గావలియుందు రవ్వార లలిగిన వారలతోడం బోరు సంభవించు మఱియు మాయావిశారదు లగు శర్వరీచరు లెచ్చోట నెప్పాట నెదుర్పడు వారో యప్రమత్తుం డవై యేవిఘ్నంబులం బొరయక విభావరి యవసానం బెనయకుండ రవి యుదయింపక యమున్న యయ్యోషధిరత్నంబులం గొనిరమ్ము. తడవైనం గార్యంబు తప్పు; ముప్పు వాటిల్లు; నిచ్చోటున కయ్యది మూఁడులక్షలు నిరువదివేలు నగు యోజనంబులు రాకపోకలకు నించుమించుగా సరిపడియుండు. శ్వేతహరిద్రరక్తవర్ణంబు లగు పర్ణఫలపుష్పంబు లాయోషధిలతామతల్లికలకుం గల గుర్తులు. కీర్తిపరిగ్రహంబునకుం బొడమిన నీ కింతయుం గరతలామలకంబ

మైనను బ్రమాదంబు చొప్పడకుండ నింతలు వివరించినాఁడ లెమ్ము పోయిర మ్మనిన నమ్మాన వేంద్రుండును శ్రీమీఱు సామీరి చిబుకంబు పుణుకుచు నిను మీఱినవా రెందును లేరింతవట్టు నిక్కంబు ద్రోణశైలంబు చక్కటి యోష ధులం దెమ్ము; సోదరుని బ్రాణమ్ము లిమ్ము;నలువురితో నైదవవాఁడ వగు నిమ్ము గై కొమ్మని వేఁడినం బొంగి నింగి ముట్టి శ్రీరాముని పాదారవిందమ్ముల శిరమ్ము మోపి నీదు నానతిమెయిన యరిగి వచ్చెద నచ్చటిమందులెల్లం దెచ్చియిచ్చెద నూఱడిల్లవే యను నాతని నాతరణికులమణి కౌఁగిటం జేర్చి యెల్లవేలుపులు వేల్పుఁ బెద్దయుఁ గామాదియు దిక్పాలకులు నిఖిలభూతంబులు కుమారగణ పతులు సరసిజనాభుండును ని న్నెల్లవేళలం గాపాడుచుండుదురు గావు త మని దీవించి యనిచిన నమ్మహానుభావుండు పయనం బై ఫణిరాజు భారం బదనం బగుడు ఫణంబులు వంపఁ బెనుగొండపై నడుగు లూఁది యైంద్రహస్తిహస్తోపమి తంబు లగు నిజహస్తంబు లాకసం బోరయం బైకెత్తి వాసుకి కెన యైన వాలు వాలమ్ము పెరిఁగి చుక్కలఁ బరామర్శింప మేరుసగమ్ముతో మేలమ్ములాడు మేని మేలిమెఱుంగు లెఱుంగు తెఱంగుపడు చూపరుల కన్నుల మిఱుమిట్లు గొలుప నడు మించుక వంచి మెడ సంకోచించి దృష్టిం బురోభాగంబునకుం బ్రసారించి గిరులు తరులు గూడిరా నభ్రగంగాస్రవంతి యుప్పొంగ దిశలొక్క టం జేరి గుసగుసలాడ లంక కంపింప వార్ధి కలుషింప మహానగరంబులు చలింప నిలింపులు పుష్పవృష్టి గురియింప సురదుందుభులు మ్రోయ దర మందఱుం బాయ నాయపారబలుం డగు మహాబలనందనుండు హరికరముక్తం బగు సుదర్శనాయుధంబు కైవడిఁ గడు వడి నుప్పరంబున కెగసి యప్పథం బారసి కొనుచుఁ బరచుచుండు నయ్యవసరంబున. ౭౩౮

ఉ॥ రామశరాహతిం బెరలి రావణుఁ డంతిపురంబు సేరి పె
ల్లామయమందిన ట్లయిన నామహనీయు ప్రతాప మంతయున్
రామకుఁ దెల్పుచుం దదభిరామగుణోక్తులు వించు నిట్టనన్
రాము జయించు మార్గ మెదిరా! మది రాయిడి నొందె నం చొగిన్. ౭౩౯

మ॥ మును కైలాసము దాల్ప నే నదుమ నమ్మోద మ్మలర్ నన్నుఁ గూ
ర్చి నుతు ల్వేదగతు ల్పొసంగ దనుజశ్రీకాముఁ డొప్పింప నె
మ్మన ముప్పొంగ నొసంగి నట్టి వరము న్మానించి దానం జయం
బొనఁగూడుం దగ వేల్తు నిప్పు డని యవ్యాజం బ్రశంసింపుచున్. ౭౩౯

తే॥ అందు ననవద్యత యుపాధి యంచు విఘ్న మైన నిజహాని నిజ మంచు నరసిపొరు
పంబ కా కొండు పోల దీ సమయమందు నంచు నతి తెల్ప నొను గాదంచు మఱియు.

క॥ తనబుద్ధి నోర్వజించుచు ఘనయుక్తులు బన్నుకొనఁగ గడకొంచు నయం
బను వంచుఁ గా దటంచుక్ దనుజేంద్రుం డుదిలపడెను తలఁపున నుండెక్.
ఆ॥ అంతలోనె చారు లంతయు వృత్తాంతి మరసి యసురనాథుఁ బెరసి దేవ!
హనుమ రాము ననుజ మనుప మహౌషధు ద్రేర నరిగె ననుచుఁ దెలుపుటయును

—♦ కాలనేమి వృత్తాంతము ♦—

క॥ చింతాక్రాంతుండై వాఁ డంతటఁ జనెఁ గాలనేమి యను రక్కసు గే
హాంతమున కొంటిమై దివసాంతమున కనంతరంబ యై తగువేళక్. ౭౮౩
తే॥ అతిథి యై వచ్చినట్టి సురారిఁ గాంచి విస్మయసమన్వితుఁడు భయవిహ్వలుండు
నగుచు మారీచజుఁడు పూజ లాచరించి యంజలి ఘటించి యిట్లనె నమరవంద్య!
క॥ ఆగమన కారణం బెది యాగమనయవేత్త! యాసురాధిప! నాకుక్
వేగమ తెలుపుము విదితుఁడ నై గమనించెదఁ ద్వదీయ మగు నాజ్ఞమెయిక్.
మ॥ అనిన న్రావణుఁ డార్తుఁ డై పలికె నేఁ డాపన్నతం గంటి రా
మన రాధీశుఁడు క్రోధితులం గొని పురి న్ముల్లాడుచున్నాఁడు నె
ట్టనఁ జంపె న్ఘటకర్ణముఖ్యుల రణాధ్యక్షత్వంబు కోల్పుచ్చి యి
ప్డనివార్యం బొకకర్జ మయ్యెది త్వదేకాయత్తమై చొప్పడెక్. ౭౮౬
ఆ॥ ప్రబలశక్తి వైచి పతి తమ్ముఁ బడవైచినాఁడ నతని జీవనంబుకొఱకు
హనుమఁ డోషధిగ్రహార్థంబు ద్రోణాద్రి కరుగుచున్నవాఁడు చుక్న మొప్ప.
మ॥ మునివేషంబున నమ్మహాప్లవగు సమ్మోహంబు నొందించి య
ప్పని చేటొందెడు జాడను న్మలఁచు మాపన్నుండు కాలాత్యయం
బుననే యా నగుగానఁ బొద్దుపొడుపుం బొల్పార వీక్షించి ర
మ్ము నికేతమ్మున కిట్టి మేలు మఱవం బోనున్నయన్నాళ్ళకుక్. ౭౮౭
క॥ అని దనుజేంద్రుఁడు వలికిన విని వెరవరి కాలనేమి వెఱవకె యతనిం
గని యనుపమ మనుభావ్యం బనఁదగు విదితమ్ము వెలయ ననె ని ట్లనుచుక్.
తే॥నాయరసినట్టి తత్త్వంబు నాథ! నీకుఁ దెలుపువాఁడ వినుము దానఁ దెలిఁగుగనుము
హితము గావించుపొంటెఁ గా కిట్టి జతన యుసుఱు గాపాడుకొను నట్టి యుఱవుగాదు
ఆ॥ మున్ను మెకమ కాఁగ మొనసిన మారీచుఁ డెంతలయ్యె నడవి నంతవట్టు
నాకుఁ గూర్చినదియ నాళీకజన్ముండు నేర్చువాఁడు గాఁడొ నియతి లేదో.
ఆ॥ పుత్రపౌత్రబంధుపూరుషు లందఱ హతులఁ జేసి వంశ మడఁచి వైచి
బ్రదికియేని నీవు పడయు సుఖం బేది తెలుపుమయ్య నాకుఁ దేటపడఁగ.
క॥ ఏలా రాజ్యము సీత యిఁ కేలా దేహము జడం బి దేలా చెడ నై
యేలాగున నెఱిగాంచెదు వాలాయము గతి దలంప వలయున కాదే. ౭౯౩

సీ॥ సీతామహాదేవి శ్రీరామునకు సమర్పింపుము న్యాసమ్ము పేర్మి వెలయ
నెల్లరాజ్యమ్ము నీయిచ్చెమ్మె దమ్మున కావిభీషణునకే యందఁజేయు
మేగుము వనమున కెలమి వానప్రస్థ మిమ్ములకెల్ల మే లిమ్మటంచు
శుద్ధజలంబుల సుస్నాతపూతుండ వై నిత్యకర్మంబు లాచరింపు
మట రహస్థ్సలంబునం దాసనపరిగ్రహంబు సంగవర్జనంబుఁ దనర
బాహ్యవిషయపరము బ్రత్యక్ప్రవాహప్రవణ మొనర్పు మక్షగణము నిమిరి.

వ॥ ప్రకృతికన్న భిన్నం బగు స్వాత్మతత్త్వంబు విచారింపు మాబ్రహ్మస్తంబపర్యం
తం బై కననగుచు విననగుచు దేహబుద్ధీంద్రియాదిసంకలితంబు నగుచు నానా
విధంబుల భాసిల్లు చరాచరప్రపంచం బంతయుఁ బ్రకృతియ కాఁ దలంపు
మయ్యదియే మాయ యనం గీర్తింపఁ బడుచుండు దానపో సంసారవృక్షంబు
నకు సృష్టిస్థితిసంహారంబు లొడఁగూర్చు నది నిజరజస్సత్త్వతమోగుణంబులచే
సంవృత యై లోహితశుక్లకృష్ణవర్ణంబుల నొప్పారు ప్రజల సృజించి యందుం
గామక్రోధాదిపుత్రపౌత్రవర్గంబులతోడను హింసాతృష్ణాదికన్యకాసముదాయం
బులతోడను సంలక్షిత యై నిత్యయౌవనవిలాసవిభాసిత యగుటకతన దేవుం
డైన యాత్మేశ్వరు ననిశంబు మోహపరవశు నొనరించి కర్తృత్వభోక్తృత్వ
ప్రముఖంబు లయిన యాత్మీయగుణంబుల నాతనియం దారోపించి యమ్మహా
త్ముని వశ్యునిం గావించుకొని యెడయాక యాతనితోడం గ్రీడించుచుండు.
నిత్యశుద్ధుం డయ్యు నద్దేవుండు బాహ్యవిషయగ్రహణశీలత్వంబునం బరఁగుచు
స్వస్వరూపంబు మఱచి తద్గుణాయత్తచిత్తుం డై ప్రవర్తించుచుండు. ౭౫౫

ఉ॥ ఒప్పరికించు తన్నుఁ గని యోడకు మంచు గురూత్తముండు దా
నెప్పటికీ వధీశ్వరుఁడ వెంచి సుఖించు మటంచుఁ దెల్పుచుం
దెప్పరము న్నడల్చి గడిఁదేర్చుఁ బ్రబోధితుఁ జేసి యప్పుడే
యప్పరమాత్మదృష్టిపరుఁ డై ముదమందును జీవుఁ డమ్మెయిన్. ౭౫౬

క॥ ఆకరుణానిధివలనం బ్రాకృతగుణముక్తుఁ డగుచు రహిఁ జీవన్ము
క్తాకలనఁ దనరు నిట్లని నీ కే నెఱిఁగించినాఁడ నిజవిదిత మొగిన్. ౭౫౭

ఆ॥ నీవనాత్మవిషయ నిరసనంబునఁ బరమార్థతత్త్వసార మరసి ప్రకృతి
కవలివానిఁ గాఁ బరాత్ము నెన్నిభజించి ముక్తిఁ గాంచు మింక మోహ మెడల్చి.

మ॥ నసమర్థుండవ యేని నిర్గుణపరానందాత్ము ధ్యానించి ది
వ్యసురూపున్ హతకిల్బిషున్ శుభగుణవ్యానద్ధు లోకేశ్వరున్
బొసఁగన్ హృన్నలకర్ణికాంతరమునం బూజింపు మేవేళ నీ
కసమానప్రతిభాసమాన మగు భవ్యస్థాన మబ్బుం దుదిన్. ౭౫౮

సీ॥ మణిగణాంచిత హేమమయి మృదులశ్లక్ష్ణ మైన పృథ్విపై నమరువాని
శ్రీజానకీదేవి సింగారపుంగల్మి చెలువెఱింగించు సుస్మితమువాని
హారకిరీటకేయూరకౌస్తుభముఖ్యభూషణస్ఫురణలఁ బొసఁగువాని
విద్యున్నిభశుభాంబరద్యోతమానాంగవీరాసనస్థితి వెలయువాని
సిరికి తావులు నవసరసీజరేఖ లైన కనుఁదోవఁ గరుణార్ద్రి లైనవాని
నఖిలమునిభావ్యు సకలగుణాభిరాము రాము వలగొని ముక్తి బిరానఁ గనుము.

మ॥ వనమాలాంచితవక్షు లక్ష్మణకరవ్యానద్ధకోదండయు
గ్మనిరీక్షాస్ఫురితాఢ్యవీర్యు మహిజాకల్యాణలీలాయితా
త్మనివిష్టస్ఫుటహాసలక్ష్ము సకలాత్మస్థానభూతు న్సదా
త్మ నరేంద్రు న్భజియింపు మాతఁడు త్వదాధు ల్మాన్చు దైత్యాధిపా! ౭౬౧

ఆ॥ పరమభక్తి మహిజపతిని భావించి సేవింపు మతని కథలు విను మనన్య
బుద్ధి నట్టులైనఁ బూర్వార్జితౌఘంబు లడఁగుఁ దూలరాసు లగ్ని నట్లు. ౭౬౨

మ॥ అరిభావం బెడసేసి రాము మహికన్యాసంయుతుం గొల్వు మా
హరి సుమ్మాతఁ డవాప్తకాముఁడు హతవ్యామోహుఁ డానందచి
త్పరిపూర్ణుం డొకరుం డనాదిపురుషప్రఖ్యుండు ప్రాజ్ఞైక త
త్పరుఁ డంచత్కరుణాంబురాశి యనుచు న్భావించుచు న్రావణా! ౭౬౩

క॥ అనుభావ్యభావరూపితు ననామరూపు సుఖరూపు నాశ్రితజనతా
వనదీక్షితేక్షితుం గనుఁగొని శరణను మవల లేవు కొఱఁత లధీశా! ౭౬౪

ఆ॥ నేమ మొన్పఁ గాలనేమి యట్లాడెడు నమృతసన్నిభంబు లయిన నుడులు
వానిఁ బ్రజ్వలించు వలనున కొనఁగూర్చె మసలు నేతఁ బడిన రసము లట్లు.

క॥ కను లెఱ్ఱసేసి వానిం గని యసి చేకొని వికారకలితుం డగుచున్
వినికృంతనపరుఁ డై యిట్లనె గడుసరి రక్కసుఁడు మహామునిపూజ్యా! ౭౬౬

ఉ॥ ఓరి దురాత్మ! నాయెదుట నోటము లేకిటు మాటలాడఁగా
నో రెటులాడె నొ ల్లెడఁగ నొవ్వక గొంటివె స్వాపతేయమున్
దారి దలంగి రాముఁ డొక దైవత మంచు వచించి తింతలోఁ
గూరెనె మర్త్యకింకరత గూల్చెద లే క్షణమాత్రలోపలన్. ౭౬౭

క॥ అని యఱుము నాతనిం గని యనదయ కా ననియె నిట్టు లన నేల నెఱిఁ
వినిచితి రుచింపకున్నం బనివిని యెద నీమెలర్చు పని యేర్పఱుపన్. ౭౬౮

ఆ॥ అనుచుఁ గాలనేమి యను మహాసురుఁ డద్దె తరలి శిశిరశిఖరి దరికిఁ జేరి
యొకతపోవనంబు నూహ్యమై సృజియించె హనుమకృతికి విఘ్న మాచరింప.

మ॥ మునివేషుం డయి శిష్యులుం గొలువఁగా మున్నాడి యవ్వానరేం
ద్రుని మార్గం బరికట్టి యాశ్రమమునన్ గ్రొక్కారు వేదంబులన్

బని లేకే పఠియించుచుం దపము సంభావించుచు న్నిల్చె నే
పున రామాధిపు దూత రాక నెదకు న్బోధించు దుర్వృత్తితోన్. ౨౨౦

చ॥ అటఁజని కన్గొనె న్వనచరాగ్రణి వాయుతనూభవుండు దా
దటుకున భవ్య మాశ్రమపదంబు మనోజ్ఞతరంబు భూవిశం
కటమణిభూషణాయితము గర్బురకల్పనగోపహాసివి
స్ఫుటకుటజప్రతత్యుచిత భూరితపస్విగుణానుభూతమున్. ౨౨౧

తే॥ కాంచినంతటనే పులకాంచితుఁ డయి మున్నరసినది గా దిది మొనసె నిప్పు
డబుర్బంబులకెల్లఁ దా నిబ్బరంపుటాస్పదం బన నగుచు నియ్యాశ్రమంబు. ౨౨౨

క॥ విన్నది గా దిది యెన్నఁడు గన్నది గా దొకనిచేతఁ గల్పిత మై యి
ట్లున్నదియో మతిభ్రమమో తిన్నని మార్గంబు దప్పి తెరలితినొక్కొ. ౨౨౩

క॥ అని తనలోఁ జర్చించి పవనసూనుఁడు బుద్ధిశాలి వల నిటు మదిఁ గా
ర్చెను గా దని పెడదారిం జన నేల? యనిష్ట మొదవఁ సంభ్రమ మేలా? ౨౨౪

ఆ॥ తపసి యాశ్రమంబు దద్దయుఁ గనఁగాంచి మునికి మ్రొక్కి సలిలములు గ్రహించి
యవల సేదదీఱ నరుగుదు ద్రోణాద్రి కట్టులైనఁ గృత్య మనుపహతము. ౨౨౫

క॥ అని నిశ్చయించి చేరం జని తనబీరంబు లావుజతనయు విదితం
బును నెఱయఁ బ్రవేశించెఁ బవననందనుఁ డవ్వనంబు వనజాతాక్షీ! ౨౨౬

సీ॥ కదలికాపనసామ్రఖర్జూరనారంగనారికేరముఖద్రుమానందితంబు
వల్లరీతల్లజావేల్లితగురుతరతరుకుంజగృహధర్మసుఖరుచిరంబు
నిర్మలరసయోగనిష్ఠితసరసీసరోజాతలక్ష్మీవిరాజితంబు
నిర్ముక్తరిపుభావనియతిమన్మృగగణద్వంద్వనిర్ద్వంద్వతాతాత్త్వికంబు
మాయికము సర్వతోయోజనాయతంబు నౌ తపస్విజనోచితమాశ్రమంబుఁ
జొచ్చి కనుఁగొనె జగదేకశోధనుఁడు యశోధనుఁడుహాఁడు సలలితశోభనాంగి!

మ॥ శుకము ల్శారికలుం బఠించు శ్రుతిమత్సూక్తు ల్ప్రశంసింపుచున్
సకలాజ్యాహుతిమంత్రతంత్రనిచయోత్సాహంబు చర్చింపుచున్
ప్రకటోల్లాసనహంససారసరవప్రస్తార మూహింపుచున్
వికలంకుం డటఁ బోయె నూతనగుణావిఖ్యాతి భావింపుచున్. ౨౨౭

క॥ అతఁడు తనదరిఁ జేరఁగ నౌ తఱి నాతక్కులాఁ డహంకృతిమెయి ను
స్నీతము శివపూజనము నిరాతంకత నెఱపె నైంద్రమగు యోగమునన్.

—♦ కాలనేమి హనుమంతుని వంచించుట. ♦—

ఉ॥ ముక్కున దృష్టి నిల్పి బలుమూఁపులు వంచి పొసంగ నిక్కి పెం
పెక్కిన పేర్లపూస లురవేర్పడఁ ద్రిప్పుచు భూతిపూఁతలున్

జక్కని యక్షమాలికలు సన్నని మేనుఁ దపశ్శ్రమంబునన్
నిక్కువము న్వచింప రజనీచరమౌని దొలంకె నద్దెసన్. ౨౮౦

క॥ అనుసృతులై వానికిఁగల వినేయు లటు మంత్రతంత్రవిధు లొనరింపన్
దనుకక స్వాధ్యాయంబులఁ దనరారఁగ హనుమ గాంచి తద్దయు మొనసెన్.

ఆ॥ పెద్దతబిసి యగుచుఁ బెనుఁబొందినాఁ డీతఁ డెవ్వఁడేని నెట్టులేని ననుచు
ననుచుభక్తి మెఱసి నమ్రుఁడైనాఁడు వాఁ డసురమాయ లివియు ననక దొఱసి.

ఉ॥ రాముని బంటువాఁడ మునిరాజ! హనూమదుపాహ్వయుండ బ
ల్నేమము గొన్న వాఁడఁ దన నేత పయోనిధిజాడఁ బంపఁగా
నీమెయివచ్చినాఁడఁ గృప యిన్మెనయం జననీక వేఁపఁగా
నీముఖ మందినాఁడ నను నెమ్మి దగం గని యాదరింపవే. ౨౮౩

తే॥ నిర్మలము లగు తోయము లెన్నమకుచున్నవాఁడ నీదయ నవి గల వల నెఱింగి
కొఱలు బలుడప్పి దీఱంగఁ గ్రోలువాఁడ నవలఁ గలయర్థ మీూ వెన్న నరయువాఁడ

ఆ॥ అనిన మాయదారి ముని యిట్టులనె ఖేద మెంచనేల విమల మీాకమండ
లూదకంబు గొనుము మాదిరి గనఁగాంచి యవిగొ మధురఫలము లవలఁదినుము.

క॥ ఈనాఁటి కిచట నిలిచి సుఖాన శయింపు మొకవార్త గలదేని నటం
బొనగు క్షీరాంబుధికిన్ నేనే యెఱిఁగించువాఁడ నీ కగువలనుల్. ౨౮౬

క॥ ముక్కారు లెఱుఁగువాఁడన్ దక్కొన కరయంగ నేర్తుఁ దలఁపులఁ మెలఁపుల్
మిక్కిలికూరిమిఁ రాముని చక్కటిఁగల దతని నెపుడు సంభావింతున్. ౨౮౭

ఉ॥ వంచనఁ బొంచి సీత జనవంద్య హరించెను రావణుం డటన్
ద్రుంచెను వాలి నర్కసుతుఁ బ్రోఁచెను రాముఁడు క్రోఁతిమూఁకలన్
గొంచు మహాబ్ధిఁ గట్టి నెఱ కోలలసేసెను గూల్చె నుగ్రతన్
మించి యరాతిసైన్యముల మేఘనినాదునిఁ గుంభకర్ణునిన్. ౨౮౮

ఆ॥ అవల వగచి యసురుఁ డతికోపమున శక్తి వైచి రాముతమ్ము వసుధఁ గూల్చె
నతని మనుప నిట్టు లరుదెంచితివి యొరు లైనలేరు నన్నుఁ గాంచి తీవు. ౨౮౯

ఆ॥ పుణ్యమతివి గానఁ బొడవగు మంత్రము దెలుప నుంటి నిందె తేటపడును
మంచిమందు లొక్కమాత్రన లంకలోఁ జేర్చువాఁడ నింత చింతయేల. ౨౯౦

సీ॥ అనిన రాజానుజుం డచ్చోటఁ బడియుండ నాయమా? నా కివ్వనమున నిల్వ
రుచియించునే? పండ్లు రుచిరంబులైననుఁ గన్నులు మోడ్ప నా గతియు వలనె?
మిక్కుట మీాతృష్ణ మెయివెంచి వేఁపంగ నడిగితిఁ దోయ మీ యర్థమునను
గురుణించితివ యేనిఁ గా దొక్కపాటి దా జలము నదీనదసరసులందు
పొరిది నొకఁడు నాకుఁ జూపిన నిచ్చమైఁ బొసఁగఁ గ్రోలి ప్రొద్దు పొడువకుండు
నంతలోనె మందు లరసి కొంపోయెద నధిపుప్రాణరక్ష కతిరయమున, ౨౯౧

టొనఁగూర్ప నందంబులెల్ల నొక్కరుం డైన చందంబున నసంగి పెనంగి వింతకాంతులం బురస్కరించుకొని యాకసంబున మేలుకట్టులు నేల నెలకట్టులుం గావింప సేవింప నెదురుచూచున్నయదియపోలె నాసరస్స్రవంతి రంగదభంగతరంగసంగతంబు లగు భ్రూవిలాసంబుల సంజ్ఞానంబునం దనమలకలు వావవే యని యప్పవమానసూను నాహ్వానించు తెఱంగునం జూపట్టి నట్టియెడ. ౭౯౪

క॥ దానిం గని సమ్మోదము మే నొందెనొ నాఁగ నాసమీరతనూజుం
డౌనే యని చేరం జని లోనికి డిగ్గి రసపానలోలాత్ముం డై ౭౯౫

మ॥ కనుదమ్ము ల్మొకుళింపఁజేసి మహిపైఁ గార్కొన్న జీమూతమో
వనమాతంగమొ నాఁగఁ దృష్ణ దెరల న్వాఃపూరముం ద్రావెఁ దొ
ల్తనె పై కల్క మెడల్చి యొంటి గెడపక లా వొక్కఁడే తోడుగా
ననవద్యాత్ముఁడు వాఁడు విశ్వభరణవ్యామోహవశ్యాత్మికా! ౭౯౬

—♦ హనుమంతుని మొసలి పట్టుట. ♦—

ఉ॥ పుట్టుకసంద్రమందుఁ బడి పోలని యిచ్చఁ దొఱంగ లేక తా
నట్టె కదర్థపుం రసము లానెడు జీవునిఁ బొంచి మాయ యి
క్కట్టొనరింపఁగా నఱుము కైవడి బల్విడి పర్వ నాతనిం
బట్టె నొకర్తు పెన్మకరి పారము లేని మహాబలంబునం. ౭౯౭

ఆ॥ పరఁగ వచ్చి తనను పాదయుగ్మముఁ బట్టి యలవిగాని యర్థ మడుగఁదలఁచు
గాఢసత్త్వ నక్రి ఘనరసాసక్తుండు వాఁడు చూచె వికచవనజనయన!. ౭౯౮

క॥ వాల మ్మను త్రిదశేంద్రుని వాలమ్మున దాని పండ్లు వడి డుల్చిన న
క్కాలమ్మున నవి వ్రాలె విశాలమ్ము సురారి యశము శకలము లనఁగన్.

ఆ॥ దాని నాల్కఁ ద్రెంచెఁ దద్దయు సునిశితకరరుహములఁ జిలువ గరుడికరణి
నదియు శాపభోగ మడఁచు మం దని గాలిపట్టిఁ బట్టి ద్రింగఁ బరఁగుటయును.

ఉ॥ కర్జము వ్రొవ్వునో యనెడు గాఢవిషాదము గ్రమ్మఁ దోఁచె వి
స్ఫూర్జితమూర్తి వాఁ డొడలు సూక్ష్మతరం బొనరించిచొచ్చె స్వీ
యార్జన మొప్పుచుండ వదనాంతరమార్గమున న్గడంగి యా
వర్జితఁ జేయ నెంచుచు బ్రవర్ధితగర్భగుహాంతరాళమున్. ౮౦౧

ఆ॥ ఆస డీఱ దొరికె నాహార మని తృప్త యై జలాంతరమున కరిగె మకరి
గరళ మట్టు లోనఁ గళవళ మందింపఁ దొడరె ననిలు కూర్మి కొడుకు గడఁగి.

చ॥ వెరవున నెమ్ముల న్విఱిచి వేగమె ప్రేవులు ప్రోవొనర్చి లే
నరములు ద్రెంచి యాంతరపు నాడికలం బెకలించి మాంసముల్

దరమిడి ముద్దసేసి యది తాళఁగఁ జాలక నోరు విప్పఁగా
బరవడిఁ ద్రోఁచె నెల్ల వెలి బాఱఁ గొలంకు కలంక మందఁగాన్. ౮౦౩

ఆ॥ నెఱకు లెల్ల నొవ్వ నెమ్మది సెడ సంగసంధు లెడల బరులు సతికిలఁబడ
నోట నల్ల లెడల నుగ్గునూచం బగుమేను వీడ కసుఱు మెలఁగుచుండ. ౮౦౪

ఉ॥ పైపయిఁ ద్రోఁచు మూర్ఛల విపాకమునం బడి దుశ్చికిత్సితం
బోపఁగరాని రోగ మిది యూరక పోబడి తిండి గాదు నా
పాపము పండె మిత్తి కొగిఁ బొల్పడితి న్వెరవేద నంచు హృ
త్తాపముతోడ నెక్కొను నదద్భుతరాపద బమ్మరింపఁగన్. ౮౦౫

ఆ॥ జలధి బాడబాగ్ని చందంబు గృహదాహకాగ్ని తెఱఁగు స్వాంబరాంతరహి వి
ధంబు నంతవట్టు దనయంద చూపట్ట దాని యు బ్బడంచి తనువు వెంచి. ౮౦౬

చ॥ కరచరణప్రహారతలఘాతనఖాస్త్రవిదారణాతిని
ష్ఠురతరముష్టిపాతముల సొమ్మసిలం బొనరించి దాని ను
ద్ధురగతిఁ దాల్చెఁ దద్రుధిరధూసరితంబు సుఫేనిలంబు నా
సరసిజినీతటంబునకు స్పర్శనసూనుఁడు శౌర్యధుర్యుఁడై. ౮౦౭

క॥ తలపగుల నడఁచి మై వ్రక్కలుసేసి సమీరసుతుఁడు గ్రక్కున వెడలెన్
వలనొప్ప రాహుముఖనిర్గలితప్రతిపన్నతారకాప్రభుఁ డనఁగన్. ౮౦౮

ఆ॥ సొరిది లోతు గలిగి శుద్ధాంతరంగుఁడై రక్తసిక్తుఁ డగుచు రాణఁ దనరె
వఱలు తేజ మొప్ప వాఁడు బాడబశిఖల్ నెఱయ మెఱయు నీరనిధి యనంగ.

తే॥ తమముఁ దూటాడి వెడమంచు దలఁగఁద్రోఁచి యుదయమందిన ఖరకరునోజ వెలయ
గ్రాహిదేహం బగల్చి నీరంబు వెడలి వచ్చి యతిదుస్సహుండయ్యె వాయుసుతుఁడు.

— ధాన్యమాలిని యుదంతము —

మ॥ వనికై వచ్చు జలాధిదేవతయొ తద్వాఃకేళికిం జొచ్చు కా
ననలక్ష్మీసతియో సురాధిపతిమాన్యశ్రీయొ పుష్పాస్త్రుపైఁ
గన లొప్పారఁ దలంగి నట్టి రతియో కావచ్చుఁబో నాఁగఁ బా
వనికిం గన్పడె నయ్యెడన్ లలితదివ్యస్త్రీలలామం బొగిన్. ౮౧౧

తే॥ ఎంత పరుసఁదనంబున నంతపడెనొ యంత కెక్కుడై లావణ్య మచ్చుపడఁగ
నయ్యెఁబో యయ్యదానిక య్యబ్జభవుఁడొ పయ్యెరవ రాలపంట మేల్పసదనంబొ.

క॥ అనవద్యాంగికి సిరి చయ్యన వచ్చెను సొమ్ము లొదవె నంబర మొప్పెన్
గననివినని కీవియు దిగ్గనఁ బొడమెన్ బావనాత్మ గరిమఁ బురంధ్రీ! ౮౧౩

ఉ॥ పయ్యెదమాటున న్నుచులు పర్వ యపూర్వత నుగ్గడింప నా
నెయ్యపుఁబ్రోవు లయ్యురము నీటులకూటువ లుల్లసిల్లఁ దా

నయ్యెడ భాసమాన మగునంబరయానముపై వెలుంగులం
దొయ్యన మించి కాంచె ఘను నుజ్జ్వలతేజు మరుత్తనూజునిన్. ౨౧౪

తే॥ కను లనెడు వింత మోహంపుగనులనుండి వెడలు చూడ్కులు రతికాంతువిశిఖములుగ
జిగినగవువెన్నెలల మోము సిలుకుచుండఁ గులుకులాడి మారుతితోడఁ బలికెనిట్లు.

సీ॥ వచ్చితే? పరిపాటి వలనుమీఱిన ఘోరకష్టంబు కడముట్టఁ గలుగు సుఖమ!
మెచ్చితే? తపముల మేర తపస్వుల సామి సేర్చిన సహాసంభ్రమాజ్ఞ!
వ్రచ్చితే? దుస్సంగవారవాణము దుష్టతనువు విదారించు ధర్మశక్తి!
యిచ్చితే? యభయ మిల్లిలమి సంభావించి పురుహూతుఁ గూర్ప నౌపూలపూజ!
నాయ మరసితె? నన్ను వినేయురాలిఁ జేసితే కృతు లందెదె వాసిఁగొనెదె
వాయుదేవప్రసాదమా! శ్రీయుతాంజనాంబికాగర్భశుక్తిముక్తాఢ్యఫలమ! ౨౧౬

క॥ నా కొనరించితి మేలే నీ కెఱిఁగింపంగవలయు నెఱి గల దితనిం
బోకార్పుము ముని యన కటఁ బోకఁగనుము ద్రోణగిరికిఁ బున్నెము వెలయన్.

ఆ॥ మాయలాఁడు వీఁడు మాఱటమారీచుఁ డతనికొడుకు వీని నంపినాఁడు
పొలసుదిండిఱేఁడు పూని నీకర్జంబు గడపఁ గంకణంబు గట్టినాఁడు. ౨౧౮

ఉ॥ నమ్మకుమయ్య! యిత్తపసి నాకసపత్నుఁడు కృత్రిమాశ్రమం
బిమ్మెయిఁ బన్నినాఁడు పతి యీతనిఁ బంపెడుచోఁ దలంచి నా
యిమ్మెఱిఁగించె నం దనుప నేడ్తెఱ గ్రాహియ గీటడంచులే
పొమ్మని వీఁడు నత్తెఱఁగు పోలు నటం చొనరించె నిత్తఱిన్. ౨౧౯

క॥ పావనివి పావనాత్ముఁడ వేవలనున నేనిఁ జిక్క వేరికి దేవ
శ్రీవిత్తుఁడ వట్లగుట న్నీ వీకల్కంబుఁ బాప నేర్చితి తండ్రీ!. ౨౨౦

క॥ ఈ వరసినదియ యిమ్మాయావనముం గడచి యుత్తరాశకుఁ జన నా
త్రోవ పయోబ్ధికి ద్రోణగ్రావమునకుఁ జనఁగ నీకుఁ గన్పడు ననఘా. ౨౨౧

క॥ అనినఁ జమత్క్రియమాణం బన నగు చిత్తంబు హర్ష మందఁగ నమ్మా
నినిఁ గనుఁగొని ఘనతేజుం డనె ననిలతనూజుఁ డరయ నగు నిది యనుచున్.

క॥ ఏకతమున నిక్కాలనున నేకతము వసింపవలసె నీవు మకరివై
నా కెఱిఁగింపఁగ వల నగు నో కాదో తెలుపు మువిద! యుచితం బైనన్. ౨౨౩

ఆ॥ అనినఁ ద్రిదశకాంత యాతనిఁ గనుఁగొని నీకుఁ దెలుపరాని నెఱియుఁ గలదె
యన్న! నీదుపాద మందితి గురుఁడవ వినుము నాదు కథ సవిస్తరముగ. ౨౨౪

క॥ నాపేరు ధాన్యమాలిని యేపునఁ దనరారుదాన నింతులలోనన్
గోపురమె కాపురముగద యాపగిదిన్ బ్రహ్మపురికి నరుగుచునుండన్. ౨౨౫

మ॥ ఒకనాఁ డిందుకలాధరుం డగజతో నొప్పారుచు న్నాదు లా
స్యకలాభిజ్ఞత నుల్లసిల్లి కృప దివ్యం బైన యానంబు తా

వక మాఁ గావృత మం చొసంగఁ గొని చెల్వం బొప్పఁగా దాని నె
క్కి కురంగాక్షులతోఁ జరించితి ధృతిం గీల్కొన్న చిత్తంబునన్. ౪౨౬
ఆ॥ ఇచ్చ వచ్చి నట్టు లెల్లలోకంబులఁ దిరిగితిరిగి యొక్క దివసమునను
నీజలాశయమున కేతెంచి జలకేళిపరత నుంటిఁ గర్మబంధమునను. ౪౨౭
శా॥ శాండిల్యుండు తపోధనాగ్రణి వివస్వత్తేజుఁ డవ్వేళ న
ట్లుండంగా ననుఁ గాంచి పంచశరుఁ డుద్యోగింపఁ దత్కాండముల్
తండాతండము లై పయింబడఁగ నిద్దం బౌ నెఱిం బ్రోఁచి పో
కుండం జూచుచు నిట్లు పల్కె దృఢరాగోన్మత్తచిత్తాబ్జుఁ డై. ౪౨౮
ఆ॥చూడ్కు లనుపు మిందు సుందరి! చిఱునవ్వు మోము గాంచినంత మొక్కవడు నె
పడఁతి! మునులతోడఁ బలికిన పాపంబె తామసింపవలదు తలిరుఁబోఁడి!. ౪౨౯
చ॥ ఒడిసెడు స్మారవహ్నిశిఖ లోర్వదు మేను పిపాస పుట్టెఁ ద
ల్లడపడెఁ జిత్త మిమ్మొయి మెలంగు మెడందఁ దడిం దలంగనీ
కిడు మమృతంపుబావి నుతి కెక్కిన మోవి ప్రసూనవల్లరు
ల్దడవెడు బాహువు ల్సొనిపి దయ్యకము న్నడసేర్చి భావినీ!. ౪౩౦
ఆ॥ మదనబాణపాత మగ్నుఁ దపస్వి న న్మనుపు మొందు తలఁపు మలయనీక
ప్రాణరక్షణంబు పరమధర్మం బని నీ వెఱుంగవే వినీలవేణి! ౪౩౧
చ॥ అనవుడు మాని గన్గొని మహాత్మ! తపశ్చరణంబు వీటఁబు
చ్చిన ఫలమేమి సిద్ధులకుఁ జేటులు పాపపదంబు లార్తిసం
జననము లేమెడన్ సురతసౌఖ్యము లిట్లని మిమ్ముఁబోఁటి స
జ్జను లెదమెచ్చ రేఁ దెలుపు జాడకు నెమ్మది నెట్టు లెంచెదో. ౪౩౨
క॥ అని పలుక వ్యధితుఁ డగుచున్ మనసిజపీడితున కొండు మాట పొసఁగునే
నినుఁ గవియుటె జపమును దపమును ననుఁ దెరలింప కెనయ మునుకొనుమబలా!.
ఆ॥ తుంటవింటివాఁడు తుంటరితనమునఁ బూవుటమ్ము లేసి పొలియఁజేయఁ
జొచ్చెఁ దాళఁజాల పొరిది నీనెనరున నుసుఱు లున్న సుకృత మొందనేర్తు. ౪౩౪
ఆ॥ కాముఁడనెడు పాము గఱచె మందిడకున్న నావిషంబు దాని కదె శమించు
టరయఁ గలదె సుఖరసాస్వాదమునఁ దేర్పు మొందు పోకఁబోకు ముదిద!యనుచు.
క॥ జాలింబడు తబిసిం గని జాలింగొని సామి! యే రజస్వల నైతిన్
దాలిమి మూణ్ణా ళ్ళున్న న్నాలవనాఁ డిచ్చదీఱ ననిచెద ననినన్. ౪౩౬
తే॥ తాపసుం డొప్పుకొనిన నత్తావు వీడి గంధమాదనమున కేగి క్రమ్మఱంగ
వత్తు నని చిత్తమున నుంచి వఱలుచుంటి నాటపాటల మేటినయ్యాటములను.
శా॥ ఆ రే యుద్ధతుఁ డైన రావణుఁడు సైన్యాటోప మొప్పార ది
క్ప్రారంబు ల్దెరలంగఁ జేసి జయము న్గైకొంచుఁ దో నగ్గిరిం

జేరన్వచ్చెను బ్రాక్తనాఘతతి నన్ జిట్టాట లాడింపఁగా
నై రానోపు ననంగఁ దన్నగగుహాభ్యంతస్థ్సలు బ్రోమ్మయంగన్. ౮౩౮

ఆ॥ అచట భూతవితతు లార్వ మెకంబులు పాఱుజూడ సురలు పల్లటిల్ల
విడిసె సేన లచట విశ్రుతుం డవ్వాఁడు మలసెఁ బుప్పటీరమ్ముల వసింప. ౮౩౯

మ॥ చలచిత్తుం డయి యొక్కచోట నిల కాశంకించి యేజాడ నే
లలన ల్లుబ్ధమ్ములువారొకో యనెడు హ్లాల్లత్వ్యంబున న్వచ్చె నే
నెలమిం దీఁగెలతూఁగుటుయ్యెలపయిన్ హేలాగతి న్నిల్చి నే
యలసల్లాలసవృత్తిదుర్లలితక్ష్మాలస్య నై యుండఁగన్. ౮౪౦

తే॥ ఇంక నేఁ దెల్పఁ బనియేమి హీనబుద్ధిజాతి యజ్ఞాతి కాదె నిశ్శంకవృత్తిఁ
జేరి కులగోత్రసంపద లెస్పి మారుకోల్తలం బడి గవయంగఁ గోరుటయును.

ఆ॥ తగదు సేర నేఁడు తలఁగినదాన నీయాన యనిన వినక యట్టు లైనఁ
దద్ద లెస్స యనుచుఁదార్కొని వాఁడు రమించె నళిని గజమలంచుగతిని. ౮౪౨

క॥ పేరున నతికాయుం డాకారం బేమనఁగ వచ్చుఁ గ్రౌర్యము ఘన మ
వ్వీరవరుఁడు సద్యోగర్భారూఢిం బొడమె నిర్జరాంతకుఁ డగుచున్. ౮౪౩

క॥ వానిం గొని తృప్తిం గని యానిర్జృతిప్రభుఁడు వోవ నావలిదినముల్
నే నడిపి స్నాతనిర్మలమానితధృతవస్త్రమాల్యమలయజ నగుచున్. ౮౪౪

చ॥ మునివరుపాలికిం జని యమోఘవచస్కున కల్ల మ్రొక్కి యా
దినములు మూఁడునుం గడవఁ దేఁకువమై నరుదెంచితి న్వెసన్
ఘనతరపుణ్యమూర్తి! ననుఁ గైకొని యేలుకొనంగఁబోలు నీ
మన మలరంగ నాఁగ ననమానమతిం బరికించి యేడ్తెఱన్. ౮౪౫

మ॥ నను వీక్షించి కృతవ్రతాచరణ వైన న్స్నాత వై యింక యా
వన మెవ్వాని కొసంగి తెవ్వఁ డిటు నోవ్వం జేసె నిన్నట్టివాఁ
డనిలోనన్ సహపుత్రమిత్రుఁడు స్వసైన్యవ్రాతుఁడుం గా వినా
శనముం గాంచునుగాత శత్రువులు దుస్సాధుల్వెన న్మాగఁగన్. ౮౪౬

ఆ॥ ఇందె యుండ కొక్కయెడ కేగి నన్ను వంచించి యన్యుఁజేరఁ గాంచి తీవు
ఘోరమకరి వగుచు వారక యిజ్జలాశయము సొచ్చి మనఁగ జనెదుగాత. ౮౪౭

వ॥ మోహవిజ్ఞానంబులకు దర్పేంద్రియజయంబులకు భోగేచ్ఛానైస్పృహ్యంబులకు ననురాగవైరాగ్యంబులకుఁ దృష్ణానిర్లోభత్వంబులకు జనసంబాధరహస్యంబులకు నహంకారశాంతత్వంబులకు మదౌద్ధత్యాప్రమాదంబులకుఁ దమస్తేజంబులకుఁ బావకసలిలంబులకు నెందునుం బొం దుండునే? కులశీలదయాసత్యశౌచపరహిత సద్భావశమదమధర్మపుణ్యచారిత్రవివేకబుద్ధిభయసత్త్వగుణంబులు తెఱవలున్న పొరువునం బోవు. నిరయమార్గంబులు మహాపాతకంబుల పొలిమేరలు ననునివి.

నారీశబ్దార్థంబులునాఁ బరంగు నిట్టి చర్మమయపుత్రికలయం దొకింతయేని సౌఖ్యంబు గలదే? వల దేనుఁ దేఁకువసెడి నీకుం గైవసం బైన మానసంబున దూషిత వర్తనుండ నైతి నక్కటా యని వితర్కించుచున్న యమ్మునివరేణ్యునిం గాంచి కరయుగళంబు మోడ్చి వడవడవడంకుచు నల్లన నే నిట్లు విన్నవించితి.

మ॥ అలఁతిం బోయెడువాఁడు గాఁ డసుర దౌరాత్మ్యంబునం గ్రాలుచుఁ
బలిమిం బట్టి పరాభవించె నొకటం బ్రచ్ఛన్నుఁడై యుండి య
వ్వల నేతేరఁదలంచి చన్నకతన న్పాటిల్లె మోసం బిఁకే
వల నెంతో కడె శాపవార్ధిఁ గడవన్ వాక్రుచ్చి నన్బ్రోవఁగన్. ౧౯౧

ఆ॥ నీకుదాస్య మొలయ నే నున్నదాన నీదాన నీదుపాద మాన దోద
యానిధీ! తలంపు మంతయు శరణ మీవనుచు మ్రోలవ్రాలి యడలుటయును.

క॥ జాలింబడి కరుణాంబుధిఁ దేలుచు నమ్మౌనివరుఁడు డీలని దిదినీ
కీలాగున ననుభావ్యం బై లావఱఁజేయు మీఁద నగు కాలమునన్. ౧౯౨

ఉ॥ రాముఁడు ఘోరపాతకవిరాముఁడు మంగళనాముఁ డాగుణో
ద్దాముఁడు వంప దాశరథితత్పరతాంచితుఁ డేగుదెంచు సు
త్రామనుతుండు వాయుజుఁడు రాజిలు తత్కృతిపొంటె నాతఁడే
నేమమునం దొలంప నగు నీదగు నేరము దుశ్శరీరమున్. ౧౯౩

తే॥ అతని పాదము లప్పావనాత్మతనువు సంటినంతన నీయఘం బడఁగు లెమ్ము
పొమ్మనుచు నానతిచ్చి తాఁ బోయె మౌని నలనుమీఱిన గంగాస్రవంతిదరికి.

క॥ ముని యనిన యత్తెఱంగున మనిచితి నాతండ్రి! తొంటి మహిమం గంటిన్
జనిమెద నీదయ నెప్పుడు ననుభావ్యం బైన యాశుభాస్పదమునకున్. ౧౯౪

—◆ హనుమంతుఁడు కాలనేమి మాయలసడల్చి చంపుట. ◆—

తే॥ అని జగత్ప్రాణనందనుఁ డనుమతింప నతనిఁ గొనియాడి దీవెన లర్థి నొసఁగి పోయె సురకాంత. యిది యింత పోలు ననుచు వింత కలరుచు నచ్చోటు వెడలివచ్చి.

క॥ అక్కాలనేమిఁ దఱిసిన ముక్కిడీ యవ్వాఁడు వేగమొనసెద నని నీ
వక్కాలనిదరికిఁ జని రా వక్కారణ మేమి? తలఁగితా? పరిపాటిన్. ౧౯౫

తే॥ నీకు సంజీవనీమంత్రనిష్ఠఁ దెలుపువాఁడ శిష్యుండ వై శుద్ధి వఱల నిమ్ము
చేరి గురుదక్షిణ యటన్న సిద్ధుఁ డగుచుఁ గోప మడరంగ నాతఁ డక్షూళఁ గవిసి.

క॥ ఇచ్చెద గురుదక్షిణ నీ విచ్చమెయిన్ గొను మిఁకేల యెడముఁగ నోపా
టచ్చరజటిలా! యనుచున్ గ్రచ్చరఁ దాఁకించె నెడఁద ఘనతరముష్టిన్. ౧౯౬

తే॥ కాలఁ దాచినఁ గ్రోధంబు గదుర నెగయు కాలసర్పంబునోజ రక్కసుఁ డెదిర్చి
వేసెఁ బృథుఖడ్గమున గాఢవేగ మొప్ప నంజనాగర్భరత్నంబు నధియురమున.

మ॥ అసిఘాతం బొకలెక్కసేయ కతఁ డాహా యెందుఁ బోవచ్చు నీ
కసురా! యింకిట నంచుఁ జేరి చటులం బౌ ముష్టిపాతంబునన్
వెస నవ్వాని మొగం బగల్చి పయిపై వ్రేటుల్ని గుద్దంగ నూ
డుసు అల్లాడఁ దలంగి పక్షివిభుఁడై యుప్పొంగి పై వ్రాలుచున్. ౪౬౦

తే॥ చట్టుపలగాడ్పు పరఁగం బ్రసక్తి నేచి చరణనఖముల ముక్కునఁ జఱచి కఱచి
యుక్కివంబున నొప్పింప నుక్కుతునియ యాప్రభంజనసూనుఁ డనాదరమున.

చ॥ పిడికిలితాఁకిడిన్ బలువు పెంపఱఁ ద్రోటి యగల్చి వాలధిం
బొడవున కెత్తివైచి వెడ పుల్లలుగా నెముక ల్విడల్చి చో
ప్పడు నెఱక ల్వికల్చి యొక పట్టున మేదిని ద్రోఁచి తాఁచి పే
రడచెడు నంతలో దనుజుఁ డబ్బుర మొప్పఁగ సింహరూపుఁడై. ౪౬౨

మ॥ సటల న్మబ్బులఁ దోలుచుం గడఁకమై సామీరిపై మీఱి మా
ఱటవజ్రాబులు శాతశస్త్రములు కోఱ ల్గోళ్లుఁ దత్కాయ మం
తట గాయంబులు గాఁగఁ జొన్పి కడిమిన్ దర్పించి యార్వ న్వనీ
ఘట లెల్లం దెరలెన్ దిశాగజము లాకంపించె నొక్కుమ్మడిన్. ౪౬౩

ఆ॥ శరభమట్లు వాని సరభసంబునఁ జేరఁబాఱి గాఢముష్టి బలువడంగఁ
బొడిచి కూలవైచి పొలివోవఁ దర్జనభర్జన ల్సెలంగఁ బరఁగుటయును. ౪౬౪

తే॥ అతఁడు సుగ్రీవుఁడై తోఁచి యన్న యేల! యిట్టికష్టము ల్సామిత్రి యెనసెసంజ్ఞ
రాముఁ డనుపంగ వచ్చితి రమ్ము ప్రీతి పొసఁగ నన వానిచెయిదము ల్పోలఁగాంచి.

క॥ అసురాధమ! యొడలునఁ గల పసనెడి వెడమాయ లిట్లు పన్నఁదొడరిన్
గసిమసఁగక పోనిత్తునె వసుమత్సుతు పురము చేరువయ నీ కింకన్. ౪౬౬

క॥ అని కాలదండనిభ మగు తనదు భుజాదండ మెత్తి దనుజునురము వ్రేఁ
టునఁ బగుల వైవ వాఁ డొయ్యన ధరఁబడి నోట రక్త మడర నడలుచున్.

క॥ హతుఁడైన యట్టు లుండియ శతశృంగాకార మొకఁడు సయ్యనఁ గొని మా
రుతిఁ దాఁకి నొంచె వింటన్ శితశరములు దొడిగి యేసి సెడు గాతఁ డొగిన్.

శా॥ వాలం బెత్తి పలాశిసాయకముల న్వారించుచుం జేరి యా
భీలాకారము దాల్చి వానిఁ బుడమిం బెంపేదఁగాఁ ద్రోఁచి మో
కాలన్ ఘట్టనసేసి మోము పగులంగా ముష్టి ఘట్టించి యు
ద్వేలశ్రీభుజశాఖ వక్షమగలన్ వ్రేసె న్ససంరంభుఁడై. ౪౬౯

ఆ॥ కదలనీక పట్టి కారించి కారించి గాలిపట్టి తనదు కరయుగమున
వాని శిరముఁ జుట్టి వడిఁ ద్రెంచి పడవైచె మేనిపొత్తుఁ బాసి మిడుకుచుండ.

ఆ॥ మాయలాని నసురు మారీచతనయుని మారిమసఁగి కాలుమందిరమున
కనిచి కీశనాథుఁ డాదటఁ దా ద్రోణగిరికి నరిగె నోజ గిరితనూజ! ౪౭౧

ఉ॥ సింగముభంగి వాఁడు శుభశీలుఁ డరాతిగజంబుఁ గూల్చి మే
ల్మిం గమనించు నయ్యెడ సమీరణుఁ డాత్మతనూజు నొవ్వ వా
యంగ సుపర్వసింధుహృదయంగమసారసుగంధశీకరా
భంగరసానుషంగుఁ డయి ప్రాఁకిడఁజొచ్చెఁ దలిర్పు మచ్చికన్. ౮౭౨

శా॥ సంతోషంబున సత్త్వముల్ జవముఁ దేజంబుం బ్రవృద్ధంబు లై
చింతాతంతువులం దెరల్ప సుయశశ్శ్రీకాముఁ డుద్దాముఁ డా
ద్యంతంబు ల్గనరాని మార్గము ననంతాయామి నొక్కింతలోఁ
జెంతం జేరెడు సేసి చేరె జగదుజ్జీవంబు గ్రావం బొగిన్. ౮౭౩

క॥ ఆద్రోణము సుత్రాణ మనిద్రాణము సోష్వధీప్రణిహితమహౌద్రీ
కద్రాఘిష్ఠప్రాణము ముద్రాపితమేరుకోణముం బొడగాంచెన్. ౮౭౪

సీ॥ కార్చిచ్చుకీలల కడఁక నుద్దీపించు కంజరాగోజ్జ్వలకటకములును
మెఱుఁగుఁదీవియల బూఁమెలు నూపు నవహేమవల్లిమతల్లికానకములును
శారదాంబరతలతారకాళులఁ గూర్చు లలి రాలు పూలసీలపుఁజఱులును
గలఁకులగజకుంభగళితముక్తాళులఁ దలపించు వెదురుపొదలదరులును
గలిగి యోషధులకు నెల వైన యమ్మహీధరము సొబగు గాంచి దలఁచినంత
దర్శనంబు మాను తరమున నవి యెల్ల నురు వడంగి యుండు నుర నెఱింగి.

చ॥ హనుమఁడు పల్కె శైలవరమా! సురమానవకోటు లెల్ల ని
వ్వనికృతి నెంచి చిత్తముల వారక సత్కృతులన్ ఘటింతు రా
ఘనమతి యానతిం బొనరుకర్జ మొకం డొనరింప వచ్చితిన్
నెనరున నీదరి న్వేలయు నిద్దపు మందు లొసంగి ప్రోవవే. ౮౭౬

ఆ॥ అనిన దర్పమునఁ బ్రియంబు లెన్నక యున్న నలిగి నలిగికాని యట్లు సేయు
టెందు నేనిఁ గఠినులందు దాక్షిణ్యంబు నెలవుకొను నె యొఱుకు నీతి గొనుచు.

మ॥ అనుచో మేనున విస్ఫులింగకము లొయ్యం దోఁపఁగోషంబు పెం
పున మంట ల్పొద లంటి గెంటుకొన నంభోదారనం బెచ్చ నా
ర్చెను సర్వంకషతేజుఁ డాఘనుఁడు నిస్సీమశ్రమముం దుద్దతిన్
దనప్రారంభము సప్తలోకమహితాస్థానమ్ముల న్నిక్కఁగన్. ౮౭౮

ఆ॥ ఒఱగె ధరణి క్రుంగె నురగనాథుఁడు కూర్మ ముదిలపడియె గ్రమ్మె నుప్పరంబు
దలఁగె దిగ్గజములు గలఁగెఁ బయోనిధుల్ హనుమఁ డచల మెత్తు నెఱుమునపుడు.

క॥ ప్రక్కలు గ్రక్కదలఁగ నిలఁ ద్రొక్కి మహావాలవివృతి దొడిబడ నిట్టట్టుకున్కనఁ బెనచి పెకల్చెను నిక్కిన యక్కుధరమొక్క నిమిషార్ధములోన్.

—♦ చిత్రసేనాదులు ద్రోణాద్రిఁ బెఱికిన హనుమంతు నెదిరి నివృత్తులౌట ♦—

తే॥ విశ్వమహిధారణచణు దర్వీకరేంద్రుఁ బోలు వాలంబునం జుట్టి భూరిబలుఁడు
పెఱికి తరిగొండ హరి దాల్చు పెనుపు దోఁప హరివరేణ్యుఁ డగ్గిరిఁబూనె నగకుమారి!

వ॥ అట్లు పదియు నైదు యోజనంబులు చాల్పును వెడల్పునుంగల యమ్మహీ
ధరంబు ధరియించి కేసరికిశోరంబు దెస లవియ నార్చు నవసరంబున. ౮౮౩

తే॥ తఱిసి చిత్రసేనాదిగంధర్వవరులు మొనలుదీర్చి తాఁకిరి పదుమూఁడుకోట్లు
లెక్క కఖిలాస్త్రశస్త్రావలిప్తు లగుచుఁ గ్రొమ్మెఱుంగులు నిగుడంగఁ గోమలాంగి!

క॥ మున్నిటులే కొనిచనినాఁ డిన్నగమున శిఖర మిప్పు డింతయు నొకటన్
మన్ననియు విడనాడక కొన్నాఁ డిన్నాలిమృచ్చుఁ గూల్తు మటంచున్. ౮౮౪

క॥ తన్నఱిమి యిఁక కగుదే యిన్నాలికభవుసృష్టి నిన్నఱి కగువా
రున్నారె దొంగతనమునఁ గన్నెఱుఁగ విదేమి పాపకర్మం బాదవెన్. ౮౮౫

ఆ॥ త్రిభువనములు బ్రోఁచు తేఁకువ కిగ్గిరి వలనుపడు నటంచు వాసవుండు
మనికిసేసి యిందు మమ్ముంచినాఁడు తదాజ్ఞఁ గడచె దింత యాగడంబె. ౮౮౬

క॥ ఒక్కఁ డడిగి కొను టని కా కిక్కుధరం బెత్తినాఁడ వేడ్తెఱ నెఱయన్
దక్కించుకొనెదె యిమ్మెయి నిక్కనమాత్రన తలంగ నీతర మగునే. ౮౮౭

క॥ నిలునిలు మీధర మిడి పోఁ దలఁతువ యేని నటుచనుము దర్పించిన నీ
బలము చలము డించెద మను పలుకులతో శస్త్రసమితిఁ బరఁగించుటయున్.

తే॥ కొండ మూఁపున నిడి పైడికొండ వాఁడు వాల మల్లార్చి బ్రహ్మాండగోలమగుల
నార్చి ప్రధనాదృతుం డయ్యె నతనిచెయిద మెన్నఁదరమె యిల హిమమహీధ్రతనయ!

సీ॥ ఘట్టించి తన్నిన దంతంబు లెడలంగ మూల్గుచు నొక్కెడ మొనయువారు
పెడచేతివ్రేటులఁ బిడికిళ్ల పోటుల నలినలి యై వ్రాలి నవయువారు
గోళ్లఁ జీల్చినఁ బండ్లఁ గొఱికిన వికలాంగు లగుచు నీపౌరుషు రా మనెడువారు
వాలంబుకొనఁ జుట్టి వార్నిధి వైవంగ నడఁగి పాతాళంబు నరయువారు
గట్టుచఱుల మోదఁ గడకాళ్లుగొని త్రిప్ప నొకనితోడ నొకరు నొరయువారు
జాలు విడువు మనిరి జరిగిరి వఱచిరి వెఱచి రుదిలపడిరి వివశు లయిరి. ౮౯౦

శా॥ ఆగంధర్వులు నుగ్గునూచ మగుచున్ హా! యేటి కీపోరు మా
యాగమ్మాగుము వానరేంద్ర! భవదీయాక్రాంతి కే మెంత లి
ల్లా గర్వం బెడయింప నీక చను మే లా లెమ్ము నీదారి నీ
వేగం గాంచి సుఖించువార మిదె మా కిష్టార్థసంసిద్ధియున్. ౮౯౧

ఆ॥ అనుచు వారు దలఁగ ననిలతనూజుండు మనము భుజము లట్లు మలసి వొంగ
సంగరాంగణంబు సరగ పీడి నగంబుఁ గొనుచు సురలు వొగడఁ జనియెఁజెలియ!

తే॥ భరతుఁ డారాత్రి దుర్గుణ భరిత మైన తనదు కలలోనఁ గాననాంతరము నందు
రామలక్ష్మణు లెన్నఁగారానికష్టదశల పాల్పడియుంటఁ దద్దయు నెఱిఁగి. ౮౬౩
ఆ॥ మేలు గాంచి యతఁడు మేను వడంకఁగ లంక దోఁపఁ దనదు లావు సెడఁగ
దుర్నిమిత్తములును దోడ్పడ బలుధైర్య మెడల నెదఁ దలంచె నిట్టు లనుచు.
కం॥ అశివారావము లుల్కలు దిశలన్ ధూమములు నెఱసెఁ దెరలె సరస్వ
ద్రస మొకర్తుక యేడ్చెడు నిశవేళన్ ముక్తకేశి నెవ్వగ లెగువన్. ౮౬౪
సీ॥ నానాథుఁ డడవిలోనన దేవితోఁగూడఁ దమ్ముఁగూడియుఁ దోన తవిలి కొలువ
నున్నవాఁ డమ్మేటి యుర వేదియు నెఱుంగఁగా రాదు కీడేమి గలిగెనొక్కొ
యమ్మహామహునకు నాపద లొప్పెడమునే యాకృతాంతుని చెద్దు మంత కగునె
పదునాల్గు వర్షము లుదముట్టఁగావచ్చెఁ గాంతు మే లని తుది గడపుచుంటి
నింతలో నేమిపుట్టెనో యెట్టులగునో మఱయు నాదు తపోయజ్ఞ మహితదాన
తీర్థవాసాదిపుణ్యము త్రేఁకువ మెయి నర్పణము సేసినాఁడ రామాధిపతికి. ౮౬౫
క॥ నాయిష్టదైవతము లెడఁ బాయని కుతుకమున రామభద్రునకు శుభం
బేమెడ నేనిఁ బొసంగెడుచాయుం గరుణింత్రు గాత సమ్ముఖు లగుచున్. ౮౬౬
వ॥ అని యాలోచించుచు నిగమాగమపారంగతులైన బ్రాహ్మణోత్తముల రావించి వారికిఁ దగుసత్కారంబులు గావించి స్వప్నవృత్తాంతం బెఱింగించి రామవియోగకృశుం డవు వాఁడు తదీయం బగు నియోగంబున వేదచోదితక్రమం బొప్ప దుర్నిమిత్తశమనంబునకుం దగిన శాంతిక్రియాకలాపంబులు నిర్వర్తింప నేర్చినవారిం బుత్తెంచి డోలాందోలనచణచిత్తవృత్తి యగుచుం బొద్దుగడపు చుండు నంత. ౮౬౭
ఆ॥ పొడుపుఁబ్రొద్దు నోడుపు పుడికిపుచ్చుకొనంగ నోపి ప్రలయకాలయుక్తిఁ బేర్చు
ననిలుఁ బోల్పనగుచు ననిలజుం డగధీరుఁ డగముఁ దాల్చి మార్గ మధిగమించి.
వ॥ వియత్తలం బొరయుచుం బఱతెంచుచున్నవాఁడు నందిగ్రామోపర్యుపరిప్రదేశంబునం బొడకట్టి బాహిరస్థలంబునం గనుపట్టి తోడివారలతో దనయులమటలం దలపోసికొనుచున్నవాని ఘనసుందరదేహు నాజానుబాహుఁ బద్మపత్రవిశాలనేత్రు సుచరిత్రు జటావల్కలాకల్పు రామచంద్రకల్పుఁ దపోనిరతు భరతుం గని సంభ్రాంతుండై రఘువరేణ్యుండు దమ్మునకుం జేటుమూడిన దుఃఖభారంబు సైరింపనోపక కాంతాలలామంబు ధరణిజాత దిగనాడి యుచ్చోటునకు విచ్చేసెనేమొకో యని శంకించి విమర్శించి చూచెదంగాక యని మది నెంచి తిలకించి నగేంద్రధీరుఁడు ధీరోదాత్తుఁ డుదాత్తప్రజ్ఞుండు ప్రాజ్ఞుండు సత్యధర్మదయోదయధనుండు ఘనుండు నగు రాముండు సాధ్వి ననుజుం బన్నంబుల పాల్సేసి యావిభీషణు నర్కతనూజుని వీడి పాడిదప్పి దురాత్ము రావణుం బోరఁ గూల్తు

నను బ్రతిజ్ఞం బాలింపక నైలింపవిజ్ఞాపన లాలింపక జాలింబడి యోలిం బేరు నెఱిచి యూరుదటిసి యుండునంతటి వాఁడే యీతలంపు నాకేలపొడమె నీతం డెవ్వండో కాని దాశరథి భజించి తద్రూపంబున నొప్పారు తాపసోత్తముండు గానోపు నింత నిక్కవంబని నిశ్చయించి రయంబుమీఱ లంకవంక కకలంకుఁడై యరుగుచుండు సమయంబున. ౯౦౦

ఆ॥ గగనవీథిఁ గాంచెఁ గాకుత్స్థుఁ డప్పుడు భ్రాజమాన తేజుఁ బవనతనుజు నాకసంబు మ్రింగనైనఁ జాలినవాని నతిరయమున మింట నరుగువాని. ౯౦౧

తే॥ ఉదురుతనమునఁ దెఱగొప్ప నురుధరాధరంబు వెలుఁగుల నికరమంసంబుమోవ నరుగుచున్నది వెనుభూత మౌర దీనిఁగూల్తుఁ బ్రబలాస్త్రముననంచుఁగోలుమసఁగి.

క॥ ఉదిలపడెడు చిత్తము తనకదనున రోసంబు వెనుప నధికార్ముకముఁ బదరి ధరించి పినాకం బదిగా శరమంది యట్టహాసం బెసఁగన్. ౯౦౩

క॥ ఏయఁదొడర నశరీరచ్ఛాయము భూతంబు వలికెఁ జన దీతని పై నీయలుఁగు బ్రయోగింపఁగ న్యాయచ్ఛరసన్నివేశ! భరతాధీశా! ౯౦౪

తే॥ నీకుఁ బ్రియబంధుఁ డీతఁడు నెగడువార లిందఱును వీనికతన నంచెలమి మించు నుడి వెలయఁజేయఁగా వైవసూల్కొనకుపసంహారించె శరంబు ప్రశాంతుఁడగుచు.

క॥ రఘునాథువలనిస్వప్నం బఘుముం గూర్పక చనంగ నగుఁ బరమేశా లఘుపూజాదిక మరిరాజఘుఁ డతఁ డొనరించి సుజన సంగతి నుండెన్. ౯౦౬

చ॥ అటఁ జని కాంచె వాయుసుతుఁ డాకసవుం బలువాఁక వీఁక వి స్ఫుటతరభంగసంగమునఁ జుంబనముం బొనరింప నెంచుచుం బటుతర ఫేనహాసముల భాసిలుచున్ మణిమస్తకోరగో త్కటరుచిరప్రవాళరుచికల్పనలం దనరారు వార్నిధిన్. ౯౦౭

క॥ ఆకొన్నపులియ కా నతఁ డాకడలిం గడచుచుండ నాకట్టెరి నా కౌకస్నపత్నుఁ డనుప నిశాకులుఁ గ్రోఁతి నలయింతు మనుచుఁ గడంకన్. ౯౦౮

ఆ॥ అంద అంద తైన నాముదిరక్కసుం డందు మాల్యవంతుఁ డధికబలుఁడు మును సురాసురాజి మొనయ విష్ణునితోడఁ బోరినాఁడు తావుసేరినాఁడు. ౯౦౯

క॥ గడితేఱిన గడుసరి వెంబడి నరువదికోట్ల లెక్కఁ బరఁగెడు నసురుల్ వడిఁ బఱతేరఁగ సంద్రము నడుమ హనుమ నెదిరి నిలిచె నారీమణిరో! ౯౧౦

ఆ. మాయదారు లుజ్జ్వలాయుధుల్ సమరదుర్మర్షణులును గాలిమప్రధాను లైన వారికోటు లఱుమ జీమూతంబు లనుచుఁ దలఁచెఁ దొల్త ననిలసుతుఁడు.

క॥ తటియఁగ శస్త్రాస్త్రంబుల నెఱి శ్వేళల తెఱఁగు బొడువ నెఱయఁ దొఱయునే డ్తెఱయుఁ గనియసురు లనుకొనె నెఱుకఁ గనినయంత నెదిరి నెదిరించె ధృతిన్.

—♦ హనుమంతుఁడు మాల్యవదాదులతోఁ బోరుట ♦—

ఆ॥ గగనవీథిఁ జరణఘట్టనాదులు లేమి సంగరంబు నిస్తరంగ మైన
యబ్ధి యనఁగ నయ్యె యాదస్తతు లనంగ బరఁగె నందుఁ గలుగు పరికరములు
మ॥ గదల న్మోది శరాళు లేసి పృథుచక్రంబు ల్ప్రయోగించి మే
ల్పద నా కత్తులు శక్తులు న్విసరి యుత్ప్రాసాదికాసాదనం
బొదవం జేసి విదల్చి వైరులు రణోద్యోగమ్మున న్మించినన్
గదియం బాఱి క్రుధాయితాత్ముఁ డయి రక్షశ్శాసనోగ్రస్థితిన్. ౯౧౪
ఆ॥ తనవయిం దొఱంగు తతహేతితతులె యాజ్యాహుతులుగ హేతు లఖిలయిల్ల
మలసి వాఁడు వర్ధమానతేజుం డయి యనలుఁ డనఁగ వికచవనజనయన! ౯౧౫
సీ॥ మున్నిటినీటిలో మునిఁగి మైకొన్న యాదిమీనము ఛాక ననుకరించి
యాప్రభంజనుఁడు తా నై యెల్లకడ లేర్చు కడనాఁటి యాచిచ్చు కడఁక మించి
యట్టహాసంబున నఖిలంబుఁ బోకార్చు నలకల్పభైరవు నలవు గాంచి
సర్పప్రతానంబు దర్పం బడంగించు వైనతేయుని తోంటి వాసి నెంచి
తుంగమదువు సొచ్చి తూటాడు మదకుంజరమ్ముఁ దెగడి మృగచయమ్ముఁ జమరు
వ్యాఘ్రముం గ్రమించి వాఁడు రక్కసులఁ గలంపఁ దొడరె సత్కళానిధాన!
తే॥ వాలమునఁ జుట్టి కొందఱ వార్ధి వైచి తాఁచి వేరొడ్లఁ బార్ష్ణిఘాతతలపార్శ్వ
జానుఘాతంబుల నొకొండఁ జమరి చమరి పొలియఁజేసె నమ్మారుతపుత్రుఁ డలిగి.
మ॥ తనవా రుక్కఱ మాల్యవంతుఁడు మహాదర్పప్రతాపంబు నొ
య్యన నెక్కొల్గన మండలీకృతసముద్యచ్చండకోదండుఁ డై
యనికిం జొచ్చి సహస్రబాణముల నర్కాంశుప్రమాణంబులన్
జొనిపె న్వాయుజు మేన నార్చుచుఁ దదర్చు ల్మింటితె న్నంటఁగన్. ౯౧౬
ఆ॥ లీల మెఱయ రణకరాళుఁ డాభీల ముద్వేలధూమకేతుజాలకీలి
కాలవాల మైన వాలమ్మునన వానిఁ దూలనడఁచె లోకపాలవినుత!. ౯౧౭
సీ॥ తలకొని రక్కసు తలఁ దన్ని తా వియత్తలమున కెగసిన దానవుండు
నెత్తురు లురలంగ నెఱిదప్పి తేఱి జముని చూపు లట్టి తూపులు నిగుడ్ప
వాలమ్మునఁ దెరల్చి యాలాతి విల్ద్రెంపఁ దెమలి శూలమున ఫాలమునఁ బొడిచి
యదియె పేరురమునం దసురుండు తాఁకింపఁ జెఱకుఁగఱ్ఱంబోలె విఱిచెఁ గాలఁ
బావని సురారి గద వైవఁ బట్టి త్రుంచి తలమున నడంచెఁ బగతునిఁ జలము నెఱయ
నంతటం బోక యమ్మాల్యవంతుఁ డడరి హనుమనిం గని యిట్లనె నబ్జవదన!
ఆ॥ తార్క్ష్యు నెక్కి వార్ధి దైత్యారి నాతోడఁ బోరి పోరలేక పోయెఁ దెరలి
సీతరంబె నన్ను నెఱి మీఱి గెలువఁ గాపేయమునఁ జెడకుము వాయుజుండ!

క॥ మున్నీట నీనగం బిడి క్రన్ననఁ జనుదేనిఁ జంపఁగా రానని వా
డన్నం గన్నుల నిప్పుక లున్నిద్రము లగుచు నెరయ నొరయ నరిగినన్. ౯౨

చ॥ నవశితశక్తి వైవ నది నాకసదు ల్బెగడొంద విస్ఫులిం
గవితతు లొంట నుప్పతిలఁ గాఁ బెనుమంటలు మింట నంట రాఁ
బవనతనూజుఁ డుద్దవడిఁ బైకొని నేకొని దానిఁ ద్రుంచి యా
భువనధిలోనఁ ద్రోఁచెఁ బెరపూర్వసుపర్వులు విన్నఁబోవఁగన్. ౯౩

ఉ॥ అంతట మాల్యవంతుఁడు రయం బలరారఁగఁ గాళికాకటా
క్షాంతలసత్ప్రకాశమన నా కరవాలముఁ గేలఁ దాల్చి నీ
యంతము దీన నయ్యెడు నటం చెద వ్రేసిన వ్రేటుతోన యిం
తింతలు ముక్కలయ్యె నది యెంత? తదీయబలప్రసక్తికిన్. ౯౪

ఆ॥ వజ్రసంహననుఁడు వాయుతనూజుండు వాలపాశమునను వానికంఠ
మొనరఁ జుట్టి గరుడి యురగమ్మునటు త్రిప్పి వీఁచి వార్ధిలోన వైచుటయును.

క॥ తలముడి వీడ వియుక్తోజ్జ్వలభూషాంబరుఁడు నగుచు సడలిన యొడలుం
దలఁగిన బలము నయి రసాతలమునఁ బడె జీవితమ్ము తరలకయుండన్. ౯౫

ఆ॥ మారుతాత్మజన్ము మహితోగ్రరూపమ్ముఁ గాంచి ముజ్జగములఁ గలరె వీని
గెలుచువార లెల్లకృతుల నీతఁడె గెల్చు ననుచుఁ జనిరి కడకు నసురు లెడలి.

క॥ ఆజి గెలిచి గిరిఁ గొంచును యాజితకాశి చనె వెలుఁగు లన్నిఁటి కితఁడే
యోజమెయిఁ దానకం బనగాఁ జని గగనంబు వెలుఁగఁగా వెలుఁగులతోన్.

మ॥ స్ఫురదుద్యన్మణిరత్నదీధితితతు ల్పొభిల్ల దివ్యౌషధీ
వరవిద్యుద్ద్యుతు లుల్లసిల్ల స్వతనుప్రాగ్భారదీప్రప్రభల్
వెరయంగా నొకఁడైన దీప్తి భయ ముద్వేలంబుగాఁ బొంగి భా
స్వరభాస్వన్మహనీయబింబ మన నుద్భాసించి కాన్పించినన్. ౯౬

—♦ రాముని విషాదము ♦—

ఆ॥ ప్రొద్దుపొడు పటంచుఁ బోలఁగా భావించి ప్రొద్దుకొలముసామి భూరిచింత
మునిఁగినట్టు లగుచు మునుకొని యిట్లనెఁ దమ్ము నొడలు చేతఁ దడవుకొనుచు.

సీ॥ నిక్క మారయ వచ్చె నీరజాప్తుం డదె యుదయాద్రి నేరంగ నోజ మెసఁగ
విరియఁజొచ్చెఁ దమంబు వెలసెడు దిక్తటుల్గ్రహతారకాతతు ల్గాంతు లుడిగె
నేర్పడ నెల్లర కిది ప్రొద్దుపొడు పైన నాప్రొద్దు గ్రుంకు ననంగ వలసె
నీమాయసత్తికి నిచ్చితిఁ దమ్ముని బాపపు దుఃఖాబ్ధి పాలుపడితి
నన్న నగధీర! లక్ష్మణ! యగునె యిట్లు నన్నుఁ దిగనాడి చన నెపం బున్నయదియొ
ని న్నెదురుచూచు తల్లికి నీదుసతికి నన్నదమ్ముల కెటుదెల్పు మనెదొ చెపుమ.

క॥ అన్న! విడిచె నీవే శర ణన్నా! యన్నాఁ డటంచు నభయం బిడి నే
ని న్నరసెద నంటిని నా కన్నెఱి గలదే యభాగ్యు లన మెన సెదరే. ౯౩౧
క॥ ఇల నిలువఁజాల సీతని విలసద్గుణు విడచి జంట వెలయఁ జనినఁ
మలయుదు సుగతికి దొసఁగుల గలవరపుంగొంప యిచటఁ గలవే సుఖముల్.
క॥ బంధుత్వము నెఱపితి నీబంధులఁ గొనివచ్చి తరులఁ బఱపితి విఁకఁ గి
ష్కింధకుఁ బొమ్మనుఁగులతో బాంధవ మెద నుంచుమయ్య భానుతనూజా!.
ఆ॥ అని విరక్తి నెఱయ నాడు రాముని గాంచి యనఘ! యీవిచార మగునటయ్య
ననిచె నిప్పుడిపుడె నాల్గవఁజా మొంట వచ్చు హనుమ యింకఁ బొచ్చె మున్న
క॥ చన దూరక యతఁ డరిగిన పని ఘనతేజుండు తత్ప్రభావటలంబే
యనవచ్చు నొకగడెకు మే లనువొందెడు నింతలోనె యలమట లేలా. ౯౩౫
ఆ॥ అనెడునంతఁ దేజ మగ్గలం బై దుర్నిరీక్ష మగుచు నుండ నినుఁడవోలె
గవియరాఁ గపు ల్ప్రకంపితు ల్గా రాముఁ డలుక నెమ్మనమున నడరుటయును.
మ॥ కలయ న్మంటలు పర్వఁ గాలు ననలుం గాలారిఁ బోల్పంగ నై
తలఁ పొంటం దహియింప నోపి మెలఁగం దార్కాణగా నెల్ల ది
క్కులు నే డంబుధులుం గలఁప నగుచుం గూలంకషం బైన రో
షలసన్మూర్తివిశేష మొప్ప దృఢసంస్థానంబు చెన్నొందఁగన్. ౯౩౭
చ॥ కొలమున కెల్లఁ గర్త యఁట కూలిన లక్ష్మణుఁ డిట్టు లుండ ద
వ్వెలసిన వాయుజుండు తల మొందకయుండ సురారి కర్జముం
దలఁపున నుంచి నాయొదువు దక్కడి సేయఁగ నెంచి ముందుగా
వెలయఁదొడంగినాఁ డినుఁడు వేడబ మయ్యెనె రాము పాటిలన్. ౯౩౮
ఆ॥ నా కజేయ మున్నె నాకౌకు లలరంగ వేఁడివెలుఁగుఁ గూల్తు వెంటనంటి
ప్రదరశక్తి నిదె యరాక్షసం బొనరింతు వలయునేని సృష్టి వల నరయుదు.
క॥ అని రౌద్రరసభరంబున ననితరసంరంభుఁ డై యుగానలకీలల్
దనరార నిలిచి రాముఁడు తన వి ల్లందికొనె జగతి తద్దయు వడఁకన్. ౯౪౦
క॥ మును పురములు గాల్పఁగ నేఁ బినాక మందుకొను వీఁక పెనఁగొన రౌద్రం
బనుపమ మస్త్రముఁ గొనె భానుని నొకయుంకింపులోన నోసేయంగన్. ౯౪౧
వ॥ అట్లడరిన రఘువీరుని ప్రక్రమంబు తెఱంగెఱింగి సుగ్రీవజాంబవద్విభీషణాదులు సంభ్రమంబునం బెరసి వినయవినమితశిరస్కులు ఫాలఫలకఘటితాంజలిపుటులు నై యొక్కపనిఁగొని లోకత్రయంబు నెఱుపం దలంతే మానుషవేషం బొరసి యెఱుంగమి నటించుచుంటి వింతియ కాని నీయరయరానిదియుం గలదే రుద్రునట్టు లీవు రౌద్రతరంబు వహ్నిమయంబు నగు రౌద్రాస్త్రంబు చేఁ బూనినయంతన సురసిద్ధసాధ్యగరుడగంధర్వప్రభృతు లతిభీతిం గడగండ్లు పడుచుం గడళ్లంటం బఱచుచున్న

వారు ప్రతిభయోల్కాప్రతతుల నంబరస్థలం బెల్లఁ గాలి పగులు చందంబున నొగులుచున్నయది. క్ష్మాతలంబు గ్రక్కదలంజొచ్చె. ధరణీధరంబులు వడంకు చున్నవి. దినకరవంశసంభవా! యియ్యస్త్రరాజం బింకఁ బ్రయోగింపవలవ దుపసంహరింపుము. మా మొఱలాలింపుము.మహితదివ్యౌషధిలతికాస్ఫురితం బగు ద్రోణశిఖరి నిజభుజశీర్షంబున ధరియించి పఱతెంచు నమ్మహాజుండు వాయు తనూజుండు గాని భానుమంతుఁడు గాఁడు. సహజతేజోవిరాజమానుం డగు నాయగ్నిమిత్రపుత్రునకు జ్యోతిర్లతామణిరత్నవిభ్రాజితం బగు చంద్రశైలంబు ప్రభావిశేషంబులఁ బైపై చ్చయ్యె నఖండఝ్ఝ్వేళారవపూరితదిగంతరుం డగుచు రయంబునఁ దపనునికన్న మిన్న యని యెన్నం దగియున్న కతంబునను బ్రొద్దు పొడుచుతఱి గాకుండుటంబట్టియు మనహానుమని వీఁకతోడి రాక యని నిశ్చ యింపుము. సంశయింపకుము. అమ్మహామహుని కెదురుగాఁ గపివరులం బనుపు మాతండును సంతసించు నని విన్నవించుటయు. ౫౮౩

—♦ రాముఁడు హనుమంతుని మెచ్చుట. ♦—

తే॥ నల్ల కలువల కాంతి విన్నాణ మైన మేనివాఁడు కన్దమ్ముల నూను వేడ్క
మోముచందురు తెలివియు మురువుసూప వరమహుఁడు రాముఁడని చెల్లవంగవరుల.

ఉ॥ అంతట సంతసంబొ నలినాప్తుఁడొ పండువొ యిష్టలాభమో
వింతగ రాముసన్నిధికి వేఁ బఱతెంచెడు నాఁగ వ్యుత్క్రమం
బంతయుఁ దీఱ భూస్థలికి నాహనుమంతుఁడు డిగ్గి జానకీ
కాంతుని పాదము ల్గొలిచెఁ గ్రన్నన నగ్గిరి డింపి సొంపునన్. ౫౮౪

మ॥ పలికెం బల్కు సుధారసంబు జిలుకం బాలింపవే రామ! నే
నలచోటం గిరిఁ గాంచి యోషధుల నొయ్యం గాన కద్దానినే
చలమొప్పం గొనివచ్చినాఁడ దొసఁగు ల్సన్నద్ధము ల్గాఁగ ని
క్కల నొక్కించుక సేపు త్రోవ మసలం గానయ్యె నయ్యాఱడిన్. ౫౮౫

ఆ॥ అనినఁ ద ప్పటంచు నాలస్య మంచు నీవెనసి చేయుపనుల నెన్నఁడేనిఁ
గలుగునయ్య! తండ్రి! కాపాడితివి నన్ను నాకొలమ్ముఁ దమ్ము ననుచుఁ గూర్మి.

క॥ నీపేర్చు కృతుల భారము నాపయి నిటు మోపుచుంటి నలఁచు బుణం బే
నేపగిది నెన్నఁటికిఁ గులదీపక! తీర్పంగనేర్తుఁ దెలియం జెపుమా! ౫౮౬

ఆ॥ అనుచు రాముఁ డతని నాదరించుచునుండ భానుజుఁడు సుషేణుఁ బరగఁ గాంచి
భూధరంబు నెక్కి పొలుపొందు మందులు దెమ్ము తడయ కీవు తెలివి పొదల.

క॥ సౌమిత్రి కిడి మనువు మిపుడామీఁదట నెల్లవారి కానందరస
శ్రీమానితాబ్ధిపూర మసామాన్యం బెనయఁగాఁ బొసంగింపఁ జనున్. ౫౯౦

క॥ అనునంత హరివరులు తోఁ జనుదేరఁగ సత్వరంబ చని యాశైలం
బనుపమకూటకటకతటఘనలక్షణ మరసి యొరసి కౌతుక మొదవన్. ౭౫౧
శా॥ వేయుంగన్నులవేల్పు వేల్పుగమితో విన్నాణ మా వేడ్క నిం
దే యానం గనె నాసుధారసము లక్ష్మీశుండు చక్రాహతిన్
స్వాయుద్ధావహుశిరంబు ద్రెంచె జగతీసంరక్ష కిచ్చోటునన్
దోయం బొప్పెడుఁ దద్ద్రిప్రోత్థములు మందుందీఁగె లిప్పట్టునన్. ౭౫౨
క॥ అది సావర్ణ్యకరణి యయ్యదియే సంధానకరణి యరయుఁ డెఱుకమై
యిదిగో విశల్యకరణి యిట్లిదియా సంజీవకరణి యేర్పడఁ గొనుఁడీ! ౭౫౩
ఆ॥ అనుచుఁ దోడివారి కాయాస్థలమ్ముల మహిమ లెన్ని తెలిపి మానితుండు
చేరి పుచ్చుకొనెను సిద్ధౌషధి విశల్యకరణి సంతసంబు గడలుకొనఁగ. ౭౫౪
చ॥ ఘనతరశక్తి పేరురము గాడిన యావివరంబునందు నె
క్కొనఁగ మహౌషధి న్ననిచికో లొనరించిన యంత లక్ష్మణుం
డు నిహతవేదనుం డగుచు డొం పెడలంగ నిలింపు లుబ్బ సు
ప్తునిక్రియ నుత్థితుం డయి ప్రఫుల్లముఖస్థితి నుల్లసిల్లుచున్. ౭౫౫

—♦ లక్ష్మణుఁడు మూర్ఛఁదేఱుట ♦—

క॥ నిలునిలు రావణ యిపుడే పొలియించెద నె మ్మటంచుఁ బొలుచు మగఁటిమిం
బలికెడు తమ్ముని ర మ్మని పిలిచెన్ రాముండు ప్రీతి పెంపెసలారన్. ౭౫౬
ఆ॥ తేజు లావు దెలివి తేటయు మునుపటికన్న మిన్న లగుచుఁ గ్రాలుచుండ
నన్న పాదయుగళి నత్యంతభక్తిమై నెఱఁగి నిలిచెఁ గుతుక మెలయుచుండ.
క॥ సహజార్ద్రస్నేహార్ద్యుఁడు సహోదరుం గౌఁగిలించె క్ష్మాపతి పులకో
ద్వహుఁ డానందరసామృతమహోర్మిమిళదక్షుఁ డగుచు మహిలామణిరో! ౭౬౧
ఉ॥ ఒక్కఁడ పో కృతార్థుఁడు మహోదయుఁ డేలినవాని కర్జముం
జక్కఁగ నిర్వహించెఁ దన సారము బీరము పెంపు సొంపుఁ బే
రుక్కు వహింప నాపదల కోర్చి తగ న్నిరపాయుఁ డౌచు నాఁ
డక్కల నేఁటి కిక్కరణి నంచు నుతించిరి వాయుజుం గపుల్. ౭౫౬
తే॥ రాముఁడు సుషేణు హనుమని రమణఁజేర్చి మీఁకతంబునఁ దమ్ముని మేలు గొంటి
మేలుకొంటిఁ బ్రత్యుపకార మేలలి నొనరింతునో దోఁపకున్న దే నంత గలనె.
క॥ సోదరు నొసఁగిన యీకృతి కేదియు సరి గాదు గాన నిందఱు గన సం
మోదమునఁ గౌఁగిలించెద నాదెసఁ గల కూర్మి పేర్మి ననిచి వెలయుఁడీ. ౭౬౧
వ॥ అని పలికి శ్రీరాముఁ డమ్మెయి ననుగ్రహించినం దత్ప్రసాదంబున ననంత తేజో
వీర్యబలాతిరేకంబు లొప్పార నవ్వార లరుసంబునం బొదలి రయ్యవసరంబున

రామలక్ష్మణవానరేంద్రానుమతు లై యగచరవరు లమ్మహామహీధరం బారో హించి వివిధమణిమయశృంగంబులం గనుంగొనియు సవిధమధురమధురసంబులు ద్రావియు భూమాభామసురుచిరరసవదవిఫలఫలంబు లసదృక్షంబు లనుచుఁ భక్షించియు నమృతజాతీయంబు లగు పానీయంబు లానియు నసమానబలౌజులు విగతక్షతశల్యవేదనులు నై యగ్గిరి డిగ్గి రామసేవానిరతు లై రంత జానకీజాని యమానుషతేజోవిరాజమానుం డగు పవమానతనూజన్ముని గాంచి మీఁదటి కర్జం బెంచి యిట్లనియె. ౯౬౨

—♦ హనుమంతుఁడు స్థూలజంఘాదుల నమయించుట ♦—

క॥ అన్నా! యెప్పటిచోటున నిన్నగ మునిచి చనుదెంచుకే మే లని నే
నెన్నెద నన నౌనని వాఁ డన్నెటి గిరి గొంచు నరిగె నమృతకలాఢ్యా! ౯౬౩

క॥ ఉరవడి నవ్వేరవరి యంబరతలమున నరుగుచుండఁ బరు లారసి యా
సురవరున కెఱుకసేసిన సరభసుఁ డై యాతఁ డధికసంరంభమునన్. ౯౬౪

వ॥ స్థూలజంఘ మహానాద మహాదంష్ట్ర మహాఘోర స్ఫోల్కాముఖ మహావీర్య చతుర్వక్త్ర శంఖకర్ణ చిత్రవర్ణాదులగు నక్తంచరవరులం బెక్కండ్రంగనుంగొని.

ఆ॥ మీర లేగి యాసమీరకుమారకు నాన మీఱఁ బొదివి యలఁచుటొండె
వాట మరసి చేతి కూటవంతంబు మున్నీట వైవఁజేయ నెఱయుటొండె. ౯౬౬

క॥ కావింపఁగ భావింపుఁడు సేవించెదు వాని నెల్లి శ్రీవిలసిత మా
నావలనియర్ధరాజ్యము నా వలవదు శంక యెవని నయ మిం దవునో. ౯౬౭

వ॥ అనుచుఁ బ్రేరేప నిది యానౌ ననుచు నహమహమిక ననుచు దుస్సహసాహస జయాశాతిరేకంబుల నొందు రులం ద్రోచుకొనుచు సేనాసహస్రంబులతోఁ దరలి నానావిధప్రహరణహస్తులై కొఱలి రణపారీణులవ్వారు సురాసురదూషంబులు దాల్చి తటిమి నడిచి మారుతిం దఱిసి యురవడిందాకి నీలమేఘుంబులు మహా శైలంబున ట్లుఱిమి యాగ్రహంబున కలిమి నఱిముఱి పడుచు నహంకారంబుల తోడి హుంకారంబు లాకసంబు వ్రక్కలింపం దొడరం గక్కసం బొనరింప నడరుచు నిట్లనిరి. ౯౬౮

తే॥ గిరి పెకల్చి తెచ్చితి సురాసురుల మమ్ముఁ జీరికింగొన కిది మా యశేషధనము
నీమదమె నినుఁ దిను నొక్క నిమిషమునఁ జలించెదే యాయుధమ్ముల ముంచి యిడమె.

ఆ॥ అనిన వారితోడ ననియెఁ బావని మీర లెంతవారొ మడిసి రిట్టివారె
కొంద ఱింతయేల కొనసాగునంతకు నిలువుఁ డంతకునకుఁ దెలివి లేదె. ౯౭౦

మ॥ అనుచుం బల్కెడునంతలో నరిహుఁ డౌ నవ్వాని వాలం బహీం
ద్రునిభోగంబు మహేంద్రు హస్తి కరముల్ రూపించుచు న్మించె నె

ట్టిన లంకాపురధూమకేతువు నిశాటస్తోమనిర్వాపణో
పనిషణ్ణోద్ధతకాలరాత్రి యది తత్త్వం బట్లు చెల్లింపదే. ౯౨౧

ఉ॥ చిచ్చులుకంటి మంట యయి చేరి దహించె నొకొండ్ల సొరికిళ్
మెచ్చొనఁ గూర్చు దండ మయి మేకొని కూల్చెను గొంతవట్టు బెం
పెచ్చిన వజ్ర మై గెడపె నెందఱనో హరిచక్రచక్ర మై
తచ్చటులోగ్రవాల మటఁ దక్కిన తండము గం డడంపదే. ౯౨౨

క॥ గద యై కార్ముకముక్త ప్రదరం బై ప్రలయవహ్నిపటలం బై నీ
రదనిర్ఘాతంబును నై యదనున నవ్వాని తోఁక యసురులఁ గెడపెన్. ౯౨౩

ఆ॥ మిత్తి పాశ మగుచు మెడఁజుట్టి త్రోఁచిన రాచియిడిన మింట వైచిన న్ని
శాచరౌఘ మట్టు లేచి యాచికొనంగఁ జూచి చూచి జమునిఁ జూడఁ జనియె.

క॥ ప్రహరించు పగఱ శస్త్రము లహస్కరుం బోని వాని నంటవ చదలన్
దహనజ్వాలాభీలత దహించె నవ్వాఁడు వారిఁ దనవాలమునన్. ౯౨౫

తే॥ పదములం దన్ని హుంకృతి బడలుపఱిచి తోఁక వీఁక విదారించి త్రోచి వైచి
యొక్కనిం జిక్కనీక వాఁ డుక్కడంచె జాలు భైరవు నట్టహాసకృతి నెగడ.

ఆ॥ భూతజాత మంధభూతంబుఁగాఁ గులగిరులు వడఁక దెసలు గీడ్వడంగఁ
బొదివి పొదివి చంపెఁ బొలదిండ్ల నాగండఁ డడరునంత కైన నడరనీక. ౯౨౭

క॥ అమ్మెయి గ్రమ్మిన పరజలదమ్ములె యద టడఁగి విరియఁ దతబలుఁడుం దే
జ మ్మొలయ నొప్పె నత్తఱి నమ్మారుతసుతుఁడు శారదార్కుం డగుచున్.

చ॥ హరిపద మంది యావరణ మట్టి చన న్జితకాళి కాంతిసుం
దరుఁడును నై కళ ల్వెలఁగఁ దద్ద దరస్మితచంద్రిక ల్తగన్
వరధృతి నేగుచుం దన రి వాఁడు ఘనాంతపువేళఁ బొల్చు చం
దురుఁడొ యనంగఁ ద్రోపడిన ధూర్జుల యాస్యనళమ్ము లుక్కఱన్. ౯౨౯

క॥ సిద్ధికరుఁడు హనుమఁడు కృతిసిద్ధుం డై యటఁజనన్ సుసిద్ధుఁడు గాఁగన్
సిద్ధులు సాధ్యులు సుర లనుబద్ధు లగుచు గురిసి రతనిపై విరులజడుల్. ౯౩౦

వ॥ మానసోచితవేగుం డగు పవమానతనూజుండు వీతఖేదుండు ప్రమోదభరితుండు నై యసమాన నసమానవీర్యబలంబు లొప్పార నప్పరమహామహాస్పదం బయిన నగరాజంబు ప్రాక్తనస్థానంబునం బ్రతిష్ఠించి యతిమానుషంబు నధిదైవికంబు నధ్యాత్మంబు నయిన నిజసత్త్వసంపదకు నిలింపగణంబు లచ్చెరువొందం జెచ్చెరం జని శ్రీరామచంద్రుని పాదారవిందమ్ముల కెఱఁగి సౌమిత్రిరవినందనులకు నమ్మెయి వందనమ్ము లాచరించి వేడుక దనరం దనదగు వృత్తాంతం బెల్ల నల్లన వివరించిన నమ్మువ్వురుం దదీయప్రసంగంబు లాకర్ణించి విస్మయసంకీర్ణంబు లగు చిత్తంబుల నత్తరంబు దరంబు మీఱి మేనులం బులకంబులు గులకంబుగా

హర్షోత్కర్షజనితబాష్పనివహంబులం గనుంగవలు నిమీలనోన్మీలనసాదరంబులై కాన్పింప ననన్యసుకరం బికర్జంబు సాధింప నీక పోలు నింతియ యనుచు నెడయరాని కౌతూహలంబున నుపగూహనాదిసత్కారంబుల సంభావింప భావింప నశక్యంబు లగు పురస్కారంబులం గానచరు లందఱు హనుమత్సుషేణుల నగ్గించుచుం బరస్పరాలింగనసౌఖ్యంబుల ననుభవించుచు లంకాపుర సౌధంబులం బ్రతిధ్వను లుప్పతిల్ల సింహనాదంబు లెసంగించుచు ననామయులై చెలంగుచుండు నాసమయంబున. ౯౮౧

తే॥ అభ్రలక్ష్మీమనోహర హారమౌక్తికంబు లన నొప్పు తారకౌఘంబు లెడలి
యసురవిభురాజ్యచిహ్నంబులనఁగ దృష్టిమార్గదూరంబు లయ్యె ౧ గ్రమక్రమమున.

తే॥ గంధసింధురకల్పులు ఘననిభులు మదాంధులును నగు నసురుల బంధుకోద్య
మాంధతమసంబులం గూడి యంధకారగంధములు గ్రంథములు వీడఁ గడచిచనియె

—♦ సూర్యోదయము ♦—

తే॥ వారిజము లొప్పె వానరవీరముఖము లట్లు కుముదము లొగ్గిడె నిశాటమనము
లనఁగ రామరావణసముద్యమముల గతిఁ గోకఘూకప్రసక్తులు గొఱలెఁ దెరలె.

మ॥ తిమిరోద్యద్గజరక్తసిక్తతనురక్తిం బొల్చు సింహంబు ప్రా
చ్యము సంద్ర మ్మెడఁద్రోచి పై కెగయ నానార్వంబు పూర్వాద్రిశృం
గముపై నెత్తిన పద్మరాగఘటి ప్రాక్కాంతాలలామంబు హ
స్తమునం గొన్న ప్రవాళగుచ్ఛ మట భాస్వంతుండు దోఁచెం బొరిన్. ౯౮౫

క॥ అరుణుఁడు రామమనోరథపరిపక్వఫలంబు నాఁగఁ బరఁగెం బ్రాచిన్
వరతేజోరాశిఁ దమోహరుఁ గులదీపుఁ దనుఁ బోల్పనై జగ మెలయన్. ౯౮౬

ఆ॥ కాల్యవిధులు దీర్చి ఘనుఁడు గుణాంబుధి యద్రిధీరుఁ డతిదయార్ద్రహృదయు
డంచితావలోకుఁ డనె రాముఁ డిమ్మెయిఁ దమ్ముతోడ మోముదమ్మి వెలయ.

ఉ॥ నీ విటు దైత్యరాజపరినిష్ఠితశక్తిహతిన్ ధరం బడన్
లే వింక నేకృతు ల్గడిమి లేమయు సీమయు జీవితమ్ము నం
చే విలపించినాఁడ నిపు డీ వనపాయుఁడవై కనంబడన్
వావిరి నన్నియు న్మగిడి వచ్చిన య ట్లలరారె లక్ష్మణా! ౯౮౮

ఆ॥ నినుఁ బ్రబుద్ధు నెనసి నెఱిఁగంటి లే బలే యట్లుగాకయున్న నవని యేల
విజయ మేల సీత విధికృతం బేల నీ తోడిలోక మేను దొరయుచుండ. ౯౮౯

క॥ అని పలికిన ఖిన్నుండై యనె గద్గద మొదవ రాఘవానుజుఁ డిమ్మై
ననఁ దగునే ధీరోదాత్తున కిది తెలిఁగే యొకొండు దొసఁగునఁ బడెదే. ౯౯౦

క॥ సత్యపరాక్రమశీలుఁడ వత్యలఘుగుణుండ విట్టు లనిన జగములన్
నిత్యముగఁ బ్రబలిన నెఱపెడు ధృత్యుచితక్రముఁ డొకం డుదీర్ణుఁడు గలఁడే.

చ॥ చులుకనివాని తీ రెనసి సూనృతమూర్తివి నీవు పల్కినన్
గలఁడె యొకం డిలం దగవు గా దవు నం చన దండకాటవిన్
వెలసి తభీతిదాన మిడి వేల్పులు మానులు వేఁడ నయ్యెడన్
బలసి విభీషణుం డొదుఁగఁ బ్రాజ్యము రాజ్య మొసంగి తమ్మెయిన్. ౯౯౨

క॥ నీవు ప్రతిజ్ఞారక్షణ మేవిధినేనియుఁ బొనర్ప నెంచక నాకై
చేవచెడి యట్టు లాడే యావర్తన మడఁపకున్నె యఖిలార్థములన్. ౯౯౩

తే॥ సత్త్వసంపన్నుఁడవు నీకు సకలధర్మపాలనమ్ము ప్రతిజ్ఞానుపాలనమున
సులభ మగుఁగాని యెుండొంటఁ జూడనెంచ నున్నధర్మంబు సెడుట గా కొండు లేదు.

సీ॥ ముజ్జగం బీవు కార్ముక మూని నిలిచినఁ దలఁకెఁడు ననిన నీతండు ఘనుఁడె
నీకోపవహ్నిలో నిమిషార్థమున వైరి మిడుత యై తక్కిని మిడుకకున్నె
సింగమ్ము విక్రమించిన సామజము మదోత్కటమైన ధృతి నెట్లు గాంచగలను
వైనతేయు నెదిర్చి యానాగ మెంత లేనియుఁ బౌరుషం బొంట నెఱపనగునె.
పగటికగుసామి యస్తమింపకయమున్న యతఁడు కరములఁ దిమిరంబు నడఁచుమాడ్కి
నీశరమ్ములఁ బొలియింపు మాశరేంద్రు నామహేంద్రాదు లలర శ్రీరామచంద్ర!

ఉ॥ నీమది రావణుం గెడప నిష్ఠ వహించెనయేని సత్ప్రతి
జ్ఞామహితప్రవర్తనమె జానుగ ధర్మనిదానమేని నేఁ
డామహిజాత కష్టదశ నాఁగుటె పౌరుషమేని నెట్టనం
బాముల కోర్చి నాపలుకు పాడి మెలంగు మిఁక రఘూద్వహా!. ౯౯౬

క॥ అని నొడివెడు తమ్ముని నుడు లనుయుక్తము లాలకించు నతన నెఱసెన్
దనసహజం బగు తేజం బనుపమ మది భానుమండలాంచిత మనన్నై. ౯౯౭

—— రాముఁడు లక్ష్మణాదులతో సుఖంబుండి రావణున కెదురుచూచుట. ——

క॥ కల్యాణాత్ముఁడు రాముఁడు కల్యము శోభనము గాఁగఁ గని విజయశ్రీ
కల్యోక్తి వెలయఁ గృతిసాకల్యము నేఁ డే నొనర్పఁ గాంచెద ననియెన్. ౯౯౮

క॥ అందఱియం దన్నెఱినిరవొందె మహానంద మప్పుడపుడె సుర ల్సం
క్రందనముఖ్యులు పొగడిరి ముం దెనసెడు మేల్దలంచి మునులు న్గలయన్. ౯౯౯

క॥ చంద్రముఖి! వింటివె యాచంద్రార్కస్థాయిగాఁ బొసంగదె రఘురా
మేంద్రుని జయప్రసంగము సాంద్రయశశ్శ్రీగుణప్రసక్తం బగుచున్. ౧౦౦౦

ఆ॥ అనుచు విభుఁడు దెల్ప నది యెల్ల వివరింపవలయు మేలి తఱియ వలనుపడియె
సంగ్రహించి పలుకఁ జాలునే నొడువు మయ్యధికథాంశ మనుచు నడుగుటయును.

శా॥ చిత్రామేయకథావిధాననిగమాశ్లేషాఢ్యపాదాంబుజా!
పాత్రీభూతజనోదయప్రణిహితప్రాజ్యప్రసాదాంచితా!
అత్రాసాదినిరాససంవలితచిత్తాయత్తవీర్యోజ్జ్వలా!
మిత్రామిత్రవిభావనావిధురసంమృష్టాత్మతత్త్వాశ్రయా! ౧౦౦౨

క॥ శ్రుత్యంతసూక్తివిలసత్ప్రత్యయపరతత్త్వనిరతపండితజనతా
నత్యయతాసంపాదిప్రత్యక్షానుభవలక్ష్యభాసుకరూపా! ౧౦౦౩

మాలిని॥ విదితగురునిదేశావేశసంపత్ప్రకాశాభ్యుదితరసవిశేషాభ్యున్నతస్థానలక్ష్మీ
సదయహృదయయోగైశ్వర్యసంధానలీలాస్పదనిజపదభక్తీ! సంభృతానంతశక్తీ!

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్య మహితాత్రేయగోత్రపవిత్ర హనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథామృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబున
నవమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీరామకథాఽమృతము

## యుద్ధకాండము

పూర్వభాగము

## దశమాశ్వాసము



సురమునిసంప్రార్థిత
భాసురలక్ష్మీవిలాసపరినిష్ఠిత దు
ష్టాసురకోటిశమన లీ
లాసురభిళకీర్తిపుష్కలప్రాజ్యకలా!

—♦ ఏడవునాఁటి యుద్ధము ♦—

వ॥ అవధరింపు మమ్మోయి నమ్మహారాజ్ఞి యానందసాంద్రయై యవ్వాలికథాంశముం
గూర్చి ముచ్చటించుటయు నమ్మహాదేవుం డిట్లని వివరింపం దొడంగె. ౨

శా॥ వింటే నీరజపాణి! రామచరితాఽవేలాఽమృతోల్లాస మా
తంటాలెల్లఁ దలంగ స్వీయజనసంధానంబు చెన్నొందఁ నే
వెంటం గాంచినఁ దద్గుణాభ్యుదితనిర్వేశంబు పెంపార శ్రీ
లుంటాకుం డగు రావణుం డరసి లోలోఁ దా విమర్శించుచున్. 3

తే॥ ఇట్లనె సభాసదులఁ గాంచి యింతసేత బూది వేల్చిన యట్టిదై పాడవడంగెఁ
దొంటితప మెల్ల మున్నె నిర్ఘాతమయ్యెఁ గలుగఁబోయెడు తెఱఁగింకఁ గానరాదు.

సీ॥ ఆయింద్రజిత్తు వోనడఁగె మాయ లటంచు నద్దమరేయి నే నరిగి వేఁడి
మైరావణుం బంప మాయావి రాముని గాళికి బలివెట్టఁ గడఁగి మొఱఁగి
పాతాళలోకమ్ము పట్టునఁ జేర్పంగ నంత విభీషణు ననుమతమున

ధూర్తుఁ డాహనుమఁడు తో నేగి యవ్వాని వధియించి తలపూవు వాడకుండ
నన్నుఁ దెచ్చి యిచ్చె ననుజునిఁ బోకార్ప మేలి మందు గూర్చి మెలఁగఁ జేసె
శరున కైనవారు ననుమించువా రైన నింకఁ జేయ నైన దేమి గలదు?
తే॥ అలవు చల మొప్ప నేఁ జని యయ్యరాతివర్గ మెడలించి వచ్చెద వార కిప్పు
డున్న బలమెల్లఁ జేర్పుఁ డియ్యోజ నన్ను బలసి రాఁజను నయ్యదిప్రౌఢి నెఱయ.
క॥ అని యానతి సేసిన వా రనుపద మటు గూర్ప దాని నందఁగఁ గొని చ
య్యన నేగె రణస్థలి కయ్యనువున నది మిడుతదండ యన నగుచుండన్. ౮
తే॥ రాము నెదిరి తద్బాణాగ్ని రాలె నదియు నొక్కపెట్టన తా నట్టు లోజ మెఱయ
నాఘనునితోన పెనఁగిన నతఁడు గనలి పిడుగుఁబోలిన శర మొండు దొడిగి యేసె.

—♦ రావణుఁడు రామబాణార్దితుఁడై భార్గవు శరణు వేడుట ♦—

చ॥ అది యెదఁ దాక సొమ్మసిలి యాదశకంఠుఁడు నిల్వలేక దు
ర్మదము దలంగ లంకకయి మానము దూలఁగ నేగి రాము సం
పద యతిమానుషస్థితి నభంగుర యాటయు వాయు వగ్గిక
ట్లదనున మారుతాత్మజుసహాయ మెసంగుటయుం దలంచుచున్. ౯
తే॥ తనదుసైన్యంబు తలపోసికొని కలంగి హంగుసెడె నింక నేమి సేయుఁగఁబోలు
ననుచు నెట్టన భార్గవు మొనయఁగాంచి యతని పదయుగ్మమునకుసాష్టాంగ మెఱఁగి.
క॥ ఆతఁ డుపలాలనంబునఁ జేత స్సొకయింత చల్లసేసి సరగ ని
ట్లీతఱి రాఁ బని యే మనఁ జేతులు జోడించి యసుర సిబ్బితిపడుచున్. ౧౧
ఆ॥ గురునిఁ గాంచి పలికెఁ గూళ వాఁ డేనాఁడు నీదయం గొఱంత నే నెఱుంగ
దొరసినాఁడ నిప్డు దుఃఖపరంపర నీవు గలుగ నేమి నియతి సెడెనొ! ౧౨
క॥ భగవంతుఁడ! నీయెఱుఁగని దగు నంశం బేజగమున నైన సుగమ మై
నెగడునె యైన న్వినుచుటె తగ వంచు వచించువాఁడఁ దత్పరబుద్ధిన్. ౧౩
సీ॥ నరుఁడు రాఘవుఁడు వానరయూథపులఁ గొంచుఁ దరలినాఁ డంబుధి దాటినాఁడు
పలుకోటు లగచరు ల్బలసి రా మనలంక నఱిమినాఁ డెల్లరఁ దఱిమినాఁడు
లగ్గలెక్కి మహాబలముల నొక్కట మారి మసఁగి నాఁ డేత్తెఱ నెసఁగినాఁడు
పుత్రుల బంధులఁ బొలియించి నాపయి వాలినాఁ డన్నిటఁ జాలినాఁడు
నాయలవుతోడి చల మొంట నవయఁ జొచ్చె నేమిచెప్పుదునయ్య! నీయెలమి గలుగ
నెల్లెడల ముంపఁ దేల్పఁగ నితఁడె నేర్చు ననఁ బొగడుగంటి నేఁ డిట్టు లగడుగంటి.
ఆ॥ ఇంక నీవ నేర్తు వెద్దియేని నొకండు తెరువు సూపి మనుచు తెఱఁగొనర్ప
మెలఁగువాఁడ దాని మేకొని పగతుఱ యాగడం బెడల్చె నాఁగ నెగడి. ౧౪
మ॥ అనినన్ దైత్యగురుండు దైవకృత మయ్యర్థంబు సాధింపఁ జ
య్యనఁ బాతాలగుహాంతరంబున రహస్యప్రక్రియన్ హోమముం

బానరింపం జను మందు వహ్నినడుమం బుట్టుం బ్రశస్తంబు స్యం
దన మశ్వధ్వజసూతయుక్త మవిభేద్యం బొక్కండబ్బుమ్మొగన్. ౧౬
ఆ॥ ఖడ్గచాపబాణకవచశస్త్రములు లట్లె యావహిల్లు నెల్ల నధిగమించి
గెలుతు వఖిలలోకములను నిన్నెదిరించి మిత్త్రియేని నవల మిడుకఁజనదు. ౧౭
క॥ ఏను గలిగి నీకొక కొఱ రానిత్తునె మంత్రతంత్రరాజవిశేషా
నూనప్రక్రియ లొనఁగెద నీనెఱి నవి యెల్లఁ గొని జయించెద వరులన్. ౧౮
ఆ॥ విఘ్న మొనయకుండ వెలయించితేని నివ్విధి సురాసురులును విధిముఖులును
నిన్నుఁ దేఱిచూడ నేరరు నరులు వానరులు వలఁతులే యసురవరేణ్యా! ౧౯
చ॥ అనిన మహాప్రసాద మని యన్నియు నట్లె గ్రహించి యొయ్యనన్
జని జనితప్రహర్షుఁ డయి సంభ్రమవిభ్రమము లొప్పసంగ నం
గన లుచితస్థలంబున రకంబుగ నిల్వఁగ గట్టిసేసి లం
కను గనుపట్టు పట్టు లరిగాఁపులు గాపులు గా నెలర్పఁగన్. ౨౦

—♦ రావణుడు పాతాలహోమము సేయుట ♦—

ఆ॥ పౌనర నానవెట్టి పురగోపురద్వారదుర్గరక్షణంబు ధూతవిఘ్న
ముగ ఘటించి తలుపుల గములు మూయించి యనుపమితమహాప్రయత్నుఁ డగుచు.
క॥ పాతాలసదృశి యా గుహ నాతంకం బెడల మందిరాంతస్స్థలి సం
స్థీత నొదవంగఁ జేసె ననేతాదృగ్విభవుఁ డరిజయేచ్ఛ తలిర్పన్. ౨౨
క॥ అంతటికిం బైకాపుగ నంతకసన్నిభ మహాట్టహాసప్రసితుల్
సంతతభృతశస్త్రాస్త్రి నియంత తటిజ్జిహ్వ నభ్యనంతరు నిలిపెన్. ౨౩
సీ॥ ఆభిచారికవిధి కా నెల్లపరికరంబుల నేర్చి కూర్చి విభుత్వ మొప్ప
స్నానాదికృత్యము లనలిపి పాతాలగుహాగర్భ మంతకాస్యంబు నట్లు
సొచ్చి రక్తవిలేపసూనమాల్యాంబరాభరణంబులు ధరించి సరభసముగ
గంధపుష్పాక్షతబంధుర మైన వేదిక విధిననలుఁ బ్రతిష్ఠితునిగఁ
జేసి శరపరిధులు సేర్చి శాండిల్య భల్లాతకాక్షసమిదు పేతములుగఁ
సరవి తత్ఫలములు సర్షపాగురుగుగ్గులుప్రయుక్తపాత్రలుం గ్రహించి. ౨౪
తే॥ ప్రణిహితంబులు గాఁగ దూర్వలఁ బొసంగ సంస్కృతంబు లొనర్చి ప్రసక్తరక్త
సురలు దధిమధుఘృతములు నిరవుకొనఁ బ్రవాలదర్భప్రభృతులును వర్తిలంగ.
తే॥ మౌని యై నిశ్చలము నియమమ్ము దనరఁ దన రసావేశమున నె చందనసుమఘన
సారకుంకుమములు పాయసములు ధాతురసములుం గేశములు రక్తవసనములును.
ఆ॥ కాకకంకగృధ్రకచ్ఛపచ్ఛాగము లనకరఝషభుజంగమములు శ్యేన
ములును భల్లములును మొనయంగ హోమమ్ము సేయుచుండెనతఁడు శీలమహిత!

మ॥ పొడమెన్ ధూమము పేరి చీఁకటి నభోభూభాగము ల్గ్రమ్మి యె
క్కుడఁ దానే యయి యక్కడ న్నెఱఁపగా గట్టాయితంబయ్యె నా
బుడమిం గ్రక్కదలించి మించి రవితోఁ బోరంగ నా నిచ్చ నే
ర్పడె నా భోగివిషాగ్ని కేతనచయాభంగాత్మసంఘంబుతోన్. ౨౮

ఆ॥ గాలి వాలి యెల్ల కడ లాక్రమింపంగ నావరింపఁ జను లయాభ్రగణమొ
కల్పకాలకాలికాకాలిమస్ఫురద్ఘనశిరోజనిచయకాంతిచయమొ. ౨౯

క॥ అన నడరు ధూమమండల మనుపదమే భువనమెల్ల నలమఁగ నైత
మ్మనియమితచిత్తవృత్తులఁ బొనరింపం గలఁగె నఖిలభూతౌఘమ్ముల్. ౩౦

క॥ పొగ యభ్రమ్మగ వెడలఁగఁ బగతుం డొనరించు హోమ పద్ధతి యనుచున్
దగ నెఱిఁగి తగ వెఱింగిన యగణితగుణుఁ డసురవిభుని యనుజుఁడు తోడ్తోన్.

—♦ అంగదాదులు పాతాలహోమంబుఁ జెఱుపఁ బోవుట ♦—

మ॥ అలఁతం బొందుచు రాముఁ జేరఁ జని యయ్యా! కాంచితే భూనభ
స్థ్సలము ల్గ్రమ్మెడు ధూమరాజి యదె రక్షఃపాలుఁ డీనాఁటి నీ
బలువుం బీరముఁ గాంచి నైజ మగు నాపన్నత్వ మగ్లించి యా
చలమున్ డించి శరణ్యు శక్రుఁ గని యిచ్చం దెల్పి ప్రార్థించినన్. ౩౧

క॥ ఆదైత్యగురుఁడు తనవిద్యాదర్పము కలిమి నసుర కభయం బిడి యి
ట్లీదారి సూపె నతఁ డయ్యాదేశముమెయి మెలంగ నయ్యెడుఁ గడఁకన్. ౩౩

ఆ॥ పరఁగ నట్టిదైన పాతాలహోమంబు పరిసమాప్తి గవియఁ బాఱెనేని
నందు సంభవించు స్యందనం బెక్కి యాతండు ముజ్జగములు దఱిమి గెలుచు.

క॥ అజరుద్రాదులకేనియు నజేయుఁ డగు నయ్యరాతి యటు గాకుండన్
గజిబిజి జేసి యలంపంగఁ జనుం దగువారి ననిచి కాకుత్స్థమణీ! ౩౪

తే॥ రాజితయశస్కుఁ డగు యువరాజుతోడ మంతుఁ గనినట్టి మన హనుమంతుఁ గూడఁ
బ్రబలు రగు యూథనాథులం బలసి కొలుచు బలములం బంపు మీనుడి పాటిసేసి.

క॥ అని తెలుప నల్లె యాఁ గాకని యాసుగ్రీవు ముదల నగచరవరులన్
బనిచెఁ బదికోట్ల కంగదహనుమత్ప్రముఖుల జతన్ హిమాద్రితనూజా! ౩౬

శా॥ దిట్ట ల్గట్టులు ఱాలు గొంచు వినువీథిం బోయి ప్రాకారక
ట్ట్యాట్టాదు ల్గ్రమియించి ద్వారపరిరక్ష్యధ్యక్షులం ద్రుంచి ప
ల్దెట్టల్దెట్టలు గాఁగఁ దేర్లిభములుం దేజీలు వే జీరుచున్
మట్ట న్మట్టున గొగ్గఁజేయు తెగువ న్మల్లాడుచుం గూడుచోన్. ౩౭

క॥ మొగిళుల యుఱుముల చందం బెగసెడు మున్నీటి తెరల యెలగోలు తెఱం
గు గణితము లయ్యె వారల యగణితరణకౌతుకోద్భటారావములన్. ౩౮

సీ॥ తేరుల తెగ లున్న తీరునఁ బైకెత్తి క్షోణీస్థలంబునఁ గూలనేసి
కుంభీంద్రకుంభము ల్గుల్లపుట్టికలుగాఁ బిడికిళ్ల పోటుల బిట్టగల్చి
వెలపెచ్చు తేజీల తలపుచ్చె లాగి వ్రీలఁ బలువ్రేటుపాటుల బలుపుసూపి
యంపకోలల కొంప లలమి శస్త్రము లెల్ల వీటతాటమ్ముగా విఱిచివైచి
జిగిమెఱుఁగు లీను రొక్కమ్ము లెగయఁజల్లి యల్లరు లెసంగ సప్పట్లు లడఁచి తాఁచి
సౌధములు గోపురమ్ములుఁ జక్కు సేసి కోల్పఱిచి రప్పురం బగకూటచపులు.
తే॥ రావణుం డేడి? యతఁ డున్నతావు సూపుఁ డూరకున్న నగల్లు మం చోజనెఱపు
వారు దెగఁబాఱి సొచ్చి యిల్వరుస దప్పకుండ శోధించువారునై రోగి సుభటులు.
శా॥ ఆలుం బిడ్డలు నేడ్వ రేపుచు గృహం బల్లాడఁగా నూపుచుఁ
గోలాంగూలవరు ల్తదంతరితరక్షోజాతి దక్కోల్వడఁ
జాలిం బెట్టుచు నీడ్చుచుం గడఁకమైఁ జామోదుచుం దెల్పుఁ డిం
కేలా జాగనుచుం గలంచిరి పురం బిట్టట్టుగా నత్తఱిన్. ౭౨
ఆ॥ ముసలిముతక లెడలి మొఱ్ఱో యనఁగఁ బాలు రెదురువచ్చి విడువుఁడీ యనంగఁ
గావు కావు మనుచుఁ గసుగందు లడలంగ నింతు లఱవ లంక యేడ్చులమ్యె.
తే॥ రావణు పురిం గలంచి రైరావణంబుఁ బోలువారుఁ బెన్గొండలఁ బోలువారు
నైన హరివీరు లాడాడి కంత మొరులు గాన రైరి వా రసురేంద్రుఁ గాన రైరి.
సీ॥ అదరి రౌద్రం బట్టు లతిభీషణము గాఁగఁ గలనిపండువు పొంగి గడలుకొనియెఁ
బుడమి గ్రక్కదలిపోఁ బడిమైనఁ బొలదిండ్ల యొడళ్ళుల నయ్యెది యుబ్బగాంచెఁ
బెనుధూళు లెగసి యక్కనుకలి మరలింప నస్రపుంజదుల నయ్యెవి యడంగె
మొనయు రోదనశబ్దముల దీనదశ దోఁప నాచికోలూనెపి క్ష్వేళారవములు
లంక కపిమయిగా నకలంక యయ్యె నసురసుభటుల యస్త్రశస్త్రాసిభూష
ణద్యుతులఁ దుల లేని రాణం దనర్చెఁ దేజ మొప్పారె నపుడొక తెఱపుగదుర.
చ॥ అలిగి నిశాచరు ల్వొడువ నార్చుచు వానరులుం గడంగి బె
బ్బులు లటు లాక్రమింప నని పోఁడిమి యొప్పెను ము న్సురాసురుల్
చలమునఁ గొన్న కయ్యమును సాటికి రా దన నందు వానరుల్
గెలిచిరి రక్కసు ల్దొసఁగు గీల్కొన వాలి రగేంద్రనందనీ! ౭౬
మ॥ హతశేషు ల్పఱవంగ నంగనలు డయ్యంబాఱ భీతు ల్పరా
గతులై సందుల గొందులం జొరఁగ నిర్ఘాతోగ్రపాతంబులన్
గతి లేకొంట నొదుంగ నా జనము పోక న్మాని సాకారమై
నతలంబు న్గతలంబు గా కడఁగఁ గీశౌద్ధత్య మొప్పెం బురిన్. ౭౭
ఆ॥ అట్లు గెలుపు గొనియు నార్చియు నెల్లెడ నెమకియును దురాత్ము నియమపదము
గాన లేక తెరలు గతినుండ నద్దేశమును విధాత చెయిది మొనయనగుచు. ౭౮

తే॥ పతిహితాత్మ దుష్టాసురభావ మెంచి సుకృత మొదవెడుఁగాత మంచును దలంచి
యావిభీషణు సతి సరమాభిధాన తెలిపె నచ్చోటు కరసంజ్ఞఁ దేటపడఁగ. ౪౯
క॥ సమ్ముఖగతుఁ డగు నంగదుఁ డమ్మెయి వెర వరసి సమ్మదామర్షమ్ముల్
గ్రమ్ముకొనఁ దద్గుహావదనమ్మున గ్రావమ్ముఁ దన్నె నలినులి గాఁగన్. ౫౦
ఉ॥ లోపలి గుట్టు గాంచి రణలుబ్ధుఁ డరుద్ధత నార్చి పేర్చి వి
ట్టా పదఘట్టనంబున నె యాయజనస్థలి గ్రుంగఁ జొచ్చిన
న్దే పెసలారఁ గీశవరు లెల్లరు మల్లడి గొంచు వాఁకిం
బ్రా పగుచుం జొరంబడిరి భావన రాముని జేర్చి చెచ్చెరన్. ౫౧
తే॥ ప్రముఖులై రగచరయూథపతులు వీరభద్రుఁ డయ్యెను దద్యువప్రభుఁడు రాక్ష
సాధిపకృతాభిచారకృత్యంబు దక్షకల్పితాధ్వర మనవయ్యెఁ గంబుకంఠి!
తే॥ పెండిలికిఁ బిలువం జను పేర్మి దోఁప నతనియార్పున లోఁజని యతఁడు గాంచఁ
గాంచి రగచరు లబ్బంగి కడఁక వేల్చు రావణు జగద్విరావణు రా పెలర్పు.
క॥ కాపున్న రక్కసులఁ బులి కాపొనరింపంగఁ దొడరి కదిసి చమరి య
య్యాపుదల సెడ నిరంకుశు లై పురుషవిశేషసంపదభిరాములు నై. ౫౨
చ॥ కను లరమూసి హోమము రకంబుగఁ జేయుచు ధ్యాననిష్ఠ నె
ట్టనఁ దనరారఁగా నెదిరి డంబరముం బరికింపనీని తెం
పున జయకాంక్షి చిత్తధృతి ప్రోపొనరింప నిలింపవర్గముల్
గనుకనిఁ బల్లటిల్ల లయకాలు నదల్చెడు నెత్తికోలునన్. ౫౩
క॥ పొనరారు నసురనాథునిఁ గనుచూడ్కిన యోర్వరామి గడలుకొనంగన్
గన లెగువఁ దెగువ మేకొన ననువర్తన మనువుపడ ఘనార్భటు లెసఁగన్. ౫౪
సీ॥ చేతిస్రుక్స్రువములు చెచ్చెర నొరసి తెప్పర మిది యనఁ ద్రెంచి పాఱవైచి
పరవంజి చేర్చిన పరిధులు సమిధలు నొక్కటఁ జిచ్చులో నురక ద్రోఁచి
పాత్ర లింకిట నియ్యపాత్రున కేల యం చురవడిఁ దెమలించి యురవడించి
యున్న పశ్వంగంబు లొంట నాజ్యాదులు హోమకుండంబున నునిచి యార్చి
వెఱచఱచి యఱచెడు నట్టి విధమునఁ బరిచారకుల నంద యిడి చక్కఁ జదిపి చనును
సేసి యాగోపసద మెల్లఁ జిక్కుపఱచి చెఱచి రచ్చోటు కర్త్రివశిష్టముగను.
క॥ ఒలసి పిడిగ్రుద్దులం గరతలప్రహారముల మేలితాఁపుల నలమన్
గలఁగమిఁ గని యచలత్వం బలముకొనెనో యంచు నెల్ల రనుకొనుచుండన్.

—♦ అంగదుఁడు మందోదరిని రావణునెదుటి కీడ్చితెచ్చుట ♦—

తే॥ అంగదుం డంతిపురి కేగి యలవు నెఱయ నంగనలు తన్నుఁ జుట్టి నయంబులాడు
పగిదిన తదీయదుఃఖంబు పాలుగొనఁగ విన్నఁబోవు సురారి దేవేరిఁ గనియె. ౫౫

వ॥ అత్తఱి నమ్మత్తకాశిని యుత్తలపాటునం జిత్తం బుడికిన యట్టైన నురవుసెడి వెరవరయలేని దను సడికిం దలంకినయదియపోలె మిట్టిమిట్టిచూచుచుం జూడ్కుల వలను వీడ్కొని తరలు తెఱవున నురలు బాష్పజలకణంబులు తెరువువట్టి పలుకని చెక్కులపేరి లవలీదలంబుల నవలీల నాక్రమించి మించినం ద మిమ్మాసంచుముంచు నేమొకో యని సంచలించి యాశ్రయించినం గెంగేలుఁదమ్మిదోయి యొక్కం డవలంబంబుగాఁ దక్కొం డవ్వాని రెమ్మి గోళ్లం జిమ్ముటట్లుగా నొడంబడి యాఁచికోలు సూప నెదిరి దౌర్బల్యం బెంచి యింతవట్టు పాలుపడిన యాడికోలు చాలు నని వాసికై యచ్చోటు వాసి హారయష్టుల లోఁగొని స్తనమండలం బలమి యలవు గని విఱ్ఱవీగి యెల్లకడలం దామయై యడరుచుండఁ బల్లగిలి విన్నను వెడలి విన్నయై చిన్నవోయిన నెమ్మొగ్గమొగమ్ము నెల బాముపేరిఁటి పాముబలుగాము బుస్సు రనుచు నొడియు నుత్పాతంబున నుత్పతితంబు లగు నిట్టూర్పు వేఁడిమిఁ బోఁడిమి గెడసి పల్లటిల్లు నధరపల్లవంబు సంపల్లవంబులేక నల్లనై పొంకం బెడల నంకంబు పైకొనిన చందంబుతోన యొండొండ నుఱిసిన విరులతోఁ జిఱ్ఱుముఱ్ఱాడు కురు లను చిఱ్ఱచీఁకటులకుం బ్రాపయి యేపుసూప నాపదలకు నెదురైతింగదా యనుచు ననివారితంబు లగు ననివృత్తాంతంబులం గూర్చి యూరార్చు తోడిచేడియలతోడం గల కష్టంబులం దలపోసికొనుచున్న యన్నిశాచరేంద్రు నారీరత్నంబు దఱియం జను నవసరంబున. ౬౦

తే॥ అమ్మ చెల్ల దమ్ములు బిడ్డ లఖిలబంధువులుఁ బరివారములుఁ బోరికలనఁ దెగిన
లంకయిరుమాఱుఁ గాలిన లక్ష్మణాగ్రజన్ముతోఁ బగ విడఁడు రాక్షసవిభుండు.

ఆ॥ ఇంకఁ గ్రాలుద్రవ్వ నేల? రాముని గెల్వఁ దనతరంబె బ్రదుకఁదలఁపఁడొక్క
యతఁ డజేయుఁ డజహరాదుల కీవంక మగిడెఁ బ్రాద్దు తొంటిమాట గాదు.

తే॥ అంజనాసూనుఁ డిచ్చోటు నలమినపుడె మన తెలివి తేట లన్నియు మాఱుపడియె
దా నొకఁడు గాఁగ నైన యీదశ దశాస్యుఁ డెట్లు జయమంద నెంచెనో యెఱుకపడదు.

క॥ రామస్మరణము దక్కఁగ రామకు వేఱొండు తలఁపు రాదు మదికి సా
ధ్వీమణిమహిమం బెన్నంగా మనవశమే? తదర్థిగా మన వశమే. ౬౪

ఆ॥ అందుఁ గలుగు యోధు లందఱు నందఱే యంద రెవ్వరికిని యమునివలని
భయము లే దదేమి పాపమో మనవారి మదికి నింతవట్టు మలయఁబోదు. ౬౫

క॥ అనుచుం బెక్కుతెఱంగుల వనితామణి వనరఁ దోడివనితలు నట్లై
యనయం బిది యనుచుండఁగ ఘనభుజుఁ డైంద్రితనుజుండు గదిసి రయమునన్.

శా॥ ఆమందోదరి కొప్పువట్టి తిగిచెన్ హా యంచు శోకింప ను
ద్దాముం డుద్ధతిమై హరీంద్రుఁ డసురేంద్రప్రాజ్యసామ్రాజ్యల

క్ష్మీమర్యాద గజేంద్రయానఁ గొనివచ్చె న్రావణుం డున్న యా
ధామం బొయ్యనఁ జేర వాని యెదురం దన్వంగిఁ బీఠించుచున్. ౮౯

తే॥ రత్నభూషితకంచుకరాజ మెడలఁ జేసె నీవి సడల్చెఁ జేచేతఁ బిణికి
ముక్తల విముక్తలఁ బొనర్చె మున్నె త్రెంచివైచెఁ గటిసూత్రముఖ్యముల్వాఁడు కెరలి.

క॥ సీమంతినీమణీఘనసీమంతమణీచయములు శీఘ్రమ వ్రాలెన్
దామసవిభు చే టిదె యన నై మహిఁబడు నుల్కలట్టు లంభోజముఖీ! ౯౦

ఉ॥ సొమ్ములు రాలె నెమ్మగము సోలె దృగంబుఝరంబు లెక్కరాఁ
జెమ్మట లమ్మెయిం దొడరి చేరెన నేడ్లను బూండ్లు నయ్యె శో
క మ్మవశమ్ము గూర్ప నయి క్రాలఁగఁ జొచ్చెను మానహానితో
బమ్మెరపోక ముట్టుకొనె భావిని కా వినిపాత మేర్పడన్. ౯౧

ఆ॥ ఆస నాథుమ్రోల నటు లాసనాథ యనాథ యట్టు లడలె నలువు సెడఁగ
సిగ్గుబలు వొకొంటఁ జేడ్పా టొకటఁ దన్ను మొనయ శోక వార్ధి ముట్టమునిఁగి.

క॥ తక్కినకాంతలలోఁ బెంపెక్కిన యవ్వారినెల్ల నిభనిభులు కపుల్
గ్రక్కునఁ గొని తెచ్చిరి తో నక్కర్జమ పోలునంచు నరుసం బెసఁగన్. ౯౩

తే॥ కమలినులభంగి వారుఁ దత్కరములందె దీనదశ నొంది కుందుచు దిటవుసెడఁగ
నాటకాంద్రాట లాడించు నచటి పైఁడిబొమ్మల తెఱంగు దోఁచెఁ బూబోఁడి!వింటె.

ఉ॥ మంగళవస్తుధారణము మానిని కింకఁ దలంగునన్న య
ట్లంగన న ట్లొనర్చి జనితార్తిమెయిం గృశియింప నైన యా
సంగతియుం గనంబడఁగఁ జాన యెఱుంగుపడంగ నేడ్చు నా
భంగియుఁ గానిపించి యనె వాలిజుఁ డాపొలదిండ్లఁజేనితోన్. ౯౫

—♦ అంగదుఁడు రావణుదూతి వానిపలుకులకు బదులుసెప్పుట ♦—

సీ॥ మాయదారి మెకమ్ము మారీచు నొనరించి యధిపునిఁ దమ్ముని నట్లు పనిచి
సన్న్యాసి వై యొంటఁ జని సాధ్వి వంచింప బిచ్చం బనుచు నొక పేరుపెట్టి
పిలిచి రక్కసిరూపు వెనిచి మూర్ఛిత యైన యద్దేవిఁ దెచ్చితి వంతవట్టు
నీకుఁ బోలినయది నే నాజి నిందఱు వీక్షింపఁ ద్వద్భార్యఁ బిఱికి వగుచుఁ
గనులు మూయుచుఁ దెఱచుచుఁ గదలకుండ నీయెదురఁ బట్టి యిన్నాతి నియతి సెదర
నాటలాడించుచున్నాఁడ నడరవలదె? భుజపరాక్రమ మెపుడు జూపె దసురేశ!

క॥ ఈనాఁడె యిట్టివిధి గా నేనాఁటికిఁ దాచుకొంటి విస్సీ మగలా
గీనింద సాలుఁ జచ్చిత యేనిం దనుజేంద్ర! సెడితి విటునటు గతికిన్. ౯౭

క॥ అనునెడ నాక్రోశించుచు వనితయు బిట్టార్తి మునిఁగి వశముసెడఁగ ని
ట్లనెఁ బతితో నతిదీనంబును గరుణంబు నగుచుండఁ బుణ్యచరిత్రా! ౯౮

ఆ॥ ఇంత సిగ్గుమాలి తేల? యొండొక్కండు కేశపాశ మొడిసి గేలి సేసి
తెచ్చి మ్రోల నిడఁగఁ దెప్పిఱిల్లక వేల్చెదే? జపంబొనర్చెదే? కడంగి. ౭౯
క॥ పాపులు పగతుఱు సారఁబడి యేపున నిజభార్యఁ గడఁక నేచు నెడం గా
కాపురుషకార మెన్నఁటి కాపట్టునఁ జావకున్న యాతఁడు మగఁడే? ౮౦
ఉ॥ రాముని జూచి మైనఁ దఱి రాపొనరింపఁగ రాదె? తత్సతిం
బూమెలువన్ని తెచ్చినది పోఁడిమి యయ్యెనె? దుష్టవర్తనం
బీమెయి నిప్పుడే కుడుప నేడ్తెఱ సూపఁదొడంగె నట్టి దా
నామయముం దలంగెదె? యహమ్మను దుర్యశ మింక మానునే? ౮౧
శా॥ కైలాసంబుఁ బెకల్చినాఁడ వటు తార్క్షాణంబుగా దిగ్గజ
శ్రీలక్ష్యోన్నతదంతము ల్వ్రెఱికి తాచేత న్సురేంద్రాదులం
బోలం గెల్చితి వన్నియుం జెడఁగ నీప్రోద్దివనాటుంచు డా
చే లంఘించెఁ ద్వదాత్తకల్పసుమలక్ష్మీ స్మవాసము ల్కేశముల్. ౮౨
ఆ॥ ఇంద్రజిత్తుతోడనే పోయె మాయలి ప్తిజపమ్ము లేల? యెదిరి నిలిచి
పగతు గెలిచి యసము బాటించుటో, చచ్చి పరమసుఖము గనుటో పరఁగు నింక.
ఆ॥ నీవు బ్రదికియుండ నే నిట్టులైతిఁగా కట్టకొడుకె యున్న నరుల ముట్టి
యడఁచి యిడఁడె నన్ను నంటనిచ్చునె యంగవాఁడు గూలె నీదు వర్తనమున.
ఆ॥ ఇంత చేతఁగాని యీచల మింకేటి కరి యటంచు రాము ననక యర్థి
సీత నిచ్చి వేఁడి జీవింపఁగా రాదె యాస లున్న నొంట నడిచిపడక.
క॥ అని పలుకుచు నెం దరిగితి తనయా! యోమేఘనాథ! ఆత్రి రావలదే
తనతల్లికిఁ బరిభవ మిట్లొనగూరఁగ నింద్రుఁ గెలుచు నోడ మెడలెనే. ౮౬
తే॥ అనుచు వనరుచు నాథ! నన్నలఁతి ద్రోఁచి పుచ్చితే కావవలదె నీ ప్రోఁ పెడలెనె
యని మహాక్రోశ మొనరించె నబల కురరి యట్టులాక్రోశ మయ్యెదియాక్రమింప.
ఆ॥ కనులు దెఱచి ప్లవగుఁ గాంచి సాధ్వి తెఱంగు నెంచి తెగిన నిష్ఠ యెడయుననుచుఁ
బులిమిపుచ్చు పాడి వైసఁగ నిట్లనె రాక్షసేంద్రుఁ డప్పు డోసురేంద్రవినుత!
క॥ పగలేదు నీకు నీదగు తెగవారికి నాకు నిదియుఁ దెఱవగునె కడుం
దెగఁబాఱెద వాదట నీయగచాట్ల కొకండ్లు చాలి యద్దుపడెదరే. ౮౯
క॥ వికలుఁడ వయ్యెదె నైజము వెకలితనము మాన వెచటి వేరం బిది కూ
లికి విసముఁ ద్రావుదురె యూరక చనఁజనదే యసక్తరభసము వలనే. ౯౦
క॥ అని పలుక నాహరీశుఁడు కనలుచు నిట్లనియె నీవు గాని తెరువుఁ గై
కొని యాడఁజొచ్చి తింతటఁ జన దాఱడి యబ్బు నిదియు సౌజన్యంబే. ౯౧
మ॥ పగ లేదున్నది యేల యావివరమో పందా! యమందాయతిం
బగ లే నీసతి కొప్పు వట్టుకొని యీడ్వం గాంచి న న్నడ్డగిం

పంగ లే వక్కట యింకఁ బొడుజపము ల్పన్నాగము ల్సాగ వా
పంగలేఁ డీశ్వరుఁడేని రామశరసంపాతోగ్ర ముత్పాతముల్. ౯౨

క॥ అని తెగనాడిన నసురుం డనితరవిక్రముఁడు కలఁగి యుసిఁగొని చెడెఁ బో
ఘననియమ మనుచు వేసెను జనవిభునిం గొలిచి దీనఁ జచ్చి తటంచుల్. ౯౩

క॥ వేఁటువడి యంగదుం డప్పాట రుధిరధార లొలుకఁ బడె నేలఁ ద్రియా
మాటపతి పడఁతి విడచి వనాటులు ముసురుకొన నాతఁ డాఱని యలుకన్.

వ॥ శూలముద్గరాసిగదాప్రభృతిసాధనంబుల హనుమదాదియోధవీరుల నొప్పించి తక్కుంగలుగు యువతులంగూడ విడిపించె నంతలోన దెప్పిరిల్లి వాలినందనుండు వాలిన కినుకం దోడివారిం గూడుకొని పిడికిటిపోటులఁ దలప్రహారంబులఁ బాష్ణిఘాతంబుల నవ్వాని నొవ్వాని తెరలునట్లు సేసి యచ్చోటు వాసి శ్రీరామదేవు చరణారవిందములకు వందనంబు లాచరించి రాత్రించరు వేలిమి సెఱిచిన తెఱం గెఱింగించి మన్ననలు వడసియున్నంత. ౯౫

ఉ॥ శోకరసాధిదేవతయు చుమ్మన నిమ్ము సెడంగ హృద్వ్యథో
ద్రేకము బాష్పసేకమునఁ దీర్చుచునున్నదిపోలెఁ గందు కుం
దేకముగా నలంప నిఁక నేఁటికి జన్మ మటంచుఁ గర్మ కిం
పాకము నెంచుచుం బొరలు భామినిఁ జేరి సురారి చొక్కుచున్. ౯౬

—♦ రావణుఁడు మందోదరి నూరార్చుట ♦—

తే॥ సాంత్వములుపల్కి డెందమ్ము చక్కపఱుచుచంద మొప్పారఁగాఁజేయి సాచి
కొలు సూపుచు నద్దానికొఱఁతఁ గూర్చినేర్చి యిట్లనె నతఁడు వినీలచికుర! [యాఁచి

క॥ ఇంతయు దైవాధీనమ యింతిరో! నీ వలుకవలవ దెంతలువడినన్
సంతతము గాదు జీవిత మెంతటివారలకు నైన నిది యరయనిదే. ౯౮

తే॥ ఓవిశాలాక్షి!శోక మిట్లొలసితేని నొడలు సెడుఁగాని లాభ మొం డొకఁడు లేదు
గాన నిశ్చిత యగు జ్ఞానకలన నూని దీని విడనాడి మే లైన తెరువు గనుము.

తే॥ ఎఱుకలేమిన తొడరు నిమ్యొడరు దాను బొడమినంతనె జ్ఞానముం బొడవడంచు
నజ్ఞభావంబుననె బంధమావహిల్లు నబల! దేహాదు లైన యనాత్మలందు. ౧౦౦

ఆ॥ అట్టి బంధముననె యగుఁ బుత్రదారాదిసంగలక్షణమ్ము సంసరణము
హర్షశోకభీత్యమర్షతర్షవిలోభమోహామదముఖములు మొనయు నందు. ౧౦౧

క॥ ఆసంసారాంబుధిఁ బడి కాసునకుం గానివారుగా నౌదురు వి
న్యాస మొనఁగూర్చు నిది యాభాసం బనఁ జెల్లుచుండుఁ బరిగత మగుచున్.

ఉ॥ కేవలుఁ డాత్మ శుద్ధుఁ డవిగీతుఁ డలేపుఁడు సర్వతఃపరుం
డేవికృతు ల్గొనం డతఁ డహీనసుఖామలచిత్స్వరూపుఁ డం

చీవు దలంపు మావిభున కెన్నఁడు యోగము విప్రయోగముల్
భావ మభావముం గవియు పద్ధతి లే దెటు లెంచి చూచినన్. ౧౦౩
క॥ ఈవిధమున నీ యాత్మను నీవే పరికించి శోక నిరతిఁ దెగడి ప్రా
నావిష్కృతి నెగడుము ని న్నావిలభావమ్ము వెరయ దావల నవలా! ౧౦౪
తే॥ ఓయనిందితురాల!నీ వ్రొటుపడకు భద్రమూర్తి! నానుడి పరిపాటి నరయు
మిపుడ వోయి సలక్ష్మణు నినకులేశు నినసుతాదికీశులఁ ద్రుంతు నేగుదెంతు.
ఆ॥ అట్లుగాక యాతఁ డధికుఁడై నను వజ్రకల్పశరము లనిచి గాసిపఱిచె
నేని నాదునుడుల నీ వొనరింపంగ వలయు తెఱఁగు వినుచు నాఁడ వినుము.
క॥ సీత నలమి పాలియింపుము పాతక మొకఁ డున్నె నీకుఁ బతిసగు నాతో
సీతనువు వేల్చి పరలోకాతతసౌఖ్యంబు లందు మందఱు మెచ్చన్. ౧౦౬

—♦ మందోదరి రావణునకు కర్తవ్యముఁ జెప్పుట ♦—

చ॥ అనిమెఱిఁగించిన న్విని ఘనార్తిమునింగి లతాంగి కన్నులన్
దొనదొన మంచు నశ్రుతతి తొంగలిఱెప్పలఁ ద్రోచుకొంచు నె
ట్టనఁ బ్రవహింపఁ జేడ్పడి యొడ ల్వడకంగ నెలుంగు రాల్పడన్
వినమితవృత్తియై పలికె వెల్లఁదనంబు మొగంబు నందఁగాన్. ౧౦౭
సీ॥ నాథ!నానుడి విని నన్నుమన్నింపుము తలఁపు మియ్యది యథార్థంబటంచు
కలన నీకేని నన్యులకేని గెలువంగ నలవిగాఁ డధివీర్యుఁ డర్కకులుఁడు
ప్రత్యక్షదేవుండు పరుఁ డాతఁడు ప్రధానపురుషేశ్వరుఁడు నిత్యభూతిమయుఁడు
విభుఁడు రాముఁడు నాఁగ వెలసెను ధర్మసంస్థాపనార్థము శ్రితసారమణియ
కాఁగ శ్రుతివిదితం బిది కాదె తొల్లి నిగమముల ముచ్చిలిన యవినీతు సోమ
కాఖ్యుని వధించి యవి దెచ్చి యజునకిచ్చె ననుచు మత్స్యావతారుం డనంగ నెగడి.
క॥ మను వగు వైవస్వతు నటు మనిచె న్నిఖిలాపదలను మాయించి జగం
బున విశ్రుతంబకాదే యనవద్యునిచరిత మిప్పు డన నేర్పదు నే ౧౧౦
తే॥ భక్తవత్సలుఁ డీరామవరుఁడె లక్షయోజనాయామవిస్తృతం బొడలు వెలయఁ
గూర్మ మైతరిగిరిక్రిందఁ గుదురుకొని యొ సంద్రముం ద్రచ్చు నాఁటి ప్రసంగమునను.
మ॥ అతిదుర్వృత్తతమై హిరణ్యనయనుం డబ్జాత్భుఁ డేడి యటం
చతిరౌద్రాకృతిఁ బేర్చి సంద్రమున నొయ్యం డయ్యెఁగాఁ జుట్టి యా
క్షితి ముంపం దనక్రోడరూపమున నిస్సీమప్రభావోన్నతిం
బ్రతిపక్షుం దునుమాడి యెత్తడె స్వదంష్ట్రన్వేల్పు లుప్పొంగఁగన్. ౧౧౨
ఉ॥ పట్టి యగల్చుచుం దనదు పట్టిని నీహారిఁ జూపుమన్నఁ జే
పట్టి ప్రసన్నుఁడై నిసువుఁ బాలనసేయఁగ స్తంభ మందు వేఁ

బుట్టి నృసింహరూపమునఁ బూర్వసుపర్వ హిరణ్యసంజ్ఞునిం
గిట్టి వధించి యాశ్రితునిఁ గీర్తితుఁ జేయఁడె యాతఁ డెవ్వఁడున్. ౧౧౩

తే॥ అదితికింబుట్టి బలిని మూఁడడుగు లడిఁగి యాత్రయమున జగత్త్రియ మాక్రమించి
మించి యతనికి సుతలమ్ముఁ బంచియిచ్చి యింద్రున కిడండె స్వారాజ్య మీాఘుసుండు.

తే॥ దుర్మదుల రాజులఁ దొలంపఁదోఁచె బరశురాముఁడన భార్గవకులంబురాణమెఱయ
హైహయులఁ ద్రుంచి సత్తపం బధిగమించి జగతి కశ్యపున కొసంగెఁజాణయితఁడు.

తే॥ అనఘునవతారములు విస్మయావహములు భార్గవుఁడు శాంతుఁడైన నెపమున దశర
థాత్మజుఁ డనంగ నుదయించె నసురతతులచేష్ట లుడిగింప నెఱిమీఱు సిరిఁ దలిర్ప

క॥ తలఁపెఱిఁగి యప్పురాత్పరుఁ దలఁపున నిడి యతని పాదతలము లెనయ నా
పోలు పెన్నక తత్సతినే నలపింపఁదలంచి తీవవార్యుఁడ వగుచున్. ౧౧౮

ఆ॥ మాయలాని ఁజెడుగు మారీచుఁ గొనియాట లాడి తతఁడు పడిసెనవల నెట్లొ
చిచ్చు నొడి నమర్చి చేర్చితి విచటికిఁ గొలమడంప నాదు కొడుకుఁ జంప. ౧౧౯

ఆ॥ ఏమి ద్రొచముకొంటి విప్పాటనైన విదేహతనయ దేవదేవునకు నొ
సంగు మాదరము పొసంగఁ దమ్మున కిమ్ము రాజ్యభార మిచ్చ రహిఁ దొలంక.

క॥ ఇమ్మెయి సౌచిత్యమ్మున కిమ్మై జతనం దనర్చి యేఁ దొడై రా
సమ్మతిమై వానప్రస్థమ్మున వని కేగి తపము సాధింపు మొగిన్. ౧౨౦

తే॥ నిత్యయావన నగు నాదు నెఱి నెఱింగి యొండుసేయం దలంపక యుచితవృత్తి
మై మెలంగుము సీతమ్మ మానసీయుఁ జేసిన తెఱంగరసి రాముఁజేరఁగనుము.

క॥ సకలశరణ్యుని శరణనుట కలంకము గాదు నీదు డంబర మెల్లన్
వికల మయిన నిప్పటికినిఁ బ్రకటముగాదఁటె విరక్తభావం బకటా. ౧౨౨

క॥ నీనేర్చిన విద్దెలకును నీనెఱపిన తపములకును నీపుట్టునకా
యీనీమహిమమునకు సరియౌనే యాఱడివినాశ మందు టధీశా! ౧౨౩

తే॥ నిన్ను మించిన కొడు కట్లు నిహతుఁడైన చుట్టపక్కము లెల్లరు మట్టమైనఁ
బాయనీయని కూర్మి నీ బ్రదుకుఁగోరి వేఁడుకొనుచున్నదాన నావెరవుగొనుము.

ఆ॥ అనుచుఁ బాదయుగళి నవశతమై వ్రాలి యొత్తి తెలుపు నువిద నెత్తుపడితె
కలికి! యంచు గ్రొచ్చి కౌఁగిటఁ గదియించి బుజ్జగించుచునె విభుండు వలికె.

—♦ రావణుఁడు భార్యతో తన నిశ్చయము దెల్పుట ♦—

ఉ॥ ఇమ్మ సెడంగఁ దమ్ములనహీనుల సూనుల రాముతోడి యు
ద్ధమ్మున గీడ్పడం బనిచి తక్కినబందుగు లాప్తులున్ స్వనీ
కమ్ములు నమ్మెయిం జని వికాశిక లై పడఁ బ్రాణభీతి నే
స్తమ్మొనరింతునే? తుదిఁ బ్రశస్తి తలంగ వనిం జరింతునే? ౧౨౪

ఆ॥ మున్ను దొడరి గెలుపు సున్నగా నరులిడ్డ యరులు సవ్వ నొరుల నాశ్రయించి
బ్రదుకఁజాల నెదిరి పాఱంగనేర నా తలఁపు దెలుపువాఁడఁ దన్వి! వినుము.
తే॥ రాము నెదిరించి నిలిచి రారాపు సూపువాఁడ గెలిచినఁ బరఁగఁడు నొడనైన
నతని బాణాగ్నికుండంబునందు వేల్తుఁ దనువు విశసించి తద్ధామ మనుగమింతు.
తే॥ రాఘవుఁడు విష్ణుఁ డనుచు శ్రీరమణి ధరణిజాత యనుచు నెఱుంగుదు సంతసమున
నాయమం గొని తెచ్చితి నఖిలసిద్ధు లిందె కల వని సందియం బంద నేల? ౧౨౯
క॥ రామునిచే ననిఁ దెగి యభిరామము తత్పరమపదము రహిఁ గాంచెద ని
ష్ఠీమెయిఁ బదముల కొలువున నీమే నుండంగఁ దలఁచి యేగ మృగాక్షీ! ౧౩౦
క॥ సహధర్మిణీ! వినుము నే సహింతుఁ దద్బాణవహ్నిసంస్పర్శమ్ముల్
బహిరంగ మెడయునంతనె వహింతు విభు నంతరంగవర్తిత్వమ్ముల్. ౧౩౧
క॥ చిరకాలము సంసారముఁ బెరసి సుఖించితిని నీదుపేరిమి నెఱయన్
దరియింతు నిఁక భవాంబుధి దరి నెనయఁగ నైన మేలి తఱి యిదె యనుచున్.
తే॥ ఎది పరానందమయి శుద్ధ యెద్ది గొన ముముక్షు లీక్షింతు రాగతి నెనయఁగాంతు
రాము నెదిరించి సద్ధాము రాణ నెంచి మించి తిలకించి పులకించి మే నడంచి.
క॥ చేసిన యఘముల నెల్లం బాసెద జన్యావభృథము ప్రస్తావమునం
దీసీమనె రాముకృతిన్ భాసిల్లెద ముక్తియోగపరతంత్రుఁడ నై. ౧౩౪
తే॥ క్లేశముఖపంచకతరంగకీర్ణ మాఢ్యపుత్రదారాప్తబంధుస్వభూరిఝషము
భ్రమయుత మనంగజాల మహార్వనిభరోష మిట్టిసంసారసాగర మేఁ దరింతు.
క॥ నేను హరి నెనయఁబోయెద మానిని! నీయిచ్చ మెయిని మనియో చనియో
శ్రీనాయకాంఘ్రియుగళశ్రీనుతసేవాప్రసక్తిఁ జెనయుము సుగతిన్. ౧౩౬
తే॥ అనుచు నర్మిలిఁ బ్రియరాజ్ఞి నాదరించి తెలియ నగు నర్థ మంతయు దేటపఱిచి
తరలె రావణుఁ డాధురంధరు నరేంద్రుఁ దొడరి గెలువ నెడఁద నాస దొండడింప.

—♦ రావణుఁడు యుద్ధసన్నద్ధుఁడై వెడలి రాముం గవియుట ♦—

ఉ॥ ఘోరనిశాచరు ల్వెడలి కోరిక లీరిక లెత్తఁ బగ్గెలం
గూరిచి పల్కుచుం గవిసి కొత్తలల సేయుచు నేగుదేర నిం
ద్రారి మహారణంబునకు నాయితపాటునఁ గూర శ్రీయుతం
బై రహి దేర్ప నొ నరద మాశరు లేర్పాటి మీఱఁ దార్పఁగన్. ౧౩౮
సీ॥ వజ్రనిర్భేద్య మై వఱలుచుఁ దొల్లింటి సంగరంబుల కీర్తిఁ జాటునదియు
షోడశచక్రము లొసబగొంద స్వరదల మబ్జమ్ముతో సామ్య మందునదియు
నటు పిశాచాస్యంబు లౌ ఖరంబులఁ బూన్ప నతిభయావహవృత్తి నడచునదియుఁ
బ్రబలశస్త్రాస్త్రముపస్కరాఢ్యము నిరవస్కందగతియు నై పాలునదియు

సంచితవరూథకూబరాభ్యంచితంబు నైన యారథ మెక్కి మహారథుం డ
ధీశు రాము జయింతు నిట్టిట్టు లనుచుఁ దనమనోరథములనెల్లఁ దడవుకొనుచు.

ఉ॥ భీషణమూర్తి వాఁడు సవిభీషణు లక్ష్మణవానరేంద్రసం
తోషణు వైరిపక్షబలదూషణు నుద్ధతసాగరాంబుసం
శ్లోషణు భక్తజాలపరిపోషణు భానుమదన్వయోల్లస
ద్భూషణు రాముఁ జేరఁ జని భూరితరోషహితప్రతాపుఁడై. ౧౪౦

తే॥ కడఁగి వానరసేనఁ జక్కాడఁచుపొంగె నడరుటయు భీతినది రాము నాశ్రయించె
దొడిబడఁ బ్రతీపవాతంబు దొడరి గడప వార్ధి యవ్వలిదరిఁ బట్టు వలను దోఁప.

తే॥ వెస దిగువ కేగు బలువాఁక వీఁక నాఁకపడిన ఱెక్కలపెనుగొండ పగిది నలమి
కనలి పవనజుఁ డెగసి రాక్షసుని వక్షమగల దృఢముష్టిఁ గీలించి యార్చెనపుడు.

క॥ ఆపిడికిఁటిపోటున నతఁ డాపదపా లగుచు రథమునంద పడెం దా
నేపఱి రూపుసెడం జానూపోపాలంబ మొదవ నుచితం బెడలన్. ౧౪౩

ఆ॥ ఒక్కగడియ ప్రాలి యున్నయట్టులె యుండి తేఱి యోరి! నీదు తెలివి మెచ్చి
నాఁడ ననిన హనుమ నన్నేల పొగడెద వింతవట్టు బ్రతికి తెట్టు లనుచు. ౧౪౪

క॥ రావణ! నావక్షంబున నీవిలసితముష్టి వెలయ నెఱయింపుము నే
నావల మఱి బరఁగించెదఁ జావో చేవయొ యొకొండు సమకూరు నటన్. ౧౪౫

ఆ॥ అనిన వాఁడు వ్రేంగి యట్లె యొనర్చిన ఘూర్ణమానుఁ డగుచు గొడవ నొంది
యవలఁ దెలివి గాంచి యసురు నొంపఁ దలంపఁ దెరలి యాతఁ డొండుదెసకుఁ జనియె.

వ॥ అగ్నివర్ణుండును సర్పరోముండును ఖడ్గరోముండును వృశ్చికరోముండు నను రాక్షసవీరులు కనలున నెగిచిపడుచుం దీక్ష్ణాయుధంబులు ధరించి వానరవీరవరుల నురవడించి తాఁకి నామసరూపంబు లగు చేష్టావిశేషంబులఁ బొడవడంపం దొడరుటయును నవ్వారలలో నగ్నివర్ణుని హనుమంతుండును సర్పరోముని నంగదుండును ఖడ్గరోముని విశ్వకర్మతనయుం డగు నలుండును వృశ్చికరోముని సేనాధీశుం డగు నీలుండును వరుస దప్పక పరుసఁదనంబుతోడి యరుసంబున మొగకొని యగపడి యగడుపఱుపం జొచ్చి రందు. ౧౪౬

తే॥ అగ్నివర్ణుండు తనమేని యగ్నిశిఖలఁ బరఁగు బాణాగ్నిశిఖలతోఁ బరిఢవిల్లఁ
జేసి హనుమని గాసిల్లఁ జేయుటయును బవనసుతుఁ డోసరిలని దర్పమునఁ బెరిఁగి.

ఆ॥ అలవి గాని యచల మలవోక పెకలించి యసురమీఁద వైచె నలవు నెఱయ
దాన నడఁగి గిరికిఁ దద్ద వాఁ డొనఁగూర్చె వహ్నిమత్త ధూమవర్తనమున.

తే॥ సర్పరోముఁ డంగదు నుపసర్పణమున దర్ప మెడలింపఁ దొడరి యదల్పఁ గనలి
వాఁడు వాని విశాల మహా పాదపమున వాలి దుందుభి నట్టులు వాలి మడఁచె.

తే॥ ఖడ్గరోముండు పటురోపఖడ్గములను నలుఁ బరబలాబ్ధిబాడబానలు నెదిర్చి
యార్పువుచ్చుకొనంగనీ కొరయుటయును బెరుఁగు రోసంబునం బెచ్చు పెరిఁగి
క॥ ఒక్కఁడు మహాకృపాణము జిక్కం జేర్చుకొని వాని శీర్షం బలుఁగుల్ [యార్చి
సిక్కని మేనును ధరపై ముక్కలుముక్కలుగఁ జేసి మొనయఁగ వైచెన్. ౧౫౩
క॥ ఆమై సుడిసెడు వృశ్చికరోము న్నీలుండు గదిసి రూఢి తలిర్పం
గా మితిమించు శిలం గొని యామఱ జముఁ గాంచు మనుచు నడఁచెం బెలుచన్
క॥ నలువురు నలువురఁబోరిగొని బలువు నెఱయఁజేసి రాము పార్శ్వ మొనసినన్
బలువురు బలువుర నమ్మోయి చలమునఁ జెగటార్చి యార్చి సంభ్రమ మొదవన్.
వ॥ ఏలినవాని సన్నిధికిం జని తోడివారితోడిపాటుగ మన్ననలు వడసి యున్నంత.
క॥ భానునిఁ బెరయం జను స్వర్భానునిక్రియ దోఁప నరిగెఁ బౌలస్త్యుఁడు సీ
తానాథుఁ డున్న దెసక సమానాటోపబలవిక్రమంబులు పొసఁగన్. ౧౫౬
తే॥ ఉరవడి రథస్థుఁ డసుర వజ్రోపమంబు లైన శరములు వరఁగించె నచలముపయిఁ
దోయదము వర్షధారల దొఱయఁజేయు పగిది రాముపైఁ గెలనివా రగఁడుపడఁగ
తే॥ అగ్నివర్షంబు నెగడించినట్లు రాముఁ డసురుపైని శరాసార మడరఁజేసె
వాఁడు పొదలె దివిం గనువార లెల్ల నబ్బ మిది యంచుఁ దమలోన నాడుకొనఁగ.
ఆ॥ భూమి నిలిచె నెదిరి పురుషోత్తముఁడు రాముఁ డడరుచుండె నట్లు లాశరేంద్రుఁ
డరదమునఁ బొసంగి యది యిది సరిపోలు చెట్లు లనుచుఁ బలికి రెల్లసురలు.

—♦ ఇంద్రుడు తన రథసారథుల రామునకుఁ బుత్తెంచుట ♦—

ఉ॥ మాతలిఁ బిల్చి శక్రుఁడు సుమాళము నెట్టన మీఱఁ బల్కె నీ
వీతఱి నస్మదీయము సమీహిత మెంచి రథమ్ముఁ గొంచు వే
భూతల మందఁగాంచి రఘుపుంగవునిం గెలిపింపు మాత్మవి
ఖ్యాతికి నీ డనం దనరు నట్టిద నేర్మి రసోర్మిలంబుగన్. ౧౬౦
క॥ అనినన్ మహాప్రసాదం బని యరదము హరుల హరుల నాయిత మొనరం
బొనరించి పూంచి రఘునందను దఱియంజనియె నతఁడు దద్దయుఁ బ్రీతిన్.
సీ॥ బంగారు రంగారు పరితోవయవముల నుప్పరంబునకుఁ జె ల్వుప్పతిల్ల
గింకిణీసాహస్ర కిణకిణారవముల పంపిణు లైసలాని పరిఘవిల్ల
రవిమండలం బొండు రవణిల్లె నన నచిరత్నరత్నద్యుతు ల్లగము మీఱ
సితము ఛత్రము మేలి సిడముసీవిరులును శ్రీవిలాసకలావిశేషములుగఁ
బిచ్చుకుం టని యరుణు మార్పేరఁ బిలుచు సారథీడ్యుఁడు సారథి ప్రేరణింప
రాముఁ జేరంగ నరుదెంచె గయము మెఱయ రాజరాజప్రథము దేవరాజరథము.
క॥ ఆమెయి రాము విజయముం గామించి నికామహృష్ట గతి నెఱయఁగ సు
త్రాముని సారథి రథ మపు డాముని సురవరదుఁ జేర్చి యవహితుఁ డగుచున్.

క॥ వందన మొనర్చెదను శ్రితచందన! యవధారు దేవ! సవితృకులమణీ!
ముందుగ నింద్రుని దగు నాసందేశముఁ గొను మటం బ్రసక్తము జయముల్.
సీ॥ ఇనవంశ్య! నీ వరి నెదిరి మేదిని నిల్వ నతఁడు రథంబున నమరియుండ
నీదుకింకరులకు నెఱిమాలి నటులయ్యె నటుగాన నీకయి యనిచినాఁడ
దీని నధిష్ఠించి తెరలింపు మసురుని దీనపాలనవిధి తెలియఁగఁ
బురహంత కజుఁడక్షు పొనరించు సారథ్య మితఁడు కృతార్థత నెనయుపొంకు
ననుచుఁ దెలుపు మనియె నయ్య ని న్సేవించువాఁడ నగుచు వచ్చినాఁడ దీన
నస్త్రశస్త్రములు మహాశక్తిముఖ్యముల్ గలవు తూణఖడ్గకార్ముకములు. ౧౬౫
ఆ॥ ఒకఁ డభేద్యకవచ మున్నది యది దాల్పు మన్నియుం గ్రహించి యరద మెక్కి
నన్ను నేలుకొనుము నాతండ్రి! నీవాఁడ నెందు నీకు సురల కెరవు గలదె. ౧౬౬
తే॥ అన ఘనానందసాంద్రుఁడై యలరుటయును రాముఁ డభిరామమూర్తియౌ రాణ
లక్ష్మి యుపలాలనంబు కలానిధానమగుచు లోకావలోకాద్భుతావహముగ. [నెఱయ
ఆ॥ చుట్టివచ్చి మ్రొక్కి సూనృతుం డద్దేవుఁ డీప్సితంబు పొనర నీశితృండు
దేవరాజరథము తెలిఁగెంచి యధిరోహణం బొనర్చెఁ బుషితశంబరారి! ౧౬౭

—♦ రామ రావణ మహాయుద్ధము ♦—

క॥ రామరో! కన్నులు గలిగి నిరామయు లగు వారు గాంచి యలరారిరి శ్రీ
రామునిఁ గోదండకలారాముని మునిమానసాభిరాముని నియతిన్. ౧౬౮
తే॥ అద్భుతం బగు యుద్ధ మప్డడరె రామరావణులకు జగత్త్రియరావణముగ
దారతమ్యప్రచారంబు తవులు విడుపు లేని దగుడుఁ దదాఖ్యానలీలలొలయ.
ఆ॥ కడఁక నడచె విభుఁడు గాంధర్వమునను గాంధర్వ మసురవైవ దైవము నధి
దైవమున మహాస్త్రతత్త్వవేత్త కొకంటఁ దఱుగు నొఱఁగు ననుచుఁ దలఁపఁగలదె.
మ॥ పరమక్రోధమునం దనర్చి ఘనచాపస్ఫాలనం బొప్ప ని
ర్భరరక్షోస్త్రము గ్రమ్మఱం బనిచె ఘోరం బాశరేద్రుండు త
చ్ఛరమం దుప్పతిలె న్మహావిషము లాస్యప్రోల్లసజ్జ్వాలముల్
స్ఫురదాశీవిషశస్త్రజాలములు వాసుక్యాదిసంశీలముల్. ౧౭౦
తే॥ రావణధనుశ్చ్యుతము లహిరాజ శరము లట్లు
వ్యాత్తాస్యములు గాఁగ నడరి దెసల
నావరించుటయును నరదేవవరుఁడు
తఱిమి గారుత్మతాస్త్రంబు దవులుకొలిపె ౧౭౩
ఆ॥ అవి భయానకముల యైన నత్యంతభయావహమ్ములగుచు నడరఁ దొడరె
రాము గరుడశస్త్రరాజము ల్కాఞురూపములు స్వర్ణమయసుపర్ణములుగ.

తే॥ క్షణములోపల నమ్మహాశరము లగ్ని నిభము లాశరపన్నగనివహములను
రూపుమాపె నేరికిని నిరూపణంబు సేయరాని ప్రభావంబు సిరి దలిర్ప. ౧౭౫

క॥ అహిశత్రుశరము లమ్మెయి నహిరిపునిభు రామవిభు ననంతప్రతిభుణ్
సుహితు నెలయించి యహితుని యహితండములం బెరల్చి యలరారుటయుణ్.

మ॥ తనయస్త్రం బటు వ్యర్థ మౌటఁ గని దైత్యస్వామి సంక్రుద్ధుఁడై
ఘనఘోరాశుగవృష్టుల న్రఘువరు న్గాతింపఁగాఁజొచ్చి శ
క్రుని సూతుం బటుబాణసంపిహితగాత్రుం జేసి యైంద్రధ్వజో
పనిపాతం బొనరించి యశ్వముల దర్పంబు న్నివారించినణ్. ౧౭౭

తే॥ కాలు సే యాడనీయని కల్పమునను రామచంద్రుని రావణరాహు వడరి
గ్రస్తుఁజేసె భృశార్తుండు గా నటంచు దివ్యు లెల్లరు వడఁకిరి దిటవుసెడఁగ.

క॥ ఆనుష్టకర్మ కర్మం బాదశరథతనయు సునయు నటునిటు జేయం
గాఁ దొడరునపుడు రోహిణిఁ బాదుకొనియె బుధుఁడసాధుపరివర్తనుఁడై.

తే॥ అట్టు లింద్రాగ్నిదైవతం బైన కోసలాధిపతుల బుఱుఁడు గుజుఁ డాక్రమించె
నదియు నశుభావహం బైన యదియ యుఱియ సెట్టరక్కసి యేడ్తెఱ సెల్లుటకును.

తే॥ ధూమపరివృత్తమై యగ్ని దుస్థమయ్యె ప్రజ్వలన మొప్పరోషాప్తిఁ బ్రబలె సంద్ర
మర్కుఁ డాయంగనరిగెడునసఁగ నెగసెనాదురాత్ముండు రామునట్లఁబుముటయును.

ఆ॥ చెడె దివాకరుం డసిశ్యాముఁడై పరుసందనంబు దోఁప శాంతరశ్మి
ధూమకేతుయుక్తుఁ డామట్టునసె కబంధాంకుఁడును ననంగ హంగడంగ. ౧౮౨

క॥ పదితల లిరువది చేతులు పదిలములు శరాసనములు బరఁగఁగ నపుడా
పదికుత్తుకల పిశాచము పదరెను జట్టుపలతోడి పర్వత మనఁగణ్. ౧౮౩

ఆ॥ వానిచే నిరస్యమానుఁడై బాణసంధానదృష్టి మఱచుతరము దార
సిలఁగ స్వాత్మనీన శ్రీయొప్ప నొప్పారె నది యశక్య మెన్న నమరులకును. ౧౮౪

శా॥ కించిల్లోహితనేత్రుఁడై భ్రుకుటి సంకీర్త్యత్వ మొందంగ నై
ష్కించన్యం బెడఁబోవ గాఢ క్రుధ లక్ష్మీభూత గా వైరిమే
న్గ్రొంచెం బంచు దహించు దృష్టి వెడసంకోచంబు నోనాడ భీ
మాంచన్మూర్తి ధరించె రాముఁడు స్వతంత్రామేయభావోన్నతిణ్. ౧౮౫

క॥ కాలస్వరూపుఁ డీశుఁడు కాలాకృతి శత్రుఁ గెడపఁ గా నఱిమెడు నా
లీల దులకించె లయకాలాలంబితభైరవాట్టహాసస్ఫురణల్. ౧౮౬

ఆ॥ ముద్దుమోము నగవు మురువు మార్పడునంతఁ గ్రుద్ధభావలక్ష్మి కొమరువింత
వేడబములు సూప వేల్పులే సడలిరి పుడమి వడఁకెఁ దెరలె భూతవితతి. ౧౮౭

తే॥ సింహశార్దూలములతోడ శీర్ణవృక్షసంతతులతోడ శైలంబు సంచలించె
క్షుభితతర మయ్యె సంద్రంబు క్షోభమందు నదులతో గగనస్థఘనములతోడ.

క॥ పరుషముగ నఱచుచుం దివిఁ బరిక్రమము లేర్పడ న్నిపాతోత్పాత
స్ఫురితములతోడ ఖగములు విరావమొప్పారఁ జెట్ట వివరించెఁ జెలీ. ౧౮౯
తే॥ ప్రభువు సంరంభ మమ్మెయిఁ బరఁగుటరసి తోఁచు నుత్పాతవితతి యుద్ధురతఁ
సన్నలెడలిన యక్కైరి సకలజనులువాసి క్రోల్పోక నెఱయరావణుఁడువడఁకె. [గాంచి
క॥ సురలు మునులు గంధర్వులు నురగులుఁ గరుడులును జేరి యొకదెస నటు ఖే
చరుల యగు నసురు లొకదెస నరయుచు సంవర్తలక్ష్య మాయుద్ధంబుల్. ౧౯౧
ఆ॥ కూర్చి ముచ్చటించుకొను నెడ మొదలిసంఘములవార లనిరి ఘనుఁడు రాముఁ
డే జయించు ననుచు నితరులు వచియించి రసురవరుఁడు గెలుచుననుచు నపరి. ౧౯౨
క॥ అరుసముప్రపత్తియును నెవ్వరియెడ నెవ్వారి కెట్లు వఱలెడునో య
వ్వరుసనెములుఁ గూసెను నుదిఁ బరగిం త్రవ్వార లట్టి పలుకుంబడుల్. ౧౯౩
ఆ॥ అట్టు లడరి క్రోధ మవశతఁ గూర్వంగఁ జాపసంప్రయుక్త శాతశరశ
తంబు లనిచి దైత్యుఁ దద్దయు బడలించుటయు నరేంద్రుఁ గినుకమొయి నదల్చి.
క॥ రావణుఁడు కడఁక తోరం బై వెలయ దురాత్ముఁ డగుచు నతిరౌద్రం బౌ
నా వఱలు ప్రహరణం బొకఁ డావేళ స్పృశించి వఱప నొఁ గా కనుచున్.
సీ॥ ఎది వరప్రాప్త మై యిత్థయుగాంతాగ్నికల్ప మై కలనునఁ గాని పించు
నెక్కాల మేయది యిచ్ఛమైఁ బరఁగించు నుపహారతతపూజ లోఁజ నొఱయుఁ
జూపుమాత్రన దహించు ననంగ నెయ్యది పెనుపొంను పేరునఁ బేర్చుచుండు
హీరసారం బెద్ది ధారుణీధరశృంగనిభకూటములతోడ నివ్వటిల్లుఁ
గొనలు పొగలు గాఁగఁ గొఱలు మంటల జంటఁ దనదు రోస మిట్లు దనరె ననఁగ
నగుచుఁ గాలునకు దురాసదం బనఁ జను నట్టి శూల మొక్కఁ డవధరించి.
తే॥ దారణము సర్వభూతవిత్రాసనంబు భేదనంబును నైన యాపృథులపరమ
సాధనము నెంచి రాముఁ బ్రసక్తిఁ గాంచి యేయ నుద్యుక్తుఁ డై రాక్షసేశ్వరుండు.
క॥ నడుమన యద్దానిం గొని కడురభసం బొప్ప నెదిరిఁ గని కన్నులఁ గెం
పడరఁ దనవారు పురికొనఁ దొడరించె న్భైరవంబు ధూర్తుఁడు రవముల్. ౧౯౮
ఆ॥ పుడమి చదలు నెల్ల కడలు గంపింపంగఁ గడలి క్షోభ మెనయఁ గా సమస్త
భూతములు వడంకి పొలివోవ నాతని భీమఘోరవంబు పెచ్చుపెరిగె. ౧౯౯
క॥ అటు లార్చి మహావీర్యుఁడు పటుతర మాసాధనంబు బరఁగించుచు ను
త్కటమదమున రామునితోఁ దటుకున నిట్లనియె దైత్యదర్పాపహరా! ౨౦౦
చ॥ అడ రడఁగించు లే నరుఁడ ! యాయుధ మియ్యది వజ్రసార మే
ర్పడినది నిన్ను నీయనుజుఁ బాపఁగ వేఁపఁ గలంపఁ జక్కనై
తొడరినఁ జాలుఁ దర్పరమధూర్తతఁ ద్రుంగఁగఁ జేసి యుద్ధమం
దెడలిన యస్మదీయుల సమీహితము ల్పమకూర్తుఁ జెచ్చెరన్. ౨౦౧

ఆ॥ ఓరణార్థి ! నిలువు ముదఁటార్తు లె మ్మిదె యనుచు శూల మట్టహాంకరించి
వైచె దుష్టుఁ డసురవరుఁ డది యాకసం బగలఁజేయు రభస మానహిల్ల. ౨౦౨
శా॥ విద్యుజ్జ్వాలసమాకులం బగుచు నుర్వీద్యోంతరగం బెల్ల నే
కద్యోతం బగుచుండ స్వాత్మసుమహాఘంటానినాదంబు నే
గోద్యన్నాదము నొక్కఁడై దిగిభకర్ణోత్పీడనాపాది గా
నుద్యల్లీలఁ గరాల నై పదరు నయ్యుత్పాత మూహించుచున్. ౨౦౩
ఆ॥ ఆపఁదొడరె రాముఁ డాశుగవర్షంబు నెఱపి వాసవుండు ప్రళయవహ్ని
నిజజలౌఘవృష్టి నెఱిఁ జాప మెక్కుడి వీర్యసారుఁ డధిక వేగ మొప్ప. ౨౦౪
తే॥ రామకార్ముకనిస్సృతభీమబాణములను ఘూర్ణమర ఘూర్ణితమ్ముల నొనర్చె
రాక్షసేంద్రు మహాశూలరాజ మగ్ని పతగముల సట్టు లాఘునప్రపథనమునను.
ఆ॥ శూలసన్నిపాతచూర్ణితభస్మసా ద్భూతహేతివితతి భూతలమున
నట్లు వ్రాల రాముఁ డగ్గలికం బెచ్చు పెరిఁగి దాని యులవు పెం పెఱింగి. ౨౦౬
ఉ॥ మాతలినీత నిర్జరసమాజపతీరిత దివ్యశక్తి ను
త్పాతహారం దటాలున విపాకదురుద్ధరఁ దాల్చి రాఘవుం
డూత మొసంగి వైవ నది యుప్పరవీధి జ్వలత్ప్రభావలీ
ప్రోతముగా యుగాంతసమయోల్కన చుల్కనసేయుచుం బొరిన్. ౨౦౭
క॥ ఘంటానాదాఢ్యయు నై లుంటాకుని శూలము న్విలోడించి వెసన్
దుంటలుగ విఱిచి యిడి నిష్కంటక మొనరించి గమ్యగతిఁ బోలుపొందెన్.
తే॥ అది హతద్యుతి యై రాల నవనిజాసనాథుఁ డరిరథ్యముల జవనముల నజ
కల్పనిశితప్రదరముల గాసిపఱిచి వానివక్షమ్ము వ్రచ్చెఁ దీవ్రశరతతుల. ౨౦౯
క॥ వెండియు మూఁడు పత్త్రుల గండడఁగ. లలాటమునను గాడి మెఱయ ను
ద్దండత నాఁటె రఘుప్రవరుం డాశరు మేను శరనిఘాతమొనర్చెన్. ౨౧౦
క॥ అని శరభిన్నాంగుం డై దనుజేంద్రుఁడు ప్రస్రుతాస్రతతిశోణితుఁ డై
యనుకృతఫుల్లాశోకుఁడు నన నై యను వరయలేక యవశత నుండెన్. ౨౧౧
క॥ ఖేదము క్రోధంబును సమ్మోదం బెడలంగఁజేయ ముఱముఱలాడం
గాఁ దొడరెను రామాస్త్రవిభేదితగాత్రుఁ డయి వ్రీడ పెనఁగొనుచుండన్. ౨౧౨
ఆ॥ అర్దితుండు గాఁగ నలము రోసము సైపలేక ఘూర్ణితాక్షిలీల లోలయు
సంభ్రమమున కల్మిఁ జాప మాస్ఫాలించి మొదిఁ గదిరి బీర మెసకమెసఁగ.
తే॥ అంబరం బెల్లఁ గ్రమ్మిమహాంబుదంబు వర్షధారాసహస్రము ల్వఱపి ప్రాదము
నెట్లు పూరించుఁ గ్రొమ్మించు లెసఁగ నట్లె రాముమై నించె బాణధారాశతముల
క॥ ఆశరుఁ డేయఁగ నేయఁగ నాశరజాలములఁ దాల్చె నదియ కా రా
మేశుఁ డకప్యుఁడు విజయశ్రీశంస్యుఁడు నాఁగ నెగడి శ్రితసురవల్లీ! ౨౧౫

తే॥ ప్రేరణంబు శరౌఘనివారణంబు దారణంబు సపత్నావధీరణంబు
నారణంబునఁ గాన్పింప నధిపుఁ డొప్పెఁ గారణగభస్తిసంగ్రహాగ్రహము నెఱయ.
క॥ క్షీప్రకరుఁ డన్నిశాచరుఁ డాప్రక్రమ మరసి యొరసి యతిదుష్టుం డై
దీప్రప్రదరసహస్రము లాప్రభు నెద నాఁటె విస్మయం బొదవంగన్. ౨౧౮
తే॥ రక్తదిగ్ధాంగుఁ డై సమరమువనమునఁ బూచి యొప్పారు మోదుగు పూచికగుడు
నాఁచికోలయ్యెఁ గాకుత్స్థ నపుడు చక్కఁజూచువారి కన్గవలకు శోభనాంగి.
మ॥ సుమహాజుం డసురాశుగాభిహతి రుష్టుం డై యుగాంతార్కక
ల్పము లా సాయకము ల్నిగుడ్చి యరిదర్పం బెన్న కవ్వాని ప్ర
చ్చి మహౌద్ధత్యము సూపె నిర్వ్యరును లక్ష్మీభూతభావం బల
క్ష్యము గావించిరి ప్రస్తుతప్రహితశస్త్రాస్త్రవృతిప్రక్రియన్. ౨౧౯
సీ॥ అలవెంచి రావణు నలుఁగాంచి సక్రోధుఁ డై రాముఁ డిట్లనె నల్ల నగుచు
నవివేకమునఁ దెచ్చి తట్లు జనస్థానమం దున్నతఱి సీత నవనిజాత
మద్భార్య నాదుసమక్షంబు గాకుండఁ బొంచి వచించి మై వెంచి యొకట
దీనయు వివశయు దీర్ణయు గా బలాత్కారంబునం బాపకర్మ మనక
ధూర్త! యంతనె వీర్యవంతుండ వైతె చెడుగ! స్త్రీశూరుఁడ వనంగఁ జెల్లుఁగాక
యదియును ననాధ లగువారియం దొకొంట నీదు కాపురుషత్వంబు నెఱయుచుండు.
తే॥ రహితమర్యాదుఁడవుగ నిర్లజ్జుఁడవుగ నటులె యనవస్థితుఁడవు గా నడరి తొడరి
యన్యదారాభిమర్శనంబాచరించు నీవు పురుషుండ వౌదె వినింద్యచరిత. ౨౨౧
శా॥ శూరమ్మన్యుఁడ వన్నఁ దోలితి నటంచుం దమ్మనిం దన్ని తే
జోరూఢిం బ్రకటింపఁగంటి ననుచుం జుక్కాణికిం గర్వ మొ
ప్పారంగా రహిఁగాంచె దంతయును సవ్యాజంబ యొందేనియుం
జోరత్వంబె ప్రసిద్ధమయ్యె నిఁక సంశుద్ధత్వ మాబద్ధమే. ౨౨౨
తే॥ పూర్వుల యశంబు దలఁపవ పో త్వదార్జితం బనఁగఁ జెల్లునది యేది ధన్యమాని
వైన ఫలమేమి గెలిచితి వన్నిదిశల దుష్టవర్తనముననె నిర్ధూతసుకృత! ౨౨౩
తే॥ పుట్టితివి కన్నతల్లి దాపొంపు సెడఁగఁ బెరిఁగితివి పెద్దవారల పెంపు దలఁగఁ
దక్కులాని ని న్నన నేల తాతసేఁత యింతవాని నొనర్చుట యెఱిఁగియెఱిఁగి.
తే॥ కల బలసమృద్ధి యుత్సేకగతి వరప్రసక్తియుం గర్వ మెదిగింప జరిగె నెల్ల
రకు నహిత మగు వృత్తంబె ప్రకట మైన లోగి రొడ్లంచు నీవు లోలోన మురియ.
ఆ॥ దొంగ వై మొఱఁగి తోడితెచ్చితివి సీతాంగనం దలంప వదియ మిత్తి
యగుచుఁ జేరఁబాఱె నగుణ! తత్ఫల మిడ్డై యనుభవించువాఁడ వదరిపడకు.
ఉ॥ సిగ్గొక యింత లేనిపని సేసితి వింతియ కాక యేది నీ
పగ్గె బలంబు శౌర్యమును బాడ్వడ వీడ్వడఁ బోని దుర్యశం

బగ్గల మై బయల్పడఁగ నమ్మెయి చౌర్యపుఁబోఁతకూఁటి వే
వాగ్గితి వన్నఁ జాలదొ మహోద్యమము ల్సెడవో యసాచితిన్. ౨౨౭
క॥ డాయక పోయితి వే నాచాయం గొని మెలఁగుచుండు సమయంబున ని
న్నా యెడ మదీయసునిశితసాయకములఁ గ్రొచ్చి ఖరుని జతకుఁ బనుపనే. ౨౨౮
ఉ॥ లేఁ డనిపింప కెట్టులొ బలే కనుపించితి వింతె చాలు నీ
నాఁడయిన న్నిలంబడుము నైఋతనాయక! యొంటిఁబోక ని
న్వాఁడి యలుంగులం జొనిపి వ్రచ్చి కృతాంతనిశాంతలక్ష్య మా
పోఁడిమి గన్నులారఁ గనఁ బుచ్చెద మెచ్చెద నుచ్చితంబుగాన్. ౨౨౯
తే॥ మచ్ఛరచ్ఛిన్న మయి జ్వలన్మహితకుండలమ్ము నీమస్తక మ్మోయిలం దొఱంగి
ధూళిఁబ్రుంగుడుపడుచుండ దొర్ల నీడ్చుఁ గాత మొరయుచుఁ గ్రవ్యాదఖగమృగములు.
ఉ॥ నీయుర మెక్కి గృధ్రములు నేఁడె యథేచ్ఛముగా నవాస్రముం
బాయక గ్రోలుఁగాత మతిపాతశరవ్రణనిస్రుతం బొగిన్
డాయఁగ వచ్చి మెచ్చి గరుడంబులు డంబుగఁ జిల్వలం బలెన్
వేయును గంకముఖ్యములు విస్రపుఁ బ్రేఁగుల లాఁగుఁగాతృతిన్. ౨౩౦
క॥ అని ముట్టఁబలికి రాఘవుఁ డనిమిషులౌ ననఁగ నహితు సంతికగతు నె
ట్టన శరవర్షంబులఁ జొప్పెనయఁగనీ కతివె సన్మహితచారిత్రా! ౨౩౧
మ॥ కలన న్శత్రునిశాతనం బెడఁద నాకాంక్షించు శ్రీరాము న
ద్బలవీర్యంబులు హర్షతర్షకలనాప్రాపీణ్యము ల్రెట్టిగా
బలుపొందె న్బలు పొందు సూపె సకలప్రౌఢాస్త్రశస్త్రంబు లు
జ్జ్వలతేజోనిధి జ్ఞానమూర్తి లఘుహస్తస్ఫూర్తియుం గానఁ గాన్. ౨౩౩

—♦ మెత్తవడిన రావణు రథము సారథి తొలఁగించుట ♦—

ఆ॥ ఆత్మగతము లైన యాశుభచిహ్నంబు లరసి రాక్షసాంతకరుఁడు రాముఁ
డరుస మొనసె నసురు నభ్యర్దితుం జేసె మరలఁ జెరల కొలయు మత్సరమున.
క॥ హరినికరశిలావృష్టుల నరేంద్రశరవర్షముల వినాశోన్ముఖుఁ డై
పెరవేది విఘూర్ణాత్ముఁడు విరతక్రముఁడును నిశాటవిభుఁ డయ్యె సఖీ! ౨౩౫
ఆ॥ శస్త్ర మొరయలేఁడు శరశరాసనములఁ గూర్పఁ గర్షణం బొనర్పఁ జాలఁ
డళ్లి వైచెనేని నంతరంబున వ్రాలు నవియు వైరిఁ దాఁక కసురశమని. ౨౩౬
క॥ తనబీర మెదిరిబీరము గననేరని చిత్తవృత్తిఁ గలఁతంబడు న
ద్దనుజేంద్రు మృత్యుకాలంబున వర్తన ముచిత మైన బుద్ధి నరయుచున్. ౨౩౭
క॥ సూతుఁడు ప్రవీణతాసముపేతుఁడు తదవస్థు రథికు నీక్షించి రణా
పేతముగఁ జేసె నరదము శీతాచలతనయ! తనదు చేమెల పొప్పన్. ౨౩౮

శా॥ క్రుద్ధాత్ముండు కృతాంతచోదితుఁడు నై క్రూరుం డట న్సోమహాసం
బద్ధుం డై కను లెఱ్ఱసేసి నయముం బాటింపఁగా లేక దు
ష్టోద్ధత్యంబున సారధి న్సురథవిద్యాసారధీయుక్తునిన్
రుద్ధుం జేయుచు నిట్లనె న్నెపము లారోపించి శ్రీపాలసీ! ౨౧౯

ఉ॥ బీరము లేనివానిగతి భీరువునట్టు లశక్తుఁబోలె ని
ష్పౌరుషునింబలెన్ లఘునిభాతి నసత్త్వ నమాయికు న్నుతే
జోరహితు న్వ్యపాస్తరిపుఁగఁ జొప్పడ న స్గని స్వేచ్ఛ నిమ్మెయిన్
వారక వ త్తిలం దలఁచి వచ్చినవాఁడవ కావె దుర్మతీ. ౨౨౦

సీ॥ అలవోక న న్నిట్టు లపవాహితు నొనర్తె రథముతో నిజమనోరథముతోడ
ఖ్యాతవీర్యుం డరి కనుచుండ రణలుబ్ధు ననుఁ గాపురుషుఁ జేయ ననిచితెట్లు
చిరసమాశ్రిత యశశ్శ్రీ తేజ మోజమ్ము ప్రత్యయమ్మనుబాడు పఱిచి తీవ
పరు పురస్కృతులకై ప్రాల్మాలి తని కాక యవిదితం బిది యంచు నరయఁజాల
నిట్టిపనికిఁ జొరఁడు హితకాంక్షి యగువాఁడు పదరుఁ బఱప శత్రుపక్షజనుఁడు
పిన్ననాఁటఁగోలెఁ బెనుపొంది తిచ్చోట మలసి తరుస మదియు మఱవవలెనె.

తే॥ రిపుఁ డుపగతుం డగుచు నన్ను రెమ్మకుండు నంతలోపల నతని నే నణుమునట్లు
సేయు మిపు డైన రథ మందుఁ జేర్చి నేర్చితేని మది యీదెసఁ బ్రసక్తి నెంచునేని

ఆ॥ ఇటు లబుద్ధియగుచు హితబుద్ధియుతు సూతుఁ గాఱులఱచి యలఁచు గతికి నాతఁ
డలఁతి నధిపుతోడ ననునయ మొప్పఁ బథ్యంబుగాఁగఁ బలికె నంబుజాక్షి!.

ఉ॥ భీతుఁడనో విమూఢుఁడనొ పెంపఱ వైర్యపజాప మంచు నే
నీతరమందు వింటినొ నిరీహుః బ్రమత్తుఁ గృతఘ్ను స్నేహాని
ర్యాతునిఁ గూర్చువాఁడనొ మహాశయవర్యుఁడ విట్టు లాడఁగా
నాతలఁ బెల్ల వ్యర్థ యగు నాళిక నందె నిశాచరేశ్వరా! ౨౨౨

క॥ అయమెంచి నయము నారసి స్వయశఃపరిరక్షణంబు జాడనె చని వి
ప్రియ మొనరించితిఁ బ్రియ మని నియతస్నేహార్ద్రభావ నిష్ఠితబుద్ధిన్. ౨౨౩

తే॥ దోస మెంచి గొనంబులఁ దూలపుచ్చి ప్రియహితాదృతు నన్నిట్లు పెనుపుదక్క
దూఱకు మనార్యలఘుఁడగుఁదొరయ పోలె వినుము నాయపరాధమ్ము విధము దెలియ.

క॥ ఏ నేనిమిత్తమునఁ దే రానియతరణాంగణమ్ము నాభోగము నే
తేనెఱి నట్టులు దలఁగం గా నొనరించితినొ యట్టి క్రమ మరయఁజనున్. ౨౨౪

సీ॥ పెనుబోరునం దీవుబీఱువ్రాయెడువాని తెఱఁగున నలఁతమైఁ దెరలుటయును.
సౌముఖ్య మరుసంబు చక్కనై మెలఁగుట యను నివి నీదెస నడఁగుటయును
వర్షాహతములు గోవరముల ట్లీవాజు లఱుమలే కొండొండ నలుకుటయును.
దుష్టనిమిత్తము ల్దోడ్తోడఁ బ్రతికూలములు పెల్లుగాఁ దోఁచి మొనయుటయును

దెలియఁ గాంచి నిన్నుఁ దేర్పఁ దురంగమ స్ఖలితగతులతోడి శ్రమముఁ బాప
దొరవు నీదుచనవుఁ దొందరింపఁగ నిదె క్షమ మటంచు నిటు జరిపినాఁడ. ౨౪౮
తే॥ దేశకాలమ్ము లధిపుని తెలివితేట లింగితములు నిమిత్తంబు లీరితములు
దైన్యఖేదహర్షంబులు తద్బలాబలములు సారథి యెపుడుఁ దలంపవలయు. ౨౪౯
తే॥ సమవిషమనిమ్నభూభాగసరణు లాత్మపర పరావరభావము ల్పరఁగుతఱులు
స్థాన ముపయాన మపయాన సర్పణాపసర్పణములును యంతకుఁ జనునెఱుంగ.
ఆ॥ రథకుటుంబి వాఁడు రాణమై మెఱయంగఁ దగినయట్లు మెలఁగఁ దగునకాని
యరద మెక్కినంత కాపే రెనయఁబోవఁ డింత నిజము రాక్షసేంద్ర! వింటె.
క॥ లక్షణలక్ష్యము లరసి పరీక్షణ మెడలించితిని యథేచ్ఛాంగా దీ
వీక్షణ మేయది తత్త్వమొ వీక్షించి యనుజ్ఞసేసి వెలయుము కరుణన్. ౨౫౨
క॥ నీనెఱపిన శిక్షమెయి న్నే నానృణ్యంబు మదిని నెలకొనఁగానా
పూనిక మెలంగువాఁడం బో నొం డగు తెఱఁగు వంకఁ బొరయఁగ నింకన్.
చ॥ అని వివరించుయంత నుడు లారసి సంగరలుబ్ధుఁ డాతఁ డా
నని పరితుష్టి నెక్కొనఁగ నాహృదయంబు దయామయంబు నై
తనరఁగ వానిఁ బేర్కొనుచుఁ దద్దయు రత్నపుఁ గూర్పు లొప్పు చ
క్కని కరకంకణం బొసఁగి క్రయ్యని యాదర మొప్ప నిట్లనున్. ౨౫౪
ఆ॥ సూతవర్య! నీవు సుముఖుఁడ వైరాఘవాభిముఖునిగా రయంబు మెఱయ
రథము నడుపు మిఁక నరాతులం దెగఁజూడ కురక రాఁడు రాత్రిచరవిభుండు.
క॥ రావణు నెదిర్చి మనఁబో డేవైరియు ననుచు నీవు నెఱుఁగుదు మదిలో
నావల నరయుచు మెలఁకువ మైవిహరింపు మనమెందు మూర్వడకుండన్.
ఆ॥ అనుచు నానసేయ ననితరహర్షాప్తి బొదలి సెల వటంచుఁ బొలుపుమీఱ
దీఁగెఁ దివిచి నట్లు తే రెనయించె వాఁ డదియు రాము నెదుట నపుడ నిలిచె.
మ॥ అలఁతం బొంది తలంగి క్రమ్మఱ మహాహర్షంబుతోఁ దొంటియ
ట్టిలలిం ద న్నలవొంక మార్గొని నిరూ ఢిం బేర్చు పౌలస్త్యు దు
ర్లలితం బెంచి స్వకీయఖేదమును సంలక్షించి యివ్వాని నె
ట్లలఁతిం గెల్వఁగవచ్చు నంచు హృదయ వ్యాపార మేపారఁగన్. ౨౫౮
క॥ విస్మితుఁ డగు రామునిఁ గని సస్మితుఁ డై యరుగుదెంచె సంయమివర్యుం
డాస్మాకభావి దానవఘస్మరుఁడు మహామహుండు కలశజుఁ డంతన్. ౨౫౯
తే॥ సురలు మును లని దివి నుండి చూచుచుండ వారితోఁ గూడి యచ్ఛోటవఱలు
పాపకర్మల సిరులకు బందెకాఁడు చులకవోని తపస్సారములకు వీఁడు. [వాఁడు

—♦ అగస్త్యుఁడు రామునకు నాదిత్యహృదయం బుపదేశించుట. ♦—

క॥ భగవంతుఁడు పీతాంబుధి నిగమాగమపారదృశ్వ నిశ్చితమహిమో
పగతుఁ డగస్త్యుఁడు రాముని నగణితగుణరాశిఁ గాంచి యలరుచుఁ బలికెన్.

సీ॥ ఉన్నవాఁడవె తండ్రి! యోజన నెఱయక మునుపటి దగు తత్త్వమును స్మరింతె
మాయామనుజతాప్తి మార్గంబుఁ బ్రకటింతె పాటింతె పాఱు చాపలపునడియు
విధిపల్కు తెఱఁగు గావించితివే కద యనుమాన మింకేల యసురు గెలువ
జయలక్ష్మి మొనయనౌ సమయమియ్యదియ సుమ్మసముతో సురకార్య మరసికొనుము
గోప్యము సనాతనము ప్రతికూలహనన మఖిలపాపప్రణాశన మభయదము జ
యావహము పర మక్షయ్య మశివహరము నైన యాదిత్యహృదయ మీ వవధరింపు.

క॥ పురమశివతత్త్వసారము హరియోగాస్పదము బ్రాహ్మ మఖిలసురాధీ
శ్వరభావిత మిది నిత్యము స్మరియింపుము దీనఁ దలఁగు సకలాపదలున్. ౨౬౩

తే॥ సర్వమంగళమంగల్య సర్వవేద సారసర్వార్తిశమనప్రశంసిత మిది
ఆయురభివృద్ధికర ముత్తమానుబంధ మిట్టి స్తవరాజము జపించి యెదిరి గెలుతు.

సీ॥ తెలిసి పూజింపుము దేవాసురార్చితు రశ్మిమంతుని దెసరక్తి నెఱపు
ముద్యన్మహోరాశి నొప్పారఁ గొనియాడు మావివస్వంతున కంజలు లిడు
మట్లు భాస్కరు కొలు వంది మిన్నందుము భువనేశ్వరునకు సంస్తవము లొసఁగు
మఖిలభూతాత్మున కాత్మార్పణ మొనర్పు మాశ్రయింపుము ద్వాదశాత్మగురుని
నితఁడె దేవదేవుఁ డితఁడె తేజస్వి యితఁడె రశ్మిభావనేప్సితుండు
నీతఁడే గభస్తులెనయించి యలరించు నెల్లలోకములఁ దదీశతతుల. ౨౬౫

వ॥ ఇమ్మహామహుండు బ్రహ్మయు విష్ణుండును రుద్రుండును శివుండును స్కందుం
డును బ్రజాపతియు మహేంద్రుండును ధనదుండును గాలుండును యముండును
సోముండును నపాంపతియుఁ బితృదేవతలును వసువులును సాధ్యులు నాశ్వి
నేయులును మరుత్తులును మనువును వాయువును వహ్నియుఁ బ్రజాప్రాణుండును
ఋతుకర్తయుఁ బ్రభాకరుండు నాదిత్యుండు సవితయు సూర్యుండును బూషయు
గభస్తిమంతుండును సువర్ణసదృశుండును భానుండును హిరణ్యారేతసుండును
దివాకరుండును హరిదశ్వుండును సహస్రార్చియు సప్తసప్తియు మరీచిమంతుం
డును దిమిరోన్మథనుండును శంభుండును ద్వష్టయు మార్తాండుండును నంశు
మంతుండును హిరణ్యగర్భుండును శిశిరుండును దపనుండును భాస్కరుండును
రవియు నగ్నిగర్భుండును నదితిపుత్రుండును శంఖుండును శిశిరనాశనుండును
వ్యోమనాథుండును దమోభేదియు ఋగ్యజుస్సామపారగుండును ఘనవృష్టియు
నపాంమిత్రుండును వింధ్యవీధియుఁ బ్లవంగముండును నాతపియు మండలియు

మృత్యువును బింగళుండును సర్వతాపనుండును గవియు శిశ్వుండును మహా
తేజుండును రక్తుండును సర్వభవోద్భవుండును నక్షత్రగ్రహతారాధిపుఁడును
విశ్వభావనుఁడును దేజస్తేజస్వియు ద్వాదశాత్ముండును నను నీశ్రుతివిశ్రుతం
బు లగు నామవాచకంబులఁ జతుర్థియగు విభక్తితోడం గూర్చి నమోంతమంత్ర
ముల నొనరించి యద్దేవు నీక్షించుచు జపింపవలయు. ౨౯౬

సీ॥ వెండియుఁ బ్రాగ్గిరిశుండ! నీ కంజలు ల్పశ్చిమగిరిదేవ బహువినతులు
జోత లియ్యవె కొను జ్యోతిర్గణాధిపతీ! దినాధిపతీ! నతీరితములు
జయ నమస్కారము ల్జయభద్ర! దోయిళ్ళు మ్రొక్కులు హర్యశ్వ! మోడ్పుఁగేల్ల
తతి సహస్రాంశుండ! దండంబు లాదిత్యుఁడా నమస్కృతు లుగ్రుఁడా! నమోను
వాకము ల్వీరసారంగ! వందనములు పద్మబోధక! మార్తాండ! బ్రహ్మశంక
రాచ్యుతేశ! ప్రణామాళు లయ్య యివిగొ సూర్య! జోహార్లుగూర్తుఁద్రిశుద్ధి దనర!

వ॥ జేజేలజేజే! నీకు జేజే లర్పించెద నాదిత్యవర్చస్కుఁడా! శరణు భాస్వంతుఁడా!
శరణు సర్వభక్షా! శరణు రౌద్రాకారా! శరణు తమోఘ్నా! శరణు హిమఘ్నా
శరణు శత్రుఘ్నా! శరణు అమితాత్మా! శరణు కృతఘ్నఘ్నా! శరణు దేవా!
శరణు జ్యోతిషాంపతీ! శరణు తప్తచామీకరాభా! శరణు హరీ! శరణు వహ్నీ
శరణు విశ్వకర్ముఁడా! శరణు తమోభినిఘ్నా! శరణు రుచీ! శరణు లోకసాక్షీ!
శరణు శరణు లోకతంద్రీ! శరణు లనుచు శరణులు సమర్పింపవలయు. ౧౯౭

తే॥ తానె నశియింపఁజేయు భూతము సకలము దాన సృజియించు నీతండె తవిలి ప్రోచుఁ
దన గభస్తుల చాయన తపనవృష్టు లెనయఁగాఁజేయుచుండు నీయన ప్రభుండు.

తే॥ భూతపరినిష్ఠితుండై ప్రభూతమహిమ మేలుకొనియుండు సుప్తుల మేలుకొలుపు
నీతఁడే యగ్నిహోత్రాత్ముఁడీతఁడె యగ్నిహోత్రఫలదాతయుననంగనొప్పుచుండు.

క॥ శ్రుతులుం గ్రతువులుఁ గ్రతుఫలవితతులు న ట్లఖిలలోకవిధికృత్యము లా
కృతివిషయములు నయంబులు నతీంద్రియుఁడు రవియ నేర్చు ననుశాసింపన్.

తే॥ దుర్గమారణ్యసంచార దూరగతిభయార్తులం దేపురుషుఁడేని యత్న మొప్ప
నీ స్తవంబు పఠించి కీడెనయఁబోవఁ డాపదల నిస్తరించు సుఖాత్ముఁ డగును.

తే॥ దేవదేవు జగత్పతి నీవరాన్వయమ్ముకంద మ్మితని దృఢైకాగ్ర్య మొప్పఁ
బూజసేయుము త్రిగుణితంబుగ జపింపు మీ స్తవం బెందునేని జయింతు వధిప.

క॥ అజితుఁడ వీవని యెఱుఁగుదు నజముఖ్యవరప్రసక్తి నతఁ డంతలు గా
గజిబిజివడి సాధింపంగ జతన నీ కొదవె మనుజకలనఁ దనరుటన్. ౨౯౮

క॥ రామాజగదేకమనోరామా! శ్రితకల్పకాభిరామా! రామా!
నీమానితమహిమంబున నే మాకభయప్రతిష్ఠ హితసుఖభూమా! ౨౯౯

తే॥ ఈక్షణంబున నసురు నీ వీక్షణముననే దహింతువు నిజ మింత నేఁ దలంతు
రాజతేజంబునను గ్రహరాజతేజ మోజ మెసఁగింప నైన యిద్యోజ నెఱయ.
క॥ వియదాదివ్యాపక! యిదె జయ మందెద వనుచుఁ బలికి చయ్యనఁ జనెఁ దా
నయ మెన్నుచు మునిమండనుఁ డయత్నలాభంబు వడసి యారఘువరుఁడున్.
ఆ॥ నిర్విచారుఁ డగుచు నిర్వృతాత్ముండు నిర్ధారణం బొనర్చి ధారణాశ్ర
యతనె యాచమించి యాదిత్యు ధ్యానించె నిత్యశుచి శుచిత్వనిరతి మెఱయ.
క॥ కష్టాత్ము రావణుంగని హృష్టాత్ముం డగుచు రాముఁ డేడ్తెఱ నెఱపన్
స్పష్టం బయ్యెను బగతుని నష్టత్వము చూచువారి నయనంబులకున్. ౨౭౯
తే॥ అవల నగు జతనల ధృతి దవుల దేవదేవుఁ డట్లుండ వాసరదేవుఁ డెలమి
మించి రక్కసు క్షయము యోజించి రాముఁ గాంచి యిట్లనె సురగణకలితుఁడగుచు.
క॥ త్వరపడుము సురసనాథా! పరఁగుము పరు గెలువు మసము పాటింపుము పె
ల్లరుసము గొనుము జయశ్రీకరగ్రహణ మొనసి సీతఁ గైకొను మనియెన్. ౨౮౦
ఉ॥ అంతటఁ జేరవచ్చె నమరాంతకుఁ డాశరనాయకుండు వాఁ
డంతలు ప్రేరణంబు తన యంతను గూర్చి పొనర్చిన ప్రసా
భ్యంతరవర్తివర్తన మయత్నిత మై తగ నాతఁ డొడ్డు వి
భ్రాంతతమైఁ గనుంగొన దురంబు నయంబు రయంబు నూపఁగన్. ౨౮౧
సీ॥ ఆకసం బొరయుచు నద్దాని గ్రసియింపఁ దవిలెఁబో యన నొంటఁ దివురునదియు
దనభాటి కే నెంత లని ధాత్రి మొరయంగ నేమిఘట్టనముల నెఱపునదియు
గంధర్వనగరంబు గలదె యెండొక్కోట నిదె యంచు రుచు లెనయించునదియుఁ
బురదాహకునకేనిఁ బోలునే తన్ను వ్రేలిడిచూప నని గర్జ లిడెడునదియు
నవియె శ్రీపతాక లన నుచ్ఛ్రితపతాక లొప్ప నొప్పు వాజు లోసరిలక
యిలకు మింటి కొక్కఁడే కాఁగ మొనయింప నడరునదియు నయ్యె నసురరథము.

—♦ రామ రావణులు మరలఁ దలపడుట ♦—

మ॥ శరధార ల్పరఁగించు సంచున శరాసారాఢ్య మౌ నంబుదం
బు రహి న్మించి తటిత్పతాక లెగువన్ భూరిస్వకేంద్రాయుధ
స్ఫురణ ల్నెక్కొనఁ గృష్ణవాజియుత మై పోలంగ రాద్రోరుడం
బరవర్చస్స్వనవత్సమీరితము లొప్పం దాఁకు నప్పట్టునన్. ౨౮౨
తే॥ తివిరి వజ్రాభిమృష్టవిదీర్యమాణ ధరణిధరనిస్వనస్ఫురోద్ధురము గాఁగఁ
దనదు ధనువు స్ఫాలించుచు దద్దయు నది బాలచంద్రనతం బయి పరఁగుచుండ.
క॥ ఘనవాహను సారథితో ననె ననవద్యుండు రాముఁ డనవద్యకలా
వన మైన పలుకుఁబడి యిమ్మున స్మితరుచి గూర్చు తెలివి మొనకొనుచుండన్.

ఉ॥ మాతలి! చూచితే కడఁక మార్తు రథంబు మనోరథంబుతో
నీతఱి డాయవచ్చెడు సమేధిత మై యపసవ్యపుం గతి
న్నేతకు నాదు గెల్పిడెడు నేర్పనయించుచు వేగయోగవ
త్రాతతవర్తనం బయి లయాభ్రఘనార్భటు లుల్లసిల్లఁగన్. ౨౮౭
ఆ॥ అట్లుగాన నీవు నస్మదీయము రథం బెదిరి కెదురు గాఁగ నెనయఁజేయు
మనిలుఁ డడరు నబ్ధమునుబోలెఁ దధ్వంసనం బొనర్తు నెఱచలంబు నెఱయ.
ఆ॥ స్వాక మవిక్లబం బసంభ్రాత మవ్యగ్రహృదయవీక్షణము సమిద్ధనియత
రశ్మిసంచరణము రయవంతమును గాఁగ రథము నడపు మీవు రాణ నెఱయ.
క॥ నీ కేను దెలుపువాఁడనె ప్రాకటయశుఁడవు పురందరవిభుప్రబలా
నీకరథోచితుఁడవు ని న్నేకాగ్రయుయుత్సుతాప్తి నిటు దలఁపింతున్. ౨౯౦
క॥ అను రాముని నుడి విని నంతనె పరితుష్టుఁ డయి వేడ్క తన రారఁ బ్రచో
దన మొనరించె నతం డయ్యనువున రథ మంతరముగ నాటాడంగన్. ౨౯౧
క॥ సురసారథిసత్తముఁ డయ్యరదము రావణరథంబు నపసవ్యముఁ జే
యురహిఁ దఱిమి చక్రోత్క్షిప్తరజమ్మునఁ గప్పెఁ బగుఁడు పరిభూతుఁడు గాన్.
చ॥ అలిగి దశాస్యుఁ డంతకుని యట్టులు తామ్రవివృత్తనేత్రుఁ డై
చల మెగువంగ సమ్ముఖు లసమ్ముఖు రాము నిశాతసాయకం
బుల నవధూతుఁ జేయు నెఱపోఁతర మొప్పఁగ నేసి యార్చె న
య్యల వధికం బటంచుఁ గన నయ్యె సురాసురకోటి కయ్యెడన్. ౨౯౩
తే॥ ధర్షణామర్షితుం డయి దాశరథియుఁ జండకోదండ మైంద్రంబు శరము లర్క
రశ్మిసప్రభములును బిరానఁ దాల్చె రోషలంభితధైర్యుఁడౌ రూఢి వెలయ.
ఆ॥ అలఁత నొందఁజేసె నంతకు ముబ్బడి గాఁగ రామధరణికాంతుఁ డసురు
సరభసముగ నడరి శరవరాసారమ్ము వఱపి సురలు మునులుఁ బ్రస్తుతింప. ౨౯౪
తే॥ అప్పు డన్యోన్యవధకాంక్షులైన వారి కొదవెఁ దరమెన్న రానియాయోధనంబు
రుష ముఖప్రతిముఖతానిరూఢి దనరఁ గదిసి యొరపెట్టు కొదమసింగముల కట్లు.
క॥ దేవర్షులు గంధర్వులు నావలనున సిద్ధవరులు నాదైవ్రథజ
న్యావభృథ మెదలఁ గోరిరి రావణశసనమునకై ధరాధరతనయా! ౨౯౬
శా॥ ఆలో రాక్షసనాశనంబు రఘురామాధీశు లీలాజయ
శ్రీలాలిత్యముఁ దెల్పులక్షణము లక్షీణంబు లై తోఁచె ని
ర్వేలార్తి న్దనుజు ల్మనుంగఁ బ్లవగు ల్వేలాతిగానందవే
ణీలోలాత్ములు గా సురర్షిసుఖనిర్ణిద్రత్వ మొప్పారఁగన్ ౨౯౭
సీ॥ వర్షించె నెత్తురు ల్వాఱఁ బర్జన్యుండు సుడిగాడ్పు లపసవ్య మడరి చుట్టె
నెట్టట్టు లసురు తేరెనయు నన్నెఱి గృధ్రకులము భ్రమించుచుఁ గూడముట్టె

దానవపూజితిఁ దనరారు సంజచే దీపితం బయ్యె లంకాపురంబు
పగలేనిఁ జుట్టును బొగలేని నిప్పట్లు భాసిల్లె నవ్వీటి ప్రాంతభూమి
వాని కటు కానివై యెల్లవారు నడలఁ బిడుగులంగూడి యుల్కలపేర్చు ధ్వనుల
నెలవులనె సంప్రచారంబు నెఱపుచుండె దసిలిచేడ్పడె నతఁ డున్న దెసపుడమియు.

ఉ॥ సంగరముం బొనర్పఁ జెయి సాచు తెఱంగునయుండె పట్టిన
ట్లంగద వృట్టె బాహువుల కాశరసంతతి కెల్ల భర్త మే
నం గనుపట్టెఁ దెల్పెఱుపు నల్పును బస్పును నైన భానుర
శ్మింగము లింగలమ్ములు మహీధరమం దగు ధాతువుల్వలెన్. ౩౦౦

క॥ గ్రద్దలు తోడ్పడిరాఁ దమ గద్దఱితన మొగువ సరిమొగం బసురున కై
యుద్దవడి నార్చె నక్కలు తద్దయు జ్వాలనములు నోళ్లఁ దరలుచునుండన్. ౩౦౧

క॥ వీఁచెఁ బ్రతికూలవాతం బాచెయిదంబున నె ధూళు లడరించుచుఁ బె
ల్లేచి యసురాధినాథుని లోచనమార్గంబు దృష్టిలోపం బెనయన్. ౩౦౨

తే॥ పడియె నింద్రాశనులు సేనపట్టునందు దుర్విషహ్యాస్వనంబులు ధూర్తములుగ
జలధరంబులతోడి ప్రచారమింతలేక యే యాఁకపడుచున్నలీల వెలయ. ౩౦౩

ఆ॥ దిశలు విదిశ లొకటఁ దిమిరావృతములయ్యె బాంసువర్ష మటు నభంబు గ్రమ్మె
ఘోరకలహ మడర గొనకొని శారిక ల్వాని తేరిపైని వ్రాలి యఱచె. ౩౦౪

క॥ జఘనముల స్ఫులింగమ్ములు నఘమయములు గనుల వెంట నశ్రువులును జా
ఱ ఘనస్యందనహయములు మఘవారికిఁ గీడుపుట్టు మార్గము సూపెన్. ౩౦౫

తే॥ అబల! యేవంవిధములు భయావహములు
బహుళములు దారుణమ్ము లుత్పాతములు మ
హాహవమ్మున నెట్టన నావహిల్లె
రావణుని కీడు నొడువు విరావములను. ౩౦౬

క॥ కృతనిశ్చయోషితుం డమ్మతకరిరక్కసుఁడు మతము మఱలింపఁడు న
మ్మత మగుఁగాదే యదియును వితతోత్సాహమునఁ బెనగు వీరుల కెపుడున్.

ఉ॥ పూవుల చల్లకంబు పరిపోషణముం బొనరించు వంక నె
త్తావులు నెక్కొనన్ సులలితంబులు భృంగరవానుషంగముల్
శ్రీవిలసద్వనోపవనసీమవిహారము లొప్పఁ బయ్యెరల్
పావనమూర్తి రాము జయపద్ధతిఁ బేర్కొనసయ్యె నయ్యెడన్. ౩౦౭

ఆ॥ పరఁగె భౌమములు నభౌమమ్ములును సాత్త్వికమ్ము లాంగికములుఁగలసి మెలసి
తెలివితేట లెనయ దిక్కులతోఁ గూడి రాము మేలు సూపు రాణలొలయ.

క॥ జయశంసులు సౌమ్యము లప్రయత్నసిద్ధములుఁ గాఁగఁ బార్థివవరు స్వ
స్త్యయనం బెనయ నొనర్చె సదయములై యట్లాదవె నాఁగనగు లక్షణముల్.

క॥ ఎమ్మె లగు శుభనిమిత్తము లమ్మెయిఁ దనకుఁ బొడసూప నా లెమ్మరిద
ర్ప మ్మడఁగుకాల మిదె యని నెమ్మది నూహించె భువననేత యలరుచున్.

మ॥ పరమానందముఁ గూడి విక్రమము దర్పంబు స్ఫురస్మేరసుం
దర మాస్యాబ్జ మలంకరింపఁ బ్రథితాత్మప్రౌఢి యాహూఢి య
బ్బర మాకాశసదంతరంగముల రూపు ల్పూనఁ బ్రేరేప స
త్త్వరమావల్లభుఁ డొప్పె రాముఁ డధియుద్ధప్రాజ్యరంగంబునన్. ౩౧౨

ఉ॥ ఆనల రామరావణుల కయ్యె దురంబు సమస్తజీవభీ
త్యాసహ మత్యుదారమహిమాస్పద మాఘ్యమహాస్త్రమంత్రవి
ద్యావిలసత్ప్రయోగ మతిదారుణ మశ్రుతదృష్టపూర్వ ము
ద్భావితసర్వలోకచయపాలనశీలనయాంచితేక్షణా! ౩౧౩

క॥ సురరాజవైరి సైన్యము హరిరాజచమూచయంబు యతయుద్ధసమా
దర మై తిర మై నిజపరవరతరతమభావ మరయువలనున నుండెన్. ౩౧౪

ఆ॥ ప్రహరణములు వట్టి బలుజతనల ముట్టి యాటలాడనున్న యాబలములు
చూచుచుండెఁ గాని చొరఁబాఱ వవ్వారి దురము మేకురముగ దొరయుచుండ.

క॥ అద నరసి పదరి యొండొరు గుదియింపఁగ నెంచు వారి కోల్తలవంకన్
హృదయములు ప్రొవ విస్మయ మదనముగాఁ జేష్టలుడుగ నవి యటు లుండెన్.

ఆ॥ ఉదుటుతనముతోడి యుద్యమంబులు దోఁప నాయుధములు దాల్చి యట్టులున్న
యుభయసైన్య మొప్పె నురుచిత్రగతమైన యదియ పోలె విస్మితాక్ష మగుచు.

ఆ॥ అట్లు వారివారు సంబరచారులుఁ జూచుచుండ మిగుల నేచి శకున
వీక్షణప్రవృత్తవృత్తులై నరవరాఽసురవరు ల్తదేకపరతఁ గనిరి. ౩౧౭

క॥ కృతనయులు స్థిరామర్షులు ప్రతిహతసాధ్వసులు నగుచుఁ బ్రతికృతిరచనా
ద్యతిశయితము లొప్పారఁగ సత మిది యనఁ బోరి రేకసంయమ మమరన్.

తే॥ ఎట్టులుం గెల్పు తనయది యే యటంచు దాశరథి మేలియసముబ్బ తఱియటంచు
రావణుఁడును స్వవీర్యసర్వస్వములను ధారవోసి రప్పోరునఁ దరళనయన!

చ॥ కనలున దానవుండు గనుగానక దేవరథంబు వజ్రకే
తన మగలించుపొంటె నిశితప్రదరంబులఁ గూర్చి వైచి యా
ర్చిన నవి తద్వ్యమగ్నమున శీర్ణము లై ధరణిం దొరంగెఁ దో
డనె తమమిట్టిపాటున విడంబన మెల్లరు గాంచుచుండఁగన్. ౩౨౧

మ॥ అట రాముండును కోపచిహ్నముల నుద్యద్వహ్నినా నొప్పుచున్
బటుచాపార్ణవఘూర్ణనం బెగువ దీప్రం బొక్క బాణంబు మా
ఱటసర్పాధిప మేర్చి కూర్చి గుఱివాఱం బేర్చి యేయంగ ను
త్కటతేజం బది వైరి తేరి సిడ ముత్పాటించి చొచ్చె న్మహిన్. ౩౨౨

ఆ॥ అదియు రాక్షసేంద్రు నధిరాజ్యలక్ష్మితోఁ జీవితాశతోడ క్షితిని ద్రెళ్ళి
నదియె నేయి వ్రాయు నైన చుట్టుసుడియు కృశాను నట్లె మండె దానవుండు.
క॥ కోపోజ్జ్వలుఁ డై తద్వశతాపన్నుఁడు వాఁడు బుస్సు రను నహివహి బల్
రోపవిషవర్ష మొక్కటఁ బ్రాపింపఁగఁ జేసె రామపర్వతముపయిన్ ౩౨౪
ఆ॥ అలుక పలుకబాఱ కాశయం జై శరజాలములఁ దెరల్పఁ జాల నెఱపె
దివ్యరథ్యముల నుదీర్ణుం డవధ్యంబు లని తలంప కడరి యాక్షణమున ౩౨౫
తే॥ పద్మనాళంబులం గొట్టుపడిన యట్లు స్వస్థహృదయంబు లై యుండె స్వస్థసహారివ
రేణ్యములు గణ్యమానము ప్రీతి దప్ప నడల వెనయంజనవు భయసంభ్రమముల.
చ॥ అవి యవిసంభ్రమంబు లగు టారసి సారశిలీముఖంబులన్
బ్రవిమలచక్రచక్రములఁ బ్రాసగదాసిపరశ్వధంబులన్
సవ రగు నద్రికూటముల సాలములం బటుశూలపంక్తులన్
సువితత మైన వృష్టి సురసూదనుఁ డేర్పడఁ జేసె నేర్పునన్. ౩౨౭
క॥ మాయావిహితము శస్త్రామేయాసారంబు నిర్నిమీలనముగ న
ల్లేయెడఁ జూచినఁ దానే యై యఱుమ రఘుప్రవీరుఁ డాఱనియలుకన్. ౩౨౮
క॥ తుములము భీకర మతిభీమము భీషణరవము నైన మాయాశరవ
ర్ష మనేకశస్త్రమయ మస్త్రమహామహిమం దెరల్చె రభసం బెసఁగన్. ౩౨౯
ఆ॥ నైకశోవిభిన్న మైన యాశస్త్రౌఘ మధిపు స్యందనంబు నందలేక
చెదరి వానరేంద్రు సేనలపైఁబడి యుడిగె మొదలి దైన యుడుకుసడల. ౩౩౦
ఉ॥ వెండియుఁ జండకాండముల వేలకొలందిగఁ దాల్చి రాక్షసా.
ఖండలుఁ డాకసం బనవకాశము గాఁ బరఁగించె నుద్యమం
బొందు దలంపనీని దయి యుత్కటబంధము చిత్తవృత్తి కా
దండనె కూర్చుచుండ నవధానము దుండగ మండఁగాఁగొనన్ ౩౩౧
మ॥ జతనం బెంచుచు రామభూవిభుఁడు శిక్షాపాటవం బొప్పఁగా
శతసాహస్రములన్ శితాశుగములన్ సంధించి బంధించి న
ట్లితరుల్ దృష్టి నిగుడ్పనేరని తెఱంగే సేసి యేసె న్రణా
యతనం బుజ్జ్వలదస్త్రవహ్నిమయ మై వ్యాపాదఘోరంబుగాన్. ౩౩౨
ఉ॥ రక్కసుఁ డోసరిల్ల కని రాగము వెంచిన చిత్తవృత్తి పే
రక్కజముల్ సృజింపఁగ దిశాంతరమెల్ల నిరంతరంబుగా
నుక్కున బాణము ల్వఱపె నోటును గీటునఁ బుచ్చుచు న్మనో
వాక్కలనంబు లొక్కఁ డగు బాటఁ గొన న్సకలాంగసుందరీ! ౩౩౩
క॥ ఇరువురచేఁ గల్పిత యగు శరవర్ష నిరంతరప్రసక్తిం బడి యం
బర మపర మయ్యె నన భాస్వరము ప్రదరబద్ధముగఁ బొసంగెఁ బ్రియసఖి! ౩౩౪

మ॥ అనిమిత్తం బతిపాతి నిష్ఫలము నా నం దొక్కఁడున్ లేదు నె
ట్టన లక్ష్యం బగలింప నా నవియ కట్టా యన్నియుం గట్టె వ
య్యని నన్యోన్యవిమర్దనం బొదవుచున్ వ్యాహన్యమానంబులై
వినిపాతం బెనసె న్ధరాస్థలమున న్వేవేలు వేవేలుగాన్. ౩౩౬

ఆ॥ రామరావణు లట్లు నిరామయులుగ బాణములఁ బఱపిరి మహాప్రాణనముల
నవి నిరుచ్ఛ్వాసులుగఁ జేసె నంతరంబువారి యెదలోడి చూడ్కి నివారితముగ.

తే॥ యుద్ధ మొనరించి రాసంప్రయోద్ధ లోలసి సవ్యదక్షిణాక్రమణాసు ల్సరవి బోరయ
భూనభోంతర మంతయు భోరుకొనియె వరశరాసారముల ననవరతముగను. ౩౩౭

క॥ రావణు హయముల రాముఁడు నావరదుని హరుల నమ్మహాశరుఁడును సం
ప్లావమునఁ దేర్చి రలుఁగులఁ బ్రావీణ్యకృతానుకృతులు వరఁగుచు నుండన్.

ఆ॥ అబ్బురంబు గాఁగ నతితుములము గాఁగఁ గ్రోధదీప్తు లెగయ రోమహర్ష
ణంబు తమకుఁ గనుజనంబుల కొకటఁ దిరంబువడఁగ బలుదురంబు సెలఁగె.

ఆ॥ అట్టు లొకముహూర్త మై యహోరాత్రప్రయోగఘటన కదియె యుక్తి సూపి
ధ్వజహయావమర్దనజ మమర్షం బెద నాఁటుకొనఁ జలంబు నేఁటుకొనఁగ.

క॥ రావణుఁ డెడయీ కఱిమెను జీవధ్వజ మెడలెనన్న సిగ్గునను ధరా
దేవవిభుఁ డట్టు లడరె నిసీ వీనికి నింతవట్టు చేఁతయె యనుచున్. ౩౪౧

సీ॥ ఒండొరు తేరుల నొరయించి యలుఁగుల నెఱకులు నోనాడ నెఱసి నెఱసి
గతము ప్రత్యాగతం బతులితం బగుచుండ నానాస నెట్టన నఱిమియఱిమి
మండలవీథ్యాదిమహితాకృతు ల్పూపు యంతల ప్రావీణ్య మరసియరసి
ద్రుతపాతముల నేర్పు దులకింపఁ బరికరమ్ముల పీడనమునకై మొనసి మొనసి
యంతకంత కెక్కుడై యధిక్రోధం బభిద్రుతంబు బెనుప బెంపుఁగాంచు
పెనకువల విధములఁ బేర్చి రమ్మెలఁకువ యఖిలభూతవిస్మయావహముగ. ౩౪౨

తే॥ కుపితులై యట్టులెగయుచు ఘోరరూపులగుచు నొండొరులకుఁ బీడలందఁజేయు
నెఱిన పోరాడి రిరువురు నిష్ఠితములు చేష్టితంబులు సరిసరి సిరిఁ దలిర్ప ౩౪౩

మ॥ శరజాలంబుల ముంచుచున్ మగఁటుము ల్భాసించుచుం బేర్చుచున్
భరసంరంభము లోర్చుచుం గడఁక సంప్రస్థానము ల్గూర్చుచున్.
స్వరథు ల్వా రటు పోరి రుద్ధవడి సాసారంబు లభ్రంబు లి
య్యిర వొందెన్ యుగకాల మేర్పఱుప నం చేవారు భావింపఁగాన్. ౩౪౪

తే॥ శరధు ల ట్లాశరేంద్రదాశరథు లడరి గతివిశేషంబులందు సంగతివిశిష్ట
తలకుఁ దలకొని యొక్కింత తలఁకులేక తలపడిరి సరిమొగకొను తలఁపమెలఁకు.

ఆ॥ కాఁడి కాఁడి మోవఁగా రథంబును రథంబును ననంతరముగ మొనకొనంగ
ఘనపతాక లెనయఁగాఁ దురంగమముల మొగము లొరసుకొనఁగ మొగిసి రనికి.

మ॥ స్వధనుర్ముక్తశితాశుగంబుల మహోత్సాహాప్తి రాముండు త
ద్రథరథ్యంబులు నాల్గు దీప్రతనువుల్ రాపొందఁగా నేసి స
వ్యథతం బ్రత్యపసర్పణం బెనయఁగా నా భంగికిం గూర్చ న
వ్విధికిన్ రాక్షసలోకనాయకుఁడు దుర్వృత్తుండు క్రోధాంధుఁ డై. ౩౮౭
క॥ తలఁగించితి హయముల నిఁక దలఁగించెద నిన్ను ననుచు దర్పం బెసఁగన్
మలయించె నిశితశరముల విలయాంచద్యముఁడ పోలె వెస రాముపయిన్.
క॥ బలవంతుఁడు దశముఖుఁ డటు బలునారసముల నొకంట బరఁగించిన న
బ్బలరిపునుతుఁ డించుకయుం దలఁకఁడు వ్యథితుండుఁ గాఁడు తన్వీ!వింటే. ౩౮౯
ఆ॥ మఱియు వజ్రపాతమహితస్వనంబు లౌ మార్గణముల వజ్రిమానితాత్ముఁ
డైన సూతు నేసె నమరాంతకుండు వాఁ డంతకంత కలుక యగ్గలముగ. ౩౯౦
క॥ ఆవేగప్రహితములు మహావేగము లసురశరము లటు నాఁటి తెగం
గా వివశుంగా వ్యథితుంగా విధికృతి వానిఁ జేయఁగానని వయ్యెన్. ౩౯౧
తే॥ మాతలి ప్రధర్షణము తనమాటకన్న మిన్న యనుకొని యానూత్నపన్నగారి
వాహనుఁడు శరజాలవివదనుఁ జేసె నమరవిమతుం బగతు వృత్రునంతవాని.
తే॥ అలఁతి నిరువదిముప్పదియఱువదియును నూఱులిన్నూర్లు మున్నూర్లు నూఱునూర్లు
గానగు శరంబుల విపక్షు కదనరథము ముంచి తేలించె నమరులు మురియ విభుఁడు.
ఆ॥ క్రుద్ధుఁ డటఁ దెమల్చుకొని రాక్షసేంద్రుండు ముసలముద్గరాసిముఖ్యశస్త్ర
విసరములను గుప్పె వేలకొలందిగా రాము నరదమున విరామ మెడల. ౩౯౪
తే॥ అట్టు లభివృద్ధ మైన మహాహవ మమితాద్భుతము తుములము రోమహర్షణంబు
నయ్యె నప్డు గదాముసలాసిశస్త్రశరవిశేషప్రసారప్రచారములను. ౩౯౫
మ॥ క్షుభితం బయ్యెను వార్ధిసప్తకము సంక్షుబ్ధార్ణవాధస్థ్సల
ప్రభు లప్పన్నగవర్యు లాపదలకుం బాలైరి తోడ్తోదను
ప్రభువుల్ సేడ్పడి రెందరో ధరణి కంపంబందె భానుండు స్వ
ప్రభ వీడెన్ దెస లార్చె మారుతుఁడు పీవంజాల కోడెం దుదిన్. ౩౯౬
సీ॥ అమరులు గంధర్వు లాసిద్ధసాధ్యులు పరమర్షు లట్లు కిన్నరు లురగులు
నొక్కటఁ గూడి పెల్లొదవెడు చింతార్ణవమునఁ దేలుచు ధృతి వ్రాలనీక
స్వస్తి గోబ్రాహ్మణసమితి కౌఁ గావుత మెడ రడంగెడుగాఁత మిందఱకును
లోకము ల్శాశ్వతలోకంబు లౌఁగాత మీరాము జయలక్ష్మి యెనయుఁగాత
మసుర ద్రెళ్లుఁగాత మనుచు జంపించుచుఁ జూచుచుండి రాజిఁ జోద్యముగను
రామరావణుల దురం బవిరామాతిఘోర మగుచు నేటుకొనఁ బురంధ్రి. ౩౯౭
తే॥ తలఁపులొప్ప నచ్చరలు గంధర్వవరులు మొత్తములు గాఁగ వినువీధి మొనయఁ
యుపమితము గానిదా తదాయోధనంబు నూహసేసిరి తారిట్టియోజ గిరిజ! [గాంచి

ఆ॥ గగన మెన్నఁ జేసి గగనాకృతియ యగు సాగరోపమంబు సాగరంబ
రామరావణుల దురం బట్లు రామరావణుల దురముఁ బోల్పవచ్చు నింక. ౩౫౯
క॥ అని నిశ్చయించి నొడువుచు ననితర మయ్యాని ప్రకార మాలోకనముల్
మొనయించుచునుండిరి దివి ననంతరోపహిత మర్థ మరయుతలఁపుల౯. ౩౬౦

—♦ శ్రీరాముఁడు రావణు తలలు నఱకుట ♦—

క॥ అంతట రాముఁడు భుజబలవంతుఁడు శ్రీమంతుఁ డని నవార్యక్రుధ ను
ర్దాంతుం డై క్షురము ఫణావతం బనఁ దనరుదాని వఱలెడుదాని౯. ౩౬౧
ఆ॥ కొని శరాసనమునఁ గూర్చి సమంత్రకముగ నొనర్చి యసుర మూదలించి
సిరుల తానకంబు శ్రీమజ్జ్వలితకుండలంబు నైన తచ్ఛిరంబు దునిమె. ౩౬౨
క॥ అమరారి శీర్ష మటు లాసమయంబున రాముకృతి రసా స్థలి వ్రాల౯
దమకించి కాంచె ముల్లోకము జన మయ్యద్భుతంబుఁ గాంతామణిరో. ౩౬౩
క॥ వీడని సిరు లేర్పడఁ దోడ్తోడనె పొడచూపె దానితోయము శిర మ
వ్వాడ పిశాచము బలుమెడఁ గూడఁగనే వింతజాడ గొనకొనకుండ౯. ౩౬౪
ఆ॥ క్షిప్రకారి రాము క్షిప్రహస్తత దోఁప క్షిప్ర మల్లవాని శిరము మఱలఁ
దునిసిపడఁగఁ దాఁకె దోర్బలసృష్టంబు సాయకంబు ఘృహానాయకంబు. [గడఁగి
తేఁ॥ ఛిన్నమాత్రం బగుడు దానిచెలువ మొప్ప నొండుశిరమచ్చోటుం బాయకుండఁ
యదియు దునుమాడె నశనికల్పాశుగముల మనుజమూర్తిధరుండైన మాధవుండు.
ఆ॥ ఒక్కశిరము గోయ నుజ్జ్వలంబులు పదితలలు నట్లు బాహుదండము లిరు
వదియు వెలయఁ దనరి యుదిలపాటని లేక యడరువానిఁ గాంచి యవనివిభుఁడు.
క॥ తలలు పదియు నొకమాత్రన బలుశరములఁ దెగిపడంగఁ బరఁగించిన న
వ్వేలనున నవియుం దాళము ఫలములక్రియ రాలె నిలఁ బ్రభావన్మూర్తీ! ౩౬౮
ఆ॥ నూఱు నొకఁడు నైన మాఱు లాశరు తల ల్నఱికె నురక దివసనాథకులుఁడు
దొంటియట్టు లన్ని దోఁచుచునుండెఁగా కలఁతిఁజనియె నొక్కఁ డనఁగరాదు.
క॥ జీవితమున కవధి యెటుల్ భావింపంబోల దులికిపా టెనయంబోఁ
జేవలనున నలమటఁ గొనఁ డావీరుఁడు రాముపై నహంకృతి నెఱపు౯. ౩౭౦
సీ॥ రుధిరోక్షితంబు లౌ రూఢినె రణభూమి దొర్లుచుఁ బంకంబు దొరయుఁ గొన్ని
బొమముడు లీడని పొంగు గాన్పింపంగ నలుక మేకొనినట్టు లడరుఁ గొన్ని
రాముపైఁ దొంటిదౌ రభస మేర్పడ వ్రాల నుంకించు తెఱఁగున కొలయుఁగొన్ని
కన్నుల నిప్పుక ల్గ్రాలంగఁ గ్రవ్యాదములఁ దోల నా రీతి మొనయుఁ గొన్ని
గాని యంతలయ్యుఁ గానిపద్ధతిఁ బోవు తాత వ్రాత నెంచి తల్లడిలవు
తలఁగియును సురారి తలలు వింతలఁ బెం పీరోత్తమాంగకలన లొప్పుఁగాదె. ౩౭౧

క॥ అంతట రఘువీరుఁడు దన కెంతయు విస్మయము దోఁప నిది యే మనుచున్
జింతాపరుఁ డై తద్విక్రాంతిం దలపోసుకొనుచుఁ గలవరపడియెన్. ౩౬౨

ఆ॥ విభుఁ డనేకశస్త్రవిదుఁడు కోసలసుతానందవర్ధనుండు సంద్యచరితుఁ
డఖిలసంప్రదాయ మరసినవాఁ డెల్లమునులు దనకుఁగూర్చి ముచ్చటింప. ౩౬౩

క॥ అసురు వినాశ మొనర్చెడు దెస కడ్డుపడంగ నైన తెఱఁ గూహింపన్
మసలెనటె యేమిచెప్పుదు భసలాలక! విధివిలాసభర మదె కాదే. ౩౬౪

మ॥ ఎవి మారీచు మడంచె నేయవి ఖరున్ హింసించె నద్దూషణున్
జవిచూచెం దెగఁజూచె నాత్రిశిరు దుస్సాధు న్విరాధు న్గబం
ధు వినాశం బెనయింపఁజాలె నవి యాఘూతాఘుబాణౌఘము
ల్నవయంజొచ్చెను నేఁడు రావణుడెస న్నష్టోరుతేజంబు లై. ౩౬౫

తే॥ వరమున ప్రభావమో?మాయవలని తెఱవొ? యలఁతిఁబోనిశరమ్ములిట్లయ్యెఁదనదు
నమ్మకము సెడ మీఁదఁ గీనాశుఁ డేమి దలఁచుచుండెనో మదికేవిధంబు సారదు.

క॥ అని యాలోచించుచునే ఘనతేజం డప్రమాదకలన దనర దా
నని శరశతఘాతంబుల దనుజేశ్వరు నెడఁద వ్రచ్చి తనికించె ధృతిన్. ౩౬౬

క॥ వారని మదవారణ మటు లారాక్షసవిభుఁడుఁ గుపితుఁ డై ముసలగదా
వారములు వఱపి రాముని సారోదారుని వికారసంగతుఁ జేసెన్. ౩౬౭

ఆ॥ అటు ప్రవృత్త మాధ్య మమ్మహాయుద్ధంబు సంకటము నిరంకుశంబు నగుచు
నవని నాకసమున నచలమూర్ధంబున సరభసంబ కాఁగ జరుగుచుండె. ౩౬౮

క॥ రోమాంచము లొప్పార నభోమాంచద్ధామకలనఁ బరఁగిరి దివిజుల్
ధూమాంచలాగ్నికీలాభూమాంచన మైన రణము పొం గరయంగన్. ౩౭౦

తే॥ దేవదానవరాక్షసదితిజయక్షకిన్నరోరగముఖ్యులు కీర్తితులు ము
నీంద్రు లింద్రాగ్రసరు లయి యింతవట్టు తెఱవు గాంచుచునుండిరి దివిని నిలిచి.

చ॥ పవలును రేయు నాక నొకపట్టున ముట్టుట వీడు టంచు తే
కపిరళబాణవర్షనివహోర్భటు లుద్భటసంప్రయోగముం
దవిలి చెలంగ దాశరథిదానవవీరులు పోరుచుండి ర
య్యవసరమందు దుర్విషహ మయ్యాది యై నెగడొందుచుండఁగన్. ౩౭౧

క॥ తల లెడయక కొలనిమహోత్పలములు కరిదితము లట్లు తలమునఁ బడఁగాఁ
జలమున నరి నఱుముచు నుత్తలపడఁజేయుచు నె రఘువతంసుఁడు తనరెన్.

చ॥ ఇరవగు నస్త్రపాతముల యెత్తెఱసూపుచు బాణవర్షము
ల్పరఁగ ఘటింపుచు న్వెఱఁగు పాటునకొగ్గుచు వైరిశీర్షము
ల్కరములుఁ ద్రెంచి ప్రోవులు రకంబుగ నించుచుఁ దత్పునర్భవం
బరయుచునుండె. రాఘవుఁ డహర్పతితేజుఁడు క్రోధమూర్తి యై. ౩౭౪

క॥ తెరలియుఁ దెరలక తేజోభరితుం డసురుండు రామబాణాగ్నిశిఖా
విరతికిఁ బాటుపడుచు శరపరంపర ల్నిగుడఁజేయఁ బదరుచునుండెన్. ౩౮౫
క॥ సరిసరిగాఁ బోరెడు నాశరు సరణికి రామదేవు సంభ్రమమునవర్
బరఁగ దీఁక నంత మన నా పరిపాటి తనర్చె సురల పలుకుంబడులన్. ౩౮౬
క॥ ఎన్నఁ డిఁక వీనిఁ గూల్చుటొ యెన్నంబడ దనుచు రాఘవేంద్రుఁడు మదిలో
న న్నెఱయఁగాంచు టారసి యన్నెలవుననున్నవాఁ డయం బెసయంగన్. ౩౮౭

—♦ విభీషణుఁ డుపాయముఁ జెప్పుట ♦—

ఉ॥ చేరి విభీషణుం డనియెఁ జేప్పడె దిమ్మొయి నేల పోలదే
గారడి యన్న నీ కరయఁగా వరలాభముపేర్మిఁ గాదె యీ
వీరుని బాహువు ల్తలలు ప్రేలుచు మొల్చుచు నుంట ప్రాంచితా
కార! సురేంద్రనంద్య! శ్రితకల్పక! భానుకులప్రదీపకా! ౩౮౮
క॥ అనల్తాస్త్రంబున నుదరంబునఁ గల రసఘట మగల్పఁ బోరిఁ దచ్ఛోషం
బొనరింపఁ గాని యీనాటన ముడుగం డితఁడు రిత్త డంబర మేలా. ౩౮౯
తే॥ కుండలాకార మై నాభికుండముదరి నుండి యయ్యది యిమ్మెయి గండుమిగులఁ
జేయుచున్నది వీని నజేయుఁ గాఁగ నావుడు వికాసి యై రఘునందనుండు.
మ॥ అనలాస్త్రం బరివోసి దివ్యశరవిద్యాప్రౌఢిమం బొప్పఁ జ
య్యన సన్మంత్రితముం బొనర్చి విడువన్ వ్యాసిద్ధసంపాతమై
దనుజేంద్రోదరమందుఁ జొచ్చి కడఁకం దత్రత్యకుండామృతం
బును శోషిల్లఁగఁజేసి వచ్చి శరధిం బోలం బ్రవేశించినన్. ౩౯౧
చ॥ మునుపటియట్లు లయ్యసుర మూర్ధము లున్నతబాహుదండముల్
మునుమిడి కోసె రాఘవుఁ డమూల్యమణీఘృణిసంప్రకీర్ణమం
డనమహితంబు లామరకుటప్రకటస్ఫుటసూనమాల్యని
స్స్వనితమధువ్రతంబులును శాతశిలీముఖజాతసంహతిన్. ౩౯౨
క॥ బలువడిఁ బలుమాఱులు దా నలయక తెగఁజూచె రాముఁ డారాత్రుసు నా
దలలు భుజములునుఁ గడపట దల యొక్కఁడు రెండుబాహుదండము లుండన్.
ఆ॥ అట్టు లగుచు ఘోర యా శక్తి యొకఁ డెత్తి యసురవిభుఁడువైచె ననుజుపైనిఁ
దొడరి దానిఁ బెక్కుతునియలుఁగాఁ జేసె బలుశరముల భూమిపాలసుతుఁడు.
చ॥ అటులు శిరంబు లన్నియు మహావిభవోజ్జ్వలము ల్పునర్జని
స్ఫుటమహిమంబు లోలిఁ దెగి భూరితరోర్జితబాహుశాఖికా
పటలముతోడ భూతలనిపాతనముం గనఁ దేజమేది యా
దటఁ గడుమ్లానరూపుఁ డయి దైత్యుఁడు ప్రాకృతభావ మొప్పఁగన్. ౩౯౪

ఆ॥ ముఖ్యమొక్క శిరము మొగి బాహువులు రెండు గండుమీఱియుండఁ గానిపించి
తొంటిదైన చలము ద్రోవక రఘునాథుఁ గ్రోధదృక్ప్రసక్తి గొఱలఁగాంచి.
క॥ నానాశస్త్రాస్త్రంబులఁ బూనికెమెయిఁ గురిసె భూనభోభాగములన్
మానుగఁ దన్మయములుగ నమానుషవిక్రమము దోఁప మదమెసలారన్.
క॥ శిక్షాపాటవమున నటు లాక్షణమున నడరు వాని యయ్యైశరము
ల్ప్రక్షీణములై ధరఁబడ నక్షీణాశుగము లేసి యధిపుఁ డొనర్చెన్. ౩౯౮
తే॥ నిచ్చఁ బూజలఁ దనియుచు నెఱేఁదనర్చు పరిఘ మొక్కండు వైచె నాప్రల్లదుండు
దానిఁ బలుతునియలు గాఁగ దాశరథి నిశాతశరముల నొనరించె సరభసముగ.
ఆ॥ అంత లైనఁ దెరల కద్దానవేంద్రుండు గడఁకమెయిన రాముఁ గదిసి పెక్కు
లలుఁగు లేసియేసి యలమట నొందించి నెగడఁజూచుజాడ నెగయుచుండె. ౪౦౦
క॥ ఘోరాకారం బగుచు నపారము కల్లోల మనఁగఁ బరఁగి దురము దు
ర్వారముగా సురసారథి యారాఘవుఁ గాంచి యిట్టు లనె నెయ్యమునన్.

—♦ మాతలి బ్రహ్మాస్త్రమేయుమని రామునికిఁ జెప్పుట ♦—

చ॥ ఎఱుఁగనివానిపోల్కి నిటు లేల మెలంగెదు లోకనాథ! యే
డ్తెఱ నెఱపంగరాదె గడిదేర్చి పరుం గొని యాట లాడెదే
మఱచువ సూపు టిట్టిఁతఱి మాన్యమటయ్య సురేంద్రవైరి నే
మఱక వధింపు మింకిట నమానుషనిర్భరదర్ప మేర్పడన్. ౪౦౨
క॥ పైతామహాస్త్రరాజముఁ బాతకు నీతని నగల్పఁ బరఁగింపు మెదన్
బాతెడలఁ గాని కూలఁ డపాతుకుఁ డివ్వాఁడు తల కుపద్రవ మైనన్. ౪౦౩
ఆ॥ సురలు నొడివి రితని చోద్య ముద్యమ మద్యతని వినాశదశయుఁ దత్పరత్వ
మొప్ప నాకుఁ దెలియ నోజమైఁ దనరారు మరి దెరల్చి కీర్తి నవధరించి. ౪౦౪
క॥ అని మాతలి యెఱిఁగించిన విని యెఱుకమెయిన్ దలిర్చి విభుఁ డుజ్జ్వల మై
తనరారు శరముఁ గైకొనె వినిశ్శ్వసత్పవనభోజివిధ మది గొనఁగాన్. ౪౦౫
సీ॥ ఎది సృజింపంబడె నింద్రార్థమై యమితప్రభావముగ విధాతచేత
బ్రహ్మదత్తం బనఁ బరఁగెడు నెద్దానిఁ దాల్చి ముజ్జగము లతండు గెలిచె
నిల్లటవెట్టె శచీంద్రుండు దేనిఁ గాఁగలకర్జ మెంచి యగస్త్యునొద్ద
భగవంతుఁ డమ్మునిప్రవరుండు దన కిడె నెద్దాని నాశ్రమం బెనసినపుడె
దలములం బవనుఁడు ఫలమునఁ బావకభాస్కరులును లోకపాలు రఖిల
పర్వములను గారవంబున మేరుమందరములుం దనర్చుఁ దనువు నభము. ౪౦౬
క॥ ఏమనీయాస్త్రంబున కామహితుఁడు దానిఁ దాల్చె నరిపాటనముం
గామించి యదియు మించెను శ్రీమదఖిలభూతసారసిద్ధము ద్యుతులన్. ౪౦౭

—♦ శ్రీరాముని బ్రహ్మాస్త్రప్రయోగమున రావణసంహారము. ♦—

వ॥ నిఖిలచేతనసత్త్వతేజోవిశేషనిర్మితంబును జాజ్వల్యమానమూర్తియు హేమభూషణభూషితసుపుంఖంబును భాస్కరవర్చస్కంబును సధూమకల్పకాలాగ్నికల్పంబునుఁ బ్రదీప్తాశీవిషనిశ్శ్వాసోచ్ఛ్వాసంబును బరనాగాశ్వబృందభేదనంబును క్షిప్రకారియు నమోఘంబును ద్వారపరిఘగిరిప్రముఖవిదారణంబును నానారుధిరసిక్తాంగంబును మేదోదిగ్ధంబును సుదారుణంబును వజ్రసారంబును మహానాదంబును బహుసమితిజయవిధాయకంబును సర్వవిత్రాసనంబును భీమంబునుఁ గంకగృధ్రధవళగోమాయుగణరక్షశ్చయనిత్యభక్షప్రదంబును యమరూపంబును భయావహంబును వానరేంద్రాభినందనంబును రాక్షసావసాదనంబును వివిధగరుత్మచ్చారుచిత్రపత్రవాజితంబును లోకోత్తమంబును స్వపక్షభయనాశనంబును విపక్షకీర్తిహారణంబును నిక్ష్వాకుప్రకర్షకారణంబును బ్రాహ్మంబు నైన యమ్మహాస్త్రరాజంబు. ౪౦౮

క॥ అభిమంత్రించెను సకలప్రభుఁడు మహాబలుఁడు రామభట్టారకుఁ డు
త్ప్రభ మగు ధనువునఁ గూర్చెను విభాసితం బగుచునుండ వేదోక్తవిధిన్.

క॥ ఆయధివిభుఁ డాయస్త్రం బాయత మగు వింటఁ దొడిగినపుడె సకలలో
కాయతన భూతవితతియు శ్రీయుత వసుధయు వడంకి చేడ్పడఁ దొడఁగెన్.

తే॥ మర్మఘాతిశరేంద్రంబు మానవేంద్రసూనుఁ డాకర్ణకృష్టంబుగా నొనర్చి
విడచె నసురేంద్రవక్షంబు వేధ్య మగుచునుండఁ బ్రలయాగ్నికీల లొండొండనిగుడ

ఆ॥ వజ్రబాహుసృష్టవజ్రం బనంగ దుర్ధర్షమై కృతాంతు తర్షమై దు
రంతమై యవార్య మగుచు నాక్షణమె విపక్షు వక్షమునను వ్రాలి యదరి.

ఆ॥ ఆదురాత్ము నెడఁద భేదించె నతివేగవంత మంతకరము వరశరమ్ము
బిరుసుఁదనము దోఁప బెళుకువృక్షమ్ముపైఁ బడి యుగల్చు దుడుకుపిడుగువోలె

శా॥ చొచ్చెన్ వచ్చి శరంబు జీవితహరాస్త్రౌకస్వరం బవ్విధిన్
మెచ్చెం దద్రుధిరంబు స్వాదము సమున్మేషస్థితిన్ భూస్థితిన్.
గ్రొచ్చెం జెచ్చెరఁ బ్రాణము ల్గడపి సాకూతంబు నా నిచ్చమై
వచ్చెన్ రాముని తూణము న్నిలయ దుర్వారప్రతాపోన్నతిన్. ౪౧౪

క॥ ఉసులు వెడలు నప్పాటనె యసురుని శరకార్ముకంబు లవనింబడె న
య్యుసి గడకొని త్రోవ నిజప్రసక్తభావంబు ఱిచ్చపడి యెడయంగన్.

ఆ॥ భీమరంహుఁడును మహామహుఁడును నగు నైరృతపతి స్యందనంబుఁ బాసి
యశనిహతుఁడు వృత్రుఁ డన భూమిపైఁ వ్రాలెఁ గాలనిహతిఁ గడవఁగలఁ డెయొకఁడు

క॥ పతితుం డగు పతిఁ గనుఁగొని హతశేషనిశాచరౌఘ మడలుచుఁ బఱచెన్
ప్రతిదిశము భయత్రస్తము గతబోధ మనాథ మగుచుఁ గల్యాణనిధీ. ౪౧౭

తే॥ పఱచి రఱచుచు వారివెంబడి బరవడి వానరులు ద్రుమయోధులు వార కఱుమ
నట్లు పీడితు లగుచుఁ బె ల్లడరు గదుర నెట్టకేలకుఁ బురిఁజొచ్చి రిందువదన.
క॥ అసదృశము రాము విజయం బసురేంద్రు వినాశమును గతాశ్రయులం ద
మ్మసురుసురుపాలు సేయఁగఁ బసచెడి రాక్షసులు దుఃఖపడి రబ్జాక్షీ. ౪౧౯
క॥ దీనానను లై యెది యనఁగా నైన నొకండు లేని గతి పాల్పడ ని
ధ్యానం బశ్రు ప్రస్రవణానద్ధం బగుచు నుండ న ట్లడఁగి రుమా ౪౨౦
క॥ జితకాశులు వానరు ల ట్లతిసంహృష్టాత్ము లగుచు నరినాశనముఁ
బతివిజయము నెల్లెడలం బ్రతిధ్వనులు పుట్టఁ జాటఁబరఁగిరి పెలుచన్. ౪౨౧
ఉ॥ అయ్యెడ నంతరిక్షమున నంచిత మారవ మొప్ప మ్రోయఁగా
నయ్యెను సౌరదుందుభి మహాసుకుమారుఁడు మారుతుండుఁ దా
నొయ్యన వీచె గంధరసయోజన నెక్కొన సర్వసౌఖ్యముల్
నెయ్యమున న్గడల్కొలుప నేర్చి యలర్చు స్వభావ మొప్పఁగన్. ౪౨౨
శా॥ ఏనాఁ డందసి దై మనోరమయు నై యేతెంచె విన్వీథి న
ష్టానందామృతసారవృష్టి కుసుమవ్యాకీర్ణ యౌ వృష్టి దే
వానీకంబులు సృష్టిసేయ రఘునాథాంచద్ఘనస్యందనం
బానేమిప్రసృతంబుగా నెఱయ నుద్యల్లీల విద్యుద్ద్యుతీ! ౪౨౩
తే॥ రాఘవ స్తవరాజవిరాజమాన సాధువచనద్విరుక్తిప్రసాధ్యమాన
మైన భారతి వినవయ్యె నంబరమున నగ్ర్య మహిత దైవతకృతి నధిగమించి.
క॥ అచ్చర లాడిరి గంధర్వోచ్చైస్స్వరగీతికలన యొప్పారఁగ సం
పచ్చయములెల్లఁ జొప్పడె నచ్చపుఁగుతుకంబు పేరి యంబుధి వొంగన్. ౪౨౪
క॥ ఇంత యనరాని సాతస మంత వియచ్చరులపాలి దై వెలసె సుదు
ర్దాంతుఁ డతిరౌద్రుఁ డసురుఁడు సంతతభీకరుఁడు రామసంహృతుఁ డైనన్.
ఆ॥ కోర్కి దీర్చె నపుడు కోణపాధిపుఁ ద్రుంచి రాముఁ డఖిలహృదభిరాముఁ డలరి
సౌరిది సుహృదుఁ డైన సుగ్రీవునకు నట్టు లధిబలాఢ్యుఁ డైన యంగదునకు.
మ॥ ప్రశమం బందిరి దేవత ల్నిజసుఖప్రస్తావ మొప్పారఁగా
దిశలెల్లం బెరసెం బ్రసాదసుసమృద్ధి న్నిర్మలశ్రీకలా
వశ మై యుండె నభంబు భూమి స్థిర మై వర్తిల్లె గంధాఢ్యుఁ డై
యశమం గాంచెను గంధవాహుఁ డటు సప్తాశ్వుం డెసంగెన్ బ్రభన్. ౪౨౫
చ॥ రణవిజయాభిరాముఁ డగు రాము సుధామునిఁ జేరఁగాంచి స
ద్గుణులు విభీషణార్కజముఖుల్ సహలక్ష్మణు లాప్తియోగల
క్షణసవిశేషు లాహవవిచక్షణు లాదృతు లై క్షణాఢ్యు లై
ప్రణతులు పూజలు న్నుతులుఁ బన్నిరి తన్మయచిత్తవృత్తులన్. ౪౨౬

—♦ రావణు చైతన్యము రాముఁ జెందుట ♦—

ఆ॥ నిహతశత్రుఁ డతఁడు నిర్నిద్రనేత్రుం డుదీర్ణసంగరుండు దీప్తతేజుఁ
డాప్తయుతుఁడు నగుచు నమరవర్గములతో నింద్రుఁ డనఁగ నొప్పె నేణనయన!
శా॥ ఆలో రావణు మేనిలోని దగు నుద్యజ్జ్యోతి భానుప్రభా
జాలాభం బొకఁ డేగుదెంచి సుర లాశ్చర్యాబ్ధినిర్మగ్నులై
లోలాత్మత్వమునం గనుంగొనుచు నాలోచించుచుండంగ నా
లీలామానుషమూర్తి తేజమున నొలిం గాంచె నేకత్వముల్. ౮౩౧
క॥ తమలోఁ దారి ట్లనుకొని రమరులు భాగ్యంబకాదె యస దీతఁడు స
త్త్వమయాత్ము నీశు నెనసెను జము ప్రోలికిఁ జనక యక్షజముగా నిచటన్.
ఉ॥ క్రూరుఁడు రక్కసుండు ద్విజకోటి మడంచెఁ బరాంగనారతుం ౮౩౨
డేరికి నేనిఁ గీడొదొవ నెప్పును వర్తిలు నీచు తామసుం
డారయ విష్ణువైరి యితఁ డౌర యి టిందఱము గనంగ నీ
దారికివచ్చె మెచ్చునొకొ తద్దయు దైవము దోసకారులన్. ౮౩౩
తే॥ ఎంతటి మహాత్ముఁడయ్యె వీఁడింతలోన సాత్త్వికులమయ్యు హరికటాక్షప్రసాద
భాజనములము నా నయ్యుఁ బరఁగుచుందుమిట్లు సంసారభయదుఃఖ హేతుకృతుల.
క॥ అని దివిజు లాడుచుండఁగ విని నారదమౌని వారి విస్మితులఁ గనుం
గొని స్మేరవదనుఁ డై యి ట్లనె సాదరవృత్తి వెలయ ననుపమసుగుణా. ౮౩౪
సీ॥ వినుఁడు దేవతలార విస్మయమానమానసవర్తనంబున నడుక నేల
ధర్మవిత్తములరు తద్దయు మీకు నియ్యర్థంబున రహస్య మరయరాదె
విష్ణుచారిత్రము ల్వింతలు గా వెట్లు ద్వేషంబున నితండు దెగల కెపుడు
రాము భావించుచు రాముకథాంశమ్ము లరయుచుఁ దనుద్రుంచు నధిపుఁడనుచు
విని తదేకాత్మకత భృత్యవితతితోడ నాతని తెఱంగు లెంచుచు నఖిలజగము
తన్మయ మటంచు స్వప్నవృత్తములఁగనుచు రామతత్త్వపరత్వంబు రమణఁగాంచె.
మ॥ గురుఁ డయ్యెం దనక్రోధమే తనకు విక్షోభంబు పోకార్చి రా
మరహస్యం బెఱిఁగింప నంతమున దుర్మానాదిదోషచ్యుతిన్
స్థిరుఁ డై రాము నెదిర్చి కూర్చుకొనెఁ దద్దృష్టి న్నిరస్తోరుబం
ధురసాంసారికబంధుఁ డై పడసెఁ దోడ్తో రామసాయుజ్యముల్. ౮౩౫

—♦ అందఱు సుఖమొనయుట. ♦—

సీ॥ పాపి దురాత్ముండు పరధనపరదారసక్తుండు నన఼గ నొ జనుఁడయేని
నిచ్చలు స్నేహంబు నెఱయంగ నైనను భయమున నైన నెప్పాట నైన
రఘుకులతిలకుని రాణ భావించుచు సంపరేతుం డగు జాడ నతఁడు
శుద్ధాంతరంగుఁ డై సురుచిరుఁ డై భవశతజనితానేకశమలబంధ

ముక్తుఁడై తోడుతోడనె మొనయఁగాంచు రాముఁడే విష్ణుఁ డద్దేవు ధామ మనఘ
మఖిలసురముని సంభావ్య మై తనర్చు పరమపదము వైకుంఠంబు ప్రాంచితంబు.
సీ॥ భువనకంటకు దురంబున దశాస్యునిఁ గూల్చి యనువృత్త యాకీర్తి నవధరించి
వామహస్తగచాపవరకోటిఁ బుడమిఁగన్నియ నూఱడించు నన్నెఱికిఁ గూర్చి
దక్షిణకరధృతోద్ధత బాణరాజంబు భ్రమియింపఁజేయు దర్పమునఁ దవిలి
యరిశస్త్రదలితాంగుఁ డారక్తనేత్రాంతుఁ డర్కకోటిప్రకాశాంచితుండు
నగుచు నగుమొగమునఁ దగు వీరలక్ష్మీధురంధర ప్రబంధబంధురత్వ
కలితుఁ డింద్రనుతుఁడు సలలితుం డెలమి న న్నోముఁగాత వీరరాముఁడెపుడు
క॥ అని సురముని వివరించిన యనువున రఘువీరు తత్త్వమారసి యమరుల్
వినుతించి రాఘనుఁడు న ట్లనుమోదము నెఱపెఁ దత్కథాంచద్గీతిన్. ౪౪౦
తే॥ చెప్పినంతన చాల దాచెలువు గనులఁ జూచితీరంగవలెఁ గాక సుందరాంగి
సీతతోఁ గూడి పట్టాభిషేక మెనయు నాఁటి సౌభాగ్య మేమందు నలిననయన.
శా॥ శ్రీరాముండు విభీషణుల్ హనుమ సుశ్రీలక్షణుల్ లక్ష్మణుల్
ధీరోదారు హరీంద్రు ఋక్షపతి సాధీయుం గుమారాంగదున్
సారాచారు సుషేణు సర్వజగదాశ్చర్యక్రమాక్రాంతిమ
ద్వీరోత్తంసుల నీలముఖ్యుల న్గరిన్ వీక్షించి సంతుష్టుఁడై. ౪౪౨
చ॥ ఇటు లనె నన్నలార! భవదీడ్యగుణోన్నతబాహువీర్యవి
స్ఫుటతరసాహసంబు లొగిఁ బ్రోఁది యొనర్చుచునుండ నేననిన్
నిటలతటాక్షునిం జెనకనేర్తునహో యను వైరి రావణున్
జటులబలంబుతోఁ గెడపఁజాలితి నొం డననేల యింతకున్. ౪౪౩
మ॥ జగతిన్ సూర్యుఁడు చంద్రుఁ డెంతవఱకున్ జానొందువా రంతవ
ట్టు గుణోదార భవత్సుకీర్తి వెలయున్ డొంపింతయున్ లేక యే
వగలుం జేరవు పున్నెమబ్బు గెలుపు న్వాటిల్లు సుశ్లోకులై
నెగడంగాఁ గల రేరికేని మిము ధ్యానింపం దలం పొప్పినన్. ౪౪౪
క॥ కలిహర మదీయకృతిసంవలిత భవత్కథ త్రిలోకపావని భావం
బెలయఁగ బాగడుదు రెవ రయ్యలఘుగుణులు పరమపదము నందుదురుతుదిన్.
క॥ అని రాముఁ డానసేసిన ననఘులు వా రందఁగాంచి రానందరసా
బ్ధిని వినతు లొప్ప నవ్విభుఁ గొనియాడిరి సత్కథాఢ్యగుణరత్నములన్. ౪౪౬
తే॥ అనుచు వాగీశ్వరేశ్వరుం డభవుఁడు భవుఁడాభవాని కెఱింగింప నాయమయును
విస్మయోత్ఫుల్లనేత్రయై విభునిఁబొగడి యవ్వలికథాంశమునుంగూర్చి యడుగుటయును.
మ॥ సకలామ్నాయరహస్యకలక్ష్య! జగదాశ్చర్యప్రభావోన్నతి
ప్రకటామేయగుణాఢ్య! సన్మునిగణప్రస్తూయమానోదయా!

వికటారిప్రకృతాహివర్గదలనావిఖ్యాతిచాతుర్య వ
త్సుకృతస్థేమకలాభిరామ శిఖితాస్తోకస్మయాంచన్నయా! ౪౪౮

క॥ అక్షీణాన్నమయాదిక సాక్షాద్ద్రిష్ట్రుత్వనిత్యసామ్రాజ్యరమా
దీక్షితభావరసాభ్యు త్ప్రేక్షితపరతత్త్వయోగధీసారమయా. ౪౪౯

మాలిని॥ సరససురమునిప్రస్తావవిస్తారకీర్తి
స్ఫురదమలకథాంశస్యూతనిర్ణీతసత్త్వా!
పరహితగుణలక్ష్మీ భ్రాజమానానుషంగా
స్తరతమఘననిత్యానంద సాంద్రాత్మతత్త్వా. ౪౫౦

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్య మహితాత్రేయగోత్రపవిత్ర హనుమత్సుకృతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు పూర్వభాగంబున
దశమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీరామకథామృతము

## యుద్ధకాండము

### ఉత్తరభాగము

## ప్రథమాశ్వాసము


కరుణావేశపరా
లోకనసంపుషితసర్వలోకనిచయ ! సు
శ్లోక ! సుచరిత్ర ! సుకవి
వ్యాకృతనిఖిలార్థభవ్యభావా ! దేవా !

—♦ విభీషణుఁడు రావణునిఁగూర్చి దుఃఖించుట ♦—

వ॥ అవధరింపు మవ్విధంబున ననంతరకథాశ్రవణకుతూహలాయత్తచిత్త యై తన్ను వేఁడుకొనిన ప్రాణేశ్వరికి మహేశ్వరుం డిట్లని వివరింపందొడంగె. అట్లు శ్రీరామచంద్రుండు సాంద్రానందనిష్యందపరీవాహంబున సుహృద్వరేణ్యులతో నోలలాడుచుండు నంత సంతతావిచ్ఛేద్యసహజన్మస్నేహాతిరేకనిర్బంధనిబంధనబంధురబాంధవుం డగు నవ్విభీషణుండు శోకావేగపరీతాత్ముం డై పరేతత్వం బంది పడియున్న సహోదరునిం జేరంజని రామనిహతుం డై భూశయానుండును బాంసుచ్ఛన్నదేహుండు నై సన్నసెడిన యాయన్న తెఱంగవలోకించి వీర ! విక్రాంత ! విఖ్యాత ! విధపినీత ! నీతికోవిదా ! యనుచు సంబోధించుచు నిట్లని విలపింపం దొడంగె. ౧

సీ॥ అధిప ! మహార్హశయ్యాతలంబు దొఱంగి యనని సైఁబడి పొర్లనైతి వేల
వీరగంధోచితవిస్తృతవక్షంబు నెత్తురుల్ ధూళులు నెఱయు నదియె
యంగదాముక్తదైర్ఘ్యాంచిత దోర్యుగి విక్షిప్తఁ జేసినవిధ మదేమి
భాస్కరాకారవర్చస్కంబు మకుట మిట్లపన్నత్రి కేసేర మాచరించె
గీ॥ కామమోహాదిదోషసంకలిత మైన చిత్తమున కెట్టిదియును గుచింపకుంట
దొరవు నా తెల్పిన తెఱంగు ద్రోఁచిపుచ్చి యాజి రాము నెదిర్చి యిట్లలతిపడితె.
ఉ॥ ఒక్కనికేని నా తెలుపు నోజ మెలంగఁ దలంపు పుట్ట దా
మిక్కిలిదర్ప మీదశకు మేకొని తేరఁగడంగుచుండఁగా
డక్కరి మేఘనాదుఁడు ఘటశ్రవణుండు ప్రహస్తముఖ్యు లా
రక్కసిమన్నెకాండ్రును ధర న్నిలసేర్తురె మేలు గాంతురే. ౪
మ॥ నయసేతుచ్యుతి గల్గె ధర్మగతి హీనం బందె సత్త్వాగ్రహం
బు యతం బయ్యెను ప్రశస్తవంబులు సెడెన్ భూమిం బడెన్ సూర్యుఁ డ
వ్యయుఁ డౌ చంద్రుఁడుఁ జీకటి న్మునిఁగె హా హా యగ్ని చల్లాఱె స
త్యయ మీవీరుని శస్త్రభృద్వరుని డాయన్ సావసాయాంచితున్. ౫
తే॥ ఇపుడు రాక్షసశార్దూలుఁ డిట్టి నేలఁ బాంసువులఁ గప్పఁబడి సుప్తపగిది నొదుఁగ
లుప్తవీరాగ్ర్యమైన యిల్లోకమునకు మిగిలినది యిట్టిదనఁగ నా మెలపు గలదె.
ఆ॥ ధృతికిసలము ప్రసహాతతపుష్ప మాధ్యతపోబలంబు శౌర్యమూలనిభృత
మాజి రాక్షసాధిరాజవృక్షముఁ గూల్చె రామమారుతుఁడు మహామహుండు ౬
మ॥ క్షితిపై రావణగంధహస్తి శయనించెన్ రామసింహోత్తమా
ర్దితవిస్తారససారదేహము లసత్తేజోవిషాణంబు సం
గతరంగత్కులవంశవంశము మహాకార్యక్రమక్రోధభా
గితరాంగంబు ప్రసాదహస్త మజితం బిక్కాలయోగంబునన్. ౭
తే॥ అమితవిక్రమోత్సాహతతార్చి నిశ్శ్వసనలసద్ధూమము బలోష్మ మనుపమాన
తేజ మసురాగ్ని రాముండు దీర్చె ఘనుఁడు స్వాతిశరవృష్టి యుద్ధవర్షాగమమున. ౮
ఉ॥ పోలినజోదు సింహాభవిభూతి తతాన్వయయోధముఖ్యలాం
గూలకదుద్విషాణ మురుకోప మరాతివిభేదకంబు వ్యా
లోలనిజాక్షికర్ణ మవిలూనము దైత్యవృషమ్ము రాజశా
ర్దూలముచే హతం బగుచుఁ దూఁటె విధిప్రతిపాదనంబునన్. ౧౦
తే॥ తొలుత నా తెల్పినట్టి నీతుల గ్రహింప వవల వెడలంగనడిచితి వంత్రిఁ దన్ని
తుదిహతుఁడవైతి నిజకర్మదోషవృత్తి నన్నిఁటికిమూలమై విధియడరుటయును. ౧౧
ఆ॥ అని సహేతుకము కృతార్థనిశ్చయము నౌ నుడి పొసంగ నెడఁద నొవ్వ దోఁప
శుద్ధవృత్తి వాఁడు శోకసమావిష్టుఁ డగుడు ననుజుఁ గని నృపాత్మజుండు. ౧౨

తే॥ ఈతనిఁ బ్రబోధితునిఁ జేయుమిట్లు మృతునిదరి మృతుఁడపోలెఁబడియుండు తత్తఱి మెఱుఁగు
పోలదన్నకు సంస్కృతుల్ పాసఁగఁ గూర్చు తానెయి ల్లైన స్నేహంబు దాల్చునదియె.

—♦ రామప్రేరితుఁడై లక్ష్మణుఁడు విభీషణునకుఁ దత్త్వంబు సెప్పుట ♦—

కం॥ అని తెలిపిన విని లక్ష్మణుఁ డనుపమనయుఁ డనఘు నాసురాధిపుఁ గని యి
ట్లనెఁ దగునే నీయట్టిఁడు వనరం దొడకుటయు దుష్టవర్త్మము కాదే. ౧౮

సీ॥ ఎవ్వానిఁ గూర్చి నీ విట్లు దుఃఖించెద వాతనికిని నీకు నైన దేమి.
యేసృష్టినాఁటిది యిట్టి సంబంధంబు ము న్నున్న దే యింక మొనయఁగలదె
తోయౌఘపతితము ల్దారయు వీడునుఁ దద్వశంబులై నెట్టన సైకతంబు
లట్లు సంయుక్తంబు లగు వియుక్తములును బ్రాణు లన్నియుఁ గాలపరవశములు

గీ॥ ధానములయందు ధానను బ్రవిలితవుల వెట్టు లట్టులె భూతమ్ము లీశు మాయ
దనరు భూతంబులం దొంటఁ దనరు కుండుఁ బ్రేరణము దైవయుక్తిఁ బెరయు నెపుడు.

ఆ॥ నీవు వారు నేము నీవార లన్యులుఁ గాలవశతఁ దుల్యగతిఁ దనర్తు
మట్లుగాఁగ నియతి నాజన్మమృత్యువు ల్దారసిల్లు బహువిధంబు లగుచు. ౧౭

మ॥ అజుఁ డీశుండు సమస్తభూతములఁ గా న్పాదించుఁ ద్రుంచుఁ స్వస
ర్గజభూతంబుల నస్వతంత్రములఁ జక్కం గొంచు నాపేక్షుఁడ
య్యు జరాద్యాకృతిక ప్రసంగములు జేయుఁ బాలకుం డెట్టు ల
క్కజపుం గ్రీడలవంకకుం దొడరి వేడ్క ల్సూపు నమ్మాడ్కిఁగాఁ. ౧౭

తే॥ వఱలు బీజంబు బీజంబువలన నెట్లు లట్లు దేహంబువలన దేహంబు వొడము
దేహయుక్తినె జీవుండు దేహి యగుట యతఁడును బరాత్మునట్లు శాశ్వతుఁడు ఘనుఁడు.

సీ॥ పృథులావివేకకల్పితము ము న్నీదేహి దేహవిభాగంబు తెఱఁగు పడఁగ
నానాత్వమును జన్మనాశంబులును సంక్షయాభివృద్ధులును గ్రియాఫలములు
ద్రష్టకుఁ దోఁచు నతద్ధర్మములు తారు విక్రియల్ వహ్ని కావేడబముగ
నదియు నియ్యవియు దేహాదిసంయోగాప్తి నమకూరు నాత్మకు సద్గ్రహమునఁ
బ్రథితి యెట్టులట్లు పరఁగంగఁ బరమార్థ మరయనీని నైన యాగ్రహమున
సారహీన మైన సంసార మాత్మకు నద్గ్రహంబు లేమి సంభవించు. ౧౯

ఆ॥ గాఢసుప్తుఁ డగుచుఁ గానఁ డహంకృత్యభావమునను జీవవంతుఁ డయ్యు
దేహి సంసృతి ప్రతీతివిముక్తుఁ డనాగ్రహుండు దాని నందఁ డెపుడు. ౨౦

క॥ మమకారాహంకారభ్రమ మిది మాయామనఃప్రభవ మగు ధర్మం
బమలుఁడవై విడనాడుము సమరసభావమున స్వాత్మసంయమ మమరన్. ౨౧

సీ॥ భగవంతుఁ డీరామభద్రుం డధీశ్వరుం డఖిలభూతాత్ముఁ డవ్యయుఁడు పరుఁడు
మాయామనుష్యాత్మమహితాత్ముఁ డీతని మెడనె చిత్తము సేర్పు మేమఱకుము
బాహ్యేంద్రియార్థసంబంధంబు వలని దోషంబులు సూపి మనంబు గడపి

స్వాత్మ రామానందమందు నియోగింపు మనల బంధచ్యుతి సంగమ దీవు
వఱలఁగు దేహబుద్ధి భ్రాతృమాతాపితృబంధుముఖ్య మగు ప్రపంచ మెల్ల
ద్వంద్వలక్షణాత్మతత్త్వ మాధ్యాత్మికవృత్తి నరయఁగ న నివృత్తిఁ గాంచు. ౨౨

క॥ అన్నల నెవ్వని కెవ్వం డెవ్విధి బాంధవుఁడు గాఁగ నేర్చును వాఁడా
నివ్వటిలు తత్త్వ మారసి మవ్వముగను నతఁడె సర్వమాన్యుఁడు జగతిన్. ౨౩

శా॥ మిథ్యాజ్ఞానవశంబునం బొడముఁ జుమ్మీ దారపుత్రాదికా
తథ్యం బైన ప్రపంచ మెమ్మెయి పదార్థమ్ముల్ స్వసర్గీయముల్
వేధ్యంబుల్ బహురాజ్యసంపదలు నావేద్యంబు లై సంతతా
పథ్యంబుల్ క్షణసంగభంగురము లాపత్ప్రాప్తికి న్మూలముల్. ౨౪

ఆ॥ ఇంక లెమ్ము రామ నెనయింపు మెద భక్తి భావితమ్ము సుగుణపాలితమ్ము
నెఱయు రాజ్యసుఖము నీతివర్తనమున నరయనగుము కృతజ్ఞ మతియు ననుచు.

కం॥ భూతభవిష్యత్కర్మము లాతతవిదితము నిను నంటు నెఱుగావున నీ
వీతఱిని వర్తమానము నీతిమెయి న్నెఱపి కీర్తి నెగడుము జగతిన్. ౨౬

కం॥ భవదూషణావిలిప్తుఁడ వవసితకృత్యుఁడవు నగుచు నఖిలసురమును
స్తవనీయం బగు సత్పద మవలం గాంచెదవు సంతతానందుఁడ వై. ౧౭

ఆ॥ ఇంత రాము నాన యేను దెల్పుచునున్నవాఁడ నిక్క మరసి ననుఁ బాసి
స్త్రీల నూఱడించి చేయుము సత్క్రియ లన్న కాలమృతుల కాప్తులకును. ౨౮

కం॥ ఆకరణిఁ దెలుపు లక్ష్మణు శ్రీకరవాక్యముల దేరి చేర రఘుకులుం
డాకులదీపకుఁ గనుఁగొని ప్రాకటశుభదాయివచనపద్ధతిఁ బలికెన్. ౨౯

సీ॥ ఇతఁడు నిశ్చేష్టుఁ డై యింతకునష్టుండు నా నయ్యె నైంద్రదైత్యనాథుఁ డాజి
నతిచండవిక్రముఁ డత్యుచ్ఛ్రితోత్సాహుఁ డాశంకితుం డను టరయరాదు
క్షత్రధరోజ్జ్వలు ల్సంగరాంగణహతు లైన వీరులఁ గూర్చి యడలఁ జనునె
యాశంసితర్థి నా నఖిలలోకంబులు గెలిచె నింద్రాదుల గెడుపఱిచె

గీ॥ నెల్లరు వడంకి రెవ్వాని హేతికలన కెందు నేనియు నొండొరు లెనసి పోర
నొక్కఁడు జయించుఁ దక్కొరుఁ డోడుచుండుఁ గాని యిరువురు గెలుచుట గానఁబడదు.

ఆ॥ పరులఁ బొడిచి గెలుచుఁ బరులచే హతుఁ డగుఁ బేరుగాంచినట్టి వీరవరుఁడు
కాని యెందు తెఱఁగు గలుగ దాతని కెందుఁ గాన నిశ్చితప్రకార మిదియ. ౩౧

కం॥ ఈ నిర్ణీతార్థముఁ గొని గ్లానిం బోఁద్రోఁచి యవలి కర్జం బనువౌ
నా నెఱి నాలోచింపుము శ్రీనందితకీర్తి జగతిఁ జెలువారంగన్. ౩౨

కం॥ ఆక్రమమునఁ గార్యము రణవిక్రాంతుఁడు రామవిభుఁడు వివరించిన శో
కాక్రాంతిక్లాంతుఁడు నిర్వక్రత వెలయంగ నసురవరుఁ డిట్లనియెన్. ౩౩

ఆ॥ వేలఁ గడవరాని విధి సముద్రం బట్లు నిన్నెదిర్చి యాజి నిహతుఁడయ్యె
గాని మున్ను వేల్పుగములతో వాసవు క్రందులందు భంగమందఁ డితఁడు.
తే॥ దానము లొసంగెఁ బూజలఁ దనిపె గురులఁగలిమిభోగము లెల్ల భుక్తములుసేసె
భృత్యుల భరించె మిత్రులఁ బేర్మి నరసె వైరనిర్యాతన మొనర్చె వైరులందు.
ఆ॥ ఈతఁ డాహితాగ్ని యిద్ధతేజుం డనూచానుఁ డఖిలవేదసారవేత్త
తపసి కర్మఠుండు తగు సంస్క్రియ లొనర్పఁగాఁ దలంతు నీప్రసాద మొనయ.
క॥ అని దీనుఁడగుచు వేఁడు నతని నుడులం దేర్చి యిచ్చ దవుల మహాత్ముం
డనితరగుణుఁడు నృపాత్మజుఁ డనుశాసించె నిటు లోమహాసేనాంబా! ౩౮
తే॥ వైరము ల్మరణాంతము ల్వచ్చె మరలి తలఁపులం గొన్న యస్మదర్థంబు లడరి
సంస్కరింపు స్వర్గాధానసముచితముగ ననఘ! నీకె ట్టితఁడు నాకు నట్టివాఁడె.

—♦ రాక్షసస్త్రీల విలాపములు ♦—

మ॥ అనునాలోఁ దమభర్తపాటు విని శుద్ధాంతాంగనల్ రాజ్ఞియుక్
జనుదేరంగని వారణ ల్వెలయఁగా సంసక్తశోకాత్మలై
యనపేతత్వమున స్వరం బొరలుచుక్ హాయంచు బిట్టేడ్చి రా
వినిపాతంబున ముక్తకేశు లయి యావేగప్రవేగంబునక్. ౩౯
క॥ హతవత్సలు ధేనువు లట్లతిశయితారావ మడర నటఁజని నష్టా
యతు లెడయనీని కూర్మిం బతిపజ్జం దొరసి రార్త్యుపప్రేరితలై. ౪౦
తే॥ ఉత్తరద్వారముననుండి యోల మెడలి రక్కసులుగూడిరాఘోరరణముతలము
సొచ్చిపడియున్నతమభర్తఁ జొప్పెఱింగి వ్రాలిరొగి నాథ! రాజపుత్రా! యటంచు.
ఆ॥ కనుల దొట్టు నీరు కాల్వలై పారంగ భర్తృశోకజితలు పరగతలుగ
రిక్తయూథపలు కరేణుక లట్లు లపారరావ మెగువఁ బనవి రపుడు. ౪౨
ఉ॥ నెంజలివాకలో మునిఁగి నీలకచ ల్మహిమాఢ్య నీడ్య నీ
లాంజనసారసన్నిభ మహావిభు భూరిశరీరు శూరు శ
త్రుంజయు సర్వతోజయు సుదోర్బలవీర్యు సధైర్యు భర్తఁ జే
రంజని పర్వతంబు భిదురప్రహతం బటు గాంచి మూర్ఛలై. ౪౩
క॥ ధూళిం బ్రుంగుడుపడుచు నిరాలంబలు ఛిన్నలైన యావనలతల
ట్లోలిం గనుఁగొనవగుచుక్ వ్రాలిరి తద్గాత్రముల నవారిత లగుచుక్. ౪౪
ఉ॥ ఒక్కతె కౌఁగిలించుకొని యొక్కతె పాదము లాని పూని వే
ఱొక్కతె కంఠసక్త యయి యోర్తు భుజమ్ములు సేర్చుకొంచు నిం
కొక్కతె మోము గన్గొనుచు నోర్తుక యుర్వర వ్రాలి పొర్లుచుక్
రక్కసితేని యంతిపురి రామలు రావడి గాంచి రత్తరిక్. ౪౫

తే॥ అంకమున శిర మునిచి మోమందిపుణికి యొక్కరిత యేడ్చె నొక్కరిత యొగి మొగమ్ము
మొగము సేర్చియవశ్యాయములఁ బయోజమట్లు గన్నీళ్ళఁదడుపుచు నడలఁదొడఁగె.
క॥ పతి ప్రహతుం డై సమరక్షితి మృతుఁ డయి వ్రాలి రుధిరసిక్తుఁడు ఘూర్ణి
ప్రతిసక్తుఁ డగుట కోర్వక సతు లాక్రోశించి రురువిషాదము పొదువన్. ౮౭
ఉ॥ ఎవ్వనివల్ల నిచ్చ భయ మెంచునొ శక్రుఁడు కాలుఁ డెవ్వనిం
దవ్వులఁ గాంచి చింతిలునొ త్రాసితుఁ డై ధనదుండు పుష్పకం
బెవ్వని కోడి కోల్పడెనొ యెల్లమహర్షిసురాసురాదు లె
వ్వెవ్వని గుండెగాల మని యెంతురొ యాతఁడు గూలె నేఁ డనిన్. ౮౮
తే॥ వరసురాసురభుజగఖేచరులవలనఁ బ్రబలగంధర్వసిద్ధచారణులవలన
నెన్నఁడేనియు భయ మంచు నెన్నఁ డట్టివాఁ డిమగఁ డందె మానవులవలని భయము.
క॥ ఏ వాఁ డవధ్యుఁ డెపుడును దేవాసురయక్షదనుజదితిజవరులకున్
దావల మట తేజమునకు నావిభునిఁ బదాతి మనుజుఁ డని నిలఁ గూల్చెన్. ౯౦
క॥ ఆజి సురాసురముఖ్యులే తేజోనిధిఁ గానలేక తెరలుదు రరరే
యాజిత్వరుం డసత్యుని యోజ న్మృత్యుగతుఁ డయ్యె నొకమనుజునిచేన్. ౯౧
క॥ అని పనవిపనవి వెండియు వనితామణు లిట్లు లనుచు వాపోయిరి నె
ట్టన గడవరాని యంగద మునుకొని త మ్మొకటఁ దడవి ముట్టుకొనసంగన్. ౯౨
సీ॥ మతు లెన్నిచెప్పిన మాన వమ్మానవనాథు నంగనఁ దెచ్చినాఁడ నడరి
యాయమ యిలుసొచ్చినదె మొదల్గాఁ దోఁచె నన్ని యరిష్టమ్ము లసురపురికి
నిందర మిమ్మెయి నెడరునకుం బాలుపడి కూల నై యుంపఁ బ్రాఁక వెట్లు
పరుషమ్ములాడి నీభ్రాత విభీషణుఁ ద్రోచి తిట్టము వల్కఁ దోరఁ దెరల్చి
యతని హితము మెచ్చి యాసాధ్విఁ బనిచి శ్రీరాము శరణ మనిన రావు లేక
బ్రదుకువార మెల్లభంగుల సుఖవృత్తి నెఱఁ బొసంగునే పనిగ్రతులకు. ౯౩
ఉ॥ తమ్ముఁ డెఱింగి తెల్పిన విధమ్ము మనమ్మునఁ జేర్చి తైన న
ర్థమ్ము ఫలమ్ము గాంచె నని తా నెదఁగాంచు ముదమ్ము రాఘవుం
డిమ్మహి కెల్ల మిత్రుఁ డగు నించు నయమ్మునఁ దొంటి శాత్రవుల్
వమ్ములు దీఱ నవ్వగతి వాటిలకుండుఁ గలంతకాలమున్. ౯౪
ఆ॥ ఘాతుకుండ వగుచుఁ గల్యాణి సీత నిరుద్ధఁ జేసి రాము రోషితుం బొ
నర్చి తకట యాబుధార్చితుం డడరిన నింతవుట్టె నింక నేమి గలదు. ౯౫
*కం॥ యోధాగ్రేసరుఁ డని యవ్వేధకు మునిమనుమఁ డని వివిధవిదుఁ డనియున్
నాధా! నినుఁ గొని పొంగితి మాధికి మముఁ గూర్చెఁ గాముఁ డక్కట కంటే.
తే॥ ముందు వెను కని లేక నిర్మూల మయ్యె రక్కసికొలంబు నేఁడిట్లు లుక్కడక్క
నీవు గూలితి వింకొక్క నెఱియు గలదె విధవలము మేము పలవించువిధము దక్క

ఆ॥ నీదు కామకారనిరతిఁ దిట్టఁగ నేల విధియ యి ట్లొనర్పఁ వేచియుండ
దైవనిహతు నొందుఁ దాఁ గండడంచితి ననున కాని యెల్ల యదియ చేయు.

కం॥ వానరులు మడిసి రెందరొ హానము నొందిరి మహాత్ము లౌ రాక్షసు లిం
కేనెరి కోపదు హతవిధి నీనెల విటు రిత్తసేసె ని న్నెడలించెన్. ౫౯

ఆ॥ అర్థముసన కాని యటు కామమునఁగాని విక్రమమునఁగాని విధినకాని
దైవగతి యశక్య తద్దయుఁ గడవఁ జేఁ ద్రోవ నాకసంబు దూర మగునె. ౬౦

క॥ అని దీన లగుచుఁ గుఱరుల యనువున దుఃఖార్త లై మహానాదమ్ముల్
మొనకొనఁగా నేడ్చిరి కనుగొనల నుడుకునీటి సొనలు గొనకొని నెఱయన్.

ఉ॥ రక్కసియాండ్రు పెక్కు రటు రావము లెచ్చ వగర్పు లేర్పడన్
దిక్కటి యేడ్చుచుండ నతిదీనత మైకొన జ్యేష్ఠపత్ని పే
రక్కఱ కెక్కు పెంపుఁ గని నట్టిది వర్ణితశీలవృత్త యా
చక్కటి సేరి భర్తఁ గని సాంద్రవిషాదమునం గృశించుచున్. ౬౨

—♦ మందోదరి శోకము ♦—

ఆ॥ వనరె నిట్టులంచు వాకొంచు మందోదరీసమాఖ్య రుచిర భాసమాన
యాయచింత్యకర్ముఁ డౌ రాముచే నంత లైన యాతఁ డింత లగుట కదరి. ౬౩

సీ॥ ఓమహాభాగ! ని న్నోపె నెట్లు వధింప వనగోచరుం డైన మనుజుఁ డొకఁడు
నీసమ్ముఖమ్మున నిలువ నేరఁడు సంగరం బనునంతఁ బురందరుండు
నీవు క్రుద్ధుఁడ వైన నెఱిమాలి సురలు గంధర్వులు ఋషులును దలఁగఁజూతు
రుద్వేగ మెదఁ గ్రమ్మ నోటము పైకొనఁ జారణు లైన లెక్కి సంచలింత్రు
సిగ్గు వొడమకున్నె సిరి బీర మెసఁగఁ ద్రైలోక్య మాక్రమించి లోఁగొనంగ
నైనయాతఁ డిట్టులయ్యెఁబో యను వాదు వుట్ట దానఁజేసి పొలిసితొక్కొ. ౬౪

క॥ వైశ్రవణానుజ నిను నరుఁ డశ్రమమున గెలుచుజాడ నరయఁగనిన నీ
కాశ్రవు లై మనువేల్పులు విశ్రాంతికి నిట్టి వెరవు వెదకి రనఁ జనున్. ౬౫

ఉ॥ మానవు లే? నినుం జెనకి మార్కొనువారలు కామరూపసం
ధానమునన్ గడల్కొనెడు తాఁకఁ బినాకినయే నలంతు వే
పూనికమై వధించు నెఱపోటరి యయ్యెను రాముఁ డింక నే
నానెఱి నమ్మఁజాల సకలర్థులు నీయవె నాఁ బొసంగఁగన్. ౬౬

ఉ॥ తా నొకఁడే కడంగి సహదానవనైకసహస్రకున్ జన
స్థానమునందు నాఖరునిఁ దావకసోదరునిన్ త్రిశీర్షుతో
నానెఱి వైరిదూషణుఁడ మై తగు దూషణుతో క్షణంబులో
మాన కడంచినప్డె యతిమానుషుఁ డన్నరుఁ డంచు నెంచితిన్. ౬౭

ఆ॥ ఎపుడు నగరి లంక యింద్రాదులకు దుష్ప్రవేశ బీరమునఁ బ్రవేశ మొనసి
హనుమఁ డంతలంత లాచరించి చెలంగె నపుడె కీడు మూఁడు టరయనయ్యె.

క॥ సేతువు మహార్ణవంబున నేతఁటి నిర్మించి రగచరేంద్రులు కడిమిన్
గాతరత నపుడె రాముం డేతావన్మాత్రుఁ డనుచు నెంచకుఁ డంటిన్. ౧౯

ఉ॥ ఒక్కెడ రామరూపమున నోజఁ గృతాంతుఁడు తా నె పొంచి యా
తక్కరి మాయతో నపరితర్కితతోఁ జనుదెంచి మించి యీ
రక్కసివీడు సొచ్చి కడురాయిడిమై ననుతానుజాప్తు ని
న్నిక్కరణి న్వధించె నని హేతుకృతిన్ సమకూర్తు నెమ్మదిన్. ౨౦

ఆ॥ అట్లు గాకయున్న నరి వాసవుఁడె యిట్లు చెనకి ధర్షితునిగఁ జేసె నిను మ
హాబలుం బలారి యనిన నంతటి శక్తి కలదె యతని కెవిరి నిలుచువాఁడె. ౨౧

సీ॥ యుక్తమీతఁడు మహాయోగి సనాతనుం డాదిమధ్యాంతశూన్యాత్ముఁ డైన
పరమాత్మ మహదాదిపరమతమస్తత్త్వపరముఁ డవ్యాకృతపరుఁడు ధాత
శంఖచక్రగదాసిసంశ్రితకరుఁడు శ్రీవత్సవక్షుఁడు శ్రీనివాసనిత్యుఁ
డప్రమేయుఁ డజయ్యుఁ డటు శాశ్వతుఁడు ధ్రువుండణిమాదికైశ్వర్యగుణసమృద్ధుఁ
డైన విష్ణుఁ డిపుడు మానుషదేహాప్తి సత్యవిక్రమప్రశస్తి వెలయ
సురల హరులఁ జేసి చూపట్టె నిమ్మహాద్యుతి సతీవతంసయుక్తుఁ డగుచు.

తే॥ సర్వలోకేశ్వరుండు సాక్షాత్కరించి లోకహితకామ్య రాక్షసలోకకలితు
నిన్ను దునుమాడె నాతని నిర్ణయమున కీవును సహాయ మొనరించితేమనంగ.

ఆ॥ ఇంద్రియముల గెలిచియే గెల్చితీ త్రిభువనముఁ దపము పేర్మి వాసికెక్కి
యింద్రియములె వైర మెంచి నిన్ను జయించె మమ్మువోంట్ల కర్మమార్గమునను

క॥ అవిరోధ మందఁ గాంచుము సువిదితుఁడగు రాముఁ గొలిచి సుఖపడు మనుచున్
సువిహిత నేఁ దెలిపిన విన వవిరళఫల మబ్బె నదియ యంతిమదశగాన్. ౨౪

తే॥ ఆత్తకాముఁడ వైన నీ వంతకాల మగుడు సీతాభికాముఁడ వైతి రిత్త
స్వాత్మనిజజనతామహైశ్వర్యనాశ మొదవఁజేయంగ నగు యోగ ముట్టిపడగ. ౨౫

తే॥ చెలి యరుంధతికన్న విశిష్ట తలఁప సాధ్వి రోహిణికన్న విశాలకీర్తి
సీత జగదేకమాతధర్షించినాఁడ వసదృశంబైన దదియ నీయట్టిదౌరకు. ౨౬

సీ॥ వసుధ కద్దేవియే వసుధ శ్రీకిని సిరి భర్తృవత్సల సీత పరమసాధ్వి
సర్వానవద్యాంగి సకలశుభాత్మిక యొంటి కాననమున నున్నతఱినిఁ
గపటంబు పన్ని నన్గావు మోయన్న యం చతిదీన యై యార్తి నడలుదాని
నటు తోడితెచ్చితి వాత్మస్వదూషక! యక్కామ మెద మొదలంటఁ గ్రాచె
దగ్ధుఁ జేసె నిన్నుఁ దనుమధ్య సుచరిత్ర తపము తోడుతోన తగులఁబడ వ
దెట్లొ? దానఁజేసి యింద్రాగ్నిముఖ్యులు బ్రమందుచున్నవారు మాత్రభుండ. ౨౭

ఆ॥ పాపకర్మఫలముఁ బడయుఁ గర్త యవశ్య మది సుఘోర మగుచు నవసరంబు
వచ్చినపుడ కొల్చు వారని దై దైవ మదియ చుమ్ము సందియమ్ము లేదు.
తే॥ మంచి చేసినవానికి మంచి కలుగు పాప మొనరించు నతనికిఁ బాప మొదవు
నావిభీషణుఁ డటు సుఖ మందినాఁడు నీకు సంప్రాప్త మైన దీని ర్ధారణము. ౮౦
ఉ॥ కామము మోహ మిట్లు నినుఁ గాటియపెట్టి విమూఢుఁ జేసెఁ గా
కా మెయి రూపలక్ష్య లగు నంగన లెందఱు లేరు నీకు నే
నామిథిలేశు కన్యకకు నన్వయమందొ సురూపమందొ బల్
ప్రేముడినో వయస్సుననొ పెక్కువ తక్కువ నిశ్చయించితే? ౮౧
ఆ॥ ఎల్లభూతములను నెద్దియో యొక నిమిత్తంబు సూపి మిత్తి తారసిల్లు
నీదుమృతికి సీత నెపమునఁ దలయెత్తె నెయిది తెచ్చికొంటి వింతసేయ. ౮౨
కం॥ ఆయమ రామునితోడ సుఖాయతనం బన విశోకయై విహరించున్
బాయక ఘోరాఘాంబుధినే యడఁగెద నల్పపుణ్య నే న్ప్రౌఢ్న్. ౮౩
శా॥ కైలాసంబున మందరాద్రిఁ గనకగ్రావంబునం దేవతా
లీలోద్యానములందుఁ జైత్రరథపాలిం బాళిమైఁ బుష్పక
శ్రీలక్ష్మ్యాఢ్యవిహారము ల్నెఱయ లక్ష్మీలాలనోద్యత్కలా
లాలిత్యంబున నిన్నుఁ గూడి ప్రమదోల్లాసంబుల న్మించితిన్. ౮౪
శా॥ ఆయాదేశములం గనుంగొనుచు సర్యాటంబు లర్థించుచో
నాయావేషములం దనర్చుచు మహావ్యామోహ మొప్పార నీ
శ్రేయం బెంచుచు మాల్యలేపవసనశ్రీ లొయ్యఁ గల్పించుచున్
జాయంబోల మెలంగితి న్విభవవిస్తారాఢ్య నై నిచ్చలున్. ౮౫
తే॥ నీక్షయంబున నిప్పుఁ డున్నిద్రకామభోగవిభ్రష్ట యై మందభాగిని యగు
ప్రాకృతస్త్రీ తెఱంగున బడలుదాన ద్రిమ్మరులు సిరు లనుచు నిందింపవలదె. ౮౬
వ॥ హా మహారాజా! సుకుమారంబును సుభ్రువును సుచర్మంబును సమున్నతనాసం బును గాంతిశ్రీద్యుతులచే నిందుపద్మదివాకరతుల్యంబును గిరీటకూటోజ్జ్వలితంబును దామ్రాస్యంబును దీప్తకుండలంబును బానభూమివిహారంబుల మదవ్యాకులలోలాక్షంబును దివ్యమాల్యాలంకృతంబును జారుతరంబును వల్గుస్మితకథంబును శుభకరంబును నగు నీవదనం బీదుప్కాలంబున రామసాయకవినిర్భిణ్ణంబై రుధిరవిస్రవసిక్తం బై విశీర్ణమేదోమస్తిష్కం బై స్యందనరేణురూక్షం బై యొప్పారకున్నయది. మందబుద్ధి నగు నాచే నెక్కాలంబును సంబుద్ధగాని దైన యీయాపశ్చిమదశ నా కిప్డు వైధవ్యసంతాపకారిణి యై సంప్రాప్తించినది. తండ్రి దానవేంద్రుం డగు మయుం డనియు, భర్త సకలరాక్షసేశ్వరుం డనియుఁ, బుత్రుండు నిర్జరేంద్రనిర్జేత యనియు సుభృశగర్విత నైతి. నిం కే మనుదాన

నా వార లందఱు దృప్తారిమర్దనులు శూరులు ప్రఖ్యాతబలపౌరుషులు నకుతశ్చిద్భయులునుం గదా. నాకేమి కొఱంత యను సాహసమున దృఢతర నై సంతృప్తిం బొదలించుచుండె. నట్టి మీర లిందఱు విదితప్రభావు లేక కాలంబున నొక్క మానుషమూర్తివలని భయంబునం బొడవడంగితిరి. క్షణభంగురత్వం బన నిట్టిద గాబోలు స్నిగ్ధేంద్రనీలనీలకోమలం బై మహాప్రాంశుశైలోపమం బై కేయూరాంగదవైదూర్యముక్తాదామస్రగుజ్జ్వలం బై విహారాధికమనోహరం బై సంగ్రామభూమిప్రదీప్తం బై విద్యుద్విభాంచితతోయదం బట్టు లాభరణప్రభాభాసితం బై సహజలావణ్యభాసురం బై యుపభోగయోగ్యం బగు నీశరీరం బిప్పుడు శలలంబులచే శ్వావిన్మృగంబు చేసి చందంబునఁ దీక్ష్ణానేకశరశతంబులచే నిచితం బగుచు దుర్లభసంస్పర్శం బై పరిష్వంగంబున కర్హంబు కాకున్న యది. స్వర్ణపుంఖంబులు నిరంతరసంలగ్నంబులు నై మర్మంబుల నంటనాటుకొని నాటుకొనిన బాణంబులచే శ్యావసన్నంబును రుధిరస్రావంబులచే లోహితంబును నై వజ్రప్రహారాభిహతం బై వికీర్ణం బైన పర్వతంబుచాడ్పునఁ బుడమిం బడియున్న దీనిం గన్నులారం గనుంగొనుచున్న దాన. నీదాన నో నాథా! నన్ననాథం జేసి యెందరిగితివి. నిజంబుగా నిది స్వప్నంబ యనవచ్చు. నట్లు గాకున్న మిత్రికి మిత్రి వగు నీవు రాఘవునిచే నిహతుండ వై మృత్యువశ్యుండ వెట్లగుదువు. త్రైలోక్యవసుభోక్తవు త్రిభువనమహోద్వేగదుండవు లోకపాలనిర్జేతవు శంకరగిరిక్షేప్తవు దృప్తనిగృహీత వావిష్కృతపరాక్రముఁడవు లోకక్షోభయితవు. భూతవిరావణుండవు. నోజమ్మోకలిమి రిపుసన్నిధి యనక దర్పితవాగర్పణంబు సేయువాఁడవు స్వయూథభృత్యవర్గగోప్తవు భీమకర్మహంతవు వేలకొలందిగా దానవేంద్రులను యక్షులను నివాతకవచులనుం జేర్చుకొనిన యద్ధీశ్వరుండవు ననేకయజ్ఞవిలోప్తవు స్వపక్షత్రాతవు ధర్మవ్యవస్థాభేత్తవు రణరంగమాయాస్రష్టవు దేవాసురనరవరకన్యాహర్తవు శత్రుస్త్రీశోకదాతవు స్వజననేతవు లంకాద్వీపగోప్తవు నస్మత్కామభోగప్రదాతవు రథికాగ్రగణ్యుండవు ననంబరఁగి యద్భుతప్రభావుండ వగు భర్త వీవు రామునిచే నిట్లు వినిపాతితుండ వై యుండ స్థిర నై హతస్వామికం బగు నిద్దేహంబు హద్దు లేక ధరించుచున్న దాన ననుచు మోహాపారవశ్యంబున మునింగి కొండొకవడికిం దేఱి నిట్టూర్పులు నిగుడించుచు వెండియు నిట్లని విలపింపం దొడంగె. ౮౭

ఉ॥ నాయక! మమ్ముఁ గూడి శయనప్రవరంబుల సమ్మదంబునన్
సోయగ మెచ్చు నిద్ర యను జోటికిఁ జోటిడి మేలుకాంచె దా
నాయకరంబు వీడి కఠినం బగు నిట్టి ధరాతలంబునన్
బాయని సుప్తిఁ బాల్గొను నెపంబున ధూళుల ద్రుంగు టొప్పునే. ౮౮

తే॥ నగము సచ్చితి నాబిడ్డ శక్రజేత లక్ష్మణునిచేత దురమున లావరి తన
లావఱి విశస్తుఁడైన స్థలాత మైతి నున్న యుసు ఱిప్పు డిట్టు లుబ్బూతలూఁగ.
తే॥ బంధుజనహీననైమున్నె బడలి యిపుడు భర్తృహీననై కడగండ్లుపడుచుఁదొంటి
సుఖము లెడలంగ నిలువంగ జోటులేని శోకవార్ధిలోఁ బడి యింక సాఁగయనేర.
తే॥ శాశ్వతసుఖమ్ము లీఁజాలు జాణ వీవు శాశ్వతపథంబు గైకొని జాఱి తింక
శాశ్వతం బగు కాలంబు సతతదుఃఖభాజనం బయి నీపత్ని బ్రదుకఁగలదె. ౯౧
ఆ॥ దుడుకుదనము మీఱి దుర్గమపథమునఁ బోయె దొంటి చనుట పోల దింక
నన్నుఁ దోడుకొనుము నాయక! నిను వీడి నొవ్వపాలు గొంచు నొగులఁజాల.
క॥ ఏ మనినఁ బలుక వే మని యేమఱపాటెంచి విడిచి యేగెద వనఘ
స్త్రీమహిళ దీన దుఃఖిత నేమెయి నేరమి ఫొసంగ నెఱిఁగింపు దయన్. ౯౩
ఆ॥ కాలినడక నిట్లు గాలుచు నగరంబు వెడలి త్రొక్కరాని పుడమి వ్రాలి
యడలు టొప్పదనుచు నన వకుంఠిత నన్ను దిట్టవేల యిదియు దిట్టతనమె. ౯౪
తే॥ ఇష్టదార! భవద్దార లిరవు బాసి భ్రష్టలజ్జావకుంఠితత్వమున తెఱఁగు
వీడి మసలంగ నెట్టి దీమోడి కూడ దనవు పలుకవు కోపింప వరయ వెదియు.
తే॥ నీదుక్రీడాసహాయ మిన్నెలఁతపిండు నేఁ డనాథ మై విలపించుజాడ యెఱిఁగి
యూరడింపవు చేరి బహూకరింప వింతలోనన తీఱెనే యంత చెలిమి. ౯౬
సీ॥ ఎందఱెందఱఁ జేసి తిల్లాండ్ర విధవలు గాఁగఁ గూడని సమాక్రాంతి నెఱపి
పతిదేవతలు ధర్మపరమలు గురుసేవనాభిరతలు నైన యతివమిన్న
లట్లు నీచే పడి యార్తలు శోకాభితప్తలు నౌ వారు తలరి తలరి
నాఁడు దిట్టిన తిట్లు నేఁ డిట్లు ఫలియించెఁ గా కొండ్లు గలరె ని గ్గాసిపరుప
సత్య మింతవట్టు సతులఁ గాఱియవెట్ట వారి కంటినీరు వసుధఁ బడినఁ
జేటు మూఁడు ననుచుఁ జెప్పుదు రార్యు లవ్వాదు నీకతమున వఱలె నధిప.
ఉ॥ శౌర్యమునన్ జగత్త్రియము సంభ్రమ మొప్పఁగ గెల్చి యీవధూ
చౌర్యమునం జొరంబడితి చక్కదలంచిన నిట్టి దేటిశౌం
డీర్యమొ మాయలాతని గడింది మెక మ్మొనరించి స్వీయకా
తర్యము దోఁప రాముఁ డటు దాఁ జన జానకిఁ దెచ్చి తేమనన్. ౯౮
తే॥ కాతరత్వంబు జాడయే కానఁబడదు నీదెస దురంబులం దీవు నెగడునప్పు
డెట్లు భావించినను నేఁటి కీవిపర్యయంబు దలయెత్తె నాయభాగ్యంబుకతన. ౯౯
సీ॥ అనవద్యగుణుఁ డతీతానాగతజ్ఞుండు ప్రస్తుతార్థవిశేషపండితుండు
సత్యవాఙ్నిరతుండు సంప్రదాయజ్ఞుండు దేవసన్నిభుఁడు నాదేవరుండు
నిట్టార్పు లెడలంగ నినుఁగాంచి యూహించి సీత ముచ్చిలి యిల్లుసేరినపుడె
ధర్మార్థయుక్తమై తగ నాడె నిట్టి యాపర్యవస్థిత మైన పాపమునను

సర్వరాక్షసకుల ముపసంహృత మగుఁ గూడ దిమ్మెయి వ్యసనంబు క్రోధకామ
సంభవ మటంచు నమ్మాట సరకుగొనక మూలనాశ మొనర్చితి మునిఁగి తీవు.

చ॥ పరఁగితి వీవు ఖ్యాతబలపౌరుషుఁ డెక్కటి యీతఁడే యనన్
బెరసితి భోగమున్ జగతిఁ బేరునుఁ బెంపునుగాంచి తన్నిఁటన్
నరసురవీరులం గెలిచి నల్లవె పున్నెమొ పాపమో చిరం
బొరసిన దెల్లఁ గొంచు నని నోడక సద్గతి కెక్కి తీగతిన్. ౧౦౧

ఆ॥ స్త్రీస్వభావయోగసిద్ధచాపల్యకారుణ్యవలనమునను రూపుసెడిన
బుద్ధిఁ ద్వద్వియోగపురుదుఃఖదాయి శోకాత్మవృత్తి మగ్ననైతి నేను. ౧౦౨

వ॥ హితకాము లగు సుహృద్వరుల సువచనంబులు నీకుం గొఱగానివయ్యెఁ; నన్న దమ్ముల మహితోపదేశంబుపై వెగటు వాటిల్లె; హేత్వర్థయుక్తము విధివంతము శ్రేయస్కరంబు నదారుణంబు నగు విభీషణోపపాదితం బగు వాగౌషధంబు విషం బని మిష పెట్టి గ్రహింప నొల్లక కుతర్కంబున నాతనిఁ బేలఁజేసి యడచి పుచ్చిన నరులు వీడి యాతండు నరులవాఁ డౌట కతన నింతటికీడు మూఁడె నది యట్లుండ మారీచకుంభకర్ణులు మజ్జనకుండునుఁ గార్యకారణభావంబరసి సారవంతంబు లని నొడివిన నుడు లెల్ల వీరరసమత్తుండ వైన నీకు నిస్సారంబులని తోఁచె నన్నిటికి నైన ఫలం బిదియచుమీ యోనీలజీమూతసన్నిభా! పీతాంబరా! శుభాంగదా! నిజావయవవిచ్ఛేదంబులం బోరికలనున వెదజల్లి రుధిరాప్లుతం బైన కడమదేహంబుతో నొంటి శయనించి నిద్రించువానివలె శోకార్త నగు నాతో మాటాడ వడిగిన దానికిం బ్రత్యుత్తరం బీయవు. మహావీరుండవు దక్షుండవు సంయుగానివర్తివి. యాతుధానేంద్రదౌహిత్రుండవు నగు నీవు రాజ్యలక్ష్మిం బోని నన్నేలొకో యిట్లుపేక్షించుచున్నాడవు. లే లెమ్ము. వింతపరిభవమ్ము సంప్రాప్తం బగుచుండ నింకను నిమీలితుండ వై యుండ నేల. యల్లదిగో నేఁడు సూర్యరశ్ములు నిర్భయమ్ము లై లంకలోఁ బ్రవేశించుచున్నవి. చూడుము. దునుమాడుము. దురముల నరివర్గంబులం బరిమార్చునదియు హేమజాల పరిష్కృతంబును సతతార్చితంబును వజ్రధరునకు వజ్రంబపోలె సూర్యవర్చస్కుండ వగు నీకుం బరమసాధనంబై నెగడొందు నదియు నైన యమ్మహా పరిఘంబు రామబాణంబులచే సహస్రధాచ్ఛిన్నంబై వ్యవకీర్ణం బై యున్నది. ప్రియురాలిం బలె సమరమేదినిం గౌఁగిలించుకొని ప్రీతిమై నిద్రించుచున్నాఁడ వెందులకో? సమాగత నన్నప్రియం బోలె ననాదరించి యభిభాషింప నొల్లమి చూపుచున్నాఁడ వియ్యది యాగ్రహంబా? పంచత్వంబా? ఛీ! ఛీ! యీపాడు హృదయంబు వేయి వ్రక్కలు గాక యుక్కుమిగిలి యున్నయది. వజ్రకఠినం బగు దీని శోకవజ్రంబుగూడ భేదింప నేరనిదయ్యె. నింకనేమిసేయుదు నని

యిట్లనేకప్రకారంబుల విలపించుచు బాష్పవ్యాకులలోచనయు స్నేహావస్క
న్నాంతరంగయునై యద్దేవి మోహపారవశ్యంబున మగని యురంబున వ్రాలి
మే నెఱుంగక యున్న యవసరంబున. ౧౦౩

తే॥ కశ్మలాభిహతయు సన్నగాత్రియు నయి రావణోరస్స్థలమున నారాణి మెఱసె
నసితసంధ్యానురక్త మహా నంబుదమున దీప్త మైన విద్యుల్లత తెఱవు దోప. ౧౦౪

క॥ అది గని సపత్నులోడ్లును ముదిత విపర్యస్తదశకు మొగకొనె ననుచున్
గదిసి భృశాతుర లగుచున్ సదుపస్థాన మొనగూర్చ్చి సంగతి నెఱపన్. ౧౦౫

ఆ॥ తేఱి రుదిత యగుచు దెరు వేది యున్న యన్నాతితోడ రోదనమ్ము లెసఁగ
నిట్టు లనిరి దేవి! యిది తెఱం గగునె నియెఱుఁగనిదియు నెందునేనిఁ గలదె.

క॥ లోకస్థితి యధ్రువ గద ప్రాకటము దశావిభాగపర్యాయమునం
దాకలన నెపుడుఁ జంచల యై కాలెడు రాజ్యలక్ష్మి సనఁగావలెనే. ౧౦౭

తే॥ అనుచు బాంధవవృద్ధాదులనుననునయ మొప్పఁబలుకఁగృశాంగిబిట్టూరసికొనుచుఁ
బోర్లు నస్రాంబువిస్రవంబుల నభిముఖముల స్తనంబులఁ దడుపుచుఁ దలరుచుండె.

—♦ రాముఁడు రావణు సంస్కరింప విభీషణు నియోగించుట ♦—

ఆ॥ అంతలోనె రాముఁ డనఘు విభీషణుఁ గాంచి పలికె నేల కాలహరణ
మింక సోదరునకు నెనయింపు మంత్యేష్టిసంస్కరణము సాధుసమ్మతముగ.

క॥ అనుపుము నగరికి వనితాజనతం దగనూరడించి చయ్యన నను న
య్యనుపమచరితుం డా రాముని ధర్మార్థోపహితమమ్మాల్యవచనమున్. ౧౧౦

తే॥ విని వినమితోత్తమాంగుండు వినయనిధి విభీషణుఁడు శ్రుతిసమ్మితభాషణుండు
మతి విమర్శించి రాముసమ్మతి స్థిరీకరింప నా తలఁపునఁ దగు రీతి ననియె.

ఉ॥ క్రూరుఁడు త్యక్తధర్ముఁ డతికోపపరీతుఁడు మూర్ఖుఁ డన్యయో
షారతిశీలి పాతకి మృషావచనుండు నృశంసుఁడున్ దురా
చారుఁడు భ్రాతృరూపుఁ డగు శత్రుఁడు సర్వహితేతరస్థుఁ డే
గౌరవ మెంచి వీనికి రకం బగు సంస్క్రియ లెట్లొనర్చెదన్. ౧౧౨

ఆ॥ పతితు లైనవారు భస్మాంతసూతకు లనుచు స్మృతులు దెలుప ననుచు విధుల
నెట్లు మెలఁగువాఁడ నితరులు దనుఁబాపకర్ముఁ డనుచుఁ దిట్టఁ గడఁగి కడఁగి.

క॥ తద్దోషంబుల నారసి మద్దూషణ మానుకొంద్రు మహి నెల్లరు నీ
విద్దానఁ గనిన సందియ ముద్దవడి దెరల్పఁజాలు దూర్జితచరితా. ౧౧౪

మ॥ అనినన్ రాముఁడు ధర్మభృద్వరుఁడు ప్రీతాత్ముండు నై తోనె యా
తనితో నిట్లను వాక్యకోవిదుఁడు సద్వాక్యజ్ఞుఁ డవ్వాఁడు మే

లన నెవ్వారును సంతసిల్ల నుచితం బౌ నర్థ మూహించి నీ
యనయాభిజ్ఞత చొప్పడంగఁ గడు నెయ్యం బొప్ప నో నేర్పునన్. ౧౧౭

సీ॥ నీవు మత్ప్రియ మైన నెఱిఁ బ్రవర్తించుట యుక్తమే యైనఁ గద యొరసిచూడ
నీప్రభావంబున నే జయించినవాఁడ నరయంగ నయ్యది యట్లు గాట
ద్వచ్ఛ్రేయ మూహించి తగును క్రిఁ దెలుపంగ నలయు ధర్మ్యము నైన వల నెఱింగి
యానిశాచరుఁ డధర్మానృతవర్తనుం డైనను దేజస్వి యధికబలుఁడు
కీర్తిగాంచె నింద్రాదుల గెలుపుకతన నీతఁ డపరాజితుం డను నెఱుక వొడమె
నట్టులు తపోనిరతుఁడు మహాత్ముఁ డెన్న రావణుఁడు సర్వలోకవిరావణుండు.
తే॥ వైరము ల్మరణాంతము లవ్వి మరలి తలఁపులం గొన్న యస్మదర్థంబు లడరి
సంస్కరింపు స్వర్గాధానసముచితముగ ననఘ! నీ కె ట్లితఁడు నాకు నట్టివాఁడె.

క॥ అపరావృత్తమృతుం డితఁ డపరిమితానందలోక మందంగను దే
యుపహితమైనది కావున సుపక్వ మీఫలము గాంచు నో ప్పురయఁజనున్.

ఆ॥ వెరవు నెఱయ నీవు విధిపూర్వకంబుగా భ్రాత సంస్కరించి ప్రస్తుతకీర్తి
వగుదు ధర్మమూర్తి వైన నీసత్కృతు లంది పరమపదము నందు నతఁడు. ౧౧౯

క॥ అని రాఘవుఁ డానతిసేసిన నలరి విభీషణుండు నచ్చెరి నచ్చో
టెనసి తగు ఋత్విజులతో ననురూపవిధాన మొప్ప నారంభించెన్. ౧౨౦

సీ॥ శ్రీచందనేధ్మరచిత మైన సౌదమీఁదఁ బద్మకోశీరము ల్పరఁగఁ బఱచి
రాంకవాస్తరణవిరాజమానంబుగా నొదవించి బ్రాహ్మణు లోజ నెఱయ
భ్రాత రావణు దానిపై నివేశితుఁ జేసి యాహితాగ్నివిధాన మమరుచుండఁ
గ్రమ మొప్పఁ బితృమేధకల్పోదితక్రతుసంస్కారముల నెల్ల జరిపి రపుడు
దక్షిణప్రాచి వేది సలక్షణముగ సంఘటించి యథాస్థితి జ్వలనములను
జేర్చి హోమం బొనర్చి యర్చితఁ జితఁ బృషదాజ్యసంపూర్ణ స్రుక్స్రువము ల్నిలిపిరి.

చ॥ ఒడయని యంఘ్రులన్ శకట మూరుయుగాంతరమం దులూఖలం
బెడనెడ దారుపాత్రము లనేకములుం బ్రథమోత్తరారణుల్
బడి ముసలాదులు న్విధులఁ బాటిలు స్థానములందు నుంచి రే
ర్పడ నిగమాగమోక్తపరిపాటి విచక్షణు లైన ఋత్విజుల్. ౧౨౧

తే॥ పశువు మేధ్యము విశసించి ప్రకృతహోమవిధిసమాపన మొనరించి వేదవేత్త
లాప్తృతోక్తము లైన యజ్యాపరిస్తరణములం గూడఁ జితమైఁ బరఁగ నమర్చి.
తే॥ కలఁగు చిత్తంబుల సుగంధిగంధమాల్యవసనభూషణవిసరము ల్పొసఁగఁ దాల్చి
రందఱు విభీషణసహాయు లశ్రుపూర్ణముఖులు నై లాజలుం జల్ల మొనసి రపుడు.

క॥ పావనవిధియుక్తం బగు పావకకీల నెలకొల్పి బహుమంత్రప్ర
స్తావం బెసఁగ విభీషణుఁ డావల వలనొప్ప స్నాన మట్లొనరించెన్. ౧౨౨

తే॥ తిలల దూర్వాభిమిశ్రితముల జలములఁ గలితసార్ద్రివసనుఁడయి క్రమముగను ని
వాపవిధు లెల్లఁ దీర్చిచి వలగొనె నతఁ డాసురేంద్రున కాసురేంద్రారి కపుడు.
క॥ మందోదరీప్రభృతు లగు నందఱకును సాంత్వపూర్వ మగు భాషణ మిం
పొందఁ బచరించి యనిచె నమందవివేకుఁడు నగరికి మాన్యత మెఱయన్.
ఆ॥ రామ లంతిపురిఁ దిరముపడ నొనరించి రామపార్శ్వ మెనసి రహి వొసంగ
నిలిచె నసురపతి వినీతత్వమున కమ్మహాత్ముఁ డలరుచుండ నంతలోన. ౧౨౯
తే॥ వృత్రునంతటి శత్రునిఁ బీచ మడఁచి యాశతక్రతుఁ డట్లు కృతార్థుఁ డగుచు
లలి సుహృల్లాభమున సహలక్ష్మణుఁడు సరవిజుఁడు ససైన్యుఁడునునైన రాముఁ డొప్పె.
సీ॥ ఘోర మహా రావణుఁ గూల్చు తెఱంగున రాఘవేంద్రుస్ఫురత్పరాక్రమంబు
వాఁడిమగంటును ల్వాఱల రక్కసులపై వాలు వానరుల గర్వములకలిమి
సుగ్రీవుమంత్రంబు సూనృతోక్తులఁ గల మానితార్థవిశేషమంజిమంబు
వరసుమిత్రానందవర్ధను లక్ష్మణు వీర్యానురాగనిర్వేలమహిమ
మన్నిటికిని నెక్కుఁడైన హనూమంతు నన్నిరంకుశము సమర్థనమ్ము
నాటనమ్ము తీర్పనం గూర్పు శోభిల్ల నడిగికొనుచుఁ దెలియ నాడుకొనుచు.
ఆ॥ కనుల గట్టినట్లు గాన్పించు రావణు వధవిధాన మాజివర్తనంబు
చూచినట్లె వినుచుఁ జోద్య మియ్యది యంచు హర్షవార్ధి నోలలాడఁ గనుచు.
తే॥ దేవగంధర్వదానవు ల్దివ్యయానయానములు ప్రాప్తశుభశోభమానములుగ
రాము విజయ మాత్మీయమహా రాణ వెలయ స్వస్వధామమ్ము లెనసిరి స్కందజనని!
మ॥ జ్వలనజ్వాలవిలాసమండనకలాజాజ్వల్యమానం బనా
విల ముద్వేలసుఖావహంబు విజయావిర్భూతిహేతుప్రసా
దలసన్మూర్తి స్వభావభావుకము నిత్యశ్రీక మత్యుచ్ఛ్రితం
బలఘూల్లాసి సురేంద్రదత్తము రథం బాలో రసాలోలుఁడై. ౧౩౩
ఆ॥ పూజసేసె విభుఁడు పూజించె మాతలిఁ బూజ్యమాను సర్వపూజ్యుఁ డెలమి
మీఱ నభ్యనుజ్ఞ మెలకువమై నిచ్చె హెచ్చు మాలిమి న్మహేచ్ఛుఁ డతఁడు.
క॥ ఆమంత్రితుఁ జేసె రఘుస్వామీ! నేఁ బోయివత్తు సౌరపురికి న
న్నేమఱవి ప్రేమనెంతుకదే మహనీయాత్మ యనుచు నెల్లరుఁ బొగడన్. ౧౩౪
ఆ॥ అవల నింద్రసూతుఁ డారథం బెక్కి స్వర్గాధిరోహణము రయంబు మెఱయ
నెఱపె నాతఁ డట్లు నింగికై చనఁ బ్రహృష్టాత్ముఁ డగుచు దశరథాత్మజుండు.
చ॥ ఇనజునిఁ గౌఁగిలించుకొని యిచ్చమెయిన్ శుభభాషణంబులన్
దనరుచునుండ లక్ష్మణుఁడు తత్పరత న్వెలయింప నెల్ల రా
నన ఘనపేతహర్షకలనాంచితుఁడై శిబిరంబు సేరఁగా
జనె హరిముఖ్యులెల్లరుఁ బ్రసక్తసమర్హణ లర్థిఁ గూర్పఁగన్. ౧౩౫

శా॥ ఆవేళన్ స్తుతివేలహర్షలహరీవ్యాసంగవశ్యాత్ముఁడై
శ్రీవర్ధిష్ణుతను న్నమీపపరివర్తిన్ సత్యసంపన్ను స
ద్భావున్ సోదరు లక్ష్మణున్ ఘను సుమిత్రాగర్భరత్నాయితున్
వ్యావల్గత్కరుణావలోకనకలావ్యాసద్ధునిం జేయుచున్. ౧౩౮

తే॥ శ్రీనివాసుఁడు దాక్షిణ్యసీమ రామనామవిలసితుఁ డాగుణధాముఁ డిట్టు
లనియె నను నుడితో సుర ల్ననలజడియు సౌరదుందుభికలనయు సంతరింప.

తే॥ ఈవిభీషణు ఘను రావణావరజు స్వభక్తు ననురక్తు నుపకారపరు సుతేజు
సౌమ్యు సౌమ్యుండ! కొనిచని సరగ సకలరాక్షసాధీశ్వరుండయి రాణఁ బొసఁగ.

క॥ ప్రాకటలంకారాజ్యశ్రీకిం బట్టాభిషిక్తుఁ జేయుము సిద్ధ
శ్రీకామఫలుఁ గనుంగొని ప్రాకామ్యసమృద్ధి గాంచి పరఁగుదుఁ బ్రీతిన్. ౧౪౧

ఆ॥ ఒసఁగినాఁడ సీతఁ దొలసినయప్పుడే పరఁగు నెలమి కలిమిఁ బాడి నెఱయ
విషమకాలమున వివిగ్నుండ నైనాఁడ నిట్టిభాగ్య మొదవు టెట్లొ యనుచు. ౧౪౨

శా॥ నా పున్నెంబు ఫలించె నేఁడు విబుధానందైకసంధాత వీఁ
డీపట్టొంది సురేంద్రసఖ్యమున సంప్రాప్తాత్ముఁడై రాక్షస
శ్రీపాలుం డగుచుండుఁగాత మిది సంసిద్ధార్థ మెక్కాలమున్
స్వాపత్యాధిపతిత్వ మారసి పులస్త్యాదు ల్ప్రశంసింపఁగాన్. ౧౪౩

—• శ్రీవిభీషణ పట్టాభిషేకము •—

చ॥ అని కరుణాసముద్రుఁ డతఁ డానతిసేయఁ బ్రహర్షమూర్తి యై
తనరెను లక్ష్మణుండు సుకృతం బిది యం చని రెల్లవానరుల్
మనుకులదీపకుం బొగడి మాన్యుఁ డినాత్మజుఁ డానురేంద్రు న
క్కునఁ గదియించి కర్జమునకుం బురికొల్పె సుఖాయితాత్ముఁడై. ౧౪౪

సీ॥ అనఘుఁడు సౌమిత్రి యన్న కంజలిసేసి యాన యాదల స్రజమట్లు దనరఁ
దనపంపు బూని పాదపచరేంద్రులు చతుస్సాగరసలిలము ల్సరగ దేర
సౌవర్ణకలశసుసంభృతంబులు గాఁగ నొప్పారు నవ్వాని నోషధీర
సోపబృంహితముల నొనరించి పౌలస్త్యు నసురాధిరాజ్యసింహాసనమున
నునిచి రామానుశాసనం బొప్పఁ దెలిపి మంత్రదృష్టవిధానంబు మలయుచుండ
రాక్షసామాత్యపౌరసమక్షముననుఁ జేసె సిరిమీఱఁ బట్టాభిషేక మపుడు. ౧౪౫

ఉ॥ మంగళవాద్యము ల్సెలఁగె మానితలై తనరారు నట్టి పు
ణ్యాంగన లొప్ప సేసలిడి రాదృతులై కులవృద్ధు లార్యులుం
బొంగుచు మేలిదీవెనల పొల్పొనయించిరి వేల్పు లుల్లసం
గం గురియించి రోలిమిఁ గల్పతరుప్రసవప్రసూనముల్. ౧౪౬

తే॥ దిక్కులు ప్రసన్నభావాప్తిఁ దేజరిల్లెఁ గమ్మతెమ్మెర లొప్పారె నెమ్మిలోలయఁ
బౌరులెల్లరు సుఖసారభరితు లైరి పూజ్యుఁడు విభీషణుండు ప్రభుత్వ మెనయ.

ఉ॥ మాన్యుల సత్కరించె బహుమానము లొప్పఁ గ్రహించి మిత్రులన్
ధన్యులఁ జేసి యుత్తమపదంబుల నిల్పి సమంచదాత్మసౌ
జన్య మెసంగఁగాఁ బ్రకృతిసంఘము సాంత్వము సంతరించి వా
దాన్యకశీలు రామవిభుఁ దత్పదతత్పరతం గనుంగొనన్. ౧౪౮

తే॥ వచ్చునెడ రాజమార్గంబువరుసఁ బౌరులాయితము సేసి యిడినయుపాయనములు
దివ్యసుమములుమున్నుగాధృతిదలిర్పఁగొంచునరుదెంచెఁదగువారుగొలిచిరాఁగ.

ఉ॥ మంగళవస్తువర్గము సుమాళి మెసంగ నొసంగి కేలు మో
డ్చెం గులదీపకుం డసుర శ్రీపదపద్మములన్ భజింపుచున్
మంగళదేవతాంచితుఁడు మాన్యుఁ డతండుఁ బరిగ్రహించె స
త్సంగతిఁ దత్ప్రియార్థము ప్రచారము తోరము గాఁగ నత్తఱిన్. ౧౫౦

ఆ॥ మఱియు సత్కరించె మహితాత్ము సౌమిత్రి నట్లు గారవించె నర్కతనయు
ననిలజాంగదాదు లగు యూథపతుల బహూకరించె హర్షయుక్తి దనర. ౧౫౧

క॥ కృతకార్యు సమృద్ధార్థుం గృతకేతరమహితచరితుఁ గీర్తిప్రియు న
ప్రతిమగుణు నసురవిభు రఘుపతి మెచ్చెఁ దనర్చెఁ దనదు భావం బలరన్.

ఉ॥ ఆదట రాఘవుండు పవనాత్మజుఁ గన్గొని పల్కె సౌమ్య! నీ
వీదనుజేంద్రుసమ్మతిమెయిన్ బురిలోనికి నేగి జానకిన్
మోద మెసంగఁ గన్గొని విముక్తసుఖేతర గాఁగఁ దెల్పుమీ
నాదు జయమ్ము రావణు వినాశనము న్మనవారి సేమమున్. ౧౫౩

—♦ శ్రీరాముఁడు హనుమని సీతదరి కనుపుట ♦—

తే॥ శ్రీవిభీషణు పట్టాభిషేకవిభవ మట్టులె యుదాహరించి తదభిలషితము
తోడి సందేశముం గొని దొరయు మిచటు నీముఖమ్మున నదియును నెగడుగాంచు.

క॥ అని పతి యానతిసేసిన హనుమఁడు మతిమంతుఁ డనఘుఁ డటఁ జనె దనుజుల్
దనుఁ బూజించుచు వెంబడి వినమ్రభావంబుతోడి వెరవున మొనయన్. ౧౫౫

ఆ॥ మందిరమ్ముఁ బెరసి మానితాశోకవనమ్ము సొచ్చి కాంచె నమ్మహాత్ముఁ
డంతరమున శింశుపాగమాధస్థలంబునఁ జరిత్రపూత భూమిజాత. ౧౫౬

సీ॥ సంస్కారరహిత భాషయ పోలె మాలిన్యయుక్త యై యేర్పడకున్నయదియుఁ
గ్రూరగ్రహాక్రాంతిఁ గుంఠితద్యుతి యైన యారోహిణిదశాప్తి కందునదియు
వ్యాఘ్రములు పొదువన హరిణి నా రాక్షసీవ్యూహమ్ము నడిచిక్కి నొదిఁగినదియు
భానూదయార్థిని పద్మిని తెఱఁగున మొగిడిన మోమె మొత్త మొనయునదియు

నై నిరానంద యై కృశ యై వివిగ్న యై శుభాశంస లెన్ను భవ్యాత్మవృత్తి
రామనామపదావృత్తి రహిఁ దొలంకు వాణిఁ దులకించు సద్దేవి వలని కరిగి.

తే॥ నిభృతుఁ డై మాతృసన్నిధి నిధి యటంచు
గీర్తితుఁడు స్వీయనామసంకీర్తనంబు
మున్నుగాఁ బ్రహ్వుఁ డై చేరి ప్రమొక్కి నిలిచె
వినయనమితోత్తమాంగుఁ డై యనిలసుతుఁడు. ౧౫౯

క॥ వచ్చిన హనుమ మహాబలు నచ్చపలాలోక గాంచి యటులుండి స్మృతిం
దెచ్చుకొని ప్రముదితాత్మత నొచ్చెము లేకున్న తెలివి నొప్పెనయుటయుఁ.

క॥ పావని త్రిలోకపావని యావదనాంబుజవికాస మారసి రామ
శ్రీవిభువచనామృతఝరి దావల మై నెఱపఁ దొడరెఁ దరుణీమణికో! ౧౬౦

—♦ హనుమత్సీతాసంవాదము ♦—

సీ॥ కుశలి మైథిలి! రామకువలయాధీశుండు సహజార్కసుతవిభీషణసహాయుఁ
డాయరిందముఁ డిప్డు హతశత్రునివహుఁ డై సిద్ధార్థుఁ డై మేలి సిరి భజించె
వేల్చె రావణు నని విభుఁడు లక్ష్మణు నయం బసుర తోడ్పాటు దోయంబు దనర
నడిగె నీకుశలమ్ము నావీరుఁ డాదేవుఁ డారఘునందనుఁ డరుస మెసఁగ
నమ్మరో! మనోరథము సఫలమ్ముగాఁగ నెవ్విఁ బొనరారుచున్న చిత్తమ్ముతోడ
నెమ్మెలోలయంగఁ బలికి నీకెఱుకసేయు మనిన పలుకులు గల వవి యవధరింపు.

శా॥ దేవీ ! నీకుఁ బ్రియంబు దెల్పెదను విందే ? నీదు సంతుష్ట మా
భావం బొప్పెడు నట్లు ధర్మపథసంప్రజ్ఞానమూర్తీ ! తిరం
బై వర్ధిల్లఁగ నుంటి మంటి విడుమ ల్వ్యాపింప నిష్కంప వై
యీవేళ న్విజయోదయం బొదవె నీయిష్టంబు సేకూరఁగాఁ. ౧౬౧

తే॥ సఖి! గతవ్యథ వై యింక స్వస్థచిత్త వగుము శత్రుఁడు రావణుఁ డడఁగె లంక
వశములో నున్నయదియయ్యె వార కిపుడు నీదు నిర్మలభావంబు నిరతిఁ జేసి.

ఆ॥ ఏను నిన్నుఁ గూర్చి యేకాగ్రచిత్తుండ నగుచు నిదుర వీడి యర్ణవమున
సేతుబంధ మొప్పఁ జేసి తరించితి నట్లు ప్రతిన దీర్చి యలరఁగంటి. ౧౬౨

ఉ॥ రావణునింట నొంటి నితరప్రతిరుద్ధత నుంటి నంచు నీ
వేవిధ మైన సంభ్రమము నింకిట నెమ్మదిఁ గూర్పఁబోకు మో
భావిని ! ధర్మమూర్తి యన భాసిలువాని విభీషణాఖ్యు లం
కావిభుఁ జేసితిం బరుఁడు గాఁ డతఁ డస్మదుపాసనాప్తిచేఁ. ౧౬౩

తే॥ స్వగృహమునసుంటిన నెడు విశ్వాసమున నయూరడిలుము భవద్దర్శనోత్సుకుఁడయి
యరుగు దేరంగనున్న వాఁ డసురవిభుఁడు నిన్నుఁ బూజించి సంసిద్ధి నెఱయఁగోరి.

చ॥ అని యనునంతనే శశినిభానన దిగ్గన లేచి హర్షరో
ధనిభృతచిత్తవృత్తి యయి తత్పరతం బలు కెద్ది యేనియుఁ
గొనకొనకుంట నూరకయె గోలతనంబునఁ జూచుచుండె న
య్యను వనిలాత్మజాతుఁడు మహాప్రతిభుండు దలంచి యిట్లనుఁ. ౧౬౭

తే॥ అమ్మరో ! ప్రతిభాషణం బదనునందుఁ గూర్ప వేమొయి చింతలోఁ గూరనయ్యోఁ
బతి విజయలక్ష్మిఁగొనె నీదుబన్నముడిగె నింకఁ గృతిశేష మొకఁడున్న నేర్పుఱుపుము.

చ॥ అనవుడుఁ బ్రీతచిత్త యయి యాసుకృతాత్మిక హర్షగద్గదాం
చనసముపేతవాక్కులన సంభ్రమ మొప్పఁగ విభ్రమక్రమం
బనువుపడంగ భర్తృజయ మంతయు మంతనమందు యూపుగాం
చిన తెఱఁ గేర్పడంగ శ్రుతశీలుఁడు పావనితోడ నిట్లనుఁ. ౧౬౮

సీ॥ అన్న ! తటాలున మన్నాథు విజయంబు చెవిసోఁక నెట్టనఁ జిత్తసీమ
నరుసంబు తాన యై యాక్రమింపఁగఁ బారవశ్యంబు పేర్మి నిర్వాక్య నైతి
నొకక్షణం బిప్పు డత్యుల్లాసమునఁ బ్రియాఖ్యాత వై తనరు నీకనుగుణ మగు
నభినందనం బెది యగునొకో యని యిచ్చ నరయు నవ్వేడుక నందియున్న
దాన సౌమ్యుండ! యెందేనిఁ గానఁబడదు తలఁప నొక్కండ యేని నేతత్సదృక్ష
మైంద్రరాజ్యంబె పోల్ప నన ర్హ మనిన మణిసువర్ణాదులకు నింక మనికి గలదె.

ఆ॥ అనిన నెదిరి నిలిచి యంజలిబంధంబు నెఱయ సీతపలుకు నెఱికిఁ బొంగి
యిట్టు లనియె నాతఁ డింగితాభిజ్ఞుండు తనదు నొడువు తెఱఁగు తరము మీఱ.

ఆ॥ భర్త్రుప్రియహితంబె పాటించి మెలఁగెదు భర్తృవిజయకాంక్షఁ బరఁగె దెప్పు
డమ్మ ! భద్రశీల ! యా నీకె స్నేహసంభరిత మైన యిట్టి పలుకు పలుక.

క॥ ఈనీనుడియే చాలును వేనూర్లకు నైంద్రరాజ్యవిభవంబునకుఁ
దా నెక్కుడుగా స్నిగ్ధము మానితగుణసారమంజిమం బిది సౌమ్యా! ౧౭౩

తే॥ అర్థతఃప్రాప్తములు మున్నె యైనవి సురరాజ్యముఖ్యగుణంబు లోరామపత్ని !
విభుఁడు విశిఖాగ్ని విద్వేషి వేల్చి యాజి విజయి యై వీక్షణసుఖమ్ము వెలయఁజేయ.

క॥ అను నుడి తననుడికన్నను వినయమున వివేకమునను విశ్రుత మగుచుఁ
దనరారు టరసి మైథిలి జనకజ శుభతరకలన పొసఁగ నిట్లనియెఁ. ౧౭౫

క॥ అతిలక్షణసంపన్నం బతిమాధుర్యగుణభూషణాస్పద మష్టాం
గతతమతియుతము నగు భాషితము రచింపంగ నీక చెల్లు నభిజ్ఞా! ౧౭౬

సీ॥ పొడమితే? నాతండ్రి! పుట్టిన పుట్టిల్ల మాపాలిభాగ్య మై మలయుచుండఁ
దీర మెక్కించితి దివియు శోకాంబుధి దాఁటించి నీనెఱి తరముమీఱఁ
బూరుషాకృతి గొన్న పున్నెంబుసిరి వన్న నొదు గా కెట్టు లేతాదృశుఁడవు
శ్రుతసత్త్వములుబలశూరత్వములుపరాక్రమదాక్ష్యములుఁదేజుక్షమయుధృతియు

ధైర్యము వినీతతయు నింకఁ దక్కఁగలుగుబహుగుణములునీయందెశోభనము లై ప్ర
భాసమానము లగు రిత్త వలుకుదానఁ గాను సందియ మింతేమి గానఁబడదు.
తే॥ అనిలునకు శ్లాఘనీయుండ వాత్మజుఁడవు పరమధార్మికుఁడవు నాఁగఁ బరఁగినాఁడ
వంజనాదేవి నోముల యాఫలంబు జనకు మించిన కొడుకవు నీఁజాలి నెగడ.
క॥ ఆయుష్మంతుఁడ వగు మయ్యా యోగశ్రీసమృద్ధి నంది మహాశ్రే
యోయుక్తి గను మనుచు సీతాయోషామణి శుభోక్తి తగఁ బలుకుటయున్.
ఆ॥ దోసిలొగ్గి యెఱఁగి తొట్రుపా టింతయు లేని వినయమున సలీలరుద్రుఁ
డాతఁ డేతదీయ మగు సన్నిధి న్నిధిఁ బేదయట్టు లొలసి ప్రీతిఁ బలికె. ౧౮౦
సీ॥ అమ్మరో! వరమొకం డర్థింతు వాత్సల్యమున నిండుమది దాని మొనయఁజేయు
మీపాపరూపలౌ నింతులు పతిదేవతావతంసము నిన్నుఁ దద్ద పొదివి
క్రౌర్యం బెసంగ ఘోరతరోక్తులం బిట్టు తర్జించుచు న్వ్యథితం బొనర్చి
రిమ్మాయలాండ్రఁ గ్రూరేక్షాత్మవృత్తులఁ జెడిప రాకాసులఁ జెనకె యిపుడె
కాలఁజేత ముష్టిఘాతంబులఁ దలప్రహారముల వధింతు నడరు కినుకఁ
గర్ణనాశికాస్యకచకుచకంఠముల్ గోళ్ళఁ ద్రెంచి పండ్లఁ గొఱికి కొఱికి. ౧౮౧
క॥ ఇదియె మహానుగ్రహ మీమదాహతలఁ బుడమి వైచి మట్టెదఁ దార
య్యాదనున నీకప్రియ మగు సొద గూర్చిన యది దలంచి క్రుక్కుచు మిడుకన్.
తే॥ త ప్పొనర్చినవానికి దండనంబు విహితమే కద యని తన్ను వేఁడుటయును
దేవి వైదేహి సద్ధర్మభావకలన తనయశ స్వీతఁ బెనుపంగ ననియె నిట్లు. ౧౮౩
ఉ॥ ఎవ్వఁడు కోపగించును హరీశ్వర యేలెడువాని కెప్పుడున్
గొవ్వఱ మేను వెట్టి యనుకూలకృతు ల్పొనరించు దాస్యపుం
గవ్వలమీఁద వారలకుఁ గానిది యానది యంచు నుండునే
చివ్వన నట్టియాండ్రపయి జేయిడు టొప్పునె నిన్నుఁబోఁటికిన్. ౧౮౪
మ॥ ఘనసద్భాగ్యవిపర్యయంబునఁ బురాఘప్రాప్తియోగంబునన్
నను నాపన్నివహంబు చుట్టె నదియు న్న్యాయంబ యెవ్వారు చే
సిన పాపంబు ఫలంబు వారిదెస నక్షీణంబుగాఁ జెల్లుఁబా
టొనరింపంగ న దెట్లటంచు మదిలో నూహించి మర్షించితిన్. ౧౮౫
తే॥ నాదశాయోగమున నిన్నినాళ్ళు నిట్టివారిచే పడి చేడ్పడవలయు టెంచి
యనుభవించితి నదియెల్ల నట్టులౌట దఱుమఁ జేటులఁ బొదువ నిత్తఱిమహాత్మ.
ఆ॥ వానరోత్తమా! యవారితుం డగుచు నాదానవుండు కనలి యాన సేయ
నట్లు పఱచి రాతఁ డడఁగిన నాజోలి యేల వీరి కింత యెన్న రాదె. ౧౮౭
చ॥ వినుము ప్లవంగమేశ!భువి విశ్రుత మైనది ధర్మసంశ్రితం
బనఘము బుద్ధకీర్తితపదాక్షరగీతము ప్రాక్తనంబు దు

ర్మను శ్రితు వ్యాఘ్రభీతుఁ బరిరక్షితు వ్యాధుఁ గృతాపరాధు నె
క్కొనుకృప నమ్మెకంబు ధృతి గూర్చి రచించెను దీని నొక్కెడన్. ౧౮౮

ఆ॥ ప్రాజ్ఞుఁ డెపుడుఁ గొనఁడు పాపంబు బరుఁ డెట్లు పాపకర్మపరతఁ బరఁగెనేని
యును సురక్ష్య మరయ నుత్తమాచారంబె సచ్చరిత్రులైన జనుల కెందు. ౧౮౯

ఉ॥ కావునఁ బాపులేని శుభకారులయేని వధార్హులైనచో
నేపగనైనఁ గావఁ దమయిచ్చఁ దలంచెద రార్యు లిట్లనం
గా వధియింపనేల నెఱి గల్గినయయ్యెడ నస్వతంత్రులన్
రావడిదోఁప నెవ్వ రపరాధ మొనర్పనివార లియ్యెలన్. ౧౯౦

ఆ॥ కామరూపు లగుచుఁ గ్రాలుచు లోకహింసావిహారపరత సంభ్రమించు
నట్టి జాతి పాప మాచరించినయేనిఁ దగదు దానిఁ గూర్చి దండనంబు. ౧౯౧

క॥ ఎన్నఁగ నిసర్గజం బగు నన్నెఱి మాని పరకృతుల కగు సజ్జనమే
మన్నినికి దండ్యం బగుఁ బన్నుగ మది నెంచి చూడఁ బాపదురాపా. ౧౯౨

క॥ అని పలుకు సీత పలుకులు విని హనుమఁడు వాక్యసారవేత్త రఘువరే
ణ్యుని పత్ని యశస్వినిఁ గనుఁగొని మఱియిట్లనియె సకలకోవిదవంద్యా. ౧౯౩

ఆ॥ తల్లి! నీవు రామధరణీశునకుఁ దగు ధర్మపత్ని వసము దద్ద గాంచి
తేను గఱపనేర్తునే ప్రతివాచికం బిడుము విభునిపాలి కేగువాఁడ. ౧౯౪

క॥ అనవుఁడు విదేహనందిని జనకాత్మజ పలికె మేలిసంభ్రమ మొప్పన్
దనభర్తఁ గాంచు వేడుక దనరారుచునుంటి ననుచుఁ దత్పర యగుచున్.

క॥ ఆమాట వినినయంతనె యామారుతి హనుమఁ డిట్టు లనె హర్షితుఁడై
యామానవతి ప్రహర్షిత యై మానుగ వినఁగఁ దనమహోద్యుతి నెఱయన్.

సీ॥ అమ్మరో! పూర్ణచంద్రానను రాము నీక్షణమె వీక్షింతు వీక్షణము లలర
హతశత్రు స్థిరమిత్రు నధిలక్ష్మణాఢ్యు నీయధిపు నింద్రుని శచియ ట్లైనయుదు
చంద్రునితో రోహిణిచెలువునఁ జెలువుతోఁ బరఁగెదు మానేత్రపర్వముగను
సీతామహాలక్ష్మి శ్రీదేవి రాఘవుఁ జేరె నందురు చూచువార లెల్ల
జగతినోమిన నోములు చక్కఁగా ఫలించె నాథు గెలుపుపేరి లిబ్బిపడఁతి
కోరి వరియించె వేల్పులకోర్కి దీఱ గోఱఁత లున్నవియే యింకఁ గువలయాక్షి.

క॥ అనునెడ సాక్షాల్లక్ష్మియ యన నాయమ తనరి యలర హనుమ వినతి గూ
ర్చిన నానసేసె నాసతి చని యాతఁడుఁ జెరసె రాము సాన్నిధ్యంబున్. ౧౯౮

ఉ॥ ప్రాజ్ఞవరేణ్యు రామనరపాలు ధనుఃకలనాగ్రగణ్యు న
రజ్ఞుఁడు వాయునందనుఁడు తత్పరతం గనఁగాంచి మ్రొక్కి సం
విజ్ఞత మీఱ సంతతవివేకవిశేషవిభాసురాస్యుఁడై
యాజ్ఞఁ బొసంగఁ జేర్చితి మహాత్మ! యటంచు వచించు నెంతయున్. ౧౯౯

—♦ హనుమంతుఁడు శ్రీరామునితో సీతవృత్తాంతము చెప్పుట. ♦—

సీ॥ యన్నిమిత్తం బయ్యె నట్టియారంభంబు కర్మఫలోదయగతియుఁ గడఁగి
యద్దేవి మైథిలి నభిశోకసంతప్త నాలయుక్తమైఁ గాంచు కొప్పు నీకుఁ
బెద్దకాలముఁ దన పెనుపఱఁ బాష్పపర్యాకులేక్షణ యయి యడలుచుండి
నేఁడు త్వద్విజయమ్ము నెఱి విని హర్షాశ్రుకలనస్థఁ దొంటి గా కందఁజూసెఁ
బూర్వపుం బ్రత్యయమ్మునఁ బుణ్యమూర్తి పలికెఁ బతిదర్శనోత్కతఁ బరఁగుచుంటి
నన్న సహలక్ష్మణుఁ గృతార్థ నధిపు నాదుకనుల పండువుగాఁ గూర్పఁగదె యటంచు.
క॥ దేవర యానతికై యద్దేవి నిరీక్షించి యున్నదియ దయుం జెదియుం
గావలెనె సతికిఁ బతిపదసేవాతత్పరత నిచ్చ చెలఁగుట దక్కన్. ౨౦౧
తే॥ అనుచు హనుమఁడు విన్నవించిన మహాత్ముఁడజముఖానురసన్నుతుండవనిఁ గనుచు
నించుకంతలు గనుల నీ రేర్పడంగ ధర్మనిష్ఠుఁడు ధ్యానతత్పరతనుండె. ౨౦౨

—♦ రామునానతితో విభీషణుఁడు సీత నలంకృతఁ జేయించి తెచ్చుట ♦—

ఉ॥ వేడబ మింతయుఁ సకలవేత్త యెఱుంగదె నాఁడు దేవి నా
జాడ నిజస్వరూపమును జాటొనరింపఁగఁబంచె వహ్నిలో
గూడఁగ నా పరామరిక గూరిన నేఁడు యథార్థఁ గొంటకై
పాడిమెయిం బ్రవర్తిలెడు పద్ధతి కన్నఱి ధ్యాన మొప్పెడిన్. ౨౦3
తే॥ నిట్టనూర్చుచుఁ గొండొక్కదిట్టతనము నెఱయ సముపస్థితుఁ బయోదనిభు విభీష
ణుం గనుంగొని యొండు తెఱంగు దోఁప నోడయఁడు గభీరభాషితం బొప్పఁ బలికె.
తే॥ సీత సుస్నాతఁ గావించి శ్రీసమేత పూత దివ్యాంగరాగవిభూతిమహిత
దివ్యభూషణభూషితస్థితి దలిర్పఁ దెమ్ము చిరకాలమున నీ యుద్దేశమునకు. ౨౦౪
క॥ అని రాముఁ డానవెట్టిన విని ఘనుఁడు విభీషణుండు వే నగరునకుం
జని తనగరితలచే న య్యనఘాత్మిక కెఱుకపఱిచె నవ్విధ మెల్లన్. ౨౦౬
ఆ॥ దేవి!జనకపుత్రి!దివ్యాంగరాగసువసనభూషణప్రభాసమాన
వగుచు విభునియాన యాన మారోహింపు మమ్మ!భద్ర మొదవు నరయవలదు.
క॥ నినుఁ గాంచు వేడ్క నీపతి గొనిరమ్మనెననుచుఁ దదనుకూలమ్ముగ న
వ్వనితలతలవాకిట నట్లనెడు విభీషణుఁడు వినఁగ ననె నాసతియున్. ౨౦౮
ఆ॥ అన్న!రాక్షసేంద్ర!యున్నట్లె యస్నాత నగుచు భర్తఁ గాన నరుగు టుచిత
మని తలంచుదాన నది యెట్లొకో?యను ననుపమానచరిత యను నెఱింగి.
క॥ తా ననె విభీషణుం డమ్మానినికి న్మ్రొక్కి యంబ!మహిజాత!విభుం
డేనెఱి నానతిసేసెనో యానలువున మెలఁగు టొప్పు నన్య మిఁ కేలా. ౨౧౦

ఆ॥ అనుచు నతఁడు దెలుప వినినంత భర్తృదేవత దృఢవ్రతాఢ్య పరమసాధ్వి
యట్లుగానిఁగాక యని పతిశాసనపరత నెగడు పలుకుఁ బలుకుటయును. ౨౧౧
క॥ అతఁ డానసేయ రామునిసతి యువతిజనమ్ము పొదివి సంభ్రమ మొప్పన్
గుతుకమున నలంకారప్రతిభాసితఁ జేసి రుచితభాషాంచిత లై. ౨౧౨
సీ॥ జలకమార్చిరి వింతజలజవాసినిఁ గరిగమనలు కరరత్నఘటజలములఁ
దడియార్చి రట్లు పుత్తడిబొమ్మ కురుల కగురుధూపయుక్తి గగ్గురు వొడమఁగ
వరమహార్హాంబరం బిరవొప్ప నిడిరి ప్రాగంబరచారిణు లమ్మహాంబ
కాజగద్భరణాఢ్య కంచితమణికాంచనాభరణంబులు ననువుపరిచి
రంతిపురిచాన లంగరాగాతిశయిత మృగమదవిశేషతిలకిత యగుచు వెలయఁ
జేసి రాసిరి దొల్లింటిసిరిఁ దలిర్చెనానె యను మేలిపలుకు లందంద నెగడ. ౨౧౩
క॥ వితతపరార్థ్యాంబరసంవృత దీప్త సుగుప్తయుగ శిబిక గూర్చిన నా
క్షితిసుత యారోహింప మహితుఁ డాసురవిభుఁడు వేడ్క యెలరారంగన్. ౨౧౪
క॥ పరిజనము దేవితోఁ దగువరివస్యలు వేచి కొలిచి వచ్చునెడకి న
ప్పరతత్త్వజ్ఞుఁడు గూర్చుచు వరయోగం బిరవుపఱుచు వల నొప్పారన్. ౨౧౫
ఆ॥ అమ్మహాత్ము రాము ననవద్య ధ్యాననిధ్యానకలితుఁ జేర నరిగి యెఱఁగి
త్రోవగనియు దేవి దోఁతెంచె నిదె దేవ!యని సహర్షుఁ డగుచు నాడుటయును.
శా॥ రక్షోగేహమునం జిరోషితయ కా రారాపు భావించి యు
ద్వీక్షం బెంచు తలంపున న్నెనఁగు నవ్వేళం దదీయాగ మ
ప్రేక్షావచ్ఛ్రవణంబు రామునకుఁ గూర్చెం దోన హర్షంబు దై
న్యక్షుబ్ధత్వము రోషముం దదుపపాద్యం బెట్టిదో? భావినీ! ౨౧౭
క॥ సవిమర్శవిచారణమున నవిమృశ్యమనోగతుఁడుగ నై దనుజేంద్రున్
బ్రకృతులుఁ బార్శ్వగుఁ గని రాఘవదేవుఁ డహృష్ట మగు రకంబునఁ బలికెన్.
ఆ॥ అసురాధిపతి! మహాసౌమ్య! మద్విజయైకనిరత! సందియం బిఁ కేల
నాదు సవిధమునకు వైదేహి వైళంబ యేగుదెంచుఁగాత మెరవుపడక. ౨౧౯
చ॥ అను పలు కాలకించుచు నె యాసురభర్త విభీషణుండు చ
య్యనఁ బలుసందడిం జడియ నా జతనం బురికొల్పఁ గంచుకుల్
ఘనతరవేత్రపాణు లయి కార్కొని పాయఁగఁ జేయఁ జొచ్చి ర
ప్డనఘుల ఋక్షవానరుల నమ్మెయి రాక్షసులం దలోదరీ! ౨౨౦
క॥ తెరలించు పురుషు లన్నెడఁ బరిక్రమింపంగ నిలువఁ బట్టనరా క
య్యురుసత్త్వ లొదుఁగఁ జొచ్చిరి భర మగు రాజాజ్ఞ కెదురుపా టొప్పమిచేన్.
ఆ॥ ఓజమెడల నట్లు లుత్సార్యమాణంబు లైన బృందశతములందుఁ బొడమి
యొక్క యులివు మారుతోద్వర్తమానాబ్ధులందుఁ దోఁచు తెఱఁగు నధిగమించె.

క॥ చిరసంప్రార్థిత మఁట యాసిరిదేవిం గాంచి కొలిచి సిద్ధార్థతనుం
బరఁగుదు మనువారల కావెరవున వినివారణంబు విషమం బయ్యెన్. ౨౨౩

క॥ సమ్మర్దము దలఁగింపఁగ సమ్మతిసెడఁ దోల జాతసంభ్రమ మగు స్వీ
యమ్ము జనముదెస వాత్సల్య మ్మొగువ నమర్షితాత్ముఁడై రాముఁ డటన్.

క॥ వారణసంరబ్ధుఁ డగుట వారనికినుకన్ దహించు వల నొప్ప మహా
ధీరు విభీషణుఁ గని సస్మేరోపాలంభ మైన స్థితి ని ట్లనియెన్. ౨౨౪

సీ॥ దర మెన్న కి ట్లనాదరవృత్తి నే మని మెలఁగఁజొచ్చితి వీవు మేల్మి సెడఁగ
స్వాత్మీయ మా జన మలఁతపా ల్గా నివారింపఁబూనితి విది రీతి యగునె
చాలింపు మొప్పని సంరంభ మియ్యది యిందఱు నావార లెంచిచూడ
సాధ్వి కావరణంబు సద్వృత్త మని కాక తెఱ లిండ్లు వసనము ల్ప్రస్తసాల
ములును రాజసత్కృతులును యోగ్యత గూర్పఁజాలునొటు పెడవిచార మేల
పోడమె నీకు నాదుబుద్ధిమై వర్తింపు మనువుగాని చోట నడుగు లిడక. ౨౨౬

మ॥ వ్యసనంబు ల్బలుకృచ్ఛ్రము ల్సమరము ల్యజ్ఞస్వయంగ్రాహయో
గసముత్సాహవివాహము ల్వెలయుచోఁ గాన్పింపు స్త్రీజాతికిం
బొసఁగుం దోసముఁ గూర్పఁబోవ దన నీపూఁబోఁడి బిట్టార్తికె
వసమై చేరఁగనయ్యె నాజికలనావ్యాసద్ధ యా పద్ధతిన్. ౨౨౮

ఆ॥ మఱియు మత్సమీపమహిత మై యున్నెడ నొడ్లు దన్నుఁ గన్న నోటు గలదె
బెఱుకు లేక గాంచుఁ బ్రియసుహృద్వృతు నన్నుఁ జెలువ నిట కుఁ దెమ్ము శీఘ్రముగను

తే॥ ఓవిభీషణ యన నతం డూర్జితుండు మహితుఁ డగు రాము పలుకు విమర్శనంబు
సేసి తత్సన్నికర్షంబు సేర్చె సీత నవనిజాత వినీతత్వ మలరుచుండ. ౨౨౯

ఉ॥ అంతట లక్ష్మణుండు తపనాత్మభవుం డనిలాత్మజుండు లోఁ
జింతిలఁజొచ్చి రియ్యధిపు చింతిత మెందుగఁ దోఁచె నింతిపై
మంతన మొప్పకున్నయది మాటలతీ రటు చేష్ట లింగితం
బింత యెఱుంగఁజేసెడు విధీప్సిత మెట్టిదొ యంచు నెంచుచున్. ౨౩౦

ఆ॥ వరుఁడు దఱిఁ గళత్రనిరపేక్షుఁ డైనాఁడు చెల్ల రే యటంచు సిగ్గుపడుచు
వార లట్లు తర్కవార్ధి మునుంగుచు నుండి రనుశయమున నుడుకు నెదల. ౨౩౧

సీ॥ అవయవమ్ములలోనె నడఁగెడునోయన హ్రీయంత్రణాలక్ష్య మెనయఁగాంచి
యావిభీషణుఁడు తోడై తోడితేరంగఁ బ్రియు నెదుర్కొను సిరిఁ బ్రేముడించి
చక్కనివదనంబు జనసమక్షం బంచు నవకుంఠనపటంబునందు డాచి
కోర్కెపెల్లున నెట్లొ గొనకొను నెలుఁగున నార్యపుత్రాయని యధిపుఁ బిలిచి
స్నేహవిస్మయహర్షము ల్చిగురులిడఁ బతివ్రతామణి పతిమోముఁ దేఱిపాఱఁ
జూచె నుదితేందుమండలశోభమాన మమలహారిణాంకముఖ లోని యలఁత వాయ.

క॥ చిరకాలదృష్ట మన్నెటి సిరి నెల వగు మగని మొగము సిరి గాంచి వియో
గరచిత వ్యథఁ దొఱఁగి విభాసురసుఖవార్ధిఁ జొరఁబాఱి చొక్కుచు నుండెన్.

—♦ శ్రీరాముఁడు సీత నెగ్గులాడుట. ♦—

క॥ ప్రాంతస్థిత నమ్రానన సంతుష్టస్వాంత విగతసంతాప రసా
భ్యంతర నిజసేవాగత సంతతశుభశీల సీత జనవిభుఁ డరసెన్.

సీ॥ ఆశ్రయించినవారి కఖిలార్థములు గూర్చి చన వొసంగు నటంచు సంశయింపఁ
డఖిలాండకోటుల ననిశంబును సృజించు నార్భాట మెంచి నెయ్యంబు మానఁ
డేరూపు గాని రచ్చకెక్కిన నచ్చోటఁ గూడి తన్నెలయింపఁ గోపగింపఁ
డెల్లవాడల నీపె యిచ్చకంబులతోడి యాడిపోత లటంచు నవమతింపఁ
డెడయకే ప్రొద్దు గనయు నం చీసడింపఁ డట్టిదేవుఁ డద్దేవిపై నలుకఁ బూని
యెన్నఁడును లేని నేరమ్ము లెన్ని యెత్తిపొడుపు లాడంగఁ దొడరెఁ బూబోఁడివింటె.

క॥ ఇదె ని న్నవమానించిన మదవద్రిపు నాజిఁ గూల్చి మలయించితి స
మ్మద మోభద్రముఖీ యే నదనునఁ బౌరుషము ధన్య మై తనరారన్.

ఆ॥ అలుక కొదవగంటి నంతంబు ఫలము ధర్షణ ప్రమార్జితత్వసరణిఁ బట్టె
శత్రుపరిభవములు సమసమయోద్ధృతంబులుగఁ గెలుపు గాంచి పొలుపు గనుట.

చ॥ మగఁటిమి నేఁడు స్పష్ట మయి మన్నన కెక్కె శ్రమంబు సత్ఫలం
బుగ నెగడొందె నావ్రతిన పూర్ణ యుదీర్ణయుఁ గాఁగ లోకమం
దగపడినాఁడ నిప్పటికి నంద ఱితండు స్వతంత్రుఁ డంచు నె
న్నఁగ నగచాట్లు వాయఁగ సనాతనధర్మపథాశ్రయంబునన్. ౨౩౮

మ॥ చలచిత్తుం డగు రక్కసుండు నిను నిచ్చ న్మెచ్చి తోడ్తెచ్చుటే
యలఘూపద్రవకారి దోష మది దైవాయత్త మై చెల్లె మ
ద్విలసత్సన్నిధిఁ బాసి తెట్లొ పడి తే విక్రాంతిమై దాని ని
ష్కలనం దీర్చి జయంబుఁ గొంటిఁ బృథుదక్షత్వంబు పెంపారఁగన్. ౨౩౯

తే॥ ప్రాప్తమవమాన మెవ్వాఁడు ప్రాభవమ్ముఁగని ప్రమార్జన మొనరింపఁగాఁదలంపఁ
డల్పతేజుఁ డప్పూరుషుఁ డందఁగాంచు నట్టి పురుషార్థ మనఁగ నొం డవనిఁ గలదె.

క॥ మున్నీరు దాఁటుటయు లంక న్నిప్పేషించుటయు మొగంబుగ నెది సం
పన్నుఁ డొనరించెఁ గర్జము పన్నుగ హనుమండు దాని ఫల మొప్పారెన్.

ఆ॥ ఆజి విక్రమించు టరుల మర్దించుట మదితంబుపొంటె మలయుచుంట
యింతవట్టు సబలుఁ డినజు పరిశ్రమం బెల్ల సఫల మంచు నెన్నఁబడియె. ౨౪౨

క॥ తను దాన భ్రాత నిర్గుణుఁ డని విడనాడి ననుఁ జేరి యనువగు భక్తిం
దనరె నెవఁ డవ్విభీషణుఁ ననుపమయోగము కృతార్థ మై నెగడొందెన్. ౨౪౩

మ॥ అని నైరాశ్యము దోఁప రాముఁ డిడు నయ్యర్థంబునం గల్పనం
బనవద్యాంగి గ్రహించి కన్నుఁగవ బాష్పాపూర మొప్పారఁ గ
న్గొనె నుత్ఫుల్లవిలోచనాప్తి భయసంక్షుబ్ధ స్మృగిం బోల నై
తనపై దక్షిణభావముం దొఱఁగి క్రోధంబూనె సంచార్ద్ర యై.
ఆ॥ అట్టు లున్న దేవి నటుగాంచి నంతనె మఱియు రుష ప్రవర్ధమాన యయ్యెఁ
బ్రాజ్య మాజ్య మిడిన పట్టున జ్వలనునిజ్వాలఁ బోల నగుచు జనవిభునకు.
మ॥ భ్రుకుటీబంధము మోమునం దమరె నాప్రౌ ద్ధాకసంబందు భా
రకి గన్పట్టిన కేతువట్టిఁ డనఁ దిర్యక్ప్రేక్షితాక్షిక్రమం
బు కరాలం బయి కానిపించె క్షుభితాంభోరాశి యై రాముఁ డో
డక కీడెంచి సతీమణిం బరుసు లాడంబోవునప్పట్టునన్. ౨౮౭
ఆ॥ జనసమక్షమునను జనవల్లభుఁడు చన దనక పలికె వింటె జనకతనయ!
యేమిసేయుఁ బురుషుఁ డెవిరి ధర్షణ మూఁగ నది కృతము సమస్తమయ్యె నిపుడు.
ఆ॥ అరికరమున నుంటె వని యమర్షణమునఁ దలఁగఁ జేసినాఁడ ధర్మ వెంచి
కుంభభవుఁడు దనుజుఁ గూల్చి దక్షిణదిశ భావితాత్ముఁ జేరువఱచినట్లు. ౨౮౮
సీ॥ విదిత మాఁగావుత మది త్వదర్థము గామి మత్కృతాజిపరిశ్రమస్ఫురణము
బిరుదు లౌ సుహృదుల బీరమ్ము తోరమ్ముగా సాయ మొనరింప గణన కెక్క
స్వాత్మవంశంబు ప్రఖ్యాతంబుఁ బోషించుకొన నపవాదంబు గోలుపఱుపఁ
బడితి నింతలు నీవు ప్రాప్తచారిత్రసందేహవు ప్రతిముఖస్థితవు గాఁగ
నక్షిరోగి కెట్టు లాప్రదీపిక ప్రతికూల యగునో యట్టి మేల మయ్యె
ధ్రువము జనుము మదికిఁ దోఁచినదెస కనుజ్ఞాత వైతి జనకజాత! వినుము. ౨౮౯
క॥ లే దిఁకఁ గర్జము నీతో నీదశదిశలందు నెడఁద కిష్టం బెచటో
యా దేశమునఁ జరింపుము వాదున కిట్లనుట గాదు వనజాతాక్షీ. ౨౯౦
తే॥ పరగృహోషిత నెవ్వఁడో పందదక్క బురుషుఁ డై సత్కులంబునఁ బుట్టినట్టి
వాఁడు తేజస్వి మరల నేవగ గ్రహించుఁ జిత్తముబలాటపుంజాడఁ జిందులాడ.
తే॥ రావణాంకపరిభ్రష్ట వీవు దుష్టవైతి తద్దుష్టదృష్టిదృష్టాత్మ వగుచు
నిట్టి నిన్నెట్లు గైకొందు నెఱిఁగి తిరిగి యాభిజాత్యంబు వ్యపదేశ మాడుకొనుచు.
తే॥ ఏతదర్థంబె నిర్జిత వైతి కాని లేదు నీదెస ననురాగలేశ మేని
నసము ప్రత్యాహృతం బయ్యె నదియ చాలు నింక నీయిచ్ఛవచ్చిన ట్లెయుఁబోలు
ఉ॥ ఏఁ గృతబుద్ధి నౌచు వచియించెద నెంచెద వేని నిమ్మహా
భాగుని లక్ష్మణున్ భరతు భద్రయశున్ రవిజున్ విభీషణున్
బాగుగ బుద్ధిఁజేర్చి తనుఁ బాలనసేయఁగ నేర్చికొమ్మతం
డాగరిమంబున న్మనుపనయ్యెడు నైన్వరిత పోలదేనియున్. ౨౯౧

క॥ ఎటులైన నిచ్చమెయి నోకుటిలాలక! మెలఁగు టురువ కూడదు స్త్రీలం
పటు నింటం జిరకాలము దటమటపడినట్టి యువతిఁ దద్దయుఁ గొనఁగన్. ౨౫౭
తే॥ దివ్యరూప మనోరమఁ దేజరిల్లుదాని నిను యౌవనాఢ్యఁ జెంతం గనికని
యెట్టులు సహించు రావణుం డేల విడుచు వంటయి ల్సొచ్చిన శశమ్ము వరుస గలుగ
చ॥ అని తెగనాడు నాప్రియుని యప్రియభాషణ మాప్రియార్హ తా
విని వినిపాతభీతి భృశవేపిత యై జనకాత్మజాత నె
ట్టన మదహస్తిహస్తహతి డస్సిన సల్లకి క్షీరమ్ముం బలెం
దొనదొన రాల్చెఁ గన్నుఁగవఁ దోయము దోయము పిచ్చలింపఁగన్. ౨౫౮
తే॥ ప్రవ్యథిత యయ్యె సతి నిజభర్త యట్లు పరుషముగ రోమహర్షణాస్పదము గాఁగ
రోషరూక్షేక్షణుం డగు రూఢి నెఱయఁ బలుకుపలుకున డెందమ్ము పగులువాఱ.
ఉ॥ అశ్రుతపూర్వ మా నుడి మభాజనమెల్ల వినన్ జగత్త్రియీ
విశ్రుతుఁ డౌ విభుండుఁ దను వెంగలిఁజేయుచు నాడఁ దత్పదై
కాశ్రయ లజ్జ రెమ్మకొన నంగములం దడఁగంగ నొచుఁ బె
ల్లశ్రులదండడి న్నెఱపె నొదల వంచి విరించి నెంచుచున్. ౨౫౯

—♦ సీత శ్రీరామునితో నుచితములు పలుకుట ♦—

తే॥ అబల వాక్ఛల్యముల సశల్య యన బాష్పదూషితం బాస్యబింబంబు దుడుచు
గద్గదిక గూర నల్లనఁ గాంతుతోడ నిట్టు లని పల్కఁదొడరె రాకేందువదన.[కొనుచు.
సీ॥ ఇది యేమి యసదృశం బీదృశం బగు నుడి నాడివితి శ్రోత్రంబు లుడికి నొగుల
వీరుఁడ రూక్ష మా విధమున వినిపింతె ప్రాకృతం బ్రాకృతభవుఁడ పోలె
నీ కనగత మైన నెఱి దాన నేఁ గాను నమ్ము మి ట్లని శపథ మ్మొనర్తు
సుభుజుండ చారిత్రసూనృతం బరసిన నావల నె ట్లన్న నగునకాదె
దుష్టవర్తన లగువారి తోడను జేర్చి జాతిసామాన్యమున కెల్ల సంక్రమింపఁ
జేయు టొప్పునె ననుఁ బరీక్షింపు మెడఁదఁ బుట్టినది యైన యాశంక పొడవడంగ.
మ॥ వివశాత్మ న్ననుఁ దెచ్చునాఁ డసుర యావేశంబున న్మేనిసో
కవు నన్నన్ విధి చెట్ట గాక యది స్వీయం బైన దోసంబు గా
దవలోకంబెద వాక్కు సత్త్వమును నీయం దేకరూఢంబు లై
స్తవనీయత్వముఁ గాంచియున్నయవి సత్యం బింత భావింపుమీ. ౨౬౦
ఆ॥ ఏమి సేయుదాన ని ట్లనీశ్వర నయి యొకని నెలవు సేరి యొదిఁగియుండ
వ్రాసె నొసట బ్రహ్మ వారింప నెట్లగు నదియు నీయెఱుంగనిదె నరేంద్ర.
తే॥ సహజసంవృద్ధ భావప్రసాదముననుఁ గృతసుసంసర్గముననను నాకీడు మంచి
నీక విజ్ఞాతముల యైన నెఱియుఁగలదె శాశ్వతంబుగ హాత నైతి జనవరేణ్య!

సీ॥ న న్నవలోకింప ననుచు ద్రేముడిఁ బంపితివి వీర! హనుమనిఁ దేజు నెఱయ
లంకాస్థ నైన నాలా గెల్లఁ బరికించె బహుపరిశ్రమ మోర్చి పరిశ్ఘవిల్లి
నీసేమ మెఱిఁగించు నెఱిన నాసందేశముం గొనియు న్నిన్ను మొనయఁగాంచెఁ
గాని నీతలఁపునఁ గలకర్జ మి ట్లంచు నించుక దెలుపంగ నెంచఁడయ్యె
నప్పుడే విడనాడితి వన్నమాట విన్నఁ బ్రత్యక్ష మసులులు విడచి యెల్ల
కష్టములుఁ బాసి యుత్తమగతికిఁ గూర్చుదాన దానవు నింట నింతకుఁ బడుదునె.
ఉ॥ జీవిత మింతమాత్ర కరచేత నిడంగని యీవృథాశ్రమం
బేవల నెంచి కాంచితి వహీనసుహృజ్జనసంగతుండ వై
భావ మొకింత యేర్పడఁగఁ బాటిలఁ జేసిన నే నిరాశ నై
నీవలఁ గీర్తి నిల్పి సుఖనిష్ఠిత నై చనుదారిఁ జూడనే. ౨౬౬
ఆ॥ నిష్ఫలంబులయ్యె నీవు నీపక్షంబువారుఁ బడిన కష్టవాటు లెల్ల
స్త్రీత్వమే పురస్కరించితి రుమఁ గొని లఘుజనంబువలె నలఘుఁడ వయ్యు.
శా॥ భూగర్భంబునఁ దోఁచితిన్ జనకు సత్పుణ్యంబు మూలంబుగా
నాగక్ష్మేశ్వరి నాఁ దనర్చితి శ్రుతవ్యాపారపారీణతా
శ్రీగణ్యత్వము వృత్తము న్మనిజనాశీస్స్వము మా భావముల్
నీగుణ్యత్వచణమ్ము చిత్త మెఱుఁగు న్నేఁ జేల యి ట్లం టెనో. ౨౬౭
తే॥ బాలుఁడనవై యబాల్యంబు పరఁగఁ బాణిఁ బాణిఁ గొన్నట్టి తెఱఁగు ప్రమాణితమ్ము
గాదొ మద్భక్తిశీలము గ్గాంచలేదొ యంతయునుఁ బృష్ఠతఃకృతమయ్యె నిపుడు.
మ॥ అనుచుం బల్కుచు బాష్పగద్గదిక చెన్నారంగ నుష్ణాంబువుల్
గనులం దొట్రిలఁగా విలాపపర యై కల్యాణి నాథుండు త
న్ననుమానించిన తీరు సన్మనము నొయ్య న్నిరుగాఁ జేయ దీ
నుని ధ్యానైకపరాత్మ లక్ష్మణునిఁ గన్నుందోయి లక్షించుచున్. ౨౭౦

—♦ సీతాగ్నిప్రవేశఘట్టము ♦—

సీ॥ ఓసుమిత్రకుమార! యురుతరవ్యసనంబునకు భేషజం బిదె నాకుఁ జూడ
మదిఁ దోఁచినది గాన మానక చితఁ గూర్పు మొల్ల మిథ్యాపవాదోపనిహత
గాఁగ జీవించుట కథలు గొనంబులు నట్లుండ నప్రీత నైతి భర్త
కిట్టి యాస్థానిఁ దా నిటులాడ నింకిట నే మని యేఁ దలయెత్తుదాన
ననఘ యగ్నాయనఁగ నా గతి యియ్యది హవ్యవాహునందు నాన మొదలఁ
దనువు వేల్చి రామతత్పరతం గాంతుఁ బరమపద మటంచుఁ బలుకుటయును.
క॥ అనుపద మరివీరఘ్నుఁడు జనవంద్యుం డతఁ డమర్షసంగత వృత్తిం
గనె రాము మోము నెట్టన ఘనతాపం బెద నగల్పఁగా విహ్వలుఁ డై.

ఆ॥ అట్లు చూచి విభుని యాకారసూచితం బేమి గనెనొ యెల్ల యెఱిఁగి సరిగి
కొండఁబోల దిండు గూర్చిఁ గట్టియలఁ జేచేతఁ జితఁ గడంగి చేర్చె ననలు.
తే॥మతియుతుండట్లు రాముని మతము నెఱయ నాయితము సేయునంత గట్టాయితముగఁ
బతి నధోముఖుఁ జుట్టి వినతిఁ బొనర్చి దీప్యమాను హుతాశు వైదేహి దఱిసె.
ఆ॥ చుట్టు దిరిగి మ్రొక్కి శుద్ధాత్మ దేవభూదేవవర్గములకుఁ దెలివి మీఱ
వందనము లొనర్చి వఱలి బద్ధాంజలి యగుచు నిట్టు లనియె నగ్గిదరిని. ౨౭౫
సీ॥ తలఁగదు నామది ధర్మాత్ము రాఘవు వలనుండి యేనాఁడు వాంఛ మెఱయఁ
ద్రికరణంబులుఁ దాని దేవదేవుం డని యనువృత్తి నుండ నెట్లతిచరింతు
నను శుద్ధచారిత్ర నాథుండు దుష్టఁగా నెంచె నిక్కాల మిల్లెడరు దొడర
సత్యంబె పాలింపు సకలలోకములకు సాక్షివి శుచివృత్తి సంశ్రయుఁడవు
వఱలు దీవు హవ్యవాహుండు నా దేవముఖత మైఁ దదేకముఖ్యకలనఁ
గాన నాదు కర్మగతి విమర్శింపుము పాడి నెగడు మెల్లప్రజలు పొగడ. ౨౭౬
క॥ భగవంతుం డాదిత్యుం డగణితగుణుఁ డైన వాయు వాశలు శశియున్
బగలును రేయును సంజలు జగతియు నితోడి సర్వసాక్షులు గారే. ౨౭౭
క॥ నను జారిత్రసుసంయుత ననిశం బరసి కనువార లందఱు నొక్కఁడై
మునుకొని నీ మొగమున సత్యనిరతి నెల్లం బొనర్ప నాదురు కరుణన్. ౨౭౮
తే॥ అనుచు నిస్సంగ మగు నంతరంగమున మహాహుతాశనుఁ జుట్టి యయ్యన్నుమిన్న
జనకసుత సొచ్చె నందుఁ దజ్జ్వాల లెగయ భువనభోంతర మంతయు భోరుకొనఁగ.
ఆ॥ చిచ్చులోన నుఱుకు చెలువఁ గన్గొనెఁ ద్రస్త మగుచు నచటి యమ్మహాజనమ్ము
బాలవృద్ధయుతము బాష్పపూరమ్ములు గ్రమ్మ నెమ్మనమ్ము లుమ్మలింప. ౨౮౦
ఆ॥ మేలిపసిఁడిబొమ్మ మెఱుఁగారు బంగారు తీరు వగల నగలఁ దేజరిలుచు
జాతవేదునందు జనకజ సొరఁబాఱె సర్వలోక మరసి జలదరింప. ౨౮౧
తే॥ ఆమహాభాగ సీత హుతాశనార్చిఁ దనదు నెమ్మే నిడఁగఁ ద్రిభువనముజనము
లార!యిది పుణ్యమైన యాజ్యాహుతియని యెన్నఁగాఁ దొడఁగెను శారదేందువదన!
తే॥ అంద ఱాక్రోశ మొనరించి రబల లార్య హవ్యవాహనునందు మే నట్లు వేల్వ
మంత్రసంస్కృత యధ్వరమహితమైన యా వసోర్ధారఁగా నెంచి యబ్జనయన!
శా॥ ముల్లోకమ్ములవారు వేల్పులు మును ల్మొత్తమ్ముమొత్తమ్ము లై
కల్లోలోల్లసితమ్ము లౌ మనముల న్గాంక్షించుఁ జర్చించుచున్
సల్లాలిత్య సుపుణ్యదేవత యిదే శాపార్తయై వ్రాలెడున్
జెల్లంబో దివి బాసి దుర్గతిదెసం జేరాదు చిత్తంబునన్. ౨౮౪
క॥ అనుచుండ వహ్నిలోఁబడి యనవద్య శుభాంగి నెఱయ హాహారవముల్
దనరారె వానరులదెస దనుజులవలనున మహాద్భుతంబుగ మగువా! ౨౮౫

శా॥ ధర్మాత్ముం డగు రాఘవుం డతివిశుద్ధన్ సాధ్వి నమ్మానినిన్
మర్మావిత్పరుషోక్తులం దెగడి యమ్మార్తిం దలంగంగ నా
కర్మం బెట్లు ఘటిల్లె నంచు వగ తారాకాణంబుగా నెల్లరున్
నిర్మింపం దొరకొన్న యన్నడుల నిర్ణీతంబు భావింపుచున్. ౩౮౬
తే॥ దుర్మనుండుగఁ దోఁప్తోన తోడరు ధ్యానసంగతిం గనఁగాంచె నాసవిత్రృకులుఁడు
నేలఁ జూచుచుఁ గను లశ్రుజాలములను ఖిన్నములు గాఁగఁ జూపట్టు ఖిన్నగతిని.

—♦ బ్రహ్మాదులు శ్రీరామునసమక్షమునకువచ్చి సీత నిర్దోషయని చెప్పుట ♦—

సీ॥ రాజు వైశ్రవణుండు రారా జమిత్రకర్శనుఁడు యముండు భువనవినేత
యామహేంద్రుఁడు సహస్రాక్షుండు వరుణుండు ప్రత్యగాధీశ్వ పరంతపుండు
త్ర్యక్షుండు శ్రీమన్మహాదేవుఁడు వృషధ్వజుండు నా నెగడు నాతం డితండు
గలలోకములకెల్లఁ గర్తయుఁ బ్రహ్మవిద్వరుఁడు నౌ బ్రహ్మయు నరుస పౌనఁగ
మొనసి దేవర్షిపితృగణమ్ములు భజింప నిందఱు విమానకలితు లై యేగుదెంచి
రాదిమూర్తివిభుఁడు రాముఁ డచ్యుతుండు నెటఁ దనర్చుచునున్న యన్నెలవుసేర.
ఆ॥ సూర్యమండలముల చొప్పున నొప్పు విమానతతులు లంక మలసి యొలసి
రాణమెఱయ నరివిరాము రామునిఁ దేర్ప నరిగి రంతికమున కధిగుణాఢ్య.
క॥ పరమం బగు నరుసంబునఁ బరమాత్ముని రాముఁ దఱిసి ప్రాంజలు లగుచున్
బరమార్థయుతశుభోక్తుల బరఁగింపందొడరి రఘుకు ప్రజ్ఞాసహితా. ౩౯౦
ఆ॥ కలితలలితరత్నకంకణమ్ముల దీప్తు లొలయఁ జేతులె యురుభుజమ్ము
లమరశాఖిశాఖ లన నమరారంగ నెలయు నధిపుఁ గాంచి యిట్టు లనిరి. ౩౯౧
సీ॥ కామింతు వఖిలలోకములుఁ గావింపంగఁ గర్త వీవఖిలసంహార్త వీవు
సిరిఁ జెంపనేర్తు సాక్షివి జ్ఞానవిగ్రహస్ఫురణమైఁ దనరారు చొరవ మఱియు
నఖిలభూతంబుల కాదిభూతంబవు బ్రహ్మ వీ వటు పరబ్రహ్మ మీవ
కలరుద్రులందు శంకరుఁడ వీ వష్టమవసు వైతి ఋతధామ వసువులందు
సాధ్యులందుఁ బంచముఁడవు చంద్రసూర్యు లక్షు లీనీకు శ్రవణంబు లశ్వినులు మ
హామహుండవు నిత్యస్వయంప్రభుండ విట్టి నీవు నిన్నెఱుఁగవే యిందిరేశ. ౩౯౨
క॥ ఆద్యంతము లన్నిటికి ననాద్యంతుఁడ వైన నీదు యానసె పరఁగున్
వేద్యావేద్యము లెల్ల నివేద్యము లగు నిన్నుఁ గొలుచు విదితాత్ములకున్. ౩౯౩
వ॥ జగత్కల్యాణమూర్తీ సద్గుణనిధానంబ వగు నీవు నిత్యుండ వొక్కరుండవు
సదోదితుండవు సదాశుద్ధుండవు సదాబుద్ధుండవు సదాముక్తుండవు సదాశివుండవు
నగుణుండవు నద్వయుండవు నై నెగడొందుచుందు వట్లగుటం ద్వన్మాయా
సంవృతాత్ములకు మానుషవిగ్రహుండ వై చూపట్టెదవు; భవన్నామస్మరణపర

తంత్రమానసులకు సత్యానందచిదాత్మస్వరూపుండ వై భాసిల్లెద విట్టి నీదు
విలాసంబులు గణియింప నశక్యంబులు. ౨౯౪

ఉ॥ ఏల యుపేక్ష సేసితి వహీనశయాన త్వదానతిం గృతిం
బోలఁగఁ గూర్చునట్టి సతిఁ బుణ్యచరిత్రఁ ద్రిలోకభావ్య ని
య్యాలమె ఱుఁగరాదు గదె యారయఁ బ్రాకృతు కృత్య మట్టిఁ డై
మా లలివారిచిత్తముల మార్గ్యునఁ గాఁజ గదేకసంశ్రయా. ౨౯౫

క॥ చిచ్చులుకఁ జేయుదే సిరి లచ్చి యనక సుదతి నీకు లాఁతి యగునె నీ
యిచ్చఁ దొలఁగి యున్నదియే క చ్చని సీతలఁచుపనియుఁ గావించినదే. ౨౯౬

తే॥ మాపదము లాక్రమింప దుర్మదునిఁ గినిసి రావణుని వధియించితి రాపు నైప
కాపదలు దీఱ సుస్థితు లందఁగంటి మింక నిమ్మెయి వేడబం బేల వలసె. ౨౯౭

తే॥ అనుచు నింద్రపురస్సరు లైన లోకపాలకులును లోకేశుండుఁ బలుక వినుచు
నాత్రిదశవర్యులం గాంచి యనియె రాముఁ డఖిలపతి ధర్మభృద్వరుఁ డాదరమున.

ఆ॥ నన్ను మానుషునిఁగ నాబుద్ధి నూహింతు దశరథాత్మజప్రథాప్రసక్తి
నెవఁడ నెవనివాఁడ నేల తోఁచితి భగవంతుఁ డజుఁడు తెలిసి పలుకుఁగాత.

క॥ అని పలికెను కాకుత్స్థుని గని బ్రహ్మవిదుండు బ్రహ్మ గడుకొని ప్రణతిం
బొనరించి సత్య మిది సత్యనిరూఢా! విను మటంచు నాదటఁ బలికెన్. 300

సీ॥ నీవు నారాయణదేవుండ వోదేవ! శ్రీమంతుఁడవు చక్రసిద్ధహేతి
వేకశృంగవరాహ తేత్థవైభవుఁడవు భూతభవ్యారిజయాతిశాయి
వక్షరం బవు బ్రహ్మమవు సత్యమూర్తివి లోకాదిమధ్యాంతలోకక మగు
పరమధర్మమవు విష్వక్సేనుఁడవు చతుర్భుజుఁడవు శార్ఙ్గధన్వుఁడ వజుఁడవు
పరఁగు నీకు హృషీకేశ పురుష పూరుషోత్త మాజిత సంజ్ఞ లుపాత్తఖడ్గ
విష్ణు కృష్ణ బృహద్బల వేదవేద్య ముఖ్యనామంబులుఁ బురాణమునివిచింత్య.

క॥ సేనానివి గ్రామణి వీ వానెఱి బుద్ధియును సత్త్వ మాక్షమ దమముల్
మానుగఁ బ్రభవాప్యయలీలానిరతులు త్వత్ప్రకృతులు లక్ష్మీనాథా. 30౧

వ॥ దేవదేవా! నీ వుపేంద్రుండవు మధుసూదనుండ వింద్రకర్ముండవు మహేంద్రుం
డవు పద్మనాభుండవు రణాంతకరుండవు శరణ్యుండవు శరణం బవు ని ట్లని దివ్య
మహర్షు లెల్లం గొనియాడుచుండుదురు. నీవు సహస్రశృంగుండవు వేదాత్ముండవు
శతజిహ్వుండవు మహర్షభుండవు లోకత్రయాదికర్తవు స్వయంప్రభుండవు సిద్ధ
సాధ్యాశ్రయుండవు పూర్వజుండవు యజ్ఞంబవు వషట్కారంబ వోంకారంబవు
పరంతపుండవు నిట్టి నీదు ప్రభవంబు నిధనంబును వేదంబులు వేదనిష్ఠులు
నెఱుంగ రన నీ వెవ్వండవో యెవ్వాని కరయవచ్చు? నేనెవ్వనివాఁడ నంటి
వెవ్వారివాఁడవు కావు? సర్వభూతములయందును సర్వబ్రాహ్మణులయందును

సర్వగోబృందంబులయందును సర్వదిక్కులయందును గగనమందును బర్వతంబుల యందును వనంబులయందును నెందునేనియు నీవ యుందువు. శ్రీమంతుండవగు నీవు సహస్రచరణుండవు సహస్రశీర్షుండవు సహస్రదృశుండవు నగుచు సర్వభూతంబులను సశైలకాననేందిర యగు వసుంధరను ధరించుచున్నవాఁడవు. పృథివ్యంతంబున సలిలమధ్యంబున మహోరగంబవై భాసిల్లుచు మూఁడు లోకంబులను దేవగంధర్వదానవ ప్రభృతుల నవధరించుచు మహాత్ములచే నవలోకింపఁ బడుచుందువు. రాఘవేంద్రా! బ్రహ్మంబ వగు నీకు నే హృదయంబ నై యొప్పారుదు. దేవి సరస్వతి నీదు జిహ్వ యై వర్తిల్లు. దేవత లెల్ల గాత్రంబులం దలి రోమంబులుగాఁ బరిగణింపంబడుచుందురు. నీదు నిమేషంబు రాత్రి; యున్మేషంబు పవలు; నిశ్వాససంస్కారంబులు వేదంబులు. వేయునేల? నీవుగాని దెద్దియును లేదు. జగత్తంతయు నీశరీరంబు. నీదు స్థైర్యంబు వసుధాతలంబు. పావకుండు కోపంబు. సోముండు ప్రసాదంబు. శ్రీవత్సలక్షణా! మున్ను త్రివిక్రమసంజ్ఞం దనరారి త్రివిక్రమక్రమణంబుల లోకత్రయం బాక్రమించి మహాసురుం డగు బలిని బంధించి మహేంద్రునకు స్వారాజ్యం బొసంగితివి. లక్ష్మి సీత యై సముపేత గాఁగ విష్ణుండవు కృష్ణుండవు దేవుండవు ప్రజానాథుండవు నగు నీవు రాక్షసవధార్థంబు మానుషతనుప్రవిష్టుండ వై యక్కార్యంబుఁ జక్కఁ బఱిచి మామనోరథంబు లెల్ల సఫలంబు లొనరించితివి. రావణుండు నిహతుండు గాఁగ ధరాభారంబు నివర్తితంబయ్యె నట్లుగావున. 303

క॥ నీదగు హర్షముకొలఁదిగ నేదిష్టం బీజగమున నిలిచి నెగడనై
యాదట నాదివ మారసి ప్రోఁది యొనర్పం దలఁపుము పురుషోత్తమసా. 30౪

క॥ నీబలవీర్య మమోఘము నీబహుళపరాక్రమంబు నెఱియు నమోఘం
బౌబంతిఁ గా న్నమోఘం బౌఁబో నీస్తవ మమోఘ మన్నిఁటికన్నన్. 30౫

పృథ్వి॥ పురాణపురుషోత్తము న్మురి భజింతు రెవ్వారు ని
న్వరాభయకరాఢ్యు నివ్వసుధ దేవు నీడ్యుం ధ్రువున్
నిరంతరసుఖాంబుధి న్నెగడ నొదు రిం దాదటన్
బరాహ్వయపదంబునన్ బరఁగఁగాంత్రు విశ్వాధిపా. 30౬

సీ॥ శ్రీవిష్ణుదేవు నశేషసంస్థితిహేతుభూతు నధ్యాత్మదృగ్భూతిభావ్యు
ద్వంద్వవిహీను సత్తామాత్రుఁ బరుని నొక్కని సకలాంతస్థు ఘనచిదాత్ము
నిను భజించెదఁ దండ్రి! నిశ్చయబుద్ధిఁ బ్రాణాపానముల హృదయమున నిల్పి
సర్వసంశయబంధ సంక్షయం బొనరించి విషయౌఘములఁ బాచి విగతమోహు

లగుచు మణికిరీటహాటకోజ్జ్వలు మందహాసలలితు ద్యుమణిభాసమాను
నెవని సర్వజగదధీశుఁ గన్గొనుచుందు రమ్మహాత్ముఁ బరము ననవరతము. ౩౦౭

సీ॥ ఆద్యు మాయాతీతు నభవు మాధవు జగదీడ్యు నిత్యానందు నిద్ధతేజు
మోహవినాశను మునివంద్యు యోగినిత్యధ్యేయు యోగవిధానునిఁ బరి
పూర్ణు రంజితలోకుఁ బుణ్యుఁ బుణ్యశ్లోకు రమణీయు నినుఁ గొల్తు రామదేవు
భవముఖు లొభ్భగసంపద్యుతు ల్నిచ్చలు నర్చింతు రెవని పాదాబ్జయుగ్మ
మట్టి నీకు వందనార్చనదాస్యము లొప్పనరఁ జేయుచుందుఁ బుణ్యపాప
కలన లెడల జ్ఞానఘను లెన్ను నీదగు నల్లపరమపదము నందుకొఱకు. ౩౦౮

క॥ భావాభావప్రత్యయ భూవిరతు న్నిత్యు శుద్ధు బుద్ధు ననంతున్
దేవు నశేషాసురదవదావుం బ్రణవాఖ్యు నిను నెదం బూజింతున్. ౩౦౯

సీ॥ నాథుఁడ వీవు మన్నాథితాఖిలకార్యకారి వౌట జగత్ప్రకాశ మయ్యె
మానాతిగుఁడవు శ్రీమాధవమూర్తివి నిఖిలధారివి నిత్యనిర్మలుఁడవు
భవహారి వయ్యెదు భక్తియోగాభ్యాస భావితహృత్సహాభావి వగుచు
భావనారూపసద్భక్తిగమ్యుఁడ వంచు నిన్నుఁ బేర్కొందురు నిగమవేత్త
లధిప! లోకతతుల కాద్యంతములు నీవ లౌకికప్రమాణలక్ష్య మీవ
యఖిలలోకలౌకికాతీతుఁడవు నీవ పరుఁడ వీవ లోకపతివి నీవ. ౩౧౦

సీ॥ భక్తియు శ్రద్ధయు భావంబు నీయందుఁ బరఁగిన నినుఁ గాంత్రు పరము నీశు
నతిమానుఁడవు గతాహంకారుఁడవు సనాతనముని వనఁగ మాధవ తనర్తు
మానాశ్రయుఁడు నీవు మర్మం బరయ నెట్లు నేర్చువాఁ డెమ్మెయినెఱయఁ గనిన
నిందీవరశ్యామసుందర! రాఘవ! రామ! భజింతు నీరమ్యమూర్తి
నెపుడు బృందావనమున దిగీశవరానిబృందబృందారకతతులుఁ బేర్మిఁ గొలువ
నుంచు సుఖకంద మన నయి యోగనిరతి దవిలి యానీకు నేను వందనము లిడుదు.

ఉ॥ ఆనిగమాగమానుస్మృతి నయ్య! భజింతుము ని న్నతీంద్రియ
జ్ఞానమ వీ వనాది వటు సత్యము హార్దము నీస్వరూపముల్
మానుషభావ మూది మము మన్నన సేయఁగఁ దోఁచి తీనెఱిన్
మా నగు గారుడాశ్మరుచి మాధురి మైకొను మంజిమంబునన్. ౩౧౨

ఆ॥ నీకు శరణు లయ్య! నీకు వందనములు నీకు నతులు వికచనీరజాక్ష!
నే సమర్పణంబు నెఱిమీఱఁ బొనరింతు నీప్రసాదలాభనిరతికొఱకు. ౩౧౩

శా॥ ఆద్యం బార్షము నై పురాతనము నై యర్థ్యేతిహాసంబు నై
హృద్యం బౌ నిది బ్రాహ్మ మా స్తవము సాహిత్యాప్తి నిద్ధాన సం
వేద్యున్ రాముని శ్రద్ధ భక్తిఁ గొని భావించు న్నరుం డెవ్వఁ డా
యుద్యుక్తుం డఖిలార్థము ల్వడయుఁ బాయుం బాపజాలంబులన్. ౩౧౪

తే॥ మలయు నతనికిఁ గరతలామలక మగుచు మోహ మట్లు విడించి సమస్తమునను
రామవిభుఁగొనియాడెడు రాణిఁగాంచి యఖిలమునులు సురలు హర్షమందుచుండ.

క॥ శుభమైన యాయుపశ్రుతి ప్రభుఁ డన్విధి మోమునందు భాసిల్లఁగ శ్రీ
ప్రభవుఁడు హుతాశనుఁడు దా నభయతఁ బొడసూపి కుతుక మలరారంగన్.

తే॥ మన్మహామూర్తి శ్రీదుండు మహితుఁ డతఁడు దేవి సుచరిత్ర నల్లవిదేహతనయఁ
బుణ్య స్వస్రుభూత మాతృవత్పూజ్యఁ దెచ్చి రాముని కొసంగు నిచ్చమై రాణమెఱయ.

క॥ చితఁ ద్రోచుకొనుచు వచ్చి యుచితరూపం బొలయఁ గాంచి చేరంజని శ్రీ
పతి నవ్విభుఁ గీర్తించుచు వితతోత్సవమునఁ దనర్చు వృత్తి దలిర్పన్. 3౧౮

—♦ అగ్ని సీతను సమర్పింప శ్రీరాముఁడు గ్రహించుట ♦—

సీ॥ పొడుపుప్రొద్దున నొప్పు పూజనీయతతోడి భాసమున్నతి వింత బలువుసూపఁ
దళుకు లీనఁగఁ జాలు తప్తకాంచనభూషణశ్రీలు రూపగుణంబుఁ బెనుప
రక్తమౌ చిత్తంబు రాణమై నెసలారు నంబరంబున డంబరంబు నెలయ
నీలకుంచితమూర్ధజాలంబనము బాల ప్రథిత యౌవనలక్ష్మిఁ బ్రస్తుతింప
నవనవోన్మేషమాల్యంబు నలువు మీఱ దనమనస్వితఁ నఘదూరతను దనర్చు
కీర్తి యన మందహాసవిస్ఫూర్తి పొనర నెగడు నద్దేవి రఘుదేవు నెఱయఁ దార్చి

తే॥ పావకుఁడు కర్మసాక్షి విభావసుండు లోకపావని సీత సుశ్లోకితాత్మ
రాము నంకమ్ము సేర్చి విరాజితముగఁ బలికె నిమ్మెయి నుడి భక్తపావకమని !

సీ॥ నీధర్మపత్ని యీనిర్మలాత్మికయందు లే దధీశ్వర ! పాపలేశమేని
వృత్తశౌండీర సువృత్త వాక్కర్మదృఙ్మనముల నెప్పు నేమఱదు నిన్ను
నీ వింట లేకున్న నెరిని రావణుచేత నిర్జనవనతో నపనీత యయ్యె
బ్రబలరాక్షసుఁడు నేడ్పడి దీన వివశయునై యుండెఁ దేఁగట్టై నను నూచి
యాసురీసంఘరుద్ధమై యంతిపురిని గుప్తయయుఁ బ్రలోభ్యమానయుఁ గూటవాక్య
భర్త్స్యమానయు నగుచు నప్పాపకర్ము నెంచ దెద నీదు మూర్తి ధ్యానించుచుండు.

ఆ॥ త్వద్గతాంతరాత్మ త్వత్పర త్వత్పరాయణ విశుద్ధభావ యఘువిదూర
నీయమం గ్రహించి యెనసి సుఖింపు మెం దాడ కాన నెట్టువాఁడ నిట్లు. 3౨౨

శా॥ నీయాన న్నిటఁ గాంచె నిట్లు మొలఁగ న్నేఁడేల యీవేదబం
బాయాకల్పన లట్లు సెల్లెఁ దుది నయ్యర్థంబు గావించి త
చ్ఛాయామూర్తిఁ దొలంగి నిత్యము నిజస్వం బైన తత్త్వంబునన్
స్థాయత్సత్త్వమునం దొలంకె సతి సద్భావంబు పాటింపవే. 3౨3

ఆ॥ ఇంతయేల మెప్పు డెడసియున్నది యనపాయినియ యనంగఁ బ్రథిత గాదె
సాధ్విఁ గూర్చి నీకు సంశయింపఁగ నేల వలసె నొడ్ల మొఱఁగు వలన శా క.

క॥ అని విన్నవించి యనలుం డనుపమవాఙ్మయము వెలయ నగ్గించెను రా
ముని విశ్వమూర్తి యజ్ఞాత్ముని భావన తనర దేవ! మునినుత యనుచున్. ౩౨౫

శా॥ శ్రీనాథుండగు రాముఁ డన్నుడులచేఁ జిత్తంబు పొంగారఁగా
నానందాశ్రుపరీతనేత్రుఁ డయి నిధ్యానంబు ధ్యానంబు న
మ్మై నెక్కొల్గనుచుండ మంతనమునన్ మంత్రంబు పాటించుచున్
దా నాదిత్యవితాన మెల్ల వినఁగం దాత్పర్య మొప్పారఁగన్. ౩౨౬

క॥ తేజము దృఢవిక్రమతయు నోజము ద్యుతిమత్తయును మహోన్నతములు గా
నాజతనుఁ బెనుపుఁ గనుచున్ నైజస్థితి మేలుకొలుప ననుచు ప్రభుతతోన్.

ఆ॥ మోము త్రిదశులకుఁ బ్రముఖ్యుఁ డధ్వరయోగి రుద్రమూర్తి వహ్నిరూఢిగాంచి
యామహానుభావుఁ డాత్మధృద్ధర్మ మాప్రవక్త రాముఁ డనియె నిట్లు.

సీ॥ సీత పుణ్యోపేత సేయదు పాప మవశ్య మత్తైన నవ్వామనేత్ర
యున్నది చిరకాల ములిపిరక్కసు నంతిపురి నవశత నొందు తెరువు గాన
కబల శోధింప కెట్లంగీకరించెను బాలిశుఁ డట్టై నృపాలసుతుఁడు
రాముఁ డీశ్వరవునఁ గామాత్ముఁ డనవచ్చు నని జగమ్ముల ఘను లాడుకొందు
రెపుడు నాన్యహృదయ యేకాంతభక్త మచ్చిత్తవర్తినియు విశిష్టయు నగు
నేను నెఱుఁగువాఁడ నిమివంశసంభూత జనకజాతవలని సద్గుణములు. ౩౨౯

క॥ లోకప్రత్యయమునకై యీకల్యాణి చిత సొచ్చునెడ సత్యమ హే
వాక మిడుఁగాక యని నే గైకొంటి నుపేక్ష నెల్లకలఁక తలంగెన్. ౩౩౦

చ॥ జలనిధివేలఁ బోల గుణసంభృతకీర్తి విశాలనేత్ర ని
శ్చల సుమహామహోభరిత సాధ్విఁ గ్రమింపఁగ లేఁడు రావణుం
డలవున దీప్తవహ్నిశిఖ నాఁకపడంగలదే పతంగ మ
మ్మలకయ కాదె దుష్టమతి మైకొనఁజూచినయేని వానికిన్. ౩౩౧

తే॥ భాస్కరునితోడి ప్రభయట్ల పరఁగుచుండు సీత నా కెప్పుడు ననన్యశ్రీ యనంగ
రావణాంతఃపురైశ్వర్యరంజనమున కర్హురా లనుకొను టనర్హంబ కాదె. ౩౩౨

తే॥ మూఁడు లోకంబులు విశుద్ధమూర్తి సీత జనకనందిని యన వీడ శక్య యగునె
యాత్మవంతున కగు కీర్తి యట్లు నేర్చు నీతఁ డనిపించుకొను నా కధీశులార.

ఉ॥ కావున లోకమాన్యు లిటు గైకొని నాదు హితంబుపొంటె సం
భావనసేసి యిందఱునుఁ బల్కఁ దలంగుదునే భవద్వచ
శ్శ్రీ వెలయంగలాడ నిది సిద్ధ మటంచు విభుండు దివ్యులన్
భావితులం బొనర్చె ననపాయసుఖోజ్జ్వలమూర్తి యై తగన్. ౩౩౪

శా॥ ఆనందాశ్రుపరీతనేత్రుఁ డగుచున్ స్వాంకస్థలిన్ జానకిన్
శ్రీనంద్య న్నెలకొల్పి పావకుని మే ల్చింతించి పూజించి తే

జోనూనుం డనపాయినిఁ సిరిఁ బరార్థ్యం గూడి శోభిల్లు నా
శ్రీనారాయణదేవుఁ డై వెలసె నిశ్చింతాత్ముఁ డై పార్వతీ. ౩౩౫

ఆ॥ రాముఁ డల్లు నెగడ రాణ జగత్త్రయజనని జనకజాత సంతసమునఁ
బొదలఁగా నభూతపూర్వ శోభనలక్ష్మి తోలఁకె వారియందుఁ దోయజాక్షి.

క॥ సురనాయకుఁ డత్తఱి నాసురనాయకుఁ గెలిచి కీర్తి సుస్థిరగా భా
సుర సీతఁ బెరసి మెఱసెడు సురసిద్ధస్తుత్యు రాముఁ జూచుచు వేడ్కన్. ౩౩౬

తే॥ తొడరి మ్రొక్కి ప్రపత్తిమై దోసిలొగ్గి పలుకుబడి గద్గదిక వేఱుపడి పొసంగఁ
బలికెఁ గలిమికిఁ బాత్రుఁ డై భయముఁదొఱఁగి పలుకునది స్తోత్రరాజమై పరిఢవిల్ల.

—♦ ఇంద్రకృత రామస్తవము ♦—

సీ॥ ఏనెప్డును భజింతు నిందీవరాభుఁ బాపారణ్యదావానలాభిధాను
రాము నిరత్యయధాము సీతేందిరాశ్రీనందితాత్మసంసేవ్యమాను
భవభవానీచిత్తభావితానందప్రపత్తిగీతు భవాద్యభావహేతు
భూతు నిన్నుఁ ద్రిలోకపూజ్యు సురానీకదుఃఖౌఘనాశనుఁ దోయజాక్షుఁ
కలితమానవప్రకారు నిరాకారు నీడ్యు హర్షఘనుఁ బరేశు హరి వ
రేణ్యు సర్వతోగ్రగణ్యు భావాభావవిరతు విశ్వరూపు వేదవేద్యు. ౩౩౭

సీ॥ అభవుఁ బ్రపన్నాఖిలానందసందోహదోహుఁ బ్రసన్ను నిర్ధూతపాపు
నతజనాఘౌఘనిర్ణాశనదక్షస్వకీయమంగళనామధేయు మహితు
జపతపోయోగప్రశస్తయోగీశ భావాభిభావ్యుఁ గపీశ్వరాదిమిత్రు
శ్యామలగాత్రు సంసరణభోగాసక్తదూరయోగోద్భాస్యదూరభాసు
నినుఁ జిదానందకందమ్ము నిరతిఁ గొలుతు రామచంద్ర విదేహాత్మజామహామ
హాంబ నను ధన్యుఁ జేయవే యఖిలపాపసంచయముఁ బాపి నీపాదసరణి సూపి.

సీ॥ మహిత ! మహాయోగమాయావికాసానుయుక్తుండ వై పురుషోత్తముఁడవు
లీలానరాకారహేలావిశేషప్రవర్తనంబున నిట్లు వఱలినాఁడ
వో రామ! త్వత్కథాపూరంబు గర్ణరసాయనంబుగఁ గ్రోలి యమృతతృప్తు
లై లోకులెల్ల సదానందరూపు లై నీసన్నిధిఁ గాంత్రు నియతి తనర
మానపానాభిమత్తప్రమత్తతలు ననూనబలతాధిపత్యాభిమానములును
మున్నుఁ గలిగియు నేఁ డిన్ని ముడుఁగఁబాఱెఁ ద్వత్పదాబ్జప్రసాదసంపత్ప్రసక్తి.

సీ॥ నీలమేఘోల్లాసనిర్ణాయకంబు లౌ నెమ్మేని తళతళ ల్నివ్వటిల్ల
సుద్రశ్మిరత్నకేయూరకుండలతారహారద్యుతు ల్దిక్కు లాక్రమింప
శరదిందుచంద్రికాసల్లాపమున మించు చిఱునవ్వు మోమున సిరి దలిర్ప
నటు దయాశరధి నామాంకితమ్ములు గనుదమ్ములు నేత్రము ల్గుమ్మరింప

నిమ్మెయి ధరాభరం బెల్ల నెడయఁజేసి హేమవర్ణ తటిత్పుంజధామ సీత
యంకపాళి కలంకార మావహింప రమణ నెగడొందు నిను రాజ్యరమ భజింతు.
తే॥ చంద్రకోటిప్రకాశప్రసాదభరితరాజ్యపీఠి సీతారమారమణితోడ
వర్తిలి నివర్తితాత్మజనార్తితంద్రుఁ డితఁ డనఁ దనర్చు దేవు నిన్ననిశ గొలుతు.

—♦ శివుఁడు రాముఁ బ్రశంసించుట ♦—

చ॥ అని వినుతించుచుండఁగ మహావిభవాంచితు రాము వేడ్కమై
మొనసి భవాని ! యే నిటులు మున్కొని పల్కితిఁ బుష్కరాక్ష ! యి
ట్లని యనరాదు త్వత్కృత మనర్ఘ మసాధ్యము కర్మవృత్త మి
య్యనువున సంతసిల్లె జగ మంతయు మామది కెక్కె నింతయున్. 3౮౮
ఆ॥ శస్త్రభృద్వరుఁడవు సన్మహాసత్త్వుండ వటు మహాభుజుండ వరినిషూద
నుండ వెన్నఁదరమె గండరగండఁడ వైన నీపరాక్రమాతిశయము. 3౮౯
తే॥ ఆక్రమించె రావణదారుణాంధతమము సకలలోకంబులందు నిస్తంద్ర మగుచు
విరియఁజేసితి వెలుఁగులు వేనవేలు నొక్కఁడయి నీవుగాఁ దోఁచి యొఱపు నెఱపి.
క॥ తలఁగించితి వలరావణు వలని భయము వలన జగము వల నొప్పారన్
వెలయించితి వీ నీనెఱిఁ దలఁపున నిడువార మెపుడు దైత్యధ్వంసీ ! 3౯౦
తే॥ సచ్చిదానందవిగ్రహసత్త్వరూప ! చారుతరమూర్తి ! సర్వజ్ఞ ! సదసదితర
నిర్మలాత్మ! మాయాపరినిష్ఠితాత్మ! యనఘ! విశ్వేశ! నిన్నెంతు ననవరతము.
సీ॥ పదరజమ్ములు లేవె? పాషాణతరుణీకరణయశస్స్ఫూర్తి కేర్పడవు గాక
భుజసత్త్వములు లేవె పురదాహిచాపవిదారణోన్నతి కెన్నఁదగవు గాక
శరరయంబులు లేవె కరటాసురత్రిలోకగమన హేతువు ల్గావు గాక
మాహాత్మ్యములు లేవె మహిభృజ్జలోన్మజ్జనక్రియావ్యాప్తిఁ జెనకవు గాక
క్షితిపతులు లేరె నృమృగాదితతుల సుతుల లీలఁ బాలింతు మనువారు లేరుగాక
యనుచు దివిభువి సంస్తుతు లావహిల్ల నోమువిఁక భూమిఁ గల్యాణధామ! రామ!
సీ॥ దీనుఁ డౌ భరతుని దీవింపవే యూరడించి కౌఁగిటఁ బ్రేముడించి నెఱపి
నిను గన్నది యశస్వినిం గోసలునికన్నె నలరింపవే మ్రొక్కి యలఁతవాయ
మేలిమిఁ బాటింపవే లక్ష్మణాంబ సుమిత్ర నానందాశ్రుమిళితఁ జేసి
యల్ల కైకేయి దూఱ డఁగింపవే గారవించి నీకథ విస్తరించి తెలిపి
ప్రకృతుల సుహృజ్జనుల మహాబ్రాహ్మణులను మన్ననలఁదన్పి మహిత సన్మానమొనసి
యాయయోధ్యామహారాజ్యమరసి యేలుమఖిలజగములుఁబొగడ నెయసముఁగనుము.
మ॥ కుల మైక్ష్వాకవ మంచితంబుగ హరిత్కాలంబు లేల న్మహా
బలులం బుత్రులఁ గాంచి సర్వశుభము ల్వాటిల్లఁగా నశ్వమే

థలసద్భాగముఁ గూర్చి యర్చితముగా దైవంబు లోకంబు భూ
తలముం దృప్త మొనర్చి రమ్ము స్వక ముద్ధామంబు ధామం బురన్. ౩౫౧

తే॥ రామ! మీతండ్రి దశరథరాజచంద్రుఁ డల్లఁడుగొ దివ్యరథముపై నలరుచున్న
వాఁడు మాతోడ నినుఁజూడవచ్చినాఁడు సానుజుఁడవయి కనుము సన్మాన మొలయ.

ఉ॥ మానవనాయకుం డితఁడు మానుషలోకగురుండు నీకుఁ జి
న్మానితమూర్తి తత్తపమునం గదె యిత్తను నంది యైంద్రసం
స్థానమున న్మెలంగుచుఁ బ్రశస్తిఁ గనంగ నె నీకతంబునన్
దాను భవాబ్ధి దాఁటె సుకృతం బొలయన్ సురమౌనిపూజ్యుఁ డై. ౩౫౩

చ॥ అను నుడి విన్నయంత నె మహామహుఁ డారఘుపుంగవుండు గ్ర
క్కున ననుజుండు దో డనయఁ గోరికె లీరికె లెత్త మ్రొక్కె న
య్యనువునఁ జేరఁబాఱి విరజోంబరసంవృతు దీవ్యమాను శ్రీ
ఘను మహనీయదేహుఁ గనెఁ గన్గవ కొ ప్పగు విప్పు చొప్పడన్. ౩౫౪

—♦ సీతా రామలక్ష్మణ దశరథ సమావేశము ♦—

క॥ అతిశయితానందంబున క్షితిపతి సుతు ననుజసహితుఁ జేరఁ దివిచి స
మ్మతిఁ దనసింగపుఁబీఠికిఁ గుతుకంబునఁ దార్చి సముపగూహనపరుఁడై ౩౫౫

తే॥ బాహువులఁ గ్రొచ్చి ప్రాణమ్ము ప్రాణమైన రాముతో నిట్టులనె గుణధామ!నిన్నుఁ
బాసి వచ్చితి స్వర్గంబు బహుమతంబు గాదు సురమునిసన్మానగణన లేదు.

సీ॥ ఉంటి మహేంద్రు పేరోలగంబున దివ్యతనుధారి నై సురాంగనలు గొలువ
నిన్నినాళ్లును సుఖ మిది యిట్టిది యటంచు నిక్కంబు పలికెద నే నెఱుంగఁ
గైక నాయెడఁ దార్చు కా ఱెఱపులు భవత్ప్రవాజనార్థము ల్పడలుపఱుప
నిటవచ్చినాఁడ మే నెడయంగ నైనాఁడ నెలకొనె నవి మది నేఁటివఱకుఁ
గుశలి వై లక్ష్మణునిఁ గూడి కూర్చి నాదు కనులపండువు గావింప గతము వీడ
నివము దొఱఁగిన భాస్కరుం డట్టు లట్టు లైతి సౌఖ్య ముపస్థిత మయ్యె రామ.

ఆ॥ తారితుండ నైతిఁ దఱిఁ బుత్రక! సుపుత్రుఁడవు మహాత్ముఁడవు కడంగి నీవు
చిత్తమునఁ దలంచి చేయ నష్టావక్రుచేఁ గహోళుఁ డట్లు సిద్ధ మిదియు. ౩౫౭

ఉ॥ ఇప్పటి కే నెఱింగితిన యింతలు సేసిరి వేల్పు లంచుఁ దా
నప్పుడు దోఁచకుండె మది నాశరమర్దన మీ వొనర్ప న
య్యొప్పమి పుట్టఁగావలసె నోపురుషోత్తమ! యెట్టు లైన నా
తప్పులు ముప్పులుం దలఁగెఁ దావక మౌ యశ ముప్పతిల్లఁగాన్. ౩౫౮

తే॥ కోసలాత్మజ సిద్ధార్థ గుణనిధి యది రామతో వనవాసంబు రభస మెడలి
యింటికి సహానుజుండ వై యేగుదేరఁ గాంచుచు ముదశ్రువు ల్నించుకలనరామ.

తే॥ అరినిషూదన! సిద్ధార్థు లయ్యెదరు మహాజనులు పురగతులు ని న్నరయఁగాంచి
వనముఁ బాసి గృహస్థితిఁ గని జలాభిషిక్తుఁడవు క్షితిపుఁడవు నా సిరి దలిర్ప.
మ॥ అనురక్తుండు సుధర్మచారి శుచి భవ్యాత్ముండు సత్త్వాఢ్యుఁ డ
వ్వనిపాతం బటు వుట్ట నీకయి మహోద్వేగంబున న్నిష్ఠఁ గై
కొని నీ మే లగు రాక నెంచి నెఱకోర్కు ల్లీవియల్లాఱ నె
ట్టన నున్నాఁడు త్వదాసక్తిఁ భరతుఁ డొంట న్నాని లాలింపవే. 3౬౭
సీ॥ సౌమ్యుండ వౌ నీవు జతన మైఁ బదునాల్గు వత్సరంబులు నిల్చువాసి వన ని
వాసి వై యొంటొంట గాసినొందియుఁ దండ్రి సత్యంబు పాటింపఁజను నటంచుఁ
బ్రతినవట్టితి దానిఁ బాలించి తింతకు సాధ్వితో సుమతి లక్ష్మణునితోడ
దేవకంటకు నవిఁ దీర్చితి రావణు సఫల మయ్యెను నీప్రచార మెల్ల
సురలు మునులును సంతోషభరితు లైరి శ్లాఘ్యకర్ముఁడ వైతి వసంబు వోసఁగె
దమ్ములంగూడి రాజ్యపదమ్ముఁ గొని చిరాయు వంగి ప్రజాక్షేమ మరసికొనుము.
క॥ అని తెలఁగుపడ వచించెడు మనుజేంద్రుం గాంచి రామమహిపాలుం డి
ట్లనెఁ బ్రాంజలి యై తననుడి వినుతం బగుచుండ మేలి వినయం బొప్పన్.
ఉ॥ పాపమొ పున్నెమో పలుకు పాటిలె నాఁడటు మధ్యమాంబ క
య్యాపద గూడమున్టు నెడ నాపఁగ నెవ్వరి కౌఁ దలంపునం
గోపమువుట్ట ని న్ననుతఁ గూళఁ దొఱంగితి నంటి ఘోర మా
శాప మనంగ నయ్యె నది సంభృతధర్మ! మరల్చి కావవే. 3౬౯
ఆ॥ తండ్రి! తావకోక్తి తడవి యింకిట వారిఁ దరలఁజేయకుండఁ దలఁపు మనుచు
దోసిలొగ్గి వేఁడు నాసుతు మత మెంచి యిల్లె తలఁగుఁగాత మనియె నతఁడు.
తే॥ విభుఁడు సౌమిత్రిఁ గౌఁగిట వేడ్క మీఱఁ బొదివి నాయన్న యడవులఁ బ్రొద్దు
తఱిని సీతాసహితు రాముఁదద్దఁగొలిచిమంటి వదినామదికిఁ బ్రీతిమహితమయ్యె [గడపు
క॥ లోకములెల్ల జయించితి వీకారుణ్యనిధివలన నెల్లశుభములుం
జేకురు నీ కిఁక ధర్మప్రాకటసంస్థాన మెనసి పరఁగితి జగతిన్. 3౭౦
సీ॥ ఈ రేడుభువనంబు లెక్కటి మనుపంగఁ బుడమిభార మెడల్పఁ బొడమినాఁడు
సిద్ధులు మునులు సంసేవింప నింద్రాదు లాశ్రయింపఁగ నిట్టు లమరినాఁడు
పురుషోత్తముఁ డితండపో యను నాబ్రాహ్మకీటంబు నెఱిఁ బరికించినాఁడు
"తదిదమేవాన్యక్తతత్త్వ మక్షరపరబ్రహ్మ" మం చను శ్రుతిఁ బరగినాఁడు
దేవతాహృదయం బిదె దీప్యమానతేజ మిదె గోప మిదె రామదేవుఁ డనఁ బ
రంతపుఁడు విష్ణుదేవుఁడే రాణదసరఁ బూజసేయుచు మనుము సంపూర్ణభక్తి.
క॥ ఈపతి ప్రసన్నుఁ డైనన్ రా పొకయింతయును లేని రహి వాటిల్లున్
బ్రాపనఁగఁ దగుదు మహిమకు శ్రీపరమార్థంబుఁ గూడఁ జేకురు వత్సా!

ఉ॥ ఇట్టిపురాణదంపతుల నేమఱ కెల్లెడఁ గొల్చి తీవు చే
పట్టితి కీర్తిఁ దత్కులనఁ బాటిలె ధర్మువుతోడి సేమ మా
కట్టిడికర్మ మ ట్లడవిఁ గాఁచియ వెట్టిననాఁడు నేని నీ
పట్టు దలంగ వన్న! నిరపాయుఁడ వైతివి లేర యింకిటుల్. ౩౭౧
ఆ॥ ఆసుమిత్ర కాను పతిశయితం బన నయ్యె నటఁ జనంగ నైన నాఁటి
కింత దలఁచి జనని సంతసింపంగ నేమఱక రాముఁ జేరి మనుము తండ్రి! ౩౭౨
క॥ అని తెలిపినఁ గడుసంతసమునఁ జేలుచు దోసిలొగ్గి మ్రొక్కి నిలిచి బా
ష్పనివహము కనులఁ జాల్కొనఁ దనరారెను లక్ష్మణుండు తద్ద నృపతియుఁ దా.
క॥ జనవందిత జనకజ స్త్రీజనమణిఁ బేర్కొని వచించె సమ్మద మొదఁ గ
మ్మ ననుచు వత్సతలం బావని! స్నుష వై తీవు జగతి వఱలితి ననుచున్. ౩౭౪
సీ॥ తొడిగితిలే మంచితొడవు లన్నియు మేలి గొనములపేరిటఁ గొమరుమిగుల
నర్థిఁ గొంటివిలే మహార్థంబు స్త్రైణంబు ధర్మంబు గీర్తితోఁ దనరఁజేసి
యార్జించితివిలే శ్రుతార్జవధృతిసార మగ్నిశోధనమున నలవరించి
సిరి నేలితివిలే ప్రసిద్ధపాతివ్రత్య మాభిజాత్యముతోడ ననుపుపఱిచి
తలఁగినాఁడ ననియె ధవుఁ డంచు నెదఁ గూర్మి పొలియఁ గోపగింపఁబోకుమమ్మ!
యిట్టి నీదుశీల మిందఱ రావించు నురవు నరయఁగాక యెరవు గలదె. ౩౭౫
క॥ నీహిత మెంచియ యిట్టి సమీహితమున కీవు చేర ననీదృశుఁడు విభుం
డూహించి యూరకుండెను సాహిత్యము వెలసెఁగాదె సతి! యీకృతిచేన్. ౩౭౬
క॥ సుభ్రూ! పతిశుశ్రూషణ మభ్రంశముగాఁ బొనర్పు మతఁ డీశ్వరుఁ డం
చభ్రేష మగును ధర్మం బభ్రంకష యగును గీర్తి యమలాకృతి నై. ౩౭౭
తే॥ ఏను నీ కిట్లు దెలుపంగ నిచ్చమెయిన వచ్చినాఁడ నినుం గని మెచ్చినాఁడ
నమ్మ! చిరకాల మధిపు నెయ్యమ్ముఁ గాంచి మనుము నామాటమఱవక మహితవగుము.
క॥ అని తెలుప సిగ్గువెంపున వనితామణి మ్రొక్కి పాదల వారల నెల్లన్
గని బుజ్జగించి వీడ్కొని చనె జనపతి యింద్రలోకసదనంబున కున్. ౩౭౯
తే॥ రాము నామంత్రితునిఁ జేసి రహి రహింప నందఱును స్వస్వధామంబు లందఁగోర
నామహామహు నింద్రుఁ డయ్యదనునందుఁ జేరి కూరిమి మీఱ వీక్షించి పలికె.
ఉ॥ రామ! యమోఘదర్శనవిరాజితవృత్తుల మేము నీవు మా
సామివ వైన నీతలఁపు చక్కటి కర్జ మొనర్చు టొప్పుఁ ద్వ
త్కామిత మ్గుడింపు మిదె కంజభవాదులు మెత్తు రింతయుం
బ్రేముడిఁ బల్కు ప ల్కనుచుఁ బ్రీతి గణింపుము దేవ! నావుడున్. ౩౮౧
తే॥ లక్ష్మణుఁడు సీతయుం గేలు లాలితముగ మోడ్చినిలఁబడఁ దానింద్రు మోముగాంచి
రాముఁ డిట్లనె జగదభిరాముఁ డగుచు నెనరు నుడి రూపు గొనుసడి నివ్వటిల్ల. ౩౮౨

క॥ వదతాంవర! సర్వసుపర్వదయిత! యంతలుగఁ బ్రీతి వఱలెడునే ని
 య్యెదనున నీయున్నది ననుఁ బొదలించెడుఁగాత మించుపొలమున కెదురై. ౩౮౩
సీ॥ ఎచ్చటెచ్చట నున్న యిందఱు నీవెంట గుమిగాఁగ నొక్కటఁ గూడినారు
 దారపుత్రాదులఁ దగ వెన్న కెడలి యిక్కార్జంబు వలనెంచి కడఁగినారు
 కడుఁబరాక్రాంతులై కడలిఁ గట్టుట మున్నుగా నెల్లెడలఁ దార గ్రాలినారు
 మత్ప్రియార్థము మిత్తిమాట దలంపక యాజి శత్రువులపై నడరినారు
 కూటరాక్షసముద్గరకోటిదవులఁ బెనఁగి యుడివోక యుసుఱు లర్పించినారు
 వానరులు వీరు నీకృప వఱల మఱల జీవితము లొంది నెగడంగఁజేయుమయ్య.
క॥ మనియున్నవార లైనను జనితశ్రమము లగుచు నంగసంధు లెడల నె
 ట్టనఁ గ్రాలఁజాల రేర్పడ ఘనసత్త్వులఁ జేసి మనుపఁగాఁజను దేవా. ౩౮౫
ఉ॥ నెక్కొని వీరు నిర్వ్రణులు నీరుజులుం బలపౌరుషాఢ్యులుం
 జక్కని నేరుము ల్లనుచు సంయమము ల్దగఁ బేర్చువారునై
 యెక్కుడుసంపదం బొదల నేఁ గనఁగోరుచునున్నవాఁడఁ బెం
 పెక్కిన నీప్రసాదమున కియ్యది యూ వర మీయవే హరీ. ౩౮౬
ఆ॥ ఎట్టికాలమందు నేని ముఖ్యము లగు మూలములు ఫలములు మొనయుచుండ
 నేఱు లించునీరు లెడలకయుండంగ వలయు వీర లెనయు వలనులందు. ౩౮౭
క॥ ఇదియును నిట్టులుగా నీయెదఁ దలఁపుము నాఁగ నింద్రుఁ డెఱిఁగి ముదమునం
 బొదలంగ రఘువీరునితో నదనున నిట్లనె ధరాధరాధిపతనయా. ౩౮౮

—♦ ఇంద్రవరమున రామకింకరులెల్ల సజీవులు సబలులు నగుట ♦—

చ॥ అనుపమ మీవరంబు మహితాత్మక యెట్టిదయేని నీవు గో
 రిన నెడసేయువాఁడ నెటు ప్రీతి ఘటించెద నంటిఁగాదె యే
 యనువున నేని నొండనఁగ నయ్యెనె నానుడి కూర్తు నట్టులే
 ఘనరససారవృష్టిపదకల్పిత దృష్టి యెలర్చుచుండఁగాఁ. ౩౮౯
సీ॥ అసురాస్త్రహతులైన హరు లెలుంగులు గూడ నిపుడె జీవితులయి యెనయువారు
 కృత్తబాహులు విసికృత్తాస్యులును నగు వార లన్నియు నొప్ప వఱలువారు
 నిర్వ్రణగదు లౌచు నెగడొంది బలపౌరుషాఢ్యులై యెల్లరు నలరువారు
 సుప్తప్రబుద్ధుల చొప్పున నెలకొని యెల్లబాంధవులతో నెలయువారు
 మఱియు నీకుఁ గోర్కె నెఱి వీరు నెక్కొనుచోటు లన్నియుం బ్రసూనఫలస
 మృద్ధవృక్షమూలహితరసోల్లసితనదీకములుగ నెదలఁ దివియు రామ.
మ॥ అనుచో నిద్దుర వీడి మేల్కొనినయట్లై యందఱుం దేఱి యొ
 య్యన రాముం గని మ్రొక్కి రెట్టి దిది యూహా యంచు స్మేరాస్యులై

ఘనహర్షంబునఁ దేలి యబ్రపడుచుం గల్యాణధాము న్మహేం
ద్రునిఁ గీర్తింపఁదొడంగి రిచ్చగొను నాహూఢిం త్రిలోకార్చితా. ౩౯౧

తే॥ అట్లు పరిపూరితార్థు మహాత్ము నాదయాశరధి దాశరథిఁ గాంచి యంతవట్టు
దనరు సురనాయకుఁడు సురోత్తములు ననుచు సంస్తుతులు వన్ని గొనములచాల్పు

క॥ స్తోత్రార్హుఁ డావిభుఁడు సౌమిత్రియుతుం డలరుచుండ మే లెంచుచు ని [లెన్న.
ట్లత్రాసు లగుచు నొడివిరి సుత్రాణుఁడ వైతి దనుజసూదన యనుచున్. ౩౯౩

సీ॥ హెచ్చు మత్స్యాకృతి ముచ్చురక్కసు ద్రచ్చి పెనుబల్కు లజున కర్పించితికద
తామేటిరూపునఁ దరికొండ వీపునఁ దార్చి సంద్రంబొంట ద్రచ్చితికద
మొఱకుల మొఱఁగ నా మోహనాకృతిఁ దల్లి పేర్మి మా కన్నంబు బెట్టితికద
నీటఁ ద్రొక్కు దురాత్మునిం ద్రెవ్వ దంష్ట్రి వై దంష్ట్రఁ బంటవలంతిఁ దాల్చితికద
పట్టి విష్ణుధర్మ్యుఁ బట్టి బాధించుచుఁ జూపు మిచట నీదు సొబగు కాని
నోరి! యని యదల్చు నోజ నరహరి వగుచుఁ దోఁచి యసురు నడఁచితికద.

ఆ॥ వేల్పులమ్మ నోము వ్రేగున కాన్పునఁ బొట్టిపట్టి వగుచుఁ బొడవుసూపి
బలి నడంచితికద పాతాళగుహ సేర్చి యింద్రునకు స్వరాజ్య మీయమున్న.

క॥ మత్తు లగు భూమిపతుల నికృత్తులఁ జేయుకృతి మహిత కేళీపరతం
జొత్తిల్లితివి కుఠారోపాత్తతదీయాస్రనదుల నధిరాముఁడ వై. ౩౯౬

మ॥ రఘురామేంద్రుఁడ వై తనర్చితివి శ్రీరామామణిం గొంచు ని
ట్లఘుకారిం ద్రిదశారి రావణు నని న్వ్యాపన్నునిం జేయ నై
మఘువుం దేర్చితి మమ్ము మన్చితి మునిమ్లానత్వము న్మాన్చి తెం
దు ఘనం బీయభిరూపరూప మఖిలస్తోత్రార్హసాభ్యర్హణా. ౩౯౭

సీ॥ తొలఁగించితివి మానితో నేగి జన్నంబుకొలఁ బలాశుల నొంటఁ గూలనేసి
చేపట్టితివి తోన శివు వింటిపై బీర మడరించి యిమ్మేటిఁ బుడమికన్నెఁ
దఱిసితి వనసీమఁ దపసుల మొఱలెంచి యభయం బొసంగ నా నాదరమున
ననువుసూపితి దండకారణ్యము తతాసురము నోలి నిష్కంటకముగఁ జేసి
తార మగనిఁ బెరల్చితి ధర్మ్మ వరసి క్రోఁతిపిండుల నేలంగఁ గొలిపి తినజు
నందఱం గొని మున్నీట నడ్డుకట్ట గట్టి కట్టిడిఁ బౌలస్త్యు మట్టితభవ. ౩౯౮

క॥ పగవాని తమ్ము రక్కసు నగణితబలు నేలి యర్థి నధిరాజ్యశ్రీ
కగపడఁ జేసితి నీదగు తెగువ నుతింపందరంబె దివ్యార్చ్యపదా. ౩౯౯

ఉ॥ మానవమూర్తిఁ దోఁచి తను మాటయె బూఁట యొనర్చు తెన్నునన్
మానెఱిఁ బెద్దసేసి తతిమానుషలీలఁ దనర్చు నీకు మే
మానలి దీర్చువారము వరార్థనపూరణము ల్దలంప ని
న్మానితవృత్తిఁ గొల్చుకతన న్సమకూరెన కాక రాఘవా. ౪౦౦

ఉ॥ ఆ లలనం బొనర్చిన తెఱంగునఁ జిచ్చుఱకంటిసామి వి
ల్లాలము సేసి త్రెంచి యిడు నప్పటికప్పుడు కాకిదుండగీఁ
డోల మటంచు ముప్పాలము లోటఁ గ్రమించిన పూట వారిధిం
గోలకుఁ దెచ్చునాఁ డెవరిఁ గోరితి సాయ మధోక్షజా! హరీ! ౪౦౧

సీ॥ పొ మ్మయోధ్యకు నీదు పోలమ కాదె మహాత్మ! వీరాగ్రగణ్య! యుదారభావ!
భావనాదూర! నీపత్ని నూఱడిలంగఁ బలుకవే యనురక్తఁ బాడినెఱయ
వానరోత్తముల నీహారలం దగ నామతించి యన్నవె ప్రీతి నించి పొసఁగ
నందఱఁ దల్లుల హర్షమూణలఁ జేయు మలఘు శత్రుఘ్ను నెయ్యమునఁ గనుము
వ్రతముఁ బూని యున్నవాఁడు ని న్నాసిన నాఁటఁగోలె నెవఁడు నందితాత్ముఁ
డాసమెయినిఁ ద్వత్పదార్చ లొనర్చుచు నట్టిభరతుఁ దనుపు మాదరమున. ౪౦౨

క॥ ప్రాకటజగతీరాజ్యశ్రీకై పట్టాభిషేకసిద్ధిం గొని నీ
వా కల నుపలాలింపు ముదాకలనం దనరఁ బౌరు లందఱు నొకటన్. ౪౦౩

ఆ॥ అనుచు నొప్పఁబలికి యనుజాఘ్యు రాము నామంత్రణం బొనర్చి మనము లలర
మలయు సూర్యనిభవిమానరాజములపై నమరి దివికిఁ బోయి రమరు లార్య.

తే॥ వందనాభినందనము లవ్వాలనునందుఁ బొనరఁ ద్రిదశోత్తముల నట్లు పోవఁబనిచి
లక్ష్మణునితోడి సల్లాపలాలనంబు లొప్ప నప్పుణ్యరాశి తా నోజ మెఱసె.

చ॥ వసతి కనుజ్ఞ సేయఁ బరివారము తోరము గాఁగ నెద్దియున్
విస్మృమరవృత్తిఁ గూర్పఁ దగు వేసము లొప్పఁగ నెల్లరుం బ్రశాం
తిసలలితప్రచారసుఖదీవ్యదుదారరమాసమేతు లై
పొసఁగి రిఁకెందు నేని సరిపోలద యమ్మెయి పొందు సుందరీ. ౪౦౪

—♦ సపరివారుఁ డగు శ్రీరాముని సుఖనివేశము. ♦—

తే॥ రామలక్ష్మణపోషణభ్రాజమాన యామహాసేన హృష్ట జనార్చ్యమాన
శ్రీయశోనూన యానిశఁ జెలువుగాంచెఁ బూర్ణచంద్రనిశాకలాస్ఫురణ తనర.

ఉ॥ ఆనికపూనిక ల్దనర నందఱుఁ గూర్చు కథాళి జానకీ
జాని యశఃప్రతాపముల సంగతిమైఁ బెనుపొందఁ బ్రాంచిత
శ్రీ నెగడం దదేకరససిద్ధి తలిర్చెను సానుభావ యై
మానితసాత్త్వికాకలన మంజులవాణి యథాక్రమంబుగన్. ౪౦౫

క॥ ఆనందముపై నందం బానం దమ నిండువృత్తు లలరారంగన్
సూనములఁ దేనియలు నాఁ గానంబడె నచటివారి కనుల ముదశ్రుల్. ౪౦౬

సీ॥ తనవడ్డబన్నము ల్దార్కొనఁ జేయఁగా రామి నాథు సుఖాంబురాశి నోడువ
నభిమానహాని కే మనఁగూడ దని ప్రియు మన్నన ల్చెలు లట్లు మలసి తెలుప

మాలిన్యకృశతల మలంచి వచ్చితి మని హృష్టిపుష్టులు సేరి యెలమిఁజూప
సిరితోడి దానె యీ సిగ్గు మొగ్గను మేల్మి సింగారపుంగల్మి చెవికిఁ దార్ప
రాము నంక మెనసి రాణ మీఱంగ ధరాజ సతి విదేహరాజతనయ
మేటి శుభసమృద్ధి మెయిఁగొన నెక్కొనె సకలలోకపాళి సంతసింప. ౪౧౦

క॥ ముచ్చటలు మురువు లొఱపుం బెచ్చులు నిర్ధారణములు ప్రేరణలుఁ దగన్
బొచ్చె మనరాని కూరిమి సచ్చరితులు మెఱసి రపుడు సతియుం బతియున్.

క॥ రాముఁడు నిఖిలసపత్నవిరాముఁడు హితజనమనోభిరాముఁడు మహిజా
రాముఁడు ప్రసన్నకల్పారాముఁడు సుఖనిద్రఁజేసె రామామణిరో! ౪౧౧

తే॥ వింటివా మేనకాత్మజ! విశ్రుతంబు రామచరితామృతంబు నిరామయంబు
గొంటివా శుభయుక్తి సేకూర వెలయఁ గంటివా చిత్తవృత్తుల కలఁక వాయ.

క॥ అని పరమేశ్వరుఁ డెఱిఁగించిన విని శర్వాణి యభవ! శ్రీజానికథం
దనివోదు చిత్త మింకిట ననువృత్తకథాంశ మెలమి నానతి యీవే. ౪౧౨

వ॥ అనుచుం బ్రార్థించుటయు. ౪౧౩

ఉ॥ ఆగమయోగనిత్య నిగమాంతసుసంభృతతత్త్వసార! వి
ద్యాగమమూలనైజచరణాంబురుహస్మరణప్రచార! హృ
ద్రోగశమక్షమైకరసరూఢమహాసమయప్రసార! సం
త్యాగిజనాత్మరూపమహితత్త్వసమాకలనప్రకారకా. ౪౧౪

క॥ పారాశర్యవచోఽమృతసారామలవృష్టిపుష్టిశమితవివేక
ప్రారంభహరణచణసంసారదవానలజనాత్మసంశ్రయణపరా! ౪౧౫

మాలిని॥ నవవిలసితయోగానందలక్ష్మీవిలాస
ప్రవణమననసంపద్భ్రాజమానాత్మరూపా!
వ్యవహితపరతత్త్వావ్యక్తసన్మానితోద్య
ద్భవతిమిరపదాంతఃపాపనాశప్రదీపా! ౪౧౬

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్య మహితాత్రేయగోత్రపవిత్ర హనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు నుత్తరభాగంబునం
బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథాఽమృతము

## యుద్ధకాండము

### ఉత్తరభాగము

## ద్వితీయాశ్వాసము



సాన్నిధ్యవిశేషో
ద్భాసివికాసాప్రమేయబహుశుభగుణల
క్ష్మీసంప్రదాయకలనా
ప్రాసంగికవిశ్వరూపభర ! పరమేశా !

ఆ॥ అవధరింపు మభవ యట్లు దన్నడిగినచెలువ కార్య కిట్లు చెప్పఁదొడఁగె
శివుఁడు వినుము దేవి! శ్రీరాముఁ డా రఘురాము చరిత మఖిలరంజకమ్ము. ౨

ఉ॥ వానర సైన్యసాగరము వర్ధిల సర్వసుపర్వులున్ సుఖ
శ్రీ నలువొందినార మని చెప్పఁగ నొప్పగు రీతి ఖ్యాతి తా
నానెడిఁ జంద్రికాప్రకృత మై జగదంచితలీల దిక్తటం
బానఁగ రామచంద్రుఁ డిభవాఢ్యత మీఱెఁ గవుల్నుతింపఁగాన్. 3

ఆ॥ రాత్రియెల్ల సౌఖ్యరాశి నానొప్పారెఁ జంద్రుకృతికి రాజచంద్రుఁ డొకఁడె
చాలు నన్నరీతి సంస్మరింపఁగఁజేయనగుచు వృత్తవర్తనాప్తి నగుచు. ౪

మ॥ కల మే లెంతయుఁ జూడఁగంటిఁ ద్రిజగత్కల్యాణి క్షోణీజ ము
త్కలనన్ రాముని సన్నిధిం గొనె జయస్థానోదితశ్రీ యనన్
గల దొక్కం డిఁక నాదుకన్నులకు సత్కారం బొనర్పంగ నా
వల నూహం బురిసేర్చి కాంతు ననుచున్ వ్యాకోచచిత్తాబ్జుఁడై. ౫

ఆ॥ పద్మబాంధవుండు భవ్యాత్ముఁ డుదయింప లోఁ దలంచునంతలోనె రాముఁ
జేరి కౌతుకమునఁ జేసె విజ్ఞాపనం బావిభీషణుఁడు మహామహుండు. ౬

—♦ విభీషణుఁడు శ్రీరామచంద్రు రాజోపచారములఁ బూజించె ననుట ♦—

క॥ వైతాళికులుం దాను ననేతాదృశవిభవ మిట్లిదే యనుకొనుచున్
బూతవచస్స్తుతి రాఘవు శ్రీతరుణీశుం బ్రబుద్ధుఁ జేసిరి తరుణీ ! ౭
సీ॥ తొలి బాలమున్నీటి తెలిదీవి ఫణిశయ్య మించు వేలుపుమిన్న ! మేలుకొనుము
బంతితేర్లదొరఁ గేర్పడ జన్న మిడిన యెమ్మెల పాయసాన్నంబ ! మేలుకొనుము
కోసలాత్మజ యిచ్చ గూర్చి పేర్చిన వ్రతామృతసారగర్భంబ ! మేలుకొనుము
రాపుట్టుపాఱు నిరాబారి వేలిమి మెఱయించిన మహాజ్ఞ ! మేలుకొనుము
చిచ్చుకంటి వింటిచేవ దొలంచిన మేటి పౌరుషంబ ! మేలుకొనుము
పుడమిగన్న కాన్పుపున్నెంపు సిరి గన్నె నేలుకొన్న యన్న ! మేలుకొనుము.
తే॥ రాచవారికొలంబున రాణ నెఱపు తలఁపునను భార్గవుని దెసఁ దప్పు మోపి
తతఁడు శర ణన్నఁ గాచితి వజిత నీకు వేఱొకని మేలుకొలుపుల వెరవు వలెనె.
క॥ ఏలితి వేల్పుల నెఱుకని నేలితి తపసులను గపుల నేలితి విటు మ
మ్మేలితి వింకట మనుజుల నేలంగావలదె కూర్కు టినునకు వలసే. ౧౦
క॥ జయ మెప్పుడుఁ గొనుము పరాజయ మాస్మాకం బెడల్చు చతురతరం బౌ
నయమున మేల్కొనియుండుము నయవేత్తవు గానె లోకనంద్యచరిత్రా ! ౧౧
చ॥ సుఖశయనం బొనర్చితె ? విశుద్ధమనస్కత నొప్పితే ? జగం
బఖిలము పాల్య మింక నని యంచితబుద్ధిఁ దలంచితే ? స్వస
మ్ముఖ మిడరాదె ? వీరి కయిమోడ్పులు గైకొనుటొప్పదే ? త్వదు
న్ముఖులు భరింపఁజూచు బలునోముల పంటవ కావె రాఘవా. ౧౨
మ॥ భవదాజ్ఞాకలన న్మెలంగ నగుచున్ బ్రాజ్ఞు ల్సువిఖ్యాతు లౌ
కవులుం గాయకవైణికప్రభృతులుం గల్యాణమూర్తీ ! మహో
త్సవ మొప్పన్ సమకూర్పవచ్చి రిదె త్వత్సాంద్రదాపత్రంద్రామల
త్వవిశేషోన్నతకీర్తిచంద్రికల చెల్వం బిందు రూపింపవే. ౧౩
సీ॥ కాల్యకృత్యంబులఁ గైకొనవే నీదు పరవున కివ్వారు వచ్చినారు
మహితప్రశస్తి సన్మానింపవే వేఁచి మంగళగాయను ల్మలసినారు
పాద్యార్ఘ్యముఖ్యము ల్పాటించు కొంచవే త్వద్భక్తు లిందఱు దఱిసినారు
కప్రంపుటారతి గని సేస లెనయవే పుణ్యాంగనలు ప్రీతిఁ బొరసినారు
మేలి సంపంగినూనియ ల్మెఱుఁగుపిండ్లు జెలివిమై నేర్చి సుందరు లెద్దెచ్చినారు
శోభనస్నాన మొనరింపఁజూడుమయ్య! నామనోరథములు ఫలోన్నతి వహింప.

క॥ జతనమొయిఁ దెచ్చినా రిదె రతనపుఁబీఁటపయిఁ జెలువు రాణబూనఁగ నీ
యతులితవిభవం బెసఁగఁగఁ గుతుకంబునఁ గాంతు మధిప! కూర్చుండఁగదే.

తే॥ మొదల మధుపర్కముంగొని ముగ్ధమూర్తి! యవలఁబంచామృతోక్షితం బాదరించి
మొనసి గొజ్జఁగనీటిమజ్జనముఁ బ్రీతి మజ్జనము గూర్ప సుఖవృత్తి మలయఁగనుము.

తే॥ అట్లు శుద్ధోదకస్నాన మవధరించి యాచరింపుము ధృతి సమ్యగాచమనము
మహీకుమారికతోడ లక్ష్మణునితోడఁ బరిజనముతోడ నైన యుప్పరిధవమున. ౧౭

ఉ॥ డం బెసఁగంగ జింగులఁ గడానిబెడంగు మెఱుంగు లీను తో
రం బగు వస్త్రయుగ్మము విరాజితహాటకయజ్ఞసూత్రముల్
పం బెడు రత్నభాసమితి భాసిలు భూషలు కల్పసూనదా
మంబులు నాయెడం గలుగు మాలిమి సొంపలరారఁ దాల్పవే. ౧౮

క॥ చందన మలందెదను శ్రితచందన! నాకల్కమెడల సన్మునిసురసం
క్రందనవందిత! కస్తురి పొందిక ముఖరేఖ తీర్పు పొసఁగఁగ మేనన్. ౧౯

ఆ॥ పూలపూజ గొనుము పుణ్యంపురాశి! మాపాలిభాగ్యమా! గుణాలయంబ!
మైథిలీమనోబ్జమార్తండ! దర్పకదర్పహరణసంవిధానధామ! ౨౦

తే॥ సహజబంధురపరిమళస్నిగ్ధకాంతిపుంజమంజులతర మాత్మఁ బొరి నలర్తు
దివ్యగంధాఢ్యసద్గుణోదీర్ణధూపధూమమంజిమమున శుభనామ! రామ! ౨౧

తే॥ కప్పురపు మేలి దీపము ల్కలితరత్నదీపములు స్నేహగంధిలదీపములును
మ్రోల వెలయించి నీదగు మూర్తికలనఁగాంతు మదివెంగఁ గన్నుల కఱవుదీఱ.

క॥ వివిధోపహారంబులు సవిధంబునఁ జేరి మ్రొక్కి సంతర్పణ మొ
ప్పవు రీతి సమర్పించెదఁ బవిధరవందితపదాబ్జ పరిపంథిహరా! ౨౩

క॥ సప్తాన్నబ్రాహ్మణనుత! సప్తాశ్వకులప్రదీప! సకలాత్మక! మ
త్ప్రాప్తసరసాన్నములఁ గొని తృప్తి వహింపవె కృతార్థదేహుఁడ నౌదున్. ౨౪

తే॥ పచ్చకర్పంపుఁబొడుల సంభావ్యము లగు పచ్చిపోఁకల కలనలఁ బరువ మొలయ
వెలయ తెలియాకుమడుపులువిహితచూర్ణవివిధవస్తుసమేతము ల్విభుఁడ! కొనుము.

క॥ నీరాజన లేర్పఱిచెద రా రాజీవాక్షు లెలమి నరయవలవదే
సారాగమతత్త్వవిచారా! రాణం దనరు త్వచ్చరణపద్మంబుల్. ౨౬

ఆ॥ కలితభక్తిపూర్వకముగఁ బ్రదక్షిణనతులు గూర్తు మేను నాజనములు
పూజనము దలిర్పఁ బుష్పాంజలులతో నుపాయనములు సేర్చి శ్రేయ మెనయ.

మ॥ అపరాధక్షమ మర్థి వేఁడెద భవద్వ్యాసంగవశ్యుండనై
విపరీతంబులు కొన్ని మున్నొనవవే వేయేల సంసారబం
ధపరీతాత్ముఁడు నిన్నుఁ గొల్వక దరిం దాఁ జేరునే విశ్వమూ
ర్తి! పరానందరసస్వరూప! మహితశ్రీ! జానకీనాయకా! ౨౮

క॥ రక్కసికోలమునఁ బొడమితి రక్కసుఁడ భవాబ్ధికలితరంహోగతుఁడన్
దిక్కెడలితి నినుఁ జేరితి నక్కటికము పేర్మి నెట్టు లరసెదొ? రామా. ౨౯
ఆ॥ ప్రాప్తకాల మిదియ పాలింపు మత్ప్రాణ లంది లసదనుగ్రహంబు నెఱపు
మిట్టి విన్నపము రహిం గ్రహింపుము నిన్నె వేఁడువాఁడ గడమ వీడువాఁడ. ౩౦

శ్రీరాముఁడు భరతుని గానక దీక్ష వీడననుట

క॥ అని పలుగొనఁ గాకుత్థ్సుం డనితరుని విభీషణుని మహామోదమునన్
దనరుచుఁ బొదివి సుతత్త్వం బనఁ దగు నిజవాక్యకలన ననె నిట్లనుచున్. ౩౧
తే॥ నిన్నెఱుంగుదు నీదగు నెమ్మి నేర్మి నెఱియును నెఱుంగుదును సువినీతమతి వ
నన్యుఁడవు సుమ్ము నాకు మహానుభావ! నీయెడ రహించు నామది నిక్కమెప్పుడు.
క॥ నీపాటివార లే రెవ్వరు లోపాలస్యకులదీప! యొఱపౌ ధర్మం
బీపగిది రూపెనసె బలె యోపితి ప్రహ్లాదుఁ బోల నొం డననేలా. ౩౩
ఆ॥ మత్ప్రియన్ను లెల్ల మనవార లే నీకు సందియంబు వలదు సౌమ్య! వేగ
హరివిభుప్రముఖుల నామంత్రణ మొనర్పు మదియ నాకుఁ దృప్తి నావహించు.
సీ॥ నను నిచ్చ మది నిల్పి నాకై వ్రతంబూని యున్నాఁ డనుజుఁడు సుఖోచితుండు
సుకుమారమూర్తి సుశ్రుతుఁడు రూపెనసిన ధర్మంబు కొఱలేని దయ గలండు
భరతకుమారుండు ప్రబలుండు తేజస్వి కైక కా న్పొనసిన కల్పతరువు
సత్యసంశ్రవుఁడు ప్రసన్నుండు మునిజనస్తుత్యుండు హితవాది సూనృతుండు
ప్రతిన వట్టినాఁడు పదునాలుగేండ్లు పూర్ణైననాఁడు నీపదాబ్జయుగముఁ
గనుల నద్దుకున్నఁ గాల్తుఁ జిచ్చున మే నటంచుఁ దగు నె వాని నరయునతనికి. ౩౪
మ॥ అనఘాత్మన్ బహుసమ్మతు న్మహితు నే నన్వాసి వీక్షింప కె
ట్లను మోదించెద భోగ్యభోగముల నెయ్యం బొనె ఁయయ్యర్ఘ్య మా
తనికిం గాని ముదం బదేల తనువుం దానంబు పానంబు నో
య్యనఁ దత్సంగతి నందియున్న యవి తథ్యం బేను వాక్రుచ్చితిన్. ౩౫
తే॥ ఇయ్యదియె మార్గ మిద్దాని నెనసి పురికి నాయయోధ్యకుఁ బోయెదనయ్య యింక
దూరదూరం బదియు నెల్లి సేరవలయు నితర వాంఛల కిర వున్నదే? మహాత్మ! ౩౬
చ॥ పురి సొరఁబాఱ కెందు ముని పొందిక నొందితి నిన్నినాళ్ళు నా
వరగుణుఁ జేర కీవ్రతము వారణసేయఁగ నేర నన్ను నీ
దరిఁ జరియించువానిఁగ నెదం దలపోయుము పోయివత్తు నే
యొరవు దలంప కూఱడిలి యేలుము రాక్షసరాజ్య మేర్పడన్. ౩౭
క॥ అని రాముఁ డానతిచ్చిన విని సుమతి విభీషణుండు విహిత మరసి యి
ట్లని పలికె రాఘవునితో వినయము నయ మయముఁ బెరసి వెలయుచునుండన్.

చ॥ మనవిని విందె మన్ననకు మార్కొనఁ జేయుదె నన్ను రామ! ని
న్ననిశము గొల్చియుండఁ దగునట్టిఁడ ని క్లెడ కోర్చి యానతిన్
విని యొకనాఁడయేని విధి విన్నను వొప్పఁగఁ బూజసేయఁగా
మనమున నెంచినాఁడ నధిమానుషమూర్తి! సుమాళ మేర్పడన్. ౪౦

సీ॥ ఒకపూటలోనె నిన్నోలిమిమెయి నయోధ్యాపురిఁ జేర్పంగఁ దలఁచినాఁడ
బుష్పకం బున్నది పూజ్యమానవిమాన మసమాన మది దేవతాత్మకంబు
కామయానరవిప్రకాశసౌందర్యసౌభాగ్యంబు లానెంటఁ బరఁగుచుండుఁ
బెద్దన్న నర్చ్యుఁ గుబేరు గెల్చి బలాత్కరించి రావణుఁడు హరించినాఁడు
నెమ్మిమీఱ దాని నీకయి వీడ్కొల్ప నునిచినాఁడ నింత కోమహాత్మ!
భవదనుజ్ఞ వడసి పాటింతు నిందఱఁ జేర్చు తెఱఁగుసేసి సిద్ధిఁగాంచి. ౪౧

క॥ అవికల్పస్ఫురణా! నీ నవికల్పస్థితిఁ దనర్తు వందఱతోడన్
బవిధారి విమానము ఘాపపిధానము సూపు దీనఁ బయనముఁ గూర్పన్. ౪౨

ఉ॥ నాదెస నున్న సౌహృదము నాదు గుణమ్ముల నెన్ను పేర్మియున్
నాదగు భాగ్యమైన జననంద్య మనుగ్రహమున్ స్మరించి య
ట్లే దయసేయు మీవిహితు లిందఱతో సకతోఁ గుమారుతో
నోదయితా! యహం బిచట నుండి యటం బయనం బొనర్పఁగన్. ౪౩

మ॥ సకలార్థంబుల స్వర్చితుండ వగుచున్ సౌముఖ్య మొప్పార న
న్నకలంకాత్మునిఁ జేసి లంకఁ గల నాయంశమ్ము వారెల్ల నీ
ప్రకటశ్రీపదపద్మముం గొలువ సంభావించి నేఁ డోర్చి వే
డుకమై నెల్లి చనంగ నౌ జతన మెట్లుం బోలదే రాఘవా. ౪౪

తే॥ ప్రీతియుక్తుండ నైతి నాపెనుపుఁగోరి యెల్లరంగూడి సత్క్రియ లెనయఁగనుము
కూర్చుకింకరుఁడని నన్నుఁ గూర్చుకొనుముచన వొసంగు మివ్విధముప్రసాద మొలయ.

తే॥ నాపలుకు వింపు వనియెడు నమ్మకమున నీదు మహితయా బహుమాననిరతివలన
సౌహృదమ్మున నిన్నుఁ బ్రసన్నుఁ జేయ నమరినాఁడఁ బ్రేష్యుఁడ నీ కనంతవిభవ.

క॥ ఆజ్ఞాపించుట గా దిది విజ్ఞాపన మయ్య రామ విధిముఖనుత సం
ప్రజ్ఞానమూర్తి మామక మజ్ఞానము దొలఁచి ప్రోవుమా వేఁడు నెఱిన్. ౪౫

చ॥ అనుచు విభీషణుం డడుగ నందఱు రక్కసు లెల్ల వానరుల్
వినతివినమ్రులై వినఁ బ్రవీణుఁడు రాముఁడు వల్కె నింత కో
యనఘుఁడ తెల్పినాఁడఁ గల యర్థము నీమది నాఁటఁ బూఁట కే
మన మలరింప కొం డయిన మాట దలంచి వచించినాఁడనే. ౪౬

సీ॥ ఇట్లైనవిధిచేతనేఁ బూజితుఁడ నైతి సౌమ్య సాచివ్యంబు జరిపినాఁడ
వెదచేష్ట తెలమియు నేఁకట చెలిమియు నేకంబ కా వాక్కు నెనసి వెలయ

నర్థించి తిట్టి నీయర్థంబు సర్వోత్తమోత్తమం బనఁ జెల్లు నొంటిప లేదు
నీపలు కొనరింపకే పోవనెంచితి ననఁబోకు మంతయు నరసి కనుము
భరతుఁ జూడంగ మనము సత్వరము గాఁగ నతని ప్రతిసఁ దలంపఁ బిట్టార్తిపెడమ
నాకుఁ బురిఁ జొరఁగా రామి నాయమగుట నింతలు బెనంగెదను దను జేంద్ర తొడరి.
సీ॥ వనవాసమున కేను వచ్చు వాడెఱుఁగఁడు తాత రమ్మనఁ జని తడసినాఁడు
తండ్రిపోయిన వార్త దవుల ఘోషించుచు దరలినాఁ డిలుసొచ్చి తెరలినాడు
తల్లి దూషించి సత్కర్మము ల్దండ్రికిఁ బొనరించి ననుఁ గాంచ బొరసినాడు
చిత్రకూట మ్మట్లు సేరి నెమ్మది వెంగ గ్రాలి నాయడుగుల వ్రాలినాఁడు
శిరము గదియంగ మ్రొక్కి యాచించినాఁడు పెద్దలగు వారిచేతఁ జెప్పించినాఁడు
విసివి ప్రాయోపవేశాప్తి వెలసినాఁడు తెలిసి నేఁ దేర్ప నెట్టన మలసినాఁడు. ౫౦
తే॥ గురుఁడు బోధింప నయ్యనవరగుణుండు కాని పనిసేయ నొల్లఁ డొంగాని వాని
పూనిక దెరల్చి వచ్చితిఁ బోరి మరల్చి తండ్రిసత్యంబె పాటించు తలఁపుదెలిపి.
ఆ॥ నాఁటఁగోలెఁ జొరఁడు నంద్యచరిత్రుండు పురము వ్రతవిశేషభరముతోడఁ
గెలనిపల్లెసేరి కలగుండుపడుచున్నవాఁడు నాదురాక వల నరయుచు. ౫౨
క॥ పాదుకలం గొనిచనె నామీఁదనె మదినిలిపితనదు మెలకువ రాజ్యం
బూడియుఁ దద్వశతనె ప్రతిపాదించును గడువుచన విపద్దశఁ బొరయున్. ౫౩
క॥ అది యొక శల్యము గతి నామది నాఁటినయది మహాత్మ! మాటాడకు మి
య్యదనున వానిం దల్లుల విదితుల గురులఁ బురజనుల వే గనవలయున్. ౫౪
క॥ పనులెల్లఁదీర్చి యాతనిపనిఁ దలఁపక యిచట నునికి పాడియె నా క
వ్వినిపాత మెంచి కాకీ పనిచెద నెల్లి యన నొక్కఁ డనునట్టిఁడనే. ౫౫
ఆ॥ అనుమతింపుమయ్య యన్న! నాదుప్రయాణ మావిమానరాజ మందఁజేసి
కోపగింపవలదు గుణరత్ననిధి! యిట్లు వేఁడు నాదునుడుల వెరవెఱిఁగి. ౫౬
క॥ అను రామచంద్రు పలుకుల ననుమోదించి చని రాక్షసాధిపుఁ డపుడే
మొనయించెఁ బుష్పకాఖ్యం బనుపమితము దివ్యయాన మాతఁడు మెచ్చన్.
సీ॥ కాంచనమణిరోగకలితాంగములతోడఁ బ్రకటవైదూర్యవేదికలతోడఁ
గూటయంత్రాగారకుట్టిమంబులతోడ హైమపద్మవిభూషణాళితోడ
ధ్వజపతాకాహర్మ్యవరజాలములతోడ విమలముక్తాగవాక్షములతోడ
ఘంటికాకింకిణీకలరవంబులతోడ తతగోపురద్వారతతులతోడ
స్ఫటికమాణిక్యతలవరాసనమహార్హ శయనమహితాస్తరణవిశేషములతోడ
నొప్పు నప్పుష్పకముఁ గాంచి యుల్లసిల్లె రాముఁ డధిసాధువచనాభిరాముఁడగుచు.
ఆ॥ విశ్వకర్మ తనదు వెరవుమై నిర్మించె మేరుశిఖరరూపమేలనమున
స్వర్గపురము దీని సరిపోల దను నట్లు తన్మనోరథము రథమ్ము గాఁగ. ౫౭

తే॥ సూర్యమండలతేజమ్మొ సురుచిరమ్మొ చంద్రబింబవిశేషప్రసాదభరిత
మనిలవేగమ్మొ కామరూపాంచితమ్మొ సానుభావమ్మొనా వ్యోమయాన మొప్పె.
క॥ త్వరితుం డగుచు విభీషణుఁ డరుసంబున దాని విభున కర్పించి ప్రబం
ధరుచిరపదవాగ్గుంభన యిరవుకొనఁగఁ గేలుమోడ్చి యి ట్లని పలికెన్. ౬౧
సీ॥ పుష్పకం బిది పుష్పపూజితం బనిశంబు దేవతాత్మతోఁ బ్రజీవితంబు
ధృష్టు లౌ విద్విషు ల్తేఱిచూడఁగ నేర రప్రధృష్యప్రభావాంచితంబు
త్రైలోక్యసంచారదక్ష మియ్యది దీనఁ జొచ్చువారికి లేవు క్షుత్పిపాస
లమృతహ్రదంబుల నమరియున్నది మనోజవమున నెదియును సాటిరాదు
పుణ్యమూర్తు లిమ్మేటిపైఁ బూనఁగువార లెందఱకు నేని నవకాశమెనయఁజేయు
చుండు నిండుమనంబున నోజ మొప్పఁ గైకొనుము దీనిఁ గల్యాణకలితమూర్తి.
క॥ అంకిలి లే కిదియు భవత్కైంకర్యము వంక మెలఁగుఁ గాళఁ గన్పడె ని
ట్లింకిటఁ బొనర్ప నగు నది యంకసదుఁడ నన్ను మనుప నానతి యీవే. ౬౩
చ॥ అనిన విమర్శనం బెసఁగ నామహితాత్ముఁడు రాఘవుండు దా
ననిమొను లక్ష్మణుం డుచిత మౌ నని ప్రీతిమెయి న్వినంగ స్నే
హనిభృతవృత్తి సంస్కృత మహంకృతిదూరము గాఁగ వత్సల
త్వనిరతుఁ డీతఁడే యనుచుఁ దత్పరత న్మర లుబ్బియాడఁగాన్. ౬౪
సీ॥ అన్న విభీషణ యనువొప్ప నీ కేనుఁ దెలియంగ నగునది దెలుపువాఁడ
మానార్హు లెందు సన్మానింపఁబడి ప్రీతి నాకృతజ్ఞు గణింతు రనవరతము
దానసాంత్వప్రసాదవిహీనుఁ డై క్రోధహింసారతుం డగు నేలువాని
సంవిగ్ను లగుచు మెచ్చరు తఱి యొదవిన విడనాడుదురు ధృతి బడలుపడఁగ
సంగృహీతయుఁ ద్యాగియు సమయవిదుఁడు కీర్తిశాలి సానుక్రోశవర్తనుండు
నగు విభునిపాలివార లై యఖిలజనులు నుంచు రెవ్వేళఁ బొరపొచ్చె మొరయకుండ.

—♦ శ్రీరాముఁడు పుష్పకమునెక్కి యయోధ్య కరుగుట ♦—

ఉ॥ కావున నెల్లవానరులఁ గైకొని పూజ లొనర్పు మిత్రతన్
భావితయత్నకర్ములు విభాసితవీర్యులు సంస్తుతవ్రతుల్
ధీవరు లెల్లకృత్యములు దీర్చి రొకింత గొఱంత వెట్ట కే
నీ వను భేద మెన్నక మహేచ్ఛుల కిట్టిరఁ దేర్చు టొప్పదే. ౬౬
క॥ జితకాశులు వీర లనిర్జిత లంక జయించినారు జీవితభీతిన్
మతిఁ గొనరు హృష్టు లనివర్తితు లంచితకీర్తు లిట్టి ధీరులు గలరే. ౬౭
ఆ॥ ఇచ్చ వచ్చినట్టు లివ్వారి నర్చింపు మఖిలవస్తువాహనార్పణములు
పొసఁగ నిదియ నాదు పూజ నే మెచ్చెద వార లెల్ల గూర్చువారు నీకు. ౬౮

క॥ నీకై తెలిపితి నిట్లని యేకాంతప్రణిహితుండ పీ వౌట మహిం
ప్రాకట నై చెల్లన్వలె నీకారుణ్యా మన మొలసి నిర్మలచరితా. ౧౯

క॥ విభుఁ డవ్విధిఁ దెలుపఁగ నవ్విభీషణుఁడు సకలసైన్యవీరులఁ దత్త
త్ప్రభుల నరసి పూజించెను విభాగ మొప్పార మహితవివిధార్థములన్. ౨౦

ఆ॥ రాణఁ దనరు స్వర్ణ రాసులు వసనము ల్మణికిరీటముఖ్యమండనములు
ప్రవరచిత్రవస్తునివహంబులును దార్చె నతఁడు వారియంతరాత్మ లలర.

తే॥ అన్నియును రత్నమయములే హాటకోజ్జ్వలములై శయ్యాసనప్రముఖములు భాజ
నములువాహనములుమహోన్నతము లతఁడొసంగె సంప్రీతిమెయిఁ దత్ప్రసంగమునను

శా॥ పర్జన్యుండు మహార్హవృష్టి నెఱపం బాల్గొన్నచందాన స్వీ
యోర్జస్విత్వ తతౌదరార్జవ సముద్యల్లాసము ల్మీఱ వి
స్ఫూర్జద్వస్తుపరంపర ల్గురిసె సంస్తుత్యంబుగా దానఁ దా
నార్జించెన్ సుయశమ్ముతోడి దగు సఖ్యార్థంబు కీర్త్యుజ్జ్వలా. ౨౩

సీ॥ అటు వారు పూజితులై రా విమాన మారోహించె రాముఁ డాయూఢి దనర
లజ్జిత వైదేహి లలిత యశస్విని నంకస్థలంబున నవధరించి
తమ్ముఁడు సౌమిత్రి ధనువమ్ములుం గొని విశ్రాంతుఁడై వెనువెంట నెగడ
నంత వానరనాథుఁ డసురనాయకుఁడునుఁ బ్లవగవీరులుఁ దన్ను బలసి కొలువఁ
బూజితుం డెల్లవారలఁ బూజితులుగఁ జేసి యుపలాలనంబున సిరి దలిర్ప
మంత్రణం బనువొంద నామంత్రణం బొనర్పఁదొడఁ రెను గందర్పదర్పజనని. ౨౪

ఉ॥ మంచి దలంచినారు మహిమంబునఁ గీర్తివహించినారు స
ఖ్యాంచితవృత్తి త న్విజయ మర్మిలి నా కొనగూర్చినారు మి
మ్మెంచఁగ నాతరంబె సకలేప్సిత లైతిరి లెండు పోయిరం
డించునివాసము ల్వేరయ నిమ్మెయి నేనునుఁ బోయివచ్చెదన్. ౨౫

చ॥ సుహృదుఁడవు వ్వయస్యుఁడవు చుట్టమవుం దగ నిన్ని నీవ వై
విహితుని కర్జము స్గడుప్రవీణతఁ దీర్చి తధర్మభీరుతో
ద్వహుఁడవు న ట్లభీరుఁడవు దద్దయు న న్మది నుంచి వేడ్కఁ ద్వ
న్మహితబలంబులం గొని సమాహితతం బురిఁ జేరు మర్కజా. ౨౬

ఆ॥ ఏనుఁ బురిక చనుదు నెలమిమైఁ గిష్కింధఁ బాలితం బొనర్చి ప్రథితిఁ గనుము
పెరిమ నంగదప్రభృతుల బోధింపుము హనుమతోడివాఁడ వగుచు మనుము.

క॥ ఏ నరిగెదను విభీషణ! నీ నెఱి వర్తింపు మెల్లనిర్ణయములకుం
డానకము నీదు ధర్మంబే నెయ్యముసూపనేర్చు హితజన మనసై. ౨౭

శా॥ లంకారాజ్యమున న్వసించి స్వజనాలంబంబ వై యెల్ల ని
శ్శంకం బాలనసేయు మేనిడిన ని న్యాసింప నింద్రాదు లా

తంకం బందెడువార కాని యెపుడున్ ధర్షింపఁగాఁబోవ రీ
వింక న్నిర్మలవృత్తిమై మనుము న న్నే వేళ ధ్యానించుచున్. ౯
క॥ ఇందఱ నామంత్రించెద జందం బొప్పార సెల వొసంగుఁడు జనకుం
డెం దుండి యేలె నిల సిరి పొందిక పురి యాయయోధ్యఁ బోరయుదు గరిమన్.
క॥ అని నొడివెడు రామేంద్రునిఁ గని కనుగొలుకులను బాష్పకణికలు దొనుకన్
వినతు లయి కూర్చుదోయిళు లనువొందఁగ నిట్లు పలికి రందఱు నొకటన్. ౧౧
సీ॥ ఏ మయోధ్యకు వత్తుమెల్లర మనుమతి నలరింపుమయ్య దయావిధేయ!
తమ్ములఁ గాంచి నేస్తమ్ములు నెఱయించి యమ్మలకును మ్రొక్కు లందఁజేసి
మాయమ్మ సీతమ్మ మలయ రాజ్యపదాభిషిక్తుండ వగు నిన్నుఁ జేరి కొలిచి
నగరి వనంబులు నానాస్థలంబులు నుద్యుక్తతం జూచు నోజ మెఱసి
నీయనుజ్ఞ వడసి నెఱి మీఱ స్వస్వధామంబు లందువార మంబుజములు
ధామనిధినపోలెఁ దవిలియున్నవి మామనములు నీదెసం దనర్చి రామ! ౧౨
క॥ ఇదె దయ యిదె గారవ మి య్యదియె యనుగ్రహము జనవు నని మాయెదలం
బొదలెద మిటు గైకొనవే సదయత మ మ్మిందఱం బ్రసాదగుణాఢ్యా! ౧౩
మ॥ అని ప్రార్థింపఁగ సన్మహామహుఁడు ధర్మాత్ముండు శ్రీరాముఁ డో
య్యన వారిం దగురీతిఁ బేర్కొని వచోభ్యర్చ ల్పొసంగంగ నె
మ్మన ముప్పొంగఁగ సర్వమానిజనతామంతవ్యుఁ డి ట్లంచుఁ బ
ల్కె నవోద్యన్ముఖసారసోల్లసితదృక్కీర్త్యాళిపాళు ల్తగన్. ౧౪
చ॥ ప్రియములకెల్ల నియ్యదియ పెద్ద యటంచుఁ వచింపనయ్యె ని
య్యయమున కింక మేర గలదా? నయదృష్టులు మీర లన్నిటన్
రయమున మిమ్ముఁ బొమ్మనుచు రా పొనరించితి నాంధ్ర బిడ్డలన్
మెయికొనఁ గాంచి ప్రీతి నెఱి మించెద రన్న తలంపు చొప్పడన్. ౧౫
ఉ॥ పున్నమ కాదె యిన్నెఱిన పోయి పురంబు సొరం బురీజను
ల్సన్నుతు లైన బంధువులు సన్నుతులం బచరింప వారలన్
మన్నన సేయఁగాంచుట సుమాళమ చొప్పడె లెందు రండు మా
యన్నలు మీర లీమహిత మైన విమానము నెక్కఁ గ్రక్కునన్. ౧౬
తే॥ హరిబలము గొల్వ సుగ్రీవ! యమితతేజ! లలిత మిప్పుష్పకవర మ్మలంకరింపు
మసురనాయక! నీవు నీయనుఁగుఁజెలులతో విమానాధిరాజమ్ము పై వఱలుము.
క॥ అను రాము ప్రబోధన మొయ్యనఁ దమపాలిధన మనఁగ నై తారసిలన్
జనితోల్లాసంబున వా రనుపదమె పరిక్రమించి రనుకృతి తనరన్. ౧౭
ఆ॥ ఇంత యనఁగరాని సంతసం బిగురొత్త సేనతో హరీంద్రుఁ డైనవారి
తో విభీషణుండుఁ దోన యారోహించి రావిమానవర మహార్యనిభము. ౧౮

ఉ॥ అందఱు యానరాజమునయం దిరవొంద మహాద్భుతక్రమం
బొంది తనర్పనయ్యె నది యోజము తేజము హంసకల్పనా
మందవికాసము న్వెసఁగ మానితుఁ డా రఘువీరు చిత్తవృ
త్తిం దళుకొత్తఁ జేయుచు నుదీర్ణవిశేషమహానుభావమై. ౯౦

ఆ॥ హంసయుక్తమైన యద్దాన నిరవొంది రాముఁ డపుడు నలుఁవరాణఁ బొనరె
దేవితోడఁ గడమదివిజులై రందఱు నదియు బ్రహ్మసభయ యనఁ దనర్చె. ౯౧

శా॥ ఆకౌబేరవరాసనేంద్రము మహేంద్రార్చ్యుండు రాముండు ద
న్నాకన్నాకెనయం గుబేరు విడనై యభ్యర్హితత్వంబు నేఁ
డీకర్జంబునఁ గంటినంచు నిజసంప్రాప్తత్వముం జూపి నా
నా కల్యాణపరంపర ల్నెఱయఁ జేయంజాలె నప్పట్టునన్. ౯౨

ఉ॥ ఎందునుఁ గాన మిమ్మెయి నహీనమహత్త్వము వ్యోమయానముల్
గ్రం దొకయింత లేదు సుఖకంపమ పో యిది యెన్నఁడేని నిం
కెందఱు కేనిఁ జో టిడుఁ బ్రహృష్టుల మైతి మటంచు వాసరు
ల్పొందిరి హర్ష మబ్బురముఁ బొల్పువహించిరి రాక్షసోత్తముల్. ౯౩

తే॥ అందఱం దుపవేశంబు లంది నెగడ నానసేసెను రాముఁ డత్యాదరమున
దాన నది యుబ్బి తోడ్తోన తరలె నుత్తమోత్తమము వాతధుత మభ్ర మో యనంగ.

తే॥ విశ్వతోముఖుఁ డన్నెఱవెరవు నెఱయ సర్వతోదృష్టికలితుఁ డై సంభ్రమమున
మహిత మహితనయం జంద్రమస్సమాస్య సీత మైథిలిఁ గాంచి లక్షితము వెంచి,

—♦ శ్రీరాముఁడు త్రోవలోని స్వచరిత విశేషములు సీతకుఁ జెప్పిచూపుట. ♦—

క॥ తత్త్వద్విశేషములఁ బ్రియ కత్తఱి బోధింపఁ దొడఁగె నర్మిలి రఘువం
శోత్తముఁడు నేను నీ కెటు లత్తని వొప్పార వికసితాంబుజవదనా! ౯౬

చ॥ అలికులదృశ్యవేణిరో! యహర్పతితేజుఁడు విశ్వకర్ముఁ డి
య్యెలయు త్రికూటకూటము గిరీశగిరీంద్రశిఖాభ మింపుఁ దా
నలఘుతపఃపరిశ్రమనయమ్మున నియ్యకలంక లంక ని
ట్లలవున సృష్టిసేసి యిడె నాదృత వై కను మాన తిచ్చితిన్. ౯౭

ఉ॥ కైశికకాంతినిర్జితవికస్వరబంభర! కాంచు మీ యెడన్
గీశవరుల్ని శాటులును గీల్కొని యుద్ధ మొనర్చినారు మ
త్తాశయలక్ష్యవృత్తి నిరయంబు సయంబున నీస్థలంబు మాం
సాశనజంతువాస మన నయ్యె నసృక్పలకర్దమస్థితిన్. ౯౮

ఉ॥ ఓకుటిలాలకా! యిచట నుద్ధతు రావణుఁ గ్రూరకర్మనిన్
నీకయి త్రుంచినాఁడ నవినీతుఁ డనం జనెఁ గాని వీఁడు ము

ల్లోకములున్ జయించె సురలోకమువారల గన్నుకొట్టె నా
లోకవిభుం డొసంగిన యలోపవరంబుల కల్మి బల్మితోన్. ౯౯

తే॥ వెలసె నియ్యది బహుపశువిశసనమున నమరిన మహాహావం బన నాహవంబు
పున్నెపుంగతిఁ గనినారు పొలిసి పీరు లష్టమీచంద్రశకలనాంచదలికఫలక! ౧౦౦

క॥ అందఱు నందఱె దశముఖుఁ డందఱు తలకట్టు తపమునందలి గరిమన్
బ్రందె నిటు లిచట నీకథఁ జందము సెడ నగుచు నోవిశాలశుభదృశా! ౧౦౧

క॥ స్మరచాపోపమసుభ్రూ! కర మరు దిది వీనిమ స్తకము లిల ప్రాలెన్
బోరిపోరి నఱుకం బలువే ల్వరశక్తిం బక్వతాళవరఫలములు సాన్. ౧౦౨

క॥ అగుణుండో? సగుణుండో? తెగె నిమ్మెయి నీకుఁ గాని తెఱఁగొనరింపన్
దెగి వర్తిలి ఘనుఁ డాతఁడు త్రిగుణాత్మకదివ్యరూపధృతిమన్నయనా!

ఆ॥ కుంభకర్ణుఁ డిందుఁ గూలెఁ గనుంగొను మూప్రహస్తుఁ డిచటునం దడంగె
ధూతరిపుఁడు హనుమ ధూమ్రాక్షు నిచ్చోటఁ జదియనేసెఁ బూర్ణచంద్రవదన!

శా॥ విద్యున్మాలి సుషేణుచే నిహతుఁడై వ్రేలాడె నిచ్చోటునం
దుద్యచ్చాపుఁడు రావణాత్మజుఁడు మాయోల్లాసి యింద్రారి యిం
దద్యోతుం డయి త్రెళ్ళె లక్ష్మణునిచే నవ్యగ్రుచేఁ బోర ది
వ్యద్యుత్యూర్జితకామదర్పణమణిన్యక్కృత్కపోలాంచితా! ౧౦౫

తే॥ కలితుఁ డంగదుఁ డిచట వికటు మడంచె నటు విరూపాక్షు దుర్ధర్షు లామహోద
రాదులు నకంపనుఁడు వ్రాలి రవని ననిఁ గపిప్రవరు లేచి పొదువఁ జాంపేయనాస!

క॥ అన్యులు నన్యుల నఱిమి రనన్యాదృశులం గపుల మహాబలు లసురుల్
దైన్యం బెనసి రనలశలభన్యాయము నెఱయ బింబఫలరుచిరోష్ఠీ! ౧౦౭

ఉ॥ కన్నుల నీరు దొట్టిల వికాసము నాశిల మేను గాసిలన్
ద న్నొక వేయుఁదోడిగఱిఁత ల్సరిపోలుచుఁ బొక్కుచుండ న
య్యన్నులమిన్న రావణుని యంతిపురిం దులకించు రత్న మ
ప్డిన్నెలవొంది ఘూర్ణిలుచు నేడ్చె సుధామధురాధరాంచితా! ౧౦౮

క॥ మందోదరి యాయమ రతిసుందరి మయపుత్రి మహిత సూనృతపద య
స్పందిత సతి కాలగతిం గ్రందన మొనరించెఁ బోరికలనున సుదతీ! ౧౦౯

ఆ॥ ఇది యొకండు తీర్థ మే మబ్ధి దాఁటి యానాఁటిరాత్రి విడిసినార మిచటు
నందుఁ గాంచినార మలఁతఁ బాసి ముదమ్ము స్నిగ్ధసమసరూపశిఖరిదశన! ౧౧౦

ఉ॥ ఈయది సేతుమార్గము త్వదీహితము న్నమకూర్ప నెట్టనన్
దోయధిఁ బన్నినాఁడఁ బ్రణిధు ల్నలముఖ్యులు నేర్చి కూర్చు బ
ల్పాయముకల్మి నూఱుఁ బది సంఖ్యల కేర్పడు యోజనంబులన్
స్వాయతవిస్తృతు ల్దనర నైనది చూ స్మితచంద్రికాంచితా! ౧౧౧

క॥ ప్రకటం బయ్యెను నలకృత మకలంకం బగుచు నిది తదాఖ్యన్ జగతిన్
సుకృతము దుష్కర మట్టిద సకలకలామూర్తివాక్ప్రసాదప్రచురా! ౧౧౨
క॥ పారావారం బిదిగో యపారం బై యున్నయది యభంగోద్ధతభం
గారూఢిం గర్జిల్లుచు సారగుణోదారసత్త్వసంపత్సహితా! ౧౧౩
క॥ ఈవార్ధియె సాగర మన నై వరుణాలయము నయ్యె నక్షోభ్యం బై
తా విదె రతనములకు ముఖలావణ్యారమాధిపీఠలాలితచిబుకా! ౧౧౪
ఆ॥ అదె హిరణ్యనాభ మను శైలరాజమ్ము కాంచనమ్ము కంటె కాంచనాంగి!
జనకపుత్రి! యిదియె సాగరమ్మున నుండి హనుమవిశ్రమార్థ మరుగుదెంచె.
క॥ దీన ముద మంది సురపతి దీనతఁ బాపఁగ స్వపక్షధృతిని సపక్షం
బై నలువొందుచునున్నది గానామృతసారతత్త్వకలరవలక్ష్మీ! ౧౧౬
క॥ వే వచ్చుతఱి నిచట స్కంధావారనివేశనం బొదవఁజేసితి మి
ట్లీవార్నిధి యంతర మిదె యా వేదాత్మత్రిరేఖికాభ్యర్చ్యగళా! ౧౧౭
మ॥ ఇదె కంటే కలకంఠకంఠి! మహితుండే యయ్యె నీసాగరుం
డొదవెం దీర్థము సేతుబంధ మన నిట్లోజన్ సుపుణ్యంబు నా
విదితం బైనది ముజ్జగంబుల గుణావిష్టంబు బూజ్యంబు స
త్పదసంపాది సుపావనం బటు మహాపాపౌఘవిధ్వంసి నాన్. ౧౧౮
క॥ కర్ణాభరణ మొనర్పుము కర్ణాలంకారమహితకర్ణా! యిది యి
ట్లర్ణవగర్భోచిత మై నిర్ణీతం బయ్యెఁ బావనినహాను దోలఁపన్. ౧౧౯
ఉ॥ దీనిఁ గనుంగొనం గనిన దేవి! పునర్భవ మొందఁ డెట్టివాఁ
డేనియు నేను సేతువున కేగెద స్నాన మొనర్తుఁ దర్పణం
బానెడఁ బైతృకంబు గలయంతలు సేయుదు నంచు నిచ్చలున్
దా ననినం దరించుఁ బితృతండముతోడ మృణాలజిద్భుజా! ౧౨౦
క॥ పున్నెముల నెలవు దీనిం గన్న కృతార్థులకు నెల్లఁ గామగవి యనం
గన్నది పేరు సకలసంపన్నులఁ జేయు న్నరులనుఁ బల్లవపాణీ! ౧౨౧
తే॥ సేతుబంధమహత్త్వంబు సెప్ప నరిది యేను సురలు సిద్ధులు నుండు మిచటునందు
వాలఖిల్యాదు లౌ మును ల్వత్తు రెపుడు దీని సేవింప ననుఁ గొల్వ దివ్యమూర్తి.
సీ॥ దీని భావించిన దేవుండె యగు నన్న సేవామహత్త్వంబు సెప్పఁదరమె
సార్ధత్రికోటితీర్థౌఘంబు మధ్యాహ్నసమయంబునం దీని సంశ్రయించు
నరునిఁ జుట్టిన పాపనాశంబులఁ దెరల్ప దీని మించిన దొండు తెరువు లేదు
హనుమద్విభీషణార్కాత్మజసౌమిత్రు లెనయ సన్నిధిసేసి యెలమిగూర్తు
నే నిచటఁ గాంచువారి కభీప్సితములు సిరు లెసఁగ నంతమున ముక్తి సిద్ధిపొసఁగ
ధాము సేతుస్మరణము నిరామయ మ్మొనర్చు నరులకు సకలలోకార్చనీయ!

శా॥ ఏ రామామణి మత్సమాఖ్య తగ రామేశుం బ్రతిష్ఠించితిన్
ధీరుల్మెచ్చఁగ దేవదేవుఁడు మహాదేవుండు నా కర్థిమైఁ
దీ రొప్పారఁగ దర్శనం బొసఁగె ని తీర్థప్రదేశంబునన్
సారోదారవరం బొసంగి నిలిచె న్సర్వార్థము ల్పూర్పఁగన్. ౧౨౪
తే॥ ఇది మహాపుణ్యసంస్థాన మిచటు సేరి వఱలు రామేశుఁ బర్వతవర్ధనీమ
హాంబ సేవించి గంగాజలాభిషేక మొలయఁజేసిన నరులు ముక్తులు గుణాఢ్య!
క॥ ఇది దర్భశయన మిచ్చో నొదవించితిఁ ద్ర్యహాసమంచదుపవాసవిధిన్
దుది సాగరుఁడు మహాత్ముఁడు ముదముంగూర్చెఁ గనఁగాంచె మోసముదలఁగన్.
తే॥ అట్లు ప్రత్యక్షమై కొన్క లనువుపఱిచి సేతు నిర్మాణవిధిఁ దీర్పుసేసి దుష్ట
కోటి నాచేఁ దెరల్పించుకొని చనెం బ్రసాద మొప్పారఁగ సుసంప్రసాదకలిత!
ఉ॥ వేరము గూడ దన్నఁ గడు వెంగలి యై తను వీడె నన్న యం
చారభసంబునం బెరసె నంచితబుద్ధి విభీషణుఁడు న
న్నీరమణీయదేశమున నీఘనుసాయముకల్మిఁ గల్మి న
న్గూరిమిమై వరించెఁ గరికుంభహసత్కుచకుంభశోభితా! ౧౨౫
మ॥ ఇదె కిష్కింధ విచిత్రకానన ప్లవంగేంద్రుండు సుగ్రీవుఁ డే
ల దనర్చుం బురి రమ్య కన్గవలకున్ లాలిత్య మాతిథ్య మిం
పొదవం గూర్చెడు వాలి యింద్రతనయుం డోజస్వి యిచ్చోట భ్రా
త్రదయుం డొటఁ దెగె న్మదస్త్రహతి దివ్యత్తారహారాంచితా! ౧౨౬

—సీతాప్రార్థితుఁడై రాముఁడు వానరస్త్రీల నయోధ్యకుఁ దోడితెమ్మని సుగ్రీవుతో ననుట—

చ॥ అన విని భూమిజాత వినయాన్విత యై ప్రణయంబు సాధ్వసం
బనునయముం బొసంగఁగ నిజాంచితదృష్టిఁ బురీవతంసముం
గనుఁగొని వల్లభుం గని ప్రకాశిలు కార్యవిశేషసంపదన్
గొనకొను చిత్తవృత్తి మొగిఁ గోరికె లీరికె లెత్త నిట్లనున్. ౧౩౦
ఉ॥ నాయక! నామనం బలర నాదగు ముచ్చట సెల్లఁ గూర్తు వం
చీయెడ నర్థిమై నడుగ నెంచితి నొక్కటి తార మున్నుగా
నీ యినసూనుప్రేయసులు నెల్లహరీంద్రుల సుందరాంగులున్
దోయము సేరి రా నరుగుదు న్నినుఁ గూడి యయోధ్యఁ గన్గొనన్. ౧౩౧
క॥ చన వింతవట్టు నాదెస ననుగ్రహము కలిమి నొసఁగు మని వేఁడుటయున్
జననాయకుండు తన నెమ్మన మలరారంగఁ గూర్మి మలయఁగ ననియెన్. ౧౩౧
క॥ ప్రీతిమెయిఁ బలికి తియ్యది నీతియ సు మ్మివ్విధంబు నే నొనగూర్తున్
బ్రాఁతియె యిది నీపేర్మికి నాతిరో! యని యచటు సేరి ననుచుశుభోక్తిన్. ౧౩౩

ఆ॥ ఆవిమానరాజ మాఁగి సుగ్రీవునిఁ గాంచి స్మేరదృష్టికలితుఁ డగుచు
నెలమిమీఱఁ బలికె నినవంశతిలకుండు రమ్యవాక్ప్రసంగరమ వొసంగ. ౧౩౫

సీ॥ మనవార లిందఱు మానుగ వినఁ బల్కు మిత్త్రతతి దేవి యభీప్సితమ్ముఁ
దార మున్నగు నీదు దారలతోఁ గూడఁ దమతమభార్యలు దరలిరాఁగ
సిరిమీఱఁగ నయోధ్యఁ జేరి మెలంగ సన్మానం బనూనంబుగా నప్రాద్య
దుత్సవం బరయంగ నొగి రాజపత్నులఁ గాంచి సమ్మద మొదవించి చెలఁగఁ
గోరినది యటంచుఁ గోర్కి సాఫల్యంబు నెఱి దలిర్ప వారు నీవు నరిగి
వారిఁ దోడుకొనుచు వచ్చి వైళమె పుష్పకంబు నధిగమింపఁగాఁ గడఁగుఁడు.

ఆ॥ అమితతేజుఁ డైన యారామచంద్రుఁ డిట్లన సుమహుఁడు వానరాధిపతియు
నంతవట్టు దెలిపి యవ్వారలం గొని యంతిపురికిఁ జేర నరిగి ప్రీతి. ౧౩౬

క॥ తార నుదార స్వదారం దారాధిపవదనఁ గని ముదంబున ననె ని
ట్లోరామామణి! వినుమా శ్రీరామాధిపుఁ డనుజ్ఞసేసెం బ్రీతిన్. ౧౩౭

క॥ తడయక నీవును నీసరిపడఁతులు వారివరుల కూర్చుభామల ననువే
ర్పడఁ బిలిచికొని కడంగుఁడు పుడమితనయ కోర్కి దీర్పఁ బోనగు గరిమన్.

సీ॥ ప్రేయసీ! రాముఁడు పేర్చి రావణుఁ దీర్చి సీతఁ గైకొని గెల్పుసిరియుఁ గూడ
నావిభీషణునిఁ బట్టాభిషిక్తు నొనర్చి నఖిలామరులు మును లభినుతింప
వారితోఁ గపులతో వరపుష్పకం బెక్కి చేరె నిచ్చోటికిఁ జెలువఁ గూడి
యాయమ మీఁదెస నత్యాదరం బొప్పఁ దోడి తెమ్మని మిమ్ము దొరసి తా న
యోధ్యకుం బోయి యందఱ నోజ మెయిఁ గనుంగొనన్వలె వేడ్క వొసంగ ననుచుఁ
బ్రియుని వేఁడెఁ దా నిట్లని ప్రీతిమెఱయ నాతఁ డెఱిఁగించి యనిచె నన్నాననెఱప.

ఉ॥ కావున నందఱుం గొని వికాసము పేర్మిఁ గడంగి చెచ్చెరం
బోవలెఁ బుష్పకం బెనయఁ బూజిత లై తగు రాజపత్నుల
న్నావిరి గాంచి రామవిభు వైభవముం గని సీత మన్ననల్
శ్రీ వెలయంగఁ గైకొని విశిష్టలు నై చనుదెంతు రేర్పడన్. ౧౪౦

ఉ॥ నావుడు దార సంతసమునం దనరారుచు వల్లభుండు సు
గ్రీవుఁ డనుజ్ఞ సేసె నిటు ప్రీతి మెయిం జనువార మిప్డయో
ధ్యావరరాజధానికిఁ బ్రియం బిది నేనును గోరుచుందు మ
ద్భావన నెల్లఁ బ్రాభవము వైభవముం బెను పొందుచుండఁగాన్. ౧౪౧

తే॥ నాథులం గూడి చని జననాథు సతుల భూమిసుత తోడికోడండ్రఁ బొరసి కాంచు
రహికి మున్నుగ రాము పురప్రవేశ పౌరజానపదాప్తులుఁ బడయఁగలము.

క॥ సకలైశ్వర్యసమంచిత మకలంకం బైన రాము నభిషేకంబున్
బ్రకటశ్రీకలనముఁ గని స్వకము పురం బెనయుదుము ప్రసాదాఢ్యుల మై.

మ॥ అనుచుం దార యనుజ్ఞసేయ నఖిలం బౌ వానరీబృంద మె
య్యన మే లంచు నలంకరించుకొని డాయం దాను సర్వాంగశో
భనలక్ష్మిం దనరారుచు న్వడలె సంపన్నక్రమం గొంచుఁ ద
మ్మనువృత్తి న్విభుఁ డెల్లవానరులు నెయ్యంబారఁ బ్రేరేపఁగాన్. ౧౪౪

ఆ॥ అట్లు వచ్చి విభవ మనువొంద నావిమానంబునకుఁ బ్రదక్షిణం బొనర్చి
జనకరాజతనుజఁగను కాంక్ష దళుకొత్త నభ్యుపేత లగుచు నలరుటయును.

క॥ వా రెల్లవానరులు నధ్యారోహింపంగఁ దరలె నట రయమారం
గా రాజేసు విమానం బారాజేంద్రాజ్ఞ నెఱయ నంబరవీథిన్. ౧౪౬

తే॥ అంగనామణితో నిట్టులనె విభుండు డంబుమీఱిన ఋష్యమూకంబు దఱిసి
తొంటి దైన ప్రసంగంబు ధోరణిం బొసంగి యిగురొత్తుచిత్తంబు సరణిఁ బెరసి.

ఉ॥ అంబర మాహరించెడు మహాకృతి మించి సవిద్యుదుద్యద
బ్దం బన నొప్పుచున్న యది భాస్వరకాంచనధాతురాగచి
త్రాంబరము న్ధరించె నన నంచిత మై యిదె సుమ్ము ఋశ్యమూ
కం బను పర్వతోత్తమము కాంతవళిత్రయచిత్రితోదరీ! ౧౪౭

క॥ ఇన్నెల వే మెనయఁగ నడిసన్న గనం బనిచె హనుమ సవితృసుతుఁడు వి
ద్వన్నుతుఁ డతఁ డిరువురకునుఁ బన్నెను సఖ్యంబు దిరముపడఁ దనుమధ్యా!

ఆ॥ ప్రతినచఱచినాఁడఁ బవనసఖుండు సాక్షిగ సురేంద్రసుతుని గీటడంప
నేను రవిసుతుండు నెఱపినాఁ డట్లు నీనెల వెఱింగి తెలుప నిమ్ననాభి. ౧౫౦

మ॥ ఇది పంపాహ్వయ చిత్రకానన జనాభీష్టంబులం గూర్పనై
నది స్వచ్ఛాశయ పద్మినీమణి రసౌన్నత్యంబునం బెంపుఁ గాం
చె దయాహీనత నన్ను శోకవివశుం జేసెన్ సిరి న్నిన్ను బా
సి దరింజేరితి నన్న దోసమున కో శ్రీకామ్యకాంచీగుణా! ౧౫౧

మ॥ శ్రమణీసంజ్ఞిత ధర్మచారిణి తపస్సంసిద్ధ యేతత్తట
స్థమతంగాశ్రమసీమఁ గానఁబడెమొం దచ్ఛిష్య మత్పూజలం
గ్రమయుక్తిం బొనరించె రస్యఫలవర్గమ్ముల్ సమర్పించె ని
ర్గమ మొప్పం గనె ముక్తి స్మారరథచక్రశ్రీసమంచత్కటీ! ౧౫౨

క॥ విధుతారికబంధుఁడు రవివిధుల విధుంతుదుఁ డనంగ వేధించెను మ
మ్మధిభుజుఁ డట దివి గనెఁ దెగి పృథువర్తులకామరాజపీఠజఘనా! ౧౫౩

తే॥ ఇదిగొ శ్రీమద్వనస్పతి యిచట నీకతన జటాయువు రావణుఁ దలరఁ బొదివి
ధార్మికుఁడు పోరె నవలఁ దత్ప్రహతిఁగూలెఁ బ్రదిలి పృథ్వీసుతాత్వాత్తపృథునితంబ!

చ॥ ఇదె మనయాశ్రమమ్ము పద మిచ్చటునన్ ఖరదూషణాదు లౌ
త్రిదశవిరోధు లుద్దవిడి ద్రెళ్లిరి న న్నెదిరించి పోరి య

ల్లదె ఘనపర్ణశాల ముద మారఁగ నిందు వసించినార మ
ట్లిది యయి యున్న దిప్పటికి డింద దమందరసోచిత్రక్రమా! ౧౫౫
క॥ శుభదర్శన! నీ విచ్చట నభయస్థితి నుండఁ బొంచి యసురేంద్రుఁడు దు
ర్లభఁ బ్రసభముగాఁ గొనిచనె విభుత న్నే మాయమెకము వెంబడిఁ జనఁగాన్.
మ॥ ఇదె గోదావరి రమ్యతీర్థ శివ వాహిన్యగ్ర్య తోబుట్టు వి
య్యది పాపాపహ సుప్రసన్నసలిలోద్యన్మూర్తి శోభిల్లుచు
న్నది యెన్నందగు నిన్నదీతటి మహానత్యంబు పెంపార న
భ్యుదయం బందఁగఁ గాంచినార మటు రంభోరూ! విహారంబులన్. ౧౫౭
తే॥ అదె యగస్త్యమునీంద్రుని యాశ్రమంబు ముదిత యిదియెసుతీక్ష్ణ సన్మునిపదంబు
ప్రథిత మైన దల్లదె శరభంగమానివాస మచటికి శక్రుండు వచ్చెనపుడు.
మ॥ స్మరతూణీరవిశిష్టసద్గుణసమంచజ్జంఘికా! యిచ్చటన్
సురవిద్వేషి విరాధుఁ డేచి యఱుమన్ సూ డించి ఖండించి బం
ధురకాష్ఠాగ్ని దహించినార మన దా త్రోవం దలంగించి చె
చ్చెర వానిం దివి సేర్పఁ దొల్త విజయశ్రీలాభ మ స్లేర్పడన్. ౧౫౯
ఉ॥ అల్లదె తాపసాశ్రమము లంచితహంసగమప్రపంచ! యం
దెల్లశుభంబులం బొసఁగు నీయదె యత్రిమునీంద్రు మందిరం
బుల్లసితంబు తన్మహిమ ముజ్జ్వలతేజము సూర్యవహ్నులం
గొల్లఁగొనంగఁజాలు సురకోటి నుతింపఁ జెలంగు నెప్పుడున్. ౧౬౦
తే॥ పసుపుకుంకుమములు నీకుఁ బొసఁగ నొసఁగె ధర్మచారిణి తాపసి తత్సతీవ
తంస మబలావతంసమా! తత్ప్రభావ మధిగతంబయ్యెఁ బదునాలు గబ్దములును.
సీ॥ అదె చిత్రకూటాఖ్య మగు కూటవంతంబు గొఱలితి మచ్చోటఁ గొన్నినాళ్ళు
నను దేర్ప నిటవచ్చె నయవేత్త భరతుండు కైకేయి తనుజుండు ఘనభుజుండు
కానిపించెదుఁ జిత్రకానన భానుజనది యిదే కనుల కానంద మిడుచు
నదె భరద్వాజాశ్రమాంచిత భూమి శ్రీమతి ప్రకాశించు సన్మానితముగ
నిదిగొ గంగాస్రవంతి కవీడ్యమాన పావనచరిత్ర త్రిపథగ భవ్యసలిల
ద్విజగణాకీర్ణఫలసుమోదీర్ణవనవిభాసితతట భద్రమూర్తి దాఁ బడయనయ్యె.
క॥ ఇదె శృంగిబేరపుర మయ్యదనున ననుఁ జేరవచ్చె నాప్తుఁడు గుహుఁ డి
య్యదె జానకి! సరయూనది ముద మలరఁగఁ గాంచుమిచటి మునుపటిపదముల్.
క॥ ముఖనిర్జితవిధుమండల! నఖకోటిద్యుతివిధూతనక్షత్రగణా!
నిఖిలాతిశాయిసద్గుణ! సుఖాస్పదము శుభపతాక చూడంబడియెన్. ౧౬౪
మ॥ అదె కంటే భువనైకసుందరి! యయోధ్యాభిఖ్య నాతండ్రి యే
లె దయాసింధుఁడు రాజధాని యయి తన్ లీలాంచితశ్రీయ కాఁ

బొదలింపం బలువేలు వత్సరము లప్పుణ్యాత్మకం గ్రమ్మఱన్
మది వొంగం గనఁగంటి మానతులు నేమం బొప్పు నర్పింపుమా. ౧౬౫

సీ॥ అనునంత సంతసం బనువొంది నెఱయ వానరవరుల్ రక్షఃప్రవరులుఁ బొదలి
మెగసి మెగసి కాంచి రేఁకట మెదలఁ బిక్కటిలంగ నవశత గడలుకొనఁగ
సురుచిరదర్శన శోభనమూర్తిఁ బాండురహర్మ్యమాలిని వర విశాలఁ
గక్ష్యాసమంచిత గజవాజిసంకులఁ గాంచనమణిరత్నఘటితసాల
మహితమాణిక్యమౌక్తికమయవితాన జాలతోరణగోపురోచ్చైర్విమాన
రమ్యతరవైజయంతీవిరాజమాన ధారుణీసారపురి రాజధాని దాని. ౧౬౬

ఆ॥ ఆవిమానరాజమం దిరవొందె నానందపూరణాభినందనములు
వందనములు నట్టు వరనుతిసారనిష్యందనములునగర మరయ నయిన.

సీ॥ పదునాలుగవది యై పరఁగు వత్సర మప్డు పరిపూర్ణమగుటయుఁ బంచమి తిథి
గడకొన లక్ష్మణాగ్రజుఁడు భరద్వాజమౌనివర్యుని యాశ్రమంబు దఱిసి
యావిమానం బాఁగి యటఁజని యమ్మునిపాదపద్మములకు భక్తి నెఱఁగి
అంజలిసేర్చి నా నెంజిలి వాయంగ నెఱేఁగింపుము మహాత్మ! యెఱుక నెఱయ
నందఱి కనామయంబ కా నప్పురము సుభిక్షమై యున్నయదియే సురక్షితముగ
నేలుచున్నాఁడె భరతుఁ డేమెడను లేదుగద ప్రజలకంబ లున్నారె కడచిచనక.

మ॥ అని ప్రార్థించిన రాము లక్ష్మణయుతు న్వ్యాసన్ప్రము నీక్షించి య
మ్మునిచంద్రుండు ప్రహృష్టుఁ డై స్మితరమ న్మోమాదరింపంగ మ
న్నన లొప్పారఁగఁ గూర్చు పల్కుబడిసన్నాహంబు చెన్నొంద ని
ట్లనెఁ బ్రాలేయమహీధరాత్తసుకృతావ్యాపన్నసంపత్ఫలా! ౧౬౯

మ॥ కుశలంబే మనవారి కెల్లరకు నేకుంఠత్వముల్లేదు త్వ
ద్వశ మై చిత్తము నెక్కొనన్ భరతుఁ డాతంకంబునం బంకది
గ్ధశరీరుం డయి వల్కలమ్ములు జడల్ దాల్చి నిన్నుఁ బోలంగఁ దా
ల్చి శుభాశంస పొసంగ నీయడుగు లీక్షింప న్నిరీక్షించుచున్. ౧౭౦

క॥ నీపాదుకలే తనకుం బ్రాపగుచుండంగఁ బోఁడు పట్టణమునకున్.
దాపై నందిగ్రామం బావయికత నిల్వ నీడ యగుచుండంగన్. ౧౭౧

క॥ వ్రతనిష్ఠతోడ రాజ్యవ్రతనిష్ఠ న్నీయనుజ్ఞ వర్తిలఁజేయన్
సుతర మొనరించుచున్నాఁ డతులము భవసాగరము దయామయహృదయా!

ఆ॥ అచటివార్త యొక్కఁ డననేల సకలప్రపంచమునను దోఁచు భంగు లెల్ల
నీయనుగ్రహమున నేనేర్తు వివరింపనదియుఁ ద్వన్మహత్త్వ మగున కాదె. ౧౭౩

క॥ నేమమున నినుఁ దలంచుచు నీమంత్రము తత్త్వ మరసి నిర్మలమతితో
నీమఱువు సేరఁగాంచు టె ధీమన్నుత! తప మన న్విదిత మగు నెపుడున్. ౧౭౪

సీ॥ కైక నెమ్మదిలోని కాంక్ష జొప్పనయించి యెదిరి లాభముఁ గూర్ప నెంచితివని
తండ్రియానతిమానఁ దగదన్నవలఁ బన్ని పౌరువులయెదలెల్లఁ బొదివితి నని
ప్రథితసర్వస్వంబు ప్రాప్తరాజ్యము వీడి నిస్సంగవృత్తిమై నెగడితి నని
తమ్ముకుఱ్ఱనితోడఁ దరుణితోడంగూడ వన్యవృత్తిఁ జరింప వచ్చితి నని
ధర్మకాముఁడవే కద తాపసులను మనుపఁదలఁతివే కద మఱియుఁ గిఁ కేల
పాపకర్ములఁ గెడపి భూభరముఁ బాప నవతరించితి నని యొక్కఁ డనినఁ జనదె.

ఉ॥ నీదెసఁ జాలి దోఁప నవినీతుల మెట్టఁగసాగె నల్క యా
వ్వాదున వేస మూని తెఱవాటుగఁ గూరలు నారచీరెలుఁ
వేదురువుట్టఁ గొంచు నటవీస్థలి కీ వరుదెంచునాఁ డహో
మాదశ యిట్టులైన నొరుమాట దలంపఁగనేల ముచ్చటల్. ౧౭౬

ఆ॥ అపుడు కాళ్లనడక నలసి వచ్చితి విప్డు దివ్యపుష్పకమునఁ దేజరిల్లి
తెవ్వఁ డెఱుఁగు నీమహీయఃప్రభావంబు తాత తలఁపులోనఁ దవిలెనేమొ.

ఉ॥ కన్నులపండు విట్టి దనఁగాఁ గనఁగాంచితి నయ్య నేఁడు మా
యన్న! పరార్థము న్నెఱపి తాశరకోటిఁ దెరల్చి తీయెడం
గన్నిడ సేసినాఁడ వని కాక సమృద్ధుఁడ వై తనర్చి యా
బన్నము వాప వచ్చితి ప్రపన్నజనౌఘముఁ గొంచుఁ జెచ్చెరన్. ౧౭౭

క॥ మాతల్లి జానకియు నీ ప్రీతఱి ని ట్లరుగుదేర నీ తమ్ముఁడు నాఁ
డే తెఱఁగున నల్లే రా నాతలఁపున సంతసము ఘనం బై తనరెన్. ౧౭౯

తే॥ ఇల్లు బాసిన దాదిగా నింతవఱకు జరిపిన కథాప్రపంచ మే నరసినాఁడ
నదియు దృశ్యప్రబంధంబ మై తనర్చె నామనోవీధి విధిముఖనందితాత్మ! ౧౮౦

సీ॥ ఇటవచ్చి యెచటికే నేఁగి మానులఁ గాంచి నెఱి దండకాటవి నిలుచుటయును
బ్రాహ్మణార్థనియోగపరత జనస్థానదుష్టరాక్షసకోటిఁ ద్రుంచుటయును
నదివిని రావణుం డడరారి నీసతిఁ బొంచి హరింపఁగా నెంచుటయును
మారీచు వెంట ని న్మలయించు మలఁకమై సీత నాఖలుఁ డిలు సేర్చుటయును
నా కబంధదర్శనము పంపాభిగమము వాలి వధియించి సుగ్రీవు నేలుటయును
నింక హనుమ యాయమఁ గని లంకఁ గాల్చి వార్తఁ దెచ్చుటయునుసనవఱలుకృతులు.

చ॥ పదఁపడి వార్ధిఁ గట్టి వినిపాతము దోఁప సపుత్రబాంధవున్
గదనమునందు రావణు నగల్చుట యా ఖగవానితమ్మునిన్
సదయత రాజుఁ జేయుటయు జాణతనమ్మున వేల్పుపెద్దలన్
బొదలుచు రాఁ బొనర్చుటయు బోధమయాత్మ! యెఱుంగుదు న్మదిన్. ౧౮౨

క॥ నీవు పరబ్రహ్మాఖ్యం బై వఱలెదు తత్త్వ మైతి వాద్యంతరితాం
...తావస్థలు లే వెన్నఁడు దేవార్చితమైన నీదు దివ్యవిభూతిన్. ౧౮౩

సీ॥ తొలుత నీ వుదకమ్ము గల్పించి యద్దాన భూతసృష్టికి సుప్తి పొలుపుగాంచి
నారమ్ము జలము గా నరసమూహము గాఁ దదంతరాత్మత్వమ్ము నవధరించి
నారాయణుండవు నా మించి నీదగు నాభిపద్మమ్మున నలువఁ బెంచి
సకలలోకమ్ములు సంభవింపఁగఁజేయు మని కర్జముం గూర్చి యతనిఁ బంచి
యెలమి గనినవాఁడవు జగదీశ్వరుఁడవు స్రష్ట యోపెఁ బితామహసంజ్ఞఁ దనరఁ
దానుఁ దనుబోంట్లఁ గల్పించి తలఁపు సెల్లఁ జేసినకతమ్మున జగద్విశిష్టుఁ డగుచు.
ఆ॥ విశ్వవంద్య! నీవు విష్ణుదేవుండవు జనకజాత లక్ష్మి సన్నుతాంగి
శేషభూతుఁ డితఁడు శేషుండు లక్ష్మణుం డొడ్డ నెన్ననేల యోజ నెఱయ.
శా॥ నీయందే నిఖిలంబు నేయు దెపుడు న్నీయాత్మచే మాయచే
నేయంశంబులనేని సక్తుఁడవు గా వేనాఁడునేని న్నభం
బాయాభూతములందు నెట్లటులె భవ్యస్వాత్మచిచ్ఛక్తిచే
నాయె న్నీదగు సర్వసాక్షితయు విద్యావిద్య లం చేర్పడన్. ౧౮౬
క॥ భూతములకు బహిరంతర్భూతుఁడ వీ వగుటకతనఁ బూర్ణుఁడ వయ్యున్
ద్యోతించెదు విచ్ఛిన్నతఁ బాతకి దృగ్దోషముననుఁ బాపాత్ములకున్. ౧౮౭
ఆ॥ జగము నీవె తండ్రి! జగదాశ్రయుఁడ వీవె పాలకుఁడవు నీవె ప్రభుఁడ వీవె
భూతములకు భోక్తృభోజ్యంబులును నీవె నీవు గాని దెదియు నెగడ దీశ!౧౮౮
క॥ దృశ్యంబు శ్రూయమాణ మదృశ్యంబు స్మృతంబు నైనదియు నీవే యు
త్పశ్య! సకలంబు నీవే పశ్యత్పాలుఁడవు నీవె పరమేశానా! ౧౮౯
క॥ వితతభవచ్ఛక్తిప్రేరిత మాయ సెలఁగి యహంకరిష్ణు వగుచు సం
తతనిజగుణముల జగముల జతనం బొనరించు లోకజనని యనంగన్. ౧౯౦
సీ॥ అదియెల్ల నీయందె యారోపణ మొనర్తు రజ్ఞులౌ జనులు మోహాత్ము లగుచుఁ
బ్రాజ్ఞులు చుంబకప్రాధాన్యమున జలజ్జడలోహవస్తుప్రచార మరసి
యట్లె యియ్యది జడయగు మాయనగు నంద్రు గడఁగి నంరక్షేచ్ఛ గడలుకొనఁగ
లీలమై మైకొందు స్థూలంబు సూక్ష్మంబు నను దేహయుగమున యవకలనము
స్థూలము విరాట్టు సూక్ష్మంబు సూత్ర మందు నెగడు వైరాజమునను నిర్నిద్రుఁడ వయి
వేనవే లవతారము ల్వెలయఁజేయు దవియుఁ గృతిఁదీర్చి తొంటినీయందు డిందు.
క॥ మహితాత్మ! యట్టి వగు నీమహావతారముల కథల మానుగ నెవ్వా
రహరహము స్తోత్రగీతులఁ బ్రహృష్టతం గూర్తు రేకపరు లవ్వారల్. ౧౯౨
అ॥ ముక్తిఁ గాంతు రభవ మును నీవు బ్రహ్మచేఁ బ్రార్థితుండ వైతి ప్రబలతపము
ఫలమ వగుచు నిట్లు ప్రభవించితివి రఘుకులము మహితమహిమఁ గొనకొనంగ.
ఉ॥ తీర్చితి దేవకార్యములఁ దెల్లముగా బరదుష్కరంబులన్
బేర్చితి వెల్లజాడలను బెంపొనరింపఁగ నాయశస్స్థితిన్

కూర్చెదు రెండులోకములకుఁ గులకం బిటమీఁద ధాత్రిపై
స్వర్చన లొప్ప నెక్కొను మహత్త్వమునం బలువేలు వర్షముల్. ౧౯౪
చ॥ పరమపవిత్రము ల్నిఖిలపాపహారంబులు కీర్తిపూరముల్
నిరవధిసంపదాఢ్యములు నీదుచరిత్రము లెప్డు నేఁడు నీ
వరమహిమంబు సెల్లఁ బరివారముతో నిచట న్వసించి యం
దరుగుదు వెంచి శేపకడ నాదృతి న న్నిటు గారవింపవే. ౧౯౫
ఆ॥ విందు బూచి వఁచె ముకుంద!నీ కిం దేను విందుసేయుతలఁపు వెరవుఁగొంటి
భాజనంబ నగుటఁ బాటించెదవ యేని బావనం బొనర్పు భవన మిదియు.
క॥ అందఱు నన్నివరంబుల నందంజేసిరిగదా కృతార్థుల మై నే
నం దొకరుఁడ నీ కొసఁగెదఁ బొందుగ నొకఁ డెన్నదేనిఁ బురుషవరేణ్యా!
ఆ॥ అనినఁ గేలుమోడ్చి యంజలి మస్తకమం దనుజ్ఞతోడ నవధరించి
యల్లె మెలఁగువాఁడ నని క్రమ్మఱ రఘూద్వహుండు పల్కె మేలి యురవు మెఱయ.
సీ॥ సంయమీంద్ర భవత్ప్రసాదంబె తఱి గాఁగ వెడమోటులునుఁ బల్లవింపవలయు
దట్టంబులై యొందుఁ దలకొని యవి యెల్ల నిండారుచాయల నెఱపవలయు
సురభిళమ్ములు పూవుజొంపము ల్నలిరేఁగి ఘ్రాణతృప్తి నొనర్పఁ గడఁగవలయు
కలవృక్షములు కల్పకములై యమృతకల్పఫలమధుస్రవములై పరఁగవలయు
నే నయోధ్య కిట్టు లిందఱతోఁ గూడి యరుగవలయు కర్జ మావహిల్లఁ
గూర్పు నొకటయేనిఁ గొఱఁత వాటిలకుండ నెలమి సూపుమయ్య యిదియె వరము
క॥ రెండవస్రష్టవు నీదగు నిండుమనంబునఁ దలంచు నెఱి నట్లది గా
కుండునె మీబోంట్లధృతుల నండగొనెడు మా కనాప్త మని యొకఁ డున్నే.
ఉ॥ నావుడు నీతలం పరసి నంద్యచరిత్ర! యటే పొనర్ప మ
ద్భావము సేర్చినాఁడ నొకపాటఁ దలంగునటయ్య యట్లు గా
కీ వీఁక నర్ఘ్యముం గొని యహీనసుఖోచితవృత్తి నుండు మో
దేవ! యటంచుఁ బల్కె ముని దిష్టమువంక ధృతి న్మలంచినన్. ౨౦౧
ఉ॥ మోటులు పల్లవించె ఫలము ల్రసపూర్ణము లయ్యెఁ బెందెరల్
వాటిలు తేనెలం బెరసి వర్ధిలె నెల్లజలాశయంబు ల
ప్పాట సుధామయత్వమున పాల్కొనెఁ గీల్కొని మాని రాము జం
జాట మయోధ్యఁ జేర్ప నగు జాడ కొనర్చిన సంయమంబునన్. ౨౦౨
క॥ అడిగిన యంతకు వేయును మడుంగులని నట్టు లయ్యె మహితార్థంబు
ల్తడ వింత లేక యెడయీ కడరిన యాచొప్పు దలఁప నచలేంద్రసుతా! ౨౦౩
క॥ ఫలములె పుష్పంబులె మే ల్వలిపని పయ్యెరలె రసపువాఁకలె సచ్ఛా
యలె దలిమపు న్నెలవులే యలమార్గము యోజనత్రయావిష్టముగాన్. ౨౦౪

ఉ॥ అంతట వానరర్షభు లనంతరు లై హృదయాంతరంబు ల
త్యంతరసప్రకర్షమున హత్తుకొనం గనుఁగొంచు నెల్లరున్
మంతన మొప్ప నన్నిట నమానుషసౌఖ్యము లందఁ గాంచి రి
ట్లింతలు స్వర్గమందుఁ గలవే యనుచుం బరికించి మెచ్చుచున్. ౨౦౫
క॥ సీతాసమేతు రాము ననేతాదృశుఁ డత్తపస్వి యెలమి దొనుక సం
స్ఫీతుఁ డగుచుఁ బూజించె నుపేతాభీష్టార్థదోహభృతి పెంపెసఁగన్. ౨౦౬
తే॥ అట్టి సౌమిత్రి నమ్మొయి నర్కతనయు నావిధి విభీషణుం బవనాత్మభవుని
మఱియు నందఱ సన్మాన్యమహితవృత్తి నెగడ సంతృప్తుల నొనర్చె నీరజాక్షి!
ఆ॥ నాఁడు భరతునకు మనం బలరఁగ నొడఁ గూర్చినట్టి కలిమి కోమలాంగి!
వింటిగాదె దాని వేషబం బలిపించె నేఁటివిందు తెలుఁగు నీలచికుర! ౨౦౮
క॥ లక్ష్మీవిలాసమునఁ దగె లక్ష్మణు నగ్రజుని రాక రహిఁ గూర్పఁగఁ బా
పక్ష్మాధరవ్రజము కాఁ బక్ష్మలనేత్రా! ప్రసాదభరితం బగుచున్. ౨౦౯
క॥ ఆనందసాంద్రుఁ డై నిత్యానందుఁడు రాముఁ డొప్పు టరుదే మునివ
ర్యానీతవైభవముఁ గని యానమ్రతఁ గాంచి రసురు లగచరవరులున్. ౨౧౦
సీ॥ అంతట రఘునాథుఁ డాయయోధ్యఁ దలంచి చింతించి హనుమనిఁ జేరఁబిలిచి
యనవద్య నీవేగి యధిరాజమందిరజన మనామయ మైన జాడ నరసి
శృంగిబేరపురంబునం గాంచుము గుహుం గహనగోచరుని నిషాదాధిపతిని
నను సానుజు సభార్యు ననుగతు విజ్వరుఁ గుశలవంతునిఁ గాఁగఁ గూర్మినొడువు
మతఁడు ప్రీతిఁబెరయు నావల భరతుని మొనసి మేలివార్త ముచ్చటించి
వృత్తవర్తనము సవిస్తరంబుగఁ దెల్పి నేఁడు మునిపదాప్తి నిలుచు టనుము.
ఉ॥ నాదగు పల్కుగా నను ముదంద్యచరిత్రుఁడు వానితోడ నే
నీదరి మెట్టి నిల్వఁ జల మేర్పడ రక్కసి సీతఁ బాఁచు టా
పాదితశక్రసూనువధ భానుజసఖ్యము వార్ధిఁ గట్టి మాం
సాదుఁ దోలంచు టీశ్వరముఖాదృతి మైథిలి ప్రాప్తి కల్మియున్. ౨౧౧
తే॥ వానరులు రాక్షసులు తత్ప్రివరులు నన్నుఁగూడివచ్చుటయునుఁ దెల్పి కూర్చునెఱి
నింగితము బహిరాకృతి యాప్సితమును గనఁగనుము భాషణాదిప్రకారములను. [యు
చ॥ కలవరపెట్టుఁ జూ సకలకామసమృద్ధము హస్తిముఖ్యసం
కులము స్వపూర్వవర్తిత మకుంఠితయోగము నైన రాజ్య మే
వలనున నైన నెల్లర వివర్తితవృత్తులు నెట్టనన్ జలం
బలవునుఁ జెల్ల వీడుదు రహంకృతి చొప్పడి వేఁపకుండినన్. ౨౧౩
క॥ కావునఁ దన్మనమునఁ గల యావద్వ్యవసాయ మెంచు మేర్పడ నతఁ డా
శ్రీవిలసితుఁ డిల యేలఁగ భావించిన నదియ నాకుఁ బదివే లరయన్. ౨౧

ఆ॥ బుద్ధిశాలి వీవు పొరసి యాతని వృత్త మరసి నొడువవలయు నంత నొడివి
మేము మిగిలిరాక యే యుండ నాతోడఁ గలిసి తెలుపు మెల్ల కార్యగతియు.
చ॥ అని తనకోర్కికి న్వెలిగ నాన యొసంగిన నల్లె యంచు న
య్యనిలజుఁ డేగె మానుషము నైన నలువొందెడు రూప మంది యొ
య్యన భుజగంబు బట్టికొను నోజ ఖగేంద్రుఁడ పోలె వేగి యై
ఘనసురవర్త్మవర్త్మమునఁ గర్జమునం దెలిఁ గూహ సేయుచున్. ౨౧౮

—◆ హనుమంతుఁడు గుహునకు రామ కుశలవార్త నెఱింగించుట ◆—

ఆ॥ గంగ యమునతోడి సంగతి నున్న శుభంగమస్థలంబు బడసి కడచి
శృంగిబేరపురి విశిష్టు నగ్గుహుఁ గాంచి హృష్టుఁ డగుచు నతని కిట్టు లనియె.
మ॥ విను కాకుత్స్థుఁడు సత్యవిక్రముఁడు నిర్వేలప్రభావుండు నీ
కనుకూలాప్తుఁడు రాముఁ డంగనయు భవ్యాత్ముండు సౌమిత్రియున్
దనతో రా నరుదెంచినాఁడు శుభముం దార్కాణ సేయంగ స
న్నని చేన్ ద్వత్కుశలంబు వార్త లడిగెన్ వ్యాసంగ మొప్పారఁగాన్. ౨౧౯
తే॥ అలభరద్వాజు నెలవున నమ్మునీంద్రుఁ డామతింపంగ నున్నవాఁ డరుస మొనఁగ
నేఁట రేపటఁ గాంచెదు నీదు చెలిమికాని సంయమివరు నానఁ గదలిరాఁగ.
చ॥ అని యిటు ముచ్చటించి మహితాత్ముఁ డతండు ప్రహర్షవారిధిన్
మునుఁగుచుఁ దేలుచుండఁగనె మున్పటి యట్ల వియత్పథంబునం
జనెఁ దన తేజమున్ రయము సంభ్రమముం దనరార వాయునం
దనుఁ డెదనున్న కర్జము పదంబున మై గఱుపాఱుచుండఁగన్. ౨౨౧
ఆ॥ ఒంటిదెసనుఁ జూడ్కి నొలయింపఁబోఁడు తా నంటనీఁడు చిత్త మంద నైన
దెదియు నేకలక్ష్య మేర్పడఁ జనియెఁ దజ్జనివిశేష మెన్న శక్య మగునె. ౨౨౨
చ॥ అరుసముపేర్మి న ట్లరుగు నాతఁడు వేగమునం గ్రమించె న
వ్వరుసను రామతీర్థమును వాలుకినిం బ్రథితార్థ గోమతిం
బరుసని సాలవృక్షవనవాటిని గోసలపుం బ్రజావళిన్
బరఁగెడు మేలిగ్రామములఁ బల్లియలన్ బహుపుణ్యభూములన్. ౨౨౩
ఆ॥ వాఁడు దూరపథము వారక లంఘించి కూడఁ బొడెఁ బ్లవగకుంజరుండు
ఫుల్లవృక్షకలిత స్ఫురితనందిగ్రామ పుణ్యసీమ నోప్రఫుల్లనయన! ౨౨౪
మ॥ ఉపశల్యోపహితార్జితోపవనికాధ్యుష్టస్ఫురద్ద్రూమపా
దపసంతానము స్త్రైణబాలయువవృద్ధప్రార్థితం బై సురా
ధిపు నానందన మట్లు చైత్రరథముం దీరొందనీ కన్నిటన్
నెపము ల్వన్నెఁగ నేర్చు నం చతఁడు తన్నితాత్ముఁ డై కన్గొనన్. ౨౨౫

తే॥ అది యయోధ్యకుఁ గ్రోశమాత్రాంతరమున నందితంబు నందిగ్రామనామకంబు
నగుచు నలువొంద నచ్చోట నధివసించియున్న రామానుజన్ము నయ్యోజ దఱిసి.
సీ॥ బవిరిగడ్డము జటాభారమ్ముఁ బొదువ దర్దురితుఁ డౌ మోముచందురునితోడఁ
వల్కలాజినకృతావరణంబు నెరదున మెయికొనరాని నెమ్మేనితోడ
ఫలమూలభక్షణం బెలరు గో మెడలింప గడుసువాఱిన యంగకములతోడ
సంస్కార మెనయక చదు వట్లు కృశ మయి రూపింపఁజడని దౌ రూపుతోడఁ
గలితుఁ డయ్యును బ్రాహ్మ మౌ లలిత తేజ మింత లనఁ బోలని ప్రసక్తి నెసక మెసఁగఁ
దాపసోత్తముఁ డితఁడు నాఁ దనరుచున్న భరతు రామనామావృత్తినిరతుఁగాంచి.
చ॥ ఎది చెవి సోఁకెనేనియు మునీద్యుఁడు రాముని వార్త యంచు నే
యది కనుదోయి కేర్పడఁగ నైన మహీతనయేశు రూపటం
చుఁ దెరువు గాంచుచున్ దడసె శోభనమూర్తి యి కేల మాటత
ప్పొదవున దేవదేవుదెస నొప్ప దిఁ కెట్లనువాని దీనునిన్. ౨౨౮
మ॥ మలదిగ్ధాంగనిబద్ధదుస్థితి నిజోన్మాదంబు రూపింప ని
ర్మలభావోన్నతి భావితాత్ముఁ డని సన్మాన్యత్వముం దెల్ప ని
ష్ఫలమో? సత్ఫలమో? శరీరభృతి దౌర్భాగ్యంబు వాటిల్లెఁ బో
కలదే యింకిట మే లటంచు నొగి నాక్రందించువానిన్ ఘనున్. ౨౨౯
ఆ॥ రూపుగొన్న ధర్మరూఢత్వ మనఁగ నంతర్ధిఁ బాసి నట్టి తప మనంగ
నెఱిఁ దనర్చు విషయనిగ్రహం బన నొప్పువాని భ్రాతృభక్తి వఱలు వాని.
ఆ॥ అష్టగంధముల నభీష్టార్థముల రామపాదుకార్చనంబు పరఁగఁజేసి
యఖిలరాజ్యతంత్ర మవ్వాని సన్నిధి నెఱుకపఱిచి ధరణి యేలువాని. ౨౩౧
తే॥ సకలవర్ణాశ్రమములు నసర్వతోభయమ్ములుగఁ బ్రోవఁజాలు నయమ్మువాని
నన్నిలక్షణములను రామావనీంద్రుఁ బోలు నిస్తంద్రుఁ డితఁ డనఁ బొలుచువాని
చ॥ నియమవిదు ల్పురోహితులు నిర్మలచిత్తు లమాత్యులున్ లస
న్నయు లగు యోధముఖ్యులును నంద్యవిచారులు పౌరు లాప్తులున్
మెయిమెయి రాజుతోడిగతి మేకొన నౌ స్థితి వన్యవృత్తులై
గయికొని కాచికొ ల్వెఱపఁగాఁ దఱి వేచెడువాని నగ్రణిన్. ౨౩౩
ఆ॥ గడువు గడవ రాము కలన గన్పడనిచోఁ దెఱఁగు లేమి బ్రతినఁ దీర్చు నీతఁ
డవల గతియుఁ గలదె యని యశ్రుముఖు లగు వారి నాదరించువలనివాని. ౨౩౪

—♦ హనుమంతుఁడు భరతునితో శ్రీరామసందేశముఁ జెప్పుట ♦—

ఆ॥ అంద ఱాస లెడలి యసురుసురుపడంగ ముందుగతినిఁ గూర్చి ముచ్చటించు
వాని సతతధర్మవత్సలు రామమయాత్ముఁ జేరి మారుతాత్మజుండు. ౨౩౫

ఉ॥ అంజలి ఫాలభాగమునయందు ఘటించి విరించికల్పుఁ డా
యంజన నోముపంట తగ నంతయు ని ట్లరుదెంచె నాఁగ నీ
వెంజిలి వాసెనయ్య నెఱి నెక్కొనఁ గంటికదయ్య సమ్మదం
బంటకఁ గాంచుమయ్య పొలుపారె శుభోత్కరమయ్య! యం చొగిన్. ౨౩౬
ఉ॥ ఏకృతి నింటివాసి చను కేర్పడఁగా వనవాసి యయ్యె నం
చాకృతి నీవు పాలుగొని యంత లలంతలు నంది కుందె ది
ట్లాకరుణాంబురాశి మహితాత్ముఁడు రాముఁడు సమ్మదంబునన్
నీకుశలంబుఁ బేర్కొనఁగ నేఁ డనిచె న్నను భవ్యభాసనా. ౨౩౭
ఆ॥ దేవ! ప్రియము నీకుఁ దెలిపెద దారుణశోకభార మెడలి సుఖము గాంతు
వీముహూర్తమున నె యెలమిమై భ్రాతతో సంగతుండ వగుదు చక్కనగుము.
ఉ॥ రాముఁడు రావణుం దునిమి రా వెడలించి మహీజ మైథిలిన్
బ్రేముడిఁ గొంచు సోదరుఁడుఁ బ్రీతమనస్కులు మిత్రవర్యు లు
ద్దామయశోబలాంచితులుఁ దద్దయుఁ గొల్వ మహాసమృద్ధుఁ డై
శ్రీమహితుండుగా నిచటు సేరఁగవచ్చుచునున్నవాఁ డనా. ౨౩౮
తే॥ లక్ష్మణుం డురుతేజుండు లక్షణమున దా నుపేంద్రుండు గా శచి మానసమున
సీత వైదేహి యాయశస్విని సమగ్రకామ్య గా రాముఁ డింద్రుని కరణి నొప్పె.
క॥ ఏను హనూమానుఁడఁ బవమానసుతుఁడ వానరేంద్రు మతమున రామున్
మా నగు భక్తిం గొలిచితి నీ నెఱి విభుఁ డనుప నిన్నుఁ నెనయుఁగంటిన్. ౨౪౧
ఉ॥ అని హనుమంతుఁ డాడు నెడ నాభరతేశిత భ్రాతృవత్సలుం
డనితరవృత్తి యై ప్రబలు హర్షమునం దలఁ పేద వ్రాలె మో
హానహతిఁ దూలి యొక్కగడె యమ్మెయినుండి మలంగి తెప్పిలం
గని ప్రియవాదిఁ గన్గొని నికామలసద్రసపారవశ్యుఁ డై. ౨౪౨

—♦ భరతుని పరమానందము ♦—

చ॥ కవుఁగిఁట నెక్కొనం బొదివి కార్కొను సంభ్రమవృత్తితోఁ గనుం
గవఁ బ్రమదాశ్రుపూర మొగిఁ గ్రమ్మి దిర మ్మగు వానిమేనునం
దవిలి యెలర్పఁజేయ నెడ దక్క నెలుం గొడగూర్చుకొంచు గా
ఢవిదిత మించు వేడ్కయు గడల్కొని ప ల్కదవింప నిట్లనున్. ౨౪౩
ఉ॥ దేవుఁడవో? మనుష్యుఁడవొ? తీ రగు మద్విభుశాసనంబవో!
భావుక మైన నా ననుచు భాగ్యమవో? యరయంగఁజాల న
న్నీవెర వొప్పఁ గాచి తిటు లిందఱ మన్చితి పుణ్యరాశి! యో
పావనమూర్తి! నీనుడువుభంగి యెఱింగి నుతింప శక్యమే. ౨౪౪

ఆ॥ ఓ ప్రసన్నరూప! యుల్లాసమో? యను క్రోశమో? యెఱుంగఁ గూర్చు నీవు
రాకమేల్మికెన్న నా కారణము నన్నుఁ గడఁకఁ జేర్చి తెడరుకడలి దరిని.
క॥ రాము శుభాగమము మదీయామయ మెడల నోడివిన దయామయునకునా
నోముల పున్నెపుఁజేజే కేమహితార్చన లొనర్తు నేమెయిఁ గొలుతున్. ౨౮౬
సీ॥ ఇదె నే సమర్పింతు నించుగోశతసహస్రము గ్రామశతము సుసంభృతమ్ము
సుందరమూర్తులు శుభసమాచారలు కుండలాఢ్యలు మహాకులజనితలు
స్వర్ణవర్ణలు శశిసామ్యాననలు సమస్తాభరణాంచిత లలరుఁబోండ్లు
నగు కన్యకలఁ బదియార్గురఁ నొసఁగెద నీకు దారలు గాఁగ నెఱె దలిర్ప
నెలమిఁ గూర్చితి మన్నాథుఁ డెనయవచ్చె ననిశుభోదర్క యీ వార్త నందఁజేసి
యిట్టినీకుఁ బ్రియాఖ్యాత కిడఁగ సదృశ మైన యర్థంబు గలదె యియ్యవనిలోన.
క॥ జీవితదాతవు నీ కే జీవితమె వశం బొనర్తుఁ జెలిమినెపమునన్
నీవలన మత్ప్రవర్తన మేవలనున నేనిఁ జెల్ల నెనయింపు సఖా! ౨౮౭
ఆ॥ అనుచుఁ బలికి విభుని యాగమనం బద్భుతోపమంబు హనుమఁ డొప్ప నొడువ
విధిఁ బ్రహర్షితుం డవేలకుతూహలుం డై దిదృక్షు భరతుఁ డనియె మఱియు.
తే॥ వెనుపుదక్క మహాటవిఁ బెరయఁ దొడరు నెడరు దోడుగ నడరు పెక్కేండ్లు నడిన
నంగఁ బ్రీతికరంబు మన్నాథు కీర్తనంబు నేఁటికి వింటిఁ గర్ణంబు లలర. ౨౮౯

—♦ భరతుఁ డడుగ హనుమంతుఁడు రాము పూర్వవృత్తము నొడువుట. ♦—

తే॥ అరయఁ గల్యాణి లౌకికి యైన గాథ నన్నువలగొని వెలసె నీనాఁటి కహహ
వెరవుమెయి వర్షశతము జీవించుచుండు వాని కానంద మొదవు నవశ్యమనఁగ.
సీ॥ అన్న! రాఘవున కయ్యగచరౌఘంబున కెట్లు సమాగమం బిఱవుపడిమె
నెయ్యది వర్తనం బెచ్చోట నునికి తా రే మేమి పని వంక నెట్లు మెలఁగి
రారాక్షసుం డెట్టిఁ డభియోగ మెభ్భంగి నొదవెఁ దీర్పున కేమి యురవు గలిగె
నిదియెల్ల వివరింపు మే దూరగుఁడ నయి యున్నాఁడఁగద నాథు నొఱకటమున
ననుచు ముచ్చటించి యంచిత యా బ్రుసి యందుఁ దదుపవేశ మనువుపఱిచి
యాదరింప హనుమఁ డధిపుని వనవాసభంగి వివర మొప్పఁ బలుకఁదొడరె.
సీ॥ మును దండ్రి తల్లి కిచ్చిన వరంబున రాము ప్రవ్రాజనం బట్లు పరఁగుటయును
బుత్రశోకమె తన్నుఁ బొరిపుచ్చ దశరథాధీశుండు పరలోక మెనయుటయును
దూత లేతెంచి మాతులగృహమ్మున నుండఁ దెరలించి నిన్నుఁ దోడ్తెచ్చుటయును
వచ్చి యయోధ్యలోఁ జొచ్చి మాతృవృతం బభీప్సితం బెల్ల గర్హించుటయును
జిత్రకూటశిఖరిఁ జేరి యమిత్రకర్శనుఁడ వీవు రాము సంశ్రయించి
యన్న! నన్నుఁగూర్మి మన్నించి ధర యేలు మనుచు నడుగులొత్తి యడుగుటయును.

శా॥ ధర్మం బింతయుఁ దప్పకుండ మెలఁగం జూర్కొన్న ని న్నెంచియున్
మర్మజ్ఞుం డతఁ డయ్యనిక్కపునుడి న్మానించి తాఁ గొన్న స
త్కర్మంబుం దిగనాడనేరక సిరిం దార్కాణగా వీడఁగాఁ
బేర్మిం బాదుక లీవు వేఁడ నిడి తృప్తిం గూర్ప నెక్కొంటయున్. ౨౫౪

ఆ॥ అంత నవి గ్రహించి యాన చొప్పే వేచియుండు ననుచు భర్త కొప్పఁబలికి
వచ్చి తింతవట్టు వరుస నీయరసిన యదియ యవలివృత్త మవధరింపు. ౨౫౫

ఉ॥ నీ విటరాగ వా రరుగ నెక్కొని కన్గొని రొక్క నిర్జనం
బౌ వన మందుఁ జొచ్చిరి మహాత్ములు భ్రాంతమృగద్విజంబు స
గ్రావము దావపావకవికంపితమార్గము ద్యూన మూస మా
నావిపినంబు వీడి చని రాదట నొ నటవీపథంబునన్. ౨౫౬

ఆ॥ హస్తిమృదిత మగుచు నతిఘోర మటు హరివ్యాఘ్రమృగమృగాదనాయుతాఢ్య
మైన విజనదండకాఖ్యమహావన మెనసి రబలతో సమిత్థబలులు. ౨౫౭

ఉ॥ వారల మ్రోలఁ దోఁచె బహువారణసారబలోన్నతుండు దు
ర్వారుఁడు వీరుఁ డుద్ధతుఁడు రాక్షసుఁ డొండు విరాధసంజ్ఞుఁ డే
పారఁగ వాఁడు ద మ్మజిమి యారవ మొప్ప నలంప నాతనిన్
నేరిమి చొప్పడ న్మడఁచు నిమ్న బయల్పడ నొక్క లోయలోన్.

ఆ॥ కూల్చి ఘీంకరించు కుంజరం బట్లుగా నఱచు మొఱకు నట్టి యంటఁగాల్చి
దుష్కరక్రియావిఘాతపాతకు వాని నమరపురికిఁ బనిచి యచటు వాసి.

క॥ సాయంతనసమయంబున నాయిరువురు సీతతోడ నటఁజని శరభం
గాయత్తము రమ్యము నౌ నాయాశ్రమపదము సేరి యలరారు నెడన్.

క॥ ఆముని రాముని సుమహితనామునిఁ గని సుకృతి నైతి నద్యచరిత ని
న్నేమమునఁ గంటి శతధృతిధామమునకు నరుగువాఁడ దయ నెల వీవే.

ఆ॥ హరిహయుండు పిలిచి యరిగెనం చని యోగ వహ్నిఁ జొచ్చి మౌనివరుఁడు సనిన
నచటు వీడి తాపసాశ్రమంబుల నెల్ల నరసికొనుచుఁ బూజ లందఁగనుచు.

తే॥ తపసు లడిగిన కర్జంబు దలఁపున నిడి యందఱకు వందనము లర్థి నందఁజేసి
యట జనస్థానమునఁ గూర్చినట్టి వసతి సతియుఁ దా ననుజుఁడు నుండుసమయమునను.

ఉ॥ శూర్పణఖాఖ్య రావణుని సోదరి దుష్టచరిత్ర రామునిన్
దర్పకసన్నికాశు మదదర్పమునం దమకించి దుష్క్రియం
బేర్పడఁ బైకొనన్ వలవ దేగు మనన్ జనకాత్మజాత నేఁ
దీర్పక పో నటం చది యుదీర్ణత నూప నమర్ష మూర్తి యై. ౨౬౪

క॥ రాముఁడు లక్ష్మణుఁ గని యీమోహమయమూర్తి బాపు మనిన నసిఁ గొని తోడ్తో
నామూర్ఖ కర్ణనాసం బామహితుఁడు గోసి యింక నరుగు మనవుడున్. ౨౬౫

మ॥ అది రేపవ్వదునాల్గువేవు రసురు ల్వ్యాపాద మేపార నా
పద మల్లాడఁగ నేగుదెంచి యఖురుల్ ప్రావీణ్య మొప్పన్ ఘన
ప్రదరంబు ల్వఱఁగించి రాముఁ డొకఁ డప్పాపౌఘు మెల్లన్ సుదు
ర్మదముం దా నరజాములోన మడఁచె న్మానుస్సుర ల్పొంగఁగన్. ౨౧౬

ఆ॥ తపముచేటు గూర్చు దారులు ఖరముఖ్యు లతిబలాఢ్యు లట్టు లనవశేషు
లగుడు మూర్ఖురా లహంకృతిమైఁ జని యగ్రజునకు వినిచి యడలుటయును.

శా॥ మారీచుం డనువాఁడు తత్ప్రణిధి దుర్మానుండు ఘోరుండు మా
యారంభుం డతఁ డంప రత్నమయదేహం బుల్లసిల్ల న్మృగా
కారుం డై చని యాశ్రమంబునదురున్ గాంతు ల్దిశాంతంబులం
దీరొప్పం గబళింపఁగా విహరణోద్వృత్తిం బ్రవర్తింపఁగాన్. ౨౧౮

ఆ॥ మాయదారిమెకము మైథిలి తాఁ గాంచినంత నిట్టిదాని నరయ మెందుఁ
బట్టితెచ్చి యిమ్ము ప్రాణనాయక! యిది యిమ్ము వెలయఁజేయు సొమ్ముసుమ్ము.

క॥ అనవ్వుం డట్లొనరించెద నని యనఘుఁడు దాని పజ్జ నరుగుటయుం దా
నని మిషగతి నది పొదలిన జననాథుఁడు ద్రెళ్ళనేసె శాతశరమునన్. ౨౨౦

క॥ హా లక్ష్మణాయనుచు దుష్టాలాపము సేసి యసుర యడఁగిచనిన నిం
కేల తడసె దని లక్ష్మణు నాలీఁగామూర్తి వనిచె నధిపు నరయఁగాన్. ౨౨౧

చ॥ అద నిదె యంచు దుర్మతి దశాననుఁ డాగృహసీమఁ ద్రొక్కి పా
పదము గ్రహమ్ము రోహిణినిఁ బాల్కొనినట్టులు సీతఁ గొంచు దు
ర్మద మొదవంగఁ బోయెను రిరక్షిషు దక్షు జటాయువున్ జయా
స్పద మగు చంద్రహాసమునఁ జక్కొనరించి వియత్పథంబునన్. ౨౨౨

ఉ॥ ఆయెడ ఋశ్యమూకమను నద్రిఁ బ్లవంగమనాథుఁడుం గపుల్
శ్రీయుత నేసతీమణినో చెచ్చెరఁ గొం చిదె పోవుచున్నవాఁ
డాయతతేజుఁ డియ్యసురుఁ డంచుఁ దలంచుచు నుండునంతలో
నాయెలనాగఁ జేర్చె నతఁ డంకిలి దీఱ నటంచు లంకలోన్. ౨౨౩

క॥ సౌవర్ణమణిమయాంచిత మా వేశ్మమునందు నునిచి యాయమతోడన్
దా వెడసాంత్వపుఁ బలుకుల నావికలుఁడు దేర్తు ననెడు నాసం బలికెన్. ౨౨౪

ఆ॥ వాని భాషితములు వరవర్ణిని వికర్ణితము లొనర్చి తృణము దానవుండ
టంచు నెంచి చనియె నట నశోకాఖ్య యా వనిక నుండు తలఁపు వఱలుచుండ.

ఉ॥ దుష్టమృగంబుఁ బోకడచి దోర్బలభీముఁడు రాముఁ డాదటన్
గష్టతరం బటం చనుజుఁ గన్గొని చెచ్చెర నేగుదెంచి యా
నష్టగృహంబు చందము వినాకృతముం గని గృధ్రరాజు నా
దిష్టపదంబునం గనమి దీర్ణమనస్కత నొల్లఁబోవుచున్. ౨౨౬

తే॥ అల్లగోదావరీతటాభ్యాశపదవిఁ బుష్పితానోకహంబులుఁ బొదలుఁ జొచ్చి
యరసి కొంతవడికి గృధ్రవరు నిరస్తుఁ బితృసఖుం గాంచి తల్లడిల్లగతికి వగచి.

క॥ ఆతని దహించి పేర్మిం బ్రేతక్రియలెల్లఁ దీర్చి పెం పేద వన
వ్రాతముఁ బెరయుచు నరయుచు లూతాకృతి నున్న పిశితలోలు కరములన్.

ఆ॥ చిక్కి యతని పొడవుచేతులు వెగఁజూడ జూడ నొవ్వ తనువుతోడ నతఁడు
పుణ్యగతికిఁ బోవు పొలుపునఁదగు వార్తఁ దెలుపమెలఁపుగూర్చు తెరువుఁగాంచి.

క॥ శబరి న్మతంగముని వనిఁ బ్రబుద్ధఁ గని పూజవడసి పరమపదవికిన్
బ్రబలతపోయోగంబున నబల సనుచుఁ దెలిపి నట్టి యర్థముఁ గొనుచున్. ౨౮౦

క॥ పంపాసరోవరము దరి సొం పెడలిన యెడఁదగతులఁ జూడఁగ నగుచున్
శంపాలతాంగి నొగులు తలం పెటియఁగఁజేయఁ దనదు లా వెడలంగన్. ౨౮౧

క॥ సానుజుఁడు ఋశ్యమూకాఖ్యానం బగు నద్రి సేర నరు దేర మహీ
జానాయకుఁ గని భానుజుఁ డానరవరు లెవరొ యనుచు నతిశంకితుఁ డై. ౨౮౨

ఆ॥ నన్నుఁబనుప నేను నాథుని చరణము ల్గొలిచి వారి నచటు గూర్చుటయును
భ్రాత వాలి దన్నుఁ బఱప నం దున్నవాఁ డతఁడు విభుని శరణ మర్థి వేఁడె.

ఉ॥ ఆతని వర్తనం బడిగి యాతఱి రాముఁడు వానరేంద్ర ! ని
న్నేత నొనర్చువాఁడ నని నిర్ణయ మొప్పఁగఁ బల్కి వారికిన్
ఖ్యాతము సఖ్య మావహిలె నగ్నిసకాశమునందు నవ్వలన్
శాతశరంబునం దునిమె శక్రజు నవ్విభుఁ డొక్కమాత్రలోన్. ౨౮౪

తే॥ ఆమహాకాయుఁ డతిబలుఁడట్లు గూల రాజ్యమున నిల్పె సుగ్రీవు రఘువరుండు
దాన నుపొంగి యినజుండు తద్ద బనిచె సీత నరయంగ నలుదెస ల్సేనయఁ గపుల.

మ॥ పదికోటు ల్లవగు ల్ప్రపంచ మఱుమన్ బ్రస్థాపితు ల్గాఁగ స
మ్మద మొప్ప న్మది దక్షిణాశఁ గొన సన్మానించు మా కప్పు విం
ధ్యదరిన్ మాసయుగంబు గోల్పడిన చందం బయ్యె నయ్యాపదం
బదిలం బించుక లేని మమ్ముఁ గని వ్యాపాదంబునం జేర నై. ౨౮౬

ఆ॥ గృధ్రరాజ మొకఁడు గిళనం బొనర్పంగఁ బెరయ నేము వాక్యసరణి నాజ
టాయు వట్లు సనియె నాయ మా గతి నన నదియు వగచి కపుల నాదరించి.

తే॥ అయ్యలార! నాతమ్ముఁడే యతఁడుమీరురామకార్యార్థులట్టి యారామయదిగొ
లంకలో నున్నయది మేలి లావు నెఱయ నబ్ధిదాఁటి చనుం డని యనువు దోఁప.

క॥ ఆసంపాతి మహాబలుఁ డాసన్న న్నొడివి యిచ్చు నరుగుటయు నఘం
బాసయుఁ బెనఁగొన నంబుధి నాసన్నం బైనదాని నటఁగాంచి కపుల్. ౨౮౯

ఆ॥ వగవ వారి యెడరు వారించెద నటంచు జ్ఞాతివర్గ మెల్ల సంతసిల్ల
యోజమెయి మహాబ్ధి యోజనశతము గలంకతోడఁ గడచి లంకఁ జేరి. ౨౯౦

ఉll శోకము పై లెసంగఁగ నశోకవనస్థలి నొంటికట్టుతో
నేకికయు స్థరాశయయు క్షీనయు దీనయు నై తపస్వితా
ప్రాకటవృత్తి నున్న రఘురాము సధర్మిణిఁ గాంచి మ్రొక్కితిన్
నీకడ కమ్మరో ! పనిచె నేత తరించితి వంచుఁ బల్కుచున్. ౨౯౧

ఆll ఆయనిందితాత్మ కధిపు సేమంబుతో నంగుళీయకము మహామహం బ
నుత్తమంబు భక్తి నొసఁగితి నడియాల మదియ చాలె నంబ నలరఁజేయ. ౨౯౨

కll ఏయమ్మ నోము ఫలమవొ? మాయన్నా! కాన్పవైతి మా కింతకు నే
నాయుర్వ్యయ మొనరింపమి మాయురె శుభమయ్యె ననుచు మానిని పలికెన్.

ఆll అట్లు హృష్టయైన యద్దేవి నచటి యుదంత మడిగి యరసి తడయ కేను
సెలవుగోర నొసఁగె సీమంతమణిని సీమంతినీమణియు సుమాళ మెసఁగ. ౨౯౪

ఆll అచటువాసి యొకఁడ నాలోచనము సేసి లోచనోత్సవంబు నాచరించు
నసురనాథు నమ్మహావన మ్మంతయు ధ్వంసితమ్మొనర్చి వఱలుచుండ. ౨౯౫

కll ననుఁ బట్టి కట్టి కొట్టఁగ ననుపదమె సురారి వనుప ననుచరవర్గం
బనిచితి జముప్రోలికి నాతనువుం గాపాడుకొనెడు తత్కర్మమునన్. ౨౯౬

ఆll అట్లు కోట్లకొలఁది నబ్బలంబుల రూపుమాపి వానిఁ జేరి మాటచొప్పు
దనర బుద్ధిసెప్పి తద్దుర్ణయపుఁ జేఁత కలిగి పురవరమ్ము నగ్గి కొసఁగి. ౨౯౭

తేll అవల దేవికి వందనం బాచరించి యంబ యొసఁగిన యారత్న మనువుసేసి
కొని తరించితి సంద్రమ్ము గొనకొనెడు భవమ్ము వేరిటి సంద్రమ్ము వరుస పొసఁగ.

కll కృతకృత్యుఁడనై యమ్మెయి కృతిఁ దీర్పెసలార రాముఁ గృతిసత్తముఁ జే
రితి నతిఁ గూర్చితి వినిచితి సతీవతంసంబు వార్త సంభ్రమ మలరన్. ౨౯౯

కll అర్చిష్మంతం బమ్మణి నర్చిమ్మత్ప్రతిభునకు సురార్చితునకు నే
నర్చన లెసఁగ నొసంగితి నేర్చినవాఁ డీతఁ డనుచు నేత గణింపన్. 300

తేll అబల శుభవార్త విని రాముఁ డరుస మొప్ప జీవితాశంస సేసెను జీవితాంత
మొదవ నాతురుఁ డగు నాతఁ డమృతసేవనమున నుజ్జీవితుం డయి ననుచునట్లు.

కll ఉద్యోగమసురహతికై యుద్యోజించె మదిలో రఘూద్వహుఁ డంతన్
సద్యోఽఖిలలోకశమప్రద్యోతితమూర్తి యగా విభావసుఁ డనఁగాన్. 30౨

ఉll వానరవీరవాహిని ప్రవర్తిలె నంతట సాగరాంతసీ
మానుసృతంబుగా నలుని నాదట సేతు వొనర్పఁ బంచి ని
ర్ధ్యాన మొనర్చి దాన బల మంతయు నవ్వలిగట్టు సేరఁగాఁ
బూనిక సంతరించె రఘుపుంగవుఁ డప్పురి ముట్టడింపఁగన్. 303

ఆll అట్లు దాడివెట్టి యసురులు పైకొనఁ దునుమఁదొడరి రెదిరి ఘాతదురితు
లైన హరివరు ల్ప్రహర్షాప్తి రిపుల కయ్యదె యుగాంతకాల మగుచునుండ. 30౪

ఉ॥ నీలుఁడు ద్రుంచె వైరిబలనిష్ఠితుఁ డైన ప్రహస్తుఁ దక్కువా
రాలలి యోధనాయకుల నందఱఁ దున్మెరి లక్ష్మణుం డస
జ్జాలము మూలకంద మగు శక్రవిజేత జయించె రాముఁ డు
ద్వేలశరార్చి వేల్చె సముదీర్ణుల రావణకుంభకర్ణులన్. ౩౦౫
ఉ॥ పూవులవాన జాల్కొనఁగఁ బుణ్యమహర్షులు వేల్పులు న్మహా
దేవుఁడు శక్రకాలజలదేవులు బ్రహ్మయు డాయవచ్చి సు
శ్రీ విలసిల్ల రాము నుతిజేసిరి భావన వెంగ లోకము
ల్బావుకసంపదం బొదలెఁ బావని భూసతి యొప్పె మెప్పునన్. ౩౦౬
క॥ మీతండ్రి దశరథేంద్రుఁడు చేతోమోదంబు దనరఁ జెలు వొప్పారన్
బూతచరిత్రుని రాముని ఖ్యాతయశోధనుఁడు గ్రొచ్చి కౌఁగిటఁ జేర్చెన్. ౩౦౭
శా॥ ఆయానందరసప్రవాహసృతియం దగ్ధోక్తులే కాని యె
ప్డేయేవక్తలునేనిఁ దెల్లముగ నిట్లీయర్థ మంచు న్వచ
శ్శ్రీయుక్తి న్వివరింప నేర రిదియు న్సిద్ధంబ పో యేను న
న్లే యూహ న్సమకూర్చుకొంటి భవదీయేష్టార్థసంసిద్ధికిన్. ౩౦౮
ఆ॥ అమరులెల్లఁ బొగడి హర్షప్రహర్షాప్తి వరము లొసఁగ రక్కసంశమాక్తి
కమున క్షం దొకంటఁ గలనునఁ బొలిసిన కపులు బ్రదికి మేలుకాంచి రపుడు.
శా॥ ప్రీతుం డయ్యె రఘూద్వహుండు ప్లవగు ల్ప్రీతాత్ము లై రెల్లరున్
జేతోమోదమునన్ సుర ల్మునులు సంస్థితత్వముం గాంచుచున్
సీతానాయకు నాన స్వస్వపదము ల్చేలొప్పఁగా జేరి ర
ద్యాతాయాతము లొప్పె న ప్పుభయలోకానందసాంద్రస్థితిన్. ౩౧౦
తే॥ వానరులు రాక్షసులునుఁ దత్ప్రభులు నుదితమహితసౌహార్దమునతమమతము హిత
వెలయ వెలలేని కందువ విభుని యానఁ బుష్పకవిమానవరముపైఁ బొనరుపడిరి. ్రము
క॥ సీతాసమేతుఁ డై రఘునేత సమారోహణంబు నెఱప సుహృత్సం
స్థితుని యనుమతి వడసి యనేతాదృశమహిమ మది మహీయస్స్ఫురణన్.
ఆ॥ మొగిలు దారిఁ జంద్రమోమండలం బనఁ దళుకు తెల్లకడల దళముకొనఁగ
నవ్విమానరాజ మరుదెంచెఁ గిష్కింధ సేర నొక్కమాత్రఁ జిత్రముగను.
క॥ అటఁ దరలి గంగ సేరఁగఁ దటుకున నేతెంచి మానితారావిభు న
య్యుటజమున నున్నవాఁ డిపు డటవీచరవరులఁ గొలువ ననుమోదమునన్.
తే॥ పుష్యయోగంబు తగ నెల్లి పొసఁగుచుండు వెరవుమైగనఁ గాంతు వవిఘ్నముగను
రామచంద్రు దయాసాంద్రు రహిం దలిర్పఁ దపము సిరిరూపు గని సిద్ధిఁ బార్పఁ దొడర.
చ॥ అను హనుమద్వచస్సరణి యంతర మంతయు సంతసంబుగా
నినుచు కడంకఁ జిప్పిలెదు నెయ్యపుఁ దేనెల సోన లన్నటిన్

గనుల నలుంగుల న్వెడలఁగా రస మియ్యదియే యటంచు వా
క్కనుసృత మై కడల్కొనఁగ నానృపనందనుఁ డుల్లసిల్లుచున్. ౩౦౬

క॥ పునరాలింగితుఁ జేసి విభుని దూతుని దెసనె చూడ్కి పౌనరారఁగ ని
ట్లనె నాథునుఁ డొయ్యనఁ గూర్చిన యంజలి పరవసంబు సిరిఁ బెర్కొనఁగన్.

ఆ॥ తవిలి నామనోరథంబుఁ బూరింపంగ నిన్నినాళ్ళ కిట్టు లేగుదెంచి
తదియ నీవు గాఁగ నన్న! మే ల్దెలిపితి వన్న నిన్ను బొగడ నలవి యగునె.

సీ॥ కావించినాఁడవు కలిమికి మూల మయ్యినజునితోఁ బతి కెలరు సఖ్య
మర్పించినాఁడ వయ్యంగుళీయక మంబ కసుర యాదలఁ గాల నాక్రమించి
నడిపించినాఁడవు నను చు వానరసేనఁ గడలి యవ్వలి దైన గట్టు సేర
గెలిపించినాఁడవు గీల్కొను దొసఁగులఁ గెడపె నీతం డన్న కీర్తి వడసి
నాథు నన్నుఁ గూర్చినాఁడవు నేఁ డిట్లు మేలివార్తఁ దెలిపి మేను నిలిపి
నాశిరమున మోపినాఁడవు ఋణభరం బెట్లు దలఁగువాఁడ నేర్పుఱుపుము.

క॥ ధన్యుల రైతిరి మీర లధన్యుఁడ నై యిల్లుసొచ్చి తడసితి నీ పు
ట్టన్యుల యట్టిది గామిన్ ధన్యుల నోనరించెఁ గన్నతల్లిం దండ్రిన్. ౩౧౦

తే॥ అన్నయడుగులు దఱియంగ నన్నుఁ జేర్చి యన్న మెఱుఁగని న్నాసుతసన్న లెంచి
యన్న ద న్నేలుకొనునంత కనువుపఱుపఁ గడఁగు మింకనుఁ బున్నెంబుఁ గట్టుకొనుము

క॥ అని వినయమునఁ బలికి ముదమున భరతుఁడు సత్యవిక్రముఁడు హృష్టుని ద
మ్ముని శత్రుఘ్నునిఁ గని యి ట్లని యాజ్ఞాపించె సంభ్రమాంచితుఁ డగుచున్.

సీ॥ పూజింపఁబనుపుము పూజ్యపూజకుల దేవాగారనగరచైత్యస్థలముల
నర్చింపఁ జేయు మనన్యసామాన్యు లౌ బ్రహ్మణ్యమూర్తుల బ్రాహ్మణులను
గూర్పింపఁజూడుము గోసహస్రంబుల వత్సయుక్తముల సువర్ణితములఁ
దెప్పింప నెంచుము దివ్యసుగంధచందనమాల్యముఖశుభార్థప్రతతుల
మృదుమధురశుద్ధపాకసమేతభోజ్యభక్ష్యరాసు లెందెందు నేర్పడ నొడువుము
చలువపందిళ్ళు పానీయశాల లెచటునందు నేనియుఁ గన్పట్ట నలవఱుపుము. ౩౧౩

ఉ॥ సూతులు వందిమాగధులు స్తుత్యపురాణవిశిష్టయోగని
ర్ణీతకథాప్రపంచగుణరీతికలాపకల్పాసమగ్రతో
ఘేతులు సత్కవీశ్వరులు ప్రీతి మెయిం జనుదెంతు గాక! యి
ట్లీతటి రామదేవుఁ గని యెల్ల షడూర్జితి నుల్లసిల్లఁగాన్. ౩౧౪

తే॥ దివ్యగాయనులన్ను ఋంచు దిట్ట లైన భవ్యగాయను లెల్లెడఁ బరఁగువారు
గీతవాదిత్రనృత్తాఖిలచరిత పూతగణికాగణములతోఁ బొలుచువారు. ౩౧౫

ఉ॥ సుందరమూర్తి రామవిభు శోభనసంపదుదారకీర్తి మో
మిందుఁ గలాభిపూర్ణ సిరి నేర్పడ నేలఁగ నైవ సన్మహాం

బిం దిరవొందె నేఁ డరసి యెమ్మెయి నెందఱు పుణ్యయోగని
ష్యందగుణానుభూతి రసపారగులై ముద మందఁగాంతురో. ౩౨౬

వ॥ అనుచు నయ్యనూచానుండు వివరించునంత. ౩౨౭

క॥ శిష్టుఁడు భరతుని యాన విశిష్టుఁడు శత్రుఘ్నుఁ డలరి చెలు వలరారన్
విష్టిశతసహస్రముల కభీష్టప్రతిపాదకముల కేర్పడఁ బలికెన్. ౩౨౮

సీ॥ చదునొనర్పింపుఁడు సమవిషమోన్నతనిమ్నస్థలంబుల నెఱిదలిర్పఁ
బరిశోధనంబునఁ బరపుసేయింపుఁ డట్లాలయ ప్రదేశంబు లోఱపు నెఱపఁ
గల్యాణధామంబు గాఁగ నందిగ్రామ మాయయోధ్యం గూడి యమరు కొంచుఁ
డించు చందనసారహిమపూరముల నించు లీల గుబాళించు మేలు గాంచుఁ
డలరు లాజలు మవ్వంపుటలరుగములు నలవరింపుఁ డాగుల్ఫకీర్ణాస్పదముగఁ
బురవరమున నగారగోపురపతాకికాంకముల నొడగూర్పుఁ డలంకృతులను.

మ॥ మణిదీపోజ్జ్వలమండలాంచితలసన్మానోద్విమానౌఘతో
రణజాలోరువితానరాజగృహయంత్రశ్రేణిక ల్నేఁడు స
ద్గుణవృద్ధిం గని శ్రీసమృద్ధిఁ దమ కెందున్ సాటి లే దంచు మే
ల్ప్రిణతు ల్గాంచుచు నుండఁగావలెఁ జుడీ భానూదయం బెంచుచున్. ౩౩౦

ఆ॥ నూర్లకొలఁది గాఁగ నూతనస్రగ్దామము క్తసుమసుగంధి మూలపంచ
వర్ణచూర్ణములఁ బ్రవర్తింపఁగాఁ జేయవలయుఁ జుండు రాజవర్త్మములను.

ఉ॥ మంగళవాద్యనాదములు మానితగాయకగీతిసంగతుల్
పొంగి మహాహ్లాదయాకలనఁ బోడిమి మించు సముద్రరావపుం
భంగి గడల్కొన న్నగడు భక్తిమెయిన్ రఘునాథుఁ దోడితే
రం గమనింపఁగా వలయు రాణఁ బొసంగ సుమాళి మొప్పఁగాన్. ౩౩౧

క॥ అని భరతు నాన శత్రుఘ్ననివేదిత మగుడు నెగడు గనిన మనములం
దను వొందిన యౌత్సుక్యము దనువొందెనొనాఁగఁ బ్రజల దార్కొని వెలయన్.

వ॥ అంత నొక్కింతసేపులోన యనంతామణిమండనాయమానం బగు నయో
ధ్యానగరంబు నగరుతోడం గూడి శ్రీకాంతుని రాక చెవిసోక రాకాశశాంకో
దయంబున దం బెనసిన యంబునిధి సంబంధంబు ననుబంధించి ప్రాతిభాసికం
బగు ద్వైతం బేమిచేయు నేనాఁడేనియు నద్వైతంబె సిద్ధాంతంబు గదా యను
కొనినట్టు లొక్కం డై స్వయంప్రకాశంబును నక్షరంబును నవికల్పంబునుఁ
బ్రజ్ఞానఘనంబును శుద్ధంబును బుద్ధంబును బరమక్షేమాస్పదంబును సాంద్రా
నందంబును నమృతసారతత్త్వాత్మకంబును నిత్యతృప్తంబును బరిపూర్ణంబును నై
శోభిల్లుచుండె నందు వాత్సల్యంబున కలిమిం దొలుదొల్త భరతానుమతిం
బురస్కరించి పురంధ్రీజనంబు పురోభాగం బలంకరింప నుదారభావంబున

రాజదారలు వెలువడునంతలో నిరంతరం బనంతంబు నగు సంతిసంబు సెలంగి యలుంగులు ద్రోఁచికొని సాత్త్వికవికాసమిషంబున మొల్లంబై వెల్లివిరియ ధృష్టియు జయంతుండును విజయుండును సిద్ధార్థుండును నర్థసాధకుండును నశోకుండును మంత్రపాలుండును సుమంత్రుండు నను నమాత్యసత్తములుం దదుత్తమాంగనలును సేనాగణగణేశ్వరులును దత్తరుణీమణులును బ్రాహ్మణులుం దత్కుటుంబినీరత్నంబులును రాజన్యప్రభృతులును దద్యువతివతంసంబులును శ్రేణీముఖ్యగణంబులుం దదీయస్త్రైణంబులు సామంతులు హితులుం బురోహితులుం బౌరులు జానపదులుం బరదేశీయులును విద్యుల్లతాపుంజమంజులద్యోతమానంబు లగు యానరాజంబుల శాతకుంభమణిగుంభవిభూషణశుంభజ్జృంభమాణమత్తకాశినీకుచకుంభోపమాన కుంభ మత్తమాతంగసహస్రంబుల హేమకక్ష్యావిరాజమానసుందరకరేణుకాబృందంబులం దురంగమాక్రాంతమహారథంబుల నాజానేయాదిహయోత్తమంబుల నధిష్ఠించి యలరారుచు నేమే మనుచుం జనుచుండ శక్తిప్రాసప్రముఖంబు లగు సమస్తాయుధంబులు ధరించి ధ్వజపతాక లడియాలంబులు గొడుగులు నాలవట్టంబులు నొప్పారఁ బరవళ్ళు సేయు వీరనరవరులకు సహాయంబు లగు పదాతిసహస్రంబులు పండితులు గవివరులు గాయకులు వైణికులు మార్దంగికులు వందులు మాగధులు మణికాంచనాలంకృతగణికాశతంబులుం బడవాళ్ళుఁ బడిదియలు వరవుళ్ళును దదేకాభ్యుదయ సమయంబున రామదర్శనకుతూహలాయత్తచిత్తంబుల నోఅపారం బరతేరనైన సాకేతనగరంబు సకలంబును నందిగ్రామంబుతో సద్వితీయంబయ్యు నద్వితీయం బై నిండారి సిరులబండారి యై నెఱిమీఱు నయ్యవసరంబున. 33౭

ఉ॥ యానవరంబులం దశరథాంగన లెల్లరుఁ గోసలాత్మజన్
మానుగ ము న్నమర్చుకొని మానిత లైన సుమిత్రఁ గైకన
వ్వానికఁ బార్శ్వయుగ్మమునఁ బొం పమరారఁగఁ గూర్చుకొంచు స
న్మాన మనూన మై నెగడ నందనదర్శనలాలసాత్మ లై. 33౮

—♦ సపరివారుం డగు భరతుఁడు సపరివారు రాము నెదుర్కొనుట ♦—

శా॥ నందిగ్రామము సేరి రయ్యెడ మహానందంబు పూరంబు వొం
గం దత్కాలనిబద్ధము ల్తురగరింఖాఘట్టహేషారథ
స్వందేభావళిబృంహితారవములున్ సన్మంగళాతోద్యము
ల్దుందుభ్యంచితనిస్వనంబులును జ్యా ద్రొట్టిల్లు న ట్లొర్వడన్. 33౯

తే॥ అంతయును సంతసంబున సంతరించి నదియ కాఁగ నదియ కాఁ గతార్థ మయ్యె
రాము వరియింపఁ బొదలు సామ్రాజ్యలక్ష్మి యందియల మొరపము మురు వంబుజాక్షి.

చ॥ గురులు ద్విజాతిసత్తములుఁ గోవిదవర్యులు నైగమాఢ్యులై
పరఁగెడు శ్రేణిముఖ్యులునుఁ బ్రాజ్ఞులు మంత్రులు బంధుపఙ్క్తులున్
బరవడి మంగళార్థము లపారము లేర్పడఁ గొంచు హర్షసం
భరితులు గాఁగఁ జేరి నడువన్ భరతుండు రసార్ద్రమూర్తియై. 33౭

ఆ॥ నృత్తగీతవాద్యనిశ్రేణులఁ బొసంగు వీణమెట్టు లెక్క వివిధతూర్య
భేద మరయుచును సవిధవందినుతు లందు కొనుచు నలువరాణి గూడి రాఁగ.

సీ॥ మొదల పీఠంబునం దార్యపాదుక లాత్మీయభాగ్యంబు లనువుపఱిచి
యోణిము త్తెపుఁజేర్ల నలరుదండల నొప్పు పాండురచ్ఛత్రంబు పరఁగదాల్చి
వెల్లజల్లి మెకమ్ము వీచోపు లిరుగడ హేమభూషితము లిం పెనయఁ గూర్చి
యధిరాజయోగాఢ్య యౌ శ్రీ యదియ యిట్లు ము పొందె ననెడు నిరూఢిఁ బేర్చి
దీనుఁ డుపవాసకృశుఁ డతిధీరుఁ డుచిత చీరకృష్ణాజినాంబరశ్రీవిలాసుఁ
డన్నఁ గనుఁగొనఁ దత్పూర్వహర్ష మెసఁగ భరతుఁ డందఱఁగూడి తాఁ బయలుదేరె.

ఆ॥ అన్నమాట యన్న నన్నన్న వాని మే నొప్పంగు హర్షవార్ధిపూర మనఁగ
నిన్ని యభ్యుదయము లెనసిరా నానాఁట నంతలయ్యె ననుట యబ్బురంబె.

శా॥ ఆలో రామునిఁ జేరి తత్పదయుగం బర్చించి తద్వృత్త మా
లీలామానుషమూర్తి మే లన సముల్లేఖ న్నివేదించి వి
ద్యాలంకారవిశిష్టకీర్తి హనుమం డర్థాఢ్యుఁడై మల్లిరా
నాలోలత్వము దోఁపఁ గైకకొమరుం డవ్వానితో నిట్లనున్. 3౪౨

తే॥ అన్న! యి ట్లిది కాపేయి మైయ తనర్చు చపలచిత్తత గాదుగా సంభ్రమమునఁ
బలికితో కానరాఁ డేమి? ప్రభుఁడు రాముఁ డాపరంతపు విడిది యి ట్లలఁతి నున్నె.

ఆ॥ కామరూపు లగుచుఁ గడకొందు రంటి వా రేరి ? ఘనులు నానరేంద్రు లెందు
నెఱయకుండువారె సహితులై యొక్కడ నేమిచోద్యమొక్కొ యెఱుక పడదు.

సీ॥ అని సందిహానుఁడై తను నిక్క మరయంగ నాసత్యవిక్రముఁ డడుగ నర్థ
విజ్ఞాపన మొనర్చు విధమునసే వాని కనుమఁ డి ట్లనె దేవ! యవధరింపు
మింతయుఁ గల్ల గా దే నసదే? సదాఫలకుసుమమధుస్రవంబు లగుచుఁ
దతమదభ్రమరనాదితము లౌ వృక్షము ల్మునిప్రసాదంబున మొనయుదేర
నలరుచున్నారు వారు తదనుభవమునఁ జొక్కి యిక్కాల మింతయు సూనృతంబు
యమ్మహాతిథ్య మఖిలగుణాన్వితంబు వినుతిసేయంగఁ దీఱదు వేయునోళ్ళ. 3౪౫

ఉ॥ వాసవసంప్రదత్తవరవైభవ మయ్యది మౌనియోగదృ
గ్భాసముపార్జితంబు విభు ప్రాప్తి విభాసిత మయ్యె నియ్యెడన్
శ్రీసముపేతులై యిపుడె చేరఁగలా రెడలేక కాంతు లే
యాస ఫలింపఁ గన్నుఁగవ కాఢ్యమహోదయ మావహిల్లఁగన్. 3౪౬

మ॥ అదిగో కోనమెకంబు లార్వ నొఱపౌ నారావ మారాద్గతం
బు దృఢం బంచితహృష్టిపుష్టికలనాపూర్ణం బుదీర్ణంబు నై
మదికి న్వీనుల కెక్కి నెక్కొనఁగ నా మార్గంబు రూపించుచు
న్నది యవ్వాహిని గోమతీతరణసన్నాహాఢ్య యా నెన్నఁగాన్. ౩౪౭
క॥ అల్లదిగొ రజోవర్షం బుల్లోలం బగుచు నెఱసె నుద్ధూతం బై
యల్లలి వాలుకినీస్థలి సల్లలితమ కాదె యదియు జనపతితిలకా! ౩౪౮
ఆ॥ సాలవనము రమ్యసాల మాలోల మొనర్చుచున్నవార లర్చితులు ప్ల
వంగు లిమ్మ్యెడం గడంగి లోలాత్మత నాగణింప నోఁగదే గుణాఢ్య! ౩౪౯
సీ॥ అదె యిదిగో కాననమ్యెఁ బుష్పకము దివ్యవిమానవరము సమంచితంబు
చందురు బింబంబుచక్కి దోసంబుల రూపించు కాంతినిరూఢి మెఱసి
విమల మై యెది తపోవిధిమనోయోగాప్తి బ్రహ్మనిర్మిత మనఁ బరఁగెఁ దొల్తఁ
గడఁగి ప్రసాదించెఁ గమలసంభవుఁడు కుబేరున కాతని బీర ముడిపి
రావణుండు హరించె నారాక్షసేంద్రు సకలబాంధవసముపేతు సంహరించి
రాముఁ డెనయంగ నీనాఁట రామవాహనంబు నాఁగఁ దనర్చుచున్నది జనేశ!
తే॥ తరుణరవిబింబసదృశ మిద్దాన రాముఁ డనుజుతో జనకజతోడ నధివసించి
యున్నవాఁడు మహాతేజు లూర్జితు లగు ప్లవగ రాక్షసవిభులు తన్నలసికొలువ.
మ॥ అనుచుండం గనుచుండునంతట నె హర్షాంభోధు లుప్పొంగి నె
ట్టన నొక్కుం డయి యంబరం బెనసి దార్ఢ్యం బొప్ప నొప్పారు ని
స్వన మై చొప్పడె వచ్చె నల్లదుగొ భాస్వంతుండు రాముండు నాఁ
జను ప ల్కై పెనుపొందె బాలయువపౌంస్నస్త్రైణవృద్ధాస్థితిన్. ౩౫౧
ఆ॥ వాహనములు డిగ్గి వసుధ నిలంబడి కనులపండువుగను గనిరి జనులు
రాము సోము నట్లు రహిమీఱ నంబర యానగతు స్వకీయ మయము వెలయ.
చ॥ భరతుఁడు దోసి లొగ్గి ముదపారమహోదధి పొంగి పొర్లఁ ద
త్పరతఁ దదున్ముఖుం డగుచుఁ బ్రాప్తయథార్థసుఖాగమంబునన్
బరముని రామునిన్ సముని భావన నర్చ లొనర్చి మెచ్చి స
త్వరుఁ డగుచుండెఁ బాదముల ప్రాలి దోసంగుల నెల్లఁ ద్రోవఁగాన్. ౩౫౪
సీ॥ బ్రహ్మసృష్టవిమానరాజంబుపై రాజరా జట్లు సిరిఁబొల్చు నోజవాని
నంచల కూ ర్పొప్ప నది మించు సరణి వాక్పతి తాన యా లీలఁ బరఁగువాని
పృథువిశాలాక్షుఁ డై పెనుపొంది వేయొండు వజ్రపాణి యనంగ వఱలువాని
లక్ష్మీవిలాసంబు లలి సద్వితీయత విష్ణుఁ డితం డన వెలయువానిఁ
బుష్పకాగ్రగతుని భూరితేజుని నగ్రజుని సుమేరునిష్ఠ సొబగు మీఱు
భాస్కరునిన పోలెఁ బరికించి కేల్మోడ్చెఁ బ్రయతుఁడై ప్రపత్తి భరతుఁడపుడు.

శా॥ రామాజ్ఞం గొని వ్యోమయానవర మారామ్యాభతత్ ధన్య యా
భూమిం దా రయ మాగి యంచ లొలయన్ బొల్పారుచు న్నిల్వఁగా
భూమానందుఁడు రామదేవుఁ డనుజన్ భూరిక్రమోపక్రమున్
శ్రీ మీఱం దనయున్నచోటున కటన్ జేరం గటాక్షించినన్. ౩౫౬

ఆ॥ రాము నెనసి యతఁడు రాణించు భక్తిఁ దత్పాదపద్మయుగళిఁ బరఁగ వ్రాలె
నదియ కూర్చుకొనియె నవల సాష్టాంగనమస్క్రియావిశేషమంజిమంబు. ౩౫౭

క॥ చిరకాలమునకుఁ దమ్ముఁడు భరతుఁడు వ్రతనిరతుఁ డక్షిపథగతుఁ డగు భా
గ్యరమం గాంచితి నని విభుఁ డరుసమున నొనర్చెఁ దివిచి యాలింగనమున్. ౩౫౮

క॥ తొడ నిడుకొని యనుజుని మది తొడసెడలఁగ లాలనంబు తోరంబుగఁ బ్రే
ముడి నూపె రాముఁ డాతఁడుఁ బడసితి నేఁటికిఁ గృతార్థపద మని పొంగన్.

ఉ॥ ఆదట లక్ష్మణున్ భరతుఁ డక్కునఁ జేరిచి బుజ్జగించి న
మ్మోదమున న్విదేహజకు మ్రొక్కెను మోడ్చిన కేలుదోయి ము
న్నాదలతోడి దై నెఱయ నంబరొ! నే భరతుండ నంచు సం
పాదితసర్వవంద్యపదభావరమావిభవానుభావుఁ డై. ౩౬౧

ఉ॥ కూరలు దించు నెమ్మనము గుందఁ గృశించి జటాలుఁ డై ధృతి
న్నారలు గట్టి యన్నెఱిన నాఁటికిఁ దోఁచి నమస్కరించు న
వ్వీరవరేణ్యు నమ్మఱఁది విశ్వజనీనుని మెచ్చి దీవెనల్
సారగుణాఢ్య భూసుత పొసంగ నొసంగె న్వసత్యసూక్తులన్. ౩౬౧

సీ॥ వైకక బిడ్డం డంతఁ గలయంగఁ గాంచి సుగ్రీవు నంగదు నట్లు కీర్తిమంతు
జాంబవంతు ననీలు నద్వివిదు న్మైందు ఘనుల నలర్షభగంధమాద
న సుషేణశరభపనసగవాక్షప్రభృతులఁ దులలేని దై వెలయు మేలి
పారవశ్యంబునఁ బరగు సమాదృతి నాలింగితులఁ జేసె నంద ఆతని
పేర్చు గారవమునఁ బెనుపొంది పొదలుచు మానవాకృతులనె మలసి యంత
వట్టువార లట్టి వలను చొప్పడనాని కుశల మడిగి తమ్ముఁ గూర్చుకొనిరి. ౩౬౨

ఉ॥ రాజతనూజుఁ డాభరతరాజు విరాజితతేజుఁ డర్కజున్
నైజసుధర్మనిష్ఠ జననందిత గాఁ బరిరబ్ధుఁ జేసి వి
భ్రాజితమూర్తి నాతని నపత్రపితుం గనుఁగొంచు మించు న
వ్యాజనఁ బల్కెఁ బల్కు స్వరసోజ్జ్వల మై తనరారుచుండఁగాన్. ౩౬౩

క॥ ఏ నవు తోఁబుట్టు వయితి వీ నలువురతోడఁ గూడ నీ విందఱకున్
మానిత యగు నీకృతియును మానింపఁగ శక్య యగునె మహితమనీషా. ౩౬౪

క॥ అరిలక్షణ మపకారము నరిసంగడికానిఁ జేయు సౌహృద మెందున్
నిరుపమము త్వచ్చరిత మే నరమర లే కాడువాఁడ నరివిధ్వంసీ. ౩౬౫

ఆ॥ అనుచుఁ బొగడి తోనె యసురేంద్రుఁ దిలకించి యంతకంతకుం బ్రహర్ష మెసఁగఁ
బలికె సాంత్వవచనపద్ధతి సహజాతపారవశ్య మెనసి బలుపు గాంచ. 366
క॥ అరిభీషణా! విభీషణ! ధరఁ బొడమితి వీవు కొలము ధన్య మొనర్పన్
దరమె పొగడ నీసాయము దర మెడలఁగఁ జేయఁజాలె దర్ప మెలర్పన్. 367
తే॥ అతిసుదుష్కర మగు కర్మ మట్లు దీర్చి తన్నదమ్ముల నలరింప నరుగుదెంచి
తౌర యిక్ష్వాకుసంతతి కసము సిరియుఁగూర్ప నొదవిన నీపుట్టు గొఱతవడునె.
సీ॥ అనుచుండ శత్రుఘ్నుఁ డన్నకుఁ బిన్నన్న కతిభక్తి మ్రొక్కి బిట్టాదరించి
యారామలక్ష్మణు లాతనిఁ దనువొందఁ బొదివి దీవించిరి పుడమికన్నె
యడుగుల కెఱఁగె నయ్యనఘుండు వినయావనతుఁడై కడంగి యన్నాతిమిన్న
దీవెనలం దేర్పఁ దెలివొందె రాముండు ఘనశోకకర్శిత కడు విషణ్ణ
యైన తనుఁగన్నతల్లి పాదాబ్జము ల్గ్రహించె నాయమ యెడనున్న యెడరువాయ
నావల సుమిత్రకు యశోనుభావయుతకుఁ గైకకును నతులొనరించె గారవమున.
తే॥ ఎల్లరకుఁ దల్లులకు నట్టు లినకులుండు వందనమ్ము లొనర్చె నవ్వారలు నభి
నందనము లొనగూర్చి రానాఁటి దైనచంద మంతయు వింత యా శైలతనయ!
ఉ॥ ఆదట రాఘవేంద్రుఁడు మహామతి దేవపురోహితాభు స
మ్మోదభరు న్గురుం దఱిసి మ్రొక్కి సుదర్శనుఁ డవ్వశిష్ఠుఁ డా
శ్రీదయితున్ యశోరతు విశిష్టవచోమృతతుష్టుఁ జేసె ని
ర్వాదరసోచితంబు లభివాదము లవ్విధి నివ్వటిల్లుచోన్. 370
శా॥ ఓకల్యాణగుణాబ్ధి! స్వాగతమె నీ కోకోసలేంద్రాత్మజా
స్తోకానందవివర్ధనా! సుభుజ! సంశుద్ధాత్మ!యంచుం బురీ
లోకౌఘంబులు దోయిళు ల్మొఱయ సుశ్లోకాళి శ్లోకింపఁగా
నాకోశాబ్జసహస్రలక్ష్యము ప్రహాదం బై యొప్పె నప్పట్టొగిన్. 371
క॥ భరతాగ్రజుండు సద్రసభరితుం డై వారినెల్ల బహుమానించెన్
స్వరసాధ్య మయ్యె రాముని చరితామృతవార్ధి యట్టి సంరంభమునన్. 373
శా॥ పుణ్యాహం బదె కాదె యాభరతుఁ డప్పూజ్యుండు పూజాధ్యపా
ద్యణ్యాంబు ల్విధిపూజితంబులు శుభాకూతంబు లౌ పాదుకల్
గుణ్యాగ్ర్యంబులు రాము పాదములతోఁ గూర్చెన్ స్వధర్మజ్ఞతా
గణ్యత్వంబు ప్రకాశిలంగ సకలక్ష్మాదోవ్యసదు ల్మెచ్చఁగాన్. 374
ఉ॥ అంజలి సేర్చి యి ట్లనుచు నాతఁడు రామునితోడఁ బల్కె నా
నెంజిలి వాసె రాజ్య మిది నీయది పాలనసేసి న్యాస మ
ట్లంజిక బత్తియుం దనర నప్పనముం బొనరించినాఁడఁ ద్వ
న్మంజులపాదపాదుకల మాలిమి సర్వము నిర్వహింపఁగాన్. 375

క॥ నాపున్నెము పైకొనె నిటు నాపుట్టు కృతార్థ మయ్యె నాకోర్కియు నేఁ
డే పండె మరల నినుఁ బ్రభు నీప ట్టైనయంగఁ గాంచి యెలయంగంటిన్. ౩౭౭
ఆ॥ అరసికొనుము కోశ మట్లు కోష్ఠాగార పురబలాదికంబు పూరితంబు
దశగుణంబు గాఁగఁ దద్దయు నీదగు తేజ మెనసి నాదు తెలివిఁ బెనుప. ౩౭౮
చ॥ అను నెడ భ్రాతృవత్సలుని యాభరతేంద్రుని పల్కు విన్నమా
త్రన రవిజుండు వానరులు రాక్షసనేత విభీషణుండుఁ గ్ర
న్ననఁ దమకన్ను లశ్రుల ప్రణాళిక లై తగ నోసరిల్లి రెం
దునుఁ గన మింత కింక నను ధోరణి సూపు మనోగతంబులన్. ౩౭౯
తే॥ అంత నింతింతలనరాని సంతసమున మంతనంబొప్ప భరతు రామప్రభుండు [చె.
స్వాంకమున నుంచుకొని విమానాగ్ర్యయుక్తి నందఱుఁ దగం దదాశ్రమ మందఁగాం
ఆ॥ అవతరించె రాముఁ డద్దానిపై నుండి యవని కదియు నప్పు డబ్బ మయ్యె
నెల్లబలగ మట్టు లెనసిరాఁ దొల్లింటిదైన యాత్రపసంగ మచ్చుపడఁగ. ౩౮౦
ఉ॥ దేవనిభుండు రాఘవుఁడు దివ్యవిమానముఁ గాంచి యింక నీ
వావరదేవు వైశ్రవణు నాన మెలంగుము నాదు సమ్మతిన్
గా వల నైన నిద్దలఁతుఁ గన్పడు మప్పటికప్పు డంచు సం
భావన సేసి వీడ్కొలుప బాపురె యంచుఁ దదాప్తి నెంచుచున్. ౩౮౧
ఆ॥ అదియు నుత్తరాశ కరిగె ననుత్తమ మా విమానరాజ మధిపు నాజ్ఞ
రాజరాజుఁ జేర రాణమై ఘనరయ మొప్ప జనత కబ్బ ముప్పతిలఁగ. ౩౮౨
చ॥ తన కనురూపుఁ డై నెగడు తాపసవర్యుఁ బురోహితు న్మహా
త్మ ననఘుఁ గూడి యాంగిరసుతోడి దివస్పతివోలెఁ దత్పదా
బ్జనిహితహస్తుఁ డై మహితసంస్తరణాసనసంస్థుఁ జేసి తా
నునుఁ దనరారె రాముఁ డభినుత్యవరాసన నుంది పొందికన్. ౩౮౩
క॥ ఆకల్యాణోదయమునఁ గైకేయ్యానందవృద్ధికరుఁడు నిజకుల
శ్రీకరుఁడు భరతుఁ డగ్రజుఁ బ్రాకటయశు రాము సత్పరాక్రముఁ గనుచున్.

—♦ భరతుఁడు శ్రీరామునకు న్యాసనసమర్పణముఁ జేయుట ♦—

ఆ॥ శిరసు కేలుమోడ్పుఁ జేర్చు తీర్పున వినయావధాని యగుచు ననువు నెఱయఁ
బలికె నిట్టు లనుచు భాషాపతియు మది మెచ్చి యిచ్చకమున మేకొనంగ.
సీ॥ ననుఁ గన్నతల్లి పూజన మొనరించితి నాఁటివరం బన్న మాట వడసి
తండ్రి నిక్కపునుడిఁ దద్దయు నెఱపితి వంతలు పోనఁగె నీయనుమతమున
ననుఁ బ్రీతి దైవార ననుచు కూర్చున భవత్సత్యంబు పాటించుసమయ మొదవె
నాయం దునిచినట్టి నయమునఁ బాలించి నీదురాజ్యము నీకు నే నొసఁగితి

నేలుమయ్య యింక నేల సంకోచ మొం డొక కిశోర మెట్టు లుత్సహించు
లీల బలిత మగు బలీవర్ద మొకఁడు భరించి యిడిన ధుర వహించుటకును. ౩౮౭
ఆ॥ పృథులవారివేగభిన్న మౌచు క్షరించు సేతు వట్టు లెపుడు ఛిద్రయుతము
ధుత మసంవృతంబు దుర్బంధనము రాజ్య మనుచుఁ దలఁచువాఁడ నమితతేజ.
తే॥ అశ్వగతి నవలంబింప నౌనె ఖరము హంస గమనికిఁ బెరయ వాయసము దగునె
య ట్లరిందమ! రామ! నీయధ్వ మనుసరింప నెట్లును నే నుత్సహింపఁజాల. ౩౮౮
ఉ॥ ముంగిట మొక్కవెట్టి దృఢమూల మొనర్పఁ బెరింగి పెద్ద యై
సంగతి మించి స్కంధతతశాఖల నెక్కొని పుష్పితంబు నౌ
భంగికి నై ఫలంబు లిడు పాడిఁ దొఱంగిన మ్రానిచంద మీ
యింగిత మీ వెఱుంగుదువ యింతకు మిక్కిలి వల్క నేఁటికిన్. ౩౮౯
ఆ॥ మానవేంద్ర! యింక మము భక్తులను భృత్యులను భరించి మనుప ననుమతింప
వేనిఁ దెలిపినట్టి యీయుపమానంబు నిన్నుఁగూర్చినదియ నిక్కముగను. ౩౯౦
సీ॥ అనువొంద నిన్ను రాజ్యాభిషిక్తుఁ గను మా కనుల కల్మి ఫలంబు గలుగుఁగాత
మట్టమధ్యాహ్నంబు మార్తండు మలయించు నీదు తేజము దెస ల్నెఱయుఁగాత
శరదిందుచంద్రికాస్ఫురణ భవద్యశ మార్తార్తిహార మయి యలరుఁగాత
మెల్లజ్యోతిశ్చక్ర మీవసుంధర యుండు నంత కీవే స్వామి వగుదుగాత
కాంచినూపురనిస్వనకలన లొప్పఁ దూర్యమహితారవములు దోడ్తోడఁ బర్వ
మధురతరగీతసుస్వరమంజిమము పొసంగ మేల్కాంతుగాత క్ష్మాజాకళత్ర. ౩౯౧
క॥ అని యడుగులఁ బడి ప్రార్థించిన గురుఁడు తథా స్తనంగఁ జిఱున వ్వెలయన్
ఘనుఁ డటు లొనరించెద నను ననుమతి ననుజన్ము లాలితాత్మునిఁ జేసెన్.
శా॥ మాయామానుషవేషధారి యటు నిర్మాయుండు సర్వాశ్రిత
శ్రేయోదాతయుగాఁ బొసంగదె సహశ్రీకుండు గా సంతత
స్థాయిజ్ఞానసుఖాత్మరాజ్యనకు రాజ్యం బొక్కఁ డేలా స్వరా
జ్యాయుక్తుం డఁట యైంద్రకోటిసిరు లొయ్యారంబునం గూర్చుచోన్. ౩౯౩
ఆ॥ లీల సృష్టిసేయు లీనంబుఁ గావించు నెల్ల యెరవుసేయు నేలుచుండు
వాని పోకడలకు వరుస యొక్కండు న్నె భక్తకామపూరభంగి యనదె. ౩౯౪
తే॥ పరపురంజయుఁడగు రామభద్రుఁ డెలమిఁ దమ్మునితలంపుగూర్చి నేస్తమ్ము నెఱపఁ
గైర మున్నుగ నలమహీకాంతు కాంత లరుసమునఁ దేలి రుచ్ఛ్వసితాత్మ లగుచు.
క॥ సన్నుతుఁ డౌ భరతుఁడు తన యన్న యనుమతిన్ శుభాసనాధ్యుఁడు గాఁ గ
న్నన్నఁ గొని పిన్నతమ్ముఁడు మిన్నందుచు మెలఁగె నెల్ల మే లగు కృతులన్.
మ॥ స్వపురాపుణ్యవికాసలబ్ధవిభుసేవాపాండితీమండితుల్
నిపుణుల్ శ్మశ్రునికృంతకు ల్వెరసి సన్నిర్ణీతభవ్యోదయం

బుపయుక్తంబుగ రాముఁ గొల్చి రపు డాయుష్కర్మముం జేతకై
నృపుఁడుం దమ్ములుఁ దద్విశేషకలనోన్నిద్రాత్ములై రత్తఱిన్. ౩౯౭
ఆ॥ శుద్ధుఁ డయ్యె విభుఁడు శోధితజటుఁడు సుస్నాతుఁడుగఁ దనర్చి సన్మహార్హ
వసన మవధరించి వరచిత్రమాల్యానులేపనములుఁ గొనె నిలింపు లలర. ౩౯౮
ఉ॥ అన్నకు మున్నె శోధితజటాలియు స్నాతుఁడునై ప్రపత్తిసం
పన్నుఁడు కైకనందనుఁడు ప్రస్తుతులా హరిరాక్షసాధిపుల్
గ్రన్నన స్నాతులై పెరయఁగా మహితాంబరభూషణాదులన్
మన్నన నూపె వారును సుమాళమునం దనరారి రయ్యెడన్. ౩౯౯
మ॥ సహగ్రశ్రీలలితోజ్జ్వలాత్మునకు సంసక్తిం బొనర్పించె ధూ
ర్వహుఁ డిక్ష్వాకుకులాభివృద్ధికరుఁ డింద్రశ్రీకుఁ డాకైకకా
న్పహితఘ్నుండు సురారిదర్పహరు నుద్యత్తేజ మొప్పార స
న్మహితం బైన ప్రసాధనంబు కలితాత్మప్రాజ్యభాగ్యంబునన్. ౪౦౦
మ॥ చికిలీచేసిన చంద్రహాస మన నిస్సీమప్రభావోదయుం
డకలంకుం డగు రాముఁ డొప్పె నపు డొయ్యారంబు తోరంబుగా
సకలం బేలెడు నాతఁ డీతఁడె యనన్ సర్వాతిశాయిస్ఫుర
త్ప్రిక్రృతాలంకృతిసంవిధానపదలబ్ధస్వప్రకాశంబునన్. ౪౦౧
క॥ ఆదట లక్ష్మీవంతుఁడు మోదమునన్ లక్ష్మణునకు మొనయించె శుభా
పాదక మగు సన్మండన మాదంటతు భజించె సుకృతి యని భరతుఁ డొగిన్.
చ॥ జనకుని పట్టి సద్గుణవిశాల యశస్విని సీతఁ బూతవృ
త్త ననుచు వేడ్కఁ బూర్వనృపదార లలంకృతఁ జేసి రమ్మన
స్వినుల స్వయంకృతి న్మఱియు శ్రీసుమనోహర యై తనర్చె న
మ్మనుకులదీపు రాజ్యరమ మా నగు రూపు ధరించి మించె నాన్. ౪౦౩
తే॥ పుత్రలాలస కౌసల్య భూరియశ ప్రహృష్ట యగుచు సకలవానరేష్టయూవ
తమున కొనరించె శోభనతర మలంకరణవిశేషమ్ము జతనమై రాణ దనర.
తే॥ అధికృతుం డయి శత్రుఘ్నుఁ డన్నియెడలఁ దవిలి శాసించుచుండె నుద్దామకలన
భరతుఁ డెట్లట్లె తాను నిర్భరకుతూహలుండు గా జనముల చూడ్కి పండు వగుచు.

—♦ రాముఁ డంతటతో నయోధ్య కరుగుట ♦—

క॥ ఆశత్రుఘ్నుని శాసితి యాశాస్యనిజాశతోడి దగుడు సుమంత్రుం
డాశోభితసర్వాంగ మధీశోచిత మరదము గ్రహిం న్మొనయించెన్. ౪౦౬
ఉ॥ భానవమండలాచితిఁ బ్రభాపటలాంచిత మా రథోత్తమం
బానవమోహనాకృతి మహామహుఁ డూర్జితవిక్రముండు త

న్మానవలోకమాధవుఁడు మంజులవేషుఁడు రాముఁ డొక్క స
న్మానవచఃప్రసంగములు మంగళవాద్యములుం బొసంగఁగాన్. ౪౦౮
క॥ అహరధిపానిలతనుజులు మహేంద్రసదృశద్యుతులుగ మాన్యత వెలయన్
మహనీయదివ్యవస్త్రాలు సహశుభకుండలులునై పొసఁగి రవిభుతోన్. ౪౦౯
ఆ॥ దేవితోడఁగూడ దివ్యమండనభవ్యకుండలాఢ్య లగుచుఁ గూర్చువేడ్క
శోభమానముఖులు సుగ్రీవపత్నులు పయనమునకుఁ జక్క బరఁగి రపుడు.
సీ॥ అనువొప్పఁజని రయోధ్యాపురంబునకు మహారాజసచివులు మంత్రివర్యు
లాయశోకుఁడు విజయాహ్వయుండు సుమంత్రుఁడును మంత్రసన్నాహమునఁ దనర్చి
రహిఁ బురోహితునిఁ బురస్కరించుకొని నాయకు సమృద్ధియు నగరాభివృద్ధి
యును నభ్యుదయములు మొనయంగ నభిషేక మొనరింపఁ దగు యత్నమును బొనర్చి
యన్నియును మీరలే నేర్తు రనుచు గురున కప్పగించి తదనుమతి నభినుతించి
వీడు వెడలి వచ్చిరి శుభవిభవ మెసఁగ రామదర్శనబుద్ధి మరాలగమన. ౪౧౦
మ॥ హరియుక్తంబు మహారథంబున సహస్రాక్షుం డధీంద్రుండు పో
లె రఘూత్తంసుఁడు శ్రీసతీరమణుఁ డాలీలామనుష్యుండు సుం
దరవేషాంచితుఁ డై ప్రధాననగరిం దాత్పర్య మొప్పారఁ జే
ర రవిద్యోత మెసంగఁగా నరిగెఁ జారుప్రాప్తభాగ్యంబ కాన్. ౪౧౧
సీ॥ ప్రగ్గ మూని హయాళిఁ బరఁగించె సారథి యై సారథీయుతుఁ డౌ భరతుఁడు
శత్రుఘ్నుఁ డల సితచ్ఛత్రమ్ము ధరియించె విభుని మస్తకముపై వేడ్క దనర
వ్యజనంబుఁ గొని వీచె ననఘుండు సౌమిత్రి వాలవ్యజన మొండులీలఁ దాల్చి
చంద్రసంకాశ మాశరనాథుఁ డెలయించెఁ బెరచామరంబు విభీషణుండు [ముగఁ
మొనసి వేల్పులు ఋషిసంఘములు మరుద్గణములు నమిచిరిపుడు వొంగ సముచిత
బొగడి రాకసమున రాము పూర్వచరిత మెల్ల మధురస్వనము లుల్లసిల్ల మహిళ!
సీ॥ రాణమైఁ దనరారె రావణవిద్వేషి కుంభకర్ణఖరాంతకుండు వీఁడె
యాఁత డాయతికాయు నింద్రజిత్తుఁ దొలంచె మునిజనరక్షానుమోది యడుగొ
దేవకార్యంబెల్లఁ దీర్చె నీతగవరి సీతావిభుం డధిశ్రీప్రభుండు
సౌమిత్రిసహజుండు సత్యైకనిరతుండు పరదారసోదరత్వప్రథితుఁడు
శాస్త్రధన్వి సుగ్రీవరాజ్యప్రదుండు పగతుతమ్ము నియ్యావఘుండె ప్రభు నొనర్చె
కంటిరే శరణార్థిరక్షకు శరణ్యు రాము భగవంతు దశరథరాజతనయు. ౪౧౩
క॥ శ్రీమంతుఁడు భరతాగ్రజుఁ డీమహితుఁడె ధర్మ మెల్లయెడ స్థాపింపన్
భూమి వెలసె నిమ్మెయి నీభూమానందుండు గెడపె భూభారమ్మున్. ౪౧౪
ఆ॥ అనుచు నొడువుచుండ మనుదండధరవంశ్యుఁ డఖిలవైభవంబు లమర సమర
రాజధానిఁ బోలు రాజధానికిఁ బోలు స్వాత్మజనతతోడ నరుగుచుండె. ౪౧౫

క॥ శత్రుంజయ మను కుంజర మత్రాసము పర్వతోపమాంచిత మెనసెన్
శత్రునిషూదనుఁ డర్కజుఁ డాత్ర మెసలి మహితుఁ డై మహానందమునన్.
ఉ॥ మానుషవిగ్రహంబు లతిమానుష విక్రమము లొప్పసంగఁగా
వానరవీరు లాఢ్యనవవారణరాజసహస్రసంస్థు లై
మానితవస్త్రభూషణసుమంజిమపుంజితభవ్యకాంతిసం
స్థానితనూత్నసంపదభిసంభృతు లై చని రుత్సవాదృతిన్. ౪౧౮
తే॥ శంఖకాహాళభేరికాస్వనము లొప్ప మంగళాశంస లొలయంగ మాన్యమూర్తి
పూరుషవ్యాఘ్రుఁ డాతండు పొరసె హర్మ్యమాలిని యయోధ్యనాజను మహితనగరి.
ఆ॥ వరరథస్థుఁ డగుచు వచ్చు నయ్యతిరథు రాజలోకనుతు విరాజమాను
రాఘవేంద్రు నంశురాశి దర్శించిరి దఱిసి యట్టి రగు ప్రధానవరులు. ౪౧౯
ఉ॥ ఇమ్మగ వా రెదుర్కొని రభీష్టశుభార్థము లెల్లఁ గొంచు నే
స్త మ్మొలయించుచున్ ప్రథితసంస్తుతి గీతికలాసమగ్రయో
గమ్ము ఘటించుచున్ నవవికాసలసద్గుణవాక్యసంగతిన్
సమ్మద మావహించుచుఁ బ్రసాదరమాధిగమాస్థ మించుచున్. ౪౨౦
క॥ ప్రతినందితు లై రపు డప్రతిమప్రతిభుఁ డగు రామభద్రునిచే వా
రతిలోకవికాసము సంప్రతిపన్నం బయ్యె స్వకము భాగ్యం బొలయన్. ౪౨౧
తే॥ అందఱం గూర్చుకొని మహానందుఁ డగుచు భ్రాతృవర్గం బమాత్యులు బ్రాహ్మణులును
పౌరజను లాప్తులునుఁ దోడఁబరఁగ రాముఁ డుడుతతులతోడి చందురు నోజ మెఱసె.
క॥ తాలస్వస్తికకరనర లీలాగాయనులు హర్షలీలాత్ములు తూ
ర్యాలంబులతో మాంగళికాలాపము లొలయ నడిచి రగ్రేసరు లై. ౪౨౩
తే॥ అక్షతలు జాతరూపమ్ము లలరుగములు మోదకమ్ములుఁ బళ్ళెరమ్ములఁ గ్రహించి
నరులు గన్నెలుగోవులుఁ బెరయ ద్విజులు ముందునడచిరి రాముఁ డామోద మొంద.
మ॥ మహిజాజాని సుమాళ మొప్ప నిజసామంతు లున్నమంత్రు ల్వినన్
మిహిరాత్మోద్భవు సఖ్య మద్భుతము సామీరిప్రభావంబు దు
స్సహ మా వానర యోధసత్త్వ మురుదాక్ష్యం బాసురం బట్లు మే
ల్రహి శుద్ధుండు విభీషణుండు దనుఁ జేరంగంటయుం జేర్కొనెన్. ౪౨౪
తే॥ అందఱు సవిస్మయులు ఘనానందులు నయివందనము లొనరింప నవ్వారిఁ గూడి
హృష్టపుష్టజనాకీర్ణ నించు వేడ్కఁ జొచ్చె రాముఁ డయోధ్య సంస్తుతులు సెలఁగ.
మ॥ అదె శ్రీరాముఁడు వచ్చె నన్పలుకుచొ ప్పాసాదితం బైన సం
పద నిండ్లం బ్రతిమందిరాంగణములం బౌరు ల్పతాక ల్శుభా
స్పదము ల్తోరణము ల్సమాస్తరణము ల్సన్మండపోల్లోచముల్
ముద మొప్పారఁగ గూర్చి రన్నగర మామోదార్ణవం బై తగన్. ౪౨౮

సీ॥ దూర్వాదళవికాసధూర్వహశ్యామసుందరతనుఁ గందర్పదర్పమథను
హారకిరీటాంగదాదిమహార్హాభరణు జగద్భరణప్రవణసుచరణు
నారక్తసరసిజాయతదయాకలితనేత్రాంతు మదోచ్చరదరికృతాంతు
సువిచిత్రరత్నాఢ్యసూత్రనద్ధస్వర్ణపీతవస్త్రు కరాభ్యుపేతశస్త్రు
భానుకోటిప్రభాభాసమాను సూర్యసూనుదనుజేంద్రముఖసేవ్యమాను దశర
థానురూపతపఃఫలత్వానుమిత్యధీను ననమానుఁ గాంచి రథీనుఁ బ్రజలు. ౨౨౮

ఉ॥ కస్తురిరేఖ యింపెసఁగగా నవచందనలేప మొప్పఁగా
శిస్తుగఁ గల్పవృక్షసుమశేఖరమాల్యము లుల్లసిల్లఁగాఁ
బ్రస్తవనీయసంపదతిభాసురహాసవిలాసము ల్రమా
వాస్తవసన్నివేశవిభవస్తుతిపాత్రులు గా రసాధ్యుఁ డై. ౨౨౯

తే॥ వీరలక్ష్మీస్వరూపమవతారవిలసితుండు రామచంద్రుండు రా నభిరామయోగ
వర్ధితామోదులై పురీవరనరు ల్నితాంతగౌరవ మొప్పారఁ దలఁపు లూర.

క॥ తద్దయుఁ గనఁగాంచుచుఁ దమముద్దియలం బిలువ వారు మోదాంచితులై
యుద్ది చెలువలకుఁ దెలుపుచు బద్దులు విడనాడి భక్తిపరవశ లగుచున్. ౨౩౦

—♦ పురస్త్రీల ప్రస్తావము ♦—

ఆ॥ చంద్రశాల లెక్కి చలువపందిళ్ళపై నమరి యమరసతుల యట్టి రగుచుఁ
గనిరి రాముఁ గన్నుఁగవలఁ గ్రమ్ముముదశ్రుసంతతులునుసుగుణసంతతులుగ.

క॥ ఒండొరులకుఁ దెలిపిరి భూమండలనాయకుఁడు రాము మాన్యచరితముల్
పండువు వారల కొదవెను నిండుతపము ఫలము నాఁటి నెఱి కేర్పడఁగాన్.

సీ॥ సుదతి! యీతఁడ చువ్వె శుద్ధాత్మ కోసలు కన్నె గర్భపయోధికల్పకంబు
పొలతి! యీతఁడ చువ్వె పురుషోత్తముఁడు దశరథు జన్మమున మనోరథముపంట
పడతి! యీతఁడ చువ్వె భద్రాత్ముఁడు తపస్వి పడసిన మేలితపఃఫలంబు
మడఁతి! యీతఁడ చువ్వె మహిజాత కదనునఁ బున్నెం బిడిన రత్నభూషణంబు
ఊాలు నీట దేర్ప ఱాతి నాతి నొనర్పఁ గ్రోఁతిగముల నేలి కోఱఁతఁ దీర్ప
నఖిల రాక్షసాగ్ను లార్ప వేల్పులఁ గూర్ప నేర్పు గనిన జాణ నెలఁత! యితఁడె.

క॥ పరనారీసోదరుఁడే పరమకృపాభరణకీర్తిభరుఁడే రక్షా
పరుఁడే పరిపంథిజనోత్కరశిక్షాకరుఁడె భూమికన్యావరుఁడే. ౨౩౪

ఉ॥ ఈతఁ డరణ్యభూమి కటు లేగిననాఁడు మొదల్కొని తంబ యీ
పాతక మందు రిందఱునుఁ బట్టుగ నిద్దుర రాదు కంటి కిం
దాతతవైభవం బనుచు యాఱడి యయ్యెను గన్నబిడ్డలం
బ్రాఁతి యొనర్ప రెవ్వరును ఖాసె వ్యథ ల్సతులార నేఁటికిన్. ౨౩౫

తే॥ లక్ష్మి తన కెడచనని యాలంబనముగ నీమహామహుఁ డీరాముఁ డీతపస్వి
వందితుఁడు రాజ్యభారమ్ము ననుచుఁ గూర్మిఁ గొని ప్రవర్తించునఁటె యింకఁ గొఱఁతలున్నె.
చ॥ అనుచుఁ బ్రహర్ష వేగకలితాననలక్ష్ములు స్మేరదృష్టు లొ
య్యన నెఱయం దృగుత్సవమ వై తగు రామునిపైఁ బ్రసూనముల్
దనరెడు లాజ లక్షతలుఁ దద్దయుఁ జల్లిరి వల్లరీమిళ
త్తనులు తనూకృతాన్యసుకృతంబు కృతం బటు త మ్మొనర్పఁగన్. ౪౩౮
క॥ మననం బొనరించిరి దృఙ్మనసరసాయనము రాము మానసమున న
య్యనఘుల కాత్మానందం బనుభూతిపదం బనంగ నయ్యాదియ కదే. ౪౩౯
సీ॥ నెనరుఁ బేర్మియు నెద నిండార స్మేరదృష్టిని నిజప్రజలపైఁ జేర్చి కనుచు
నపరప్రజానాథుఁ డౌ నీతఁ డన ననవద్యాదృతుల నెల్లవారిఁ గొనుచు
శ్రోత్రసుఖంబులు సుకృతంబు పండె ని ట్లనుట ము న్నగు పల్కు లంద నగుచు
నలరు ప్రసాదనంబులు వరంబులు దనుఁ గన్నవారల కెల్లఁ గలయనిడుచు
రాజవీధి గడచి రాణించు నగరి కక్ష్యలఁ గ్రమించి లోని కరిగి కాంచె
నించువేడ్కఁ దండ్రి యేలిన సుందరమందిరస్థలమ్ము మలసి విభుఁడు. ౪౪౦
ఆ॥ కన్నతల్లి కెఱఁగెఁ గడుప్రపత్తి సుమిత్ర కట్లు వందనంబు లాచరించెఁ
గడఁగి కైక కిడియెఁ గైమోడ్పు వినతులు గడమతల్లులకును గలయఁగూర్చి.
క॥ అందఱకు వందనము లిడి యందఱ దీవెనలు వడసి యద్భుత చరితుం
డందె మొగసాల మహితానందుఁడు భరతుఁ గని పలికె ననుచుశుభోక్తిన్.
ఉ॥ మామక మిందుసన్నిభము మందిరరాజము సుందరమ్ము ము
క్తామణివాలవాయజవిధానగుణాఢ్య మశోకముఖ్యవ
న్యామహనీయ మాప్తతముఁ డర్కతనూజున కిమ్ము సమ్మద
శ్రీ మలయంగఁ దక్కఁగల స్నిగ్ధులకున్ సమకూర్పు మిమ్ములన్. ౪౪౩
క॥ అను నుడి వినినంతనె యాతని కరమునఁ దనకరంబు దనివోప్పఁ గడ
లొక్కనఁ జేసికొంచుఁ జని యొయ్యన నచ్చటునం బ్రవేశ మమర ఘటించెన్.
క॥ పర్యంకాస్తరణాదులు పర్యంచితదీపికలును బరఁగించిరి స
త్కార్యోచితి శత్రుఘ్నుఁడు పర్యుత్సుకుఁ డగుచుఁ బనుపఁ బరివారజనుల్.
క॥ అందఱుఁ దగు మందిరములయం దిరవొందంగ నునిచె నలరారిరి వా
రెందుఁ గనువార మిమ్మొయిఁ జంద మనుచుఁ దద్విశేషసత్కృతు లగుచున్.
తే॥ వైజయంతంబునకు సాటివచ్చు రాము మందిరంబున యందు సుమాళ మొప్ప
హనుమదాదులతోఁ గొలు వందియున్న యింద్రసన్నిభుఁ డైన యయ్యినజుఁ గాంచి

—♦ భరతప్రేరితుఁడై సుగ్రీవుఁడు హనుమదాదులఁ జతుస్సముద్రజలములఁ జేరం బంపుట ♦—

తే॥ భరతుఁ డానందభరితుఁడై పలికె దేవదేవు శ్రీరాము రాజ్యలక్ష్మీవిలసితుఁ
జేయఁ బనుపుము వానరశ్రేష్ఠులను నదీనదాంభోధిజలముల నానయింప. ౨౨౮

క॥ అని యిటు లమ్మహనీయుఁడు తను నామంత్రింప మేలి తనివున భాస్వ
త్తనయుం డాన యొసంగెను ఘనమతు లగు వానరులకు గారవ మొప్పన్.

చ॥ లలితసువర్ణపుంఘటముల న్మణిరత్నవిభూషితంబులన్
మలకలు లేకఁ గొంచుఁ జని మాన్యత మీఱఁ జతుస్సముద్రసం
వలితజలంబుల న్నినిచి వారక వే జనుదెంచు మీర ల
త్యలఘులు నల్వు రేర్పడ మహావిభవం బటు లాయితంబుగాన్. ౨౩౦

ఆ॥ మఱియు నలువు రరిగి మానితసర్వతీర్థాఘరసముల న్మణీఘటముల
నందుకొనుచుఁ బెరయుఁ డంద ఉషఃకాల మేగుదేర మాప్రతీక్ష గూర. ౨౩౧

క॥ అనుటయు నతిరయు లనఘులు ఘను లిభనిభు లెగసి రపుడె గగనంబునకున్
హనుమత్ప్రభృతులు గరుడపవను లిరునలురూపు లెనసివారై రనఁగన్. ౨౩౨

ఉ॥ పంచనదీశతంబుల ప్రపంచితతీర్థజలంబుల న్సమ
భ్యంచితపాత్రల న్నినిచి యమ్మెయిఁ గొంచు రుదెంచి రుత్కటన్
బంచముఖాభుఁ డయ్యనిలుపట్టియుఁ బ్రాజ్ఞుఁడు జాంబవంతుఁడున్
మించు వృషాఖ్యయోధుఁడు సమీరితవేగుఁడు వేగదర్శియున్. ౨౩౩

సీ॥ పూర్వవారిధి వారిపూరితమణిఘటం బలసుషేణుఁడు సేర్చె నతిబలుండు
దక్షిణాబ్ధిజలాంచితముఁ గూర్చె ఋషభుండు లలిఁ జందనలతాంక మలఘుకలశ
మాగవయుఁడు పశ్చిమార్ణవోదకపూర్ణ మొనయించె సౌవర్ణ మిద్ధ కుంభ
ముదగంబుధిరసాప్య ముత్తమోత్తమరత్నపాత్రవిశేషమ్ము పరఁగఁ దార్చె
నలుఁడు గరుడానిలరయావికలుఁడు ధర్మసత్త్వగుణసర్వసంపదుజ్జ్వలుఁడు వరద
వానలుఁడు వానరేంద్రుఁ డట్లందఁగపినవారల బహూకరించె నుదారుఁడగుచు.

—♦ శ్రీరామపట్టాభిషేకఘట్టము. ♦—

ఆ॥ సకలతీర్థరాజసలిలసంభృతమణిస్వర్ణకలశములఁ బ్రసక్తి మీఱ
నందుకొనెఁ బ్రహర్షితాత్ముఁడై శత్రుఘ్నుఁ డలరుచుం బ్రధాను లాప్తులొలయ

క॥ మంగళవాద్యధ్వను లెసఁగం గమకించు శుభదార్ధకాండంబులతో
డం గురు వశిష్ఠముని కతఁ డంగం బుప్పొంగ వాని నర్పణసేసెన్. ౨౩౫

క॥ రత్నాంచితపీఠమునఁ జిరత్నభృతమనోరథంబు రాణ దనరు స
ద్యత్నమున గురుఁడు నారీరత్నసహితు రాముఁ జేర్చె రహి పెనుపారన్. ౨౩౬

సీ॥ మణిమండితము దివ్యమహితంబు మకుటంబు స్రష్టృనిర్మితము నేర్పడ ధరించి
రమణీయకట్టాభిరామాంచితాభిఖ్య కోకఁడె యర్ఘ్యం డన నోజఁ గాంచి
యర్ధాంగలక్ష్మి సీతాంగన స్మేరదృష్టిప్రసారంబుల స్వీకరించి
దర్పకకోటిసౌందర్యంబుతోడి డా భానుప్రభోచిత ప్రతిభ మించి
రాముఁడు విరాజమానుఁడై రాజపీఠరాజము నలంకరించె స్వారాజముఖులు
రాజముఖులు బలయ నంబరంబుఁ బెరయ బ్రహ్మ బ్రహ్మర్షులం గూడి పరిఢవిల్ల.

సీ॥ మొలకనవ్వులతోడి ముద్దుసూపెడు మోము సిరిదమ్మిఁ జంద్రుసోదరత నెఱపి
పతిపాదభక్తిరూపమున శ్రీలక్ష్మీవిలాసరూపకదృగ్వికాస మొలసి
యంకపాళిం దగి యధిపు సవ్యకరంబు పొదువఁ గైఁ దద్దక్షభుజము దార్చి
వరభూషణాఢ్యంబు వామహస్తంబునఁ బొలుచు కెందామరఁ బొందుపఱిచి
సహజలావణ్యసర్వాతిశాయికలన లొప్ప నొప్పారు భర్తృపుంయుక్తిఁ గూడి
చతురలంకారధృతిసముచ్ఛితయ కాఁగఁ జెలువ సీతామహాదేవి చెలువు మీఱె.

సీ॥ వృద్ధు వశిష్ఠుండు విశ్వజనీనచరిత్ర యరుంధతి శ్రీఁ దనర్చ
తెఱఁ గేర్పఱుప వామదేవుండు జాబాలి ఘనుఁడు కాశ్యపుఁడునుఁ గదిసి వెలయఁ
గాత్యాయన సుయజ్ఞ గౌతమ విజయ వాల్మీకిముఖ్యు లగు సుశ్లోకు లోలయ
నభిషేక మొనరించె నందఱుఁ దనతోడివారు గా రామేంద్రు వసుమతీసు
తాకళత్రు మహితతాత్పర్య మొప్పార మొనయు పులక లరునమును గణింపఁ
బట్ట మలవరించి ప్రభు మహాప్రభుఁ జేయ సకలతీర్థరాజసలిలములను. ౪౬౦

క॥ గాయత్రప్రభృతిచ్ఛందోయుక్తసుయుక్తమంత్రధోరణు లొప్పన్
శ్రీయుతు రామవిభుని దీర్ఘాయుస్సముపేతుఁ జేసి రభిషేకాఢ్యున్. ౪౬౧

క॥ పూజ్యార్యమణంముఖసామ్రాజ్యశ్రుతు లొప్ప రాము రాజేంద్రు జగ
త్పూజ్యులు మును లెనయించెదు నాజ్యాలోకాభిషేక మలరారె సభ. ౪౬౨

చ॥ వసువులు వాక్పతిం బెరసి వాసవు నట్లు వశిష్ఠుఁ జేరి తా
పసులు ప్రసన్ను రాఘవు నపారగుణాబ్ధి మహాభిషేచన
ప్రసితు నొనర్చి రూర్జితము రాజ్యమునం దనరారు మంచు న
వ్వసుమతి తజ్జలార్ద్రి యయి వావిరి యుబ్బి కృతార్థ నే ననన్. ౪౬౩

తే॥ ఋత్విజులు ద్విజులుం దొల్త నిత్తమూర్తు లైన కన్నెలు పదునార్గు రనుపదంబ
మంత్రులును యోధులును నైగమప్రకాండులట్లు సామంతులునొనర్చిరరుసమొనఁగ.

తే॥ సర్వదివ్యామధిరసంబు లుర్వరేంద్రు శీర్షమునఁ జిల్కరపుడు సుశ్రీ దలిర్ప
దేవతలు దిక్పతులు భూమిదేవతలును భువియు దివియు నొక్కండగు పోలుపు నెఱయ.

తే॥ ఎల్లలోకంబు లేలు రమేశుఁ గూర్చి యేకలోకాధిపత్యాభిషేక మెంత
సేసిన వలవ దయ్యెదెమొ తమకబ్రమయ్యె విశ్వమోహనమూర్తి యవ్విధిఁగూర్ప.

శా॥ తాల్చెన్ ఛత్రము పాండురంబు శుభ ముద్దామంబు శత్రుఘ్నుఁ డా
మే ల్చెన్నార ధరించెఁ జామరముఁ బేర్మి న్వాసరేంద్రుం డొగిన్
గోల్చెం జంద్రనికాశ మన్యమునఁ గైకోలొంది దైత్యేశుఁడున్
బోల్చెన్ రాఘవు ప్రాభవం బపుడు సంపూర్ణప్రభావంబునన్. ౪౬౯
సీ॥ కాంచని శతపుష్కరాంచితోజ్జ్వలమాల వాయువుచేఁ బంచె వాసవుండు
మణిరత్ననాయకమణిరత్నయుక్తముక్తాహారములఁ దానె తద్ద దార్చె
దిక్పాలకులు నిజతేజంబులకు నీడుగాఁ గూర్చి రర్థము లాకాంక్ష మీఱ
జనకాదిబంధువు లానంతరాజేంద్రు లెలమి నప్పనముల నెనయఁజేసి
లలరులు సుర ల్గురిసి రచ్చరలును రామచరితనాటకమునఁ బరిచర్య నెఱపి
రొలసి పాడిరి గంధర్వు లొజ్జ లైరి మలసి విద్యాధరులు స్తోత్రమంజిమమున.
తే॥ ఈతఁడే ముజ్జగంబుల నెలయఁజేసె నీతఁడే చాలు నీతఁడే యేలు ననుచు
మొరసె దివిదేవదుందుభు ల్మొత్తములుగ నవని మంగళవాద్యాంతరాంతరముల.
క॥ రామోత్సవరత్నాకర మామెయి నుప్పొంగఁ దన్మహత్వాఢ్యతరం
గామేయశ్రీ మలసెను భూమానందములు తత్ప్రభుస్తోత్రంబుల్. ౪౭౦
సీ॥ లలి నవదూర్వాదలశ్యామలాంగంబు క్ష్మాదేవి పైరుపచ్ఛదన మొలయ
రవికోటిదీప్తిస్ఫురద్దివ్యమకుటంబు వినువీధి తోరణ ల్వేలయఁజేయఁ
బద్మపత్రాయతప్రహితేక్షణేక్షలు నిట్టల బలుచాందినీ లమర్పఁ
బీతాంబరచ్ఛాయఁ బిరికొని భూషణశ్రీలు తేజున కాలవాలములుగ
వామభాగస్థ జనకజ వలపుతోడ వలచు చందనలేపంబు వావి దెలుపఁ
గ్రొత్తపెండిలికొడు కట్లుగొమరుమిగులుసామిఁ గని యేనుసంస్తవోత్సాహినగుచు.
క॥ కందర్పకోటిసుందరు నిందిర చుట్టఱికఁ మతని నీక్షింపఁగ సం
క్రందనముఖ్యులతోఁ జని పొందిక నొడగూర్చు తీరుపున నిట్లంటిన్. ౪౭౧

—♦ అభిషిక్తుఁ డగు శ్రీరాము రుద్రాదులు నుతించుట ♦—

సీ॥ నిను సశక్తికు నీశు నీలోత్పలాంచితశ్యామలకోమలసన్నుతాంగు
హారకిరీటాంగదాఢ్యు మహామహు సింహాసనస్థు నచింత్యవిభవుఁ
జేరి భజించెదఁ జెన్నొందు చనవునఁ గొనియాడెదను నెదఁ గోర్కు లడర
నెంచెద వినతి గావించెద నీదగు ప్రాభవం బరసి సంభ్రమము దనర
నాదిమధ్యాంతరహితుండ వైన నీవు నీదు మాయాప్రభావంబు నెఱి దలిర్ప
జగములఁ బొనర్తు పోషింతు చక్కడంతు వెక్కటిసుఖింతు వద్దానఁ జిక్క కెపుడు.
సీ॥ అనవద్యుఁడవు లీల లొనరింతు కల్యాణగుణసంవృతుండ వై కొమరుమిగుల
నది యెల్ల భక్తజనానువిధాన నిదానంబ వై యిచ్చ దనరుచుండు

దేవనరాదినానావతారంబుల జ్ఞానవంతముల నజ్ఞానిచంద
మలవరించెదు స్వాంశ మఖిలలోకము గాఁగఁ బరఁగించి యద్దాని ఫణివరేణ్యు
నోజఁ దాల్తు క్రింద నుపరిపర్యంచితభానుచంద్రపవనభంగులం బ్ర
వర్షణాదు లొలయ వఱలింతు వ్యోమధు ల్వొలయఁ బ్రోపనేకవిధుల నెఱయ.
ఆ॥ పచనముం బొసర్తు భక్తంబు భుక్తంబు దేహధాతులందుఁ దేజరిల్లు
వహ్నిరూపునం బవనసహాయుండ వై దీనఁ గాతు వెల్లదిట్టవగుచు. ౪౭౬
ఉ॥ ఎందు రవీందువహ్నిగ మధీశ! త్వదీయము తేజమూర్జితం
బొంది శరీరభృచ్ఛయము నోపు భరింపఁగ శౌర్యధైర్యముల్
పొం దగు నాయువు న్వలయుపోఁడుములు న్సముకూర్చి యుందు వీ
వం దటులే చిదాత్మకత నాదట సర్వముఁ ద్వన్మయం బగున్.  ౪౭౭
వా॥ నిక్కం బీవు విరించివిష్ణుశివనిర్ణీతప్రభేదస్థితిన్
దిక్కాలాఖిలకర్మసంగతుల నాదిత్యేందుభాగస్థతా
దృక్కర్తృత్వములన్ బృథక్ప్రమితి నిర్దిష్టుండ పోలెం గనన్
వక్కాణింపఁగ నాదు వాదిమత నిర్వాహోభ్యుపోహాప్తులన్.  ౪౭౮
తే॥ నిశ్చితము బ్రహ్మతత్త్వమ్ము నీవ సుమ్ము కేవలము శ్రుతిసారసంభావితమ్ము
నీ కనన్యంబ యెదియు ననేకభావవిలసనంబున నయ్యెఁ దద్వికసనంబు. ౪౭౯
సీ॥ మానితం బగు నెట్లు మచ్చం బసుర ప్రచ్చి శ్రుతులు తాత కొసంగఁజూడకున్నఁ
గూర్చునే సురలకుఁ గూర్మంబు తరిగొండఁ దాల్చి సుధాఘుటిఁ దార్పకున్నఁ
బాటింతురే పందిఁ బరిశుద్ధ మని పెద్ద లిల వార్ధిఁ బడనీక యెత్తకున్న
సింగంబుఁ గొలువఁ గాక్షింతురే దుర్మాని మడఁచి బాలునిఁ గావ మలయకున్న
గూనిబాపని మెత్తురే కూళ క్షత్రియాంతకు నుతింతురే యింట నగడు పొడమ
నడవి ద్రొక్కిన దొర పూజ్యుఁడగునె యొక్కఁ డధిప త్వచ్చరితము లద్భుతావహములు
ఆ॥ ఇట్టిరూపు లెనసి యెసక మెసంగుట శ్రుతిపురాణలోకసుశ్రుతంబ
యయ్యె నెట్టు లట్లె యా నెల్ల సదసన్మయమున నీ కనన్య మగు టధీశ. ౪౮౦
చ॥ అరసి చరాచరాదిజగదంతరలక్ష్య యనంతసృష్టియుం
దిర వగు దృష్టిఁ గన్గొనిన నేయది యయ్యెనొ యేది గాఁగ నై
పరఁగునొ యేది యేది యటు పాటిలుచుండునొ యట్టిదెల్లఁ ద్వ
త్పరతఁ దనర్చుటం బొసరుఁ దావకయోగపరాత్పరత్వముల్.  ౪౮౧
ఆ॥ నీదు మాయ తమ్మ నెఱయఁ బరాత్ముఁడ వైన నీదుతత్త్వ మరయనేర
రఖిలజనులు గాంతు రమలమానసులు త్వద్భక్తిపరులు నిన్నుఁ బరము నీశు.
సీ॥ బహిరర్థభావులు బ్రహ్మదులును నీదు రూపు చిదాత్మత్వరూపితంబు
గలయంతవట్టు జక్క గనుంగొనంజాల రటుగాన సగుణ మియ్యమలరూప

మొలసి సేవించి తారొగిఁ గాంత్రు ముక్తి నదుఃఖులై బుధులు నిరుష్టులగుచు
నేను భవన్నామ మెలమి భజించుచు నుందుఁ గాశీపురమందు దేవి
తోఁ గృతార్థభావధూర్వహత్వమున ముమూర్షమాణు నరు విముక్తుఁ జేయ
నీదు మంత్రరాజనిర్ణయార్థంబుఁ దత్కర్ణమొనయఁ దార్చుకలన కగుచు. ౫౮౩
తే॥ ఈస్తవ మనన్యభక్తిమై నిచ్చ నిచ్చ లెంచువా రించుపేర్మి లిఖించువారు
జదువువారును వినువారు సర్వసౌఖ్య మంది నీదయఁ ద్వత్పద మందఁగలరు.
క॥ అని మొనసి వేడు నానుడి కనంతరం బింద్రుఁ డిట్టు లనె నధియోగం
బునఁ దనరు రామదేవుం గొనకొను భక్తి న్నుతించి కోర్కు లలరఁగాఁ.
శా॥ దేవా! నాదగు సౌఖ్య మెల్లఁ గొనె నుద్దీప్తుండు రక్షోధిపుం
డేవేళన్ సెలకట్టనీ కటిమి వాణీశప్రసాదంబు దన్
శ్రీవర్ధిష్ణుఁ బొనర్ప మత్తిలి సమర్థింపంగ నా సీప్రభా
వావిష్కారమునన్ హతుం డతఁడు గా నర్థాఢ్యతం గాంచితిన్. ౫౮౬
తే॥ అనిన దేవత లిట్లని రసుర కసరి యజ్ఞభాగమ్ము లెల్లఁ దా నపహరించె
నేము రిత్తకు రిత్తగా నెడసినార మభవ వాని వధించి తయ్యాగడు వాసె. ౫౮౭
క॥ నీపున్నె మెసఁగుఁగావుత మేపారెఁడుగాత జగతికెల్ల శుభమ్ముల్
ప్రాపై నీ వుండఁగ మే మాపట్టుల నిలిచి సౌఖ్య మందెద మింకన్. ౫౮౮
తే॥ అనునెడం బితృదేవత లనిరి దేవ! దుష్టదైత్యుండు కెజిలి యహా దోర్బలమున
నాగయాదుల నస్మదీయార్పితమ్ము లొడిచికొనెఁ బిండముఖ్యమ్ము లొకఁడె చాలి.
క॥ ప్రల్లదుఁ డాతఁడు నీచేఁ ద్రెళ్ళె న్మద మొదవె మాకుఁ దీర్చెన్ దొసఁగుల్
ముల్లోకంబున నీనెఱి సల్లలితాత్మా! ప్రసంగసంభృత మయ్యెన్. ౫౯౦
ఆ॥ అనిన యక్షు లిట్టు లాడఁదొడంగిరి వెడఁగు మోచి మోచి విసివినార
మయ్య దుఃఖదుఃఖ మభినియుక్తుల మయి దిష్టకృతి బలాత్కృతిం గలంగి. ౫౯౧
క॥ ఆ రావణుండు నీచేఁ బోరితమునఁ దెగియె మాసుపుణ్యము నీవై
యారాటము మాన్పితి ని న్నారాధించి మనువార మనిశ మధీశా. ౫౯౨
సీ॥ సంగీతనైపుణి జాల్కొను మే మెప్డు నీకథామృతమున నియతి దవిలి
యానందరసతృప్తి నలరారుచుండెడువారము దుష్టాత్మువలని బాధ
లెనసి భీతుల మయి యిక్కల మసురేంద్రు గానం బొనర్చి తత్కథలుగూర్చి
యారాధితుం జేసినారము దీఱని యాపదబ్ధి మునుంగనైన మమ్ముఁ
దేర్చితభవ! వాని ధృతిగిట్టి వధియించి యింకఁ ద్రాత రాఘవేంద్రు విన్న
పొగడుచుందు మెల్లప్రొద్దెమఱక నీదు రూపు డెందమున నిరూపితముగ.
మ॥ అని గంధర్వులు ప్రస్తుతింప నమరు ల్హాయిం గనన్ సిద్ధులు
న్మనులుం గిన్నరులు న్మరుత్ప్రభృతులు న్మాఖ్యోరగమ్ము ల్పత

త్రినికాయాగ్ర్యులు నోలి సంస్తవము లర్థిం గూర్పఁగాఁ జాలి ర
య్యినవంశ్యాగ్రణి రాముప్రాభవము సర్వైష్యప్రవహ్యావ్యంబుగాన్. ౯౯౪

ఆ॥ అప్సరోగణంబు లలవార్చి తచ్చరిత్రంబు తగ నిరూపితం బొనర్చి
యధిపు మెచ్చునడసి యానందసాంద్రతఁ గఱఁగు టొప్పె నప్డు కంబుకంఠి!

క॥ అందఱుఁ బ్రజేశు నెక్కొన ముం దిడుకొని రాముఁ బొగడి ముచ్చటమెయి నిం
పొందెడు తన్మహితోత్సవ మంది తదభినందితత్వ మలరారంగన్. ౯౯౬

సీ॥ చిఱునవ్వు మోమునఁ జిందులాడఁ బ్రసన్నదృక్కలావిభవంబు తేటపడఁగ
శ్యామలాంగానంగకోమలత్వ మెసంగ మిహిరస్ఫురలు మిఱుమిట్లు గొలుప
జానకీసౌదామనీనివేశం బొప్పఁ దమ్ములకొలువు నేత్రమ్ము పొసఁగ
మునుల యాశీర్వాదములు పెంపుదల నింప వాయుజాంచితవరివస్య లొలయ
వెలయు రాఘవు నభిషేకవేషధారి భూరిసింహాసనస్థు విభూషణాఢ్యుఁ [మించి.
గాంచి ధృతిఁ బెంచి వినుతించి కనుల భాగ్య మెంచి సుకృతప్రభావ మూహించి

ఉ॥ ఆతతి వీడుకో లెదల కగ్గల మౌ వ్యథ సంతరింప సీ
తాతరుణీసమేతము సుధామధురంబు సుధాము మాదరో
పేతవచస్మితాఢ్యజగదీడ్యకటాక్షనిరీక్షణాంచిత
శ్రీతముఖాబ్జమున్ ధృతి నయించిరి తన్మహనీయరూపమున్. ౯౯౮

క॥ ఆమానితాత్మ రాముని నామంత్రితునిం బొనర్చి యరిగిరి స్వకముల్
ధామము లెనయఁగ వేల్పులు నేమమునం దత్ప్రసంగనిహితోక్తులతోన్. ౯౯౯

ఆ॥ అటు విరించిముఖ్యు లమితహర్షతరంగితాంతరంగు లగుచు స్వాత్మ పదము
లందఁ బోవువార లందించి రలరులవాన రాముపైని వారిజాక్షి!. ౧౦౦౦

తే॥ మ్రోసెసురదుందుభులు స్తుతుల్మానసె రామగీతిమధురోక్తి నాటనకృతు లెలర్చెఁ
గుంచె వీచుచుఁ జేరి విరించికొడుకు మౌని యయ్యమృత మ్మసామాన్యమనియె.

క॥ ఏ నవ్విభు వీడ్కొని సన్మానితసమ్మాన మెనసి మధురోక్తులతో
నా నెఱి సంబోధించి మహానందం బొలయఁ గాంచి యట రాఁగంటిన్. ౧౦౦౨

తే॥ రామవిభుఁ డటు లభిషిక్తుఁ డై మహీమహీనజనపాలనాహితహితసువృత్తి
దనరఁదనరా రెభూతము ల్తనివు నెఱియఁదమగుణము లుత్తమోత్త మత్వమున మెఱయ.

సీ॥ మోటులు పల్లవమ్ముల జొంపములతోడ సాంద్రతరచ్ఛాయ సంతరింప
శాద్వలమ్ముల నిండుచాల్పు ల్పసరుపన్న రత్నకంబళముల రాణఁ బొనర
మవ్వంపుఁబూగుత్తు లువ్వెత్తు గొని తీఁగె లొగి సిరు ల్తావులు నొలసి వెలయ
స్కంధాత్ప్రభృతిఫలోచ్చయసుమదళసంపదాఢ్యంబు లై క్రమాఁకు లందగింప
నధిపు మే లన్నఁ దన మేలె యనెడు నిచ్చఁ బైరుపచ్చల సుసమృద్ధిఁ బరఁగె వసుధ
యమరె భువి నిద్దె నిత్యకల్యాణ మట్లు పచ్చతోరణ లని ప్రజ ల్ప్రస్తుతింప.

తే॥ సజ్జనుల మానసంబుల సరణి సుప్రసన్నములు సలిలంబులు చాలనెగడె
సరసనిర్దుష్టశివపూర్ణసన్నివేశసురుచిరాంబుజగంధబంధురత లొరసి. ౧౦౯

ఆ॥ ఇంచురుచులతోడ నినశశిగ్రహతార కాగ్ని యుల్లసిల్లె నాన లెల్ల
రాము ననముఁ జెరసి రాణ నొప్పారె నాఁ దెలివి మీఱి మిగులఁ దేజరిల్లె.

క॥ గమకించు మేలిపయ్యెర దమకించి గానంబు లొలసి తాత్పర్యమునన్
దమ కించు సరణి బొదలెడు సమవృత్తి నటంచు జనుల సంస్తుతు లొప్పెన్.

ఆ॥ ఎందు నేని శ్రుతుల కిం పగు సుస్వర స్వరములొప్ప ద్వివిధశబ్దసమితి
పరగ నాకసంబు పరిఢవిల్లెను శబ్దగుణక మనెడు న్యాయగణన దనర. ౧౧౦

సీ॥ శతసహస్రకము లశ్వము లిభమ్ములు నూళ్ళు ద్విజకోటి కర్పించె వెలయ ప్రీతిఁ
దలఁచి నవప్రసూతలు ధేనువు లొసంగెఁ గోటులు కోటులు గోవృషములు.
నటులె ముప్పదికోటు లంచితస్వర్ణము ల్మొలయించె దక్షిణ ల్మమత నెఱయ
మహితాంబరంబులు మణిరత్నభూషణంబులఁ గట్టఁ దొడుగంగఁ బూరి నమర్చెఁ
జందనాదుల నర్చించె సన్నుతిప్రచారములఁ గూర్చి వివిధోపచారయుక్తి
బ్రాహ్మణాన్బర యనిమెడుపలుకు దనర జనవిభుఁడు తన్మహోత్సవసమయమునను

క॥ మణివిగ్రహ కాంచని సద్గుణ రవిరశ్మిప్రకాశకోటికలిత జ్యా
భణ నొక్క దివ్యమాలిక గణించి సుగ్రీవు నఱుత క్ష్మాపతి కూర్చెన్. ౧౧౧

తే॥ వఱలు వైడూర్యమణిచిత్రవజ్రరత్నభూషితము లంగదంబులు పొలుపు మీఱ
నంగదునకిచ్చె నతఁడు సమంచితుఁడయి యొప్పెనవిదాల్చి పతిధృతియుక్తినెగడ.

శా॥ ముక్తాహార మనుత్తమాఢ్యమణిభాముక్తంబు చంద్రాత్మ తా
దృక్తత్త్వైక్యవహం బమూల్యకలనా దేదీప్యమానంబు శ్రీ
యుక్తిప్రేక్ష్యము దివ్యభూషణము దీ రొప్పార నర్పించెఁ బ్ర
త్యక్తాసాదిని మేదినీతనయ కుద్యత్ప్రీతి నాథుం డొగిన్. ౧౧౨

ఆ॥ లలితవిమలవస్త్రములు దివ్యములు రెం డనర్ఘ్యములు శుభావహములు గొన్ని
భూషణములఁ బవనపుత్రున కిడెఁ బతి స్మేరదృష్టి నొరసీతఁ గనుచు. ౧౧౩

క॥ తన కిడిన కంఠహారముఁ గొని జానకి ప్లవగవర్యకోటిం గను నా
థుని కూర్చు మోముదమ్మిం గను నానతి వేచుఁ జిత్తగతి నెగడొందన్. ౧౧౪

క॥ ఇంగిత మాధసి రాముఁ డనంగప్రతిభుండు రాముఁ డనెఁ బ్రేయసితో
డం గమనీయతా ప్యాఢ్యశుభంగమవాక్కులన పొనర భద్రాత్మకుఁడై. ౧౧౫

ఆ॥ సాధ్వి యొసఁగు మింక జాగేల త్వన్మనోగతిఁ దనర్చునదియు కాదె యిమ్మ
హార్హహారవరము హనుమని కీతని కృతి జగత్త్రయోపకృతి వెలయదె.

తే॥ పౌరుషము విక్రమము బుద్ధి వరఁగుచుండుఁ బావనాత్ముం డితనియందు ప్రథితములు
యిట్టిగుణమణులకు స్థాన మిదియ యనుచు మతివిమర్శించి తీవు సమ్మతిపొసంగ. [యి

కం॥ తుష్టిం గాంచితి వీతని హృష్టాత్ము నొనర్పు మనుఁడు నెలమి మహిజ యా
దిష్టము వెలయఁగ హార మభీష్టావహ మొసఁగె వత్స!యిదె కొను మనుచున్.
ఆ॥ అమ్మ గూర్చినట్టి యాహారవల్లిక నమరఁ దాల్చి వానరర్షభుండు
శ్వసనసుతుఁడు వొల్చెఁ జంద్రాంశుచయగౌరవాసితాభ్ర మెనసి యచల మట్లు.
కం॥ గారవ మల్లెనసి శుభాకారుండు సమీరసుతుఁడు కడు నొప్పారెన్
శ్రీరమణీశుఁ గొలువఁ జేకూరెన్ సిరు లనెడు తలఁపు గూర్చెడు ధృతితోన్.
కం॥ మైందద్వివిదుల కొసఁగె నమందానందమునఁ బ్రభుఁడు మఱి నీలునకున్
సందానించె న్నలునకు సుందరతరభూషణములు శుభవసనంబుల్. ౫౨౧
ఆ॥ ఒక్క తారహార ముజ్జ్వలం బెడఁగొని జాంబవంతు మెడఁ బ్రసంజితంబు
సేయ ముసలి కేల సింగార మిది నవ్వటాల కనియె నెల్ల రోలి నగిరి. ౫౨౨
కం॥ వానరయూథపవృద్ధజనానందము పెల్లెసంగ నధిపతి కడు స
న్మానించె నెల్లరు న్మెమే నంద్యుల మైతి మనుచు నిచ్చఁ దలంపన్. ౫౨౩
కం॥ సుగ్రీవు నెట్టు లట్లు దశగ్రీవానుజు స్వకీయసహితు విభుఁడు సా
నుగ్రహుఁ డై పూజించె బుధాగ్రణి ప్రో యీతఁ డనుచు నాడుచు నెలమిన్.
తే॥ కామగుణరత్నచయము పుష్కలము గాఁగ గామితార్థము లొసఁగె నాత్మాతలేం
డెవ్వ రెమ్మెయి వరముల నెలమి వేఁడిరంత కినుబడిగాఁ బృహృష్టాత్ముఁ డగుచు. [ద్రుఁ
ఆ॥ అడుగలేనివార లందు లే రడిగిన వారి కీయరాని వర మటంచు
లేదు రాముఁ గొలువ లేమి యెవ్వారలకేనిఁ గలదె యెందు నేణనయన. ౫౨౬
మ॥ గుహునిం బ్రాంజలిభక్తు ధీవరు ధుతాఘుం గాంచి పేర్మిన్ రఘూ
ద్వహుఁ డోస్నిగ్ధుఁడ! శృంగిబేరపురముం బాలింపు ము న్నట్టుల
ట్లు హరిన్నాధులు మెచ్చ నేయెడల నేలోపంబు వాటిల్ల దా
వహిలు న్మద్భజనంబునం దుది ననాప్యం బాత్మసారూప్యమున్. ౫౨౭
ఆ॥ అనుచు నామతించి యంచితభూషణాంబరము లొసఁగి యనుపఁ బరమ మరుస
మమర నరిగె నాతఁ డమరేంద్రనందితు రాముఁ బొగడుచును స్వరాష్ట్రమునకు.
సీ॥ తనయంఘ్రియుగ మాని తరలని చిత్తంబుఁ బొదువంగఁ గేల్దోయిఁ బొందుపఱిచి
తనభవ్యనామమంత్రమె మెచ్చెడు రసజ్ఞ మేలెంచి తద్దయు మేలుకొలిపి
తనమోహనాకృతిఁ దవిలి త్రిక్కని చూడ్కి ధ్యానయోగావాప్తిఁ దనియఁ జేసి
తనదాస్య మెడలఁ బొమ్మని మోకటిలు నొడ ల్పారవశ్యంబున బ్రతిభ నాఁగి
యున్నవాని హనుమ నొప్పార వీక్షించి కన్నుఁగవ ముదశ్రుకణము లొలుక
నన్నుమిన్న! కంటివా? బిడ్డ తెఱఁగంచుఁ బొలఁతి హర్షవార్ధిఁ బొదలుచుండ.
శా॥ భూమానందుఁడు రాముఁ డిట్టు లనె సంబోధించి యోవత్స! నీ
నేమం బెన్నఁడు ప్రీతిఁ గూర్చె మది నున్నిద్రం బనన్యాపృహ మా

సేమం బే నొడఁగూర్చువాఁడ నెడఁదం జింతించి యర్థింపు ము
ద్దామప్రఖ్యఁ దనర్తులేర పరతత్త్వశ్రీ మహోల్లాసివై. ౫౩౦
చ॥ అనుచుఁ బ్రసన్నుఁడై పలుక నర్థి జగన్మయి సీత తత్త్వ ము
న్మనముగ నందఁజేయ మహిమప్రథితుం డనిలాత్మజుండు నె
మ్మన మలరార నట్టన సుమాళము మీఱ నుదారభావగుం
భన మొనగూర నిట్లనియెఁ బ్రాంజలిబంధనిబంధనోచితిన్. ౫౩౧
ఆ॥ అడుగ వేదపాఠ మర్థి నర్థింపఁ దద్వివర మాత్మనిష్ఠ వెఱ వేఁడఁ
దప మొకం డొనర్పఁ దలఁపఁ దలంపిడి తీర్థసార్థసక్తిఁ దెరలఁజాల. ౫౩౨
క॥ భావమునఁ గూర్ప నణిమాద్యావిష్కరణంబు కరణ మధిదేవత్వం
బే వెరవుననే వలగొన నోవిశ్వాత్మక! గణింతు నొకఁ డెదలోనన్. ౫౩౩
శా॥ నీనామం బె పఠించుచుం దలఁపులో నీరూపె రూపించుచున్
నీనిష్ఠాంచితవృత్తుల న్మలయుచు న్నీవీక్ష లీక్షించుచున్
నీనంద్యస్తుతిపాఠము ల్వినుచుచు న్నీపాదతీర్థంబులన్
ధ్యానాత్తంబులఁ గ్రోలుచు న్నిలుతు నిత్యానందయోగంబునన్. ౫౩౪
క॥ తనివోవ దెపుడు నీనామనిరతిమైఁ దవిలి మనము మానుగ నటు లా
టను భూతలమున నుండెద ననవరతముఁ ద్వత్పదాప్త మగు భావమునన్.
ఆ॥ ఇదె యభీప్సితార్థ మిక్ష్వాకుకులవార్ధిసోమ పూరితార్థికామ జాన
కీమనోభిరామ కీర్తనీయశుభాఢ్యనామ నీకు వందనములు రామ! ౫౩౬
క॥ కొలుతు న్నీపదముల నెదఁ దలఁతు న్నీనామ మెపుడు దవిలిన ధృతితో
నిలుతు న్నిలుపవె యిమ్మె నలఘుత నీకథ దనర్చునంతకు న్నృహరీ. ౫౩౭
సీ॥ అనినఁ గటాక్షాంచలాంచితు నొనరించి యటు బిగికౌఁగిట నలవరించి
యానందబాష్పసిక్తాంగునిఁ గావించి యప్రమేయచిదైక్య మవధరించి
కర్మబంధనిరాసకలన సంధానించి బ్రహ్మస్వరూపతఁ బరిగణించి
నిర్మలరసతృప్తి నెఱయ సంయోజించి ముక్తాత్ముఁడై మించు మురువు బెంచి
యిట్టు లనియె రాముఁ డిదియె జీవన్ముక్తి యెందు నేని నెట్టు లేని నిలిచి
నెగడుగాంచు మెపుడు నీవుకల్పాంతంబు నందుఁ గేవలత్వ మందఁగలవు. ౫౩౮
తే॥ అనుచు రాముఁడు ఘనుఁ డట్టులానసేయ నమృతవర్షణ మొదవించె నవనిజాత
మించుతరబడి నుడులఁ గ్రొమ్మించు లొలయ మలయుస్మేరదృగంచలమహిమ వెలయ
క॥ ఎచ్చోట నున్న నీకెపు డచ్చోటనె యొదవుచుండు నఖిలార్థము లీ
విచ్చ నొడఁగూర్చు నెరవుగ సచ్చిత్సుఖమూర్తి మనుము సంయమవరతన్.
తే॥ అనుచు దేవుండు దేవియు నభిమతార్థసిద్ధిఁ గూర్పఁ గృతార్థుఁడై చెలఁగెనతఁడు
హర్షబాష్పౌఘ మొలయఁ దదంఘ్రులకు నమస్కృతు లొనర్చి పేర్చె సన్మాన్యకీర్తి.

క॥ సురలెల్ల మేలు మే లని విరులజడు ల్నెఱయఁజేయ విశ్వాచి మొదల్
తరుణులు నటింప ముజ్జగ మరుసంబునఁ బొదలనయ్యె నవ్వేళ సఖీ. ౫౪౨

ఆ॥ వీడరాని దొరను వీడి యెట్టెట్టులో తలఁపులోని చూడ్కి దార్ఢ్యమునను
వీడకే ప్రసంగ విశ్వమయుఁడు దాను నై తదాత్మభావ మలవరించి. ౫౪౩

క॥ సెలవుగొని సీదుజనకుని నెలవున నిలువంగఁ దలఁచి నెఱసె మహాత్ముం
డలఘుచరిత్రుఁడు పవనజుఁ డలివేణీ వింటివా గుణాద్భుత మిదియున్. ౫౪౪

క॥ ఆమంత్రణ మొనరించుచు నేమెయి నిను విడచి నిలువ నేగుదు మనుచున్
సామీ! యేమెలకువ నెపుడే మము రావింతే యనుచు నిటు నటు గనుచున్.

క॥ ఆనరనాథుని యానతి వానరవరు లరుస మెసఁగ వఱలుచుఁ దరలం
గా నైరి తోడివారలతో నెమ్మనములు తదాత్మధూర్వహములు గాన్. ౫౪౬

శా॥ నైష్కించన్యము దోఁప రామకృతసన్మానంబు మే ల్పూప స్వా
విష్కారప్రహితప్రభావగుణ ప్రావీణ్యాఢ్య రాలచ్చి త
న్నిష్కామ్యత్వ మెడల్ప స్వీయజనతానిర్వాహ మొప్పారఁగాఁ
గిష్కింధాపురి కేగె నర్కజుఁ డటన్ గీశౌఘము ల్గొల్వఁగాన్. ౫౪౭

చ॥ కులధన మంది రాము నుపగూహనముం గనఁగాంచి యవ్విభుం
దలఁపున నేర్పడ న్నిలిపి తద్దయు భక్తిఁ దనర్చు వృత్తితో
నెలమి భజించుచుం బురికి నేగె విభీషణుఁ డల్లలంకలోఁ
గల జన మెల్ల సంతసిలఁగాఁ బలుపూజ లొనర్చి మెచ్చఁగాన్. ౫౪౮

ఆ॥ జనకముఖ్యులైన సకలబాంధవుల నా మంత్రితులఁ బొనర్చి మన్ననలఁ ద
నర్చి వార లొలయ ననుచు గూరిమిఁ బంచె స్వస్వధామములకు సరసహృదయ.

—♦ శ్రీరామరాజ్యము ♦—

మ॥ పరిపాలించెను రాముఁ డెల్లజగము న్ప్రావీణ్య మొప్పార ని
ర్జరు లిల్లా నన రాష్ట్రపుంబ్రజలు నిస్త్రాసంబు నిష్కంటకం
బరరే యిమ్మహనీయు స్వామ్య మనుచున్ హాయిం గనం గీర్తి రా
జ్యరమాకీర్తితవృత్తి సర్వదిశ లొయ్యం బ్రాకి నర్తింపఁగాన్. ౫౫౦

చ॥ తొలిబలుకల్లనాఁ డొదవెఁ దోడుగ నేలర యెల్లరాజ్య మేఁ
బలికిన పల్కు సెల్లమియుఁ బాడియె యంచు జగద్విభుండు దా
వల నొదవంగఁ దావలము వాక్కులకల్మికి రాముఁ డేర్పడం
బలికి నయింప లక్ష్మణుఁడు ప్రాజ్ఞత మీఱ నయాంచితాత్ముఁ డై. ౫౫౧

మ॥ ఎలమి న్నిన్ను భజించెదన్ గొలువువం దేవేళఁ జూపట్టెదన్
లలి నీపం పెదనింపు సత్త్వకృతి ముల్లాసంబునం గర్జమిం

పలర స్త్రీద్ర్చెదఁ గాని యొందుపద మే నరింప నీవాఁడ న
న్వల నొప్పారఁగఁ బ్రోవవే యనితరవ్యాసంగిత న్మెకొనన్. ౧౧౨

ఆ॥ అట్లుగాక పెద్ద యటులుండఁ బిన్న కా వెరవు పోలదనుచు వేఁడుటయును
భరతు యౌవరాజ్య పట్టభద్రు నొనర్చె భద్రధామి రామభద్రుఁ డెలమి.

తే॥ రామసేవాపరుం డయి రక్తి భక్తి భుక్తిముక్తుల వలని వై పొసఁగుచుండ
మెయిమెయి మెలంగుచుండె సౌమిత్రి తనదు సకలధరణక్షమతయెల్ల సంతరింప.

సీ॥ అజుఁడు మాయామానుషాకారలక్షితుం డాదిదేవుండు నారాయణుండు
పరమాత్ముఁ డౌ రామభద్రుండు దా నెప్డు నిర్వికారుం డతినిర్మలుండు
దనరు కర్మాధ్యక్షతం గర్తృతాదులఁ బెరయఁబోఁ డానందపరత కలిమి
నిత్యతృప్తుండయ్యు నెఱిఁ బ్రాకృతుల నుపదేశంబు కలనలఁ దేర్పఁదొడరు
టొప్పు ననెడు నోజ నొనరించె బహుదక్షిణాక లిజ్యలం ద్రిలోకి సంత
సమునఁ దేల మునులు సంతతాశ్రయమున మొనసి యెల్ల కృత్యముల మెలంగ.

క॥ ఆధానముఖ్యములు లక్ష్మీధాముఁడు తొలుత దీర్పు మెయిఁ దీర్చి మహా
గ్న్యాధాని యై తురంగమమేధక్రతుశత మొనర్చె మేకొను కలిమిన్. ౧౧౩

తే॥ పౌండరీక తురగమేధ వాజపేయ విశ్వజిత్ప్రముఖములు నిర్వేలవిభవ
ములుగ నొనరించె నావిశ్వమూర్తి లోక లోకవితతులు తనియ నలోలుఁడగుచు.

మ॥ తనతో డై తనతోడు లక్ష్మణుఁడు ప్రోద్యల్లక్ష్మి వర్తిల్ల మె
చ్చనువొంద న్యువరాజధర్మమున భక్త్యాగ్ర్యిండు కైకేయి నం
దనుఁడు న్మెకొనఁ బిన్నతమ్ముఁడు మహోదర్పోన్నతిన్ సైన్యపా
లనవృత్తిం బచరింప రామవిభు లీలాస్ఫూర్తి యొప్పెం గడున్. ౧౧౪

క॥ బందుగుల రాకపోకలకుం దెఱపి వచింప నెల్లు గొనకొను నెపు డా
నందానితదీక్షుఁడు సురబృందంబులు వొగడ వేల్చు విధుల న్నెగడన్. ౧౧౫

శా॥ ధర్మాత్ముం డటు రాజ్య ముత్తమము సీతాజాని పాలింపుచున్
గర్మిష్ఠుం డన నొప్పి సత్క్రతువులం గావించె ధర్మాహతా
ధర్మం బై జగ మెల్ల మేకొనఁగ నిత్యశ్రీవికాసంబునన్
శర్మోపేతసుధర్మ మేలుకొని యైశ్వర్యోన్నతిం గాంచఁగాన్. ౧౧౬

మ॥ పదికాలంబుల కీతఁడే ప్రభుఁడుగాఁ బాటిల్ల నాఁగాత మి
య్యదె కా పూర్వసుకృతంబు నెల్ల నొకఁడై యందిచ్చు నర్థం బటం
చుఁ దదేకాత్మత భూప్రజ ల్దలఁపుల న్యాచింపఁగా రాముఁ డా
పదివేలుం బదినూర్లు నేం డ్లెలమి నై భావించెఁ బాలింపఁగాన్. ౧౧౭

సీ॥ విధవలు లేరు నిర్వేదవంతులు లేరు లేరు వ్యాళజభయాలీఢహృదయు
లాధులు వ్యాధు లంచెనువారు లేరు దస్యుకృతంబు దురితం బసూర్క్షణంబు

లేమి యనర్థము ల్లీనంబు లయ్యె శబ్దములంద యొండొకటి దారి దరియు
దఱియఁగాఁ బోలమిఁ దని వొప్ప వర్షించె నెల మూఁడువానల నియతి ఘనుఁడు
పదరి పండఁదొడరెఁ బంటవలంతి ముక్కారు గాఁగ మెచ్చు కర్షకులకుఁ
బొడమఁ బొసఁగె సర్వపూర్ణత జానకీజాని రాజ్య మేలు సమయమునను. ౧౬౨

క॥ పిన్నలు పెద్దల ముందఱ బన్నముపడుట గన రామిఁ బైతృకకృత్యం
బున్నతయథాక్రమవిధికన్న వ్యతిక్రమము గాఁగఁ గనుపడ దెందున్. ౧౬౩

క॥ అంతయు సంతస మయ్యె నిరంతరధర్మపర మయ్యె నఖిలము జగ మ
త్యంతక్షము రాముంగని మంతనముల మఱచెఁ బ్రాణిమాత్రములు పగన్.

ఉ॥ వేలకొలంది వర్షము లవేల సుఖోన్నతిఁ బుత్రపౌత్రసం
శీలన మొప్పఁగా మనిరి చేటని లేక ప్రజ ల్నిరామయుల్
పోలఁగ రాము రాజ్యపరిపోషణ మొప్పఁగ నెందునేని శో
కాలపనంబు లట్టి యడియాలములుం గనరా వొకప్పుడున్. ౧౬౫

ఆ॥ నిత్యపుష్పతతులు నిత్యఫలములు నై క్షూమ్రజములు పొనర్చె స్కంధవిస్తృ
తప్రవాళరచన దళుకొత్తఁ గ్రొత్త లై రాము రాజ్యకలన రాణఁ దనర. ౧౬౬

తే॥ సమయవర్షి పర్జన్యుండు స్పర్శనుండు స్పర్శసుఖదుండు సర్వసంపాదనప్ర
సాదపరు లెల్ల వేళ నిర్జరులు రామరాజరాజస్ఫుర న్మహారాజ్యమునను. ౧౬౭

చ॥ క్షమ గల యెల్లబ్రాహ్మణులు క్షత్రియు లర్యులు శూద్రులున్ స్వక
ర్మము లొనరించుచుండ్రు కసుమాలపు లోభము వీడి తత్పర
త్వము నెగడొంద స్వీయకృతి దారితకల్మషవృత్తితృప్తు లై
యమితఫలాప్తి సౌఖ్యముల నందుదు రారఘునాథు ప్రోపునన్. ౧౬౮

క॥ వర్ణాశ్రమధర్మంబు లపర్ణా! విశదంబు లగుచుఁ బరఁగెఁ బ్రజలయం
దర్ణవముద్రితభూస్థలి నిర్ణీతంబయ్యె నీతినిగమం బెల్లన్. ౧౬౯

ఆ॥ సత్యరతులు గాని జను లెందు లే రనృతులు విధర్ము లైన తులువవాండ్రు
మాటలందునేని మలయరు రాము రాజ్యము ప్రవర్తనమున శమితశమల!

క॥ రామపదోల్లసితంబుల యా మురిపెపు నుడుల లెక్క యన్యాశంసల్
నేమమున నెగడ వెందును రామమయం బయ్యె జగము రామామణిరో! ౧౭౧

తే॥ రామపూజ లొనర్తురు రామభజనపరుల మై యుందు రెప్పుడు భావనంబు
రామనామంబె స్మరియింత్రు రామగీతు లొప్పఁ బాడుదు రెల్లెడ నుండు ప్రజలు.

క॥ అందఱు ధర్మపరాయణు లందఱు లక్షణసమగ్రు లంద రొరుల కొ
న్నం దరుదేమి ప్రజాహితఖుం దరుచి యటంచు లేని యధిపుమనుపునన్.

తే॥ తన వన్ను నొకండు వేలేండ్లుఁ దనరు రాజ్యపాలనము తెఱఁగులు ధర్మపద్ధతు లని
మునులు గూర్పంగ జేజేలు మురియుచుండ రాముఁడు ధరించె ధర సుఖధాముఁడగుచు

సీ॥ ముద్దులొల్కెడు మేలిముచ్చటలం దేర్చు తెరువున క్షితికన్య తెలుఁగు సూప
భారమ్ము తనపాలఁ బడె నంచు మే లెంచు పరిశీలనంబున భరతుఁ డొప్పఁ
బాదపద్మంబుల పజ్జ సెజ్జఁ బొనర్చి సౌమిత్రి కొలువునే స్తమునఁ దనరఁ
దనదు శత్రుఘ్నపదమ్ము సార్థకముగఁ జిన్నతమ్ముఁడు దండభృతిఁ దలిర్ప
రాముఁ డేలెఁ దండ్రిరాణ నౌరసు లైన ప్రజల నట్లు ప్రజలఁ బ్రబలి ధర్మ
మొకఁడె విశ్వరూప మొలసెఁబో యని వేల్పు లలరి యలరువాన లలరఁజేయ.
సీ॥ జిలుఁగునవ్వుల పంట సిరి నేలకన్నియ తోడి సింగారమ్ము తోడవుగాఁగ
రావణారీ!యంచు రహిఁబెంచు వందుల నుడిసంచు బీరమ్ము నొడువుచుండ
మునులపాలిటి లిబ్బి మొగసాల యగు గోష్ఠి తలఁపులఁ గరుణ నేస్త మ్మెలర్పఁ
జుప్పనాతి యనీతి చొప్పారు నప్పాట హాస్యభీభత్సమ్ము లడరుచుండ
నబ్ధిశోషణకథ రౌద్ర మచ్చుపడఁగ
స్వైక యధర్మభీరుత భయానకముఁ జూప
శాంతుఁడు గుణాద్భుతుఁడు రామచంద్రుఁ డొప్పె
నవరసాలంకృతివిశేషనాయకుఁడుగ. ౫౭౬
సీ॥ శ్రీరమాపద్మినీశ్రీయోగభాస్కరుం డినకులాంబుధిరజనీశ్వరుండు
యజ్ఞవిఘ్నకృదాశరాటవీదహనుండు గ్రావసతీత్వకళావిరించి
రౌద్రశరాసనాత్తుద్రాద్రిపవిధారి క్షితిసుతార్ధాంగలక్ష్మీవిభుండు
మునిమనోనిర్వేదముదిరమహానిలుం డహితరాక్షసనివహాంతకుండు
హరివిరోధిపుర ప్లోషణాగ్నినేత్రుఁ డసురరాజాసువాయూరగాధినాథుఁ
డఖిలసురమూర్తి రామనారాయణుండు తనదు సత్త్వము దనరార ధరణి యేలె.
సీ॥ సింహాసనము మూర్తిఁ జెంది కృతార్థత్వ మొందితి నని యుర్వి యుల్లసిల్లె
గొడుగుతోడి ప్రసక్తిఁ గొంటిలే కొఱఁతలు లే వటంచు దివంబు లేమిఁ దొఱఁగె
వరవుల్లు మావారె వర్ధిల్లెదము వారిఁ జేరి యంచు సుర ల్విచార ముడిగి
రందలి కవుల వాగర్థయోగావాప్తి నొలయ నామ్నాయంబు లొప్పుకొనియె
సీత నెనసి సిరి విశేషిత నైతి నం చలరెఁ బరికరమ్ము లంశకలన
మున్నె పెరయు పెంచి మురిసె రాఘవహరి జగతిఁ బ్రీతిఁ బ్రోచు సమయమునను.
సీ॥ మొలకనవ్వులతోడి ముచ్చటలం దీర్చు ధర్మసందేహవిదారితయును
గలికికాన్పులతోడి కన్నుల నందిచ్చు సకలసమృద్ధిప్రసాదితయును
బొమముడితోడి విస్ఫురణమైఁ బోకార్చు దుష్టసంకల్పారిదూషితయును
నొడికంబుతోడి వా నొయ్యారములఁ బొల్చు లక్ష్మీవిలాసోపలక్ష్యతయును
రామునంద కాని రాణింప వెందును మనము వానియందె మగ్న మయ్యెఁ
దలఁతు నెపుడు లోన దర్శింతుఁ దద్రూప మెంతు గుణగణముల నెలమిఁగొంతు.

క॥ వేయు నవతారముల సుశ్రీయుతు శ్రీరాము గరిమఁ జెనయఁ డొకఁడు వి
ద్యాయోగాయుర్లక్ష్మీశ్రేయంబులు రామభక్తిసిద్ధ ఫలంబుల్. ౧౮౦
తే॥ఇది రహస్యము ధనధాన్యబుద్ధి విద్య లాయురారోగ్యజయములు సందఁజేయు శ్రు
శ్రేయ మొనగూర్చు నెద దీనిఁ జేర్చు నరుఁడు దానె నారాయణుండయి తనరుచుండు
ఆ॥ ఆదిశంభుమూర్తి నైన నాదు కృతి యధ్యాత్మ రామచరిత మనఁగఁ జెల్లు
దీనిఁ జదివి తుష్టమానసుఁ డగువాఁడు సంసరణపయోధిఁ జక్కఁ గడచు.
క॥ ఇది ధన్య మిది యశస్యం బిది యాయుష్యము పవిత్ర మిది యదనునఁ బెం
పొదవం జేయును రాజుల కిది విజయావహము నాఁగ నొదును నెగడున్. ౧౮౩
సీ॥ ఆర్షమై నెగడెడు నది యాదికావ్యంబు నాగ నాఁగకరోరు! యనుచు భక్తిఁ
బ్రణుతించు వాల్మీకి పరమర్షివరుఁ డతం డనఘతపోనిష్ఠుఁ డట్టుగాన
రాణ నియ్యది యది రామాయణాభిఖ్యఁ దనరారు నీరెంటఁ దవిలి మేలి
సిరిమించు రామాభిషేక మెవ్వఁడు వ్రాయు జదువును విను నిచ్చ సంస్మరించు
వాఁడు పాపకోటివలన నిర్ముక్తుఁడై పరమపదముఁ గాంచి పరఁగఁగలఁడు
పుత్రకాముఁ డొందుఁ బుత్రుల ధనకాముఁ డొందు ధనముల న్మహోన్నతముల.
తే॥ రామవిజయంబు విను నృపుఁ డోమఁజాలు
జగతి రిపుల జయించి నిస్తంద్రుఁ డగుచు
రామసంహిత విను నాతి రమణఁ గాంచుఁ
బుత్రుఁ ద్రైలోక్యపూజితుఁ బుణ్యమూర్తి!
క॥ వంజకు నేనియు సంతతి సంజాత యగున్ ధరిత్రి సంతతభక్తిన్
రంజిలుచు రాముచరిత నిరంజనవృత్తి విన నేర్చునది యగు నేనిన్. ౧౮౬
తే॥అష్టసంపద లందెద రవని జనులు
శ్రద్దధాను లగుచు రామచరిత మెపుడు
దెలిసికొనుచుఁ జదువ దుర్గములు జయించి
యుభయము ప్రతిష్ఠఁ గాంచంగ నర్హు లగుచు.
మ॥ సురలెల్లం బరితుష్టిఁ గాంచెదరు సంస్తుత్యాత్మతృప్తి న్వహిం
తురు సీయు ల్పితరు ల్వినాయకముఖోద్భూతగ్రహార్తు ల్దలం
గు రమాధాముఁడు రాముఁ డేర్పడఁగ రక్షోనాథు శిక్షించి యె
ల్లర రక్షించిన యీచరిత్ర మురులీలాస్ఫూర్తిఁ గీర్తించినన్. ౧౮౮
తే॥ యెల్ల రామాయణము వ్రాసి యెల్లవేళ నెల్లజగములకును విభుం డీశ్వరుండు
రాము భజియించు వారలు రహిఁ గడింత్రు సకలపురుషార్థఫలవిశేషముల బాబ!
చ॥ నియమ మెసంగ భక్తి పరిణీతయు నాఁ దనరార సద్వివే
కయమధృతు ల్పొసంగఁగ జగత్ప్రభు రాముచరిత్ర మేర్పడన్

మెయికొని తెల్పు బ్రాహ్మణుల మే లెద నించి భజించి యెప్డు క్ష
త్రియముఖు లుత్తమాస్పదముఁ దేకువమైఁ గనఁగాంతు రంగనా! ౫౯౦

సీ॥ సీతామనోనాథు శ్రీరాము నారాయణాఖ్యతత్త్వము గాఁగ నవధరించి
యీడేర్చు కృతులయం దెలమితోఁ దన్నామకలన లొప్పారంగ నలవరించి
యేపక్షమునఁ జేని నిదె తత్త్వసార మా ఘనయోగ మని బుద్ధి కలిమి నెంచి
బల్లిదం బై నిచ్చ పరఁగు కామాద్యరివర్గమ్ము నిరసించు వలను గాంచి
యీ వెరవుమెయి రామాయణాగమంబు
పొంకముగ వ్రాసి పఠియించి పూజఁ జేసి
విటపవిస్తృతదుర్భవవృక్ష మడఁచి
చొప్పడు మహాహ్లాదయమున మించును నరుండు. ౫౯౧

తే॥ సుకవియగువాఁడు తన మేలిసుకృత మొప్పఁ
బ్రవిమలాత్మత నిక్కథఁ బ్రాసముఖ్య
దృగ్విలాసంబుల నమర్చి తీర్పొనర్చి
మహితకవివర్ణితపదాప్తి మలయఁగలఁడు. ౫౯౨

క॥ మీ కెల్లరకును భద్రము
సేకురుఁగావుత విశేషచిత్కళలనలతో
రాకేందుముఖిరో! రాముని
శ్రీకాముని చరిత మెడఁదఁ జేర్చుటకతనన్. ౫౯౩

తే॥ రాముఁ డఖిలాత్మకుఁడు పరబ్రహ్మమూర్తి
యతఁడు తుష్టుండు గా జగం బంతయును ని
రంతరం బగు సంతోష మందఁగాంచు
నిదియె శ్రుతిసారము రహస్య మిందువదన! ౫౯౪

ఆ॥ అనుచు వేదరాశి నసకృదాలోడన
విధి విధించి రామవిష్ణువిదిత
మరసి తెలిపెఁ దారకాభిఖ్య మా బ్రహ్మ
తత్త్వ ముమకు శివుఁడు తత్పరతను. ౫౯౫

శా॥ ఆనందామృతవార్ధిఁ దేలి మహితం బౌ నర్థ మూహించి మె
ప్పొనన్ రామకథామృతంబు స్వరసం బౌ నా నటంచున్ బ్రశం
సానిర్వాహముతో నుతించె విభునిన్ శర్వాణి సర్వామరే
శానా! నీదయఁ దత్త్వసారము సులక్ష్యం బయ్యె నంచున్ ధృతిన్. ౫౯౬

తే॥ సరగ రామకథాసుధాసాగరమున నెసఁగు రామకథామృత మిది ప్రపత్తిఁ
గ్రోలు మానవుఁ డఘకృతక్షోభ మెడలి యందఁగాంచునుఁ బరమాఖ్య మాస్పదంబు

స్రగ్ధర॥ * కల్యాణానందనాథాఖ్యగురుపదజలజాళీతాత్మీయహంకా
వల్యాత్తస్వచ్ఛభావవ్యవసితకవితావర్ణనీయాత్మతాదృ
క్పల్యంచద్వేంకటాఖ్యప్రథితకవివరప్రస్తుతాఖండదృక్కై-
వల్యానందస్వరూపాఽవ్యవహితపరమైశ్వర్యలక్ష్మ్యప్రభావా! ౫౯౯

క॥ శ్రీమచ్చిద్యోగలసద్భూమానందయతినాథపురుకరుణాసు
శ్రీమానితజనవర్ణితభామానవనవవికాస! పరమోల్లాసా! ౬౦౦

మాలినీ॥ సురుచిరశుభపీఠా! శుద్ధభావప్రతిష్ఠా!
నిరుపమగుణహృద్యా! నిష్ఠితామ్నాయవేద్యా!
గురుకృతమతిసేవ్యా! గుంభితాత్మానుభావ్యా!
పరహితపదపద్మా! బ్రహ్మభూయాఖ్యసద్మా!. ౬౦౧

గద్య॥ ఇది శ్రీసుమమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్య మహితాత్రేయగోత్రపవిత్ర హనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబున
యుద్ధకాండంబు నుత్తరభాగంబున
సర్వంబును ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ






# శ్రీరామకథామృతగ్రంథమాల, చందవోలు.

## రాజపోషకులు ( రు 200 )

నీలి పిచ్చయ్యగారు, వీరి కుమాళ్లు (1) బంగారయ్య (2) శ్రీరాములు (3) సత్యనారాయణగార్లు, చందవ్రోలు, బాపట్లతాలూకా.

## ప్రధానపోషకులు ( రు 100 )

శ్రీమదద్దంకి వేంకట తాతదేశికాచార్యులవారు, తక్కెళ్ళపాడు.
శిసుపాటి సీతారామశాస్త్రిగారు, ఇంకొల్లు.
చల్లా కామయ్యగారు, ఆలూరు.
గోవిందరాజుల సీతారామయ్యగారి కుమాళ్ళు,
(1) సత్యనారాయణ బి. యే., బి. యల్.,
(2) నరసింహారావు (డాక్టర్)
(3) కృష్ణమూర్తి (డాక్టర్) గార్లు, గుంటూరు.
తడవర్తి బాపయ్యగారు, ధూళిపూడి.
చిరసాని అప్పిరెడ్డిగారు, చోడుపాలెం.
చిరసాని వెంకటరెడ్డిగారు, చోడుపాలెం.
మోదుగుల నాగిరెడ్డిగారు, చోడుపాలెం.
ఆత్మల నాగరాజుగారు, గుంటూరు.

## పోషకులు ( రు 50 )

ఆలూరు కామేశ్వరరావుగారు, ఆలూరు.
మందపాటి సీతారామరాజుగారు, రాజుగారిపాలెం.
వంగల వెంకట సుబ్బయ్యశాస్త్రిగారు, తాడికొండ.
ముప్పా గోపయ్యగారు, ప్యాపర్రు.
చిరసాని పున్నారెడ్డిగారు, చోడుపాలెం.

## సహాయులు ( రు 20 )

ప్రతాప రామస్వామి గురువరేణ్యులు, వల్లూరు.
తాడేపల్లి సీతారామయ్యగారు, చందవోలు.
తాడేపల్లి సత్యనారాయణగారు ,,
పరిమి నరసింహంగారు ,,
మాచిరాజు లక్ష్మీనారాయణగారు ,,
వేదాంతం కృష్ణమాచార్యులుగారు ,,
కేతరాజు రామసుబ్బారావుగారు ,,
నీలి వెంకటప్పయ్యగారు ,,
వనమా సుబ్బారాయుడు కొ. పేరయ్యగారు ,,
ఈ. సీతారామయ్యగారు ,,
పొన్నూరు నారాయణగారు ,,
తాడేపల్లి పున్నయ్యగారి కొ. బ్రహ్మయ్యగారు ,,
నీలి నాగభూషణంగారు ,,
పొన్నూరు లక్ష్మీకాంతంగారు ,,
తాడేపల్లి పెదబ్రహ్మయ్యగారి కొ. చెంచుపున్నయ్య ,,
వనమా వెంకట నాగభూషణంగారు ,,
వనమా పేరయ్యగారి కొ. వెంకటేశ్వర్లుగారు ,,
నీలి పెదబంగారయ్యగారు ,,
అద్దేపల్లి వెంకటప్పయ్యగారు ,,
వనమా వెంకటరత్నంగారు ,,
వనమా సుబ్బారావుగారు ,,
బూరుగుల సూర్యనారాయణమూర్తిగారు అమృతలూరు
భాషాసంజీవనీగ్రంథాలయము ,,
కొత్తపల్లి చల్లమ్మ కొ. నరహరిగారు ,,
శరణు వెంకటసుబ్బమ్మగారు ,,
కొణకంచి అనంతనారాయణగారు ,,
గడ్డిపాటి రామస్వామిగారు, ప్యాపర్రు
కప్పర శ్రీరాములుగారు ,,
యలవర్తి నరసింహారాయలుగారు, యలవర్రు
వేదాంతం జగన్నాథాచార్యులుగారు, మోపర్రు.
అంబడిపూడి రామబ్రహ్మకవిగారు ,,
తూనుగుంట్ల నారాయణగారు, తురిమెళ్ళ.
శ్రీరాజరాజనరేంద్రగ్రంథాలయము, గోవాడ.
ఆలపాటి దేవయ్యగారు ,,
శ్రీనన్నయాంధ్ర గ్రంథనిలయము, పెదపూడి
శ్రీసరస్వతీనిలయము, కూచిపూడి.
నాదెండ్ల నరసింహ సిద్ధాంతిగారు ,,
చల్లా లక్ష్మీనారాయణగారు, ఆలూరు.
చల్లా వెంకటసుబ్బమ్మగారు ,,
చెరుకుపల్లి వెంకయ్యగారు, కోడూరు.
కోటంరాజు సీతారామరావుగారు ,,

చావలి వెంకటసుబ్బయ్య కొ. శేషాచలంగారు కోడూరు.
జాలాది వెంకటసుబ్బయ్యగారు సంగుపాలెం.
నందిపాటి తారకరామయ్యగారు, సరప్పాలెం.
పరుచూరు శేషాచార్యులుగారు, పోలూరు.
పొదిలె రామకృష్ణయ్యగారు, పొదిలెవారిపాలెం.
తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, కాపూరు
సీతారామాంధ్రగ్రంథాలయము ,,
జొన్నలగడ్డ హనుమయ్యగారు ,,
రావూరి వీరభద్రయ్యగారు దం. నాగభూషణంగారు ,,
దొంతిరెడ్డి వెంకటేశ్వరరెడ్డిగారు, రెడ్డిపాలెం.
వుయ్యూరు నరిసిరెడ్డిగారు, గోడుపాలెం.
చిరసాని చినఅప్పిరెడ్డిగారు ,,
శ్యామల రామకృష్ణారెడ్డిగారు, కోమలి.
మోదుగుల వెంకటరెడ్డిగారు, గుడూరు.
వుయ్యూరు వెంకటరెడ్డిగారు ,,
గుదేటి సుబ్బారెడ్డి భార్య సీతారామమ్మగారు ,,
మోదుగుల వెంకటరెడ్డిగారు ,,
శ్రీమదద్దంకి తిరుమల సమరయోద్దండ కోలాహల లక్ష్మీ
నృసింహకుమార తిరుమలాచార్యులు గారు, తక్కెళ్లపాడు
యడ్లపాటి సీతయ్యగారు, బోడపాడు.
యడ్లపాటి మాణిక్యమ్మగారు ,,
తాడేపల్లి పున్నయ్యగారు, తాడిసర్తి అగ్రహారం.
నులకపల్లి సత్యనారాయణశాస్త్రిగారు, యాజలి.
గూడూరు శివయ్యగారు ,,
దావులూరి రాఘవయ్యగారు, ఇంటూరు.
కాట్రగడ్డ రాజగోపాలంగారు ,,
హిందూ అసోసియేషన్ పంచాయితి గ్రంథాలయం ,,
ఉదూరి చలపతిరావుగారు (ప్లీడర్ గుమాస్తా) ,,
మద్దూరి సాంబయ్యశాస్త్రిగారు, పగుచూరు.
ప్రతాప హనుమచ్ఛాస్త్రిగారు, తిమ్మరాజుపాలెం.
యలవర్తి పెదరంగయ్య వ॥ తిమ్మాపురం.
మద్దూరి లక్ష్మీనరసింహంగారు, నరసరావుపేట.
వేమూరి చిరంజీవి అవధానులుగారు ,,
పరిమి వెంకటస్వామి నాయుడుగారు ,,
రాళ్ళబండి చంద్రమౌళిగారు ,,
పులుపుల సత్యనారాయణగారు ,,
అంబడిపూడి ఆనందయ్యగారు కాకాని.
ప్రతాప హనుమయ్యగారు, రాజుపాలెం.
మాగంటి అవధానులుగారు, తూబాడు.
గో. గోపాలరావుగారు, (సర్కిల్ ఇన్‌స్పెక్టర్) తెనాలి
నడింపల్లి రామభద్రయ్యగారు

మద్దూరి రామసోమయాజులుగారు తెనాలి.
నోరి వెంకటసుబ్రహ్మణ్యంగారు ,,
దేవభక్తుని పెదవెంకటసుబ్బయ్యగారు, పల్లెకోన.
తూములూరి కృష్ణశాస్త్రిగారు రాచూరు.
కౌతా వెంకటేశ్వర్లుగారు, పెదపులివర్రు.
దావులూరి పిచ్చయ్యగారు ,,
కస్తూరి మేధాదక్షిణామూర్తిగారు, కనగాల.
దుంపా వెంకటేశ్వర్లుగారు ,,
అవ్వారి వెంకటనరసయ్య సిద్ధాంతిగారు, వెనిగండ్ల.
యెజ్జు పున్నయ్య కొ. రత్తయ్యగారు ,,
యెజ్జు ఆదెయ్యగారి కుమాళ్ళు (1) నాగభూషణం (2) రామమూర్తి (3) హనుమంతరావు (4) వెంకట సుబ్బారావు (5) కోటిరత్నంగార్లు, తాడికొండ.
కన్యకాపరమేశ్వరీ వర్తకసంఘం ,,
గ్రంధి వీరరాఘవయ్యగారు, పొన్నికల్లు.
పాటిబండ్ల సీతారామయ్యగారు, ,,
పాటిబండ్ల నరసింహనాయుడుగారు ,,
అన్నంగోట్ల వెంకటరామశాస్త్రిగారు, గోరంట్ల.
చక్కా తిరుపతి, రామకోటయ్యగార్లు ,,
చక్కా సూర్యరాఘవయ్యగారు ,,
దిట్టకవి రాఘవాచార్యులుగారు, కంతేరు.
అవ్వారి కామయ్యగారు ,,
పాటిబండ్ల బుచ్చయ్యగారు, జొన్నలగడ్డ.
బత్తిని పురుషోత్తమయ్యగారు, కొప్పర్తి.
బత్తిని గోవిందయ్యగారు ,,
రత్నాకరరి రామాచార్యులుగారు ,,
వనమా కోటిస్వామిగారు ,,
పొత్తూరు వెంకటసుబ్బయ్యగారు ,,
పొత్తూరు హనుమంతంగారు ,,
గొడుగుల వెంకటసుబ్బయ్యగారు ,,
బత్తిని సీతమ్మగారు ,,
బత్తిని కుమారస్వామి, మే. రామయ్యా, రా. సుబ్బయ్యగార్లు ,,
శ్రీరామమందిరం, శ. శ్రీరామశాస్త్రిగారు ,,
పొత్తూరి నాగేంద్రంగారు వ|| ,,
మండెపూడి బాపయ్యగారు, గొట్టిపాడు.
కాట్రు తిరుపతిరాయుడుగారు ,,
గుంటుపల్లి రామచంద్రయ్యగారు ,,
శ్రీనివాసుల వెంకటాచార్యులుగారు ,
గుంటుపల్లి బాపయ్యగారు వ|| ,,
కస్తూరి తాయమ్మగారు వ|| ,,
ప్రత్తి హనుమత్సీతారాములుగారు, ప్రత్తిపాడు.

రాజనాల వెంకటసుబ్బయ్యశాస్త్రిగారు వ|| ప్రత్తిపాడు
,, శంకరశాస్త్రిగారు ,,
,, రామసుబ్బయ్యశాస్త్రిగారు ,,
కొండా భోగిభూషణంగారు, చినకొండ్రపాడు.
ములుకుట్ల వీరరాఘవశాస్త్రిగారు, యింకొల్లు
,, కోటయ్యశాస్త్రిగారు ,,
పిసుపాటి సత్యనారాయణగారు ,,
మేళ్ళచెరువు భగవానులుగారు, ఈదుమూడి.
అబ్బరాజు లక్ష్మీనారాయణగారు, కొణికి.
దగ్గుబాటి వెంకటనరసయ్యగారు, దగ్గుబాడు.
పోతుకుచ్చి చల్లయ్యశాస్త్రిగారు, ద్రోణాదల.
దెందుకూరి చెంచురామశాస్త్రిగారు, బాదవాడ.
పరిమి గోపాలస్వామిగారు, భీమవరం,
ములుకుట్ల వెంకటకృష్ణయ్యగారు, ,,
,, వెంకటసుబ్బయ్యగారు వ|| ,,
పాటిబండ్ల జగన్నాయకులు కొ. సుబ్బరామయ్య ,,
ములుకుట్ల రామమూర్తిశర్మగారు ,,
మాజేటి కోటయ్యగారు, ముప్పాళ్ళ.
గంజాం వెంకటరామాచార్యులుగారు, చందలూరు.
పరిమి హేమాద్రిగారు, గంగవరం.
నన్నపనేని అచ్చమ్మగారు, నిడుబ్రోలు.
పాములపాటి రంగనాయకులు భార్యా తులశమ్మ ,,
ప్రతాప సుబ్బయ్యగారు ,,
నాదెండ్ల కుటుంబరావుగారు (డాక్టర్) పొన్నూరు
వాసవకన్యకాపరమేశ్వరీగ్రంథాలయం ,,
వంగనామముల చెంచురంగారావుగారు, కట్రెంపూడి,
మండ వెంకటరామయ్యగారు, దండమూడి.
మంత్రవాది రామచంద్రయ్యగారు ,,
అన్నంరాజు ఆదినారాయణగారు, నండూరు.
ఉపద్రష్ట లక్ష్మయ్యగారు, జడవల్లి అగ్రహారం.
,, నరసింహంగారు ,,
ములుకుట్ల సుబ్రహ్మణ్యంగారు, మెట్టువారిపాలెం.
తాడేపల్లి లక్ష్మీనారాయణగారు, వేమవరం.
కడియాల సంగయ్య కొ. వీరయ్యగారు అంగలకుదురు
లక్కరాజు వెంకపంతులుగారు వ|| కవెవరం.
కాట్రపాటి వెంకాయమ్మగారు, చేబ్రోలు.
పోచిరాజు శేషమ్మగారు ,,
పొత్తూరి వీరరాఘవమ్మగారు ,,
అయ్యదేవర సీతాయమ్మగారు ,,
శ్రీశంకరమఠస్థానం ,,
రాళ్ళబండి సీతారామశాస్త్రిగారు (ప్లీడరు) బందరు.
వేమూరి సీతారామశాస్త్రిగారు ,,

వేమూరి పార్థసారథిరావుగారు బందరు
కొండపల్లి సీతారామాంజనేయులు,
కంతేటి రంగనాయకులుగార్లు ,,
నేతి వెంకటసోమయాజులుగారు ,,
ఎల్లేపెద్ది అన్నపూర్ణమ్మగారు ,,
త్రిపురమల్లు సుబ్బారాయుడుగారు పేరకలపూడి.
రాఘవదీక్షితుల నరసింహశాస్త్రిగారు ,,
పుతుంబాక శ్రీకృష్ణయ్యగారు, పెదపాలెం
,, నరసయ్యగారు ,,
నాసిరెడ్డి నరసయ్య కొ. వెంకటప్పయ్యగారు ,,
కొమరవోలు రాజయ్యగారు, బాపట్ల.
గుళ్ళపల్లి సీతారామయ్యగారు ,,
బొడ్డుపల్లి రామలింగయ్యగారు, వెదుళ్ళపల్లి.
రావుల సుబ్బారావుగారు, చీరాల.
గొల్లపూడి రాధాకృష్ణయ్యగారు, వేటపాలెం.
దోగుపర్తి స్వామిగుప్తగారు ,,
ఊ. వెం. శ్రేష్ఠిగారి సారస్వతనికేతనం ,,
మొదలి లక్ష్మీనారాయణయ్యగారు, కావలి.
గోపు బాలకృష్ణయ్యగారు, బెజవాడ.
,, శేషావతారంగారు ,,
ప్రతాప రాఘవపాకయాజిగారు ,,
జానపాటి సత్యకీర్తిగారు ,,
వడ్లపట్ల లలితాంబగారు, కొవ్వలి.
ములగు వీరభద్రశాస్త్రిగారు, జగ్గయ్యపేట.
ధూళిపాళ వెంకటేశ్వర్లుగారు ,,
శ్రీశ్రీ ముక్త్యాల జమీందారువారు, ముక్త్యాల.
అమ్మనమంచి కామయ్యగారు, (నైజాం) మధిర
పినపాటి వెంకటప్పయ్యగారు, పినపాడు.
,, మహాదేవయ్య అయ్యవారు ,,
బండ్లమూడి శ్రీరాములుగారు ,,
కూచిభొట్ల నాగభూషణశాస్త్రిగారు, కొల్లూరు.
పోలేపెద్ది వెంకటరామయ్యగారు ,,
భాగవతుల సూర్యనారాయణగారు ,,
చతుర్వేదుల వెంకటప్పయ్యగారు ,,
నారాయణం రామానుజాచార్యులుగారు, పుల్లిపాలెం.
పులిపాక హనుమంతరావుగారు ,,
పాలపర్తి రామయ్యగారు, సజ్జావారిపాలెం.
తాడేపల్లి శివరామకృష్ణమూర్తిగారు, శేపల్లె.
ముళ్ళపూడి రాజయ్యశాస్త్రిగారు పోపూరివారిపాలెం
పూరా శ్రీరామసెట్టిగారు, మద్రాసు
కూచిభొట్ల సాంబయ్యగారు, రాంభొట్లపాలెం.

సోమాసి సీతారామయ్యగారు, రాంభొట్లపాలెం.
బాపట్ల సీతారామయ్యగారు ,,
చావలి పున్నయ్యగారు ,,
మేళ్ళచెరువు పుండరీకాక్షుడుగారు, కొల్లిపర.
మల్లంపల్లి మల్లిఖార్జునశాస్త్రిగారు, యలకుర్రు.
మంతెన సీతారామరాజుగారు, ఖాజీపాలెం.
యల్లాప్రగడ సత్యనారాయణగారు, కొమరవోలు.
పెనుమెచ్చ రంగరాజుగారు, అలకాపురం.
వారి మాతిరెడ్డిగారు, పిట్టలవానిపాలెం
సమయమంతుల నాగేశ్వరరావుగారు, ర్యాలి.
,, పెదనాగేశ్వరరావు,
మాతంశెట్టి చినవెంకటరత్నంగార్లు ,,
కొమ్మూరు రామయ్యగారు, అల్లూరు.
,, నరసయ్యగారు ,,
శ్రీరాజా వాసిరెడ్డి హరిహరప్రసాద్ బహద్దూర్ గారు
గుంటూరు.
సోము వెంకటరత్నంగారు ,,
ముప్పూరిసెట్టి పుల్లారావుగారు ,,
మట్టుపల్లి వెంకటరత్నంగారు ,,
కనకపల్లి హనుమంతరావుగారు (డాక్టర్) ,,
పులిపాటి కుమారస్వామిగారు ,,
బూర్గు విశ్వనాథం (బదర్సు) ,,
కూనిశెట్టి ఆదిశేషయ్యగారు ,,
చక్కా రంగయ్యగారి కు. సీతారామస్వామిగారు ,,
జూలూరి వెంకటరత్నంగారు ,,
కొల్లిపర వెంకటరత్నంగారు ,,
తెల్లాకుల జాలయ్యగారు ,,
దేసు వెంకయ్యగారు ,,
అద్దేపల్లి రామకృష్ణయ్యగారు ,,
మానికొండ సీతారామయ్యగారు ,,
చేగు నరసింహంగారు ,,
విన్నకోముల లక్ష్మీనరసింహంగారు ,,
చెరుకుపల్లి హనుమయ్యగారు ,,
వెల్లంరాజు వీరవెంకట రామసోమేశ్వరరావుగారు ,,
మద్ది వెంకటరామయ్య అండ్ అప్పారావుగార్లు ,,
భువనగిరి విజయరామశాస్త్రిగారు ,,
,, కోదండపాణిగారు ,,
తాడేపల్లి చిదానందంగారు ,,
అంబడపూడి వెంకటేశ్వర్లుగారు, నల్లపాడు.
జాగర్లమూడి కుప్పుస్వామిగారు, కారంచేడు.
గుళ్ళపల్లి వెంకటశివయ్యగారు, ఇటికంపాడు